# విభూతి

సంపాదకులు

పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారు


సారస్వత ధార్మిక సచిత్ర మాసపత్రిక

సం. ౨ | సికింద్రాబాదు | శా. శ. ౧౮౬౧ ప్రమాథి మాఘము, ఫిబ్రవరి 1940 | రేఖ ౧



ఈ సంచిక వెల




ఏనిమిదణాలు



సంవత్సర చందా ౨-౮-౦]   సికింద్రాబాదు   [ విడి సంచిక 0-౮-0

# విభూతి విషయసూచిక.

## ప్రమాథి మాఘము,





సూచన.

శ్రీకరభాష్యము ముందుసంచికలో ప్రకటింపబడును.

ఈ విభూతి రెండవసంచిక ఏప్రేల్ (చైత్రము) నెలలో వెలువడును.




శ్రీ రామచంద్రుడు ప్రతిష్ఠించి పూజించిన
శ్రీ రామేశ్వర జ్యోతిర్లింగము.




సచిత్ర మాసపత్రిక

పుండ్రము ౨ | శా. శ. ౧౮౬౧ ప్రమాథి మాఘము, ఫిబ్రవరి 1940, సికింద్రాబాద్. | రేఖ ౧

## హృద్గతము

శ్రీ పరమేశ్వరుని లీలావిలాసజాలము లోకమోహన మయ్యును పండితమ్మన్యులకును నగోచరముగ నున్నది. ఈశ్వరసాక్షిగ కర్తవ్య మనుకొని యారంభించిన కార్యవాహిలోను సదసద్వివేక ప్రేరణ సుస్పష్ట మగుటలేదు. అంధుని చేతికఱ్ఱవలె అల్పజ్ఞమగు మా మనస్సు పోవుచున్నట్లెల్ల సంచరించుటతప్ప నిశ్చితమైన సుపథమును నిర్ణయింపలేకున్నారము. కార్యము సుపరిచితమైనను స్వాధికారమున నిర్వహించు భారాధిక్యము స్వానుభవమునకు రాకపోలేదు. పడినపాటు ఇంచుకయైనను బలమునకు భయము గలిగినది. నిశ్చయించిన నియమమును నిర్వహించిన దెంతయో నిర్వచించుట నిపుణత కాదనుకొందము. మనోరథము మహానగమువలెను, ఆచరణము ఆవగింజవోలెను ఉండునను లోకోక్తి జీవుని సామర్థ్యమును చాటుచున్నది. బలములేదని భావించి కార్యమును మానరాదని మహనీయుల యుద్బోధయు కలదు. ఇంతకును విశ్వకర్త విధాన మెట్టిదో భవిష్యమునందును తెలిసికొనదగి యున్నది. విశుద్ధమైన సామగ్రిని సంపాదించి విమలముగ వినియోగించుటకై వివేకధనుల సహకారము మాకు సదాభిలషణీయము. చెప్పవలసినదానికంటె చేయదగినదియే ఎక్కువగా కలదు. నేటివఱకును 'విభూతి' వైభవమునకు కారణమైన బంధుపరివారమునకు పూర్వాధికముగ దోడ్పడవలసియున్నదని మా హృద్గతమును సకృతజ్ఞముగను, సంక్షిప్తముగను నివేదించుచున్నాము.

— సంపాదకుడు.

# పంచరత్నోపహారము



### విద్వాన్ కవిరత్న అష్టావధాని శ్రీ మేదిపల్లి లక్ష్మీకాంతంగారు

౧

సీ॥ నవరత్నములెకాక కవిరత్నము లొసంగు, దశగుణరత్నాలు తలనుదాల్చి
పలువన్నె లాచ్ఛాదనల నొప్పుటయెకా కలంకారములఁ బెక్కుఁ దనుధరించి
హస్తపద్మాసనం బందుండుటయెకాక, కావ్యశయ్యలనుండి ఘనతగాంచి
సద్వృత్తియేకాక విద్వాంసులు రచించు, రీతివృత్తులను బ్రఖ్యాతిగాంచి
గీ॥ యాత్మఁ బరమాత్మయన్న ధ్వన్యాత్మగలిగి, జన్మదినోత్సవ సహస్రశతము వడసి
వర్ధిలుము మాదు కన్నులపండువుగ విభూతిపత్రికా! యష్టవిభూతి వరలి.

౨

గీ॥ పండితుఁడు, సుకవి, విమర్శకుండు, చిదిగె, మఠము వీరభద్రబుధ సంపాదకత్వ
మౌర! పెన్నిధి, కొంగు బంగారుమూట, పెరటి కల్పవృక్షము దొడ్డివేల్పుటావు.

౩

గీ॥ తెలుఁగు జిలిబిలి పలుకులఁ దేనెలొలయఁ, గలవరంబున నెలుగెత్తి లలితకళల
లలనలకు, బాలురకు, బురుషులకుఁ గఱపి, జగమును గళామయంబుగ సలుపుమమ్మ.

౪

సీ॥ హరుఁడైన, హరియైన, నదియుగా కెవ్వరైన, దేవుఁ డున్నాఁడని తెలిసినారు
శైవమతంబొ, వైష్ణవమతంబొ కాసి, హిందూమతం బని యెఱిఁగినారు
ధర్మబోధినియొ యధర్మబోధినియొ, విధ్యుక్త ధర్మమెఱిఁగి యుబ్బినారు
పుంస్కావ్యమైన, నపుంస్కావ్యమైన, సాహిత్యమొకింత గ్రహించినారు
గీ. సకలపురుషార్థములఁ గొనఁజాలినారు, నిన్ను సేవించుభక్తులు నిశ్చయముగ
సార్థకంబయ్యె జన్మ నిస్సంశయముగ, పత్రికామతల్లి! గొను సుస్వాగతంబు.

౫

ఉ. పుట్టిననాఁటిపండుగని, ముద్దుగఁ గానుక లిత్తురిబంధుగుల్
అట్టులె నీకు గానికల నంపుచునుందురు పోషకాళియున్
ఎట్టెటులో యొసంగితిది, యిట్టులమాయని చూడకేమనన్
పుట్టిన యట్టిదానవు, విభూతి, మహాశివరాత్రిపండువన్.

# గీతాంజలి

శ్రీ బండారు తమ్మయ్యగారు

శ్రీకరంబైన యీ జగ - త్సృష్టిరక్ష
ణాదికమునకు గర్తనే నవుదు ననుచు
బ్రహ్మవిష్ణులు గర్వసం - రంభులగుచు
నొండొరులు దాముపోరాడుచుండుటగని

వారి వారించి సత్య త - త్త్వంబుఁజూపి
శాంతి నొందఁగఁ జేయ నా - ద్యంతరహిత
మగుచు వెలుఁగు జ్యోతిర్లింగ మైవిభూతి
మెఱయ మున్నుద్భవించిన మృడునిరీతి;

చిరతరంబుగ భారత ధరణియందు
ప్రభవమందిన శైవ త - త్త్వమును, ధర్మ
తత్త్వమును బ్రదర్శించి సం - తతవిభూతి
జగము రంజించు చున్న తా - శయముపూని

పేర్మితో "విభూతి" యను న - భిఖ్యఁదాల్చి
ధర్మ పరతంత్రవై బహు ధాన్యయందు
ప్రభవమొంది మహాశివ - రాత్రినాఁడు
కడపితొకయేడు కాల చ - క్రంబునందు;

పండితులు పత్రికాధిపుల్ - ప్రస్తుతింప
చేతనైనంత సేవను - జేసినావు
అయిన భవదుత్తమాశయ - ప్రాప్తికొఱకు
చేయదగినదె గలదు వి - శేషమంచు

చక్కఁగా నెంచి సంతతో - త్సాహవగుచు
అఖిల జనసమాదరణంబు - నందురీతి
నాఁడు నాటికి సత్కళో - న్నతిని మెఱసి
సరసమతులు గీతాంజలి - సంఘటింప

పరమభవ్యవిభూతి సం - పన్నుఁడయిన
భావగమ్యుని సత్కరుణావిభూతి
గ్రాలుమా "విభూతి" సుపత్రి - కామతల్లి!

## ఆశీః ప్రసూనములు

**ఉభయభాషాప్రవీణ విద్వాన్ శ్రీ వెరవలి లింగయ్యశాస్త్రిగారు**

శ్లో॥ శ్రీమద్విభూతినామ్నా
విలసచ్ఛ్రీ పత్రికావర్యే!
అనవరత మద్రిజాపతి –
రవతా దైశ్వర్యదాయనీమ్ భవతీమ్. ౧

క॥ ఒకయేటి కాలముననే
యకళంకస్ఫూర్తిఁ గీర్తినందిన నీదౌ
ప్రకటీకృతమాహాత్మ్యము
సుకవీంద్రుని ఛాయనున్న సొగసు విభూతీ? ౨

శ్లో॥ విద్యానిధి రధ్యక్షో
విద్యాశాస్త్రార్థ ఏవ సరణి స్తే
అపి విద్వత్కవితామృత –
సువిమర్శామ్నాయసంస్కృతా భవతీ. ౩

క॥ శివరాత్రి సమయమందున
శివలింగోద్భూతిమైన శివలగ్నమునన్
శివధర్మోద్ధృతికొఱకై
ప్రవిమలత్వజ్జన్మదినము బరగె విభూతీ? ౪

శ్లో॥ శతమానం భో భవతా –
దాయుష్యం తేఽద్య దేవమానేన
త్రినయనవరప్రసాదా –
దాచంద్రార్కం ను తే ప్రచారోఽస్తు. ౫

# అముద్రిత ద్విపద కావ్యములు

(శ్రీ శేషాద్రి రమణ కవులు, శతావధానులు)



నిజాము రాష్ట్రమునఁగల ప్రాచీన కవులలోఁ బలువురు కవుల చరిత్రమున కెక్కనివారు గలరు. కొందఱి నివాస స్థలములు, కాలము గుర్తింప వీలుకాదు. కాని భాషనుబట్టి వంశజుల సంబంధములనుబట్టి స్థూల దృష్టితో నునికిపట్టు నిర్ణయింప వచ్చును. ఈ రాజ్యమునందలి కవుల చరిత్రము వ్రాయ నుద్దేశించి సంపాదించిన యంశములఁ గొంతవఱకు శ్రీకృష్ణదేవరాయ గ్రంథాలయ రజతోత్సవ సంచిక యందును నిజాంరాష్ట్రకవుల పద్య గ్రంథమగు గోలకొండ పత్రికవారి ప్రచురణము నందును పూర్వకవుల చరిత్రము కొంతవఱకు సూచించితిమి. ఈ వాఙ్మయ కృషి కొఱకును భవిష్యదాంధ్ర సోదరుల ఉపయోగము కొఱకును, ఒక లిఖిత గ్రంథా లయము స్థాపింపఁదలఁచి వ్రాఁత ప్రతులఁ గొన్నింటి సేకరించితిమి. అందుఁ గొన్ని టిని పరిశోధించి సారాంశములు వ్రాసికొను తఱి గ్రంథములకు మాకును దీఱని వియోగము గలిగినది. అం దెన్ని గ్రంథములు క్రిమిదష్టములై నశించుచున్నవో ఆ వాగ్దేవతకే తెలియును. ఏనాఁడో విశ్రాంతి లభింప పరిశోధించునాఁటికి అవి యే స్థితిలోనికి వచ్చునో! కావున జ్ఞాపకార్థము వ్రాసి యుంచుకొన్న దినచర్యలోని చరిత్రాంశములు కవి జీవితములు పునః పరిశీలనము గావించి మేము సేకరించిన ద్విపద కావ్యములలోని చరిత్రాంశములు ఆంధ్రలోకమున కెఱింగించినచోఁ గొంచె మేని భాషాసేవకుల కుపకరించునని ఈ వ్యాసము వ్రాయుచుంటిమి. విజ్ఞులు సారము గ్రహింతురు గాక.

## 1 ద్విపదరామాయణము

చాడ వీరరాఘవకవి రచించినది. శైలి మనోహరము. రామాయణకథ సంగ్రహ రూపముగా నిందుఁ జెప్పఁబడినది. కవి రెడ్డికులజుఁడు, నూఱునూటయేఁబది సంవత్స రముల క్రిందట వరంగల్లు చెంతగల వేల్పుకొండ పరిసరమున నీ కవియున్నటుల వంశీ యులు చెప్పుచున్నారు. గ్రంథము సంపూర్ణముగ నున్నది. కవి తనచరిత్రము స్వల్ప ముగా గ్రంథారంభమున నిట్లు చెప్పుకొన్నాఁడు.

వెంకటేశుని పేర విఖ్యాతముగను
అంకితంబుగను శ్రీహరి పాదపద్మ
మకరంద రసపానమగ్నులై సతత
మకలంకులైన మహానుభావులకు

దాసానుదాసులై ధర్మకాలమున
భాసురప్రభల నింపలరిన చాడ
కులదీపకుఁడు పరాంకుశులకుఁ గూర్మి
వెలయ నే ననుజుండ వీరరాఘవుఁడ
రచియింతు వాల్మీకిరామాయణంబు

2 వరదరాజరామాయణము

ఈ ద్విపదగ్రంథమునకు రెండుతాళపత్రప్రతులు మాకు లభించినవి. తంజావూరు సరస్వతీమహాలులో వరదరాజరామాయణప్రతులు రెండు గలవుగాని అవి అసంపూర్ణములు. మా కడగల సమగ్రమగు రెండుప్రతుల సహాయముతో శుద్ధప్రతి లిఖింపవచ్చును. ఈవరదరాజకవి యింటిపేరు కట్టా వారు. కవి సూర్యవంశక్షత్రియుఁడు. బహుశః పదునాఱవ శతాబ్దాంతమున నుండి యుండును. ఈయన రచించిన శ్రీరంగ మాహాత్మ్యమొకటియే ముద్రితము. కవులచరిత్రమున కీ కవిచరిత్రము పరిచితముగా లేదు. కవిత మృదుమధురము. దాదాపుగ ఒక్కొక పుస్తకమున 320 తాళపత్ర ములుగలవు. 8, 9, 10 పంక్తులవఱకు వ్రాయఁబడినవి. పంక్తికి ఎనిమిది ద్విపదపాదము లుండును. రంగనాథ రామాయణముకంటె రెండంతలు పెద్దది. కాండాంతమునఁ గవి తనను గూర్చి యిట్లు చెప్పుచున్నాఁడు.

వెంకటేశ్వరుపేర విశ్వాత్ముపేర
అంకితంబుగ వెంకటాధీశచరణ
పంకజసేవానుభావమానసుఁడు
హరిదాసమణి కట్ట హరిదాసరాజు
వరదరాజు నితాంత వరదానశాలి
రచియించు వాల్మికి రామాయణంబు

ఇంతవఱకున్న ద్విపద రామాయణములలోఁ బ్రథమగణ్యము కాఁదగిన యీ యుత్తమ గ్రంథమును బ్రచురింప నే యుదారుడేని బూనుకొన్నచో ఐహికాముష్మికములను బడయఁగలడు. కవి శ్రీకృష్ణదేవరాయల అల్లుఁడగు రామరాజునకు బంధుకుటుంబములోనివాఁడు. మృదుమధుర కవితాధురీణుఁడు, అత్యంతరామభక్తుఁడు. బోయకులమునఁ బుట్టిన వాల్మీకి కవితకంటె దన సూర్యవంశమునఁబుట్టిన వరదరాజు కవిత శ్రీరాముఁ డానందించినాఁడట! తన ద్విపదరామాయణ సారస్యమును నిట్లు కవి తనకుఁదానై చెప్పుచున్నాఁడు. ఇం దతిశయోక్తి లేదు. గ్రంథపరిశస్తిఁ దెలుపఁ గవి ప్రతిజ్ఞాదికము చాలును.

అందమై సుకవు లౌరా యనఁ జెవుల
విందుగాఁ గ్రపంబు వెదజల్లినట్లు
ధ్వనులు వ్యంగ్యములు వింతలు వాసనలును
మినుకులు జిగిబిగి మెఱవడుల్ జాతి
వార్తలు నుపమలు వర్ణనాంశములు
మూర్తిమద్వాక్యముల్ ముద్దులుసూప
ఒకమాటకన్న వేఱొకమాట వింత
ఒకపాదమునకన్న నొకపాద మొప్ప
ఒకదళంబునకన్న నొకదళం బలర
ఒకయుత్తరము మించి యొక యుత్తరంబు
వెలయంగ ద్విపదఁగావింపఁ జిత్తమున.........

ఎంతగొనియాడినను దనివి సనని యీ యుత్తమ గ్రంథము ముద్రితము కాఁగల భాగ్యము ఆంధ్రభాషావధూటికి లభించుఁగాక.

3 తత్త్వార్థ దర్పణము

నలుబది తాళపత్రములపైన వ్రాయబడిన వైష్ణవమత గ్రంథము. కవిత్వము ప్రౌఢము, రసవంతము. శైలి మృదుమధురము. గ్రంథమంతయు నాలుగాశ్వాసములుగా విభజింపఁబడినది. కవిచరిత్రము గ్రంథభాగములవలన గ్రహింపఁదగిన దిట నుదహరింతుము.

"కామ లక్ష్మణయోగి గర్భితాత్మాచ్చి
రామానుజోక్త సుశ్రావ్య తత్త్వార్థ
దర్పణంబను ప్రబంధము లక్ష్మణార్యుఁ
డర్పించుమని తానె యంగీకరించి
యందుఁ జెప్పిన చతుర్థాశ్వాస మిలను.

ఇందుఁ గృత్యాదిలో తిరుమల వేంకటాచార్యులు, ఈయన తండ్రి సింగరాచార్యులు, అద్దంకి సింగరాచార్యులు అనువారల ప్రశంసగలదు. ఆచ్చి రామానుజాచార్యులు సంస్కృతమున రచించిన తత్త్వార్థ దర్పణము అనుపలభ్యము. దాని తెలుఁగుచేత యగు ద్విపద తత్త్వార్థదర్పణము విశిష్టాద్వైత సంప్రదాయములు తేట తెలుఁగు మాటలతో ననువదించు నుత్తమగ్రంథము. గ్రంథము చక్కని లిపిలో సరియగు వ్రాతలోనున్నది.

4 అర్చిరాది ప్రబంధము - ద్విపద

ఇది మూఁడాశ్వాసముల పరిమితిగల గ్రంథము. తత్త్వార్థ దర్పణములో పరిశంసింపఁబడిన తిరుమల సింగరాజాచార్యు లీ గ్రంథము రచించినకవి. వరంగలు చెంత గల నల్లబల్లి అగ్రహారికుల కీ కవిపూర్వుఁడని వినుచున్నారము. భారద్వాజస గోత్రజుఁడును, వైష్ణవధర్మవిదుఁడు నగు తిరుమల కృష్ణమాచార్యులు తిరుమలాంబల కుమారుఁడు. ప్రతివాది భయంకర దేశికేంద్రుల శిష్యుఁడు అగు నీ సింగరాచార్య వరుని కవిత రసవత్తరము. కవి తన ప్రయత్నము నిట్లు చెప్పుకొన్నాఁడు.

రంగేశభక్తి తరంగాంతరంగ
రంగుండనే సింగరయ్యనువాఁడ
తుచ్ఛంపు నాబుద్ధిదోఁచిన రీతి
అచ్చతుర్నిగమాంత మందొప్పు వింత
అఖిలశాస్త్రరహస్యరస్యమై ముక్తి
సుఖసాధకంబునై సూక్ష్మార్థమైన
అర్చిరాది యనంగ నమరిన పేర
చర్చించి మునుమునుల్ సాత్వికమణులు
అలసబుద్ధులమైన యస్మదాదులకు
తెలియ నేర్పఱచిన దివ్యశాస్త్రంబు
నీరధిగల రత్ననికర మేర్పఱచి
తారహారంబుగాఁ దగఁ గూర్చురీతి
సకలపుష్పంబుల సారంబుగ్రోలి
యొకవంకనళి తేనె నొనగూర్చురీతి
మంజులవాక్పుంజమహిమ కబ్బముగ
రంజిల్లఁగూర్చితి రంగేశు కృపను.

నిజముగా నీకృతి మంజుల వాక్పుంజములతో రంజిల్లుచున్నది. కవి ద్విపదరచనమున మిగుల నేర్పరి. ఆశ్వాసాంతమునందుఁ గవి తనచరిత్రము నీక్రింది విధముగా మిగులసంగ్రహముగాఁ జెప్పుకొనినాఁడు.

భూనుత కృష్ణార్య పుత్రసన్మిత్ర
వితతాత్మ విక్షేప విద్యాప్రదీప
జితదుష్టభవకార్య సింగరాచార్య



రచితార్చిరాదిమార్గ ప్రబంధమున
అచలార్థమగు తృతీయాశ్వాసమయ్యె

పదునైదు తాళపత్రముల పయిని గ్రంథమంతయు వ్రాయఁబడినది. ఆకున ఎనిమిది పంక్తులు గలవు. గ్రంథము ఆకృతిలోఁ జిన్నదైనను గాంభీర్యగౌరవములలో మిగులఁ బెద్దది.

5 విక్రమార్క చరిత్రము – ద్విపద.

గ్రంథకర్త వీరశైవాచారుఁడును చిట్టయప్రభుతిమ్మయ కుమారుఁడును నగు కొండయ నామధేయుఁడు. గ్రంథము ఐదాశ్వాసముల పరిమితి కలది. కవిత్వము సామాన్యమైనది. లేఖకుఁడు బొత్తిగా భాషాజ్ఞానము లేనివాఁడగుటచే వ్రాత తప్పులు మెండుగాఁ గలవు. కొఱవి గోపరాజు వ్రాసిన ద్వాత్రింశత్సాలభంజి కాకథల కిదిసంగ్రహ రూపమగు ద్విపద. ప్రతి కొరట్ల వీచు కాగితములపై వ్రాయఁ బడినది. నిర్మలలో నీ ప్రతి లభించెను. గ్రంథాంతమునఁ గవియిట్లు తన వృత్తము చెప్పుకొనెను.

ఇది చనమలికార్జునేంద్ర పవిత్ర
సదమల చారిత్ర సత్కవిచిత్ర
చిట్టయ ప్రభుతిమ్మ శ్రీకర పుత్ర
గట్టిగా పదబంధ కావ్య విచిత్ర
జయ వాక్యహరితల్ప సద్గుణకల్ప
నయనీతి వినయ కొండయ నామధేయ
విరచితంబై.................
అనఘాత్ముఁడగు విక్రమార్కుని కథలు.

ఇవి యన్నియు మాకు తెలిసినంతలో అముద్రిత గ్రంథములు. వీరశైవుల తరువాత ద్విపద వాఙ్మయమును బ్రచారములోనికిఁ దెచ్చినవారు వైష్ణవ కవులు. పరమయోగి విలాసము, అష్టమహిషీ కళ్యాణము, తిరువాయి మొరి, తిరుప్పావు మొదలగు ద్రవిడ వాఙ్మయములోని మతవిషయిక కథలు వైష్ణవాచార్యులు ద్విపద వాఙ్మయములో సులలితముగా రచించిరి. పరమయోగి విలాసము, తిరువాయి మొరి ముద్రితములైనవి గాని వ్రాఁత ప్రతులలోని విశేష భాగములందు లేవు. చరిత్ర గ్రంథము లనఁదగు కాటమరాజు కథ, పలనాటి వీరకథలు, పోలురాజు కథ, సిద్ధేశ్వర చరిత్రము, బేతాళ చరిత్రము, కొలనుపాకమాహాత్మ్యము లోనగుచరిత్ర ద్విపదలలోఁ బలనాటి వీరుల కథలె కొంతవఱకు ముద్రితములు. మన యాంధ్రకవు

లలో వీరశైవులు కన్నడ వాఙ్మయము నందలి శివకథలు, శైవభక్తులకథలు, వైష్ణవ కవులు ద్రావిడ భాషలోని ప్రబంధములు తెలుఁగు చేసిరి. మతము సర్వజన గ్రాహ్యము గావించుటకుఁ దెలుఁగుఁదనము వెలయించు ద్విపదలనే సార్వత్రికముగాఁ బ్రచారము లోనికిఁ దెచ్చిరి.

ద్విపద గ్రంథములలో రంగనాథ రామాయణము తోలుబొమ్మలాటలలో నుపయోగింపఁబడుట చూడఁ బండిత లోకమువలెఁ బామరలోకము గూడ ద్విపద నాదరించునట్లు బోధపడును. యాదవుల వీరకథలు విశేషించి ద్విపదలలోఁ గలవు. వానిని మాలవారిలో నొక తెగవారగు బయినీడివాండ్రు శ్రుతితో వీరరస ముట్టి పడునటుల గానము చేయుదురు. ఆంధ్రకవులు ప్రబంధములలో క్వాచిత్కముగా నుపయోగించిన తరువోజలు ద్విపద జాతిలోనివే. ఆంధ్రసోదరులు ప్రత్యేక కృషిచేసి నచో ద్విపద వాఙ్మయము విరివిగా లభింపఁ గలదను నంశము సాట మేము సేకరించిన ద్విపద గ్రంథములలోని భాగము లిట నుదాహరించితిమి.



# నిర్వేదము

## శ్రీ శేషాద్రి రమణ కవులు, శతావధానులు



కావ్య వేణికలందునఁ గలసి మెలసి, రూపు చెడనున్న కావ్య స్వరూపములను
దీన బాష్పమలీమస దృష్టితోడఁ, బఠనసేయుట తప్పె నీ వత్సరమున. 1
విస్మృతితరంగములనుండి వెల్లివిరియు, మహితచారిత్రికోదార మధురగీతి
శూన్యవాటికలోఁ జవిచూచి యలరు, భాగ్యము తొలంగె నాకు నీ వత్సరమున. 2
ఆంధ్రభారతి పాద పద్మాంగణమునఁ, బ్రాక్తన చరిత్రగీతముల్ పాడనేర్చు
జిహ్వికకుఁ గల్గె విశ్రాంతి శిథిల దేహ, గతమయిన నూతన వ్యాధి కారణమున. 3
గోచిపెట్టుట నేర్వని కుఱ్ఱతనము, నంద నను తావకాంకంబునందుఁ జేర్చి
భవదుదంచిత విశ్వరూపమ్ము నరసి, కవితఁ జెప్పించినది నీవ కాదఁటమ్మ. 4
మాటుపడియున్న సద్రత్నమండనముల, తల్లి నీ వక్షముననుండి పెల్లగించు
సోదరులకెల్లఁ జూపించు, సుతుఁడు నేఁడు, చింతచేఁ గ్రాలుచూలె నీసేవఁ జేయ. 5



# బ్రాహ్మణ జాతకము

**శిరోమణి శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు**



క. తొలిబోధి సత్త్వుఁడొకపరి, నిలయంబై పుణ్యమున కనింద్యగుణుండై
తిలకంబై సజ్జనులకుఁ, గలిగెను బ్రాహ్మణ్వయంబు కడు ధన్యముగన్. ౧

క. తోఁబుట్టువు ధర్మము; వి,ద్యాబుద్ధులె పెద్దబలగ; మార్యచరిత్రం
బే బహు సంపద; విప్రుం, డాబాలకుఁడు శకపురుషుఁ డంటకుఁ దగుఁబో. ౨

క. ఏతఁడు జననం బందుట, జాతి సమున్నతివహింపఁ జాలును భువియం
దాతని జన్మమె సఫలము, లాఁతులుగారే యజాగళస్తన సదృశుల్ ? ౩

క. సుకృతావతారమగు తండ్రికిఁ బుట్టిన సుతుఁడు భిన్నరీతిగఁ దగునే?
ఒకవిత్తు నాఁటఁగా వే, ఱొక మొలక జనించునొక్కొ? యుర్విని నెందున్. ౪

గీ. బీజమున డాఁగిన మహోచ్చవృక్షమువలె, బాలకుండైన యాతని వర్తనమున
నిర్వచింపగరాక మసీమిమాత్రి, దృశ్యమానంబు మాహాత్మ్య దీప్తి డాఁగె. ౫

క. తన వినయ విధేయతలన్, వినీతుల విధేయులుగను బెదపెద్దలఁ జే
యును దనకు; వెలయునువిల, క్షణమగు నతిశయమొక్కొ జనునందు నిలన్. ౬

ఆ. బాలుఁడైన నతఁడు వందనీయుండయ్యె, బాలచంద్రుఁడట్లు ప్రజలకెల్ల
దినదినాభివృద్ధిఁ గొనుచున్న యతఁడెంత, కనులవిందు సేయఁ గాఁగలాఁడొ ? ౭

క. అందంబునఁ జందంబున, నందక వాఙ్మనములకు నుదాహరణంబై
మందికి, నాతఁడు శైశవ, మందునుసడి సన్నయశము నంది వెలింగెన్. ౮

క. క్షితిగురువులకు గురుండనఁ, బ్రతిభాయుక్తుం డతండు పరగుచు విద్యా
తతిఁ గఱచె గురుగురుత్వముఁ, బ్రతిష్ఠఁ గావింప శిష్యభావాశ్రితుఁడై. ౯

ఆ. జీవరత్నమేని శ్రీ సముజ్జ్వలమౌనె, సాన దీఱకున్న జగమునందు ?
ఉజ్జ్వలించునే ? గురూపదేశములేని, చదువు సద్వివేక శాలికైన ? ౧౦

గీ. ఆ కుశాగ్రీయబుద్ధి విద్యాచయంబు, నేకసంథాప్రతిగ్రాహి యగుచు నేర్చి
ప్రాగ్రసరుఁడై సమస్తకలార్థితతికి, గురుని మించిన శిష్యుఁడై వరలెనోలి. ౧౧

క. నేలయును విత్తనంబులు, మేలివియగునేనిఁ బంట మేల్మేలగు నా
చాలునఁ దెలివియుఁ గఱపులు, మేలివిగలవాఁడు గొనఁడె మేలగు విద్దెల్! ౧౨

గీ. తెలివితేటలు వినయవిధేయతలును, ధర్మమార్గానువృత్తి యుదారవృత్తి
కలుగు నాతండు శిష్యుండుగా లభింపఁ, బూజ్యుఁడగుఁగాదె ముల్లోకముల గురుండు.

క. ఒకపరి శిష్యుల కధ్యాపకుండు బోధించి వలయుపాఠంబుల వా
రికిఁ గల ధర్మారూఢినిఁ, బరికటింపఁదలంచి యిట్లు పలికెను గూర్మిన్. ౧౪

క. ఉప్పుండినఁ బప్పుండక, పప్పుండిన నుప్పులేక పడుచుంటిఁగదా !
తిప్పలు మీరలెఱుంగరె?, చెప్పంగానేల యింటివిధ మెల్లదియున్. ౧౫

చ. నలుగురిలోని కేగుటకు నాన యగుంగదె ! యట్టి చింకి పాఁ
తలు ధరియించి యుండ నుచితంబగు నిల్లును బండ మంచముం
దెలియదె నాకు లేనికత ? తెల్లము మీకును నాదువంటపా
త్రలు మఱిఁగుండ బొచ్చెలుగదా ! వచియింపఁగనేల నాసిరిన్. ౧౬

క. నగనాణ్యంబుల కోసము, మగువయు బిడ్డలు నొనర్తురి మారాముననే.
బగళులను శిష్యులారా !, మగనాండ్రికుఁ గలదె జాలి మగవాండ్రిపయిన్ ! ౧౭

గీ. నరిగఁ బ్రతిపూటకెన్ని విస్తళ్లు లేచు?, నెన్ని యుడుకును బియ్యం? బిదెల్ల మీకుఁ
జదివి వినుచుట చర్విత చర్వణంబు, కలదొకో? మీ రెఱుంగని కత యొకండు. ౧౮

క. తరమే? విస్తరివంపును, మరి సంసారంపువంపు మానవతతికిన్
సరిదిద్దఁగ? నైనను బ్రతి, నరుఁడు యథాశక్తి ప్రియతనము సేయవలెన్. ౧౯

కే. తలక్రిందఁ గొండయుండఁగ, నిలరాలకు వెదకు విధిని నీరుండఁగ శి
ష్యులరై ధనార్థముగ వారల వీరల దేబిరించు క్రమ ముచితంబే ? ౨౦

ఆ. ఇంటికొక్క పోఁగు నిచ్చిన నిల్లాలి, కగునుగాదె చీర? యవ్విధమున
సాయపడఁగ మీరు నాయిల్లు నిండదే?, నగును మీకు దాన నభ్యుదయము. ౨౧

క. గురుదక్షిణ నర్పింపఁగఁ, బరధనముల నపహరింపవచ్చును; దానన్
దురితంబు రాదు; కావున, నరుగుఁడు! కొని తేరుఁ! డోపినట్లు ధనంబుల్. ౨౨

గీ. చూచిరమ్మన్నఁ గాల్చివచ్చుదురు మీర,లొక్కరొక్కరు; నేమి సేయుటకుఁ దగరు?
పెద్ద తడవులనుండి యీ విషయమెల్లఁ, గడఁగియుం దెల్ప సంశయపడుచునుంటి. ౨౩

ఆ. మీరు సుతులవంటివారలు కావుట, వెళ్ళఁబోసికొంటి వెతల నిట్లు
తండ్రి కష్టములకుఁ దనయులుగా కెవ్వ, రాదుకొందురన్య? లయ్యలార !. ౨౪



౧. శ్రీ జగద్గురు సిద్ధలింగ శివాచార్య మహాస్వాములు.

౨. ఉజ్జయనీ పీఠము మహాద్వారము.



౩. శ్రీ జ. సిద్దేశ్వరశివాచార్య మహాస్వాములు.



౪. 'సంప్రతి' యొక్క ఎఱ్ఱగుడి శిలాశాసనము.

క. అని తన దారిద్ర్యవ్యథ, వినిపింపఁగ దేశికుండు, విద్యార్థులకున్
మనమున శూలాఘాతము, లన నొక్కఁ కనుడియు వర్ణములం గల్పించెన్. ౨౫

చ. గురువులు వారి పేదఱిమిఁ గూర్చి గడుంగడు సంతసించుచున్
ద్వరితగతిన్ దిశాతతికిఁ బైనమొనర్పఁగ శిష్యులెల్ల ని
ల్పిరి కొని తెచ్చి ముచ్చిలియుఁ జేలములన్ ధనధాన్యరాశ్యలం
కరణగణంబహం ప్రథమికన్ గురుభక్తిని వెల్లడింపఁగన్. ౨౬

క. దురితంబుపదేశించిన, గురువులతో గ్రుద్దులాడఁ గూడునుగానీ
దురితక్రియ కురరీకృతి, గురుభక్తి యనంగఁ దగునొకో? ప్రాజ్ఞునకున్. ౨౭

క. పలుమఱులు "పరద్రవ్యా, ణిలోష్టవ" త్తనుచుఁ గఱపి నీతులు పెక్కుల్
తలక్రిందుగ నేఁ డీతఁడు, పలుకఁగ నేలంచు వారు భావింప రిసీ! ౨౮

క. స్తేయంబుఁ గఱపిన యుపాధ్యాయుని పలు కాలకించి తన డెందమునన్
రోయుచుఁ గడు గురుదూషణ, హేయంబని బోధిసత్త్వుఁ డేడ్చుచు నిలిచెన్. ౨౯

క. వంచనతల మెత్తఁడు వీక్షించండాచార్యుఁ డన్యశిష్యుల నను వ
ర్తించఁదలంపఁడు విద్వచ్ఛంచువు మది వెఱచి కిల్బిషంబొనరింపన్. ౩౦

క. రావేటి? కనుచు మిత్రులుఁ, బోవేటి? కఁటంచు గురువుఁ బోర్వెట్టిన నా
ధీవరుఁడు బోధిసత్త్వుఁడు, వావిడిచి వచింపఁడయ్యెఁ బ్రత్యుత్తరమున్. ౩౦

ఉ. ఇంగితవేదియైన గురు వీతని పాపవిదూరచిత్త వృ
త్తిం గనిపెట్టి శిష్యులకుఁ దెల్లముగా గుణపాఠమొండు నే
ర్పంగను బోధిసత్త్వుఁగని పల్కెను నో గురుభక్తిశూన్య! ని
న్నుం గరినుండవంచుఁ గృపణుండ వటంచు నెఱుంగ నింతకున్. ౩౨

ఆ. చీమకుట్టినంత చేయకున్నది నీకు, నింత వినుచుకొన్న నింటిగోడు
ఒకని కడుపుమంట నొకఁడేమెఱుంగు? శుష్కప్రియంబులాడు జాణవీవు. ౩౩

మ. అనిపల్కన్ గురుభక్తిశూన్యుఁడను పల్కాలించి యాతండు గ్రు
న్ననఁ "బాపంబుశమించుఁగాత" మనుచున్ గర్ణంబులన్ మూసికొం
చును "నా యీ యపచారమున్ సయిపుఁ" డంచుం బాదపద్మంబులం
బ్రణమించున్ రుదియించు నశ్రువుల జాల్వాఱంగ నేత్రంబులన్. ౩౪

3

క. "అనరాదుగాని మీరలు, పనిచిన కార్యంబు ధర్మబద్ధము గాదం
చును బోధించుచు నున్నది, యనయము నాయంతరాత్మ యత్యంతంబున్. ౩౫

గీ. అంతరాత్మ విరుద్ధ కార్యానువృత్తి, కొప్పకున్నది; వెనుదీయుచుంటిదాన;
నాకు నిక్కంపు గురుభక్తి లేకకాదు; నాకు మిత్రులపైఁ గూర్మిలేక కాదు. ౩౬

క. ప్రవచించి ధర్మవర్తన, స్వవచో వ్యాఘాతముగను "చౌర్యము ధర్మ్యం"
బవునని మీరలు గఱపిన, నవుగాదనఁగ మొకమోట మందుచునుంటిన్. ౩౭

గీ. అకట! 'దండ్యుండు గురువు శిష్యాపరాధ,మున'నఁటందురుగద మిమ్ముబోటిబుధులు
నాకతన మీకు నెట్టి దండంబువచ్చునో? యటంచును బరితాప మొందుచుంటి.

క. చౌర్యము ధర్మంబనియా, చార్యుం డెవ్వండువలుకు? నది సేయునొకో
ఆర్యమనస్కుండు? భవ, చ్చర్య మముఁ బరీక్షణంబు సలుపుట కేమో? ౩౯

క. ఆఁకలి యసహ్యమగునెడ, నాకలముల మేసి బ్రదుకు టర్హముగానీ
యీ కరణి దుష్కృతంబున, గూఁకొట్టుట సముచితంబొకో మనుజులకున్? ౪౦

క. అని ధర్మబద్ధముగ నిటు, జనవంద్యుండైన బోధిసత్త్వుఁడు వలుకన్
విని హర్షబాష్పముల నా,తనిఁ గౌఁగిలిఁగొని గురుండు దగ నిట్లనియెన్. ౪౧

క. అక్షేత్రంబున బీజము, ప్రక్షిప్తంబై నశించు, ఫలియించుఁగదా!
సుక్షేత్రంబున నయ్యది, దక్షుండవు ధర్మముల ముదంబును గొంటిన్. ౪౨

క. ఉపధాశుద్ధుండవు! నా,యుపదేశము నాటె నీకు యుక్తముగ. మహిన్
సుపురుషులు భవాదృశులుం, ద్రపురూపుగ? నాదుగురుత సార్థతఁగాంచెన్. ౪౩

క. అనిమెచ్చి బోధిసత్త్వునిఁ, గనుంగొనియు నన్యశిష్యగణముం బలికెన్
సునయజ్ఞుండగు నీతని, ననువర్తింపుండు ధర్మ మారాధింపన్. ౪౪

క. అని యుపదేశంబొనరిచి, యనేకముల నాశిషముల నర్పించియు నం
పినఁ,బోయి బోధిసత్త్వుఁడు, తనయింటికిఁ, గడపె జీవితము ధర్మరతిన్. ౪౫

# 'సంప్రతి' యొక్క ఎఱ్ఱగుడి శిలాశాసనము

## పండిత చిదిరె మఠము వీరభద్ర శర్మగారు



'భారతి' మాసపత్రికయొక్క గడచిన శుక్ల సంవత్సర భాద్రపద సంచికలో శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు "అశోకుని శిలా శాసనములు; రాయల సీమ" అను వ్యాసమును ప్రకటించిరి. అనంతపురం జిల్లా గుత్తి తాలూకా గ్రామమునుండి గుంతకల్లు పోవు రోడ్డుమీద తూర్పుప్రక్కన ఎఱ్ఱగుడి అను గ్రామము కలదు. దీనికి పడమరనున్న గుట్టలలోని బండలమీద అశోకుని శాసనములు చెక్కబడి యున్నట్లు తెలిసికొని శ్రీ. మ. సో. శర్మగారును శ్రీ డా. ఎన్. వేంకట రమణయ్యగారును అక్కడికి వెళ్ళి మిక్కిలి ప్రయాసతో ఆ శాసనములకు ప్రతిబింబములను తీసిరి. కాని వానిలో నొక్క పెద్ద శాసనము మాత్రమే ప్రతిబింబములో బాగుగా వచ్చినది. ఈ శాసనమును సంపాదించుటలో తమకైన వ్రియ ప్రయాసలను శర్మగారు నిరూపించుచు, ఆ శాసన చిత్రమును గూడ పై సంచికలో బ్రకటించుచు నిట్లు వ్రాసిరి.

"శాసన లిపి బ్రాహ్మిలిపి; భాష ప్రాకృతము. మేము తీసిన ప్రతిబింబమును బట్టి శాసనమును విడదీసి చదివి ప్రకటించవలెనని కొంత ప్రయత్నించితిమి కాని శాసనపంక్తులు సరాసరిగ నుండక ఒకదానిలోనుండి మఱియొకదానిలోనికి పోవునట్లు చెక్కబడుటచేతను, కొన్ని యక్షరములు చెడుటచేతను, శాసనమును విడదీయుటకే అసలు శాసలు శాసనశిలను చూడవలసిన పునరపేక్షకలిగినది, కాని యది యెట్లు నెరవేరగలదు ? ద్రవ్యసాధ్యము. అందువలన చేయునదిలేక యా శాసనము నింతవరకు ప్రకటింబజాలమైతిమి. అశోకశాసన విమర్శ జిజ్ఞాసువుల కుపకరింపగలదేమో కొంతవరకైనని మేము తీసిన ప్రతిబింబము నిట నిచ్చుచున్నాము"

నే నపుడు కాశీక్షేత్రములో శాస్త్రాభ్యాసము నొనర్చుచు మాకాలేజిప్రిన్సిపాలుగారైన శ్రీ మహామహోపాధ్యాయ పండిత గోపీనాథకవిరాజ ఎం. ఎ. గారి ప్రోత్సాహానుగ్రహములవలన మఱొకవైపు ప్రాచీనలిపిమున్నగు నితిహాసజ్ఞానము కొరకును పరిశ్రమించుచుంటిని ఇట్టి సంధిలో శ్రీ సోమశేఖరశర్మగారి శాసన ప్రతిబింబము నాకంటబడి కుతూహలమును గల్గించినది. శాసనమును జూపగా ప్రిన్సిపాలుగారు "దీనిని జదివి పాఠమును నిర్ణయింపగలవేని నీకు బ్రాహ్మలిపి, పాలిభాషయు వచ్చినట్లే" యని సెలవిచ్చిరి. తత్కాలముననే త్వరగా పఠింపదలంచితిని కాని రెండుమాసముల దనుక పఠనపాఠనములవలన నవకాశములభింపలేదు. స్వయముగ ప్రతిబింబమును దీసినవారే తమ యొద్దనున్న పెద్దప్రతిబింబమును బట్టి పాఠమును వ్రాయనపుడు 'భారతి'లో ప్రకటింపబడిన చిన్నబ్లాకును బట్టి చదివి పాఠమును నిర్ణయింపవలెనన్న నాకును చాల చిక్కుగ దోచినది. అసలు శాసన ప్రతిబింబమును పంపవలెనని శ్రీశర్మగారికి నివేదించినట్లు గూడ జ్ఞాపకమున్నది. అవకాశము

భింపగానే శుక్లసంవత్సరకార్తిక బ॥ ఏకాదశినాడు ఆ చిన్నబ్లాకును బట్టియే శాసనమును చదువుట కారంభించి కాలేజిలేని సమయములందెల్ల పది దినములవరకును తంటాలుపడుచు చివరకు పాఠమునంత సరిజేసి రిపోర్టు వ్రాసి శ్రీ ప్రిన్సిపాలుగారికి చూపగా సంతోషించి ఇంకను కొన్ని దోషములు కలవనిరి. రిపోర్టు పై పేజీలో తెలుగుతో నిట్లు వ్రాసితిని.

"బ్రాహ్మిలిపిలో నేను మొట్టమొదలు చదివినశాసనము.

శ్రీ. మ. సోమశేఖరశర్మగారు ఈ శాసనముగల వ్యాసమును భారతిలో ప్రకటించిరిగాని శాసన పాఠమును మాత్రము ప్రకటింపలేదు. ప్రతిబింబముకూడ సంపాదకుల అజాగ్రతవలన తలక్రిందుగా నచ్చయినది. ఎంతో కష్టముమీద దీని పాఠమును సాధించితిని. పాఠమూ రిపోర్టూ చివర నున్నవి.

బనారస్ } చి. మ. వీ.
శ్రీ విశ్వారాధ్యగురుకులము } శుక్ల మార్గశీర్ష శుక్ల పంచమి"

తర్వాత నా పాఠముగల వ్యాసమును భారతిలో ప్రకటింప దలంచితినికాని వీలు కలుగలేదు. ఈ యౌదాసీన్యమువలన పదునొకండు సంవత్సరము లెట్లు గడిచి పోయినవో స్వప్నమువలె నున్నది. ౬ సంవత్సరముల క్రితము శ్రీ. సో. శర్మగారు సికింద్రాబాదు మా యాశ్రమమునకు విచ్చేసినపుడు నా పాఠమును రిపోర్టును చూచి నవ్వుచు ప్రకటింపుమనిరి. దరిమిలా గతసంవత్సరము మద్రాసులోగలిసి సంభాషించగా "ఈ శాసనము పాఠముతో సహా ఇంగ్లీషుపత్రికలో నచ్చుపడినద"ని చెప్పిరి. "వారిది వారికే నా పాఠము నేను ప్రకటింతున"ని నివేదించితిని. ఇంతవరకును ఆ శాసన పాఠముగల ఇంగ్లీషుపత్రికను నేను చూడదలచలేదు.

శర్మగారి బ్లాకు ననుసరించియే చదివినాడను కావునను, బ్లాకులో కొన్ని తెల్లచుక్కలు నల్లచుక్క లుండుటచేతను, నేను చదివిన పాఠము సంపూర్ణముగా సక్రమమైనదని చెప్ప వీలులేదు కాని, అశోకుని శాసనపఠనములోను పాలి సంస్కృతభాషలలోనుగల పరిచయము కారణముకాగా బ్రాహ్మిలిపి నభ్యసించిన విధానమును పురస్కరించుకొని శాసనమును చదివితిని. వారి బ్లాకు తొమ్మిదంగుళముల వెడల్పుగానున్నను మసకగా నున్నందున ఇతరులు చదువుట కుపయోగ పడునట్లు తెల్లనల్ల శిరాలతో దానిని నా పాఠానుసారము సంస్కరించి క్రొత్తగా నాల్గు అంగుళముల చిన్నబ్లాకునుగా చేయించి ఇందు వెంట ప్రకటించుచున్నాను. ఈ కారణములవలన సహజముగ కొన్ని పొరపాట్లు జరిగియుండునేమో అసలు ప్రతిబింబము లభించినగాని నిర్ణయించుటకు వీలుండదు.

మన దేశమున దొరకిన బ్రాహ్మిలిపిశాసనలన్నియు దాదాపు అశోకచక్రవర్తి వెలయించినవనియే సామాన్యముగ విద్వాంసులు భావించుచున్నారు. శాసనములలో "దేవానాం ప్రియదర్శి" అనుమకుటమురాగానే ఆది అశోకుని శాసనమనుట రూఢియై పోయినది. నేనును ప్రప్రథమములో నట్లే భావించుచుంటిని. సోమశేఖరశర్మ గారును సహజముగ ఈ శాసనమును అశోకునిదిగా నెంచి "అశోకుని శిలా శాసనములు" అని వ్యాసమును ప్రకటించిరి.

కాని వారు ప్రకటించిన శాసనము అశోకునిదికాదు. అది అశోకుని మనుమడైన సంప్రతి చక్రవర్తియొక్క శాసనము. అశోకునివని చెప్పబడు శాసనములలోను అశోకునిపేరు లేదు. ఒక మస్కి (రాయచూరు జిల్లా) శాసనములో మాత్రము అశోకుని పేరున్నట్లు జ్ఞాపకము. మామూలుగా "దేవానాం ప్రియ" అనుటను బట్టియే అశోక శాసనములని చెప్పుచున్నను ప్రత్యేకముగ నాగార్జున కొండలోని శాసనములలో "దశరథ" అను పేరును ఈ యెఱ్ఱగుడి శాసనములో సంప్రతి పేరును కనుపడుచున్నది కావున ఈ దేవానాంప్రియశాసనములన్నియు ఈ ముగ్గురి వ్యక్తులకు జెందవలసినవేకాని ఒక అశోకునివి మాత్రమే కాజాలవు. ఈ తత్త్వము ననుసరించి ఇదివర కనుకొనిన అశోక ప్రాబల్యము కొంత తగ్గదగియున్నది. పురాణములలో దశరథునియొక్కయు సంప్రతియొక్కయు నామోల్లేఖనము సగౌరవముగా నున్నది కావున అశోకునికి తుల్యముగ గాకపోయినను కొంతవరకైనను వీరిరువురు దేవానాంప్రియ మతమును సంరక్షించియుందురని నమ్మవచ్చును. వీనిని అన్నిటిని అశోకుని శాసనములనుటకంటె "దేవానాం ప్రియ" శాసనములనుట యెక్కువ సమంజసమని అభిప్రాయ పడుచున్నాను.

అశోకుడు క్రీస్తుకు ౨౭౨ సంవత్సరముల పూర్వము రాజ్యాభిషిక్తుడై ౨౩౧ పూర్వమువరకు అనగా ౪౦ సంవత్సరముల వరకు రాజ్యమేలి గతించినట్లు చరిత్రకారులు నిర్ణయించినారు. అశోకుని యనంతరము అతనిపుత్రు డప్పటికే గతించి యుండినందున కాబోలు పౌత్రులగు దశరథుడును సంప్రతియు సింహాసనారూఢులైరి. భారత దేశమందలి పూర్వోత్తర ప్రాంతములకు దశరథుడును, పశ్చిమదక్షిణపార్శ్వములకు సంప్రతియును, సార్వభౌమత్వమును వహించి పాలించియుందురు. అశోకునకు ఏ భార్యా సంబంధమువలన పుత్రుడును పౌత్రులును గలిగిరో ఐతిహ్యమునను సరించి సక్రమముగ నిరూపించజాలము. అలహాబాదు స్తంభ శాసనములో అశోకుని భార్య కారువాకీదేవి యని తెలియుచున్నది కాని ఆమె పుత్రులెవరో దశరథసంప్రతుల తండ్రియెవరో శాసనములవలన స్పష్టపడుటలేదు. అశోకుడు వయస్సు ముదిరిన తరువాత 'తిష్యరక్షిత' యను సుందరిని వివాహ మాడినట్లు ఆమెను అశోకుని సుందర

పుత్రుడగు 'కుణాల్' అను వానిని మోహించినట్లును అతడంగీకరించనందున వానిని నేత్రభంజనము గావించి హింసించినట్లును నొక దంతకథ ప్రచారమున నున్నది. దీని సత్యాసత్యముల నిర్ణయింపజాలము. *ఎట్లైన నేమిగాని దశరథ సంప్రతుల తల్లి దండ్రులను గూర్చి ఇతిహాసమున స్పష్టమైన ప్రమాణములు లేనందున కొంత యను మానము కలుగుచున్నది. ఇటీవల నింగ్లీషు పత్రికలలో నీయంశములను గూర్చి క్రొత్త పరిశోధన లేమైన ప్రకటింపబడిన వేమోకాని మాకవి లభ్యముకాలేదు.

ఈ మెట్టగుడి శిలాసనములో మొత్తము. 21 బంతులుకలవు. దీనిని రాతిలో చెక్కిన లేఖకుడు (లిపికరుడు=కాశవాడు) నిచ్చెన వేసికొని కొండలోని జారు (సాను) బండలమీద చేతికి అందినట్లు అనువైనట్లెల్ల తొలిచి నాడేకాని ఒక సరియైన పద్ధతి నవలింబించలేదు. బండను నునుపుజేసి బంతులను చక్కగాను సమముగాను వ్రాయ లేదు. అందువలన ఒక్కొకలైనను నిర్ణయించుటయే కష్టముగా నున్నది. ఇంకొక వైపరీత్యమే మనగా ౧౧, ౧౨ వ పంక్తులు (సందును జూచికాబోలు)సగమునుండియే ఆరంభము చేయబడినవి. పదవపంక్తి వంకరగా పోయనందున తర్వాతి పంక్తులను ఎడమవైపు మొదటినుండి యారంభించి సగము వరకే వ్రాసి ఆ వంకను సరిచేసినాడు. అనగా వీనిని ముందుచక్కగా చివరవరకు వ్రాయటకు పై పదవ పంక్తియొక్క వంక అడ్డము వచ్చినందున వీలు లేకపోయినది. అటులే క్రిందివైపు వంకలు రాగా నాలుగు బంతులను (౧౧-౧౨-౧౬-౨౦) ఎడమవైపునుండి కుడివైపుకు చెక్కినాడు.౧౬-౨౧ పంక్తులను క్రిందినుండి పైకి వ్రాసినాడు. అనగా ప్రాచీనమగు ఖరోష్ఠిలిపివలెను. నేటి పార్సీ ఉర్దూలిపులవలెను విపరీతముగా చెక్కబడినవి. అర్థక్రమమును బట్టి నే నిట్లు భావించితిని. ఈ స్థలములను గురుతించుటకుగాను ఇందువెంట ప్రకటింప బడిన బ్లాకులో కుడి యెడమవైపులందు గుండ్రని పెద్ద తెల్లచుక్కలను మధ్యన రెండురెండు పెద్ద నిలువుగీతలను ప్రత్యేకముగ తెల్లసిరాతో వ్రాసినాడను అవి సహజముగా తెలియగలవు. బ్రాహ్మీలిపి శాసనములలో నిదివర కెక్కడనైనా ఎడమనుండి కుడివైపునకు వ్రాసిన స్థలములు కలవేమో తెలియదు.

ఈ శాసనములోనున్న లిపికి (అక్షరములకు) బ్రాహ్మియని పేరు సువిఖ్యా తము. అశోకుని శాసనములు చాల నుండుటచే దీనికి అశోకలిపి యనియును వ్యవహ రింపసాగినారు. కాని అట్లనుట సరికాదు. నేడు ప్రచారమందియున్న భారత దేశపు సమస్త భాషలకును అక్షరములకును, మాతృక సంస్కృతభాష సంస్కృతాక్షరములే!

* పంజాబుదేశమున విఖ్యాతుడైన "పూరణభగత్" అను వానికిని, ఉత్తరదేశపు 'చౌరంగి' కిని, ఆంధ్రదేశపు 'సారంగధరు'నకును ఇట్టికథయేసంబద్ధముగా జెప్పబడుచున్నది. అసలీకథ గ్రీసు దేశమునందలిదనియును భారతీయు లనుకరించిరనియును కొంద రనుచున్నారు.

కావునను, వానిని ఆదియందు బ్రహ్మ నిర్మించినాడు కావునను ఇది బ్రాహ్మియనియే శిష్టపరంపరగా(బ్రాహ్మీతు భారతీ భాషా గీర్వాగ్వాణీ సరస్వతీ, అమరకోశము) వ్యవహరింపబడు చున్నది. దేశభేదమునుబట్టి ఆంధ్ర కర్నాటక ద్రవిడము లని లిపికి ఔపాధిక నామములు గలిగినవి కాని వీనికన్నిటికిని బ్రాహ్మిలిపియే ఆదిరూపము. ఈశాసనములోనున్న అక్షరములు మన తెలుగు లిపిగా నీక్రింద వ్రాయబడుచున్నవి. పంక్తులమీద వ్రాయబడిన అంకెలు శాసనములోని పంక్తులను వేరువేరుగా గురుతించుటకు వేసినగురుతులని తెలిసికొనవలెను.

## 'సంప్రతి' ఎఱ్ఱగుడి - శిలాశాసనపాఠము

(౧) స దేవానం పియేన సపతినా
(౨) తిలిన + ఛ ససాన ఏవంతు నాసపాణ కలంయ
(౩) హసంసా గవేక ఛ + సవధరేయం మయా సంఘే ఉపయి
(౪) మిభా మనీసా + + లేకా చ ణమితే కయంమే చధం థాతే
(౫) దేవానం పియేన + వేహితే దానే మలి భూతాప కమ సహీ
(౬) మ + + + ఏతమేవ ఖయేకి సవనే తాపమయం
(౭) మమ ఖసన కయే విపులే మతే అప (ఖ?) తాయేవ అతాయ ఇ అం
(౮) ఛవతే పతర అథ ఖదే కమపరకా ఇమపర కc మే వూ
(౯) యాపక వణేరత విపు + హీవ చకౌస థిర విపునో జామే వతా
(౧౦) థఅపితేవ + న + లేమ. హీవం దేవానం వథిసితా ఆపరిథియా దియథియం (?)
(౧౧) దేవానం పిసానే వసి వంయ ఇ (ఇది కుడివైపు సగమునుండి చదువవలెను.)
(౧౨) యే + హేయథా దేవా ( ,, ,, )
(౧౧) + + + కే అన పేతవియే (ఇది మామూలుగా సగమువరకు)
(౧౨) న అ దేయం న జానిదాభే ( ,, ,, )
(౧౩) వంపిసతి ణ తాణేన వా మేభ పిత సు రయేవటి కంథాతిహీ ఆయే పియావం
(౧౪) సితవియే హేమ వగపావు సుసుసితవియే పానిసు దయతవియే సచేవేస మయేనే
(౧౫) సుసుమ థంమ + నపవంతితవియే హేవంతుథ అనం పయేథ దేవానం పియ వంవణేన హే
(౧౬) యథహథియే రేహని కాగ నకో ని యుయో వరయాన థంభనాని వంతుఫహేవం పియని అ
(౧౬) యాసవే (ఇది ఉర్దువలె క్రిందనుండి పైకి చదువవలెను.)
(౧౭) థయంతే వాసినియా హిసా ప్రాపన పకింతి ఇఅం నునుసితవియేఅపవాయనాయ విఆచరిసవమే
(౧౮) యసయథా వారన అవరియా సనాతి కాని యథా రహనాతికా సుపవతితవియం హేసాయం
(౧౯) సరీతు వీస యథా రహయవతితీవీయే పిరసా పారాన పకితి యథారహం యథా ఇయం
(౨౦) మ + + కనియా హేవంతు ఆనేప యాథాని వాసాయ వచఅం తేపాసిని హేవం దే
(౨౧) వానం పియ ఆనపయతి (ఇది ఉర్దువలె క్రిందినుండి పైకి చదువవలెను.)

ఈ భాషకు సంస్కృతచ్ఛాయ ఆంధ్రానువాదమును, విశేషాంశములును, ముందు ప్రకటింపబడును. పరిశోధకు లెవరైన తమకు దెలిసిన యంశములను దెలుప గోరుచున్నాను.

# సంతాపము

'విద్యానిధి'



సీ. దుర్భరదారిద్ర్య దుఃఖాబ్ధిమగ్నుల
దీర్ఘరోగాళి విదీర్ణతనుల
ఘోరవిపన్మహా భారసంఘృష్టుల
శూన్యసంతాన విశుష్కరతుల
వికటతరాజ్ఞాన విషమదుర్బుద్ధుల
పరధన దారాపహారణమతుల
దంభవిద్వేషణా దగ్ధయశస్కుల
నాస్తికవాద వినష్టముష్కుల
గీ. జూచి, యెఱింగియు, నూహించి, వేచి, వేచి
మఱి ప్రతీకారభావనా మాంద్యవశత
వ్యర్థజీవిత మిటుల నవారితముగ
స్థాణువై యింక నెన్నాళ్లు సాగు నోళ్కా!

సీ. గర్వంబుచే కన్నుగాన కుండుట కాని
రిక్తజీవుల నుద్ధరింపనైతి
నపకారతంత్రంబు లాచరించుట కాని
యుపకారమున బాప మూడ్చనైతిఁ
బరులను పూజలు గఱపు మంటయె కాని
స్వీకరంబుతోఁ బూజ సలుప నైతి
శుష్కజీవితముతో ముష్కరించుట కాని
యొక్కరితోఁ బ్రేమ నుండనైతి
గీ. నాత్మ నీరీతి గర్వ, మహాపకార,
సేవనాహీన, శుష్కోగ్ర, జీవితముగఁ
దలఁచి సంతాపమున పరధ్యానఫక్కి
గడపుచున్నాఁడ నీ మహాకాలమెల్ల.

---

(17-2-40 నాడు భగవాన్ బుద్ధుని చిత్రమును జూచు చుండగ కలిగిన భావము)

# ఆచార్యపండితుఁడు

(సం ౧. సం ౮. తరువాయి)

శ్రీ టండారు తమ్మయ్యగారు



ఇంతవఱకుఁ జూపిన ప్రమాణములవలన వీరశైవమతాచార్యు లయిదుగురిలో నాచార్యపండితుఁడు నాల్గవవాఁడనియు యుగభేదములఁబట్టి యాతఁడు చతురక్షర, చతుర్వక్త్ర, ధేనుకర్ణ, పండితారాధ్యనామములచే వ్యవహరింపఁబడుననియు, సుధాకుండ క్షేత్రమందలి మల్లికార్జునలింగ గర్భమునం దాతని జననమనియు, శ్రీగిరియందు నివాసమనియు క్రీ. శ ౧౨ వ శతాబ్దియందు బసవేశ్వరుని సమకాలికుఁడయి వెలసిన మల్లికార్జున పండితునకు నాతనికెట్టి సంబంధమును లేదనియుఁ దెలియఁగలదు. సుధాకుండక్షేత్రమన శ్రీశైలము కాదనియుఁ గావున నాచార్యపండితు డుద్భవించిన మల్లికార్జునలింగము శ్రీశైలమందలిదికాదనియుఁ గొందఱు తలంచుచున్నారు. కాని నాయభిప్రాయ మదికాదు. శ్రీశైలమందలి పలుకుండములలో సుధాకుండ మొకటియై యుండును. సిద్ధనాథ శివాచార్యులు రచించిన రేణుకవిజయమను గ్రంథము (దీని వివరములు ముందు తెలుపఁబడును)లో రేణుకాచార్యుఁడు తన యాత్రలో శ్రీశైలమున కేఁగి తత్సింహాసనాధీశుండగు నాచార్యపండితుని సందర్శించి ముచ్చటించినట్లున్నది. ఆసందర్భమున పండితారాధ్యుని వర్ణనలో "సాక్షాన్మల్లికార్జున మహాలింగాధిగత జన్మానం త్రిలోకే తిలకాయమాన మేనం పండితాచార్యం పరితోష్య" అని వ్రాయఁబడినది కావున దీనిని బట్టి యాచార్యపండితుని జననము నావాసముగూడ శ్రీశైలమునందే యని నిస్సంశయముగ నెంచవచ్చును.

నిజస్థితి యిట్లుండఁ గేవలము పండితశబ్దమును బట్టి యారాధ్యవిశేషణశబ్దమునుబట్టి భ్రమించి మనవారు రమారమి ౮౦౦ సంవత్సరముల క్రిందటనున్న మల్లికార్జున పండితునకుఁ బంచాచార్యులలోఁ బ్రవేశము కలిగించుట గొప్ప ప్రమాదమని వేఱచెప్పనక్కఱలేదు. పండితోపపదము కేవలము వీరశైవులలోనే గాక యానాఁడు పాశుపతులు, కాలాముఖులు, జైనులు, స్మార్తులు, మున్నగు నితర మతస్థులలోఁగూడ వ్యవహారమునందుండినట్లు లాకాలమందలి శాసనములలోని ప్రతిగ్రహీతల నామములఁబట్టి మనము గ్రహింప వచ్చును. ఇఁక "ఆరాధ్య" శబ్దము కూడ జంగమశబ్దమువలెనే కులవాచకముగఁగాక యాకాలమున సామాన్యముగ శివభక్తవాచకముగనే యుపయోగింపఁబడినట్లును గేవల వీరశైవులు

గాని పాశుపతాదులు గూడఁ గ్వాచిత్కముగఁ దానినిఁ దమ నామములకుఁ జేర్చి కొనినట్లును నప్పటి వాఙ్మయమును బట్టి కానవగును. ఆగమార్థముల ననుసంధించుచు రాగ మోహాది వర్జితుడయి ధ్యానజ్ఞాన సమాయుక్తుఁడగు శైవుఁడు ఆరాధ్యుఁ డని చెప్పబడునని యీ శబ్దము నిర్వచింపఁబడినది.

శ్లో. ఆగమార్థానుసంధాతా । మద (రాగ) మోహాదివర్జితః ।
ధ్యానజ్ఞానసమాయుక్త ఆరాధ్య స్తేన కథ్యతే.

కావునఁ బయిన జెప్పిన కారణములచేఁ గేవలము పండిత, ఆరాధ్య శబ్దములఁ జూచి బుద్ధిమంతు లిట్టు చారిత్రిక విషయ నిరూపణములలో భ్రమప్రమాదములకు లోను గాఁగూడదు. గురురాజకవి సంస్కృత పండితారాధ్య చరిత్రమును గన్నడ వివరణముతోఁ బ్రకటించిన పూర్వోదాహృతులు శ్రీ ఎన్. ఆర్. కటిబసవశాస్త్రిగారి వంటి కర్ణాట పండితులేగాక, బసవపురాణ పీఠికాకర్తలగు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారివంటి యాంధ్రపండితులుగూడ నిట్టి ప్రమాదమునకు లోనగుటకు ముఖ్య కారణము కర్ణాటక కవిచరిత్రము నందలి శ్రీ ఆర్. నరసింహాచార్యులుగారి వ్రాతలే యని నాయభిప్రాయము. శ్రీ నరసింహాచార్యులుగారు సంస్కృత భాషయందలి వీర శైవవాఙ్మయమును గాని యాంధ్రభాషయందున్న వాఙ్మయమును గాని పరిశోధింపక కన్నడములో నర్వాచీనకవులు కొందఱు రచించిన గ్రంథములలో నక్కడక్కడ నున్న పంచాచార్య విషయిక ప్రశంసలను జూచి, వాని నైనను సరిగా సమన్వయము చేసికొనక యందుఁ దాము గ్రహించిన విషయముల నొక్కచోఁ జేర్చి వీరశైవ పంచాచార్యులఁ గూర్చి స్వల్పముగఁ గొన్ని సంగతుల లిఖించిరి. అందుకు ముందుగా నుపోద్ఘాత పూర్వకముగ వారు రచించిన వాక్యములఁ జిత్తగింపుఁడు.

"వీరశైవాచార్యపంచక:—వీరశైవకవిగళు తమ్మగ్రంథగళల్లి రేవణ, మరుళ సిద్ధ, ఏకోరామితందె, పండితారాధ్య, విశ్వేశ్వర, ఎంబఐవరు ఆచార్యరుగళన్ను ప్రాయికవాగి స్తుతిసుత్తారె. ఇవరుగళల్లి కెలవరు బసవనిగె హిందెయో. అథవా సమకాలదల్లియో, ఇద్దంతెయూ, కెలవరు అవనకాలక్కె ఈచె ఇద్దంతెయూ, తోరుత్తదె ఇవరుగళల్లి ఒబ్బరిబ్బరు కన్నడదల్లి గ్రంథరచనె మాడిరువుదాగి తిళివుదరింద ఈ ఐవర విషయవన్నూ ఒందే కడెయల్లి సేరిసి వీరశైవ గ్రంథగళల్లి హేళిరువ మేరెగె స్వల్పమట్టిగె తిళిసుత్తేవె."

దీని కాంధ్రవివరణము—"వీరశైవకవులు తమ గ్రంథములలో రేవణ, మరుళ సిద్ధ, ఏకోరామ, పండితారాధ్య, విశ్వారాధ్య, అను పంచాచార్యులను ప్రాయికముగ స్తుతింతురు. వీరిలోఁ గొందఱు బసవేశ్వరునకు ముందు లేక సమకాలమునం

దుండియుండునని యు దోచుచున్నది. వీరిలో నొకరిద్దరు కన్నడమున గ్రంథరచనము గావించినట్లుకూడఁ దెలియుచున్నది. ఇందుచే నీ యైదుగురినిగూర్చిన విషయముల నొక్కచోటనే చేర్చి వీరశైవ గ్రంథములలో చెప్పియున్న మేరకు స్వల్పముగఁ దెలియఁ జేసెదము.''

ఇట్లు కర్ణాట కవిచరిత్రకారులు కన్నడములోని యర్వాచీన వీరశైవ గ్రంథములఁ బట్టి స్థూలదృష్టితో సంశయసూచకముగ లిఖించిన పంచాచార్యచరిత్రమును మన పండితులు సిద్ధాంతపూర్వకముగ గ్రహించి పెడదారులబట్టి పంచాచార్యులను గూర్చియు, వీరశైవమతమునుగూర్చియు వింత వింత వాక్యములు వ్రాయుట శోచనీయము: కర్ణాట కవిచరిత్రమున వీరశైవ పంచాచార్యుల చరిత్రమునకు ముందు శివలెంక మంచనపండిత, శ్రీపతిపండిత, మల్లికార్జునపండిత అను పండితత్రయమును గూర్చి కూడ గొంతచరిత్రమును శ్రీ నరసింహాచార్యులుగారు కన్నడగ్రంథముల బట్టి వారికిఁ దెలిసినంతవఱకు సంగ్రహముగ నుదాహరించినారు. అందులో మొదటి యిద్దఱు పండితులఁ గూర్చియుఁ జెప్పిన విషయములు పాలకురికి సోమనాథకవి తెలుఁగు బసవ పురాణములోని సంగతులను గ్రహించి కన్నడ కవులు తమ గ్రంథములలో వ్రాసిన వ్రాఁతల కనువాదములు. మల్లికార్జునపండితునిఁ గూర్చి వారు వ్రాసిన చరిత్రముగూడఁ బాల్కురికి సోముని తెలుఁగు పండితారాధ్య చరిత్రమున కనువాదముగా క్రీ. శ. ౧౩ వ శతాబ్దియందు గురురాజకవి రచించిన సంస్కృత పండిత చరిత్రము నుండియు, నీలకంఠ కవి కన్నడమున క్రీ.శ. ౧౫వ శతాబ్దిలో వ్రాసిన ఆరాధ్య చారిత్రము నుండియు సిద్ధనంజేశకవి క్రీ. శ. ౧౬ వ శతాబ్దిలో వ్రాసిన కన్నడ గురురాజ చారిత్రమునుండియుఁ గైకొనిన సంగ్రహము. దానికి నేనిదివఱకుఁ బాలకురికి సోమనాథ గ్రంథమునుబట్టి యుదాహరించిన మల్లికార్జున పండితుని చరిత్ర సంగ్రహమునకు విశేషభేదమేమియు లేదు. ఇఁక వీరశైవ పంచాచార్యులలోని పండితారాధ్యుని చరిత్రము వ్రాయుటలో శ్రీ నరసింహాచార్యులుగారు మఱేమియు వ్రాయక మల్లికార్జున పండితారాధ్యుఁడే యాద్యాచార్యుడను నభిప్రాయముతో "ఇతఁడు వీరశైవ పండిత త్రయములో నొకడు. ఇతని చరిత్ర మింతకుముందే వ్రాయబడినది. (౧౬౧ వ పుట చూడుడు)" అని వ్రాసి యూరకొనిరి. రేవణసిద్ధ (రేణుకాచార్య,) మరుళసిద్ధ, ఏకోరామతందె, అనువారిని గూర్చి వీరు వ్రాసిన యంశములు ప్రత్యేక వ్యాసమున నుదాహరించి విమర్శింపఁ దగినవి. విశ్వేశ్వరాచార్యుని (విశ్వారాధ్యుని) గూర్చి వీ రతిస్వల్పముగ నిట్లు వ్రాసి యున్నారు. "ఈతడు బసవని కాలమునకు చాల నిటీవల వాఁడని యూహింపఁదగి

యున్నది. మాకు దొరకిన వీరశైవ గ్రంథములలో నెచ్చటను నీతని చరిత్రము విశేషముగఁ జెప్పబడి యుండలేదు. క్రీ. శ. ౧౬ వ శతాబ్దియందలి సిద్ధనంజేశ కవి తన గురురాజ చారిత్రములో "ఈశ్వరుడే విశ్వేశ్వరాచార్యుఁడయి ధరయం దవతరించి పాలించెను. ఈతని శిష్యుడు సదాశివాచార్యుఁడు లేక పంచవణ్ణిగెయస్వామి యని చెప్పదురు. ఈతని శిష్యపరంపరలోఁ గొందఱు రాజసమ్మానితు లయినట్లు తెలియుచున్నది."

మఱియు వీరు క్రీ. శ. ౧౬౯౭ వ సంవత్సరములోఁ బుట్టిన చతురాచార్య చరిత్రములో మొదటఁ బేర్కొనిన నల్గు రాచార్యుల చరిత్రము మాత్రమే వర్ణిత మయినదనికూడ వ్రాసియున్నారు. వీరశైవాగమములలోఁగూడ గొన్నిచోట్లఁ నిట్లే నలుగు రాచార్యులే పేర్కొనబడినట్లు కాననగును. * ఇందులో శ్రీ ప్రభాకరశాస్త్రి గారు బసవపురాణ పీఠికలో వీరాగమము లోని దని యుదాహరించిన ఈ క్రింది శ్లోకము నిదర్శనము.

"రేవణో మరుసిద్ధేశో, రామదేవో మునీశ్వరః ।
పండితారాధ్య ఇత్యేతే, చతుర్మఠమునీశ్వరాః॥

వీరాగమమునకు సరియైన ప్రతు లింతవఱకు లభింపలేదని తెలియుచున్నది. అది యింతవఱకు నముద్రితమే! పయి శ్లోకములో రెండవ యాచార్యుని పేరు మరుళసిద్ధుఁ డనునది ఛందోభంగ శంకచే గాబోలు సరిగా నుదాహరింపఁబడలేదు. మూడవ యాచార్యుఁడు ఏకోరాముఁడు గూడ నిట్టి కారణముల వలననే రామదేవుఁ డని పేర్కొనఁబడినాఁడు. ఇట్టి శ్లోకములు ప్రక్షిప్తము లనుట కనేకావకాశము లున్నవి. ఇంతకుఁ గొన్ని కొన్ని తావుల నలువు రాచార్యులే యుదాహృతు లయినంత మాత్రమున బహు ప్రమాణములకు వ్యతిరేకముగ వీరశైవ మతాచార్యులు నలుగురే యని తలంపరాదు. చతుర్వేదములను వ్యవహారము సుప్రసిద్ధమయినను గొన్నిచోట్ల "త్రయీ" శబ్దముతో నవి మూఁడుగానే పేర్కొనఁబడుట పలువురెఱింగినదే. అంతమాత్రమున నాల్గవదియగు నథర్వవేదమును మనము విస్మరించుట లేదు. వీరశైవుల పంచసింహాసనములలో రెండు ఉత్తర హిందూస్థానమున, కేదారమునం దేకోరామాచార్యపీఠము, కాశియందు విశ్వారాధ్యపీఠము,

* శివదీక్షాకాలమున నల్వురు ఋత్విక్కులుగాను ఒకరు గురువుగాను ఎన్నుకొనబడుదురు. విశ్వారాధ్యుని ఈశాన్య కలశమునకే గురుకలశ మని పేరు. తక్కిన నల్వురు ఋత్విక్కులు చతురాచార్యు లనబడుదురు. ఈ రహస్యమును గమనింపనందువలన పంచాచార్యులు కొందరికి చతురాచార్యులుగా గనుపడిరి.

నెలకొనియుండుట సుప్రసిద్ధము. ఇందులో జంగమవాడి యందలి విశ్వారాధ్య పీఠమునందే వీరశైవమత ప్రాచీనతను నిరూపించు నైతిహాసిక సామగ్రి ఇప్పటికిని లభించుచున్నది. ఆ విషయమయి ముందు కొంత వివరింపఁబడును. కావున 'కర్ణాట కవిచరిత్రకారులు పరిశోధన మేమియు నొనర్పక విశ్వారాధ్యుఁడు బసవేశ్వరునకుఁ జాలఁ దరువాతివాఁడుగ గాన్పించునని వ్రాసినది కేవలము నిరాకరణీయము. ఈ 'విభూతి' పత్రికా సంపాదకులైన పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారు ఆరు సంవత్సరములకుఁ బూర్వము "కాశీపీఠాచే ప్రాచీనత్వ" అను మరాఠీ పుస్తకమున శ్రీ విశ్వారాధ్యుఁడును, కాశీ జంగమవాడి మఠమును, ౧౧వ శతాబ్దికంటెఁ బ్రాచీనమను సిద్ధాంతమును సప్రమాణముగ నిరూపించియున్నారు.

శ్రీ ప్రభాకరశాస్త్రిగారు కర్ణాట కవిచరిత్రమును దమ బసవపురాణ పీఠికలో బలుతావులఁ దడవియున్నారు. కావున వీరు వీరశైవమత చరిత్రమును గూర్చి వినిపించిన ప్రమాదములకుఁ జాలవఱకు మూలాధార మా గ్రంథమే యని మనము తలంచుట సత్యదూరము కానేరదు. ఆ గ్రంథమందలి వ్రాఁతల నూఁతగాఁ గొని సంస్కృతాంధ్ర వాఙ్మయములందు దాము చూచిన స్వల్పవీరశైవ గ్రంథములలోని ప్రమాణములను గూడ యా వ్రాతలతోనే సమన్వయము చేసికొనుచుఁ బరస్పర వైరుధ్యములనైనను బాటింపక యిచ్చవచ్చినట్లు వీరు వీరశైవమతమును గూర్చి సిద్ధాంత పూర్వకముగ బసవపురాణ పీఠికయందు వ్రాయుట మిక్కిలి శోచనీయము. 'శైవమతము' 'పాశుపతము' 'పాశుపతాదులు లింగధారులుగారు' 'వీరశైవముబసవేశ్వరాద్యుపజ్ఞమే' అను శీర్షికల క్రింద వీరెడనెడ నసంగతముల వ్రాసిరి.

వీరి వ్రాతల నన్నిటిని బర్యాలోచించిచూడ శ్రీ ప్రభాకరశాస్త్రిగారు తెలిసియో తెలియకయో మొదట వీరశైవము బసవేశ్వరునకు ముందు లేదను తప్పు టభిప్రాయమును మనముఘనముగ నిలిపికొని యాదృష్టితోనే తాముచూచిన యితర గ్రంథములను, బసవ పురాణమును గూడ జదివి యర్థము చేసికొని యందు కనుగుణముగా నావాక్యములను రచించినట్లు గోచరించును గాని, సముచిత దృష్టితో గ్రంథముల ముందుఁజదివి యన్వయించుకొని యందువలన నేర్పడిన యాథార్థజ్ఞానముతో నిట్టిసిద్ధాంతముల వెలువరించినట్లు కానరాదు. ఇది సహృదయ సమ్మతమైన మార్గము కాదని వేఱ చెప్పనక్కఱలేదు. వీరి యీ వాక్యములందలి ముఖ్య సిద్ధాంతములన్నిటిని శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగారు శైవరహస్య బోధిని (సం. ౫-సం౧-౨-3) లో బ్రకటితమయిన "బసవ పురాణ పీఠికా విమర్శనము" నందును, నేను ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక (సం. ౧౯. సం. 3-౪-౫)లోఁ బ్రకటితమయిన "పాలకురికి

సోమనాథకవి కులగోత్ర ప్రశంస” అను వ్యాసమునందును బ్రమాణపూర్వకముగ విపులముగ విమర్శించియే యుంటిమి. వానికి శాస్త్రిగా రింతవఱకెచ్చటను సమాధానములను బ్రకటించినట్లు కానరాదు. కావునఁ దద్విమర్శనాంశములను జర్విత చర్వణముగ మరల నిచ్చట నుదాహరించుట యనవసరము. అయినను బాఠకుల సౌకర్యార్థమందలి సారాంశములను మఱి కొన్ని విశేషాంశములతో దిఙ్మాత్రముగ సూచింతును. వివరములు వలయువారు పూర్వోక్త విమర్శనములను దిలకింతురుగాక!

శ్రీ ప్రభాకరశాస్త్రిగారు బ్రహ్మసూత్రములకు శంకరాచార్యు లద్వైత పరముగా రచించన భాష్యమే మొదటిదనియు, * శంకరాద్వైతము ప్రబలిన పిదప నాగమ తంత్రమతముల వారుగూడఁ దమమతములు బ్రహ్మసూత్రాభిప్రేతములే యని నిరూపించు పూన్కితో స్వసిద్ధాంతానుసారముగా భాష్యముల రచించిరనియు వ్రాయుట సరికాదు. నీలకంఠ (శ్రీకంఠ) శివాచార్యులు శివాద్వైత పరముగ రచించిన భాష్యము అప్పయ దీక్షితుల కాలమునుండియే యెక్కువ వ్యాప్తిలో నున్నదని, యది యంత ప్రాచీనమైనది కాకపోవచ్చునని, వ్రాయభిప్రాయ పడుట కూడ సమంజసము కాదు. శంకరభాష్యమందలి యంతస్సాక్ష్యమును బట్టియే శంకరాచార్యుఁ డంతకుఁ బూర్వమున్న భాష్యకర్తల యభిప్రాయముల నుదాహరించి వానిని బూర్వపక్ష మొనరింపఁ బ్రయత్నించి నీలకంఠ శివాచార్యుని భాష్య మది వఱకే యుండుటచే నాతని సిద్ధాంతములఁగూడ నుదాహరించె నని శ్రీనాగలింగ శాస్త్రిగారుదాహరణపూర్వకముగ నిరూపించి, శంకరాచార్యుని శిష్యుఁడని చెప్పబడు ఆనందగిరి రచించిన శంకర విజయ మందలి—

శ్లో. ఇతి తం వచనం నిశమ్య సమ్య గ్గ్రథితానేక నిబంధరత్నహారః।
శివ తత్పర సూత్రభాష్యకర్తా, ప్రహసన్ వాచ మువాచ శైవవర్యః॥

అను శ్లోకముగూడ నీలకంఠభాష్య ప్రాచీతనకు సాక్ష్యమనియు సెలవిచ్చినారు. మఱియు శ్రీకంఠభాష్యమును మొదట ముద్రింపించిన కావేరీమండల వాస్తవ్యులు, శాంకరమతస్థులు, శ్రీహాలాస్యనాథశాస్త్రిగారు శ్రీకంఠభాష్యమే శంకరభాష్యమునకన్నఁ బ్రాచీనమని నిర్ణయించిరనికూడ వారు వ్రాసియున్నారు. నీలకంఠ భాష్యమిప్పుడు ముద్రితమైనది, యథామాతృకముగ ముద్రింపఁబడలేదని పలువుర యభిప్రాయము. బహుగ్రంథ పరిశోధకులు, ఆంధ్రవిజ్ఞాన గ్రంథకర్తలు విశేష వ్యయప్రయాసములకు లోనయి మైసూరు ప్రాచ్యలిఖిత పుస్తకాలయమునుండి పలు

* శంకరాచార్యులకంటె బూర్వమే ౧౦ మంది యాచార్యులు బ్రహ్మసూత్రములకు భాష్యముల వ్రాసినట్లు ప్రమాణములు గల వ్యాసము ముందు ప్రకటింపబడును. సం.

శైవ గ్రంథములకుఁ బ్రతులు వ్రాయించిన దేవిడి సంస్థానాధీశులు శ్రీ ఇజ్జతాసార్ కంధుకూరి బాలసూర్యప్రసాదరావు బహద్దరు జమీందారుగారు శ్రీకంఠుఁడు, నీలకంఠుఁడు నొక్కరే యనియు, నీలకంఠభాష్యము వ్రాఁతప్రతులలో లింగధారణ ప్రతిపాదక వాక్యములుగూడఁ గలవనియు సెలవిచ్చిరి. కాని నీలకంఠుఁడు, శ్రీకంఠుడు నొక్కరా వేఱా ? యను విషయ మింకను విమర్శనీయమే. ఇఁక నిక్కమాలోచింప శంకరభాష్యమే బ్రహ్మ సూత్రాభిప్రాయప్రేరితము కాదనియు శంకరుఁడు సూత్రములలోని పూర్వపక్షసిద్ధాంతములను దనభాష్యమునఁ దాఱుమాఱొనర్చెననియు, భాష్యారంభమున నొనర్చిన యధ్యాసభాష్యమే శంకరుని యీ పూన్కికి నిదర్శనమనియుఁ జెప్పి శ్రీనాగలింగశాస్త్రిగారు నీలకంఠభాష్యమే బ్రహ్మసూత్రాభిప్రాయానుసారముగ నున్నదని యుదాహరణ పూర్వకముగ నిరూపించినారు. కావున శ్రీకంఠ భాష్యమును గూర్చి శ్రీ ప్రభాకర శాస్త్రిగారు వ్రాసిన వ్రాఁతలు సత్యదూరములు. నిజమిట్లుండ నీలకంఠాచార్యుఁడు బసవేశ్వరుని కాలము వాఁడని వీరు వ్రాయుట మహాశ్చర్యము. శ్రీపతి పండితుని శ్రీకర భాష్యమును గూర్చి వీరు వ్రాసినది మఱియు నాశ్చర్యకరముగ నున్నది. ఈ భాష్యము శ్రీపతి పండిత రచితము కాదనియే వారి నమ్మకమఁట. కారణమేమో వారు సెలవివ్వ రయిరిగదా ? చెప్పకున్నను వారి కారణములను మనము గ్రహింపవచ్చును. ఉన్న భాష్యములలో వీరశైవ మత ప్రతిపాదకమగు శక్తి విశిష్టాద్వైత సిద్ధాంతమును (భేదాఽభేద సిద్ధాంతమును) విస్పష్టముగను, విపులముగను రాద్ధాంత మొనర్చునది యీ శ్రీకర భాష్యము. శ్రీపతి పండితుని బసవ పురాణము సప్తమాశ్వాసమునందుఁ బాలకురికి సోమనాథుఁడు పేర్కొని యాతఁడు అనంతపాలుని సభాస్థలిని గోటి బ్రాహ్మణులైన నొక్క శివభక్తునితో నెనగారని వాదించి తన హాత్తిపచ్చడమునఁ జండ్రనిప్పులు ముడిచిన సుప్రసిద్ధైతిహ్యము నుగ్గడించినాఁడు. అనంతపాలుఁడు పశ్చిమ చాళుక్య చక్రవర్తియగు నాఱవ విక్రమాదిత్యుని సామంతుఁడయి పెక్కు సీమలను బరిపాలించిన వాఁడనియు, నతఁడు క్రీ. శ. ౧౦౮౫—౧౧౧౭ మధ్య నుండెననియు, మల్లికార్జునపండితుని శివతత్త్వసారమునఁగూడ శ్రీపతి పండితుని ప్రశంస యుండుటచే నాతఁడు బసవేశ్వరునకు నించుమించుగ నొక శతాబ్ది పూర్వుఁడు కాఁదగుననియు శ్రీప్రభాకర శాస్త్రిగారు బసవ పురాణ పీఠిక ౬౩,౬౪, పుటలలో నంగీకరించి యున్నారు. ఇందుచే శ్రీకర భాష్యము శ్రీపతి పండిత కృతమని యంగీకరించినచో వీరశైవము బసవేశ్వరోపజ్ఞమను దమ సిద్ధాంతము నిలువునఁ గూలిపోవును. ఈ భయముచేతనే శ్రీ శాస్త్రిగారొక్క మాటతో శ్రీపతి పండి

తుఁడు దీనిని రచించెననుట తాము నమ్మజాలమని వ్రాసి కృతకృత్యుల మయితిమని సంతసించి యుందురు. శ్రీకర భాష్యము చాలఁగాలము క్రిందట మొదట నొకతూరి సికింద్రాబాదులో తప్పులుఁగా ముద్రిత మయినది. మరల బెంగుళూరులో దేవనాగర లిపిలో ఆంగ్లోపోద్ఘాత సహితముగ శ్రీ. సి. హయవదనరావుగారు దానిని ౧౯౩౬లో ప్రకటించియున్నారు. ఇప్పుడీ పత్రికలో నది మరలఁ దెలుఁగులోఁ బరిశుద్ధముగఁ బరిష్కృతమయి ప్రకటిత మగుచుండుట పాఠకులకు సువిదితమే. దానిలో నవతారికలో,

"శ్రీ వైయాసికసూత్రవర్ణపదముఖ్యార్థం శివానుగ్రహా
ద్భావ్యం శ్రీకరనామకం భవహరం దుర్వాదిగర్వాపహం
సర్వానర్థవినాశకం బుధనుతం తత్త్వార్థబోధాకరం
శ్రీమచ్ఛ్రీపతిపండితేంద్రయతినా వ్యాతన్యతే సాంప్రతం.

అని శ్రీపతి పండితుని కర్తృత్వము విస్పష్టముగఁ జెప్పఁబడినది. అకారణముగ దీనిని నమ్మమని శ్రీశాస్త్రిగారనినంతమాత్రమున సహృదయులు దానిని నమ్మఁగలరా? శ్రీ హయవదనరావుగారు గ్రంథకర్తృత్వమునెడ సంశయమేమియుఁ జూపలేదు. కాని తాము మధ్వమతస్థులగుటచేఁ గాబోలు శ్రీపతి పండితుని మధ్వాచార్యుని కంటె నర్వాచీనునిగా నిరూపించు కుతూహలముచేఁ గొన్ని యపపాఠముల సృష్టించి, నిర్వివాదముగ నిదివఱకే నిర్ణీతమయిన శ్రీపతి పండితుని కాలము నెఱింగియుఁ గారణాభాసములతో నాతనినిఁ దమ యుపోద్ఘాతమునందు క్రీ.శ. ౧౪౦౦ ప్రాంతమువాఁడని నిరూపింప యత్నించి లోకమునకుఁ బరిహాసభాజనులైరి. వీరివ్రాతల నిదివఱకే శ్రీ కాశీనాథశాస్త్రిగారును, శ్రీ చి. మ. వీరభద్రశర్మగారును "పంచాచార్యప్రభ" యను కన్నడ వారపత్రికలో ననేకవ్యాసములందు విమర్శించి యందలి వైపరీత్యమును వెల్లడించియున్నారు.

తెలుఁగునాటి యారాధ్యులు వీరశైవులు గారనియు, వారి పూర్వులు లింగధారులు గారనియు, అందుచే, బండితత్రయ మనఁబరఁగు శివలెంకమంచన, శ్రీపతి, మల్లికార్జున పండితులు కూడ లింగధారులనుటకుఁ బ్రమాణములు లేవనియు, కృష్ణదేవ రాయలకుఁ బూర్వము బ్రాహ్మణులలో లింగధారణ ముండెననుటకుఁ బ్రబలాధారములు గలవేమో పరిశోధింపవలసి యున్నదనియు, శ్రీ ప్రభాకరశాస్త్రిగారు వ్రాయుట మిక్కిలి యవిచారమూలకమని చెప్పనక్కరలేదు. ఇట్టి యాహాఢ జ్ఞానముతోనే బసవపురాణ పీఠికను రచించినపుడు వీరు మరల నాపీఠికయందే స్వవచన వ్యాఘాతముగఁ బాలకురికి సోమనాథుఁడు వీరశైవ దీక్షితుఁడగు బ్రాహ్మణుఁడనియు,

"రేవణో మరుసిద్ధేశో—" అను వీరాగమ శ్లోకమున వీరశైవ మతాచార్యులలో నుదాహృతుఁడయిన పండితారాధ్యుఁడు శివలెంక మంచన పండితుఁడయినను, శ్రీపతి పండితుఁ డయినను, మల్లికార్జున పండితుఁ డయినను నాతఁడు బసవేశ్వరున కించుమించుగ సమానకాలమువాఁడే యగుననియు వ్రాయుట వింతగాఁ దోపకపోదు. ఇట్టివెల్ల నాలోచింప శాస్త్రిగారు మతవిషయములఁ గూర్చి ముందు వెనుకలయినను జూచి కొనకయే యథేచ్ఛముగ విచ్చలవిడిగ వ్రాసినట్లు కానవగును. భృంగిరిటి గోత్రుఁడను, శివకులీనుఁడను, అని సోమనాథుఁడు తన యనుభవసారములోఁ దన కులగోత్రములు ములు చెప్పికొని యున్నపుడు ఆతని శిష్య ప్రశిష్యులు పిడుపర్తి సోమనాథాదులుకూడఁ దమ గ్రంథములలో నీసంగతి యుగ్గడించినప్పుడు ౧౯౨౨ వ సంవత్సరములో ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచికలో నీ విషయమును నేను సప్రమాణముగ నిరూపించి నప్పటికి శాస్త్రిగారు దానిని ద్రోసిపుచ్చి స్వవచన విరుద్ధముగ సోమనాథు నొక్కని మాత్రము వీరశైవ దీక్షితుఁడగు బ్రాహ్మణుఁ డని వాదించుటలోఁ గల వైపరీత్య మును "పాలకురికి సోమనాథకవి కులగోత్ర ప్రశంస" అను నా పూర్వోక్త వ్యాస ములో విపులముగా వెల్లడించియుంటిని.

"పవిత్రం తే వితతం బ్రహ్మణస్పతే......"
"అమృతస్య దేవధారణో భూయాసమ్"
"నమో బ్రహ్మణే ధారణం మే అస్తు"—మున్నగు శ్రుతివాక్యములు,
"చాతుర్వర్ణ్యానాం లింగధారణముచ్యతే"-ఇత్యాద్యుపనిషద్వాక్యములు,
"ముఖేమంత్రో హృదిధ్యానం మస్తకే లింగధారణం
శిఖాసూత్రం జటా భస్మ వీతద్బ్రాహ్మణలక్షణం".
మొదలగు స్మృతి ప్రమాణములు,
"తదేవ హస్తాంబుజపీఠమధ్యే నిధాయ లింగం పరమాత్మచిహ్నం
సమర్చయే దేకధియోపచారై ర్నరస్సు బాహ్యాంతరభేదభిన్నైః"

ఇట్టి పురాణవచనములు లింగధారణమును విధించియుండ, వీరశైవమునకుఁ బ్రధానాంగము లింగధారణమని యంగీకరించియు శాస్త్రిగారు వీరశైవము బసవేశ్వ రోపజ్ఞమనుట మహాశ్చర్యము. లింగధారణమును బ్రశంసించు శైవాగమము లన్నియు బసవేశ్వరుని కాలమునందే సృజింపఁబడిన వని శాస్త్రిగారు తలంతురుగాక! శ్రుతులు, ఉపనిషత్తులు, స్మృతులు, పురాణములు ప్రకటించు నిట్టి ప్రమాణములు గూడ నాకాలముననే వానియందుఁ బ్రక్షిప్తములుగఁ జేర్పబడెనని శాస్త్రిగారు జెప్పసాహ సించెదరా? సంస్కృత వాఙ్మయమునందలి వీరశైవమత ప్రతిపాదక విషయములను

శాస్త్రిగారు గుర్తింపకుందురుగాక! గుర్తించినను నవి ప్రక్షిప్తములనియో, యర్వాచీనరచితము లనియో నిరాకరింతురుగాక! తాము పరిష్కరించిన సోమనాథుని బసవపురాణమును నా సందర్భమునఁ జదివిన యాతని పండితారాధ్యచరిత్రమునైనను వారు లెస్సగాఁ జదివి నిష్పక్షపాతముగ సరిగా సమన్వయము చేసికొన్నచో నిట్టి విపరీతసిద్ధాంతములకుఁ బూనుకొని యుండ రని నానమ్మకము. జనసామాన్యమున విశేషవ్యాప్తినందుటకయి సోమనాథుఁడు జాను తెనుంగున రచించిన యీ ద్విపద కావ్యములను సహజవినిర్మల దృష్టితోఁ బఠించువారికి బసవేశ్వరుఁ డవలంబించిన కేవల వీరశైవము, మల్లికార్జున పండితుఁడవలంబించిన యారాధ్య బ్రాహ్మణశైవము, రెండును గూడఁ దన్మతస్థులే పేరుతో వ్యవహరింపఁబడినను నప్పటికిఁ బూర్వము చిరకాలము నుండియే దేశమున నెలకొనియున్నట్లు విశదముగ గోచరించును. తండ్రి నిజకులాచారధర్మము ననుసరించి యుపనయనము చేయఁదలంచినప్పుడు బసవేశ్వరుఁడు తండ్రితో వివదించి యాతని విసర్జించి కేవల వీరశైవులలోఁ గలిసి పోయినట్లు.

"రండు భక్తుల బిలువుండు మరెదురుఁ, బొండు వేగమ తోడితెండు మీ రనుచు
నిటువచ్చు నయ్యల కెదురు వచ్చుచును, నటువచ్చు నయ్యల కర్థి మ్రొక్కుచును
సింహాసనస్థులఁ జేసి యాకర్మ, సంహారమూర్తుల చరణము లడిగి
యవిరళ నవ్యపుష్పాంజలు లిచ్చి, ప్రవిమల ధూపదీపంబు లొనర్చి
య మ్మహాత్ములకు సాష్టాంగుఁడై యాక్షు,ణమ్మ విభూతి వీడ్యమ్ము లర్పించి"

(బసవపురాణము ప్రథమాశ్వాసము)

అను వాక్యముల వలన వ్యక్తమగును. ఇం దుదాహరింపఁబడిన కర్మసంహారమూర్తులగు నా యయ్యలు, దేశమున నదివఱకేయున్న పంచాచార్య ప్రతిపాదితమగు కేవల వీరశైవము నవలంబించిన జంగమయ్యలు గాక మఱెవ్వరు నయి యుండ రని బాలురకైనను బాగుగా నవగతము కాకపోదు. కావున సామాన్యదృష్టితో బసవపురాణమును జదువువారికిఁగూడ వీరశైవ మతము బసవేశ్వరునిచే నూతనముగ నుత్పత్తిగ నొక్కనాఁడు సృజింపఁబడినది కాదనియు బసవేశ్వరుఁడా మతము నవలంబించిన యొక భక్తుఁడేగాని యా మతాచార్యుఁడు కాఁడనియు, ఆ మత మాతనికి ముందు చిరకాలమునుండి దేశమున వ్యాప్తమయి యుండుననియుఁ దెల్లమగును.

ఇఁక బండితారాధ్య చరిత్రమందలి దీక్షాప్రకరణమును జదివినచో మల్లికార్జున పండితుఁడు కోటిపల్లి యారాధ్యదేవుఁ డనెడు గురువర్యుని వలన లింగధారణము నందినట్లును, కొందఱు బ్రాహ్మణు లది చూచి విప్రుల కిది తగునా? ఇది వేదసమ్మతమా? యని ప్రశ్నింప బహుప్రమాణములతో వారికి విభూతిమహిమ, రుద్రాక్షమహిమ

పాదోదకమహిమ, లింగార్చనామహిమ, లింగధారణమహిమ, ప్రసాద స్వీకార మహిమ, మున్నగునవి నిరూపించి బోధించి నట్టును గాన నగును. ఈ క్రింది యుపోద్ఘాత వాక్యములఁ జిత్తగింపుడు.

"ధృతిఁ బశుపాశ పతిజ్ఞానదృష్టి, మతినెల్ల మాయాత-మందు 'దూలించి
సద్గురు కరుణా స - ముద్గత పరమ, చిద్గత తన్మంత్రి - హృద్గత లింగ
సన్నిహితాంగ స - త్సంగతలింగ, సన్నిహితపాణి - సంబంధకళల
సపాణిలింగ విం-గపాణిమథన, సుప్రసాదానుభ - వప్రమథేంద్రి
యావధానము విష-యానన్యసుఖాంత, రావధానము తదీ-యాసక్తిఁ బడసి
విధినిషేధాతీత-వీరశైవోక్త, విధి సద్గురుభ్యో ని - వేదయేత్తనఁగ
నవికలప్రాణ దే-హార్థములుప్పార్వ, భవభావిభవసము-ద్భవహారు సకల
భవహారు సాక్షాద-భవుజిత భావ - భవు శివు శ్రీకోటి-పల్లి యారాధ్య
దేవు శ్రీపాదుకేం-దీవరంబులకు, భావం బెలర్ప న-ర్పణ మాచరించి
పడసి ప్రాణార్పణ - ప్రాణలింగంబు, పడసి తత్తను సమ-ర్పణ ప్రసాదంబు
పడసి తద్ధన సమ-ర్పణజంగమంబు, పడసి తత్పూజాను-భవభజనంబు
నొడఁబడ వీరవ్ర-తోద్యుక్తి నడవ, బుడివుళ్ళు వోవుచు-భూసురుల్ నరులు
పండితుఁజూచి సైపక యొక్కనాఁడు, పండితయ్యా! నీవు-పౌరాణికుఁడవు
సద్విజోత్తముఁడవు-సచ్చరిత్రుఁడవు. విద్వాంసుఁడవు వేద-విదుఁడ వట్లయ్యు
భూతియు, రుద్రాక్ష-ములు దాల్పఁదగునె, నీతి యెఱింగి స-న్నిహితమై యున్కి
పాదోదకంబు ప్ర-సాదంబు గొనఁగ, భూదేవతార్హమె-వైదిక మతమె
హరి విరించ్యాదిసు - రాసుర మునిని, కరము దాల్చినవారు-గలరె మున్నాది
ననుడుఁ గించిద్దర-హసితాస్యుఁడగుచు, గనుఁగొని యాద్యుల-గానరే వినరె."

దీనిని బట్టి బసవేశ్వర మల్లికార్జున పండితారాధ్య చరిత్రి శ్రోత్రియగు గొబ్బూరి సంగనామాత్యుఁడు పండితారాధ్య చరిత్రమున వర్ణితులయిన బెలిదేవ వేమనారాధ్యుఁడు, సూరసానమ్మ మున్నగు భక్తులుఁగూడ నీ యారాధ్య బ్రాహ్మణ శాఖకుఁ జెందినట్టు లీ గ్రంథముల వలన వ్యక్తము కాఁగలదు. కాని యప్పటి యారాధ్య బ్రాహ్మణులకు నిప్పటికి వారికి హస్తిమశకాంతర ముండెననుట నిర్వివాదము. అప్పటివారు బసవేశ్వరునివలెఁ గేవల వీరశైవులలోఁ బూర్తిగఁ గలియక పోయినను భవులగు బ్రాహ్మణులతో నెట్టి సంపర్కమును లేక కేవల వీరశైవుల తోడనే యెక్కువ సాహచర్యాదులను గలిగియుండిరి. ఇప్పటివారి వర్తన మందుకుఁ గేవలము విపరీతము.

మల్లికార్జున పండితుని శివతత్త్వసారమునఁ బశు, పాశ, పశుపతి జ్ఞానము వివరింపఁబడుటచే నాతఁడు పాశుపత మతప్రవర్తకుఁ డనియు నాగ్రంథమున లింగధారణ ప్రశంసయే లేదనియు శాస్త్రిగారు వ్రాయుట సరిగాదు.

క. గోపతికృతమున భవపాశాపేతములయిన పశువు లట్టులు భవపా
శాపేతులైన పశువులు ప్రాపింతురు మోక్షసుఖము పశుపతి! నీచేఁ. ౯౯

అను శివతత్త్వసార పద్యమునకు "పశువులగు జీవులు పతియగు రుద్రుని యనుగ్రహముచే పాశమైన సంసారమునుండి ముక్తులై మోక్షసుఖము ననుభవింతురు. జీవులకుఁ బాశబంధము తొలఁగును గాని పశుత్వము తొలఁగదని మల్లికార్జున పండితుఁడు చెప్పెను" అని శాస్త్రిగారు వ్యాఖ్యానముచేయుట మఱింత వింత గొలుపుచున్నది. సంసారరూపకమగు పాశబంధము తొలఁగి ముక్తులై మోక్ష మనుభవింతురన్నప్పుడు పశుత్వము వదలదనుట యేటి మాట? పండితుని పద్యములో శాస్త్రిగారి కిట్టి విపరీతభావమెట్లు స్ఫురించెను? పూర్వోక్తపద్యార్థము నే—

క. మానిత శివభక్తి శివజ్ఞానధ్యానముల నీ ప్రసాదాతిశయా
నూనతఁ గర్మక్షయమై, యానందప్రాప్తి ముక్తుఁడగు నీశానా! ౧౦౪

అను పద్యమందు పండితుఁడు మరల వివరించినప్పుడు శాస్త్రిగారీ పద్యమును గూడఁ గ్రింద నుదహరించియు నిట్టి యసంగతార్థమును జెప్పుట యుచితమేనా? ఇంతయేల? "గోపతికృతమున..." అనుపద్యము వెనువెంటనే పండితారాధ్యుఁడెట్టి సంశయములకు నవకాశము లేకుండ "త్రిమలకృత దుఃఖసంసారమహాబ్ధి నిమగ్న జీవరాసులు నీయుత్తమకారుణ్యావశంబున విముక్తులై నీవపోలె వెలుఁగుదురు శివా!" అనుపద్యమునుగూడ వ్రాసియున్నాఁడే. శాస్త్రిగారు దీనిని గుర్తింపలేదా? గుర్తించియు ముక్తుఁడయిన జీవునితోపాటీశ్వరునకుఁ గూడఁ బశుత్వము నాపాదింతురా?

పశుపాశ పతిజ్ఞాన నిరూపణవిషయమున బాశుపతమునకుఁ దక్కిన శైవభేదములకు విశేష వ్యత్యాస మేదియులేదు, మల్లికార్జున పండితుని శివతత్త్వసారము దొరకినంతవఱకసమగ్రమేగాని సంపూర్ణముకాదు. గ్రంథనామానుగుణముగ సర్వశైవసాధారణంబగు పశు పాశ పతిజ్ఞాన వివరణము మున్నగునవి గ్రంథమందున్నంత మాత్రమున మల్లికార్జునపండితునిఁ బాశుపత మతప్రవర్తకునిగఁ దలంచుట యుచితముకాదు. పండితారాధ్యుఁడు కోటిపల్లియారాధ్య దేవునివలనఁ బడసిన లింగధారణ దీక్షా సందర్భమున సోమనాథుఁడుగూడ "ధృతిబశుపాశపతిజ్ఞానదృష్టి మతి వెల్గ........" అని వ్రాసియున్నాఁడుగదా? శంకరాచార్యుఁడు గూడ శివానందలహరిలో శివస్తుతి యొనర్చునప్పుడీ విషయమును విస్మరింపలేదు. "సోహం పశుపతే

పశుం మాం సర్వజ్ఞ! ప్రథిత కృపయా పాలయ విభో!" మున్నగు శ్లోకములఁ జిత్త గించునది. శివతత్త్వసారమున వీరశైవాంగమగు లింగధారణ ప్రశంస లేదనుకొనుట వట్టి భ్రమ.

క. జంగమ లింగం బగు భ, క్తుంగని పూజింపఁడేని ♦ గోటివిధములన్
లింగార్చన జేసిన వృథ, జంగమ ముత్తమముగాఁగ ♦ స్థావరమునకున్ ॥౧౫౩॥
క. క్రియగోన జంగమ లింగము, నియతిం బూజింపఁడేని ♦ నిష్ఫలములు స
త్క్రియలును బూజలు "లింగ, ద్వయం సమాఖ్యాత" మనిన ♦ వాక్యము
మోఁయిర్. ॥౧౫౬॥

అను పద్యములు వీరశైవమత విహితమగు నిష్టలింగ చరలింగ పూజనములకు దార్కాణములు.

క. గురుకృత శివదీక్ష మెయిన్, విరహితమల దేహు లగు ప ♦ విత్రులు భక్తుల్,
హరనిర్మాల్యము గుడుతురు, పరమేశ్వరునందు దాస ♦ భావముతోడన్. ౨౨౦

అను పద్యమునఁ జేర్కొనఁబడిన దీక్ష మను క్రియా వేధా రూపాత్మకమగు నిష్టలింగ దీక్షయే యని వ్యక్తమగును. మఱియు "శివదీక్షితుడు" అను శీర్షిక క్రింద నున్న ౨౨౮-౨౨౯ పద్యములలోఁ గూడ నీ శివదీక్షాప్రశంస యున్నది. శ్రీ కొమ ర్రాజు వేంకట లక్ష్మణరావుగారు తమ పీఠికలో "ఇదియే లింగధారణ దీక్షయని కవియొక్క యభిప్రాయమేమో? తెలియదు." అని వ్రాసిరేకాని కాదని నిరూపింప లేదు. "దీయతే లింగసంబంధః క్షీయతేచ మలత్రయం దీయతే క్షీయతే యస్మాత్త స్మాద్దీక్షేతి కథ్యతే." అని పారమేశ్వరాగము శివ పురాణాదులలో దీక్షాశబ్దము నిర్వచింపఁబడినది. పూర్వోక్తమగు "గురుకృప శివదీక్ష మెయిన్" అను పద్యమీ నిర్వచనము ననుసరించి చెప్పబడినదేయని సహృదయులకుఁ దోపకపోదు. ఇష్టలింగ ధారి యని యితర ప్రమాణము వలనఁ దెలియు నీ పండితారాధ్యుఁడు తన గ్రంథ మున నుదాహరించిన శివదీక్ష లింగధారణ దీక్ష కానేర దని తలంచుట యసంగత మని చెప్పనక్కఱ లేదు. ఇంతకు మనకు దొరకని పరిశిష్ట గ్రంథభాగములో నీ దీక్షా ప్రశంస మఱింత విపులముగ వర్ణింపఁబడి యుండెనేమో యని తలంచుటకుఁ గూడ నవకాశము లేక పోలేదుగదా ? ఇన్ని గొడవ లెందుకు ? మల్లికార్జున పండితుఁ డిష్ట లింగధారియగు శైవుఁడే కానిచో భవిసంపర్కముఁ గలలోనైన దలంపని పాల్కురికి సోముఁ డాతని చరిత్రము నత్యంతాను రక్తితో రచించుటయు దానిని బసవేశ్వరున కంకిత మొసంగుటయు నసంభవమని సామాన్య దృష్టితో విచారించు వారికిఁగూడ గోచరింపక పోదు.

హిందూమత మనాదినుండియు సాధకుని యాత్మోన్నతికయి యవకాశము లను గలిగించియే యున్నదిగాని నిరోధింపలేదు. వర్ణాశ్రమవ్యవస్థ లోకవ్యవహార స్థితికై యేర్పఱుపఁ బడినను నదికూడఁ బ్రత్యేక వ్యక్తుల యాత్మోన్నతికి నుత్తమ స్థితికిఁ బ్రబలాటంకమయి యుండినట్లు కానరాదు. కావుననే బ్రాహ్మణేతర వర్ణ సంభవులగు వశిష్ఠ విశ్వామిత్రాదులు బ్రహ్మర్షులయి బ్రాహ్మణులకు గోత్రకర్తలు కాఁగలిగినది. బసవ పురాణము సప్తమాశ్వాసమున శివనాగుమయ్యగారి కథలో సోమనాథుఁడు వ్రాసిన క్రింది వాక్యములు గూడ నిందుకు నిదర్శనములు.

"ఎట్టి దుర్జాతిని బుట్టిననేమి । యెట్టును శివభక్తుఁ డిలఁ బవిత్రుండు
ఈ యగ్రజన్మల కెల్లను గురువు । బోయెతకును గాదె పుట్టె వ్యాసుండు
పూర్వద్విజాచార్యుఁ డుర్వివసిష్ఠుఁ । డూర్వశియను లంజ కుదయించెగాదె.
మాతంగుఁడనగ బ్రహ్మర్షి యొకండు । మాతంగికిని గాదె-మహిఁ బ్రభవించె
శునక గార్దభ మత్స్య శుక దర్దురాది, జనిత మునీంద్రాది - జాతముకెల్ల
శివభక్తిఁ గాదె వి-శిష్టములయ్యె, నవనీశ యెఱుఁగవే - యందఱ ననిన"

పూర్వోక్తమయిన కారణాగమ శ్లోకములలో నుదాహరింపబడిన దశవిధ శైవ ములలో నుత్తరోత్తరముగఁ జెప్పఁబడిన యొక్కొక్కటియుఁ దత్పూర్వోక్త మైన వానికన్న నుత్కృష్టముగఁ బరిగణింపఁ బడెననుట విస్పష్టము. పాశుపత శాలా ముఖము లీ దశవిధ శైవములలో నాల్గవదియగు శుద్ధశైవమునకు సంబంధించినవి. మల్కాపురము శాసనము మున్నగు వానివలన గోళకి మఠస్థులగు విశ్వేశ్వర శివదేశి కులు మున్నగు వారీ శుద్ధశైవ మతావలంబకులుగఁ గానవచ్చు ననెడి విషయము నేనుగూడ నంగీకరింతును, ఈ శుద్ధశైవ స్వరూప మాగమములలో నిట్లు నిరూపింపఁ బడినది.

"సింహపీఠస్థితం లింగ, మర్చయే ద్దేశికోత్తమః
నిత్యం త్రికాలభక్త్యా తు, లింగార్చనరతః సదా
భూతిరుద్రాక్షసంయుక్తో, భజన్ కాలత్రయే శివం"
"అతః పరం శుద్ధశైవం, వక్ష్యామి శృణు పార్వతి !
శుద్ధశైవ మితి ప్రోక్తం, తద్భవం శైవముఖ్యతే
ఏక ఏవ మహాదేవః, సాంబ స్సత్యాదిలక్షణః
తదన్యదేవా స్తద్భక్తాః, తదుద్భూతా స్తదాశ్రితాః
లింగస్య పూజావేళాయాం, యే చాన్యే దేవసత్తమాః
తేషా మావరణత్వేన పూజాం కృత్వా న చాన్యథా

గురుణా దత్తలింగం తు కరే పీఠే పి వా యజేత్
గురూపదిష్ట నియమాన్ సావధానం సమాచరేత్
ప్రమాదా త్పతితే లింగే నష్టే దగ్ధే హృతేఽపి వా
వినిర్గతే తదా పీఠా ద్వేన కేన చ దూషితే
గురుపాదాంబుజం స్మృత్వా జప్త్వాఽఘోరం తదాజ్ఞయా
తల్లింగమేవ వాఽన్యద్వా ధారయే త్పూజయేత్పునః
ప్రమాదాన్నియమే లుప్తే, మూలపంచాక్షరీం జపేత్
ప్రాయశ్చిత్తమిదం దేవి! ప్రతలోపాదిసంభవే."

దీనిని బట్టి శుద్ధ శైవమునకుఁ జెందు పాశుపతులకు గురుదత్తమగు లింగమును బీఠమునందుఁ గాని కరమునందుఁగాని యుంచి పూజించుట యాచారమనియు ప్రమాదముచే నాలింగము నష్టమైనచోఁ బ్రాయశ్చిత్త మొనర్చికొని వేఱొక లింగమును మరలఁబడసి పూజింప నగుననియుఁ దెలియుచున్నది. కావునఁ బాశుపతులలో గూడఁ గరస్థల లింగార్చకులు కొంద ఱుండిరనుట తెల్లము. పాశుపత శైవ స్వరూపమును వివరించుచు రాజశేఖరసూరి తన షడ్దర్శన సముచ్చయములో వ్రాసిన యీ క్రిందివాక్యములు కూడ నిందుకు నిదర్శనములు.

"అథ యోగమతం బ్రూమః శైవమిత్యపరాభిధమ్
తే దండధారిణః ప్రౌఢ కౌపీనపరిధాయినః
కంబలీప్రావరణాశ్చ, జటాపటలశాలినః
భస్మోద్ధూళనకర్తారో, నీరసాహార సేవినః
దోర్మూలే తుంబకభృతః, ప్రాయేణ వనవాసినః
ఆతిథ్యకర్మనిరతాః, కందమూల ఫలాశనాః
సస్త్రీకా అథ నిస్త్రీకా, నిస్త్రీకాస్తేషు చోత్తమాః
పంచాగ్నిసాధనపరాః, ప్రాణలింగధరాః కరే
విధాయ దంతధవనం ప్రక్షాళ్యాంఘ్రి కరాననమ్
స్పృశంతి భస్మనాఽఙ్గం త్రి, స్త్రిః శివధ్యానతత్పరాః"

ఇత్యాది కారణములచే శివలెంక మంచనపండితుని పూర్వులు భావశంభువు, సోమశంభువు మున్నగువారి కిష్టలింగధారణములేని పాశుపతమత ప్రవిష్టులని తలంచినను మంచన పండితుఁడో యాతని తండ్రియో యిష్టలింగధారణమునుగూడఁ బడసి యుండిరనుట కాక్షేపణ మేమియు నుండ నేరదు. సోమనాథుఁడు బసవపురాణములో షష్ఠాశ్వాసమున వర్ణించిన శివలెంకమంచన పండితునికథలో

"అక్కజం బందంగ నన్యదర్శనుల । ముక్కుపైఁ గత్తియ నైక్కమప్పరిని
నెత్తించి వీరమాహేశ్వరపదమె । యుత్తమ మీశ్వరుఁ డొక్కండె కర్త"

అని వ్రాసిన వాక్యములఁబట్టికూడ నీవిషయము విస్పష్టమయి మంచనపండితుఁడు వీరశైవమతావలంబియే యని తెలియనగును. * కావున శుద్ధశైవ మతావలంబులు వలసినప్పు డంతకంటె నుత్కృష్టతరములగు శ్రౌత, మార్గ, వీరశైవముల నధికార భేదము ననుసరించి యవలంబించుట యనూచానముగఁ జిరకాలమునుండి వచ్చుచున్న యాచారమే! అందుచే బసవపురాణమున బసవేశ్వరు నుద్భోధమువలన లింగవంతులు గాని శైవలకులు, పాశుపతులు, లింగధారణమునంది వీరశైవులలో గలిసిరని వర్ణింపఁ బడినంత మాత్రమున శాస్త్రిగారు తలంచినట్లు బసవేశ్వరుని కాలమునబుట్టిన నూతన మతమని సహృదయులు సమ్మతింపఁజాలరు.

శ్రీపతి పండితుఁ డిష్ట లింగధారియగు వీరశైవుఁడేయనుట కాతని శ్రీకరభాష్య మే పరిబలప్రమాణము. అతని వంశ్యుఁడనని చెప్పికొనిన కాశీనాథుని వీరనారాధ్యుఁడు రచించిన ధర్మగుప్తాభ్యుదయమను గ్రంథముకూడ నీనిని విశదమొనరించును. ఈతఁడు తన భాష్యావతారికలో వీరశైవ మతాచార్యులలో రేవణసిద్ధ, మరుళసిద్ధ, ఏకో రామాచార్యులను మొదటి ముగ్గురను బేర్కొని యత్యధికముగఁ బ్రశంసించి గ్రంథ మధ్యమునఁ దక్కిన యిరువురినిగూఁడ బేర్కొనినాఁడు. ఇందుచే తొలుద్దొలుత నీతఁడు శ్రౌతమార్గ శైవమతావలంబియై తన్మతప్రవిష్టుల కుదయించినను రానురాను బసవేశ్వరునివలెఁ గేవల వీరశైవమునే స్వీకరించెనేమో యను ననుమానము కొంద అకుఁ గలుగవచ్చునేమో : కాని ఏకోరామాధ్యుని సాభిమానముగా బొగడి యుండుటచే భృంగి గోత్రమునకుఁ జెందిన సహజ వీరశైవుఁ డనుటకును నవకాశము కలదు.

ఇంతకు నేఁటి తెలుఁగునాటి యారాధ్యులు పలువురు పారంపర్యముగఁ బండిత త్రయమును నుద్భటారాధ్యునిఁ దమకుఁ గూటస్థు లని చెప్పుకొనుచుండఁ దదనుగుణ ముగ వారు లింగధారులే యనుటకు బ్రబల ప్రమాణములు గానవచ్చుచుండ నిందుకు వ్యతిరేకముగ నితర మతస్థులు వారు లింగధారులు కారనియుఁ బూర్వ కాలమున బ్రాహ్మణులలో లింగధారణము లేదనియు నవిచార మూలకముగ వ్రాయుట పరిహాస భాజనము కాక మానదు. ఉద్భటుఁడు లింగధారి యనుట

* ఈ నడుమ నూతనముగ వెలువడిన 'ఆంధ్ర గ్రంథమాల' వారి పండితారాధ్య చరిత్రము యొక్క పీఠికలో శ్రీ చిలుకూరి నారాయణరావుగారు శివలెంక మంచన పండితుని ప్రశంస బసవ పురాణమున గానరాదని వచించిరి. అది పొరపాటు.



౫. శ్రీ. జ పంచాక్షర శివాచార్యులు కాశి.



౬. కాశీజ్ఞానసింహాసనము దర్బారుహాలు.



౭. శ్రీ. జ. నీలకంఠలింగ శివాచార్యులు.



౮. పం. శ్రీ కాశీనాథశాస్త్రిగారు, మైసూరు.



౯. పం. మ. మ. శ్రీ శివకుమారశాస్త్రిగారు.



౧౦. శ్రీ అహల్యాబాయి మహారాణిగారు.

కాతనిఁగూర్చి తెనాలిరామలింగకవి ప్రత్యేకముగా రచించిన ఉద్భటారాధ్య చరిత్రమను ప్రబంధమే యాదర్శము కాగలదు. ఈ తెలుఁగు నాఁటి యారాధ్య శాఖ దశవిధ శైవములలో శ్రౌత శైవ, మార్గ శైవములకు జేరినదని యాశైవముల గూర్చిన యీ క్రింది స్వరూప నిర్ణయ ప్రమాణములవలన నెఱుఁగనగును.

"శ్రౌతశైవమథోచ్యతే-గురుణాదత్తలింగం తు,
హస్తే నిత్యం ప్రపూజయేత్ మూర్ధ్ని వా ధారయేల్లింగం
కంఠే వా ధారయే ద్ద్విజః॥
నిత్యనైమిత్తికశ్రౌత । స్మార్తకర్మాణి కారయేత్
దశాంతే స్థాప్య భూమౌ చ । ఘటికాంతే దహేత్తతః ।
భ్రాతరో వా సుతో వాఽపి । ప్రాణలింగం సమర్చయేత్ ।
మంత్రోప దేశలింగాంగం । కరపీఠార్చనం జపమ్॥
యల్లింగధారణం తత్ర లోకాచారప్రవర్తనం ।
కులాచారప్రవృత్తిశ్చ । సంసారే చాభిమానవాన్ ।
న దహ్యం చావసానే తు । మార్గశైవమిదం శృణు ।
హస్తసింహాసనే లింగ । మప్రమాదేన ధారయేత్
ప్రమాదాత్పతితే లింగే । సహ ప్రాణాన్ పరిత్యజేత్ ।
గురుణా దత్తలింగం చ । సావధానేన యో యజేత్
ప్రమాదాత్పతితే లింగే ప్రాణానపి పరిత్యజేత్
సర్వేషామపి శైవానాం । వీరశైవం మహోత్తమం॥

బసవేశ్వరుని తల్లిదండ్రులీ శ్రౌతమార్గశైవావలంబకు లయి యుందు రేమో యని నాయనుమానము. బసవేశ్వరుఁడు దీనికన్న నుత్తమమగుటచే వీరశైవము నవలంబించి తల్లిదండ్రుల నుండి విడిపోయెను.

వీరశైవమనఁగా గులాచారనియమములను ద్రెంపుటయేయనియు, నట్టి వీరవ్రతము బసవేశ్వరునితోనే యారంభమగుటచే వీరశైవము బసవేశ్వరోపజ్ఞమే యనియు శాస్త్రిగారు వ్రాయుటగూడఁ జాలఁబ్రమాదము. వీరశైవమత గ్రంథకర్తలు, వీర శబ్దమునకుఁ జెప్పినయర్థము వెనుకనే వివరించియుంటిని. ఇష్ట లింగపూజనమందును, అష్టావరణాచరణ నిర్వాహణమునందును, విశేషనియమములు విశిష్టత గలిగియుండుట చేతనే దీనికి వీరాభిధానము విధింపబడినదిగాని శాస్త్రిగారు జెప్పిన విపరీత లక్షణమే వీరశైవ మతధర్మముగా నెచ్చటను జెప్పఁబడలేదు. మనుదీక్ష, క్రియాదీక్ష, వేధా దీక్షయను దీక్షాత్రయము వలన మలత్రయము దగ్ధమయి భౌతికశరీరము పవిత్రమగు

లింగశరీరమగుటచే శివదీక్షాన్వితుఁడు సర్వదా శుద్ధుఁడనియుఁ గావున శివదీక్షితుల యెడఁదత్పూర్వజాతి భేదాదికముల బాటింపరాదనియు, వీరశైవవాఙ్మయమునఁజెప్ప బడిన మాటనిజమే. వీరశైవదీక్షాబోధమున్నగు గ్రంథములనుండి శాస్త్రిగారెత్తి చూపిన వాక్యములుకూడ నీ సూత్రము ననుసరించి చెప్పఁబడినవే. వీని భావము దీక్షా సంస్కార విశుద్ధులయిన శివభక్తులు పవిత్రీకృత దేహుల య్యెదరు. కావున వారియొక్కయు వారిపూర్వులయొక్కయుఁ గులముల గొడవఁ దడవ నవసరము లేదనియు వారిని గౌరవించ వలెనని చెప్పుటయేగాని వేఱుకాదు. ఇంతకు బసవేశ్వ రాదులకాలమున వీరశైవ సంఘము విస్తృత మయినప్పుడు నూతన దీక్షితులకు వీర శైవ విహితములగు పంచాచారములు (లింగాచారము, సదాచారము, శివాచారము గణాచారము, భృత్యాచారము,) కూడ విధింపబడెననియు, నట్టియాచార సంపన్నతఁ గలవారి తోడనే పూర్వమువారేకులమునఁ బుట్టినవారైనను దానితో నిమిత్తము లేక పొత్తుగుదిరి యాబసవేశ్వరాదులు సహభోజనము లొనరించి యుందురనియు గోచరించును. అంతియెగాని శాఖాహారాది సదాచారములు గలవారు తద్విరుద్ధా చారములు గల వారందరు కలిసి యేకముగఁ బొత్తు గుడిచిరనుట కెట్టి యాధారమును లేదు.

శ్లో॥ స్వమార్గాచారనిరతాః స్వజాతీయా ద్విజాస్తుయే,
తేషాం గృహేషు భుంజీత నేతరేషాం కదాచన.

అని వీరశైవ సిద్ధాంత శిఖామణియందుఁ జెప్పఁబడినది. మత విస్తృతికై కొన్ని సంస్కరణము లొనర్చినను సదాచార విషయమునఁగల నియమములను బస వేశ్వరాదులు పాటింపక పోలేదనియే నా నమ్మకము. ఏ మతమునందైనను నేదో యొక రూపమున వర్ణాశ్రమ వ్యవస్థ లోకవ్యవహారస్థితి కయి కొంతవఱ కెప్పుడును నిర్వహింపబడుచునే వచ్చినది. 'భక్తి జ్ఞానములు' పరాకాష్ఠ నధిష్ఠించి నప్పుడవి కొంతవర కుల్లంఘింపఁబడినను నందులో నాశ్చర్యమేమియులేదు. "నిస్త్రైగుణ్యే పథి విహరతాం కో విధిః కో నిషేధః" అని శంకరాచార్యుఁడు గూడఁ జెప్పినాఁడు. కావున బసవేశ్వరు డొక్కరుడే యిట్లు వర్తించెనని చెప్ప నవసరములేదు. గొడగరి మల్లయ్య ఇంట భుజించిన శ్రీపతి పండితుని చరిత్రముగూడ నిందుకుఁ దార్కాణమే. కాని యా భక్తుడు గొడగరి కులజుఁ డయినంత మాత్రమున వీరశైవాచార సంపన్నతలో శ్రీపతి పండితునితో సమాన ధర్మము కలవాఁడు కాఁడని తలంచుటకు మనకెట్టి యవకాశమును లేదని నా యభిప్రాయము. బసవేశ్వరుని విషయమును గూడ నట్లే తలంపవలెను. అట్లుగాక బసవేశ్వరుని కాలమున నీ సదాచార వ్యవహార

ములతో నిమిత్తము లేకయే వీరశైవమతమునఁ జేరిన యెల్ల జాతులవారును సహభోజనము లొనర్చి వర్ణాశ్రమ ధర్మములను మంటఁ గలిపి రన్నచో నప్పు డేర్పడిన యా పరిస్థితి ఇప్పటికిగూఁడ నట్లే సాగుచుండవలెను గదా. అట్టి దేదియును గానరాదు. విభూతి పత్రిక (స. 1 సం. 6) లోఁ దత్పత్రికా సంపాదకులు ప్రకటించిన "వీరశైవులు, లింగాయత శబ్దము" అను వ్యాసమును శ్రీవారే 1929 సంవత్సరములో శివానుభవ పత్రికలో ప్రకటించిన "ఆంధ్ర వీరశైవులు కన్నడ" అను వ్యాసమును దిలకించినచోఁ గర్ణాట వీరశైవులలో నేమి, యాంధ్రవీరశైవులలో నేమి యీవర్ణాశ్రమ వ్యవస్థ యిప్పటికి నెట్లు నిర్వహింపబడుచున్నది తెల్లముగాఁగలదు. సజాతీయమగు సదాచారసంపన్నత గలవారియందే యిప్పుడుగూడ భోజనప్రఁ బొత్తుగుదిరి యున్నదిగాని విరుద్ధములగు విభిన్నాచారములు గలవారిలో నదికానరాదు. కావున నీవిషయమునఁగూడ శాస్త్రిగారి వాక్యములు ప్రమాణ దూరములని వేఱుచెప్ప నక్కఱలేదు.

బసవపురాణమునుబట్టి, అబ్లూరు శాసనమునుబట్టి వీరశైవమతము క్రీ॥ శ॥ 1150 ప్రాంతముననే యేర్పడినదని శాస్త్రిగారు విషయనిరూపణ మేమియును నొనర్పక నిరాఘాటముగ వ్రాయుట మహాశ్చర్యము బసవపురాణమునుబట్టి యిట్టి విపరీత సిద్ధాంతమున కెంతమాత్రము నవకాశము లేదనియుఁ బయిగాఁ నీమతము బసవేశ్వరునికిఁ బూర్వము చిరకాలమునుండియు దేశమున వ్యాప్తమయి యుండుట తెల్లముకాఁగలదనియు నింతకుముందే నిరూపించియుంటిని. అబ్లూరుశాసనములో ఏకాంతరామయ్యయను నాఁత డాతని జనకులకు శివానుగ్రహము నదయించి పెక్కు మహిమలుచూపి జైనులనోడించి శివాధిక్యము స్థాపించి కలచుర్య బిజ్జలుఁడు మున్నగు పలువురు రాజులచే జయపత్రములను సన్మానములను బడసెననియు చెప్పఁబడినది. కాని యంతకు మించిన విశేషము లేమియునుఁ గానరావు. శాస్త్రిగారు చెప్పెడి విపరీతాభిప్రాయముల కది యెంతమాత్రము సహాయకము కాఁజాలదు. సోమనాథుఁడును బసవపురాణమున వర్ణించిన ఏకాంతరామయ్యకథకును, అబ్లూరు శాసనమున నుదాహరింపఁబడిన తచ్చరిత్రమునకును విశేష వ్యత్యాసమేమియులేదు.

కెరెయపద్మరసు, మాయిదేవుఁడు, బసవేశ్వరున కించుమించుగ సమకాలికులే కాఁదగును. కాని సిద్ధాంతశిఖామణికూడ బసవేశ్వరుని కాలముననే వెలువడిన దని శాస్త్రిగారెట్లు వ్రాయగల్గిరో దురూహ్యము. వీరశైవమతసిద్ధాంతమును ప్రత్యేకముగ బోధించు సంస్కృతగ్రంథములలో నిది యత్యుత్తమమనుట నిర్వివాదము. శాస్త్రిగారు చెప్పినట్లు లిది రేవణ సిద్ధరచితముకాదు. వీరశైవపంచాచార్యులలో ప్రథముఁడగు రేవణసిద్ధుడు (రేణుకాచార్యుఁడు) అగస్త్యమహర్షికి బోధించిన వీరశైవమత సిద్ధాంత

ములను సంగ్రహించి గ్రంథరూపమున వెలయించితి నని గ్రంథకర్తయగు శివయోగీంద్రుఁ డందులోఁ జెప్పికొన్నాఁడు. అందుచే రేవణసిద్ధుఁడు సిద్ధాంతకర్తయైనను గ్రంథకర్త మాత్రము శివయోగీంద్రుఁడే. ఈశివయోగీంద్రుఁడు తాను ముద్దదేవుని మనుమడననియు సిద్ధనాథుని పుత్రుఁడనియుఁ జెప్పికొనినాఁడు. బసవేశ్వరునికిఁ బూర్వము క్రీ॥ శ॥ 1090 ప్రాంతమున నుండినట్లు శాస్త్రిగారంగీకరించిన శ్రీపతి పండితారాధ్యుఁడు తన శ్రీకర భాష్యమున నీ సిద్ధాంతశిఖామణినుండి కూడఁ బ్రమాణముల నుల్లేఖించి యున్నాఁడు. కావున నీ గ్రంథము బసవేశ్వరునకుఁ బూర్వమందే వెలసె నని స్థూలదృష్టితో విచారించువారికి గూడ విస్పష్టమగును. ఇది క్రీ.శ. 960 ప్రాంతమ్మున రచింపఁ బడియుండునని నాయభిప్రాయము. కారణములు ముందు తెలియనగును.

వీరశైవ పంచాచార్యులు బసవేశ్వరునకు ముందే యుండిరనుటకు, వీరశైవము బసవేశ్వరోపజ్ఞము కాదనుటకు నైతిహాసిక ప్రమాణముల నింకఁబరిశీలింతము.

"జనని సంస్కృతంబు సకల భాషలకును" కావుననే భారతీయుల ప్రాచీన మతవాఙ్మయమంతయు గీర్వాణ భాషయందే రచింపఁబడినది. అందుచే మతచరిత్రనిరూపణమునకయి తివురు పరిశోధకులు సంస్కృతవాఙ్మయాంబుధిలో నీతలాడినఁగాని కృతార్థులు కాఁజాలరు. కేవలము దేశభాషలలో నిన్న మొన్న బయలుదేరిన నవ్యవాఙ్మయమును, శిలాతామ్ర శాసనములును దడవులాడినంతమాత్రమున విశేష ప్రయోజన ముండ నేరదు. సర్వము మిథ్య, సాగరము మిథ్య, జగత్తు మిథ్య, అందరి గ్రంథజాలమంతయు మిథ్య. గ్రంథప్రమాణములను విశ్వసింప 'జాలననెడు మిథ్యావాదులతో మనకుఁ బ్రసక్తి లేదు. వీరశైవ పంచాచార్యులు రచించినట్టి గ్రంథములుగాని వారినింగూర్చి రచింపఁబడిన గ్రంథములుగాని సంస్కృత వాఙ్మయాంబుధిని దఱిచి జూచినఁ గొన్నియైనను లభింపకపోవు. శివాగమములు శివప్రోక్తములేయను పూర్వులమాట మనము నమ్మకపోయినను నవి శివాచార్య రచితములయిన నయి యుండుననుట కభ్యంతర ముండరాదని నా యభిప్రాయము. వాని రచనాకాలము నిదమిత్థముగా నిరూపింపదగు ప్రమాణములు దొరకకున్నను క్రీ॥ శ॥ 1100 నకు (బసవేశ్వరుని కాలమునకు) చాలఁబూర్వకాలముననే యవి దేశమున నెలకొనెనని నమ్మకుండుటకుఁ గారణములు కానరావు. వీరశైవపంచాచార్యులు రచించిన గ్రంథములు కాలగర్భమున నడఁగియుండును. ప్రథమాచార్యుఁడగు రేణుకుని పేర నొక భాష్యము వినవచ్చుచున్నది. విశ్వారాధ్యుని పేర మరియొకటి, ఏకోరామారాధ్యుని పేర నధికరణ భాష్యము వినవచ్చుచున్నది. కాని అవియింతవఱకు లభ్యములయి ప్రకటితములు కాలేదు. ఇఁక నీయాచార్యులంగూర్చి వ్రాసిన చరిత్రములలో రేణు

కవిజయము, 'దారుక దిగ్విజయము అను గ్రంథముల నామములు వినవచ్చుచున్నవి. దీనిలో రేణుకవిజయము మాత్రము దొరకినది. అలంపురమునందును, మైసూరు రాష్ట్రమునందలి శివలింగనబెట్ట యందును లభించిన రెండు ప్రాచీన తాళపత్రి ప్రతులఁ బట్టి యిది 1926 సంవత్సరములో గన్నడలిపిలో మైసూరునందు సుణకల్లు బిదరి ఆరాధ్యమతాధ్యక్ష పండితులగు శ్రీహారీశ్వరశాస్త్రిగారిచేఁ బ్రకటింపఁబడినది. దీనిలో మొత్తము 281 గద్యపద్యములు గలిగిన మంజరీనామక ప్రకరణము లయి యున్నవి. దీని కర్త సిద్ధనాథశివాచార్యుఁడు. "ఇతి శ్రీమదనాది వీరశైవగురుకుల కేతనాయమాన కవికుల తిలకాయమాన శ్రీ సిద్ధనాథ శివాచార్య విరచితే రేణుక విజయే......మంజరీ సమాప్తా అని యాతని గద్యవిధము. గ్రంథాంతమున.

శ్లో॥ ఋతుబ్రహ్మనియద్బ్రహ్మమితే విక్రమవత్సరే
మార్గశీర్షే చ పౌర్ణమ్యాం ప్రబంధః ప్రాప పూర్ణతామ్॥

అను శ్లోకమున్నది. దీనిని బట్టి యీ గ్రంథము విక్రమవత్సరము 1016 అనఁగా క్రీ॥ శ॥ 960 సంవత్సరములో బసవేశ్వరునికి రెండు శతాబ్దులు పూర్వమే రచింపఁబడినట్లు వ్యక్తమగును. గ్రంథమందు బసవేశ్వరాదులప్రశంస యేమియుఁ గాన రాదు. అట్టులుండుట కవకాశ మెంత మాత్రము నుండ నేరదుగదా. క్రీ॥ శ॥ 16, 17 శతాబ్దులలో బొమ్మరసు చన్నబసవకవి మున్నగువారు కన్నడములో రచించిన రేవణ సిద్ధపురాణము రేవణ సాంగత్యము మొదలగు నర్వాచీన గ్రంథములలోని విషయ ములకును,సిద్ధనాథ శివాచార్యుని ప్రాచీన గ్రంథమందలి సంగతులకును జాల వ్యత్యా సము లున్నవి. అది సహజమే. కావున రేణుకాచార్యుల యదార్థ చరిత్రమును దెలి యుటకు మనకు లబ్ధమయిన గ్రంథములలో సిద్ధనాథుని రేణుక విజయమే విశేష ప్రామాణ్యము వహింపఁగలదు. సిద్ధాంతశిఖామణి కర్త శివయోగీంద్రుఁడు తాను సిద్ధనాథుని తనయుఁడ నని చెప్పికొన్నాఁడని యిదివరకే వ్రాసియుంటిని. ఈక్రిందివాక్య ములు చూడుఁడు—— "ముద్దదేవ ఇతి ఖ్యాతా సమాఖ్యా యస్య విశ్రుతా తస్యాసీ న్నందన శ్శాంతః, సిద్ధనాథాభిధ శ్శుచిః శివ సిద్ధాంతనిర్ణేతా, శివచార్య శ్శివాత్మకః, యస్య వీరశివాచార్య శిఖారత్నస్య నందనః, అభవచ్ఛివయోగీతి సింధోరివ సుధాకరః.

రేణుకవిజయ కర్తయగు సిద్ధనాథుఁడే శివయోగీంద్రుని తండ్రియై యుండు నని నా యభిప్రాయము. తండ్రి రేణుకుని చరిత్రమును రచింపఁగాఁ గుమారుఁడు రేణుకుఁ డగస్త్యునకు బోధించిన వీరశైవ సిద్ధాంతమును గ్రంథరూపమున వెలయించి యుండుననుట చాల సంగతము. పాఠకుల సౌకర్యార్థమై రేణుక విజయమందలి రేణుక చరిత్రమును సంగ్రహముగఁ గ్రింద బొందుపఱచెదను. ఈ గ్రంథమున రేణుకాచార్యునకు రేణుక, రేవణ సిద్ధ నామములు రెండును గూడ గ్రంథకర్త యథేచ్ఛముగ వాడి యున్నాడు. (సశేషము)

మహాకవి నన్నెచోడుని కుమారసంభవమందలి

# జంగమమహిమ

(గతసంచికావశిష్టము)



## సప్తమాశ్వాసములో

క. శ్రీ శ్రిత వక్షుఁడు ముక్తి, శ్రీ శ్రిత సహజావదాత చిత్తుఁడు వాణీ
శ్రీ శ్రిత సుముఖుఁడు గీర్తి, శ్రీ శ్రిత దిఙ్ముఖుడు శేముషీనిధి పేర్మిన్. ౮౩౨

మ. అరిషడ్వర్గజయుండు దత్త్వవిదుఁ డాత్మారాముఁ డజ్ఞాన సిం
ధుర కుంభాగ్రి విదారణోగ్రనఖవద్దోర్దర్ప విఖ్యాత కే
సరి దుర్వార గభీర ఘోరతర సంసారోర్వ్యకూపార సం
తరణాత్యున్నత సేతుకల్పుఁ డఖిలాధారుండు ధీరుం డెదన్. ౯౯౧

క. సకలజనవినుతగుణ గణ, నికరమణి ప్రచుర రుచిర నిర్మలభూషా
ప్రకరాకల్పుఁడనల్పుఁడు, సుకవిజన ప్రణుతశివ యశోనిధిపేర్మిన్. ౯౯౨

మ. పరమానందుఁ డనిందితాచరణుఁడభ్రాంతుండు శాంతుండు దు
ర్ధర సంసారసుఘోరు భూరితర కాంతారాంతరోద్భూత సం
కర కర్మేంద్రియ దుష్ట సత్త్వ భవసంగత్యక్త సువ్యక్త భా
సురబోధాత్మకుఁ డాత్మతత్త్వగతి సంశుద్ధుండు సిద్ధుండిలన్ ౯౯౩

క. అబ్ధిగభీరుఁడు సద్గుణ, లుబ్ధుఁడు భూలోకపాలలోచనుఁ డఖిలా
రబ్ధవిముక్తుఁడు బోధా లబ్ధుడు మునిముఖ్యముఖలలాముడు ధాత్రిన్. ౯౯౪

వ. భూసురకులాగ్రణి ప్రబుద్ధుడు ప్రసిద్ధుం
డా సకలలోక వినుతాత్ముఁడు మహాత్ముం
డాసురభవోత్తరణుఁ డాద్యుఁడవిభేద్యుం
డాసుర గురుండు మతియందు నతుఁ డెందున్. ౯౯౫

## అష్టమాశ్వాసము (రెండవసంపుటము)లో

క. శ్రీమహిళామహనీయో, ద్దామోరస్థలుఁడు గీర్తితశ్లోకుఁడు దే
జోమయుఁడు పుణ్యధనుఁడు మ,హాముని ముఖ్యుండు మల్లికార్జునుఁడెలమిన్.

మ. భవరాడాశ్రితనిపాతభీతసుమహద్బద్ధాచలేంద్రాశయా
ర్ణవ గంభీరు నుదారు ధీరు బరమానందాత్మ సంకల్ప సం

భవ బాణేంధనదావపావకు జగత్ప్రఖ్యాతకీర్త్యంగనా
ధవు నజ్ఞాతతమఃపతంగు శివతత్త్వజ్ఞానసన్మానసుండు. ౧౯౫

క. జనవినుతు సితయశోనిధి, ననుపమశుభమూర్తి మల్లికార్జున మునినా
థు నపారఘోరభవ దుఃఖనివృత్తుఁ గళానిధానుఁ గైవల్యరతుండు. ౧౯౬

మ. పరవాదీంద్రఘనాఘనానిలు జగద్భ్రాజిష్ణు నర్ధేందు శే
ఖరు ధర్మజ్ఞు మహీసురేంద్రు బుధలోకస్తోత్రపాత్రుండు మనో
హరు సద్బ్రహ్మతపోధనాదినిధి నార్యశ్రేణివర్యుండు మహా
పురుషుండు జంగమ మల్లికార్జును జగత్పూజ్యప్రభాభాసితుండు. ౧౯౭

క. సజ్జననిధాను విబుధా, పజ్జలనిధి కుంభజప్రభావు శిశిరభూ
భృజ్జాతాధిపసన్నిభు, హృజ్జన్మస్త్రీనభిజ్ఞు నీప్సితఫలదుండు. ౧౯౮

వసం. కారుణ్యమూర్తి నవికారు నగేంద్రధీరుండు
మారారి సర్వజనమాన్యు వదాన్యమాన్యుండు
నీరేజపత్రనిభనేత్రు జగత్పవిత్రుండు
బ్రారబ్ధపుణ్యు మితభాషు గుణాభిలాషుండు. ౧౯౯

నవమాశ్వాసములో

క. శ్రీరామా సంచితవిపు, లోరస్థలు నిర్మలాత్మయోగ సుధాకూ
పారసుధాకరుఁ గవినీరేరుహరవి దివ్యమునివరేణ్యు నగణ్యుండు. ౨౦౦

చ. పురహరమూర్తిఁ గీర్తిపరుఁ బుణ్యు నగణ్యు నసేవ్య భవ్యబం
కరుహాజగోత్రుఁ బాత్రు నవికారు గభీరు ముముక్షు దక్షు నీ
శ్వరపదభక్తు ముక్తు గుణవంతు ననంతు వదాన్యు మాన్యు వా
గ్వరకృతకృత్యు నిత్యు మునివంద్యు ననింద్యు విచారపారగుండు. ౩౬౨

క. పరమపరుఁ బరమదురితే, తరు గురుఁ గరుణామృతాంబుధారావర్షో
త్కర తర్పిత భక్తాంతః, కరణోర్వరు దివ్యమునిశిఖామణి ననఘుండు. ౩౬౩

చ. అనఘచరిత్రుఁ బాత్రు నియతాత్ము మహాత్ము ననింద్యవంద్యు స
జ్జనహిత కాంతుఁ గాంతు మితజల్పు ననల్పుఁ గవీంద్రు రుంద్రు భూ
వినుతు నపారధీరుఁ గృతవేది ననాది ననంతుఁ గంతు బా
ణనికర ముక్తు నుక్తు మునినాథు ననాథు వరేణ్యు బుణ్యునిన్. ౩౬౪

క. మానమహార్ణవు సంతత, దాని శివజ్ఞాని రాజధరమూర్తి సుధీ
దీనజనాభీష్టద క, ల్పానోకహసదృశు మల్లికార్జునదేవుండు. ౩౬౫

## ద శ మా శ్వా స ము లో

క. శ్రీరమణీ రమణీయత,రోరస్థ్సలు ననఘు నను వినోదయవిద్యా
పారగు మునిముఖముకురు, దయారస సంపూర్ణుమల్లికార్జున దేవుఁ. ౩౬౭

మ. పరమానందుఁ డమందు డక్షజయుఁ డభ్రాంతుండు శాంతుండు స
ద్గురు డాత్మజ్ఞుడు ప్రాజ్ఞుఁడస్ఖలితుఁ డకూ్రరుం డుదారుండు వి
స్తరితశ్లోకుఁ డశోకుఁ డాగమచయాచార్యుం డవార్యుండు సా
గరగంభీరుఁ డభీరుఁడక్షయ శుభాకారుండు ధీరుండెదఁ. ౧౬౬

క. మదనమదనాస్త్ర నిభశుభ, మదవతికా లోలదృష్టి మార్గణనికరా
భిదురిత హృదయాంభోజుఁడు, మదనారిపదాబ్జమత్త మధుకరుఁడెలమిఁ. ౧౬౭

మ. సకలాధారుఁడు ధీరుఁడుత్తమగుణాసక్తుండు ముక్తుండు రా
జకళాకల్పు డనల్పుఁ డర్థిసుర భూజాతుం డజాతుండు బ్రి
హ్మకులాధీశుడు మేశుఁడూర్జితుఁడు ధీమంతుం డనంతుండు సూ
రికవిస్తుత్యుడు నిత్యుఁడాదిముని చారిత్రుండు పాత్రుండిలఁ. ౧౬౫

క. తరుణతరతరణికిరణోత్కర, సంస్పర్శ ప్రభానికర వికసిత వా
రిరుహదళకలిత శోభాహరదవదాతాక్షుఁ డూర్జితైశ్వర్యుఁ డొగిఁ. ౧౬౮

భుజంగ. మహాయోగి ముఖ్యుండు మాన్యుండు ధన్యుం
డహార్నాథ తేజం డనంతుండు శాంతుం
డహింసారతుం డంబుజాక్షుండు దక్షుం
డిహాముత్ర భోగాద్యనిష్టుండు సృష్టిఁ. ౧౭౦

## ఏ కా ద శా శ్వా స ము లో

క. శ్రీరమణు డఖిలసుజనా,ధారుడు కవి గమకి బుధనిధానుఁడు భవకాం
తార దవానలుఁ డఘనం,హారుఁ డుదారుండు మల్లికార్జును డెలమిఁ. ౧౭౧

చ. సరసిరుహాక్షు మోక్షు మితజల్పు ననల్పు వరుఁ వరేణ్యు స
ద్గురు కృతకృత్యు నిత్యు గతదోషు నరోషు ననంతు శాంతు వా
గ్వరజనసేవ్యు భవ్యమునివంద్యు ననింద్యు వదాన్యు మాన్యు శం
కరపదభక్తియుక్తు నవికారి నఘారి విచారపారగుఁ. ౧౭౨

క. ప్రణుతామల సద్గుణగణ, మణిభూషణ భూషితాంగు మారామిత మా
ర్గణ తాపరహిత హృదయాం, గణు సజ్జన కల్పవృక్షు కల్పు ననల్పుఁ. ౧౭౩

చ. కలిమలదూరు ధీరు నవికారు నుదారు సముద్భవు సహ్యు ని
శ్చలమతి దివ్యు భవ్యు నభిజాతు నజాతు సమూఢు గూఢు ని
ష్కలు నభిమాని దాని మునిశక్రు నవక్రు నభేద్యు నాద్యు ని
నిర్మలసుచరిత్రు జి బ్రాతుజిత మారు నభీరు సుమారుహారునిన్. ౭౭౯

క. పరపరివాదప రాఙ్ముఖుఁ, బరహితరతుఁ బరమముని నపరిమితవిద్యా
పరిణతుఁ బరిజనసజ్జన, పరిపాలనపరు విచారపరుఁ బరమపరున్. ౭౮౦

కవిరాజవి. మనుమునినిభచారు చరిత్రు బవిత్రు సమానుష పౌరుషవర్తి జగ
జ్జనసుత నిర్మలకీర్తి రమావిభు శాశ్వతయోగపదస్థిరు స
న్మునిజనముఖ్యు శివాగమవేది నమోఘవచోనిధి ధీనిధిఁ బా
వనతరమూర్తి సమస్తజగద్గురువంద్యు ననింద్యు సదాత్మవిదున్ ౭౮౧

ద్వాదశాశ్వాసములో

క. శ్రీరామాకేళి నీరేరుహ, పరిగళితలలిత రేణుప్రకరా
సారాపూరిత భూరిత, రోరస్థల మందరాచలోరు ప్రస్థున్. ౭౮౨

మ. క్షితి సర్వేశ్వర పాదభక్తుల మహాకీర్తి ప్రభానూన సం
హతి సూర్యద్యుతి కగ్గలంబగుచు లోకాలోక శైలావలీ
ప్రతిలోకాఖ్య మహీధరస్ఫురిత కుంభస్తంభ దీపోజ్జ్వలా
యత తేజఃస్థితిఁ బర్వు నొక్కమొగి బ్రహ్మాండంబులోనన్ వెలిన్. ౧౦౦౧

మానిని. ధీరత భూమి గభీరత వారిధి తేజము వహ్ని బలం బనిలం
బారయఁ బెంపునభంబు పవిత్రతఁ పమహార్పతిగాంతి విధుండు మహో
దారత నయ్యజమానులు పేర్మిసదాశివు నెన్మిది మూర్తులు జె
ల్వారఁగ నిచ్చుచు నుండెడు మర్థి నహర్నిశమున్ శివభక్తులకున్. ౧౦౦౨

మ. ధ్రువమై జంగమమల్లికార్జున మునీంద్రుం బేర్మిఁ బేర్కొన్న స
త్కవిరాజోక్త కుమారసంభవ మహాకావ్యంబు భూభూధరా
ర్ణవవేదానిలతారకాంబర సదానంతాంత దిక్కాలముల్ (?)
పవిలాసస్థితి నుండు నంత కిల నాచంద్రార్కమై యుండెడున్. ౧౦౦౩

సీ. జ్ఞానదీపంబు హృత్సదనంబులోఁ దాన దీవియగా నేచ దివురువారు
వలచేత వసుమతీవలయంబు నవరత్నవలయంబుగా నిడ వలచువారు

భారతిఁ దమమోముఁ బసిఁడిమాడువులోన నిలవేల్పుగా నిల్పఁదలచువారు
నణిమాది గుణమణిహారమ్ము లురమున హారంబుగా నిడఁగోరువారు
వెలయ మత్కృతి సదువుఁడు వినుఁడు వ్రాయుఁడీశ్వరాంబికాగుహులిత్తు రీప్సితములు
వారిమేమెయిఁ గొనియాడువారికోర్కు, లొసరజంగమమల్లికార్జునుడు నొసగు.

మ. త్రిజగద్వంద్యుఁ డనింద్యుఁ డిష్టజన వర్ధిష్ణుండు విష్ణుండు వా
రిజ పత్రాక్షుఁడు దక్షుఁ డాదిముని చారిత్రుండు పాత్రుండు గుం
భుజతత్త్వజ్ఞుఁడు ప్రాజ్ఞుఁ డీశ్వర పదాసక్తుండు ముక్తుండు జ
న్మ జరాదూరుఁడు ధీరుఁ డాత్మ విదుఁ డానందుం డమందుం డెడన్. ౧౦౦౧

క. అమితసుగుణమణి రచితా ద్యమల విభూషణ విభూషితావయవుడు జం
గమ మల్లికార్జునుఁడు వాగ్రమణీ రమణుండు మునిశిఖామణి పేర్మిన్. ౧౦౦౬

మ. సుకవిస్తుత్యుఁడు నిత్యుఁ డూర్జితుఁడు సుశ్లోకుం డశోకుండు స
ర్వకళాధారుఁడు ధీరుఁ డార్య జనతావర్యుం డవార్యుండు ధ
ర్మకథాసంగుఁ డసంగుఁ డాద్యుఁడు జగన్మాన్యుండు ధన్యుండు బ్ర
హ్మకులోత్తంసుడు హంసుఁ డుత్తమగణాయత్తుం డమత్తుం డెడన్. ౧౦౦౭

క. ముక్తుఁడు కృత్యాకృత్య వి రక్తుఁడు యోగీశ్వరానురక్తుఁడు తత్త్వా
సక్తుండు నియమపద సం, యుక్తుఁడు సంసారపదవియుక్తుండు మదిన్. ౧౦౦౮

మంగళ మహాశ్రీ వృత్తము

భూవినుతుఁ డార్యజన పూజితుఁడు సద్గుణవిభూషితుఁడు సర్వా
శావివర పూరితవిశాల శరనిర్మలయశః ప్రసర శోభితుఁడు సద్భా
దేవకులశేఖరుఁడు దేవముని ముఖ్యుఁడు సుధీజనవరేణ్యుడు ప్రియుండై
యీ వసుధ కిష్టతతి కిష్టఫలయుక్తముగ నిచ్చు దయ మంగళమహాశ్రీ.

గద్యము.

ఇది శ్రీ మజ్జంగమ మల్లికార్జున దేవదివ్య శ్రీ పాదపంకజ భ్రమ
రాయమాణ కవిరాజశిఖామణి నన్నెచోడ దేవ
ప్రణీతంబైన కుమారసంభవం బను కథ
యందు ద్వాదశాశ్వాసము.

---

# ద్వాదశ జ్యోతిర్లింగములు

## ౧౧. శ్రీ సేతుబంధ రామేశ్వరలింగము

**మఠం సిద్ధివీరయ్యగారు, ఉపాధ్యాయులు**



శ్రీ మహావిష్ణు భగవానుని దశావతారములలో శ్రీ రామచంద్రుడు మాననీయ చరిత్రుఁడై ఆదర్శప్రాయకమగు నీతులను ప్రపంచమునకుఁ గఱపెను. అమ్మహానుభావుని నిజకరకంజములతో శ్రీ రామేశ్వరలింగప్రతిష్ఠ జరిగినది.

లంకాపురిపై దండయాత్ర సల్పుటకు శ్రీరామచంద్రుఁ డిచటి కేతెంచెను. సముద్రతీరమందు కపిసేనలతో విడిసి ఇచటి వాలుకతో శివలింగమును నిర్మించి తదారాధన గావించెను. కారణ మీవిధముగాఁ దెల్పబడుచున్నది. శ్రీ రామచంద్రుఁడు దాహముఁగలవాఁడై జలపానమున కుద్యుక్తుఁడై యుండెను. అంత నాకస్మికముగ నశరీరవాణివాక్కు లాతని శ్రవణయుగ్మంబునకు నీవిధముగా వినబడియె. "శ్రీరామచంద్రా! నన్నర్చనముసేయక యే నీవు వారిఁ గ్రోలెదవా?" ఈ వాక్యముల నాలకించిన తోడనే శ్రీరాముఁడు వాలుకాశివలింగము నిర్మించి శివపూజ గావించెను. రావణుని గెల్తువగలందుల కభ్యర్థితుఁ డయ్యెను. శ్రీ శంకరభగవానుఁ డతని యభీష్టమును సహర్షముగా నెరవేర్చుట కంగీకరించెను. మఱియు లోకోపకారార్థముగా జ్యోతిర్లింగ రూపమున సర్వదా నెలకొని యుండుటకై యెల్లర ప్రార్థనల నంగీకరించెను. శ్రీరామచంద్రుఁడు శివలింగ ప్రతిష్ఠగావించి పూజ యొనరించి భగవన్మహిమాభివర్ణనముఁ జేసెను.

శ్రీ శివలింగ స్థానసంబంధమగు మఱొక యితిహాసము దిగువ నుల్లేఖింపఁబడుచున్నది.

రావణాసురవధఁగావించి శ్రీరామచంద్రమూర్తి సీతామతల్లితో కపిసేన వెంట నంటిరాగా, యయోధ్యానగరాభిముఖుఁడై సముద్రతీరమునందలి గంధమాదన పర్వతముపై మొదటి మజిలి చేసెను. ఆసమయమున మౌనిబృంద మా రామచంద్రుని స్తుతియొనరించుట కేతెంచెను. అప్పు డాతఁడు మునిగణము నుచితరీతి సత్కారము గావించి యిట్లుపలికెను. "మునితల్లజులారా! పులస్త్యకుల ధ్వంసము గావించుటచే బ్రహ్మహత్యాపాతకము వెన్నంటియున్నది. కావున తాము కృపాతరంగిత మానసులై యీ కలుషమునుండి విముక్తిఁ గాంచుట కేదేని యుపాయముండినచోఁ దెలియఁజేయుఁడు!"

మునీశ్వరులెల్ల నేకకంఠులై భగవద్గుణ గాన మొనరింపుచు శ్రీరామచంద్ర మూర్తితో నిట్లు ప్రతివచన మొసగిరి. "బ్రహ్మహత్యా విముక్తికొఱకొక యుపాయముఁ గలదు. తాము శ్రీశివలింగస్థాపన మొనరింపుఁడు, తన్మూలమున బ్రహ్మహత్యా మహాఘమునుండి విముక్తిఁగాంచెదరు........"

అంత నా రామచంద్రుఁడు మహావీరుఁడగు హనుమానుని బిలిచి కైలాస పర్వతమున కేగి శివలింగముఁ దెచ్చుట కాదేశ మొసగెను. తత్క్షణము హనుమంతుఁడు కైలాసమునకుఁ జేరెను. కాని అతని కచ్చోట శివభగవానుని దర్శనము కాదయ్యెను. కావున శివదేవుని గుఱించి ఘోర మగు తపస్సొనరింప మొదలిడెను. తదనంతరము శంకరభగవానుఁడు ప్రసన్నుఁడుకాగా లింగమును గైకొని శ్రీరామచంద్రుని సన్నిధికి గమనోన్ముఖుఁ డయ్యెను. కాని యిచట జ్యేష్ఠశుక్ల దశమి బుధవార మత్యంతశుభ ముహూర్తమగుటచే శివలింగస్థాపనము శ్రీరామచంద్రుఁడు చేసియుండెను. మునులు హనుమంతుని రాక కాలస్యమగునను తలంపుచేతను, పుణ్యాలగ్నకాల మతిక్రమించు నను భీతిచేతను సద్యస్కాలము లింగప్రతిష్ఠఁ గావించుటకు శ్రీరామచంద్రునికోరిరి. వారి యభీష్టానుసారము శ్రీ సీతామహాదేవిచే నిర్మింపఁబడిన సైకతలింగమును స్థాపించిరి. హనుమంతునకు జరిగిన వర్తమానము దెలిసి యతని మానసమున కత్యంత వ్యసనము గలిగినది. తన ప్రభువగు శ్రీరామచంద్రుని చరణారవిందముల పైఁబడియెను. భక్త పరాయణుఁడగు భగవానుఁ డతని వీపు తట్టి సాంత్వన వచనములతో నిట్లనియె. "హనుమా! నీవు రాకపూర్వమే లింగప్రతిష్ఠ జరిగినందుకు కారణము సుముహూర్తాతిక్రమణ మేమైన జరుగునేమో యను శంకతప్ప వేఱొండు కాదుసుమా! నీ యాత్మ తృప్తికొఱకు నే నొక విషయము నీకు దెలిపెదను. అదేమన స్థాపిత లింగమును పెకలించివేయుము. తదనంతరము నీవు తెచ్చిన లింగమును ప్రతిష్ఠచేయుదును." ఈ వాక్య మాలకించి హనుమంతుఁడు సంతుష్టుడై లేచి శ్రీరామచంద్ర స్థాపిత లింగమును పెకలింప సన్నద్ధుడయ్యెను. హస్తము నా లింగముపై మోపి ప్రయత్నించెను. కాని కార్యసాధన సులభసాధ్యము కాదను సంశయము స్పష్టమయ్యెను. వాలుకాలింగమే వజ్రసదృశమైనది. తన సామర్థ్యము నంతయు వినియోగించెను కాని యంతయు నిరుపయోగమైనది. చివరకు తుదిప్రయత్నము తన దీర్ఘవాలముతో లింగమును జుట్టసాగెను. మఱియు భీషణాట్టహాసము గావించి బలవంతముగా లాగెను. అయిన నణుమాత్రమైన లింగము చలింపదయ్యెను. అతని శక్తికి భూమియే కంపించెను. లింగచలనమునకు మాఱుగా హనుమంతుడే క్రోశదూరమున మూర్ఛాక్రాంతుడై పడిపోయెను. అతని ముఖమునుండి నాసికారంధ్రములనుండి శోణిత

ధారాప్రవాహము నిర్గమించెను. శ్రీరామచంద్రాదులు వ్యాకులిత చిత్తులైరి. శ్రీ సీతామహాదేవి యతని శరీరముపై హస్తములతో దడవుచు రోదన మొనరింప మొదలిడెను. కొండొకసేపునకు హనుమంతుని మూర్ఛ తేరినది. ఎట్టయెదుట నిలిచిన భగవాను నవలోకించెను. సాక్షాత్పరబ్రహ్మ రూపియగు రామచంద్రుఁడు దృగ్గోచరు డయ్యెను. ఆత్మగ్లాని పూర్వకముగ నాతడు తత్క్షణమ లేచి శ్రీరామ పాదపద్మములకు సాష్టాంగ ప్రణామముఁ గావించి స్తుతి నొనరింప సాగెను. భగవాను డతనిని సమాధాన మొనరింపుచు యిట్లనియె: "నీవు పొరపాటు పని చేసితివి. దీని మూలమున నింతటి కష్టదశ నందితివి. నాచే బ్రతిష్ఠిత లింగమును ప్రపంచమందలి యే మహాశక్తు లైనను యేకీభవించి భేదింపజాలవు. మహాదేవాపరాధ కారణమున నీ కీ ఫలప్రాప్తి యైనది. ఇకముం దెన్నడును యిట్టి చేష్టలఁ జేయకుము."

తదనంతరము శ్రీరామచంద్రుఁడు హనుమదానీతలింగమును సమీపమునందే ప్రతిష్ఠఁ గావించి దానికి "హనుమదీశ్వరుఁ"డను పేరిడెను రామేశ్వర హనుమదీశ్వర మహిమ భగవానునిచే నీ విధముగా వర్ణింపఁబడినది.

"శ్లో. స్వయంహ రేణ దత్తంతు హనూమన్నామకం శివం,
సంపశ్యన్ రామనాథంచ కృతకృత్యో భవే న్నరః
యోజనానాం సహస్రేఽపి స్మృత్వా లింగం హనూమతః
రామనాథేశ్వరం చాపి స్మృత్వా సాయుజ్య మాప్నుయాత్
తే నేష్టం సర్వయజ్ఞైశ్చ తపశ్చాకారి కృత్స్నశః
యేన హీష్టో మహాదేవో హనుమద్రాఘవేశ్వరౌ"

(స్కాంద పురాణము ౪౫) (బ్రం. ఖం. సం. మాం. ౭౦)

భావ మేమన "శివభగవానునిచే స్వయముగా నివ్వబడిన హనుమదీశ్వర లింగము, అట్లే శ్రీరామనాథేశ్వర లింగము ఈ రెంటి యొక్క దర్శనముఁ గావించి మనుష్యుఁడు కృతార్థుడగును. వేయి యోజనముల దూరమునుండియు శ్రీ హనుమదీశ్వర, శ్రీరామ నామథేశ్వరుల స్మరణఁ గావించిన మానవుఁడు శివసాయుజ్య ప్రాప్తిఁ గాంచును. ఎవరు హనుమదీశ్వర, రాఘవేశ్వర మహాదేవుని దర్శించినారో వారు సర్వయజ్ఞములను సమస్త తపముల నొనరించినవారు."

శ్రీరామేశ్వరమందిరము నిడివి సుమారు వేయి అడుగులు. ఆరువందల యేబది యడుగుల వెడల్పు. వంద యిరువదియైదు అడుగుల యున్నతము గలదు.

ఈ విశాల మందిరమున శ్రీ శివభగవానుని ప్రధానమూర్తియే కాక మూరెడు కంటె నెక్కువ పొడవుగల ననేక సుందర శివ విగ్రహములును మఱియు నిత్య మూర్తులును కలవు. నందీశ్వర విగ్రహము మిగుల గొప్పది, అద్వితీయమైనది. (శ్రీ శంకర పార్వతీ మూర్తులు) ఉత్సవ విగ్రహములుఁ గలవు. వీనిని వార్షికోత్సవములలో నవసరము గలిగినపుడు స్వర్ణ రజిత వాహనములపై నిలిపి యూరేగింపు చేసెదరు.

రజత త్రిపుండ్రములును శ్వేత ఉత్తరీయమును ధరించుటచే లింగమూర్తి శోభ మఱియును పెంపొందును. మందిరాంతర్భాగమున (౨౪) బావులున్నవి. వీని కన్నింటికి తీర్థము లని పేరు. వానిలోని నీటిచే జలకమాడుటయు ఫలప్రదమైయున్నది. ఈ గుండములలోని జలము మధురము. మందిరపు బహిర్భాగమునందుండు కూపముల నీ రుప్పగానుండును. ఈ గుండములను భగవానుఁడు తన యమోఘ బాణముల మూలమున నిర్మించినాడు. వానియందు భిన్న భిన్న తీర్థముల వారిని తెప్పించి నిలిపెను. వానిలోఁ గొన్నిటి పేళ్లు వ్రాయఁబడుచున్నవి.

గంగ, యమున, గయ, శంఖచక్రి, కుముద ఈ గుండములే కాక శ్రీ రామేశ్వరధామమునందు దర్శనతీర్థము లనునవి కలవు. వీనిలోఁ గొన్నింటి నామము లివి. రామతీర్థ, అమృతవాటిక, హనుమాన్ కుండము, బ్రహ్మహత్యాతీర్థము, విభీషణ తీర్థము, మాధవకుండము, సేతుమాధవము, నందికేశ్వరము, అష్టలక్ష్మి మండపము.

గంగోత్రియొక్క గంగాజలముతో రామేశ్వరు నభిషేకించుట గొప్ప మహామాస్పదము. దీనికొఱకు రూపాయపావలా సమర్పించవలెను. ఎవరియొద్ద గంగాజలముండదో వారికి అచటి (పండాలు) పూజారులు ౧౦ రూ॥ ౨౦ రూ॥ ౫౦ రూ॥ శీసాలవంతున గంగాజలమును విక్రయించెదరు. రామేశ్వరమునకు (౧౫ లేక ౨౦) మైళ్ళదూరమున ధనుష్కోటి యను స్థానముగలదు. అచట హిందూమహాసముద్రము మఱియు బంగాళాఖాతము సమ్మేళనమగును. ఇచట శ్రాద్ధాదు లొనరించుకొనవచ్చును. ధనుష్కోటివరకు రైలుమార్గము గలదు. ఇచ్చోటనే శ్రీరామచంద్రుఁడు సముద్రునిపై నలిగి శరసంధాన మొనరించెను.

ధనుష్కోటి గొప్ప రేవు పట్టణము. అచటనుండి ప్రస్తుత లంకాపురికి యోడలు పోవును. శ్రీరాముని వారధి యిప్పటికిని కొంత భగ్నావశేషమైయున్నది. దాని నాధారపరచుకొనియే ఆంగ్లేయులు రైలు మార్గము నేర్పరచినారు. రామేశ్వరము పోవుటకు కలకత్తా లేక బొంబాయికి వెళ్లి మద్రాసు చేరవలెను. అచటనుండి సౌత్ యిండియన్ రైల్వే ద్వారా తిరుచనాపల్లికి వెళ్ళి రామేశ్వరము పోవలెను. ఈ ప్రదేశము మధుర జిల్లాలోను రామనాథరాజుయొక్క జమీందారిలో నున్నది.

ఇచ్చట లక్ష్మణ తీర్థమునందు జనులు ముండనాదులును, శ్రాద్ధ మొనరించుకొనియెదరు. సముద్రస్నానము, అర్ఘ్యప్రదానము మఱియు గంధమాదన పర్వతోపరిభాగమునందున్న (రామజరోఖ) నుండి సముద్ర సేతుదర్శనముయొక్క గొప్ప మహిమ గలదని చెప్పెదరు. సేతుమధ్యభాగమునం దనేక తీర్థములు గలవు. వానిలో ముఖ్యమైనవి యివి:—(౧) చక్రతీర్థము (౨) బేతాళవరద (3) పాపవినాశన (౪) సీతాసర (౫) మంగలతీర్థ (౬) అమృతవాపిక (౭) బ్రహ్మకుండము (౮) అగస్త్యతీర్థము (౯) జయతీర్థము (౧౦) లక్ష్మీతీర్థము (౧౧) అగ్నితీర్థము (౧౨) శుకతీర్థము (౧3) శివతీర్థము (౧౪) కోటితీర్థము (౧౫) సాధ్యామృతతీర్థము (౧౬) మానసతీర్థము.

(ఓం తత్ సత్) సర్వం శ్రీ పరశివార్పణమస్తు.



## ౧౨. ఘుశ్మేశ్వర జ్యోతిర్లింగము

ఇది చిట్టచివర జ్యోతిర్లింగము. ఘుశ్మేశ్వరమనియు లేక ధృష్ణేశ్వరమనియు లేక ఘుసృణేశ్వరమనియు వర్ణింపఁబడి యున్నది. నిజాంరాష్ట్రాంతర్గత నిజాంరైల్వే లయినులో మన్మాడనుంచి ౬౬ మైళ్ళదూరమున దౌలతాబాద్ స్టేషను కలదు. అటనుండి ౧౨ మైళ్ళదూరమున వేరోల్ గ్రామముగలదు. దాని సమీపమందే యీ క్షేత్రమున్నది. స్టేషన్ నుండి వృషభశకటములు ప్రయాణికులకు లభించును. మోటారు సౌకర్యము నర్థించువారు ఔరంగాబాద్ స్టేషనులో దిగవలెను. దౌలతాబాద్ నుండి గంతవ్యస్థానమున కేగుమార్గము పర్వతమయము. మనోహరము. మార్గమధ్యమున దౌలతాబాద్ ఖిల్లా (దుర్గము) యున్నది. ఇది ధృష్ణేశ్వరమునుండి దక్షిణమున ౫ మైళ్ళ దూరమందు పర్వతశిఖరమున నిర్మితమైయున్నది. ఇచ్చట ధారేశ్వర శివలింగము గలదు. మఱియు శ్రీ ఏకనాధస్వామి గురువర్యులగు శ్రీ జనార్దన మహాశయుని సమాధి యున్నది. ఇక్కడినుండి వెళ్ళిన ముందు ఎల్లోరాగుహలు సుప్రసిద్ధమైనవి. దర్శనీయములు. ఎల్లోరా కేగుటకు దౌలతాబాదునకు తూర్పునందున్న ఎల్లోరారోడ్ స్టేషనులో దిగవలెను. ఎల్లోరాలో కైలాసమను పేరుగల గుహ యున్నింటిలో శ్రేష్టమై సుందరముగా నున్నది. పర్వతములఁ దొలిచి నిర్మింపఁబడినవి. గుహలు శిల్పకళానైపుణ్యదృష్టితోఁ బరికించిన నత్యంత సుందరములైనవి. ఇవి కేవలము హిందువులనే తమవైపు నాకర్షించునవి కావు. అన్యమతావలంబులను విదేశవాసులను తమ యద్భుత శిల్పకళా కౌశల్యమూలమున నాకర్షించి ముగ్ధుల నొనరించినవి. శ్యావలను పేరుగల పాశ్చాత్య శిల్పి

దక్షిణభారతపు మందిరము లన్నియు నీ కైలాస మందిరానుకరణము లని తెల్పుచున్నాడు. ఎల్లోరా సౌందర్యముగల ప్రదేశమని బౌద్ధులు జైనులు మఱియు పరధార్మికులగు మహమ్మదీయులు సైతము ఆకర్షితు లగుచున్నారు. వారు ఇచటి రమ్య ప్రదేశమందు మందిరముల నిర్మించుకొని యున్నారు. కొందఱు ఎల్లోరా కైలాసమందిరమునే ఘుశ్మేశ్వరునినిజస్థాన మని తలచుచున్నారు. శ్రీ ధృష్ణేశ్వర శివుడును మఱియు దేవగిరి దుర్గమధ్యమున సహస్రలింగము, పాతాళేశ్వరము, సూర్యేశ్వరము లున్నవి. సూర్యకుండము శివకుండములు గలవు. ఇది మిక్కిలి ప్రాచీనస్థలము. ప్రస్తుతాంశము ఘుశ్మేశ్వర జ్యోతిర్లింగమును గుఱించి స్థాపనా సంబంధేతిహాసము ఈ విధముగా నున్నది. దక్షిణ దేశమున దేవగిరి పర్వత నికటంబున సుధర్మనామక బ్రాహ్మణుడొకడు వాసము చేయుచుండెను. అతని పతిభక్తిగల పత్నియభిధానము సుదేహ. ఉభయులలో పరస్పర సద్భావము లుండెను. తన్మూలమున సుధర్ముడు సుఖజీవియై యలరారెను. ఆయనకు కాలము గడచిన కొలది యతని హృదయాంతర్గతమునం దొక చింత జనించి అతని సుఖమునకు కంటకప్రాయమయ్యెను. ఆచింత యేమన తన యనంతరము వంశపాలకుఁ డనదగు కుమార రత్నము లేకుండుటయే. దైవజ్ఞ శేఖరులు సుదేహజాతకమును బరిశీలించి చూచి సుదేహకు సంతానము లేనట్లు ధృవపరచిరి. ఈ విషయ మా భూసురుఁడు తన గృహిణికి తెలిపెను. అంత నాయువతి ధ్యానము వహింపక తనభర్తతో రెండవకన్యను వివాహ మాడుటకై నిర్బంధ మొనరింపసాగెను. సుధర్ముఁడు బాగుగా నామెకు బోధించి యీ గందరగోళమేల నని పలికెను. కాని సుదేహ తనపట్టు వదలక ఇట్లు పలికెను. “నాథా ! తాము నాభగిని యగు ఘుశ్మను వివాహముఁ జేసికొనుఁడు. ఆమెయు నేనును యేకగర్భసంజాతలము. ఆబిడకు నాకత్యంత స్నేహవాత్సల్యము గలదు. కావున మాయుభయులలో విభేద భావము లుదయించు నను శంక లేశమాత్రమైన మీ మానసమధ్యమున తావీయకుఁడు. మేమిద్దరము పరమప్రేమ విశ్వాసములతో నేకమానసులమై దేహద్వయముతో నుండెదము. మీరు నిశ్చింతతోఁ గాలము గడుపుడు.”

సుధర్ముఁడు తన పత్నిమాటను త్రోసిరాజనక చివరకు వివాహమాడ సమ్మతించెను. మఱియు మంచి ముహూర్తమును నిశ్చయించి ఘుశ్మను వివాహమాడి స్వగృహముఁ బ్రవేశించెను.

ఇద్దరు సోదరీమణులు ప్రేమవిశ్వాసములతో నుండిరి. ఘుశ్మయను నామె సులక్షణ గృహిణి. తనభర్తసేవయందు సర్వవిధముల సభక్తికముగా నిమగ్నయై యుండును. తన యక్కగారిని మాతృసదృశగా నెంచి సపర్య లొనరించును. శివభగ





౧౧. శ్రీబాళెహళ్లి జగద్గురువుల ఉత్సవములు మైసూరు.



౧౨. పరళీ శ్రీ వైద్యనాథుడు.



౧౩. పరళీ మహారుద్రాభిషేకోత్సవము.

వానునియం దమితభక్తిమెయి ప్రతిదినము పూజ గావించును. ఆయమ నియమ పూర్వకముగా (౧౦౧) పార్థివ లింగముల నిర్మించి పూజ విధిప్రకార మొనరించును. శ్రీ శంకర భగవానుని ప్రసాదముచే నత్యల్పకాలమున నాయమ గర్భము ధరించెను. నవమాసములు పూర్ణమైన పిమ్మట శుభదిన శుభలగ్నమునం దొక పుత్రుఁడుత్పన్న మయ్యెను. సుధర్ముడే గాక సుదేహయు నపరిమిత సంతోష భరితమానసులైరి. కాని తరువాత నామెబుద్ధిపై క్రూరరాక్షసప్రవృత్తి యావేశమైనది.

ఈర్ష్యాంకుర మయ్యెను. ఇపుడు నిజసహోదరిముఖమును చూడలేదు. శిశువుపై ననురాగముకూడ గగనసుమమైనది. కుమారుని చూచి మానసాంతర్గతమున విచారపడును. బాలకుని వయమభివృద్ధిజెందినటుల పెద్దతల్లి యీర్ష్యయుఁ బెంపొంద సాగెను. కుమారుఁడు యుక్తవయస్కుఁడు కాగా సుధర్ముడు వివాహ మొనరించెను. నవ వధూయుక్తముగా సుధర్మతనయుఁడు గృహముఁజేర సుదేహ యీర్ష్యాతరువు పల్లవితమై, కుసుమితమై, ఫలరూపము గాంచెను. "ఆహా! ఇపు డంతయు ఘుశ్మదే కదా! నా కీ గేహమునం దేమియున్నది?

పుత్రి, స్నుషలు దాని సంబంధీకులే! నాకు వీరెవరు ? నా సంపద నంతయు హరించువారు కదా! ఈ విచార పరంపర లన్నియు సుదేహమానసము గలచి వైచి నవి. వారి ధ్వంసమునే కోరుచుండెను. కుమారుని హత్య గావింప సంకల్పము సైత మొనరించెను. ఒకనాడు రాత్రివేళ కుమారుఁడు తన భార్యతో శయన మందిరమున గాఢనిద్రాపరవశుడైయుండ దుష్టబుద్ధియగు నీ సుదేహ సవతికుమారుని ఖడ్గ ధారకు బలి గావించెను మఱియు నాతని శవము నొక సరస్సునఁ బడవేసెను. ఆ సరస్సునందే ఘుశ్మ ప్రతిదినము పార్థివ శివలింగముల విసర్జించెడిది. ప్రాతఃకాల మున శయ్యనుండి సుధర్మునికోడలు లేచి తన భర్తను గానక వస్త్రము లన్నియు రుధిరభరితము లగుట గాంచి యభాగ్యయగు నాపె కేకవేసి దుఃఖింపసాగెను. సుధర్ముని ఆశాజ్యోతి యారిపోయెను. ఇంత కల్లోలము జరుగుచున్నను ఘుశ్మ శివపూజయందే నిమగ్నమై పూజామందిరమున నున్నది. ఈ హత్యాకాండవంక నాయమ ధ్యానమే లేదు. శివపూజనుండి విశ్రాంతియే లభింపదయ్యెను. ఆమె ప్రతిదినముమాదిరి నియమపూర్వకముగ నిత్యకర్మ సమాప్తి కావించి శివలింగముల తటాకమందు విసర్జించెను. భగవల్లీల యేమని చెప్పవలెను ? ఆకస్మికముగ సరోవరమునుండి యామె కుమారుడు (మరణించినవాడు) బయలుదేరి వచ్చెను. తల్లితో నిట్లు ప్రార్థించెను. "అమ్మా! నేను మరణించియు పునర్జీవితుఁడ నైతిని. నిలువుము. నేను నీ వెంటనే వచ్చెదను." కుమారు డేతెంచి మాతృదేవి చరణంబుల పైఁబడి

బొరలుచుండెను. కాని ఘుశ్మ కేవిచారములేదు. ఇదంతయు శివునిలీలయని యానందసాగరమున మునకలు వేయుచుండెను. పరమేశ్వరుడా భక్తురాలి తన్మయత్వము దిలకించి తడవుసేయక ఘుశ్మ మెదుట సాక్షాత్కరించెను. ఆమెను వరముఁ గోరుమని ప్రశ్నించెను. మఱియు ఘుశ్మసవతి దుష్టచేష్టలను సహింపఁజాలక తన త్రిశూలముతో నామె శిరచ్ఛేదన కాయత్తమయ్యెను. కాని ధర్మబుద్ధిగల ఘుశ్మ పరమేశ్వరునియెదుట కరములు ముకుళించి ప్రార్థన మొనరింపసాగెను. "ప్రభూ! దేవరవారు నాయందనుగ్రహము గలవారేయైన మాయక్కగారిని క్షమింపుడు. నిజముగా నాపై క్రూరకృత్య మొనరించినది. కాని తమదర్శనభాగ్యమువలన సమస్త కిల్బిషములచే విముక్తురాలైనది. మీ దర్శన మొనరించినవారికి పాపపుంజములు వెన్నంటునా! భగవంతా! ఆపెను మన్నింపుడు. ఆమె యేమిచేసిన చేయనిండు. కాని ఇప్పుడు ఆమె నష్టమువలన నన్నుమాత్రము నిమిత్తమాత్రురాలినిగా నొనరింపకుడు. శివదేవుడామె యుదారగుణముగాంచి మిగుల ప్రసన్నుఁడయ్యెను. మఱేదేని వర మభ్యర్థింపగోరెను. ఘుశ్మ యీ విధముగా నివేదించెను. "స్వామీ! నేను కోఱెడికోఱిక యేమనగా! తాము సర్వదా యీ ప్రదేశమందే వసింపుడు. తన్మూలమున లోకకల్యాణమునకు కారణమగును." అంత శంకరభగవానుఁడు "తథాస్తు" అని జ్యోతిర్లింగరూపమున స్థిరమై నిలిచెను. ఘుశ్మేశ్వరుఁడను నామముచే బ్రఖ్యాతుడయ్యెను. నాటినుండి ఈ తటాకమునకు శివాలయ మను పేరు కలిగినది. ఈ ఘుశ్మేశ్వర భగవానుని మహిమ విశేషముగా వర్ణింపఁబడియున్నది.

శ్లో॥ ఈదృశంచైవ లింగంచ దృష్ట్వా పాపైః ప్రముచ్యతే
సుఖం సంవర్ధతే పుంసాం శుక్లపక్షే యథా శశీ.

(శివపురాణము. జ్ఞానఖండము. ౫౭ అధ్యాయము. ౮౨ శ్లో)

భావము:—"ఘుశ్మేశ్వర మహాదేవుని దర్శనమువలన సమస్తపాపములు దూరమగును. మఱియుసుఖవృద్ధి,(శుక్లపక్షమందు చంద్రుడు వృద్ధిజెందునట్లు)చెందును"

భగవానుడగు ఆదిశంకరాచార్యులు ఘుశ్మేశ్వరస్తుతి దిగువ వ్రాసినప్రకార మొనరించెను.

శ్లో॥ ఇలాపురే రమ్యవిశాలకేఽస్మిన్, సముల్లసంతం చ జగద్వరేణ్యం
వందే మహోదారతరస్వభావం ఘుశ్మేశ్వరాఖ్యం శరణం ప్రపద్యే.

ఓం తత్ సత్. సర్వం శ్రీపరశివార్పణమస్తు.

ద్వాదశ జ్యోతిర్లింగములు

సంపూర్ణము.

# పరితాపపరిహారము

శ్రీ కె. సాంబసిద్ధయ్యగారు, ఉపాధ్యాయులు



తే. ఆశ్రయములేక భూమిపై నావరించి, క్రమ మెఱుంగక పారు నిన్గాంచ నాదు
మనమునన్ జాలిదోపగా చనువువలన, నిన్నుగొని తెచ్చి పూదోట నిలిపినాడ.

ఉ. అంతట బోదిజేసి విమలాంబువులన్ సరివేళ కిచ్చి నీ
పొంతనగూడియుండు కసవున్ గడజిమ్ముచు నెర్వొసంగి య
త్యంతప్రియమ్ముతోడ నరుణాంశువులన్ మృదుపత్రరాజి యా
వంతయునైనగాని పసివాడగ నీయక నిన్నుఁ బెంచితిన్.

తే. ఆశ్రయము నంటుకొనియుండి యనలు దినము, దినము నభివృద్ధిగాంచుచు దివికి బారి
లేతగాడ్పులు మెయిసోక లేచియాడు, మురువు గనులారగాంచి నే మురిసినాడ.

ఉ. పచ్చని యాకులెల్ల నొకవైపు వినూతనకాంతినిచ్చుచున్
ముచ్చటగొల్పుచుండ బరిపుల్లసుమాళి త్వదంగమందునన్
యచ్చపుమేల్మిభూషణములై యలరారగ నిన్నుగాంచి నే
మెచ్చుచు పారవశ్యమున మింటిపయిన్ విహరింపసాగితిన్.

తే. ఇట్టిప్రేమను నొకమారె కట్టగట్టి, యేటిలో గానరాకుండ మాటుజేసి
కనికరమువీడి నాదగు కఱకుచేత, కుసుమచయమెల్ల తెంపుచే కోసికోసి.

ఉ. అక్కట డబ్బుగోరి కఠినాత్ముడనై దయమాలి నేను నీ
యొక్క యపూర్వప్రేమ మహిమోన్నతినైన దలంపలేక నీ
చక్కని పుష్పమంజరుల సంచయమున్ గొని తెచ్చి వీథిలో
నొక్కని కమ్మివైచితి నిసీ! కడు తెంపరి నైతి వల్లికా!

ఉ. అంటినఁగందు నీజిగురుటాకులచందము జూచిచూచి నీ
కంటను బాష్పబిందువులకై వడిగారు మరందధార ని
న్నంటి చరించు భృంగసముదాయ విషాదపరీతలీల గ
న్గొంటినిగాని పుష్పముల గోయుటకున్ వెనుదీయనైతి హా!

తే. భానుకిరణప్రసారంపు పటలిలోన, మాడిపోకుండ నిన్నుగాపాడినట్టి
చేతులే నీసుమంబుల చింతలేక, గోసె ప్రేమానుబంధమ్ము గోసివైచె.

మ. లతికా! నీసుమజాలమున్ జడుడనై లాభమ్ము జింతించి గో
సితి నీ చెల్వము మాపితిన్ కటకటా చింతాగ్నిలో నిన్నుద్రో
సితి త్రైలోకములందునన్ వెదకినన్ జేజిక్కగాబోడు మత్
ప్రతిపాషాణ మనస్కుడున్ కఠినుడున్ పాపాత్ముడెం దేనియున్.

తే. సుమములన్ గోయునంత నీసోయగమ్ము, పోయె నని చింతనొందగా బోకు నీదు
స్వార్థరహిత సుగంధతాస్వాదనమున, జగము మత్తిల్లె నీజన్మ సఫలమయ్యె.

# ఆంధ్రవాణీవిలాపము

ఆంధ్రవ్యాసనిపుణ శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్య శర్మగారు



## ప్రథమాంకము

### ఒకటవ రంగము.

(ప్రదేశము—రాజమహేంద్రవరము—రాజరాజనరేంద్రుని దర్బారు. రాజు సింహాసనమునఁ గూర్చుండి యుండును. మంత్రి మొదలగువా రుచితాసనములఁ గూరుచుని యుందురు.)

సుబుద్ధి—మహారాజా ! నేఁడు మన పొరుగు రాజు తమ పేరిట నొక కమ్మ లిఖించి చారుల ద్వారా శ్రీవారి సమక్షమున కనిపి యున్నాఁడు. చిత్తగింతురు గాక ! (అని రాజు ముందరఁగల వ్రాఁతబల్లమీఁద లేఖ నుంచును.)

రాజరాజనరేంద్రుఁడు—(మంత్రిదిక్కై) కమ్మలోని యంశములఁ బఠింపుము.

సుబుద్ధి—చిత్తము. (లేఖనందుకొని)

"॥శ్రీ మన్మహారాజాధి రాజపరమేశ్వర, సకలాంధ్ర సామ్రాజ్య ధౌరేయ, సరస సాహితీకలా వల్లభ, సత్యసంభాషిత ముఖాంభోజ, నిరర్గళ వాగ్వైభవశేష, నిత్యవితీర్ణ దానధారారాధేయ, కవిజనాశ్రియ కల్పభూజ, నిఖిల భోగనిర్జితాఖండల, సాధితసముద్రాంతరద్వీప, పరనృపాల సంస్తుత ప్రతాప, సదాశ్రిత భరణ దీక్షాదక్ష, శ్రీ శ్రీ మద్రాజరాజనరేంద్ర మహారాజులుం గారి పాదపద్మముల సన్నిధికి శూరసేనుఁడు నమోవాకములఁజేసి వ్రాయించిన విజ్ఞాపనము—

తమ యానతిమెయి రాజద్రోహుల నేఁడే మాభటుల ద్వారా మీ సమక్షమున కనిపితిని. వారిని మీ యిచ్చవచ్చినట్లు చేసికొనవచ్చును.

రాష్ట్రములో కుకవు లనేకులు ప్రబలి భాషాదేవిని విరూపినిగాఁ జేయుచున్నారు. కావునఁ జిత్తగించి, తమ యాస్థాన విద్వత్కవిసింహుఁడైన నన్నపాచార్య కవీంద్రుని నారుమాసముల గడువు కాలముపైఁ బంప ప్రార్థించుచున్నాను. వారు కుకవుల పాలిటికి మృత్యువువంటి వారలు. తమ రాష్ట్ర విశేషములను, క్షేమములను తెలుపుదురుగాక ! మాభటుల పరముగాఁ దమకు చెల్లించవలసిన సుంకమును, యథాశక్తి బంపుకొన్నాను. స్వీకరించి జాబు వ్రాయింప ప్రార్థితులు.

ఇట్లు, విన్నవించు మీ సామంతరాజు

శూరపాలుఁడు"

(అని మంత్రి లేఖను చదివి, వ్రాతబల్లమీద నునిచి యాజ్ఞకొఱకు నిరీక్షించుచుండును.)

చారులు—[ప్రవేశించి] మహారాజాధిరాజా ! జయము జయము. ఏలినవారి వద్దకు మా రాజుగారు ద్రోహులగు వీరలఁ బుత్తెంచినారు. (అని యొకమూల నిలువంబడుదురు).

రాజన—సుబుద్ధీ ! శూరసేనునకుఁ ద్రోహులు చేరిరనియు, సుంకమును గ్రహించితిమనియుఁ, గానుకలను బీదలకు వినియోగింతు మనియు, నన్నపాచార్యుని బంపుట కిపుఁ డదనుగాదనియు, నెల్లరు క్షేమమనియు వ్రాయించి పంపుము.

సుబు—చిత్తము, (కమ్మ లిఖించి రాజువద్దనుంచును. రాజు ముద్రవైచును. మంత్రి చారులకిచ్చును. వారలు లేఖనందుకొని వంగి నమస్కరించి వెళ్ళుదురు. రాజ ద్రోహులు కారాగారములకు గొంపోబడుదురు.)

రాజన—సుబుద్ధీ ! ఎచ్చటచూచినను రాజద్రోహులు, కుకవులు, దుర్విమర్శకులు ప్రబలుచున్నారు. లాక్షణికముగఁ గవితామతల్లిని పెంపొందించు సుకవులు మన నన్నపాచార్యులు, నారాయణభట్టుగాఁ గలవారుతప్ప మఱియొకరు లేరైరి. పరదేశభాషలను మాతృభాషలుగ నభ్యసించుచున్నారు. ఇందులకు మన రాజ్యమే కారణమా ? లేక పరదేశాభిలాషయే కారణమా ?

సుబు—మహారాజా! తమరు దలఁచినటుల పరదేశాభిలాష కారణముఁగాదు. ఇప్పటికాలపు యువకులు స్వాతంత్ర్యవాదులగుటంజేసి సర్వవిషయములందును దుర్విమర్శలు వెలువడుచున్నవి. దుష్కవిత ప్రబలుచున్నది. స్వాతంత్ర్యగీతము లనుపేరిట పామరజనులను మోసగించుచున్నారు. ప్రణయగీతము లను నెపమునఁ బ్రళయవాదు లగుచున్నారు. ఇట్టివారినెల్లర నిరోధింపమేని, మునుముందు మన యాంధ్ర వ్యక్తిత్వము రూపుమాయు ననుటకు సందియములేదు. కావునఁ దమరిప్పట్టున రాజ శాసనమును ప్రయోగించుట లగ్గు.

రాజ—నీయాలోచనము కడుచక్కఁగా నున్నయది. రాజున కుండవలసిన దండనీతిలక్షణములు లేనిచో రాష్ట్రము సమూలముగా నశించునన్న నీతియుఁ గఱపుచుంటివి. కావున శిరసావహించెదను. సుబుద్ధియగు మంత్రిసత్తముఁడు రాష్ట్రశ్రేయమున కనుకూలము లగు నీతులను శాస్త్రవిరుద్ధముఁగానట్టి వానిని బోధించనపుఁడే, విననిరాజు, రాజ్యముతోఁబాటు నస్తంగతుఁడగును. నీవు సుబుద్ధివి; మంత్రి వర్యుఁడవును. బుద్ధిని బృహస్పతివంటివాఁడవు—మనయాస్థానకవిసింహుఁడింత వఱకును కొలువున కేతెంచని కారణ మేమైయుండును ? విచారించితివా ? వారులేని

కొంత కొంతగానే యున్నది. వారినిఁగూడ విచారించి రాజశాసనము ప్రయోగింతము.

(ఇంతలో నన్నయభట్టు ప్రవేశించును. రాజు మొదలగు వారెల్లరు లేచి నమస్కరింతురు. ఉచితాసనముపైఁ గవిశేఖరుఁడాసీనుఁడగును. అందరు నాసీనులగుదురు)

రాజు:—పండితవర్యా! నేఁడేలనో సభ కాలస్యముగ వచ్చితిరి. కారణ మరయ వచ్చునా?

నన్నయభట్టు:—రాజా! నేఁడు, నేను సభకాలస్యముగ వచ్చుటకుఁ దగినన్ని కారణములు లేకపోలేదు. వానిని వినిపించెదను. చిత్తగింపుఁడు. మామూలు వేళకుఁ గొలువుకూటమున కేతెంచుచున్న నాకుఁ బలువురు వ్యక్తులు మార్గమునఁ గన్పడి, నమస్కరించి, 'నన్నపాచార్యవర్యా! తమతో వాదింపవచ్చితిమి. అనుజ్ఞ దయసేయుఁ'డనుచు నామార్గమును నిరోధించిరి. సామమున నెంతఁ జెప్పినను వినరైరి. సాయంతనము రమ్మంటిని. కాదనిరి. అప్పుడే వాదసమరమునకుఁ గడంగవలె ననిరి. విధిలేక వల్లె యంటిని. తమ రెండవ మంత్రి విద్యానాథుని నుభయకక్షులవార మెన్నుకొని వారి స్వగృహమున వాదమునకుఁ గడంగితిమి. వరుస క్రమమున నా పలువురు యువకులు జయింపలేక ముఖములఁ దేలవైచిరి. జోహారులిడిరి. విద్యావాద సమరమున నెవరోఁడిన, నోఁడినవారు జయించిన వారి కేనూరు రూప్యము లొసంగునట్లును, నిఁక ముందిట్లు వాదములకుఁ గడంగకుండునట్లుగను, జయించిన వారి యాజ్ఞలను శిరసావహించునట్లుగ నొడంబడికఁ జేసుకొంటిమి. ఆ యొడంబడిక ప్రకారము విద్యావాద సమర విజయలక్ష్మి నన్ను వరించుటంబట్టి, వారు మదను చరులై వర్తింపవలసియున్నను, నవ్విధమున నడచుట కొప్పక తగవులాటఁ బెట్టిరి. విద్యానాథమంత్రి వర్యు లీ విషయములఁ బరిష్కరించుటకుఁ దమవద్దకు మమ్మెల్లర బంపినాఁడు. కావున తమకుచితమని తోఁచినరీతి వారితో సంప్రదించి, యీ యభియోగమును పరిష్కరింతురని నమ్ముచున్నాను. వారదే రక్షక భటసమూహ మధ్యమున నిలువంబడి యున్నారు. (అని వ్రేలితోఁ జూపును.)

రాజు:—(తనలో) అక్కటా! నేఁడెట్టి చెడ్డకాలమో గాని, రాజద్రోహులతో బాటు కవితాద్వేషులును ప్రబలియున్నారు. వారిని తగురీతి శిక్షింపవలయును. (ప్రకాశముగ) నా యిచ్చవచ్చినట్లు తమరు నడచుట కభ్యంతరము చెప్పరుకదా?

నన్న:—ఎన్నఁడైనఁ దమయానతి కడ్డు తగిలితినే?

రాజు:—మంచిది. (సేవకులదిక్కు మొగంబై) వారల నిటకుఁ దోడ్తెచ్చి యుచితాసనములపై నలంకరింపఁ జేయుఁడు.

(సేవకులట్లు చేయుదురు. నూతనులు రాజునకు నమస్కరించిన వారలై యుచితాసనము లలంకరింతురు.)

సుబు—(నూతనులంగాంచి) ఆర్యులార! తమ కలహకారణమును రాజేంద్రులు వినఁదలఁచుచున్నారు. వివరముగఁ దెలుపుఁడు.

నూతనకవి—చిత్తము మహారాజా! ఇంతకుఁబూర్వమే తమతో నన్నపాధ్యాయు లన్నివిషయములను విన్నవించిరి. మే మోడితిమని వా రనుచున్నారు. మా వాదముప్రకారము పణ మొడ్డవలసినపనిలేదు. వారివాదము ద్రావిడచాంద్రాయణ ముగ్గనున్నయది. తమరును విచారింపవచ్చును.

రాజు—నూతనకవీ! మీ వాద మేశాస్త్రము ననుసరించి యుండును?

నూ. కవి—మావాదము మాబుద్ధికుశలతా శాస్త్రము ననుసరించి యుండును.

రాజు—శాస్త్రపరిచయవాక్యము లవసరములేదా?

నూ. కవి—శాస్త్రవాక్యముల నుదహరించుచు వాదించుట వెఱ్ఱితనమని మావాదము. భగవంతునిచేఁ గల్పింపఁబడిన యీ ప్రకృతియం దెన్నియో ప్రత్యక్ష నిదర్శనములుండ, శాస్త్రములజోలికిం బోవుట బుద్ధిజాడ్య జనితోన్మాదముగాదా?

రాజు—భగవంతునిచేఁ గల్పింపఁబడిన ప్రకృతి మయప్రపంచమే మీకు శరణ్యమై, యదియే ప్రమాణమైన మన కన్నులకుఁ గోచరింపని సూక్ష్మరహస్యము లబద్ధములే యగునా? అట్టిపట్ల ప్రకృతిరహస్యములును వాలుశక్కియే యగుననవల యునుగదా! ఏభగవంతునిచే నీ ప్రకృతిమయప్రపంచము సృజింపఁబడినదో యట్టి భగవంతునిచేతనే సృజింపఁబడిన శాస్త్రముల నేల నమ్మరు? ఇట్టులాచరించుట వంచన కాదా?

నూ. కవి—వంచన కానేరదు. శాస్త్రములు భగవంతునిచే సృజింపఁ బడినవని చెప్పుచు బ్రతుకుచుండెడి మానవులచే కల్పింపఁబడినవని మా విశ్వాసము. ప్రకృతియే మా భావకవులకు శరణ్యము. అదియే ప్రత్యక్షప్రమాణము. దృష్టికిఁ గోచరింపని విషయములు త్యాజ్యములనియే మా మతము. కాని యొక్కొక్కప్పుడు ప్రకృతిలోఁగల రహస్యములు బయలువడినపుఁడు నమ్మవలసిన కారణముండుటచే నమ్ముచుందుము.

రాజు—మీ మతప్రకారము కంటికిఁ గానుపించిన వస్తువులే నిజమై, కానుపింపని వబద్ధములైన నిచ్చోఁ జూచిన వన్నియు నిప్పుడు నిజములై వెలుపలకు

వెళ్ళగనే యబద్ధములగును. ఈ తత్త్వ సిద్ధాంతప్రకారము తల్లిదండ్రులు, భార్యా పుత్రులు, రాజ్యములు, పాలకులు, పాలితులుఁగాఁగల వారల నెల్లరిఁద్రోసిరా జన వచ్చును. వారి చరిత్ర, గానములు మృషాలాపము లనవలసివచ్చును. అంతియేనా?

నూ. కవి—ఈ విషయముల నబద్ధము లనము. మాతృపితలు లేనిచో జన్మములు లేకయే యుండును.

రాజ—పునర్జన్మాదికముల నొప్పుకొంటిరిగదా! అట్టిపట్ల యదృశ్యములను నిజము లని యేల యొప్పుకొనరాదు?

నూ. కవి—మేము పునర్జన్మము నొప్పుకొనుటలేదు. భార్యాభర్తల సంబంధముచేఁ గలిగిన శుక్లశోణితమిశ్రరూపకమైన యండ మేర్పడి, తద్ద్వారా యిప్పటి యీ రూపము లేర్పడి, జన్మమై, శరీరమున నన్ని యింద్రియములుఁ జక్కఁగాఁ బనిసేయు వఱకు నాహార, నిద్రా, భోగముల ననుభవించి శక్తిసత్త్వములు తగ్గిన వెంటనే, ప్రాణవాయువున లీనమగుననియుఁ గర్మసూత్రములు లేవనియు మా సిద్ధాంతము.

రాజ—కర్మమును మీ రంగీకరింపని పక్షమునఁ బునర్జన్మము నంగీకరించుటయులేదు. జన్మమునెత్తుట నెట్టిదియో, మరణము నొందుటయు నట్టిదియ. జనన మరణ రహస్యముల నంగీకరింపుచో మానవ ప్రకృతియందుఁ గలిగెడి పరిణామముల నంగీకరించి తీరవలయును. మానవ ప్రకృతి పరిణామ సూత్రముల నంగీకరింపనిచో మీసిద్ధాన్తసూత్రములు స్వార్థము లనిభావింపవలసి వచ్చును. మానవులలోఁ గొందఱు మంచివారుగ జన్మించుటకును, మఱికొందరు వికలాంగులుగ జన్మించుటకును సంబంధము కలదా?

నూ. కవి—మానవ ప్రకృతి పరిణామముల నొప్పుకొందుము. భార్యాభర్తల సంయోగకాల సంకల్ప బలాబలముల ననుసరించి, శిశువులు మంచివారుగను, వికలాంగులుగను జన్మింతురు.

రాజ—భార్యాభర్తల సంయోగ సంకల్ప విశేషముల ననుసరించి వ్యక్తులు జన్మించుచోఁ బశ్వాదులందుఁ గానుపించెడి పరిణామముల కేమనియెదవు? వాటి కేసంకల్పములు కలవు?

నూ. కవి—పశ్వాదులకు మనస్సంకల్పములు లేవు. దృష్టిగోచర వస్తువులపై మన సుంచిన, నట్టి వస్తు స్వరూపములుగనే జన్మించును.

రాజ—మానవులను పశువులు సంయోగకాలమునఁ జూచిన, జన్మించెడి పశువులకు మారుగ, మానవ స్వరూపములే జన్మించవలయును కదా! అట్టిది కలుగుటకు మాఱుగ సహజ పశుత్వ జన్మములు సిద్ధించుటేల?

నూ. కవి—[సమాధానములేదు, రిచ్చవడును]

రాజ—ఇప్పటికిఁ గర్మసూత్రమును బలవంతముగనైనను సరియే యొప్పుకొన్నట్లైనది. ఇఁక సారస్వత చర్చలఁ గావింతము. (నన్నయభట్టు దిక్కై) ఆచార్యా! సారస్వతమునఁ బ్రశ్నింతునా ?

నన్న:—మంచిది.

(ఇంతలోఁ దౌవారికుఁడు ప్రవేశించును)

దౌవారికుఁడు:—జయము జయము మహారాజా! ఏలినవారి ద్వితీయ మంత్రిపుంగవులు విద్యానాథులు విజయము చేయుచున్నారు.

రాజ:—సత్వరముగఁ బ్రవేశపెట్టుము.

దౌ:—చిత్తము. (నిష్క్రమించును)

(విద్యానాథుఁడు ప్రవేశించును. సభ్యులు హర్షధ్వానములు సేయుదురు. రాజు ప్రత్యుత్థానము సేయఁగ నుచితాసనముపై నాసీనుఁడగును.)

విద్యానాథుఁడు:—నేటి దినమునఁ గొల్వుకూటమానందప్రదముగ నున్నయది. రాజకంఠీరవు లిట్టి యానందమును కల్పించిన హేతువు నరయవచ్చునా ?

సుబు—(చిఱునగవుతో) నీకుఁ దెలిసిన యంశమేగదా! అందున తమరధ్యక్షులును.

విద్యా—(ఆలోచించి) మఱచితిని. ఈనాఁడునన్నపాచార్యులచే మన యాంధ్ర సామ్రాజ్యాధీశ్వరులు వ్రాయించిన యాంధ్రమహాభారత కృతి సమర్పణోత్సవమని, తత్సభ కధ్యక్షుఁడ నేనని ప్రభువుల వారు ప్రకటించిన పత్రమును చూచుకొనియు నింతలో నీవిషయమును మఱచుటంజూడ, యీనాఁటి దుర్వాదమే హేతువని భావించెదను. హరి హరీ! ఎచ్చటనుండి యీ నూతనకవులు వచ్చిరోగాని, తలకుఁ దిమ్ముగలుగునటుల శూన్యపాండిత్య ప్రకర్షను ప్రకటించిరి. అట్టి దుండగీండ్రను శిక్షింపకున్న భాషామతల్లి కంట నీర్వెట్టకపోదు. ఆంధ్రవాణీమతల్లి కన్నీటి బిందువులు వజ్రసమానములు. ఆ వజ్రములు విజృంభించెనా, యాంధ్రసామ్రాజ్యమును నొక్కుమ్మడిగ సంక్షోభింపఁజేయును. దేశశాంతికైనను నట్టివారిని శిక్షాపూర్వకముగ మందలించుట కర్తవ్యము. (స్మృతినభినయించి, రాజుదిక్కై) మహారాజా! ప్రస్తుత కర్తవ్యమును మఱచిన యీమంద భాగ్యుని ప్రామాదికమును మన్నింపఁ గోరుచున్నాను. (సభనుకలయఁజూచి) నూతన కవులఁగాంచి, ఆశ్చర్యముతో దనలో) అచ్చటను వీరే ప్రత్యక్షము! ఇచ్చటను వీరే ప్రత్యక్షము! ఎచ్చటకు వెళ్ళినను వీరి బాధలు తప్పునట్లు లేవే!

రాజ—విద్యానాథా! మన్నించుట కిందు దోసమేమున్నది? నీ వేనూతన కవులతో వాదించితివో యిచ్చటకును వారేవచ్చిరి. ఇచ్చటఁ గొంతసేపు కర్మసిద్ధాంతవాదము గావింపఁబడినది. హేతువాదము వారి మతసిద్ధాంతము. సారస్వతచర్చలఁ గావింపఁ బ్రారంభింపనున్న సమయమున నీవు వచ్చితివి.

విద్యా—మహారాజా! మీరే వారితో వాదించితిరా?

రాజ—అవును.

విద్యా—తీర్పునిచ్చితిరా?

రాజ—ఇంతవఱకు నివ్వలేదు. చివరతీర్పు నాదే యై యుండును. భారతకృతి సమర్పణోత్సవాంతమున నట్టి తీర్పుఁజెప్పెదను. ప్రకృతము సారస్వతవివాదముఁ గావింపనుంటిని.

విద్యా—వలదు; వలదు. కృతి సమర్పణోత్సవమునకు నిర్ణయింపఁబడిన సుముహూర్త సమయ మాసన్న మగుచున్నది. ముందుగఁ భారతకృతినిఁగ్రహించి, యాపైని చర్చలు ప్రారంభింపుఁడు. ఇట్టు లొనర్చుట లగ్గు.

సుబు—ఎవఁడు అక్కఁడ?

సేవకుఁడు—(ప్రవేశించి) చిత్తము మహాప్రభూ!

సుబు—బ్రాహ్మణులు యుత్సవమున కేఁగిరి. సుముహూర్తకాలము చేరువనున్నది. నీవేఁగి యూరేగింపుటుత్సవమును శీఘ్రముగ సభకుఁ దోడ్కొనిరమ్మని తడయకఁబొమ్ము.

సేవ—మహాప్రభూ! ఈపాటికి భారతోత్సవమును ముగించి సభకు వచ్చుచునేయుందురు. అల్లదే వచ్చుచున్నారు.

(బ్రాహ్మణులు మహాభారతమును పల్లకియం దునిచి, వారి భుజములపై నుంచుకొని, మోయుచు మంగళ వాద్యములతో సభఁ బ్రవేశింతురు. అందరు నిలువంబడుదురు. పల్లకిని దించి, భారతమును బంగారు సింహాసనముపై నుంపఁగ, బ్రాహ్మణుఁడొక్కఁడు షోడశోపచారములచేఁ బూజించును. విప్రుల వేదగానములు చెలఁగును. అందరు నాసీనులగుదురు.

బ్రాహ్మణుఁడు—మహారాజా! మహాభారత పూజాదికములు పూర్తియైనవి. అవశిష్ట కార్యకలాపము పూర్తిజేయవచ్చును.

విద్యా—రాజకంఠీరవా! ఇఁకఁ జాగుసేయక, కృతినిఁ గ్రహింపఁ గోరుచున్నాను. ఆచార్యా! జాగుయేల?—కానిండు.

నన్న—(సంతోషముతో లేచి, నిలువంబడి, యందరి నుద్దేశించి,) మహా

రాజాది సభ్యులారా! ఈ దినము నాపట్ల చాలా సుదినమని భావించు చున్నాను. వాల్మీకి మహర్షి, యాదిలో నాది కావ్యమని పేరువడసిన శ్రీమద్రామాయణమును రచించి ధన్యుఁడైనటుల, తెలుగు బాసలో నాదికావ్యమని పేరు వడయునటుల యాంధ్రమహాభారతమును శ్రీ శ్రీ శ్రీ రాజకంఠీర వేత్యాది బిరుదవిరాజమానులగు శ్రీరాజరాజనరేంద్రవరరాజ్యాధీశ్వరుల పోషక సహాయమున రచించి, కృతజ్ఞతా పూర్వకముగ నుభయ వంశములుఁ దరింప వలె నను భావమున భారత కృతికన్యను శ్రీవారికే నిచ్చి ధన్యుఁడనగు చున్నాను. ఇఁకఁ గర్తవ్యమనుసరించెదను. (అని కూర్చొనును. సభలోఁ గరతాళధ్వనులు.)

సుబు—[రక్షకభటుల నుద్దేశించి] సభయందు నిశ్శబ్దతఁ గావింపుఁడు.

రక్షకభటులు [పోలీసులు]—చిత్తము. [అట్టి ప్రయత్నమున నుందురు.]

రాజ—[నూతన కవుల నుద్దేశించి] ఆర్యులార! కృతి సమర్పణోత్సవము పూర్తికాఁగనే సారస్వత చర్చలఁ గావింతము. దయయుంచి యోపిక పట్ట మదీయ ప్రార్థనము.

నూ. కవులు—జరుగ నుండెడిది సంతసింపఁదగినట్టి మహోత్కృష్ట కార్యము. మేమును చూచి, విని, యానందింపఁదగిన వారమే కదా!

నన్నయభట్టు— మంగళశ్లోకము.

శ్రీవాణీగిరిజాశ్చిరాయదధతో వక్షోముఖాంగేషు యే
లోకానాం స్థితి మావహం త్యవిహతాం స్త్రీ పుంసయోగోద్భవామ్,
తే వేదత్రయ మూర్తయ స్త్రీ పురుషాస్సంపూజితా వస్సురై
ర్భూయాసుః పురుషోత్తమాంబుజభవ శ్రీకంధరా శ్శ్రేయసే.

విద్యా—ఆచార్యపుంగవా! ఆంధ్ర మహాభారతమున మంగళ ప్రదముగ పద్యము వ్రాయక, సంస్కృత శ్లోకమును వ్రాసితిరి. కారణమును వినవచ్చునా?

నన్న—అభ్యంతరమేమి? సమస్తమైన భాషలకు సంస్కృతము తల్లిభాష. అందున యాంధ్రమునకు సమీపమైనట్టిది. సంస్కృతాంధ్రముల కవినాభావ సంబంధము. మనము దైనందిన వ్యవహారములందు మాటలాడుకొను వ్యావహారిక భాషయందె దనేక సంస్కృతపదములు కలవు. వ్యావహారికమునందే సంస్కృతపదములు కుప్ప తిప్పలుగనుండ, గ్రాంథికభాషయందు సంస్కృతపదములు విశేషములుగ నుండకతప్పదు. ఇట్టి భావముతోఁడనే "ఆంధ్రశబ్ద చింతామణి" యను వ్యాకరణ గ్రంథమును వ్రాసితిని. దాని నిదివఱకే తామెల్లరు వినియే యున్నారు. లోకమున ప్రాచుర్యము వహించియు నున్నది. సంస్కృతాంధ్రముల కవినాభావసంబంధ

ముండుటంబట్టియే మంగళప్రదముగ, మంగళప్రదమైన మంగళశ్లోకమును వ్రాసితిని. కాళిదాసకవి సార్వభౌముఁడు, తన రఘువంశకావ్యమున,

"వాగర్థావివసంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే,
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ."

అని నుడివినాఁడు. వాక్కునకు, భావకు, దేవతకు నవినాభావ సంబంధ మెట్టిదియో సంస్కృతాంధ్రములకు నవి నాభావ సంబంధ మట్టిదయ.

విద్యా—సమాధానము తృప్తికరముగ నున్నయది. ఇఁక గానిండు.

నన్నపా—"అని సకల భువనరక్షణ ప్రభువులై ......"

ఉ॥ రాజకులైక భూషణుఁడు రాజమనోహరుఁ డన్యరాజ తే
జోజయశాలి శౌర్యుఁడు విశుద్ధ యశశ్శరదిందు చంద్రికా
రాజిత సర్వలోకుఁ డపరాజితభూరి భుజాకృపాణ ధా
రాజల శాంతశాత్రవ పరాగుఁడు రాజమహేంద్రుఁ డున్నతిన్.

* * * *

చ॥ ఘన దురితానుబంధ కలికాలజదోష తుషారసంహతిం
దన యుదయప్రభావమున దవ్వుగఁ ద్రోచి జగజ్జనాను రం
జనమగు రాజ్యసంతత వసంతనితాంత విభూతి నెంతయుం
దనరు చళుక్య మన్మథుఁడు ధర్మదయార్ద్ర నిబద్ధబుద్ధియై.

ఉ॥ ఆశ్రిత పోషణంబున ననంత విలాసమునన్ మనీషి వి
ద్యాశ్రమ తత్త్వవిత్తమున దానగుణాభిరతిన్ సమస్త వ
ర్ణాశ్రమ ధర్మరక్షణ మహామహిమన్ మహినొప్పు సర్వలో
కాశ్రయుఁ డాదిరాజవిభు డత్యకలంకచరిత్ర సంపదన్.

సీ॥ నిజ మహీమండల ప్రజఁ బ్రీతిఁ బెంచుచుఁ, బరమండలంబుల ధరణిపతుల
నదిమికప్పంబుల ముదముతో గొనుచును, బలిమి నీయని భూమివలయపతుల
నుక్కడఁగించుచు దిక్కులఁ దనయాజ్ఞ, వెలిఁగించుచును విప్రకులము నెల్ల
బోషించుచు శరణన్నఁ గాచుచు భీతుల నగ్రజన్మలకు ననుగ్రహమునఁ

ఆ॥ జారుతర మహాగ్రహారంబు లిచ్చుచు, దేవభోగముల మహావిభూతి
దనరఁ జేయు చిట్లు మనుమార్గుఁ డగు విష్ణు, వర్ధనుండు వంశవర్ధనుండు."

[సభలోఁ గరతాళధ్వనులు జై! మహారాజులవారికి జై! జై! నన్నయాచార్యులకు జై! జై! ఆంధ్రభారతికి జై! యను ధ్వనులు.]

రాజు—ఆచార్యవర్య! బ్రాహ్మణుల కగ్రహారము లిచ్చితి నని వ్రాసితిరి.

భవిష్యత్కాల విమర్శకులు, రాజు నన్నయ్యభట్టున కగ్రహారము లిచ్చి గొప్పగ పొగడించుకొని నాడని తూర్పారబట్టుదురేమో గదా!

నన్న—మహారాజా! మీ కాసంశయము వలదు. రానున్న కాలపు విమర్శకులు విమర్శింతురని భయపడిన మీరిచ్చిన యగ్రహారము లేమగును? భూదాన మొనరించిన పుణ్యమేమగును? పుణ్యలోకగతు లే మగును? మానవుల కన్నులకుఁ గంతలు కట్టిన భగవంతుని కన్నులకు గంతలు కట్టఁగలమా? సర్వసాక్షియైన మానవుల చెయ్దములను పరికించుట లేదా? నేనిటుల వ్రాసుకొనకున్నచోఁ గృతఘ్నుఁడ నగుదును. తాము బుద్ధిపూర్వకముగఁ గాకున్నను, లోకుల వలని భయముచేనైన నన్నుఁ గృతఘ్ననిగఁ జేయనెంచితిరా? అట్టి సాహసమును విడువుఁడు. నన్ను మన్నింపుఁడు.

విద్యా—మహారాజా! తామెన్నడో విమర్శింతురని భయపడుటేల? ఎన్నడో రానున్న దుర్విమర్శములు యిక్కాలమున, నిందే గొనసాగుచుండుట మీ రెఱింగిన యంశములేగదా! గురువర్యా! కింకర్తవ్యతా మూఢత్వమును పాలించు చుంటిరా?

నన్న—లేదు "అఖిల జలధి వేలావలయ వలయిత వసుమతీవనితా విభూషణంబైన వేఁగి దేశంబునకు నాయకరత్నంబునుం బోని రాజమహేంద్ర పురంబునందు మహేంద్రమహిమతోఁ బరమానందంబున ననవరత మహామహీ రాజ్య సుఖంబుల ననుభవించుచు సకల భువనలక్ష్మీ విలాస నివాసంబైన రమ్యహర్మ్యతలబున—విద్యావిలాసగోష్ఠి సుఖోప విష్టుండయి యిష్టకథా వినోదంబులనుండి యొక్కనాఁడు.

సీ॥ తన కులబ్రాహ్మణు ననురక్తు నవిరళ జపహోమ తత్పరు విపులశబ్ద
శాసను సంహితాభ్యాసు బ్రహ్మాండాది, నానాపురాణ విజ్ఞాన నిరతుఁ
బాత్రు నాపస్తంబ సూత్రుముద్గలగోత్రు, జాతు సద్వినుతావదాతచరితు
లోకజ్ఞు నుభయభాషా కావ్యరచనాభి, శోభితు సత్ప్రతిభాభియోగ్యు
ఆ॥ నిత్యసత్యవచను మత్యమరాధిపా, చార్యు సుజను నన్నపార్యుఁజూచి
పరమ ధర్మవిదుఁడు వరచళుక్యాన్వయా,భరణుఁ డిట్టులనియెఁ గరుణతోడ.

నూ. కవి—[త్వరగ] ఆచార్య! ఆగుమాగుము. ఏది? మరియొకసా రిపుఁడు చదివిన పద్యమును చదువుఁడు?

నన్న—[తన కుల బ్రాహ్మణు ననురక్తు' యనునది మరల చదువును]

నూ. కవి—సెబాస్! నన్నయభట్టుగారీ పద్యమునఁ భట్టుమూర్తివలెనే పొగడుకొనినారు. విపులశబ్ద శాసనుఁడట. నానాపురాణ విజ్ఞాన నిరతుఁడటఁ లోకజ్ఞుఁడట. ఉభయభాషా కావ్య రచనాభియోగ్యుఁడట. మత్యమరాధిపాచార్యుఁ

డఁట. బళీ! బాగుబాగు, తమకుఁదామే సర్వజ్ఞ చక్రవర్తుల మని ప్రకటించుకొనిన లోకము గ్రుడ్డితనముగ నమ్మునా? ఆచార్యులుగారు! ఇందు మీయభిప్రాయమేమి?

విద్యా—మహారాజా! వింటిరా? యీ నూతన కవుల ప్రగల్భవచనములు: [నూతన కవుల నుద్దేశించి] నూతన కవులారా! తామిప్పు డిట్టి వ్యక్తిత్వ విమర్శనమునకుఁ బూనుకొనుటలో సమయమునైనను గుర్తించినట్లు తోఁపదు. పలువురిలో నడిగితిరి కావున వారికి మారుగ మీ ప్రశ్నముల కుత్తర మిచ్చుచున్నాను. నన్నయభట్టుగారు శ్రీ మహారాజులవారి కనాది సాంప్రదాయముగ వచ్చుచున్న పురోహిత బ్రాహ్మణుఁడు. వారు వ్రాసికొనినటుల, బహుళతరంబులగు శబ్దముల శాసించినవాఁడు. దానం జేసియే యాంధ్రశబ్దచింతామణి రచనమును పురస్కరించుకొని శ్రీ యాంధ్రమహాసామ్రాజ్య సార్వభౌములు, దర్బారు సేయించి పలువురి విద్వన్మహాశయుల సమక్షమున "వాగనుశాసనుఁ"డను బిరుదమును ప్రసాదించిరి. ఆయంశమును లిఖితపూర్వకముగ శిలలపై జెక్కించి ప్రతిష్ఠించిరి. ఈ విషయము నింతకుఁ బూర్వమే లోకము గొండాడియున్నది. ఇఁక మత్యమరాధిపాచార్యుఁ డనుటలో నావంతయుఁ బునరుక్తిదోష మాపాదిల్లదు. అనేక పండితులచేఁ గొనియాడఁబడి, వాగనుశాసనుఁడై, వేదశాస్త్రముల సమగ్రముగ నభ్యసించి, కర్మశూరుఁడై, బృహస్పతినిఁ ధిక్కరించువట్ల మత్యమరాధిపాచార్యుఁ డని వ్రాసికొనుటకుఁ దగఁడా! కుక్షింభరులే పెద్దపెద్ద బిరుదములను తగిలించుకొని పామరులను, విశ్లేషించి యస్మదాదులను మోసగించుచున్నప్పుఁ డిసుమంతయు మోసములేక, నిత్యసత్యవచనుడై విరాజిల్లుచున్న నన్నపాచార్యులు లోకజ్ఞుఁడు నగును. ఉభయభాషా కావ్యరచనా సమర్థుఁడునగును. మత్యమరాధిపాచార్యుఁడు నగును. విపులశబ్దశాసనుఁడు నగును. వలయుచో వారి శబ్దచింతామణిఁ బరిశీలింపవచ్చును; దోసములఁ జూపింపఁవచ్చును. అంతియేగాని, వ్యక్తిత్వవిమర్శనమునకుఁ దిగవలదని సవినయముగఁ జెప్పుచున్నారము. సంశయములున్నఁ దరువాత ప్రశ్నింపుఁడు.

[సభలో జై! విద్యానాథ మంత్రివర్యులకు జై! జై! మహాకవిపుంగవునకు జై! మహారాజునకు జై! అను ధ్వనులు]

నూ. కవి—(మస్తకమాడింతురు. గుటకలు మ్రింగుదురు.)

నన్న—నాపైఁగల యభిమానము పెంపున విద్యానాథులు సమాధానమిచ్చుటలోఁ బ్రత్యర్థులు చేతగానివాఁడ నని భావింతురేమో! కృతిసమర్పణాంతమునఁ బ్రత్యర్థులకు, లోకమునకుఁ బ్రతిజ్ఞాపూర్వకముగ బుద్ధిఁ జెప్పగలను. ఇట్టి యుద్ధ మాటలచే వక్తవ్యాంశమును విస్మరింపవలసి వచ్చుచున్నది. తరువాతను,

"పరమధర్మవిదుఁడు వరచళుక్యాన్వయా భరణుఁడిట్టులనియెఁ గరుణతోడ."

*　　　*　　　*　　　*

"వ......నాకు ననవరతంబును శ్రీమహాభారతంబునందలి యభిప్రాయంబు విన నభిలాష పెద్దయై యుండు.

మ॥ ఇవియేనుఁ సతతంబు నామెడఁ గరంబిష్టంబులై యుండుఁ బా
యవు భూదేవకులాభితర్పణ మహీయః ప్రీతియుఁ భారత
శ్రవణాసక్తియుఁ బార్వతీపతి పదాబ్జధ్యాన పూజామహో
త్సవముఁ సంతతదానశీలతయు శశ్వత్సాధుసాంగత్యముఁ.

వ. మఱి యదియు గాక.

చ॥ హిమకరుఁదొట్టి పూరుభరతేశ కురుప్రభుపాండుభూపతుల్
క్రమమున వంశకర్తలనఁగా మహినొప్పిన యస్మదీయ వం
శమునఁ బ్రసిద్ధులై విమల సద్గుణశోభితులైన పాండవో
త్తములచరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్టమెంతయుఁ.

*　　　*　　　*　　　*

వ. అని యానతిచ్చిన యక్కవివరుం డిట్లనియె.

*　　　*　　　*　　　*

వ....దేవా నీయనుమతంబున విద్వజ్జనంబుల యనుగ్రహంబునంజేసి నానేర్చు విధంబున నక్కావ్యంబు రచియించెద.

*　　　*　　　*　　　*

ఉ॥ పాయక పాకశాసనికి భారత ఘోరరణంబునందు నా
రాయణునట్లు దానును ధరామర వంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుఁడుం దనకిష్టుఁడుఁ సహా
ధ్యాయుఁడునైన వాఁ డభిమతంబుగఁ దోడయి నిర్వహింపఁగఁ.

విద్యా—ఆచార్య! కార్యములతొందరలచే మఱచితిమి. నారాయణభట్టు యిందుఁగానుపింపఁడేమి?

నన్న—విద్యానాథా! నారాయణభట్టు యుత్కలదేశమునఁ జెలఁగేగిన కుశ వుల నణఁచి, భాషామతల్లి కూరటఁగల్పింప నేఁగినాఁడు. నా సహాధ్యాయుఁడు గాన మదీయప్రార్థన మంగీకరించియే తరలినాఁడు. ఆతఁడు వెళ్ళినతరువాత యీకావ్యము కల్పింపఁబడినది.

విద్యా—నారాయణభట్టు యీ భారతరచనా సందర్భములందుఁ దోడ్పడి నటుల లిఖించితిరి. నిజమే యగునా ? శబ్దములను శాసించు నేర్పుకలిగిన మీకును యొరులు సాయపడవలసివచ్చినదా? ఆశ్చర్యము!

నన్న—ఆశ్చర్యము పొందవలసిన పనిలేదు. భగవంతుఁడైన నొకప్పుడొరుల సాయ మపేక్షించియే తీరును. శ్రీరామావతారమును సంస్మరించిన నెట్టి శంకయుఁ దావుండదు. ఎంతటివారికైనను ప్రమాదములు సంభవింపకపోవు. అట్టి ప్రమాద ములనుండి తప్పుకొనుటకే మరియొకరి సాయమవసరము. అట్టి యభిప్రాయము తోఁడనే నారాయణభట్టు సాహాయమునసే యాంధ్రమహాభారతమును నిర్దుష్టముగ రచించుట కవకాశముం దొరకినది.

దౌవారికుఁడు—(పరువెత్తుచువచ్చి నమస్కరించి) ప్రభువులవారి యాజ్ఞకై నారాయభట్టవర్యులు నిరీక్షింపఁబడుచున్నవారు.

రాజు—(సంతసముతో) శీఘ్రముగఁ బ్రవేశపెట్టుము. (నన్నయభట్టుతో) గురుపుంగవా! నారాయణభట్టు నారాయణునివలెనే సాక్షాత్కరించిన ట్లున్నయది సుమా!

నన్న—అటులనే గోచరించు చున్నయది. [నారాయణభట్టు ప్రవేశించి నన్నయభట్టునకు నమస్కరించును. తరువాత రాజాదులు నారాయణభట్టునకు నమ స్కరించి యుచితాసనమున నాశీనుఁ జేయుదురు].

నారా—మహాశయా! ఇట్టి సత్కార్యమున నే నుండఁగూడదనియేనా మీ యభిప్రాయము ?

నన్న—మిత్రమా! క్షమింపుము. నీవుండ తగవని మాయభిప్రాయముకాదు. నీవు వెళ్ళినతరువాతనే యిక్కార్యము సంకల్పింపఁబడినది. అయిన నిక్కార్యముకన్న నీవు వెడలిన కార్య మాచంద్రార్కము నుతికెక్క నట్టిదనియెడి భావముతోఁడనే సమాధానము చెప్పుకొంటిమి. మాపుణ్యము, విశేషించి నా సుకృతము మంచిది గావున నారాయణునివలె సాక్షాత్కరించితివి. నీకుఁ గుశలమా ? నీవు పోయిన కార్యము విజయవంతమయ్యెనా ?

నారా—అంతయు విజయవంతమే. విశేషముల దరువాతఁ జెప్పఁగలను. గ్రంథమును పఠింపుఁడు,

నన్న—మంచిది. (సంతోషముతోఁ పాయకఁ బాకశాసనికి భారత ఘోర రణంబు నందను పద్యమును మఱల చదువును. నారాయణభట్టు మేను మఱచునంతటి సంతసమును వెలిఁబుచ్చును.)



౧౪. శ్రీ వీరభద్ర భద్రకాళీవిశ్వేశ్వరులు.



౧౫. శ్రీమటికె నాగయ్యధర్మనిలయము. సికింద్రాబాదు.



౧౬. సుందరమైన నందీశ్వరుడు.



౧౭. దక్షిణావర్త (కుడిసుడి) శంఖము.



౧౮. శ్రీ మహంతుమఠం చెన్న బసవయ్యగారు.

ఉ॥ సారమతిం గవీంద్రులు ప్రసన్నకథా కలితార్థయుక్తిలో
నారసి మేలు నా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు దెనుంగునన్ మహా
భారత సంహితారచన బంధురుఁడయ్యె జగద్ధితంబుగన్.

* * * * *

సీ॥ ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని, యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని, కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్షణంబనియును, నైతిహాసికు లితిహాసమనియు
బరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చయంబని మహిఁ గొనియాడుచుండ
ఆ. వివిధవేదతత్త్వవేది వేదవ్యాసుఁ డాది ముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై, పరఁగుచుండఁ జేసె భారతంబు.

* * * * *

మ. అమితాఖ్యానకశాఖలం బొలిచి వేదార్థామలచ్ఛాయమై
సుమహావర్గ చతుష్కపుష్పవితతిన్ శోభిల్లి కృష్ణార్జునో
త్తమ నానాగుణకీర్తనార్థ ఫలమై, ద్వైపాయ నోద్యాన జా
త మహాభారత పారిజాత మమరున్ ధాత్రీసురప్రార్థ్యమై.

* * * * *

సీ॥ ఇమ్మహాభారతం బిమ్ములఁ బాయక, విహితావధానులై వినుచునుండు
వారికి విపుల ధర్మారంభ సంసిద్ధియగుఁ బరమార్థంబ యశ్రమమున
వేదముల్ నాలుగు నాదిపురాణముల్, పదునెనిమిదియుఁ-దత్ప్రమితధర్మ
శాస్త్రంబులును మోక్షశాస్త్ర తత్త్వంబులు, నెఱిఁగిన ఫలమగు నెల్లఁ బ్రొద్దు
ఆ॥ దానములను బహువిధ క్రతుహుత జప,బ్రహ్మచర్యములను బడయఁబడిన
పుణ్యఫలము వడయఁ బోలు నశేష పాపక్షయంబునగు శుభంబు వెరుఁగు.

ఉ॥ సాత్యవతేయ విష్ణుపద సంభవమై విబుధేశ్వరాబ్ధి సం
గత్యుపశోభితంబయి జగద్విదితంబగు భారతీయ భా
రత్యమరాపగాఘము నిరంతరసంతత పుణ్యసంపదు
న్నత్యభివృద్ధి సేయు వినినం గొనియాఁడిన నెల్లవారికిన్.

మహారాజా ! ఇంతవఱకుఁ బ్రస్తావనయు, భవదీయ వంశాభివర్ణన ప్రసక్తియు జరిగినవి. ఆశ్వాసాంత మందలి భవదీయ నామకీర్తనముఁ గావించి గ్రంథపఠనమును ముగించెదను.

"ఉ. రాజకులాగ్రిగణ్య మృగ రాజపరాక్రమ రాజరాజ వి
భ్రాజిత శుభ్రకీర్తి పరిపాండుర సర్వ దిగంతరాళ ఘో
రాజిముఖోప లబ్ధవిజయ ప్రమదాశ్రిత బాహుదండ ని
ర్జిత వైరివీర కులదీప మృడప్రియ విష్ణువర్ధనా.

క॥ ఆదిక్షత్రి చరిత్రి ధ,రాదేవాశీః పరంపరావర్ధిత ని
త్యోదయ సత్యోదిత విమ,లాదిత్య తనూజ విక్రమాదిత్యనిభా.

తోటకము॥ నిరవద్యన రేశ్వర నిత్యనిరం, తర ధర్మమతీ గుణధామ జగ
త్పరిపూరిత కీర్తి విభాసి విభా, కర తేజనృపో త్తమ కాంతినిధీ!

గద్యము. ఇది సకలసుకవి జనవినుత నన్నయభట్ట ప్రణీతంబైన శ్రీమహా
భారతంబునం దాదిపర్వంబున ప్రథమాశ్వాసము. శ్రీ శ్రీ శ్రీ
[ఆంధ్రమహాభారత గ్రంథమును సమర్పించును.]

(సభలో, "జై! శ్రీరాజరాజనరేంద్ర మహారాజులుంగారికిజై! జై! విక్రమాదిత్యనిభునకుజై! జై! ఆంధ్రమహారాజ్యసార్వభౌమునకుజై! జై! నన్నపాచార్యులకుజై! జై! నారాయణభట్టవర్యులకుజై! జై! విద్యానాథులకు జై! జై! సుబుద్ధి మంత్రివర్యులకుజై! జై! ఆంధ్రమహాసామ్రాజ్యమునకుజై! జై! ఆంధ్రవాణికిజై! జై! మహాభారతమునకుజై!" అను ధ్వనులు పిక్కటిల్లును.)

విద్యా—నన్నపార్య! భవదనుగ్రహమున భారత మాంధ్రదేశమున, లక్షణ యుక్తముగ తెనుంగుబాస యందాది కావ్యమనిపేరు వడయునటుల రచించి, దిగంత యశోవిశాలమూర్తివైనందులకు మదీయహృదయ పూర్వకముగ వందనశతముల సమర్పణముఁ గావించుకొనుచున్నాను.

రాజ—ఆచార్య! భవదీయ యపారకటాక్షమును నాపైనునిచి యాచంద్రతారార్కముగ నానామ మీపుడమి పైనుండునటుల చేసినందులకు నే నేమి ప్రత్యుపకారము జేయగలను? అయినను యథాశక్తి నీ కానుకల ననుగ్రహింప మదీయప్రార్థనము [అని కనక పళ్ళెరమున బంగారుశాలువలు, రత్నములనుంచి చేతికందిచ్చును.]

నన్న—[గ్రహించుచు] మహారాజా! మాపోషకభారమంతయు మీ యందే నున్నపుడు, వేరనీయలేదని కించయేల? ఈపారితోషికమువలన నస్మదీయ కుటుంబము శాశ్వతముగ వర్ధిల్లఁగలదు. భారతరచనమునకు మీచల్లని చూడ్కుల ప్రసాదమే కారణముఁ గాని వేరొండుగాదు.

విద్యా—గురువర్యా! శేషించిన పదునేను పర్వములను శీఘ్రకాలమున రచింప మదీయ ప్రార్థనము.

నన్న—ప్రియత్నించి పూర్తిచేయగలను.

రాజ—నారాయణ భట్టారకా ! వాగనుశాసనునకుఁ దోడ్పడి యాంధ్రభారతీ సేవాసమారాధన మాచరించి నందులకు మత్కృతజ్ఞతాపూర్వకంబగు నీపారితోషిక మనుగ్రహింప వేఁడుచున్నాను. [అని కనకపళ్ళెరమున బంగరు ముద్రికలు, శాలువలు నుంచి చేతి కందీయును.]

నారా—[గ్రహించుచు] మహారాజా! మీ యనుగ్రహము విశేషము, ఆంధ్రభారతికి నే నాచరించిన సేవ స్వల్పము. తాము విశేషముగ పొగడవలదని యర్థించుచున్నాను.

[నన్నయభట్టునకు మంత్రులుఁగూఁ గలవారెల్లరు కానుకల నిత్తురు.]

రాజ—సుబుద్ధీ ! ఈరాత్రి నన్నపాచార్యులవారికి యుత్సవము జరుగును గదా ! అట్టి ప్రియత్నమునకుఁ దగిన పరిచారకుల నియమించితివా.

సుబు—సర్వప్రియత్నములు సిద్ధములు.

రాజ—ఆచార్యపుంగవా ! ఇఁక నూతన కవులతో సారస్వత చర్చలు సలుపుదమా ?

నారా—రాజకంఠీరవా ! నూతన కవులెవరు ? ఉత్కలమునుండి వచ్చిన వారలే యగుదురా ?

రాజ—అవును.

నారా—అట్లులైన వారితో వాదింపవలసిన పనిలేదు. ఇట్టికవుల సంఘములనేకములు యుత్కలమునం గలవు. వారిని, వారిసంఘముల నోడించి, కాందిశీకులఁ గావించి విజయలక్ష్మిని చేపట్టబట్టి వచ్చితిని. విననివారు శిక్షార్హులైరి. తమ కచ్చటి రాజపుంగవుఁడు కమ్మ లిఖించినాఁడు. దానిని నేనతెచ్చితిని. చిత్తగింపుఁడు. (అని రాజుయెదుటనున్న బల్లపైనుంచును)

రాజ—(లేఖనుచదివి) నూతనకవులారా! మీ సారస్వతవాదము లిదివఱకే తుదిముట్టినట్లు విజయవర్మ లేఖ నంపినాఁడు. సౌజన్య మనస్కులరై భారతీ సేవా సమారాధనముఁ గావింతురా? లేదేని మీ పూన్కిని వదలరా?

నూ॥ కవులు—మహారాజా! మా వాద మన్యాయమని తేల్చి చెప్పుటకు విజయవర్మకు హక్కు లేదు. న్యాయమునుపాలింప తామే సమర్థు లగుదురు.

రాజ—మంచిది. మీ రేవిధముగ గైత నల్లగలరు? నియమములెవ్వి?

నూ॥ కవి—మేము నన్నయభట్టువలె నిబంధకవిత్వమును చెప్పము. మాకు యతిగణ, ప్రాస, వ్యాకరణాదినియమములు లేవు. అయ్యవి సర్వథా త్యాజ్యములు.

ప్రకృతి వస్తువులను వర్ణింతుము. ప్రణయగీతములను వ్రాతుము. విరహగీతములను విశ్వమంతటను వెదఁజల్లుదుము.

రాజ—ఇఁక జెప్పవలసిన యవసరము లేదు. సర్వముం దెలియవచ్చినది. (అని తీర్పు వ్రాయును)

సుబు—(తీర్పు పత్రమునందుకొని)

"నేఁటి దినమున సభయందు వాదింపఁబడిన నూతన కవులను పూజ్యులైన నన్నపాచార్యులువారియొద్ద పది సంవత్సరముల కాలము విఘ్యుక్తమగు విద్యను నేర్ప వలసినదిగను, వారి కుటుంబ ఖర్చులను సంస్థానము భరించునట్లుగను, నూతన కవులు సరియైన మార్గమునకు వచ్చువఱకు నిరువదిమంది రక్షక భటులెల్లప్పుఁడు నూతన కవులను విడువక పరివేష్టించి యుండునట్లుగను తీర్పు చెప్పఁబడుచున్నయది.

రాజన రేంద్రుఁడు."

[అని చదువును, నూతన కవులు నిశ్చేష్టులగుదురు. సభయందు విజయధ్వానములు చెలరేఁగును. జై ! ఆంధ్రమహా సామ్రాజ్యాధీశ్వరులకు జై !, జై ! ఆంధ్ర భారతికి జై !]

విద్యా—ఇప్పటికి సభ పూర్తిచేయఁబడినది. ఈ రాత్రి నన్నయభట్టాచార్యుల వారికి యుత్సవము జరుగును. తన్మహోత్సవమున నెల్ల ప్రజలు పాల్గొన మహారాజుగారి యాశయము. [అని లేచును.]

[అందరు నొక్కుమ్మడిగఁ జై ! రాజపరమేశ్వరులకు జై ! యని లేచి నిష్క్రమింతురు.]

---

## 2. వరంగము

ప్రదేశము: రాజరాజు అంతఃపురము.

రాజ-రాజనరేంద్రుఁడు—[విషాదమున] అక్కటా ! ఆంధ్రభారతీ సమారాధన మా నాఁడే పూర్తియైనదా ? నన్నపాచార్యులు గ్రంథమంతయుఁ బూర్తి నేయక శీఘ్రముగ నా కంకిత మిచ్చుట యిందులకేనా ? ఎంతటి యభాగ్యుఁడనో కదా ! వాగనుశాసనుని మృదు మధుర పదగుంభన పద్యజాలము వినుట యీజన్మమధ్యమున గలుగదుగదా ! అట్టి కవిపుంగవుఁ డింకొకఁ డున్నను నట్టి కవిత్వము కావలయును గదా !

అమ్మా ! ఆంధ్రభారతీ ! నీకు ముద్దుబిడ్డఁడై వన్నె చిన్నెలుఁ గూర్చుచున్న నన్నపాచార్యులనేనా నీపొట్టఁ బెట్టికొనుట. ఏ మపకారముఁ గావించినాఁడు తల్లీ !

దిగంత యశోవిశాలమూర్తియే! కవితా సామ్రాజ్య సార్వభౌముఁడే! నిరంకుశ కవియే! భాషావాచస్పతియే! భవదీయ రూపమునే మూర్తివంతముగ గ్రహించి వెలసిన మూర్తివంతమే!

ఏఁడీ! నాగురుపుంగవుఁ డేఁడీ! మరల నాకన్నులకుఁ జూపుదువా?

చూపవు. చూపవు—అమ్మా! నన్నపాచార్యునివలె నన్నును నీ సన్నిధానమునకుఁ జేర్చుకొనుము. గురునివిడిచి యీలోకమున నుండఁజాల. ఆంధ్రభాషకు గురుఁడైన నాగురుని నీలోకముననైనఁ జూపుము. ఈరాజ్యములు, ఐశ్వర్యములు, తృణప్రాయములుగ నున్నయవి. నన్నయభట్టాచార్యు లున్ననే యివన్నియుఁ గావలయును. లేనిచో నాకు వలదు. వలదు. తల్లీ! వలదు. తుదిప్రార్థనమును గ్రహింపుము.

ఉ. అంబ! నవాంబుజోజ్జ్వల కరాంబుజ శారదచంద్రచంద్రికా
డంబర చారుమూర్తి ప్రకటస్ఫుటభూషణ రత్నదీపికా
చుంబిత దిగ్విభాగ శ్రుతిసూక్తివివిక్త నిజ ప్రభావ భా
వాంబరవీథి విశ్రుత విహార ననుం గృపజూడు భారతీ!

అమ్మా వచ్చుచుంటివా? రమ్ము. రమ్ము.

[ఉన్మాదముతో] ఆహా! ఏమీ విమానము. దివ్యవిమానము. ఆ బంగరు చిరుగజ్జెలనాదములు, ఆవీణానాదము...అన్నియుంగలసి యోంకారనాదమును ప్రజ్వరిల్లఁజేయుచున్న యవి. తల్లీ! ఓంకారనాదమున నా జీవములఁ గలుపుమని హెచ్చరించుచుంటివా? అటులనే యొనర్చెదను. నా నన్నయభట్టారకునిఁ జూపెదవా?

[అనుచు నేలపైఁ బడును, జీవములు పోవును.]

గద్యము. ఇది శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్యశర్మ విరచితంబైన యాంధ్రవాణీ
విలాపంబను దృశ్యకావ్యమునందు నన్నపాచార్య వైభవంబను
ప్రథమాంకము.

---

## ద్రవ్యదాతలు

శ్రీ లక్కన మల్లికార్జునుడుగారు, వల్లూరుపాలెం.
,, చిలువూరు సోమనాగయ్యగారు, చిలువూరు.
శ్రీ కాజ గోకర్ణయ్యగారు, చిలువూరు.
,, నేలపల్లి గురుపాదముగారు, కొర్రపాడు.

వీరు సహాయమును బంపినందులకు మేము కృతజ్ఞులమై యున్నాము. తక్కిన మహనీయులు త్వరగా తమ సహాయమును బంపి యుపకరించ కోరుచున్నాము,

ఇట్లు, మేనేజరు
'విభూతి'
౪-౨౬౮ సజన్‌లాల్‌వీథి, సికిందాబాద్, దక్కన్.

# ధర్మప్రచారము

( సం ౧. ౩ వ రేఖ తరువాయి )

కవిరత్న: లక్కన మల్లికార్జునుఁడుగారు



భోగపురుషుఁడు—ఏమీ ! గురువు లంతటివారా ! అట్టివా రీనాడులేరా ?

ధర్మపురుషుఁడు—లేకేమి గాని కలికాలమహిమనో, ఈశ్వరకృప చాలమియో కొన్నికొరంత లేర్పడినవి.

భో—ఆ కొరంతలు పూర్తిచేయు మార్గము లేదా ?

ధర్మ—కలదు వినుమి. శ్రీవిభూతి ద్వితీయసంవత్సర ప్రథమసంచిక కడురమ్యముగా వెలువడనున్నది. దాని వర్ణింపతరముగాదు సుమీ.

సీ॥ సరసనదాచార ♦ సమరసభావ ని,రూఢత ప్రకటించు ♦ ప్రౌఢ రేఖ
చారు సద్ధర్మప్ర♦చార శీలవ్రత,జపతపోనిష్ఠ వి♦శాల రేఖ
ఆర్యమతో ద్ధర♦ణాభ్యుదయ విధాన,కావ్య పరంపరా ♦ కార్య రేఖ
పండితబృంద వి♦భాసుర లేఖాళి, సత్య ప్రభాంజన ♦ సత్త్వ రేఖ
గీ॥ వేదకావ్యాది బిరుదుల ♦ వేడ్కనంది, బ్రహ్మచర్యా ప్రభావళిఁ ♦ బ్రబలునట్టి
పరమగుణ సాంద్రుడగు వీర♦భద్రశర్మ, పుణ్యహస్తజమైన వి♦భూతి రేఖ.

మహామహిమాస్పదంబగు ఈ రేఖాధారముగా గొని పరమేశ్వరార్పణముగా మఠాధిపతులకు నొక ధర్మోద్ధరణ దరఖాస్తు పంపుకొందము.

భో—సమంజసముగా నున్నది. యా దరఖాస్తును పూరింపుము.

ధర్మ—బా గట్టులె పూరించెద. (కొంతతడవు వ్రాసి) సోదరా వినుమి.

## ధర్మోద్ధరణ దరఖాస్తు

శ్రీ జగద్గురు రేణుకాచార్య భగవత్పాదులవారి కృపాకటాక్షమున సంభవించిన వీరశైవమతరాజ్యమున కధిపతులగు శివశ్రీ యిష్టలింగ ప్రాణలింగ భావలింగ నామాంతరముల నొప్పి భానుకోటిసన్నిభ తేజోవిలసితమగు మహాలింగమూర్తి గారి పాదపద్మముల సన్నిధికి.

ఆణవమల, మాయామల, కార్మికమలములతోఁ గూడి కామక్రోధ లోభ మోహ మదమత్సరంబులగు ఆర్గుర శత్రులచేఁజిక్కి పంకంబునబడ్డ కరిభంగి పరితపించుచు దారి కానక చింతాక్రాంతులై విలపించెడి వీరశైవులు పెట్టుకొన్న ధర్మోద్ధరణ దరఖాస్తు.

ఘనమైన అయ్యా !

ఇటీవల కలికాలమహిమనో, తమ సంపూర్ణ కటాక్షము కలుగనందుననో, చిత్త శాంతులు, శరీరారోగ్యములు, నైశ్వర్యములు, సత్సంతానములు, శీలములు, నిశ్చలా

నందములు లేకపోవుట మీకు తెలియని విషయములు కావు. అది యట్లుండ యతులు సతత జపతపోనిష్ఠలు సుబోధలు గమనింపక సంచరించుట వలన తమ బిడ్డల మగు మాకు బుద్ధులనెడి పొలములందు బోధలనెడి వర్షాధారలు లేకయు దుష్టప్రవర్తనార్క కిరణములచే ధర్మసస్యములు మొలకలతో నెండిపోవుటంజేసి జ్ఞానాశనము కానక ముక్తియనియెడి మాతను, శీలమనియెడి భార్యను, ధర్మార్థ కామమోక్షము లనియెడి బిడ్డలను పోషించుకొనలేక పాపమనియెడి క్షుత్తుచే మల మల మాడిపోవు చుంటిమి.

చిత్తుసత్తు ఆనంద తత్వంబుల నెరుగక దుష్టమైన ఆకలిచే స్నానపూజాది జపనియమమ్ములకు స్వస్తి చెప్పి లింగము శిలగా గురుని నరునిగా దేవుని లేనివాని గా దలంచుచు బందిపోటు దొంగలమై ధర్మోద్ధరణ శీలురు గడించిన ధర్మసస్యంబుల ధ్వసంబుజేయుచు తనివితీరక సకాలదీక్షలఁ బడయక, స్వమతతత్త్వంబుల పాటింపక పరమతాన్నంబులకు నోరు తెరచుకొనుచుంటిమి.

కాన దీక్షావ్రతము, శీలము, సుబోధ, మతసంస్కరణలు బాల్యాదినె మాకొసంగి ధర్మోద్ధరణఁ గావించి ధర్మసస్యంబుల ఫలింపఁజేసి జ్ఞానాశనం బొసంగి సత్సంతానాది శుభప్రదములు మాకు కూర్పగలందులకు వేడుచు శ్రీ జగద్గురు రేణుకాచార్య భగవత్పాదుల వంశపరంపరాగతులగు మఠాధిపతులద్వారా మీకు మనవిచేసికొను చున్నాము. కనుక ఘామందులవారి దయాకటాక్షమున మఠాధిపతులు ధర్మోద్ధరణకై పాటుపడి మమ్ముద్ధరించగలరని వారి ఘనమునుగూర్చి కడుంగడు ప్రార్థించు చున్నాము. దివ్యచిత్తమునకు తేవలెను.

ది 22-2-1940,
విమర్శాపురము.

ఇట్లు,
ఆధునిక ఆంధ్రవీరశైవసమాజము.

భో—భళీ! బలె బాగున్నది కాని క్రియాఫలితము చేకూరునా?

ధర్మ—ఈ విభూతి ప్రతికారత్నము వెలువడుటచే వీరశైవులలో కొంతప్రచారము చెలరేగినది. అట్లే కొంతకాలమునకు మనదరఖాస్తు ఫలితము లభించవచ్చును. అది యీశ్వరాజ్ఞ!

భో—మతములో ధర్మప్రవర్తనము సంఘైక్యము లభించుటకు చాలాకృషిచేయ వలసియున్నది. దానిఫలితాఫలితము లెట్లు విశదీకరించెదవో.

ధర్మ—ముస్ముందు జరుగు సత్కృషులయొక్క ఫలములు నిదానించి లోకమునకు విదితము చేసెదముగాత! మన మరుగుదుము పద. (నిష్క్రమింతురు)

(సశేషము.)

# ధర్మప్రచారము

(సం ౧. ౩ వ రేఖ తరువాయి)

**కవిరత్న: లక్కన మల్లికార్జునుఁడుగారు**



భోగపురుషుఁడు—ఏమీ! గురువు లంతటివారా! అట్టివా రీనాడులేరా?

ధర్మపురుషుఁడు—లేకేమి గాని కలికాలమహిమనో, ఈశ్వరకృప చాలమినో కొన్నికొరంత లేర్పడినవి.

భో—ఆ కొరంతలు పూర్తిచేయు మార్గము లేదా?

ధర్మ— కలదు వినుమి. శ్రీవిభూతి ద్వితీయసంవత్సర ప్రథమసంచిక కడురమ్యముగా వెలువడనున్నది. దాని వర్ణింపతరముగాదు సుమీ.

సీ॥ సరసనదాచార ♦ సమరసభావ ని,రూఢత ప్రకటించు ♦ ప్రౌఢ రేఖ
చారు సద్ధర్మప్ర♦చార శీలవ్రత,జపతపోనిష్ఠ వి♦శాల రేఖ
ఆర్యమతో ద్ధర♦ణాభ్యుదయ విధాన,కావ్య పరంపరా ♦ కార్య రేఖ
పండితబృంద వి♦భాసుర లేఖాళి, సత్య ప్రభాంజన ♦ సత్త్వ రేఖ
గీ॥ వేదకావ్యాది బిరుదుల ♦ వేడ్కనంది, బ్రహ్మచర్యా ప్రభావళి ♦ బ్రబలునట్టి
పరమగుణ సాంద్రుడగు వీర♦భద్రశర్మ, పుణ్యహ స్తజమైన వి♦భూతి రేఖ.

మహామహిమాస్పదంబగు ఈ రేఖాధారముగా గొని పరమేశ్వరార్పణముగా మఠాధిపతులకు నొక ధర్మోద్ధరణ దరఖాస్తు పంపుకొందము.

భో—సమంజసముగా నున్నది. యా దరఖాస్తును పూరింపుము.

ధర్మ—బా గట్టులె పూరించెద. (కొంతతడవువ్రాసి) సోదరా వినుమి.

## ధర్మోద్ధరణ దరఖాస్తు

శ్రీ జగద్గురు రేణుకాచార్య భగవత్పాదులవారి కృపాకటాక్షమున సంభవించిన వీరశైవమతరాజ్యమున కధిపతులగు శివశ్రీ యిష్టలింగ ప్రాణలింగ భావలింగ నామాంతరముల నొప్పి భానుకోటిసన్నిభ తేజోవిలసితమగు మహాలింగమూర్తి గారి పాదపద్మముల సన్నిధికి.

ఆణవమల, మాయామల, కార్మికమలములతోఁ గూడి కామక్రోధ లోభ మోహ మదమత్సరంబులగు ఆర్గుర శత్రులచేఁజిక్కి పంకంబునబడ్డ కరిభంగి పరితపించుచు దారి కానక చింతాక్రాంతులై విలపించెడి వీరశైవులు పెట్టుకొన్న ధర్మోద్ధరణ దరఖాస్తు.

ఘనమైన అయ్యా!

ఇటీవల కలికాలమహిమనో, తమ సంపూర్ణ కటాక్షము కలుగనందుననో, చిత్తశాంతులు, శరీరారోగ్యములు, నైశ్వర్యములు, సత్సంతానములు, శీలములు, నిష్ఫలా

నందములు లేకపోవుట మీకు తెలియని విషయములు కావు. అది యట్లుండ యతులు సతత జపతపోనిష్ఠలు సుబోధలు గమనింపక సంచరించుట వలన తమ బిడ్డల మగు మాకు బుద్ధులనెడి పొలములందు బోధలనెడి వర్షాధారలు లేకయు దుష్టప్రవర్త నార్క కిరణములచే ధర్మసస్యములు మొలకలతో నెండిపోవుటంజేసి జ్ఞానాశనము కానక ముక్తియనియెడి మాతను, శీలమనియెడి భార్యను, ధర్మార్థ కామమోక్షము లనియెడి బిడ్డలను పోషించుకొనలేక పాపమనియెడి క్షుత్తుచే మల మల మాడిపోవు చుంటిమి.

చిత్తుసత్తు ఆనంద తత్వంబుల నెరుగక దుష్టమైన ఆకలిచే స్నానపూజాది జపనియమమ్ములకు స్వస్తి చెప్పి లింగము శిలగా గురుని నరునిగా దేవుని లేనివాని గా ద్దలంచుచు బందిపోటు దొంగలమై ధర్మోద్ధరణ శీలురు గడించిన ధర్మసస్యంబుల ధ్వంసంబుజేయుచు తనివితీరక సకాలదీక్షులఁ బడయక, స్వమతతత్త్వంబుల పాటింపక పరమతాన్నంబులకు నోరు తెరచుకొనుచుంటిమి.

కాన దీక్షావ్రతము, శీలము, సుబోధ, మతసంస్కరణలు బాల్యాదినె మాకొసంగి ధర్మోద్ధరణఁ గావించి ధర్మసస్యంబుల ఫలింపఁజేసి జ్ఞానాశనం బొసంగి సత్సంతానాది శుభప్రదములు మాకు కూర్పగలందులకు వేడుచు శ్రీ జగద్గురు రేణుకాచార్య భగ వత్పాదుల వంశపరంపరాగతులగు మఠాధిపతులద్వారా మీకు మనవిచేసికొను చున్నాము. కనుక ఖామందులవారి దయాకటాక్షమున మఠాధిపతులు ధర్మోద్ధ రణకై పాటుపడి మమ్ముద్ధరించగలరని వారి ఘనమునుగూర్చి కడుంగడు ప్రార్థించు చున్నాము. దివ్యచిత్తమునకు తేవలెను.

ది 22-2-1940, } ఇట్లు,
విమర్శాపురము. } ఆధునిక ఆంధ్రవీరశైవసమాజము.

భో—భళీ! బలె బాగున్నది కాని క్రియాఫలితము చేకూరునా?

ధర్మ—ఈ విభూతి ప్రతికారత్నము వెలువడుటచే వీరశైవులలో కొంతప్రచారము చెలరేగినది. అట్లే కొంతకాలమునకు మనదరఖాస్తు ఫలితము లభించవచ్చును. అది యీశ్వరాజ్ఞ!

భో—మతములో ధర్మప్రవర్తనము సంఘైక్యము లభించుటకు చాలాకృషిచేయ వలసియున్నది. దానిఫలితాఫలితము లెట్లు విశదీకరించెదవో.

ధర్మ—మున్ముందు జరుగు సత్కృషులయొక్క ఫలములు నిదానించి లోకమునకు విదితము చేసెదముగాత! మన మరుగుదుము పద. (నిష్క్రమింతురు)

(సక్షేమము.)

—

డా. చిలుకూరి నారాయణరావు ఎం. ఎ. గారి

# పండితారాధ్య చరిత్ర - పీఠిక

**పండిత చిదిరె మఠము వీరభద్ర శర్మగారు**

భాషాదృష్టితోడను, పాండిత్య దృష్టితోడను, శైవ వాఙ్మయమందు ననేకము లగు సుద్గ్రంథములు కలవు. వానిని జక్కగ బరిష్కరించి ప్రచురించినచో జనామోద మందుటయే కాక సార్థకముగను లోపముండదు. కొన్ని సంవత్సరములకు బూర్వము శ్రీ పండిత బండారు తమ్మయ్యగారు ఈ విషయమును గూర్చి ప్రబోధ పరమైన వ్యాసములను ప్రచురించి శ్రీ కీ॥ శే॥ దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులవారి వంటి దృష్టి నాకర్షింప గలిగిరి. తదనుగుణముగ శ్రీ పంతులవారు సోమనాథుని బసవపురాణమును మిక్కిలి వ్యయప్రయాసలతో ప్రకటించిరి. "సిద్ధమైనది శివాలయమే కాని పూజారి తురక" యన్నట్లు గ్రంథమెంత చక్కనిదైనను వీరశైవేతరులైనట్టియు, వీరశైవ వాఙ్మయపరిచయము లేనట్టియు శ్రీ పండితవర్య వే॥ ప్రభాకర శాస్త్రిగారి విపులమైన పీఠికలోని యనేక భాగములు సంప్రదాయ విరుద్ధములై సత్యమునకు దూరముగ నుండుటవలన నీ పదునేను సంవత్సరముల దనుకను విమర్శనీయాంశములై ఖండింపబడుచుండుట నాంధ్రలోక మెఱింగియే యున్నది.

1935 అగస్టు నెలలో శ్రీ నాగేశ్వరరావు పంతులవారు సంభాషణ వశమున "బసవపురాణము సంగతి గడిచి పోయినది. ఇక ముందు త్వరగా పండితారాధ్యచరిత్రను ప్రకటించు చున్నాము. మీ యభిప్రాయములను శ్రీ చిలుకూరి నారాయణరావు గారికి తప్పక వ్రాయవలె"నని నొక్కిచెప్పిరి. "వారు ఎంత నిష్పక్షస్వభావము కలవారైనను పరమతములను నిరూపించవలె నన్న పండితప్రకాండులకును ప్రమాదములు వాటిల్లును. భాషావిషయమై మీ యిష్టముకాని మతవిషయమై వీరశైవ పండితునితో పీఠిక వ్రాయించు"డని నా దీర్ఘమైన ప్రసంగముతో శ్రీ పంతులవారికి నివేదించియుంటిని. వారు నవ్వుచు కొంత గంభీరులై 'ప్రస్తుతము మూల మచ్చుపడుచున్నది. పీఠికాభాగము వచ్చినపుడు మీ యభిప్రాయమును బం. తమ్మయ్యగారి అభిప్రాయమును నేను స్వంతముగ నాలోచించెద' నని సెల విచ్చిరి. ఈమాత్రము చాలు నంటిని.

విధివశమున 'పండితారాధ్యచరిత్ర' గ్రంథము ప్రకటనను గాంచకయే పంతులవారు కైలాసవాసులైరి. నేను యాదగిరిలో నుండు తరిని, తరువాతను శ్రీ డా॥ చిలుకూరి

నారాయణరావుగారికి కొన్ని గ్రంథములను పంపించియు కొన్ని జాబులను వ్రాసియు పండితారాధ్యచరిత్ర పీఠికలోని మత సంబంధములైన విషయములకై యనేక సూచనలను గావించి యుంటిని. బం॥ తమ్మయ్యగారును ఇటులే పాటుపడిన సంగతి నాకు సరిగా తెలియును. శ్రీ నారాయణ రావుగారు మా సామగ్రి నేవిధముగ నుపయోగించిరో తెలియదు. వారికి ప్రత్యుత్తరములతో నావశ్యక విషయమై చర్చించు నంతటి యవకాశము లేదు.

ఎటులైన నేమి, పండితారాధ్య చరిత్రియను మహాగ్రంథము శ్రీ శివలెంక శంభుప్రసాదుగారి యాశ్రియమున నిపుడే ఆంధ్రగ్రంథమాలలో 30 వ కుసుమముగా వెలువడినది. గ్రంథము మొత్తము ౧౮_౨౦ పేజీలలో ముగిసినది. మూలగ్రంథము ౧_౩౪౦ పుటలగు నని మొదలే తెలిసియున్నపుడు ౪౪౦ పుటల పీఠికాభాగములు చేర వలసియుండగా చిన్న సైజులో వేయుటవలన అందము కోలు పోయినది. దీర్ఘకాల ముద్రిణ మంఫుటచే కాగితములును రకరకము లైనవి. మొదలు రెండు సంపుటములుగా వేయదలంచినట్లు తోచుచున్నది కాని పీఠికాభాగములు జేరిన పిదప నట్లు వీలుగాక నిరుపాయముగ నొకే సంపుటముగా సిద్ధపరచినారు. డబుల్ క్రౌను (పెద్ద) సైజులో ప్రచురించినచో నాంధ్రగ్రంథములలో శిరోభూషణముగా నుండెడిది. ఐదురూపాయిల వెల ఎక్కువ కాదు. అత్యధికమైన వ్యయప్రయాసల కోర్చి ఇట్టి గ్రంథమును లోకమున కర్పించిన ప్రకాశకులు అభినంద్యు లనుటలో సందియములేదు.

గ్రంథము నవలోకించగానే బైండుమీద పెద్దయక్షరముల లోని "మల్లిఖార్జున"యను నపశబ్దము ప్రత్యక్షమగును. దిమ్మెను చెక్కించుటలోని యనవధానత వలన సహజముగ నీదొసగు దొరలినను, కాళిదాసుని శాకుంతలములోని ప్రథమ శ్లోకము నాటకములోని సారస్యమును సూచించుచున్నట్లు ఈ గ్రంథముయొక్క బాహ్యావరణ మందలి "ఖార్జున" అను అశుద్ధి, గ్రంథపరిష్కరణము లోని యంతస్సార వైకల్యమును నిరూపించుట కేర్పడినట్లున్నది. గ్రంథమునకు శ్రీ నారాయణరావు గారు, 4 పేజీల పీఠికను, 350 పేజీల ఉపోద్ఘాతమును, 200 పేజీల సంజ్ఞాపదముల ఆచ్ఛికశబ్దముల పట్టికను చేర్చినారు. దీనిని చిన్నచ్చులో కంపోజు చేయించినారు కాని పెద్దచ్చులో నగుచో 700పేజీల వరకయ్యెడిదేమో? ఆంధ్రగ్రంథములకు నింత పెద్ద యుపోద్ఘాతము నింతకు మున్నెవరును రచింపలేదని ధారాళముగ చెప్పవచ్చును. ఇంతటి గాఢమైన పరిశ్రమనుగూర్చి నారాయణరావుగారి ఘనత నాంధ్రులు చిరముగ స్మరింపగలరు. వీరి గ్రంథములవలె పత్రికలును అతి విపులము లను సంగతి గమనార్హముగ నున్నది. వీరి పీఠిక, ఉపోద్ఘాతము, ప్రత్యేకముగ నిందు గన్పట్టుచున్నను, ఉభయ

శీర్షికలను జేర్చి సౌకర్యముకొరకు నే నీవ్యాసమున పీఠికయనియే వ్యవహరించుచున్న, ఇంతపెద్ద పీఠిక యెంతగంభీరముగ నున్నదో యని కొంద రవలోకించుటకై కుతూహల పడుచుందురను తలంపుతో ఈ పరిచయమును బ్రకటింప నుంకించితిని.

శ్రీ నారాయణరావుగారు శ్రీ గిడుగు వేంకట రామమూర్తి పంతులవారి శిష్యులు కావున గ్రామ్యభాషలో నీ పీఠికను విరచించి గురుభక్తిని వెల్లడించినారు. నారాయణరావుగారు అనంతపురంజిల్లా నివాసులు కావున మన పత్రికలలో నేడు గ్రామ్యభాష యని ప్రకటింప బడుచున్న కృష్ణా, గోదావరి, గుంటూరు జిల్లాల గ్రామ్యభాష అలవాటులేకను, తమ యనంతపురపు గ్రామ్యభాష మరియు విపరీతముగా నుండునను తలంపు వలనను పీఠికా రచనము అసలు గ్రామ్యములో రచింప బడజాలక నొక ప్రత్యేక కృత్రిమ గ్రామ్యభాషలో ముగింపబడిన దనవచ్చును. రావుగారు ఆంధ్రపండితులు కావున గ్రాంథిక భాషాసంస్కార ముండియు, ఇష్టము లేకున్నను గురుభక్తివలన గాబోలు శైలిని బలాత్కారముగ గ్రామ్యములోకి దించిన ట్లగపడుచున్నారు. వీరి శైలి నామమాత్రమునకే గ్రామ్యము కాని విశేషముగ గ్రాంథికమే! చక్కని గ్రాంథికములో నీపీఠిక రచింపబడుచో నాంధ్రభాషాభూషణముగ వెలింగెడిది. ఈ బాధ్యతను ఉదాసీనించి నందువలన గ్రామ్యభాషకు వారు తెచ్చియిచ్చిన పారితోషికమును లేదు. "ఇంచు మించు పదేండ్ల క్రిందట కీర్తిశేషులైన దే. నాగేశ్వరరావు పంతులుగారు మాగురువుగారైన మ. రా. గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారితో పండితారాధ్య చరిత్రమును పరిష్కరించి ఇవ్వవలసిన దనిన్ని" అను విరోధాభాసవాక్యముతో శ్రీ డా. చిలుకూరి నారాయణరావు, ఎం. ఏ. పి. హెచ్. డి. గారి మహోన్నతమైన పీఠికారంభ మగుచున్నది. నాగేశ్వరరావుగారు కీర్తిశేషులై మూడు సంవత్సరములే యైనను ఇంచుమించు పదేండ్లక్రిందట కీర్తిశేషులైనట్లు సుస్పష్టముగ స్ఫురించుచున్న వాక్యమును వీరు వ్రాయుటయు ఆంధ్రపత్రికాఫీసులోనే అచ్చుపడుటయు ఆశ్చర్యముగా నుండక పోదు. "కీ॥ శే॥ నాగేశ్వరరావుగారు పదేండ్ల క్రిందట మా గురువుగారితో," అని వ్రాయుచో ఇబ్బంది లేకపోయెడిది. గొప్పవారి కలము ఇచ్చవచ్చినటులు పోవలసినదే కాని సంస్కార మక్కరలేదు కాబోలు! నాగేశ్వరరావుగారి విషయము ప్రస్తుతము విఖ్యాతమ య్యున్నది కావున పై వాక్యములోని యసంగతి యాధునికులకు బోధపడినను, కాలాంతరమున ౪౦, ౫౦ సంవత్సరముల తర్వాత నీవాక్యము విరోధమునే బోధించును కాని ఆభాసము నందీయజాలదు. ఇంతటి చిన్నవిషయము నెత్తి చూపింప నవసరము లేదని కొందరు భావించినను, వీరు పీఠికారచనమునందు ననేక తావులలో నిట్టి విలక్షణమైన నిరంకుశత

నుపయోగించి చారిత్రక సత్యములను విపరీతమగునట్లు నిరూపించియున్నా రను సూచ నను పాఠకులు గ్రహింపవలెననియే వ్రాయవలసివచ్చినది. సోమనాథునియొక్క నివాసము, కాలము, కులగోత్రములు, వైదుష్యము, గ్రంథములు, కావ్యకళ, ద్విపద, ఛందోవిశేషములు, భాష, వీరశైవ వాఙ్మయము, శైవసంప్రదాయము, అరువత్తు మూవురు, వీరశైవసిద్ధాంతము, కొన్ని స్థలములు, శ్రీశైలము అను వివిధశీర్షికలలో శ్రీ రావుగారు వ్యాసములనువ్రాసి పీఠికగాగూర్చినారు. బసవపురాణమును పరిష్కరించిన శ్రీ ప్రభాకరశాస్త్రిగారి పీఠికాఫక్కి యాంధ్రమున నూతనమని చెప్పవచ్చును. వారిపీఠికా పద్ధతిననుసరించి వీరును గొప్పగా విస్తరించి బృహత్ స్తోత్రరత్నాకరమువంటి బృహ త్పీఠికను ప్రచురించినారు. నిజమాలోచించినచో మూల గ్రంథమునందు సామాన్య పాఠకులకు గోచరింపని మత విషయములను, ఐతిహ్యమును, సారరూపముగా పీఠి కలో వివరింపవచ్చును. గాని అనవసరమైన విషయములను కొండంతలుగా పెంచి పీఠికలను గ్రంథములకంటె గొప్పవిగా నుండునట్లు సిద్ధపరచుట సుపద్ధతి గాదని భావించుచున్నాను. కవులయొక్క భాష, కావ్యకళ, మున్నగు విషయములనుగూర్చి ప్రత్యేక గ్రంథములను ప్రకటించుటయే మంచి పద్ధతి. హిందీ బంగళా భాషలలో నిట్టి ప్రయత్నము సాగుచున్నది. సర్వజ్ఞులవలె సమస్త విషయములను పీఠికలో ఒకరే నిరూపించ ప్రయత్నించుట విపరీతముగాక మానదు. నారాయణరావుగారు తమ పీఠికకొరకై ఏయే గ్రంథములనుండి, వ్యక్తులనుండి సామగ్రిని సహాయమును, సంపా దించినారో కాని మాట వరుసకైనను సూచింపలేదు. అనేక భాగములను అను వాదముగాను సారముగాను తమ పీఠికలోనికి దిగుమతి చేసినట్లు స్పష్టమగుచుండగా నా మూలగ్రంథములనుగూర్చి అతి గాంభీర్యమును వహించుటవలన విమర్శకులకే కాదు, జిజ్ఞాసువులకును సందేహము వదలజాలదు. వీరశైవ మత విషయకములైన పీఠికా భాగములను ఏ వీరశైవ విద్వాంసునకైనను మొదలేచూపించి పరామర్శ జేసినచో ప్రమాదములకు దావుండెడిది కాదు. సౌభాగ్యమో దౌర్భాగ్యమో చెప్ప లేము కాని నేటి విద్వాంసులలో ననేకులు తమకు దెలియని విషయములను గూర్చి వ్రాసికొన్నపుడు సైతము తద్‌జ్ఞులగు వారికి జూపించుట క్రియ కొనరు. ఇదియు నొక నాగరికత కానోపు.

పీఠికలో వీరి మొదటి వ్యాసము "సోమనాథుని నివాసస్థానము"ను గురించి నదై యున్నది. ఇదివరకే విద్వాంసులును కని విని యెఱుగని స్థలములో సోమనా థుని బుట్టించిరి. అదియును మైసూరు రాష్ట్రము తుమ్కూరు తాలూకాలోని 'హాల్కురికి' యట. పరమేశ్వరానుగ్రహమువలన ఈ హాల్కురికి అనంతపురం జిల్లా

మడకశిరా గ్రామమునకు ౨౦ మైళ్లదూరమునసే యున్నది. అనగా శ్రీ నారాయణ రావుగారు నివసించు అనంతపురమునకు దగ్గరగా అన్నమాట. విధివిధాన మన్న నిటు లుండవలెనుగదా! ౭ వందల సంవత్సరముల క్రితము సోమనాథుడు పండితారాధ్య చరిత్రను రచించిన స్థలమునందే మన రావుగారును ఆ గ్రంథమునకు టీక రచించి పునర్జన్మము నిచ్చినారు. ఇక చారిత్రిక ప్రమాణములు గాని సంప్రదాయ ప్రసిద్ధములు గాని సాక్ష్యముగా నీయనక్కఱలేదు. ఇది పరిశోధన! ఎక్కడనో యున్న కుగ్రామమును నామసామ్య మున్నంతమాత్రమున సోమనాథుని జన్మస్థానముగ నంగీకరించుట పొసగనిమాట. పాలకుర్తి గ్రామము వరంగలుకు రావుగారు భావించినట్లు ౭౦ మైళ్ళదూరమున గాక ౧౮ మైళ్ళ దూరములోనున్నది. దీనినే పాలకురికియని కూడ యందురు. ఈ గ్రామమున సోమనాథాలయము నాటి నుండి నేటిదనుక ప్రఖ్యాతమై మాహేశ్వరుల యాధిపత్యమునసే యున్నది. సోమనాథుని జీవితమును గూర్చియు బాంధవ్యమును గూర్చియు నచ్చోటి జంగములలో నైతిహ్యములు ప్రసిద్ధములై యున్నవి. నిజాంసర్కారువారి గ్రామముల లీస్టులో పాలకుర్తి యున్నంతనే పాలకురికి లేదనుట వట్టిభ్రమ. ఈ లిస్టులు సరియైనవని నమ్మనక్కఱలేదు. నేటికాలపు మామూలు వ్యవహారమును బట్టి పేరులను వ్రాసి యుందురే కాని అవి ధ్రువములు కాజాలవు. పైగా నెన్నియో నామములు ఈ లీస్టులో పిచ్చిపిచ్చిగా వికారముగ నచ్చువేయబడినది. పాలకురికి పాలకుర్తి అను నింటిపేరు గల మాహేశ్వరులు వరంగలు జిల్లా ఖమ్మందగ్గరి పిండిప్రోలు ప్రాంతమునను సికింద్రాబాదునను కలరు. సోమనాథుని గురుడగు పోతిదేవర నివసించిన కట్టకూరను గ్రామమును పాలకుర్తికి ౩౦, ౪౦ మైళ్ళదూరములో (నల్లగొండ జిల్లాలో) గలదు. సోమనాథుని బంధుజాలమువారుగా నగపడు శివరాత్రి, విభూతి, పిడుపర్తి మున్నగు నింటిపేరులు గల మాహేశ్వరులు వరంగలుకు పరిసరముగా నివసించియున్నారే కాని యనంతపురము వైపువారు కారు. శ్రీ శేషాద్రిరమణకవులు లోక పరియాయము 'ఉత్తమరాజు' పేరుగల నిక్కడి బ్రాహ్మణ కుటుంబమును సోమనాథునికి పూర్వమతే వంశముగా జెప్పినారు. వారికిని ఈ యనంతపురము గొడవ తెలియదు. "కుఱ్ఱు" "కుఱికి" శబ్దములు 'గోష్ఠ' శబ్దమునుండి బుట్టి 'ఊరు'అను ఒకే అర్థము నిచ్చుచుండగా 'కురికి' యనునది కన్నడదేశమున నుండవలెననుట నిశ్చయము కాజాలదు. ప్రాచీనరూపములను నేటి ప్రాంతీయవిభాగమునుబట్టి కర్ణాటకమనియో ఆంధ్రమనియో చెప్పవీలులేదు. పాలకుర్తి పాలకురికి కాజాలదని వ్రాయుటకు "వీరి యాధారములేమో తెలియవు. పండితారాధ్య చరిత్రలోని మరాఠిభాష తెలియ

నందువలన వీరు పూనా బొంబాయి నగరములకు వెళ్ళిరటగాని, సోమనాథుని క్షేత్రమగు సుప్రసిద్ధమైన పాలకుర్తినిగాని, సోమనాథుని సన్నిహిత శాఖీయులను గాని చూచి పలుకరించిన పుణ్యము గట్టికొనరైరి. సోమనాథుడు కన్నడమునను మహారాష్ట్రమునను కవిత్వము సల్లినాడు కావున తెలుగు కన్నడములకూడలిలో జన్మించి యుండునని సాధించి యట్టి స్థలము అనంతపురముజిల్లా కంటగట్టనెంచుట మఱియు నాశ్చర్యముగనున్నది. సోమనాథునిపాటి కన్నడమరాఠి ద్విపదలను నేనును రచింపగలుగుదును. ఇంతటితో నాదు జన్మభూమియు నల్లగొండ కర్నాటకాంధ్ర ప్రాంతముల మధ్యనుండవలసిన దేనా ? బసవేశ్వరుని కథాపరిచయమయిన పిదపనే సోమనాథుడు కన్నడమును నేర్చికొని యుండునను సిద్ధాంతమే సరియైనది. ఇక కర్ణాటక కవు లాతని పొగడియుండుటకు గారణ మాతని కర్ణాటకత్వముకాదు. బసవని చరిత్రను పురాణఫక్కిని మొట్టమొదలు రచించి సమస్త వీరశైవలోకమును వశపరచికొనినాడు. ఈ యపూర్వకావ్య సృష్టివలన ఆంధ్రద్రవిడ కర్ణాటక మహారాష్ట్ర ప్రాంతములలో నెల్లెడల సంచరించి సన్మానింపబడి శాస్త్రచర్చలొనర్చి సోమనాథభాష్యమును రచించి పండితారాధ్య చరిత్ర నావిష్కరించునాటికే అష్టభాషాకోవిదుడై యుండవచ్చును. ప్రాచీన శివభక్తు లరవదేశమున నుద్భవించుటవలన వారి వాఙ్మయమును దెలిసికొనుటకు అరవబాసను నేర్చుకొనినటులే బసవేశ్వరుడు అల్లమ చెన్నబసవేశ్వరులు మొదలగు వారి చరిత్రలను తెలిసికొనుటకయి కన్నడమున సంచరించి నేర్చుకొనియుండునుగాని కన్నడ దేశము దగ్గర బుట్టి యుండుట వలనగాదు. ఇంతకు మన రావుగారు చూపిన తుముకూరు దగ్గరి హాల్కురికిలో నేడుగాని నాడుగాని ఆంధ్రభాష వ్యవహారములో లేదు. ఆ ప్రాంతమున నొకటి రెండు తొర్రి మొర్రి తెలుగుమాటలు నేడు ప్రచారములో నున్నంతనే యది యాంధ్రభూమి కాదు. అక్కడ బుట్టినవా రాంధ్రభాషలో బాండిత్యము సంపాదించుటకు అంతటి ప్రాచీనకాలమున ననువే లేదు. ఆ ప్రాంతమున నాంధ్ర గ్రంథరచనలును కాలేదు. తుముకూరుజిల్లాలోనేమి ఆ జిల్లాలోని హాల్కురికి గ్రామములోనేమి శుద్ధమైన కన్నడమును మాట్లాడగలిగి కన్నడమున గ్రంథరచన నొనర్పగల పండితులున్నారు. సోమనాథు డక్కడ పుట్టియుండిచో కన్నడ పాండిత్యమే సులభముగా నబ్బియుండెడిది. బసవపురాణమును కన్నడముననే రచించి యుండెడివాడు. హాల్కురికిలో సోమనాథాలయముగాని సోమనాథకవియొక్క బంధు శిష్యబృందముల కుటుంబములుగాని లేవు. ఆ పరిసరమునను అట్టివి కానరావు. సుప్రసిద్ధినిబట్టియు నిరర్గళమైన యాంధ్రకవితా ప్రవాహమునుబట్టియు సోమనాథుడు వరం

గలు ప్రాంతపు పాలకురికివాడనుటయే యుక్తిసహము. కావుననే సోమనాథుడు ఓరుగంటిలో స్వయంభూ దేవాలయమున బురాణమునుజెప్పి గొప్పగా ప్రచార మొనర్చియుండును. ఈ ప్రాంతపు మాహేశ్వరుల ఇండ్లలో ననేక బసవ పురాణ ప్రతులుండుట సుప్రసిద్ధము. తుముకూరు హాల్కురికియొద్ద ఇట్టి గంధము నైతము లేదనవచ్చును. పాలకుర్తిలోని సోమనాథ లింగమూర్తికిని దానికి దగ్గరగా నున్న కొలనుపాకలోని సోమేశ్వర లింగమూర్తికిని శ్రీశైలమల్లికార్జునస్వామి గురుమూర్తి యనియును శివరాత్రినాడు కొండగోగుపూలు కనుపడుచుండెశివనియును స్థలపురాణము వినికిడికలదు. ఇక్కడి మాహేశ్వరులకును శ్రీశైల విషయమున భక్తిమెండు ఇక్కడివాడే యైన సోమనాథకవికిని శ్రీశైలభక్తి సహజము. ఇట్టి ప్రేమవలన శ్రీశైలమునకును త్రిపురాంతకమునకును వెళ్ళినపుడు కొలదిదినము లచ్చోటనివసించి బసవపురాణ పండితారాధ్య చరిత్రల రచనకై సంకల్పమొనర్చి యుండునుగాని యక్కడనే స్థిరనివాస మేర్పరచుకొని యుండెనని యూహింపనక్కరలేదు. ఈ గ్రంథ రచనవలన సుప్రసిద్ధుడైన సోమనాథుడు తరువాత గర్ణాటకదేశమున సంచరించుచున్నపుడు ఎక్కడనైన లింగైక్యమంది యుండవచ్చును. పాలకుర్తివారు తమ గ్రామముననే సోమనాథు డైక్యమందెనని చెప్పుదురు. కర్ణాటక కవులు జెప్పిన కల్కె మను గ్రామ మెక్కడిదో అసలు తెలియదు. కావున సోమనాథుడు సిద్ధి పొందిన స్థలమును నిర్ణయించుటకు ఇంకను పరిశోధన కావలసియున్నది. కర్నాటకమున సిద్ధిపొందెనని ఇటీవల కవి చెప్పినంతనే దానిని సోమనాథుని స్వదేశముగా నిర్ణయించుట నిజముకానేరదు.

ఇటులే పండితారాధ్యచరిత్ర పీఠికలో వీరనేక విషయములనుగూర్చి క్రొత్త మాటలు చెప్పబోయి పొరపడినారు. సోమనాథుని కాలము, కులగోత్రములు, వీర శైవసిద్ధాంతము మున్నగువానిని నిరూపించుటకై ఏమేమో వ్రాసినారు. బసవ పురాణ పీఠికవలన శ్రీ ప్రభాకరశాస్త్రిగారు మాకు పనిగల్పించినటులే శ్రీ నారాయణరావుగారును మాకు విమర్శనీయ సామగ్రిని లెస్సగా ననుగ్రహించినారు. నేను మొదలు శ్రీ నాగేశ్వరరావు పంతులుగారికి నివేదించిన యంశము నేటికి నిక్కముగనే పరిణమించినది. శ్రీ నారాయణరావుగారు తమ ఘనతకు దగినట్లు పీఠికను రచించుటలో సహకారులతో సంప్రదించనందువలన నిట్టి విపరీతముల కవకాశము గలిగినది. వీరి పీఠిక ఇపుడిపుడే మాకందినది. తక్కిన విషయములనుగూర్చిన విమర్శనలు యథావకాశము మున్ముందు వెలువడగలవు.

---




(విమర్శనకు ప్రతులు రెండేసి రావలెను.)

**మద్యనిరోధకగీతావళి;** ప్రకాశకులు, మద్యపాననిరోధక కేంద్రసంఘము, ఆబిడ్‌రోడ్, హైదరాబాదు, దక్కన్. పేజీలు 135, అందమైన అచ్చు వెల రు, 0-4-0 లు.

హైదరాబాదులో ప్రభుత్వమువారి పక్షమునుండి పైసంఘ మొకటి స్థాపింపబడి ౫-౬ సంవత్సరములనుండి మద్యపాన నిరోధమును గూర్చిన వాఙ్మయమును పత్రికలను ప్రచురించి ప్రచార మొనర్చుచున్నది. ప్రస్తుత గ్రంథమునను ఆ విషయముల పద్యములు, పాటలు, గేయములలో బోధింపబడినవి. గద్యముకంటె పాటలు మున్నగు ఛందోబద్ధములైన గీతములే పామరజనము నెక్కువగా నాకర్షించును. పామరులలోనే మద్యపాన వ్యసనముండుట జేసి యీ గీతావళి బ్రకటించుటలో జాల నుచితజ్ఞతను వెల్లడించి రనకతప్పదు. ఆంధ్రరాష్ట్రమందలి పలువురు కవులు (స్త్రీ పురుషులు) రచించిన షుమారు ౨౬౦ కృతు లిందుగలవు. కొన్ని రచనలు చాల బాగుగగూడ నున్నవి. ఇంత చక్కని పాత్తమును సులభముగా నొసంగుచున్న సంఘమువా రెంతయు ప్రశంసనీయులు. పునర్ముద్రణావకాశము గలిగెనేని రచనలలోని క్రమమును మార్చుటయే కాక గణయతిప్రాసలులేని గీతములను ప్రత్యేక భాగముగ బ్రకటింపగోరుచున్నాము. దీని ప్రతుల నెవ్వరేని యుదారులు చెప్పించి జనులలో ప్రచారము గావింపదగియున్నది.

**వైద్యప్రకాశిక;**—సంపాదకులు: టి. వి. భాస్కర్ గారు. ప్రకాశకులు; జ్యోతిర్విద్యాయుర్వేద వైద్యాలయము, మహబూబ్‌నగరము, దక్కన్. పుటలు, 80, కాగితములు బాగుగా నున్నవి. వెల రు. 0-8-0 లు.

ఈ చిన్న పొత్తమునందు పాదరసము, పదార్థములు, వ్యాధులు, వృక్షములు, పథ్యాపథ్యములు అను కొన్ని వైద్యశాస్త్రములు వివరింపబడినవి. పుస్తకముయొక్క నామము గంభీరముగా నున్నది కాని అందలి విషయసంగ్రహము ఘనతకు దగినది కాదు. వంశావళి స్తుతులు మున్నగునవి ఆదియందు చివరగా నున్నవి. పుస్తకము వెల తగ్గించవలెను. శ్రీ భాస్కర్ గారు ఉభయ వైద్యశాస్త్రములందు నైపుణ్యము కలవారని తోచుచున్నది. మున్ముందింకను ఉపయుక్తమగు గ్రంథము నాంధ్ర సరస్వతి కొసంగ గోరుచున్నాము.

**శ్రీ యోగి రాఘవేంద్రగారి జీవితసంగ్రహము:**—ప్రకాశకులు, యోగాశ్రమము, మోర్తోట, పోస్టు రేపల్లె, జి. గుంటూరు. పుటలు, 3౬. వెల తెలియదు.

పై యాశ్రమమున విశేషముగ వ్యాధిగ్రస్తులకు, అందునను దీర్ఘరోగులకు, గ్యారంటీగా చికిత్సజేసి బాగుచేయుచున్నారట. పలువురు మహనీయు లీ యాశ్రమసేవను మిక్కిలి పొగడియున్నారు. ఆట క్రొత్తపద్ధతుల ననుసరించి ప్రాకృతిక వైద్య సిద్ధాంతముతో చికిత్స చేయుదురట. అందరను యోగులుగను విరాగులనుగాను తయారుచేయుటకుగాదు. ఈయాశ్రమము, రోగిదుఃఖములనుమాన్పి ఆనందమయులనుగా జేయు గొప్ప లోకోపకార కార్యము నాచరించుచున్నదని తెలిసి సంతసించని వారుండరు. ఇట నింకను గొన్ని యుపయుక్తములగు పనులు జేయబడునట్లు తెలియుచున్నది. వీనికన్నిటికిని కారణమైన శ్రీయోగిరాఘవేంద్రగారిని గూర్చి సంక్షిప్తమైన కథ యీ పొత్తమున గలదు.

శ్రీవారిలోకసేవ యెంతయు ప్రశస్తము. ఎవరైన ఒకఅణా పోస్టుచీటులు బంపి యీ పుస్తకము తెప్పించుకొన వచ్చునని భావించు చున్నాము.

**రైతు:—** కర్త; వెల్దుర్తి మాణిక్యరావుగారు. ప్రకాశకులు. అణాగ్రంథమాల 3601 B. తూఫ్ బజారు, హైదరాబాదు దక్కన్. పుటలు 30, వెల రు. 0-1-0 లు.

విశ్వమందలి సమస్త మానవులకు అన్నమును బుట్టించువాడు 'రైతు,' వాని వ్యవసాయము, పన్నులు, ఋణము, విరాసతు (డిక్లేరు). సమిష్టి వ్యవసాయము, రైతుసంఘము, చేతిపనులు, తోటలు, అవిద్య, దుర్వ్యసనములు, మున్నగు సుప్రసిద్ధమైన విషయములు సయితము కొండటి దెలియవు. ఈ చిన్ని పొత్తముయొక్క ప్రచారమువలన విశేషముగా నిజాంరాష్ట్ర సోదరులలో రైతుల కష్టనిష్ఠురములు వెల్లడి కాగలవు. ఇట్టి యుపయుక్తమైన వ్యాసమును రచించిన గ్రంథకర్త గారును, సులభముగా నందించుచున్న ప్రకాశకులును ప్రశంసకు పాత్రులు. ఈ పద్ధతిలో 'శ్రీమంతుడు' 'బిచ్చగాడు' 'వకీలు' 'రాజు' 'వేశ్య' 'పంచదాయీలు' మున్నగు విషయములను గూర్చియు నిష్పక్షపాతముగ వ్యాసములను ప్రకటించుట పరమావశ్యకమని తలంచుచున్నాము.

**టీకాల వ్యతిరేకసంఘ నివేదిక—** ప్రకాశకులు:—అడుసుమిల్లి వేంకట కృష్ణశాస్త్రి గారు, కార్యదర్శి, ఆరోగ్యవర్ధనీ సమాజం, చందాప్రోలు, అంగలూరుపోస్టు, కృష్ణాజిల్లా. పేజీలు 24 నవీనమైన అచ్చు, కాగితములు. వెల అర్థణా చీట్లు పంపినవారికి ఉచితం.

మశూచికము, ప్లేగు మున్నగు జాడ్యముల కొరకై సర్కారువారు వేయించుచున్న టీకాలు, ఆరోగ్యమును కలిగించ జాలవనియును దానివలన చాలమంది పిల్లలకు ఎన్‌సిఫిలో మైలిటిస్ అను రోగము కలిగి మరణము పొందుచున్నారనియును, ఈ విషయము పరదేశమందలి గొప్ప గొప్ప డాక్టర్లు అంగీకరించిరనియును, ఇకముందు ప్రజలు తమ బాలురకు టీకాలు వేయించ వలదనియును ఈ సంఘమువారు ప్రచారము చేయుచున్నారు. ఇదివరకు కార్యదర్శిగా రొకరే ౮౦౦ రూపాయలను స్వయముగా ఖర్చుచేసి ప్రజోపకారము కావించుచున్నారు. ఇకనైనను ఈ సత్యమునకనుగో తప్పక నీ సంఘకార్యమున నన్నివిధముల తోడ్పడి తమ సంతానమును కాపాడుకొన వలసిన విధానములు ఈ నివేదికవలన తెలిసికొనవచ్చును. వీరి కార్యము మిక్కిలి స్తోత్రపాత్రమగు నున్నది.

**Anglo Indian Persian Calendar for 1940 :—** ప్రకాశకులు; శ్రీరామా బుక్ డిపో మార్కెటువీథి, సికింద్రాబాద్. ద. పేజీలు 16, చక్కని అచ్చుకాగితములు. వెల 0—2—0

ఇందులో ఇంగ్లీషు, పార్సీ, హిజ్రీ, తెలుగు తిథులు, తారీఖులు, వారములు, నిజాం గవర్నమెంటువారి సెలవులు, కార్తెలు మున్నగు విషయములు లిస్టుగాను వివరణములతోను, ఉద్యోగస్థులందరికి బనికివచ్చు రీతిని మిక్కిలి చక్కగా బ్రకటించినారు. వ్యాపారులుగూడ సంగ్రహింప దగియున్నది. ఇదివరకు వీరు బ్రకటించిన హైదరాబాదు స్టేటుడైరి ఏకగ్రీవముగ ప్రజానుమోదము వడసినది. టి వెల ఒక అణాచేసి సులభము గావింతురుగాక!

**సంక్షిప్త లింగపూజావిధి (కన్నడపుస్తకము):—** ప్రకాశకులు; శ్రీ శివప్పసోదరులు చిక్కపేట చౌకు, బెంగుళూరు సిటీ. పేజీలు 54, వెల 0—1—6. అచ్చుబాగున్నది.

ఇదివరకు శాస్త్రీయ పద్ధతిలో సప్రమాణముగా నున్న విధులు పనికిరాక వారియిష్టప్రకారము మచ్చు గొట్టించుకొన్న పొత్తమిది. తమాషగా నున్నది. దేవీ భద్రకాళీ వీరభద్రస్తోత్రములు పనికిరావట. మల్లయ్య ఎల్లయ్య అను మానవులను నుతించవలెనట. పార్వతీ వీరభద్రాది దేవతలు శివపరివారమునకు జెందియున్నారను జ్ఞానముకూడ వీరికున్నట్లు లేదు. ఇట్టి విపరీత బుద్ధులు వీరశైవమతమునకు వేరు పుర్వులని వేర చెప్పనక్కరలేదు. కన్నడదేశమునకే పనికిరాని ఈ పొత్తమును గూర్చి తెలుగువారికి తెల్పనక్కరలేదు.




**స్వవిషయము:**—విభూతికి ప్రథమ సంవత్సర మొక క్షణము వలె గడచి పోయినది. కార్యభారమున నుండుటవలన మే మెట్లు సాగితిమో స్వప్నము వలె నున్నది. మే మనుకొని నంత గొప్పగా సఫలత నందలేదు. కాని దేశములో నుండెడు విషమ పరిస్థితుల వలన నిరాటంకముగ పత్రిక ప్రకటింపబడి ప్రచారము నందుట సామాన్య విషయము గాదు. మా ప్రియ ప్రయాస లెట్లున్నను దాతలు, వ్యాస కర్తలు ఎక్కువగా సహాయ మొనర్చి మా యుద్యమమును సాగించి కృతజ్ఞతకు పాత్రులైరి.

ఇపుడు ప్రకటించిన సంచిక వలన మా పరిశ్రమను సహృదయులు గ్రహింపక పోరు. ముద్రిణా సామగ్రి ధరలు పెరిగి, పరాధీన స్థితిలో నున్న మా కిది ఘన కార్యమే యైనది. భాషాభిమానులు తమ మిత్రులను ప్రోత్సహించి విభూతి సంరక్షకులలో జేర్చుటయే కాక చందాదారు లగునట్లు అవశ్యముగా ప్రయత్నింపగోరుచున్నాము. 'విభూతి' పరివారము వారందరును మా జాబుల నెదిరిచూడక తమ సహాయమును స్వయముగా నందించి యుపకార మొనర్తురుగాక!

**బాల్యవివాహనిషేధము—నిజాంరాష్ట్రము:**—నిజాంరాష్ట్రమున నింతవరకు బ్రిటీషు ప్రాంతమందువలె శారదాఆక్టు లేకుండెను. అట్టి శాసనము ఇక్కడను కావలెనని ప్రముఖులు కొందరు కోరినందున హైదరాబాదు కౌన్సిలులోను ఇటీవల నది విచారణకు వచ్చి ప్రజాభిప్రాయము తెలిసికొనవలెనని మరల వెనుకకు మరలినది. ౧౪ సంవత్సరముల లోపుగ వివాహము చేయరాదను అభిప్రాయ మీ శాసనములో ముఖ్యము కాని ఇట్టి శాసన మీదేశమున సృష్టింపబడుచో చాల యిబ్బందులు కలుగునని ఘంటాఘోషముగ జెప్పవచ్చును.

ఇది రజస్వలానంతర వివాహమగుటవలన ధర్మశాస్త్రవిరుద్ధమని వేరే చెప్ప నక్కరలేదు. హిందువులలో పరస్పర విరుద్ధ భావములను బుట్టించుట కిది మూలమగును. గణపత్యుత్సవములకును పురాణములకును అనుమతులు దొరకక కష్టపడుచున్న పౌరులకు ఈ కానూనువలన మరొకవిపత్తు రానున్నది. పైగా హిందువులలో నేడు యుక్తాయుక్తజ్ఞానము కలుగుచున్నది. కావున విరుద్ధమైన వివాహము లెవరును గాపించుటలేదు. అవి స్వయముగానే తగ్గుచున్నవి. ఏ మతమువారికిని అవసరములేని ఈ కానూను హిందువుల తలమీద బలాత్కారముగ నుంచనెంచుట నైపుణ్యము కానేరదు. ధర్మశీలురగు శ్రీనిజాం ప్రభుత్వము వారు ఇట్టి మతసంబంధమైన విషయములకు కౌన్సిలులో తావొసంగవలదని కోరుచున్నాము. ప్రజలలో సక్రమమైన వివాహాపద్ధతులు ప్రచారమునకు వచ్చునట్లు ప్రముఖులు ప్రచారము గావించవలసి యున్నది.

# చిత్రపరిచయము



ఈ సంచికలో ప్రకటింపబడిన చిత్రపటముల యొక్క పరిచయ మీ క్రింద వివరింపబడుచున్నది. ఫొటోలక్రింద నంబర్లు వేసిన ప్రకారమే చూడవలెను.

శ్రీ రామేశ్వర జ్యోతిర్లింగము.

సుప్రసిద్ధమైన ఈ చిత్రముయొక్క విషయమును గూర్చి యీ పత్రికలో (ద్వాదశ జ్యోతిర్లింగములు) ప్రత్యేకముగా చూడనగును.

౧. శ్రీ జగద్గురు సిద్ధలింగ శివాచార్య మహాస్వాములవారు.

వీరశైవ పంచ సింహాసనములలో రెండవదగు జ. శ్రీ దారుకాచార్యులవారి సద్ధర్మ పీఠము. బళ్ళారి జిల్లా ఉజ్జయినీ గ్రామమున గలదు. శ్రీవారాపీఠమునకు 30 వత్సరముల వరకు అధిపతులుగా నుండి ౩ వత్సరముల క్రితము శివసాయుజ్యము నందినారు. ౪,౫ నూర్ల సంవత్సరములనుండి వీరశైవ లోకమున నింతటి మహాతపస్సార్వభౌములు ఉదయించలేదు. శాపానుగ్రహ శక్తితోబాటు సమస్త శాస్త్రములందు పాండిత్యము గల్గి లక్షలకొలది శిష్యుల నుద్ధరింపగల్గిరి. ధర్మమూర్తులగు వీరు త్వరగా వెడలిపోయినందున వీరశైవ ప్రపంచము సంకటమున బడియున్నది.

౨. ఉజ్జయినీ పీఠము, మహాద్వారము.

౧-వ నంబరులో వివరింపబడిన శ్రీవారి సింహాసన మహా మఠముయొక్క మహాద్వారమిది. చాల ప్రాచీనకాలము నుండి రాజాధిరాజులచే సన్మానింపబడి మహావైభవముగా నున్నది.

3. శ్రీ జ. సిద్ధేశ్వర శివాచార్య మహాస్వాములవారు.

పైన చెప్పబడిన ఉజ్జయనీ పీఠమునకు ప్రస్తుతము శ్రీ వారు 3 వత్సరముల నుండి అధిపతులై యున్నారు. గొప్ప విద్యాపక్షపాతముగల మహనీయులు.

౪. 'సంప్రతి' ఎట్టగుడి శిలాశాసనము.

దీనినిగురించి యీ సంచికలోనే ప్రత్యేకముగా నొక వ్యాసముగలదు. ఆశాసనమున కిదిఫోటో.

౫. శ్రీ జ. పంచాక్షర శివాచార్య మహాస్వాములు, కాశి.

౬. కాశీ జ్ఞానసింహాసనము దర్బారుహాలు.

వీరశైవ పంచాచార్యులలో నిది యైదవ పీఠము. శ్రీ జగద్గురు విశ్వారాధ్యులు దీనిని స్థాపించిరి. దీని వైభవము వర్ణనాతీతము. వీరశైవలోకమందలి సమస్త సంస్కృతపండితుల కిదియే విద్యాభిక్షముపెట్టినది. మహావిద్యా పక్షపాతులును శాంతస్వభావులును అగు ౫ వ నంబరు శ్రీ వారు ప్రస్తుతము అధిపతులుగా నున్నారు.

౭. శ్రీ జ. నీలకంఠ లింగశివాచార్య స్వాములవారు.

శ్రీ జ. పంచాచార్యులలో మూడవపీఠమగు కేదార వైరాగ్య సింహాసనము నకు శ్రీ వారు అధిపతులు. గొప్ప మేధావంతులును, విద్యాదాతలును అయి యున్నారు. కళాశాలను నిర్వహించుచున్నారు. ఈపీఠము హిమాలయములో కలదు.

౮. పండిత శ్రీ కాశీనాథశాస్త్రిగారు.

శ్రీవారి కీర్తి మహనీయముగానున్నది. కర్ణాటక దేశమందు గురువర్గమున జ్యోతిస్సంచారముచేసి వీరశైవులకు పూజనీయులైనారు. గొప్పపండితులు. అనేక ఉత్కృష్ట గ్రంథములను ప్రకటించినారు. మైసూరునుండి పంచాచార్య ప్రభయను కన్నడ వారపత్రికను ప్రచురించు ఎలెక్ట్రిక్ ప్రెస్సుకు అధిపతులై వీరశైవ విద్వాంసు లందరికి సహాయభూతులుగా నుందురు.

౯. శ్రీ మ. మ. పండిత శివకుమార శాస్త్రిగారు.

కాశీనగరమున నీ శతాబ్దిలో నుదయించిన సంస్కృత విద్వాంసులలో వీరు సార్వభౌములుగానుండి అనన్య శివభక్తులయ్యుండుటెగాక లింగధారణచంద్రిక యను మహోన్నత గ్రంథమునకు వ్యాఖ్యానము గావించి లింగధారి మతమును లోకమున చాటిన మహానుభావులు, మహామహోపాధ్యాయులు. సహస్రాధిక విద్వాంసులకు ఆచార్యులు. ప్రస్తుతము శివలోకమున నున్నారు.

౧౦. శ్రీ అహల్యాబాయి మహారాణిగారు.

మూడునూర్ల సంవత్సరముల క్రితమ మీ మహారాణిగారు ఇందూరు రాజ్య మును పరిపాలించుచు ననేకచోట్ల దుర్జనుల మదమణచి శివలింగముల బ్రతిష్ఠించి చరిత్రప్రసిద్ధురాలైన మహాశివభక్తురాలు.

౧౧. బాళేహళ్లి జగద్గురువుల ఉత్సవములు.

మైసూరులో శ్రీ మహారాజుగారి యాతిథ్యము వలన శ్రీబాళేహళ్లి జగద్గురు శివానందరాజ దేశికేంద్ర మహాస్వాములవారి యుత్సవ మత్యంతవైభవముగా నెర వేరినది. ఆధునిక వీరశైవాచార్యుల కిది యపూర్వము.

౧౨. పరలీ శ్రీవైద్యనాథ జ్యోతిర్లింగము.

౧౩. పరమళీ మహారుద్రాభిషేకోత్సవము.

నిజాంప్రాంతములోని బీడుజిల్లాలో నీ క్షేత్రముకలదు. ఇటకై. శ్రీ శివకోటి వీర భద్రయ్యగారను మహానుభావులు రుద్రాభిషేకము చేయదొడగగా నక్కడిస్మార్తులు వీరశైవులకు వేదాధికారము లేదు కావున చేయ వీలులేదని నిషేధించిరి. దానిపై ఆరు సంవత్సరములదనుక శాస్త్రవాదములు జరిగెను. లక్షలకొలది ధనము వ్యయమయ్యెను. మహావిద్వాంసులందరుసు గుమిగూడిరి. చివరకు వీర శైవులకే విజయ మైనది. వేద తీర్థ పరీక్షలో నుత్తీర్ణులైన పండిత చి. మ. వీరభద్రశర్మగారే తమ పౌరోహిత్యమున

ఈ మహా రుద్రాభిషేకమును జేయించిరి. హోమకుండమునొద్ద కలశముల వేదిక పైన ఒన్టవ నంబరు వారినిగా శ్రీ శర్మగారిని గురుతించవలెను. క్రిందివైపు ఈ చిహ్నముగలవారు శ్రీ శివకోటి వీరభద్రయ్యగారును వారి ధర్మపత్ని యును గలరు.

౧౪. శ్రీ మటికె నాగయ్యగారి ధర్మనిలయము.

౧౫. ,, వీరభద్ర భద్రకాళీ విశ్వేశ్వరులు.

ఇవి రెండును కీ శే. మటికె నాగయ్యగారిచే ప్రతిష్ఠింపబడినవి. పం. చి. మ. వీరభద్రశర్మగారి వీరశైవ గురుకుల, విభూతి పత్రికల కార్యము లీ మహానుభావుని ఔదార్యమువలననే జరుగుచుండుట లోక విదితము.

౧౬. సుందరమైన నందీశ్వరుడు.

సికిందాబాదు మటికె నాగయ్యగారి ధర్మనిలయములో నీ నందీశ్వరుడు విరాజిలుచున్నాడు. మూర్తి చిన్నగా నున్నను, కళాదృష్టితో దీనికీర్తి గొప్పదై దర్శింప దగియున్నది.

౧౭. దక్షిణావర్త (కుడిసుడి) శంఖము.

ఈ శంఖము అపూర్వమైనది. కొన్ని వేలవరకు దీని వెల యుండును. ఇట్టి శంఖములు మన దేశమున చాల కొలదిగా గలవు. అన్నిటివలె గాక నిది కుడివైపు దిరిగియుండును. ఎవరియింట నుండినచో వారు కోటీశ్వరులై ఒకనూరు వత్సరముల వరకు మహైశ్వర్యము ననుభవింతురని ప్రతీతి కలదు. ఏ పుణ్యాత్ములదగ్గర నున్నదో!

౧౮. శ్రీ మహంతుమఠము చెన్నబసవయ్యగారు.

హైదరాబాదు నివాసులగు వీరు ౫-౬ వత్సరముల క్రింద కైలాసమున కేగిరి. విద్యాభిమానముతో వీరశైవ విద్యార్థులలో పలువురికి సహాయపడిరి. వైదిక పౌరోహిత్యములందును, వైద్యశాస్త్రము నందును విశారదులై కీర్తినందిన మహనీయులు, చి. మ. వీరభద్ర శర్మగారి విద్యాభ్యాసనమునకు మూలకారణులు. పరోపకార పారీణులు.

౧౯. విభూతి సంపాదకులు—వీరి పరిచయము వ్రాయనక్కరలేదు.

౨౦. హిమాలయ యాత్రికుడు.

వీరెవరో మీరు గురితించితిరా? 1929 జూన్ నెలలో అత్యంత పరిశ్రమతో హిమాలయ యాత్రను గావించినపుడు సైతము నేటి 'విభూతి' పత్రికా సంపాదన కార్యమంత కష్టము ఈ వ్యక్తికి గలుగలేదు. వీరెవరో ఇపుడైన మీకు తెలిసి యుండునుగదా!

(అనేక బ్లాకుల నొసంగి యుపకార మొనర్చిన శ్రీ పండిత కాశీనాథశాస్త్రి గారికి మా కృతజ్ఞతను వెల్లడించుచున్నాము.)

# చందాదారులకు సూచన

'విభూతి' ప్రథమ సంవత్సరమును నిర్విఘ్నముగ గడిపి ఈ సంచికతో రెండవ సంవత్సరమును ప్రవేశించిన దనియును, శక్తివంచనలేక చక్కని ప్రయత్నములతో నది పాఠకలోకము యొక్క ఆదరణమును పొందుచున్నదనియును మేము చెప్పనక్కరలేదు. ఈ పత్రికాభివృద్ధి యంతయు చందాదారుల మీదనే యాధారపడి యున్న సంగతియు అందరికి తెలిసియున్నది. మొదటి సంవత్సరమున చాలమంది మహనీయులు, వందలకొలది ద్రవ్యమును సహాయ మొనర్చుట వలనను, చందాల నొసంగుట వలనను నిరాతంకముగ 'విభూతి' ప్రకాశించినది. ఇంకను చాలమంది సహాయము నొసంగ వలసియున్నది. మొదటి సంవత్సరపు చందాకూడ కొందరి నుండి రాలేదు. పైగా రెండవ సంవత్సరము చందాకూడ వారి లెక్కలోకి ఎక్కినది. ఈ సంచిక యందిన పదిదినములలో తమతమ చందాలను మనియార్డరుద్వారా పంపినచో వారికిని మాకును వ్యయ ప్రయాసలు తగ్గును. మేము వి. పి. గా పంపిన యెడల నాల్గుఅణాలు ఎక్కువయగును. పత్రికయొక్క ఆకార ప్రకారములు అభివృద్ధి చేయబడినను ధరలు పెరిగిపోయినను సంవత్సరము చందా, మునుపటివలె రెండున్నర రూ (2-8-0) విధింపబడినది. కావున త్వరగా చందాను పంపుచు మనియార్డరు కూపనులో తమ చందానంబరును చిరునామాను స్పష్టముగ వ్రాయవలెను. ఏకారణము వలననైన తమకీ పత్రిక అక్కర లేదని తోచినచో ఆవార్తను శ్రమయనక వ్రాసి తెల్పవలెను. కొందరు చందాదారులు రెండవ సంవత్సరము చందానుకూడ పంపి సహాయ మొనర్చినారు. ఈ క్రింద తెలుపబడిన నంబర్లుగల చందాదారు లందరును చందాను పంపనిచో వారి యంగీకారముగ భావించి ముందుసంచికను వి. పి. గా రెండు రూపాయిల పన్నెండు అణాలకు పంపగలము. స్వీకరించి సహాయపడ గోరుచున్నాము.

## బ్రిటిష్ ప్రాంతములో

30 34 35 36 37 40 41 42 50 52 53 54 56 57 58 59 60 72 73 85 86 87 92 93 94 95 101 104 110 111 112 113 114 115 116 117 119 120 121 123 125 126 132 133 134 140 569 570 571 572 573 574 575 576 577 578 579 580 581 582 583 585 586 587 588 589 590 591 592 593 594 595 596 597 598 599 600 601 602 603 604 605 606 607 608 609 610 611 612 652 653 654 655 657 658 659 660 661 662 663 664 665 666 667 668 669 670 671 672 673 674 675 677 678 679 680 681 682 683 684 685 686 687 688 689 690 691 692 693 694 695 696 697 698 699 700 701 702 703 704 705 706 707 708 709 710 711 712 713 714 715 716 717 718 719 720 721 722 723 724 725 726 727 728 729 730 731 732 733 734 735 736 737 738 739 741 742 753

## నిజాం ప్రాంతములో

౨౦౧ ౨౦౨ ౨౦౩ ౨౦౫ ౨౦౬ ౨౦౭ ౨౦౯ ౨౧౧ ౨౧౨ ౨౧౩ ౨౧౪ ౨౧౫ ౨౧౬ ౨౧౭ ౨౧౮ ౨౧౯ ౨౨౦ ౨౨౧ ౨౨౨ ౨౨౩ ౨౨౪ ౨౨౫ ౨౨౬ ౨౨౭ ౨౨౮ ౨౩౦ ౨౩౧ ౨౩౨ ౨౩౪ ౨౩౫ ౨౩౬ ౨౩౭ ౨౩౮ ౨౩౯ ౨౪౧ ౨౪౨ ౨౪౩ ౨౪౪ ౨౪౫ ౨౪౬ ౨౪౮ ౨౫౦ ౨౫౧ ౨౫౨ ౨౫౪ ౨౫౫ ౨౫౬ ౨౫౭ ౨౫౮ ౨౫౯ ౨౬౦ ౨౬౧ ౨౬౨ ౨౬౩ ౨౬౪ ౨౬౫ ౨౬౬ ౨౬౭ ౨౬౮ ౨౬౯ ౨౭౦ ౨౭౨ ౨౭౩ ౨౭౫ ౨౭౬ ౨౭౭ ౨౭౮ ౨౭౯ ౨౮౦ ౨౮౧ ౨౮౨ ౨౮౩ ౪౦౫ ౪౦౬ ౪౦౭ ౪౦౮ ౪౦౯ ౪౧౧ ౪౧౨ ౪౧౪ ౪౧౫ ౪౧౬ ౪౧౯ ౪౨౦ ౪౨౧ ౪౨౨ ౪౨౩ ౪౨౬ ౪౨౭ ౪౨౯ ౪౩౧

మేనేజరు: 'విభూతి' సికిందాబాదు.




సచిత్ర మాసపత్రిక

పుండ్రము ౧ | శా. శ. ౧౮౬౨. విక్రమ సంవత్సర చైత్రమాసము 22 ఏప్రిల్ 1940 సికింద్రాబాద్. | రేఖ ౧

# కోకిల

శ్రీ శేషాద్రి రమణకవులు

గీ. ఇది మనోజ్ఞవనం బిటనే జనించి, యిచటి ప్రకృతి ఫలంబుల రుచులెఱింగి
యీ వనస్పతులందున జీవితంబు, గడుపు కవికోకిలమ! నీవెగద సుకృతివి.

ఉ. పుట్టినతావు నందె వలపుల్ జివురింపఁగఁ కంఠమెత్తి వా
కట్టు విదల్చి పాడెదవు గాదె ప్రపంచము మోహముగ్ధమౌ
నట్టుల భావగీతికల నద్దిర సత్కవికోకిలంబ! నీ
విట్టి యమోఘ గానకళ నెట్టుల నేర్చితో చిత్రమయ్యెడిన్.

చ. పదముల కూర్పులేదు, రసవత్కవితారచనంబు సున్న, దృ
క్పదవికి నింపు గూర్చు నవద్యతనూవిభవంబు లేదు మే
మిదివర కెన్నిమార్లొ వినియే తనివోందిన పాట నీది నీ
వదనసుధాద్రవం బ్రది శ్రవఃప్రియ మాటలు వింతగూర్చెడిన్.

# ఆచార్య పండితుఁడు

(అవశిష్ట భాగము)

శ్రీ బండారు తమ్మయ్యగారు

## శ్రీ జగద్గురు రేణుకాచార్య చరిత్ర



"పరమేశ్వరుఁడగు శివుఁడు సకలామరముని సంసేవితుండయి కైలాస శిఖర మున నిండుకొలువుండి పారిషదగ్రగణ్యుఁడగు రేణుకునిఁ దన యంతికమునకుఁ బిలిచి యతినిగూఢమగు లింగాంగయోగమును భక్తులకు బోధించి ప్రకటించుటకయి భూలోకంబున కేఁగి జంబూద్వీపమునఁద్రిలింగదేశమునఁ గొలనుపాకయందలి సోమేశ లింగము నందుద్భవించి యేడుశతాబ్దులు ప్రత్యక్షముగను మఱియేడు శతాబ్దులు రహస్యముగను సంచరించుచుఁ దదనంతరము మఱలఁ దన సాన్నిధ్యమునకు రమ్మని నియోగించెను. సర్వేశ్వరుని యానతి శిరమునఁదాల్చి రేణుకుఁడు కైలాసమునుండి వెడలి విష్ణు బ్రహ్మేంద్రాదిలోకములను, ధ్రువపదమును, సూర్యచంద్రాది గ్రహస్థానములను గ్రమముగ నీక్షించుచు మేరుపర్వతమున కరుదెంచెను. అటనుండి దక్షిణ దిశాభిముఖుండయి యంగ వంగ కళింగాది దేశముల నవలోకించుచు నయనాభిరామ బగు త్రిలింగదేశమున కేఁగి కొలనుపాకయందలి సోమేశ్వరస్వామిని సందర్శించి యాతని గర్భమునఁ బ్రవేశించుటకయి సమయమును నిరీక్షించుచుండెను. అప్పుడ స్వామి నారాధించుటకయి భక్తవరు లరుదెంచి స్తోత్రము లొనర్చి శ్రద్ధతోఁ బూజించుచుండిరి. అప్పు డపూర్వంబగు నొక యద్భుత తేజ మా లింగమునుండి వాడి గోచరించెను. దేవతలు పుష్పవృష్టి గురియుచుండి నప్పుడు రేణుకాచార్యుఁడు భస్మత్రిపుండ్రాంకిత దేహుండును, దండాలంకృత కరుండును వజ్రకుండలమండిత కర్ణుండును లింగాంకిత మస్తకుండును నయి వెలుంగుచు హారిన్మయియగు కంథయు విమల మను యజ్ఞసూత్రమును కౌశేయ కౌపీనములను పింగలవర్ణ భాసురమగు జటాబంధ మును ధరించి సోమేశ్వరలింగ గర్భమునుండి యావిర్భవించెను. ఆశ్చర్యచకితులయి యవలోకించి పునః పునః ప్రణామము లాచరించు సభ్యుల కాతఁడు నిజావతరణ ప్రయోజనమును, పరమేశ్వరుని యాజ్ఞాప్రకారమును దెలియఁ బఱిచి వారికానంద మును గలిగించెను. అనంతర మాతఁడు పరమశివభక్తుండగు నగస్త్యమహర్షిని మును ముందుద్ధరింప మనంబున నిశ్చయించెను. అంత నచ్చటి భక్తులకుఁ బరశివమత

తత్త్వము నుపదేశించి జనులాశ్చర్యాన్వితులయి విలోకింపఁ గరతలమున నిష్టలింగము నారాధించుచు గగనతలమున కెగసి మార్గోపలబ్ధములగు క్షేత్రములను, తీర్థములను, వనములను, సిద్ధాశ్రమములను, దేశములను వీక్షించుచు మలయాద్రిని చేరెను. ఆ పర్వతవైభవమును నచ్చటి యగస్త్యాశ్రమ ప్రాభవమును నవలోకించుచు నాకాశమునుండి యవతరించి యగస్త్యమహర్షి నీక్షించు తలంపుతో నాతని యాశ్రమమున బ్రవేశించెను. సంభ్రమముతో నెదురేగి ప్రత్యుత్థాన మాచరించు నగస్త్యునకు నిజ వృత్తాంతము దెలియఁబరచి యాతని సన్నుతులకుఁ గడుంగడు సంతసించి వీరశైవ మత మహత్త్వమును లింగాంగ తత్త్వాత్మకసామరస్య సిద్ధాంతములను నాతనికి సమ గ్రముగ బోధించి లోకకల్యాణమునకై యా సిద్ధాంతశాస్త్రము నంతటను వ్యాపింపఁ జేయుమని యాదేశించెను. అంత నాతఁ డగస్త్యుఁడు చూచుచుండగనే యంత ర్ధానమొంది యంతరంగమున నుమాకాంతునిఁ జింతించుచు నా మలయమహీధర మధ్యమున భద్రాతీరమునఁ బ్రత్యేక యుగస్వప్రతిష్ఠితంబయి క్షీణదశనొందిన రంభాపురీ ధర్మపీఠము నభివీక్షించి, యటనుండి తారాపథమునఁ దరలి పారావార తీరమును జేరి రామేశ్వరస్వామిని దర్శించి యచ్చట మునులకు శివాద్వైతము బోధించెను. అనంతర మాతఁడు లంకాపట్టణమునకేఁగి తత్పరిపాలకుండగు విభీషణుని యభ్యర్చనము నందెను. అప్పుడు విభీషణుఁ డాతని కిట్లని విన్నవించెను.

"మహాత్మా! మహాశివభక్తుండగు నా యన్న రావణుడు నవకోటి శివలింగ ములం బ్రతిష్ఠింపఁ బ్రతినబూని తన యవసానకాలమున కాఱుకోట్లు శివలింగము లను మాత్రమే ప్రతిష్ఠింపఁగలిగెను. మరణసమయమున నన్నవలోకించి యాతఁడు తన ప్రతిజ్ఞాపూర్తికై తక్కిన మూడుకోట్ల శివలింగములను గూడఁ బ్రతిష్ఠింప జేయుమని యాజ్ఞాపించెను. అపుడు నేను బాల్యము నుండియు విష్ణుభక్తుఁడనవుటచే నవకోటి నారాయణ ప్రతిమలను బ్రతిష్ఠించి యాతనికి సుగతిని గలిగింతు నని విన్న వించితిని. అందుపయి నా యగ్రజుఁడు వత్సా! మత్స్యరూపధరుండగు నాదినారాయ ణుఁడుఁగూడ సర్వేశ్వరుడగు శివునే యారాధించి తరించెను. కావున నా సుగతికి నా కోర్కె ననుసరించుటయే కర్తవ్యమని యాదేశించి పంచాస్యస్తవ పఠనమొనర్చుచుఁ బంచత్వమును బ్రాపించెను. అంత సత్వరముగా నాతని కోర్కెని నెఱవేర్ప నిశ్చయించి, యేక ముహూర్తముననే పలువురు గురువులచే మూఁడుకోట్ల శివలింగములను ప్రతి ష్ఠింపఁ దలంచి, తత్సాధనము కయి మా తండ్రి విశ్రవసువుతో నాలోచింప నాతని యాశ్రమమున కేఁగితిని. ఆతండును నా యాగమనకారణంబును విని విష్ణుమూర్తి ప్రతిష్ఠించిన మత్స్యేశ్వరుని భక్తితో నారాధింపుమనియు నాతని యనుగ్రహము

వలననే యీ యభీష్టము నెఱవేఱఁగలదనియు నానతిచ్చెను. నేనును పురంబునకు మరలవచ్చి మత్స్యేశ్వరు నప్పటినుండియు సేవింపుచుండ నొక నాటిరాత్రి కడపటి జామున నాతఁడు స్వప్నగోచరుండయి వత్సా! అనుపమ ప్రభావసంపన్నుఁడగు శ్రీ రేణుక శివాచార్యుఁడు కలియుగ ప్రథమపాదమునఁ దానే ఈ పురమునకు స్వయముగ నేగుదెంచి నీ యభీప్సితము నిర్వహించునని యానతిచ్చెను. నా పూర్వ పుణ్యావశమున నేఁటికి మీ దర్శనమయినది. పరిపూర్ణ కారుణ్యంబున మదభీష్టము నెఱవేర్ప ననుగ్రహింపుఁడు.''

అంత విరాడ్రూపధరుం డగు నా గురువరుండు విభీషణు నావరించి త్రికోట్యాత్మకాచార్య రూపము వహించి త్రికోటి శివలింగములను నొక్క సుముహూర్తముననే ప్రతిష్ఠించి, శివాద్వైత సిద్ధాంతస్వరూపము నాతనికి బోధించి యంతర్హితుఁడయి యాకాశమార్గమునఁ గాశీపురమున కేఁగెను. అచ్చట వీరశైవసిద్ధాంతసంస్థాపనార్థ మయి విశ్వనాథలింగగర్భమునుండి యుద్భవించిన జగద్గురు విశ్వారాధ్యుని యాశ్రమంబునకుం జని యన్యోన్యసంభాషణానంతరము గంగాతీరమునఁ దప మొనరించు మునులకు శివతత్త్వము బోధించి వారికి గంగావతరణ వృత్తాంతమును దెలియఁజెప్పెను. పిమ్మట నాకాశయానమున హిమాలయమునకు జని యచ్చట మునినికరముచేఁ బూజితుండయి వారి కా మహీధరము సైరిభాకృతివహించిన కారణంబును దెలిపి స్వమతసిద్ధాంతమును బోధించెను. మఱియు నక్కడనున్న జగద్గురు శ్రీమదేకోరామారాధ్యుని యాశ్రమంబు సందర్శించి యాతని యుపచారము గ్రహించి యాతనితో నగ్రిమకార్యాలోచన మొనరించి యటనుండి కదలి, ఋశ్యశృంగమునీంద్రుని యాశ్రమంబున్న కకుద్గిరికిం జని యాతనిచేఁ బూజితుండయి కొన్నిదినము లచ్చటనుండి వీరశైవసిద్ధాంత మక్కడి మునీశ్వరులకు బోధించి యా క్షేత్రపూర్వ వృత్తాంతమును వారికిఁ దెలియఁజేసెను. తదనంతరము కూష్మాండశైలమునకుం జని యా భూధరమునకు నందిగిరి యను నామాంతరము గలిగినవిధంబు నచ్చటితాపసులకుం దెలిపి యటనుండి కదలి తుంగభద్రాతరంగిణీ విభ్రాజితంబగు పంపాక్షేత్రమున కేఁగి జగద్గురు శ్రీ మరుళారాధ్యుని సందర్శించి పరస్పరసంభాషణ మొనరించెను. తరువాత శివభక్తకులజాతుఁడయ్యు మదమత్తుఁడయి చరించు మంగలవాడపుర వీరాధీశ్వరుండగు వీరబిజ్జలుని మదమును హరింప మనమునం దలపోసి యా పురంబునకుం జని లీలామాత్రమున నాతని భవనమునఁ బ్రవేశించి "రాజన్ భిక్షాం దేహి" యని చెయి చాచెను. మదోన్మత్తుఁ డగు నాభూవరుడు ముందు వెనుక లరయక, యుడుకు చున్న వేడిపాయసాన్నమును గరిటెతో నాతని పాణిపల్లవ మందుం జేసె

దానిపై నా గురువరుండా చేతితో నాస్థానమంటపమందలి స్వర్ణస్థూణమును స్పృశిం
పగా నారాజేంద్రుని మందిరమునందంతటను బ్రళయాగ్నింబోలు భీకరవహ్నిజ్వా
లలు వ్యాపించి హాహాకారమును గలిగించెను. దానిపై బిజ్జలుఁడు పాదాక్రాంతుఁ
డయి ప్రమాదమున నొనర్చిన తన పాపకృత్యమును క్షమియించి యన్నభిక్షను
స్వీకరించుమని ప్రార్థించెను. నాతోఁబాటు నా గణముల కెల్ల భిక్షయొనర్చినచో
నీ యొసంగు భిక్షను బరిగ్రహింతునని చెప్పి యా యాచార్యవర్యుం డపార
పారావారముం బోలు తన యసంఖ్యాక గణవర్గమును దృగ్గోచరము గావించెను.
అంత ''మహాత్మా! అందరకు భిక్షసేయ నేను శక్తుండనే'' యని మెల్లన వచించి
మౌనము వహించి సిగ్గుతోఁ గరకమలముల ముకుళించి నిలచియున్న యా భూవరుం
గని "రాజా! ఏకమానపరిమితంబగు ఘృతంబును దండులంబులను నా కిపు
డొసంగుము. అదియ చాలును" అని యాతండు వచించెను. బిజ్జలుండును నట్లొనర్ప
వానిని గ్రహించి తన యనూన ప్రభావంబున సత్వరంబుగ సకలభక్ష్య భోజ్యంబు
లను సంఘటించి యా గణముల కెల్లఁ దృప్తి కలిగించెను. ఇట్టి లీలాజాలములతో
నా రాజేంద్రుని వినీతునిం గావించి శివాగమ గ్రథితంబగు గురుప్రభావమును
సకల వీరశైవ రహస్యములను నాతనికి బోధించి రేణుకుఁడు సువర్ణకోటులను బాదా
ర్పణ మొనర్చుచు నా బిజ్జలు నాశీర్వదించి యటనుండి శ్రీశైలమునకుఁ దరలెను.
ఆ క్షేత్రమున శ్రీ మల్లికార్జునలింగ సముద్భూతుండగు జగద్గురు పండితారాధ్యు
నితోఁ గుశలప్రశ్న మాచరించి కొన్ని దినంబు లుండి మఱల మలయాద్రికిఁ
బ్రయాణ మయ్యెను. ఇంతలో శ్రీ శంకరాచార్య మునివరుండు శివ సాక్షాత్కా
రమునకై శ్రీ గిరి మధ్యభాగమున ఘోరనిదాఘ సమయమునఁ దప మొనర్పగా,
''చంద్రమౌళీశ్వరనామ లింగమును బడసి భక్తితో దాని నర్చింపుము. శ్రీ రేణుకా
చార్య గురువర్యుని వలన నీ కది లభింపగలదు. అపుడు నీ పూజల కలరి దర్శన
మొసంగుదును. కావున నా యాచార్యవర్యునకై యత్నింపుము." అను గగనవాణి
యాతనికి వినవచ్చెను. అంత శంకరాచార్యుడు సకలదేశములం బరిభ్రమించుచుఁ
గర్ణాట దేశమున మలయాచల మధ్యమున రేణుకుని యాశ్రమంబును గాంచి యా
మహాత్ముని బహుభంగులఁ బ్రస్తుతించి ప్రహృష్టునిం గావించి యాతని వలనఁ
జంద్రమౌళీశ్వర లింగమును గ్రహించి యుమాకాంతుని సాక్షాత్కరింపఁ జేసికొను
టకై తుంగానదీతీరమును జేరెను. రేణుకుండును గగనమార్గమునఁ జోళదేశమును జేరి
యేకామ్రేశ్వర, జంబుకేశ్వర, మహాకుంభేశ్వర, మధ్యార్జునేశ్వర, వృద్ధగిరీశ్వరారుణగిరీశ్వ
రాది దేవతా సార్వభౌముల విలోకించుచు, పరమ పావనంబగు పుండరీక క్షేత్రమును

సేవించి, తుండరీక మండలమున శ్రీ కాళహస్తీశ్వరు సాక్షాత్కారము నంది కాంచీ పురమును జేరి యందు మూఁగవానివలెను జెవిటివాని పోల్కిని మిక్కిలి మాసి చినుగుల బొంతను దాల్చి వికృతాకృతితో వీథివీథుల జరించుచుండెను. ఆతని గాంచిన జనంబులు కొందఱు పిచ్చివాఁడని తలంచి పరిహసించి నిందించియు, మరియు కొందరు మహానుభావుడని ధ్యానించి నమస్కరించియుఁ బరిపరివిధంబులఁ బ్రవర్తించు చుండిరి. ఒకనాఁడు కొందరు ధూర్తులాతనిం గొంపోయి వరదరాజాలయములో విడు వగా నాతఁడా వరదరాజస్వామికి శిరఃకంపన మాపాదించెను. ఆకస్మికముగా విపరీతముగ ఘటిల్లిన యీ శిరఃకంపన వృత్తాంతమును విని కాంచీపురాధీశ్వరుడు విజయేంద్ర చోళుఁడు వైఖానసాద్యాగమతత్త్వవేత్తలచే శాంతికక్రియ లొనరింపఁజేసెను. కాని యేమియు బ్రయోజనము లేదయ్యెను. అప్పుడు కొందరు భక్తులాతనికిఁ గాంచీక్షేత్ర మహత్త్వమును దెలిపి యా క్షేత్రాధినాథుఁడగు నేకామ్రనాథుని ధ్యానింపుమనియు నాతని యనుగ్రహము వలననే యీ యుపద్రవము తొలగింగల దనియు విన్నవించిరి. ఆ రాజేంద్రుఁడును నేకామ్రేశ్వరుని భక్తితో నారాధించుచు సకల జనములకు విరివిగ నన్నదానము గావించుచుండెను. ఒకనాటి రేయి కడపటి జామున నిద్రలో నాతని కేకామ్రనాథుఁడు గోచరుండయి "రాజా! నాకు సాక్షా త్పుత్రుఁడయిన రేణుకాచార్యుఁ డిప్పు డున్మత్తాకృతి నీ పురమందుఁ జరించుచున్న వాఁడు. కొందరు దుర్మార్గు లాతని కొనర్చిన యపమతివలన వరదరాజున కీగతి ఘటి ల్లినది. కావున నా గురువర్యుని వెదుకఁబంపుము. ఆతనివలననే యీ యుపద్రవము శాంతినొందును" అని పలికెను. ఈ స్వప్నవృత్తాంతమును దెలియఁబఱచి యట్టి యా కృతితోఁ జరించువానిని గొనితెండని యాతఁడు చారుల నియోగించెను. వారును బురంబునఁ బరిభ్రమించి మరలివచ్చి, "అట్టి యాకారము గల వాఁడొకఁడు రాజులో నా కేమిపని? నేను రానని చెప్పి దాటిపోయెను" అని చోళభూపతికి నివేదించిరి. అతం డును నాగ్రహముతో నాతని నెట్లున్న నట్టు కట్టి తెండని యాజ్ఞాపించెను. అందుకై వా రాతనిని గాలుసేతులు గట్టి భుజములపైఁ దెచ్చి రాజునెదుట నిలుపఁగా వారి దుష్టకృత్యమునఁ గొందరు కాళ్ళు విఱిగి మఱికొందఱు చేతులు పోయియు నింకఁ గొందఱసువుల బాసియు నానాదురవస్థలకుఁ బాల్పడిరి. విజయేంద్ర చోళు డాతని ప్రభావమున కచ్చెరువుపడి తన యపరాధముల క్షమించి రక్షింపు మని యాతని పాదములపైఁబడి యాతనిని బహుభంగుల సంస్తుతించెను. దాని కతఁడు సంతసించి యా రాజేంద్రుని ప్రార్థనము పయి విష్ణుశిరఃకంపము నివర్తించి శివాద్వైత సిద్ధాం తము నాతనికి బోధించి యటనుండి మాసనూరను గ్రామమునకుం జని యారిబయను

నున్న యచ్చటి శివాలయ మండపమున నొకనాడు రాత్రి శయనింపఁబోయెను. అద్ది చూచి యచ్చటి పూజారి భయముతో "అయ్యా! ఇటఁ బరుండకుఁడు. మఱి యొక చోటికిఁ బోయి శయనింపుఁడు" అనియెను. ఏలయని రేణుకుఁడు ప్రశ్నింప నా శివార్చకుఁ డా యాలయగోపురమున కనతిదూరమున నున్న రెండు మఱ్ఱిచెట్ల నాశ్రయించి మత్కుణాకృతిం ధరించిన పిశాచ మిథున మున్నదనియు రాత్రులం దచ్చటఁ బ్రమాదమునఁ బరుండిన వార లనేకు లా దయ్యములకు బలియైరనియు బదులుచెప్పెను. అందు కాతడు నవ్వి "నావంటి శివయోగుల కట్టి భయ మేమియులేదు. నీవు పొమ్ము. నేనిచ్చటనే పరుండెదను" అని నిర్భీకముగా శివధ్యాన మొనర్చుచు నా దేవాగార మంటపముననే శయనించెను. అంత నా యర్ధరాత్రిమున, దశదిశలందును గారు చీకటి గ్రమ్మియుండ మత్కుణీభూతము లా మఱ్ఱిచెట్లనుండి దిగి శివాలయముదెస నరుదేర రేణుకుడు తన ఫాలదృష్టిచే దగ్ధమొనర్చ, యా దైతేయమిథునము నద్యో గోలకద్వంద్వముగ మార్చివైచెను. మరునా డుదయమునం దాతఁ డా యయః పిండములను గమ్మరి యొద్దకుఁ గొంపోయి వానిని ఖడ్గాయుధములుగఁ జేసియిమ్మని కోరెను. వానిని స్పృశించినంతనే యా కర్మకారున కొడలు గంపమెత్త రేణుకుఁ డాతని భయంబుడిపి యా గోలకములను ఛురికాయుధములుగఁ జేయించి వానిని గరములందు ధరించెను. లోకాతిరిక్తమగు మహాతేజముతో వెలుంగు నా యాయుధ ద్వయమును వీక్షించి భయంపడి యచ్చటి జనంబులు "స్వామీ! యిదియేమి" యని ప్రశ్నించిరి. అందు కాతండు "పూర్వమొకప్పుడు పుణ్యారణ్యమునఁ దప మొనర్చు నొక మునిచంద్రునిఁ దపంబున కొక యక్షమిథునము విఘ్నమాపాదింప నాతఁడు తత్క్షణమ దనుజమిథునముగ భూమియందుఁ జరింపుఁడని వారిని శపించెను. వారి ప్రార్థనముపై మరల కరుణాళుఁడయి శ్రీ రేణుకాచార్యుని మీరెపుడు పీడింప నేగెదరో యప్పుడు మీకు శాపాంత మగునని ప్రసాదించెను. యక్షద్వంద్వమే యిపు డీ గోలకద్వంద్వముగ మారి శాపావధి నందెను" అని చెప్పి సమీపమున నున్న నదీతటమున కేగి యా యాయుధములలో నొకదాని నధోముఖముగ నా నదీ మధ్యమున నిక్షేపించి, నేను మరల వెలికిఁదీయుఁ దనుక నీవిచ్చట స్థిరముగ నుండు" మని యాదేశించెను. రెండవ యాయుధమును హస్తమున ధరించి వియత్తున కెగసి యాతఁ డంత నవంతీపురమునకుం జనెను.

అట విక్రమాదిత్యుని మందిరమున కేతెంచి యాతనిచే నర్చితుండై తాఁ దెచ్చిన దివ్యాయుధము నాతని కొసంగి "రాజా! మహేంద్రుని యానతిచే నీవు

స్వర్లోక రాజధానియగు నమరావతి కెప్పుడేగెదవో యప్పు డీ యాయుధము యక్ష వధూస్వాయాపమును దాల్చి నీకాశ్చర్యమును గలిగించును. అంతవరకు దీన్నిని శస్త్రముగా నుపయోగింపుము" అని యానతిచ్చి శివాద్వైత సిద్ధాంత మాతనికి బోధించి గోరక్షనాథ సిద్ధుని గర్వనిర్వాపణ మొనర్చువాడయి యాతఁడు వసించు కొల్లాపురమునకుం జని భిక్షుక వేషమున వీథులందు విహరింపఁ దొడంగెను. గర్వ విదగ్ధులగు నచ్చటి సిద్ధులు కొందరు బహు విధములఁ దన్ను వేధింప గతి స్తంభన మంత్రోచ్చరణ ప్రభావమునఁ దత్క్షణమ వారిని గుడ్యలిఖిత చిత్రములం బోలె నిస్స్పందితులుగనొనర్చెను. అదిచూచి జనులు, సింహవ్యాఘ్రాది వన్యమృగములను వాహనములుగా నొనర్చికొని, సకల క్షితీశులను వాంఛితార్థముల నొసంగు పరిచరులుగఁ జేసి యద్భుత మహిమాస్పదములగు నిఖిలకూటవిద్యలకు నధి నాథుఁడగు గోరక్షనాథుని పట్టణములోని సిద్ధుల కిట్టి విపరీతావస్థ ఘటించిన మహాను భావుడు సాక్షాచ్ఛివుండయి యుండునుగాని సామాన్య భిక్షుకుండు గానేరఁడని యాశ్చర్య పడసాగిరి. అంతే రేణుకుఁడు గోరక్షుని మందిరమున కేగి "భిక్షాం దేహి" యని యాచించెను. అదిచూచి గోరక్షుఁడు భార్యను బిలిచి "ప్రాణేశ్వరీ! అద్భుత సిద్ధ విద్యా సంపన్నుఁడ నగు నా భవనాంగణమును జొరవెఱచి యింతవర కెన్నడు నే భిక్షుకుడు భిక్షాదానమున కయి వచ్చియుండలేదు. నేఁడు వీఁడెవఁడో నిర్భయముగ వచ్చి భిక్షకై చేయి సాపుచున్నాడు. వెంటనే యీ ఖడ్గముతో వాని హస్తమును ఖండించి యిదియే నా యొసంగు భిక్ష యని చెప్పుము'' అని యాజ్ఞాపించెను. సాధ్వి యగు నాతని భార్యయు భిక్షుకాకృతియందున్నను రేణుకునియందు వెలుఁగు దివ్య తేజమును గాంచి యాతఁడు సదాశివ స్వరూపుం డని గుర్తెఱిగి, తన భర్త స్వభావము నెఱింగినదయ్యు మతిహీనతతో "ఇట్టి యకార్యమునకు నన్ను నియో గించుట తగదు'' అని విన్నవించెను. అందుపయి దండ తాడిత భుజంగము పగిది నాతఁడు మండిపడగాఁ గార్యము లేదనియుఁ బతిశాసనోల్లంఘ నము సతీమణుల కనుచితమనియు నాలోచించి యాతని యాజ్ఞను బాలింప నా గురువరుని కరమునం దా నిశితకరవాలమును విసరెను. అది రేణుకుని సోకినంతనే వేనవేలు కరవాలములు వచ్చిపడునంత మహోర్భటితో మరలివచ్చి గృహమునందున్న గోరక్షుని వక్షమునందుఁ జొచ్చి యాతనికి దురంతవేదన నాపా దించెను. అందుపయి నాతఁడు భార్యను బిలిచి వెంటనే మహాలక్ష్మీ దేవాలయమున కేగి యాదేవిని సంస్తుతించి తన దురవస్థ నామెకు నివేదించి రక్షింపఁ బ్రార్థింపు మని నియోగించెను. ఆమెయు నట్లొనర్ప శ్రీమహాలక్ష్మి సత్వరముగా గోరక్షుని

మందిరమున కేతెంచి ప్రాంగణమున నిలచియున్న రేణుకగురువర్యుని పాదములకు బ్రణమిల్లి "మహాత్మా! ఈ యవివేకి దుర్మదమున నొనర్చిన యపరాధమును క్షమించి వాత్సల్యమున నాతని రక్షింపవే"యని ప్రార్థించెను. ఆమె ప్రార్థన మంగీకరించి గోరక్షుని రక్షింప నాతఁ డనుగ్రహించెను. వెంటనే లోక మక్కజముతోఁ జూచుచుండ నా కరవాల మప్రయత్నముగ గోరక్షుని వక్షమునుండి వెడలి భూమిపై బడెను. గోరక్షుడు భార్యాసమేతముగ నా గురువర్యుని పాదములపైఁబడి బహువిధముల నాతని సన్నుతించి యాతనికిఁ గరుణాపాత్రుఁడయ్యెను. అంత రేణుకు డాతని లేవనెత్తి "వత్సా! నీ వొనర్చిన యీ యకార్యమునకయి నీ పయి నాకేమియుఁ గోపము లేదు ఇంతటినుండియైనను దురహంకారమును వీడి సన్మార్గమున జరింపుము. ఆపత్కాలమున నైన నసత్యమాడకుము. దుర్మతులనైనఁ బీడన మొనరింపకుము. దుష్టుల దూరీకరింపుము. శిష్టుల సేవింపుము. సర్వత్ర ప్రియహితవచనములనే పచరింపుము. పరశివసద్గురూపాసననే భజింపుము. పరకళత్ర క్షేత్రవిత్తములందలి వాంఛ విసర్జింపుము ఆబాలగోపాల మఖిలజగంబును నిష్పక్షపాతముగ విలోకింపుము. సంసార మసారమని యెఱింగి సర్వేశ్వరుం డగు శివునే సర్వదా చిత్తమునందు భజింపుము" అని హితోపదేశ మొనర్చి యాశీర్వదించెను. పిమ్మట నాతఁడు అయోధ్యావంతీ మాయాపుర జాలంధర మధురాది నగరంబుల సందర్శించి సర్వత్ర పరశివుని మహిమలను సదుపదేశములతో నెల్లరకు విస్తరించుచు మహాద్భుతదాయకంబు లగు సృష్టి వైచిత్ర్యంబుల దర్శించి వినోదించి యీశ్వరుని ధ్యానించుచు మరల మలయాచలమున కేతెంచెను.

ఇంతలో మంగళవాడ నగరమున మాయిదేవి యను భక్తురాలు రేణుకాచార్యుని పదపద్మములు నిరంతరము మనంబున నిలిపి సేవించుచు సకలైశ్వర్య సంపన్నయై యనేక ధర్మకర్మముల నాచరించుచు నా గురువరేణ్యుని కారుణ్యమునఁ గలిగిన తనయకు రేవణాంబ యని పేరుపెట్టి ప్రోదిసేయుచు సంగీతసాహిత్యాది విద్యలయందు సుశిక్షితగ నొనర్చెను. ఆ బాలికయుఁ బదియేండ్లప్రాయము నొంది దినదిన ప్రవర్ధమానయగుచుండెను. ఆ సమయమందే మంగళవాడపురాధీశ్వరుఁడు 'వీరబిజ్జలుఁడు రేణుకగురుగ్రామణి మాసనూరు పురోపాంతమున నదీమధ్యమందుంచిన దివ్యాయుధవృత్తాంతము విని యాయుధమును గొనితెచ్చి తనకిచ్చువారి కనేక సువర్ణరాసుల నొసంగుదు నని చాటించెను. ఈ వార్త కర్ణాకర్ణికగ విని కొంకణదేశీయుఁ డగు సుప్రసిద్ధసిద్ధుఁడు ఖర్పరుఁడు శార్దూలముపై నధిరోహించి పరస్సహస్రములగు యోగినీబృందములు బలసికొలువఁ బార్శ్వముల భేతాళభూతపరివారములు సేవింప

మహోగ్రాకృతితో మంగళవాడ కరుదెంచెను. బిజ్జలుఁడు నాతని కెదురేగి కైదండ యొసగి మణిగణఖచితమగు సింహాసనముపై నాతనిఁ గూర్చుండఁజేసి బద్ధాంజలియై తన యభీష్టము నెట్లయిన నెరవేర్పుమని ప్రార్థించెను. అందుకా సిద్ధుఁడు వల్లెయని పదిరెండువేల కన్యకల బలియిచ్చినఁగాని యా యాయుధము స్వాయత్తముగా దని ప్రేనికిఁ దెలియఁబఱచెను. ఈ మాట విన్నంతనే విషణ్ణుఁడయి బిజ్జలుఁ డెట్లును దన మనోవాంఛితమును మరల్చుకొనక సిద్ధుని యాదేశము నంగీకరించి కన్యాహరణార్థమై చారుల నియోగించి యొక్కటె తక్కు వగఁ బదిరెండువేల కన్యలను సంపాదించి కారాగారములందుంచెను. ఇక నెక్కడను కన్యలం గానక యత్యంత, లావణ్యయుతయు సకల శుభలక్షణ లక్షితయు నగు రేవణాంబనుగూడఁ గొని తేరఁ జారుల కాజ్ఞ యొసంగెను. మాయిదేవి వలదని యేడ్చుచు నెంత వారించినను వినక రాజభటులు బలవంతముగ రేవణాంబికను గొనితెచ్చి కారాగారమునఁ బడవైచిరి. వేఱుగతిలేక మాయిదేవి కన్నీరు మున్నీరుగాఁగ నేడ్చుచుఁ బలుతెరంగులఁ బలవించుచు రేణుక గురువరేణ్యుని పదపద్మములనే స్మరించుచు నిజప్రసాద లబ్ధయగు నందన నెట్లయిన నుద్ధరింపుమని ప్రార్థించెను. సర్వాంతర్యామి యగు నా సంయమి సార్వభౌముఁడు తత్‌క్షణ మామెకుఁ బ్రత్యక్షమయి యభయ మొసంగి వీరబిజ్జలుని మందిరమున కేతెంచెను. అప్రయత్నముగ లభించిన గురువరుని యాకస్మికాగమనమున కాతఁ డెంతయు హర్షించి దివ్యాయుధ వృత్తాంతమును తదాహరణార్థమై ఖర్పరుని శాసనము నాతనికి నివేదించెను. అంత. రేవణుఁడు "వత్సా! ఖర్పరుఁడు వంచకుడు. వా డభిలషించిన యేదో యొక కార్యసిద్ధికై యీ పన్నాగమును బన్నినాఁడు. కాని మోసమునకు నీవు లోనైతివి. ప్రాణిహననము పాపైకకారణంబని యెఱుంగవా ! కలలోనైన నెప్పుడు నిట్టి పనులకుం బూనకుము. నీ వభిలషించిన యాయుధమును నేఁ దెచ్చి యిచ్చెదను. వెంటనే కారాగారములందున్న కన్నియల నెల్ల విడిపింపుము'' అని యాదేశించెను రేవణుడు రాజమందిరమున కేతెంచినవార్త విన్నంతనే ఖర్పరుఁడిఁక మాటదక్కదని రెండవ కంటివానికిఁ దెలియకుండ రహస్యముగ సపరివారముగఁ బలాయితుండయ్యెను. అంత బిజ్జలునితో రేవణుఁ డా నదియొద్ద కేఁగి తద్విమల సలిలములనుండి యాయుధమును గొనితెచ్చి రాజు కరములం దుంచెను. అంత నొక్క క్షణములో నది యయిదు మొగంబులుగల భయంకర పన్నగాకృతిని దాల్చి హాలాహలాభీలంబులగు విషజ్వాలల వ్యాపింపఁజేయ బిజ్జలుఁడు భయవిభ్రాంతుడై "మహాత్మా! చాలుఁజాలు, ఈ విషానల పరితాపమును నే భరింపజాల. కలనైన నీ కరవాలమును నేను గోరను. దయయుంచి

మెప్పటియట్ల దీనిని నదియందు నిక్షేపింపుము." అని ప్రార్థించెను. "అట్లే యొనర్చెద, నీవు ససైన్యముగఁ బురమునకుఁ బ్రయాణమగుము" అని చెప్పి రేణుకుఁడాతని యొద్దనుండి యా కరవాలమును మరల గ్రహించెను. అప్పు డది యక్షరూపమును ధరించి యాతనికిఁ బ్రణామ మొనర్చెను. యక్షుండును రేణుకాచార్యుని సెలవునొంది నిజలోకమున కేఁగి యంతకుమున్నే శాపాంతము నంది యటఁజేరియున్న నిజాంగనతో నిష్టసౌఖ్యముల ననుభవించెను. రేణుకుం డంతఁ బ్రయాణోన్ముఖుఁడయిన వీరబిజ్జలునిఁ జేరి యాతని నాశీర్వటించి నిజరాజధానికిఁ బంపి తాను మలయాద్రి కేతెంచెను......

చోళభూపతి యొకప్పుడు కేరళ పాండ్య దేశాధీశుల వెంటఁగొని కాంచీనగరమునుండి మహేంద్ర సందర్శనార్థమై యేఁగుదెంచి సుధర్మాభిధానంబగు నాతని సభారంగమున నలంకరించెను. కాని మహేంద్రునకు నమస్కరింపకయే కొంతకాల మచ్చటఁ గడిపి మరలఁ గాంచీపురమునకుఁ బ్రయాణమయ్యెను. ఇంద్రుఁడిది యవమానముగ గ్రహించి పయికేమియు నట్టి భావమును బ్రకటింపక సకైతవముగ నుపచారము లొసంగి యాతని సాగనంపెను. మఱికొంత కాలమునకు సురరాజధానీ గోపురోర్ధ్వభాగమునఁ దనపాదుకాద్వయము నుంచి మహేంద్రుఁడు చోళభూపతిని మరల స్వర్గమునకుఁ దేరఁ దన సారథి యగు మాతలిని బంపెను. ఇంద్రసారథిని సబహుమానముగఁ బూజించి యా భూపతి యాతని వెంట స్వర్గమున కేతెంచి గోపురాగ్రమునఁ బాదుకాద్వయము నిబద్ధమయియుంట గుర్తించి యంతకంటె నూర్ధ్వముగఁ దనే గుఱ్ఱమును దాటించి పురమునఁ బ్రవేశించెను. ఇది యెఱింగి యింద్రుఁడు మనంబులోని యీసును బోనాడి మనుజలోక దురాసదంబగు నొక దివ్యహారమున నాతని బహూకరించి, "మహారాజా! ఈ హారము వలన నీవు నాకన్న మూఁడు మడుంగులు దివ్యతేజముతో వెలుంగుచున్నాఁడవు. నీవు మున్ను నన్ను నమస్కరింపని కారణమునఁ గలిగిన మనోవికారమును విడనాడితిని. అజ్ఞానవశంబున నేఁ బూనిన కోపమును విస్మరించి క్షమింపుము. నిరుపమ సఖ్యముతో నెప్పుడు నాయెడఁ బ్రవర్తింపుము" అని ప్రార్థించెను. అందు కా చోళనరేంద్రుఁడు "మహేంద్రా! శివుడు తప్ప నన్యదైవమునకు నమస్కరింప ననియు, ఆతని కర్పింపని పరిధానమును ధరింపననియు, ఆతనికి నివేద్యముకాని పదార్థమును భుజింపననియు, వ్రతము పూనినవాఁడ నవుటచే నీకు నమస్కరింప నయితిని గాని నిన్నవమానించుటకుఁగాదు. ఇది యన్యథా తలంపకుము" అని బదులు పలికెను. సునాసీరుఁ డా వచనంబుల కెంతేయు సంతసించి "రాజేంద్రా! స్వర్లోకమున నింద్రశబ్దము నాకు వర్తించునట్లు భూలోకమున నది నీకే వర్తించుగాక. ఇంతటినుండి రాజేంద్రచోళనామంబునఁ గీర్తి

వహింపుము" అని యనేక బహుమానముల నర్పించి నిజరాజధాని కాతనిఁ బుత్తెంచెను. కొంతకాలమున కాతని పట్టమహిషి కులశేఖరి యీశ్వరుని సేవించి తద్దను గ్రహమున కమనీయ శరీరుండగు నొక దివ్యకుమారునిం గనెను. కొంతకాలమునకు బృహస్పతి స్వయముగ నేతెంచి యా కుమారునకు రేణుకాచార్య దర్శన మెన్నఁడు లభించునో యప్పుఁ డాతఁడు చక్రవర్తి పదము నందగలఁడని రాజేంద్ర చోళునకు విన్నవించెను. ఆ మాటలకుఁ జాల సంతసించి యా రాజేంద్రుఁ డా యాచార్యవర్యు నన్వేషించుట కయి ససైన్యముగ నెల్ల దేశములందును సంచరించుచుఁ గర్ణాట దేశమును జేరి మలయాద్రి పర్యంతముల కేఁగి యచ్చటి తాపసుల వలన రేణుకాచార్యుఁ డా యరణ్యమందే యున్నవాడని యెఱింగి ససైన్యముగ నాతని యాశ్రమంబునకుం జని సాష్టాంగప్రణామంబు లాచరించి పలుతెఱంగుల నాతని సన్నుతించి దేవగురుండు వచించిన వాక్యముల నాతనికి నివేదించి తనపురంబున కేతెంచి తమ్ముఁ గృతార్థుల గావింప వేఁడికొనెను. రేణుకుండును నాతని ప్రార్థన మంగీకరించి కాంచీనగరమున కేతెంచి రాజేంద్రచోళు డొసంగు పూజనమునందియాతని కుమారు ననుగ్రహించి యాశీర్వదించి యేకామ్రేశ్వరాలయమున నధివసించి కాలముఁ గడపుచుండెను. అనంతర మాతఁడు శివాజ్ఞానుసారము తాను మరల శివలోకమును జేరవలసినకాలము సమాసన్నము కానున్నదని యెంచి తన పీఠమ్ము నలంకరింపదగు గురుదేవు నొకనిఁ బడయఁదలంచి తద్విషయక చింతనాపరుండయి మనమున గౌరీకాంతుని ధ్యానించెను. అప్పు డాతనికి "వత్సా! నీవు కోరు గురుమూర్తి స్వరూపమును మనమున భావించి యేకామ్రేశ్వరుని కెదురుగా నున్న భూతలంబున హస్తస్ఫాలన మాచరింపుము. భవదభీష్ట సిద్ధి ప్రాపించును." అను నీశ్వరసందేశ మాతనికి శ్రవణ గోచరమయ్యెను. ఆతండును శివధ్యాన మొనర్చి యిట్లొనర్పఁగా నా భూతలమునఁ బెళపెళమను ధ్వని యుద్భవించి యా భూవివరమున నరుణబింబము వలె వెలుంగు శిశువొకండు గానన య్యెను. విశాలాక్షుండును, భసితాలంకృత ఫాలుండును, సువర్ణ కేశాన్వితుండును, లింగాలింగిత మస్తకుండును, రుద్రాక్ష భూషావృతుండును, సచ్చిత్తోషమయుండును నగు నా మానసపుత్రుని భూగర్భమునుండి లేవనెత్తి రేవణుఁడు తనివిదీఱ విలోకించుచు నమందానందమును జెందెను. అంతఁ బురమునుండి బంగరు డోలికను దెప్పించి యందా బాలునుంచి యేనుఁగుపై నెక్కించి మహావైభవముతో నూరేఁగుచుఁ గాంచీపట్టణమునకు గొనిపోయి యాతనికి రుద్రదేవుడని నామకరణ మొనర్చెను. దినదిన ప్రవర్ధమానుఁడయి యా బాలుఁడు జనకునకు సంతసము గూర్చుచు నెనిమిదేండ్ల ప్రాయమ్ముం జెందెను. అప్పుడు రేణుకాచార్యుఁ డాతనిని

మలయాద్రికింగొని నిజపీఠమున దీక్షనొసంగెను. క్రమముగా నాతనికి సమస్తవిద్యలను గఱపి వీరశైవమత సిద్ధాంతమును సాంగముగ బోధించి, ఏకోరామారాధ్య, మరులారాధ్య, పండితారాధ్య, విశ్వారాధ్యులను, సమస్తదేశాధీశులను, నాహ్వానించి వారి సమక్షమున నాతనికి జగద్గురు పట్టబంధము గావించెను. అప్పుడా రుద్రదేవునకు జగదాచార్యులు శుభాశీర్వాద పరంపరయును, జగదీశ్వరులు ధన కనకవస్తువాహనాది నికరంబులు నొసంగిరి. రేణుకుఁడు వారందఱను సముచిత రీతి సత్కరించి నిజావాసంబులకు వీడ్కొలిపెను. కుమారునితోఁ దానిఁక దేశాటన మొనర్తునని భూవరులతోఁజెప్పి రేణుకాచార్యుఁ డంతఁ గుమారు నాందోళికయందుంచి గజారూఢుఁడై బయలుదేరెను. దేశదేశములఁ జరించుచు నాతఁడు భుజగారణ్యాభిదం బగు పురంబుఁజేరి శివాలయంబున కేఁగి యందలి కల్లినాథేశ్వర స్వామిని స్మరించుచుఁ గూర్చుండి యెదుటఁ గల్లినాథుఁ డను నొక భక్తునిఁ బొడగాంచెను ఆతండును రేణుకునిఁ జూచి సాష్టాంగప్రణామము లాచరించి "మహాత్మా! పూర్వమొకప్పు డిచ్చటి కొక భుజంగము వచ్చి పడగవిప్పి కొంతవడి విహరించి యాకస్మికముగ నసువుల బాసెను. అది చూచి జాలినొంది నేను వేడికొనఁగా నీ కల్లినాథేశ్వరుఁడు దానిని బునర్జీవితగ నొనర్చెను. అప్పటినుండియు నీ యూరికీ పేరు గలిగినద్ది. మరియు నేను దేవా! నాకు శివతత్త్వ ముపదేశించి సంసారబంధముఁ దొలగింపు మని ప్రార్థింపగాఁ గొలది కాలములో నీ కది నా కుమారునివలన లభింపఁ గలదని యాదేశించెను. ఆ యాదేశానుసారముగ నేడు నీవు లభించితివి, కావున నన్నుద్ధరింపుము" అని ప్రార్థించెను. రేణుకుండును నాతని భాగధేయమును గొనియాడి పిండాండ తత్త్వాదికములగు బహురహస్యముల నాతనికి బోధించి నిజకుమారునిచే నాతనికి దీక్షనిప్పించెను. తరువాత నాతఁడు కుమారునితో శ్రీశైలమున కేఁగి యఖండ మహిమాస్పదము లగు నచ్చటి తీర్థప్రదేశాదికముల నాతనికిఁ దెలిపి యట నుండి మరలి వివిధదేశముల విలోకించుచు నిజావాస మగు రంభాపురికిఁ దిరిగివచ్చెను. తరువాతఁ గొంతకాలమున కాతఁడు కనులు మూసికొని శివధ్యాన మొనర్చుచుండ పరమేశ్వరుడు ప్రత్యక్షమయి "వత్సా! నీవు భూలోకమునకు వచ్చి నేఁటితోఁ బదునాలుగువందల సంవత్సరము లగుచున్నది. కావున నిఁకఁ గైలాసమునకు మరలి రమ్ము" అని యాదేశించెను. అంత నాతఁడు కనులుఁ దెరచి శివలోక గమనేచ్ఛతోఁ గొలనుపాక కేతెంచి సోమేశలింగము నెదుటఁ గృతాంజలియై నిలిచి బహుభంగుల నా స్వామిని స్తుతించి "దేవా! నీ గర్భమునుండి నే నవతరించి నేటితో బదునాలుగు వందల వత్సరములయినది. నీ యనుగ్రహమువలన నే నవతరించిన ప్రయోజనము

నెఱవేఱినది. మరల నీయందు నన్నంతర్ధాన మొనర్పవే" యని ప్రార్థించి యా లింగగర్భము నందదృశ్యుండయి కైలాసమునకుంజని పరశివుని సాన్నిధ్యమున యథాపూర్వముగ నాతని సేవయందు నిమగ్నుండయ్యెను".

(శ్రీ రేణుకాచార్య చరిత్ర సంపూర్ణము)

దీనినిబట్టి రేణుకాచార్యుండు కలియుగ ప్రథమ పాదమున నవతరించి భూతలమున 1400 సంవత్సరములు చరించి నట్లును అగస్త్యుండు విభీషణుండు మంగళవాడ పురాధీశ్వరుండు, వీరబిజ్జలుండు, శంకరాచార్యుండు, కాంచీపురాధీశ్వరుండు, విజయేంద్రచోళుండు (రాజేంద్రచోళుండు) అవంతి దేశాధీశుండు విక్రమాదిత్యుండు, కొల్లాపురి వాస్తవ్యుండు గోరక్షనాథ సిద్ధుండు మున్నగు వారికిం దన మతమును బోధించి శిష్యులుగం గావించికొనినట్లు కాననగును. అగస్త్యుండార్యావర్తమును వీడి దక్షిణాపథమునకు వచ్చి శైవమతమును వ్యాపింపం జేసినట్లు స్కాంద పురాణాదులవలనం గాననగును. ఆత డిప్పటికి నగోచరుండయి మలయాద్రి ప్రాంతమున నున్నట్టు లైతిహ్యములు గలవు. మఱియు నాతడు దక్షిణాపథమునుండి సయాము, మలయా, కాంబోడియా మున్నగు దేశాంతరములకు, జావా, సుమిత్రా, బోర్నియో మొదలగు ద్వీపములకు నేంగి బౌద్ధమతవ్యాప్తికిం జాల ముందుగనే శివలింగముల స్థాపించి యా ప్రదేశములందుం గూడ శైవమతమును వ్యాపింపంజేసినట్లును, కొందఱు రాజకన్యలం బరిణయమయి సంతానముం బడసి రాజవంశముల స్థాపించినట్లును, శాసనాదికములగు చరిత్రాధారములా దేశములందుం గానవచ్చుచున్నవి. రేణుకాగస్త్యుల సంబంధము చిరకాలమునుండి మన దేశమున శైవవాఙ్మయమున వినవచ్చుచున్నది. రేణుకాచార్యునివలన దీక్షనొంది శివాద్వైత సిద్ధాంతముల సాంతముగ నెఱింగిన యనంతరమే యగస్త్యుండు తన్మత వ్యాప్తికై దేశాంతరములకుం గూడ నేగినట్లు కాననగును. అగస్త్యుండు క్రీస్తుపూర్వము 400 లకు ముందుండినవాండే గాని తరువాతివాండు మాత్రము కానేరడని శ్రీయమ్ శ్రీనివాసఅయ్యంగారు అను వారు Tamil Studies అను గ్రంథమున వ్రాసియున్నారు. అతని ప్రశంస రామాయణమునం గూడం గలదు; పూర్వోక్తములైన విదేశములం దీతండు స్థాపించిన రాజవంశములకుం జెందిన రాజు లీతని సంబంధము నంగ్గడించుచు నెలకొల్పిన శాసనములు క్రీ॥ శ॥ 890 నుండియు నా దేశములందుం గానవచ్చు చున్నవి. అగస్త్యుని పోలు జావా ద్వీపమున క్రీ॥ శ॥ 700 కుం జాలం బూర్వమునుండియు నున్నట్లనేకాధారములు గానవచ్చుచున్నవి. విశేషవివరములు వలయువారు The Cult of Agastya (అగస్త్యుని మతము) అను శీర్షికతో శ్రీయుతులు అర్ధేంద్రకుమారగంగోలీ

గారు Rupam అను నాంగ్ల త్రైమాసిక పత్రికలో 1926 సంవత్సరము జనవరిలో వ్రాసిన వ్యాసము చూడనగును. విభీషణుఁడు స్థిరజీవులలో నొకఁడని మన గ్రంథముల వలనఁ దెలియనగును.

మంగళవాడ పురాధీశ్వరుఁడగు వీరబిజ్జలుఁడు బసవేశ్వరుని మేలికయగు కల్యాణబిజ్జలుఁడని పాఠకులు భ్రమింపరాదు. ఆతఁడీ కల్యాణబిజ్జలుని పూర్వులలో నొకఁడయి యుండును. కల్యాణబిజ్జలుఁడుఁ గూడ మూడవ తైలపుని గల్యాణము నుండి పాఱఁదోలి పశ్చిమ చాళుక్యరాజ్యము నాక్రమించుకొనక పూర్వ మా తైలపునికి సామంతుఁడుగా తర్దవాడి మున్నగు సీమల మంగళవాడలో నుండి పరిపాలించుచుండినట్లు, ఆపట్టణమాతని పూర్వులకుగూడఁ గాణాచిగా నుండినట్లు మడగిహాళు శాసనము (Epigraphia Indica Vol, X.V,) వలన వ్యక్తమగును. ఆ సంగతి "బసవేశ్వరుఁడు- బిజ్జలుఁడు" (విభూతి సం॥1. సం7) అనువ్యాసమున వివరించియేయుంటిని. కావున రేణుక విజయమునఁ బేర్కొనబడిన వీరబిజ్జలు డత్యంత ప్రాచీను డనియే తలంపనగును. అతని కాల మిదమిత్థమ్మని నిర్ణయింపజాలము. ఈ వీరబిజ్జలునిఁగూర్చిన కథ యర్వాచీనులు రచించిన శేవణసిద్ధ పురాణాదులలో విచిత్రముగ వికృతాకృతులఁ దాల్చుట పాఠకులు గమనింపఁదగినది. వీరబిజ్జలుని కల్యాణబిజ్జలునిగా మార్చుటయేగాక చెఱనుండి విడిపింపబడిన పదిరెండు వేల కన్నియలను రేణుకుఁడు పెండ్లియాడెననియుఁ బారయు గుద్దలిగొని తటాకమును ద్రవ్వెననియు విపరీతముగ వ్రాసి యీ తరువాతి కవులు కల్యాణ బసవేశ్వరునకు బిజ్జలునకు సమకాలీనుఁడగు సొన్నలిపురపు సిద్ధరామయ్యతో రేణుకునకు సంబంధము గల్పించిరి. శంకరాచార్యుఁడు క్రీ॥ శ॥ పూ॥ 509-477 వఱకు నుండినట్లు చాలమంది యభిప్రాయము. శంకర విజయాదిగ్రంథము లట్లే నిరూపించుచున్నవి. రేణుకాచార్య ప్రదత్తమగు చంద్రమౌళీశ్వర లింగము శంకరాచార్యుఁడు స్థాపించిన శృంగేరిపీఠమున నిప్పటికిని బారంపర్యముగఁ బూజింపబడుచున్నది. తన్మతస్థులు ప్రకటించిన గురువంశకావ్యమునను కెళది బసవప్పనాయకుని శివతత్త్వరత్నాకరము నందును గూడ రేణుకాచార్యుఁ డాదిశంకరుల కొసంగిన యీ లింగ ప్రదానము పేర్కొనబడినది మఱియు రేణుకాచార్యుని రంభాపురపీఠమున రుద్రమునీశ్వరాలయమున నీ విషయమును నిరూపించు ప్రాచీన శిలాప్రతిమగూడఁ గలదని తెలియుచున్నది. చోళరాజులలో విజయేంద్ర, రాజేంద్ర నామాంకితులు వేర్వేఱు కాలములలోఁ బలువురు కానవచ్చెదరు. కావున రేణుక విజయమునఁ బేర్కొనఁబడిన రాజుల కాలముకూడ నిదమిత్థముగ నిర్ణయింపఁజాలము. విక్రమాదిత్యుఁ డా పేరిట శకమును స్థాపించిన రాజోత్తముడే యని తలంచినచో నాతనికాలము క్రీ॥ పూ॥ 56

ప్రాంతమగును. సిద్ధులలో గోరక్షనాథ నామాంకితులు పలువురు వేర్వేఱుకాలము లందు వినవయ్యెదరు. కావున రేణుకునిచే గర్వభంగమునొందిన కొల్లాపుర గోరక్ష సిద్ధుని కాలముగూడ సరిగా నిర్ణయింపఁదగిన యాధారములు కానరావు. కావున క్రీ॥ శ॥ 960 సంవత్సరమున రచింపబడినట్లు గ్రంథమునుండియే కాననగు నీ రేణుక విజయమునుబట్టి రేణుకుఁడేగాక వీరశైవ పంచాచార్యులలోఁ దక్కిన నలువురుగూడ బసవేశ్వరునకు ముందు చాలఁగాలము క్రిందటనే వీరశైవమతమును దేశమున నెల కొల్పినట్లు నిస్సంశయముగ నెంచవచ్చును. రేణుకుఁడు తన సంచారములోఁ దక్కిన నలువు రాచార్యుల పీఠములను గూడ సందర్శించి వారితో సంప్రతించినట్టు లీ గ్రంథమునఁ గాననగును గదా! మఱియు నొక్క విశేషము. ఈ గ్రంథమున రేణుకుఁడు కొలనుపాక సోమేశ్వర గర్భమునుండి యుదయించిన తరువాత రంభాపురికిఁ దరలి యచ్చట మఠము నెలకొల్పినట్లు చెప్పక యాతఁడగస్త్యునకుఁ దన సిద్ధాంతమును బోధించిన తరువాత నాతని వీడ్కొని వేఁగి పూర్వయుగములలో దనచే రంభాపురియందుఁ బ్రతిష్ఠింపఁబడి క్షీణదశ నొందుచున్న తన ధర్మపీఠమును దర్శించి యటనుండి తరలి యాకాశపథమునఁ బారావారతీరమునకుం జని నట్లు చెప్పఁబడినది. చూడుఁడీ క్రిందివాక్యములు.

"అగస్త్యాయ మత్సిద్ధాంతిత సిద్ధాంత శాస్త్ర మతి ప్రవర్తయే త్యాజ్ఞాప్య పశ్యత స్తస్య, పురతోంతర్ధాయాంతరాత్మనా చింతయ న్నుమాకాంతం తన్మలయ మహీధ్ర మధ్యవిద్యోతమాన భద్రేతర భద్రాతీర భాసమాన శ్రీమద్రంభాపురీ ప్రత్యేక యుగస్వప్రతిష్ఠితం, ధర్మపీఠం, క్షీణదశా మాపన్న మభివీక్ష్య తతస్తారాపథ పథేన ప్రస్థాయ, పారావారతీర మాససాద". దీనినిబట్టి గ్రంథకర్త సిద్ధనాథుఁడు వీరశైవ పంచాచార్యులు యుగయుగములందు వేర్వేరునామములతో నానికి శివునిచే నిర్ణీతములయిన యా యా క్షేత్రములం దుద్భవించి శివాగమోక్తములగు నా యా స్థానములందుఁ దమ ధర్మపీఠముల నెలకొల్పి యం దావాసమొనరించిరను నాగమోక్తులనే ప్రమాణముగఁ గొని యిట్లు వ్రాసియుండు నని వ్యక్తమగును. అందుచే మన ప్రభాకర శాస్త్రి ప్రభృతులు శివాగమములు బసవేశ్వరుని కాలమందే వెలసినట్లు వ్రాయుట పట్టి దబ్బర యని యీ గ్రంథము వలనఁ గూడఁ దెల్లము కాక మానదు. మఱియు రేణుకుని నామము శైవవాఙ్మయమునందేగాక తదితర వాఙ్మ యమునఁ గూడ మన దేశమున వినవచ్చుచున్నది. అతని పేరఁ గొన్ని తీర్థములు గూడ వెలసి యున్నవి. మహాభారతము వనపర్వములో 81-82 అధ్యాయములందలి పుణ్యతీర్థ వర్ణనములోఁ జేర్కొనబడిన తీర్థములలో రేణుతీర్థమొకటి. వ్యాస

భారతము ననుసరించి వ్రాసిన తన భారత మంజరిలో క్షేమేంద్రుఁడు గూడ దాని నుదాహరించినాఁడు. కావున సంస్కృత వాఙ్మయమును బరిశోధింప రేణుకుఁడు మున్నగు వీరశైవ పంచాచార్యు లతిప్రాచీన కాలము నుండియు శివాద్వైతమతమును భరత దేశమున నెలకొల్పి రని ఘంటాపథముగ నిర్ణయ మగునని నిస్సంశయముగఁ జెప్పవచ్చును............

ఇఁక నీ పంచాచార్య పీఠముల ప్రాచీనతను నిరూపించు శిలావిగ్రహ శాస నాదిక ప్రమాణములను బరిశీలింతము............

పంచపాండవుల మనుమఁడు జనమేజయ చక్రవర్తి తనపితృదేవతల శాశ్వతశివ లోక ప్రాప్తికై యుధిష్ఠిరశకము 89 వ సంవత్సరమున ననఁగా నిప్పటికి రమారమి యైదువేల సంవత్సరముల క్రిందటఁ బ్లవంగ సంవత్సర మార్గశీర్ష బహుళ అమా వాస్యా సోమవారమునాఁడు సూర్యగ్రహణ సమయమునఁ గేదారేశ్వరుని పూజార్థము సరస్వతీ మందాకినీ నదుల సంగమస్థానమున మందాకినీ, క్షీరగంగా, మధుగంగా, స్వర్గద్వారగంగానదుల మధ్యనున్న దేశము నంతయు హిమవత్కేదారమందలి జగద్గురు వైరాగ్యరామారాధ్య పీఠమున కపు డాచార్యత్వమును వహించిన శ్రీగోస్వామి ఆనంద లింగ జంగమ స్వామి కాతని శిష్యుడగు శ్రీ జ్ఞానలింగ జంగమ స్వామి ద్వారమున స్వర్ణధారాపూర్వకముగ నొసంగినట్లు లిఖించిన శాసన మిప్పటికిని తత్పీఠమున వెలయుచున్నది. ఉత్తరహిందూస్థానమున ఢిల్లి, నేపాళము, కాశ్మీరము, ఉదయ పురము మున్నగు సంస్థానములఁ బాలించు రాజులెల్ల నిప్పటికి నీ మఠమునకు శిష్యు లయి యేటేటఁ గానుకల నర్పింతురని తెలియుచున్నది. కాశియందలి జగద్గురు విశ్వా రాధ్య పీఠమున ననేక శాసనము లిప్పటికిని నిలిచియున్నవి. వానిలో మిక్కిలి ప్రాచీ నము లయినవి. (1) విక్రమశక వత్సరము 631 లో కార్తిక శుద్ధైకాదశినాఁడు కాశీ రాజు జయనంద దేవుఁ డప్పటి విశ్వారాధ్యపీఠాధ్యక్షుఁ డగు శ్రీమల్లికార్జున శివయోగికిఁ దన్మఠమునకు సంబంధించిన గోవుల సంరక్షణమునకై జంగమపుర మను పేరుగల ప్రదే శమును ధారవోసియిచ్చిన భూర్జపత్రి శాసనము. ఈ శాసనము శిథిలమవుచుండు టచే నిప్పటి కాశీరాజుగారు దానిని బరీక్షించి తన పూర్వు లొసంగినదే యని పండి తులవలననిశ్చయించి మరల దాని నకలు వ్రాసి తమ సంతకముతో నొసంగియున్నారు. (2) కాశీవిశ్వారాధ్య పీఠమునకు (జంగమవాడి మఠమునకు) జేరిన శాఖామఠ మొకటి నేపాళదేశమున భాతగాం గ్రామమునఁ జిరకాలము నుండియు నెలకొనియున్నది. అదియు జంగమవాడి మఠ మనియే యిప్పటికి వ్యవహరింపబడుచున్నది. ఆ మఠము నకు శిష్యులయి నేపాళదేశాధీశు లనేకదానము లొసంగియున్నారు. జయరుద్ర

మల్లదేవుఁడను నేపాళరాజు విక్రమశకవత్సరము 692 లో జ్యేష్ఠశుద్ధ అష్టమినా డీ మఠమునకు భూదాన మొసంగుచు వెలయించిన శిలాశాసన మా మఠమున నిప్పటికిని నిలిచియున్నది. ఈ మల్లదేవుని వంశ్యుఁడు విశ్వమల్లుఁడు సంస్కృత శ్లోకములతోను నేపాళభాషతోను వెలయించిన శాసనముకూడ నందు నెలకొని యున్నది.

మొగలుచక్రవర్తులు బాబరు, హుమాయూన్, అక్బరు, ఔరంగజేబు, అను వారొసంగిన యర్వాచీనములుగూడఁ గాశీపీఠమున గలవు. విశ్వారాధ్యుని ద్వాపర యుగ వ్యవహారనామ మాగమములలో విశ్వకర్ణుఁడని కొన్నిచోట్లను, ఘంటాకర్ణుఁడని మఱికొన్నిటను గాననగును. ఇది యేకోరామారాధ్యుని ద్వాపరవ్యవహార నామమని మఱి కొన్నిటివలనఁ గాననగును. కాశీక్షేత్రమున వ్యాసు డీ ఘంటాకర్ణ శివాచార్యుని వలన దీక్షనొంది వ్యాసేశ్వరలింగమును స్థాపించి మహా శివభక్తుఁ డైనట్లు స్కాంద పురాణాంతర్గత కాశీఖండమువలన గాననగును.

శ్లో॥ పారాశర్య స్తదారభ్య । శంభుభక్తిపరోఽభవత్॥
లింగం వ్యాసేశ్వరం స్థాప్య । ఘంటాకర్ణ హ్రిదాగతః॥

శ్లో॥ విభూతి భూషణో నిత్యం । నిత్యం రుద్రాక్షభూషణః ।
రుద్రసూక్తపరో నిత్యం । నిత్యం లింగార్చకోఽభవత్॥

వ్యాసేశ్వరలింగము నెదుట ఘంటాకర్ణ శివాచార్యుని విగ్రహ మిప్పటికిని నిలిచియున్నది. అచ్చటనే ఘంటాకర్ణ హ్రదమిప్పుడుగూడ నున్నది. జనులు దానిని "ఘంటాకర్ణతలావ" అని వ్యవహరించి ఘంటాకర్ణ శిలావిగ్రహమును "వ్యాస జీకా గురు" (వ్యాసుని గురువు) అని చెప్పుచుందురు. మరుళ సిద్ధారాధ్యుని యుజ్జని పీఠమున క్రీ॥ శ॥ మూఁడవ శతాబ్దియందు శివభక్తులగు పాండ్యరాజులు పునర్నిర్మా ణాదికములు గావించినట్లు తెలియజేయు శిలాశాసనము గానవచ్చుచున్నది. ఇఁక మన యాచార్య పండితుని శ్రీశైలపీఠమున కాంధ్ర, కర్నాట, ద్రవిడ, మహారాష్ట్ర దేశములలో శాఖామఠము లనేకములున్నవి. అందులో మైసూరు రాష్ట్రమున కోలారుజిల్లా భాగేపల్లితాలూకా గూడూరు దగ్గఱ నున్న నిడుమామిడి యందలి సుప్రసిద్ధ మఠ మొకటి. ఈ మఠమునకుఁ దృతీయ పట్టబద్ధులగు శ్రీ చంద్రగుండ మల్లికారున శివాచార్యులు దేవరదాసిమార్యునకు (శంకరదాసిమయ్యకు) లింగ ధారణ మొనర్చినట్లును, తరువాత నా దాసిమార్యుఁడు ముదనూరు రామనాథ శివాలయము నాశ్రయించి యచ్చటనే బయలయినట్లును, గొన్ని శాసనములవలనఁ దెలియుచున్నది. ఈ లింగధారణప్రశంస శివశరణవిలాస మను కన్నడగ్రంథమునను,

పుల్లకవి రచించిన తెలుఁగు పండితారాధ్య చరిత్రమునందును, ఇగడూరు రుద్రకవి వ్రాసిన పండిత చరిత్రమునందునుఁగూడఁ గలదనియు నీ మూఁడు పుస్తకములకుఁ బ్రాచీన తాళపత్రములు నిడుమామిడి మఠమున నిప్పటికిఁగూడ గలవనియు శ్రీ వీరభద్రశర్మగారు ( విభూతి సంపాదకులు ) నాకు దెలిపియున్నారు. శంకరదాసిమయ్య ప్రశంస సోమనాథుని బసవపురాణమునఁ గూడ గలదు. ఆతడు బసవేశ్వరునకు ముందొక శతాబ్దికిఁ బయిగ జగదేకమల్లుని కాలమున నున్నవాఁడు. ఆచార్యపండితుని శ్రీశైలపీఠమునకు శిష్యప్రశిష్యుఁడయిన శంకరదాసిమయ్య వృత్తాంతము గూడ నీ శ్రీశైల పీఠ ప్రాచీనతకుఁ బ్రబలనిదర్శనము కాఁగలదు.......

కావున సంస్కృత వాఙ్మయమందలి యాగమములఁ బట్టియేమి, తదితర గ్రంథజాలమును బట్టి యేమి, పంచాచార్య పీఠములందును తచ్ఛాఖామఠములందును నిలచియున్న శిలావిగ్రహ శాసనాదికప్రమాణముల బట్టియేమి, వీరశైవము బసవేశ్వరోపజ్ఞము గాక పంచాచార్య ప్రబోధితమై భరతవర్షము నలుదిశలఁ జిరకాలము నుండి యే కొలదిగనో గొప్పగనో వ్యాప్తమై యుండెననియు, పండితత్రయ మనఁ బరఁగు శివలెంక మంచన, శ్రీపతి, మల్లికార్జున పండితారాధ్యులలో నెవరికి వీరశైవ పంచాచార్యులతోఁ బ్రసక్తి యెంతమాత్రము లేదనియు, తక్కిన నలువు రాచార్యుల వలెనే యాచార్యపండితుఁడు గూడ మిక్కిలి ప్రాచీనుం డనియు నిష్పక్షపాత బుద్ధితో విషయ విమర్శన మొనర్చు వారికి విశదము కాక మానదని తలంచుచున్నాను. విజ్ఞులు యథార్థమును నిర్ణయింతురు గాక!

వీరశైవము బసవేశ్వరునకు ముందే దక్షిణ హిందూదేశమున నుండె నను టకుఁ బ్రాచీనమగు ద్రవిడ వాఙ్మయము నుండియు, పంచాచార్య పీఠములందు గాక యితరత్ర లభించు శాసనాదికముల నుండియు విశేష ప్రమాణములను "వీరశైవమత ప్రాచీనత" యను వ్యాసమున వివరింతును.



# ఓటి బుట్ట

శ్రీ వైద్యరాజ, దంటు సుబ్బావధాని కవిరాజుగారు

(జగన్నాథ పండితరాయల సంస్కృతాన్యోక్తులవలె జాతీయమగు నన్యోక్తులు దెనుంగున జాల రచింపబడి పాఠకుల వినోదమునకు, బాలకుల బుద్ధివికాసమునకు నగుంగాక).

గీ. గోయి నూయియుఁ గానని గుడ్డిగొట్టె, యింగిత మెఱుంగఁజాలని మొద్దబట్టె
జలము ఫలమును గానని చవిటిపట్టు, యొక్క చుక్కయు నిలువని యోటిబుట్ట.

గీ. పట్టియన చౌడు దానికి ప్రభుతకలదె, బుట్ట యన డొల్ల దానికి బుద్ధికలదె
బుట్టమీసాలతో వెఱబొమ్మ కోట, ముంగిటను నిల్వ దీసుకు ముగ్ధఁడగునె.

గీ. బుట్ట తన తొట్టె నెఱుఁగుచు బుద్ధిగలిగి, కొండదొర చంకనుండ కయ్యండవాసి
మేరుమందరగిరులపై మిట్టిపడిన, బొచ్చెలో చెక్కలో ముక్కముక్క లగునొ.

గీ. నూదులును జీడిగింజలు సోదిచెప్ప, పాలతు లుంచంగ దగు పారబుట్ట యెట్లు
రంగు రంగులతోన జెలంగు వీణె, బుట్టయౌ, నైన నది యగు బోడిబుట్ట.

గీ. కట్టలగు దోచునది పెద్ద బుట్టకాగ, దానగల తొట్ట నెఱుఁగును తత్త్వవిదుఁడు
కట్టలేనట్టి వానిని గొట్టె కఱచు, కట్టపైనుండి చేలను పుట్టెకాచు.

# ద్రవ్యదాతలు

ఈ క్రింది యుదార మహాశయులు తమ వాగ్దానమును చెల్లించినారు. తక్కినవారును సహాయము చేయ ప్రార్థితులు.

౧౦. రు. శ్రీ గుర్రంకొండ కుమారస్వామిగారు, చిల్కలూరిపేట.
౧౦ రు. ,, పిడుపర్తి పిచ్చెయ్యగారు, గరుడాచలపాలెం.
౫ ,, ,, పిడుపర్తి కోటయ్యగారు, పోలవరం.
౫ ,, ,, అంచెల కోటినాగయ్యగారు, గరుడాచలపాలెం.
౫ ,, ,, పురాణం కోటివీరయ్యగారు, మొవ్వ.

# 'ఈరాను'లోని శివాలయము

శ్రీ మహేశ ప్రసాదుగారు, మౌలవీ, ఆలిమ్ - ఫాజిల్



ఈరాను దేశమునకు పర్షియా లేక ఫారసు అను వ్యవహారము కలదు. ఇది మహమ్మదీయ రాజుల పరిపాలనలో గలదు. ఇచటి అధిక సంఖ్యాక ప్రజలును మునల్మానులే! పార్సీలు, క్రిశ్చియనులు, యహూదులును కొందఱు కలరు. నా దేశాటన సమయమున నీ వివిధమతస్థుల దేవాలయములును నీదేశమున గనుపడినవి. అందునను హిందువులయొక్కయు, సిక్కుల యొక్కయు దేవాలయములు నా దృష్టి నెక్కువగ నాకర్షించినవి. ఆ విశేషము లన్నియు ప్రత్యేకముగ యాత్రా పుస్తకమున వివరింపబడినవి. ప్రస్తుతము ముఖ్యముగ నొక శివాలయమును గూర్చిన పరిచయమును మాత్రమే పాఠకుల కందించుచున్నాను.

ఈరాను దేశపు దక్షిణప్రాంతమున అబ్బాను బందరు (పెద్దపడవలరేవు)అను నొక ప్రాచీన నగరముకలదు. పర్షియా కిది దక్షిణ తట మనవచ్చును. ఐతిహాసిక దృష్టితో దీని మహిమ యల్పముగాదు. క్రీ. శ. 7 వ శతాబ్దమున అరబ్బుల దాడి కోర్వలేక ఏతద్దేశీయు లగు పార్సీలు భారత దేశమున శరణముగొని తలదాచుకొనిరి. నేడును దీని, మహత్త్వమధికము. ఇట ఈరాను దేశపు ప్రధానాధికారులు నివసింతురు. మఱియు నీనగరము పర్షియాలోని ముఖ్యపట్టణములలో నొకటి. ఇచ్చోటనే యొక విశాలమైన శివాలయము కలదు.

నేను పడవలో నుండగానే 'దుబాయి' రేవుకు ముత్యాలవ్యాపారమునకై వెళ్ళు కొందరు హిందువులు గలిసి మొట్టమొద లీ మందిరమును గూర్చియే ప్రసంగించిరి. కాని యేదో చిన్న గుడి యనుకొంటిని. తర్వాత దాని సమీపముగా వెళ్లినపుడు ఆ మందిర వైశాల్యము స్వయముగా నన్నాకర్షించెను. ప్రక్కనగల సిక్కుల గురుద్వారముతో బాటు నీ మందిరమునకు 18 యకరముల విశాలమైన మైదానము కలదు. ఇది నగరము నట్టనడుమను మహమ్మదీయుల వసతి మధ్యముననను కలదు. పూజాసమయమున తాళములు, గజ్జలు, ఘంట, శంఖము, డోలు మున్నగు వాద్యముల ధ్వని నిత్యముగ జరుగును. కాని యా నగరమున నివసించు ఎనిమిదివేల మహమ్మదీయ ప్రజలకు నెంతమాత్రము మాత్సర్యవిషయముకాదు. హిందువుల సంఖ్య 60, లేక 70 మాత్రమే.

ఈ యాలయ మెపుడు ఎందుకు ఎవరిచేత నిర్మింపబడినది అను విషయములు నాకు సరిగ దెలియలేదు. కాని ఇది ప్రాచీన మనియును ఎప్పుడో ఇట నివసించిన హిందూసైనికులు దీనిని నిర్మించిరనియును దెలిసెను. ప్రస్తుతమిది ౧౫ వేల రూపాయల ఆస్తిగ నున్నది. 1929 మే నెల 17 తేది శుక్రవారమున నేను దీసిన మందిర చిత్ర మీ పత్రికలో ప్రకటింపబడుచున్నది. దీని యాకారము ఉత్తర భారత దేశపు శిల్పమును బోలియున్నది. భారత దేశమునుండి వచ్చిన శివలింగమూర్తియే ఇట ప్రతిష్ఠింపబడినది. మందిరావరణమున నిట నట శ్రీకృష్ణ, ఆంజనేయ, యోగమాయా దేవతల మూర్తులును గలవు. ప్రక్కనే శ్రీ గురుగ్రంథ సాహెబుగారును గలరు. ఇందలి యేమూర్తికి పూజ జరిగినను అన్నిమూర్తులకు మంగళహారతు లీయబడును. ఈ విదేశమందుగల మన విభిన్న దేవతలు ఐక్యముగ మెలగుట గమనింపదగియున్నది. వ్యాపారార్థ మిచ్చోట స్థిరనివాసులైన హిందువులే దీనిని నిర్వహించుచున్నారు. ఇది హింకూ బాగని వాడుకలోనున్నది. నే నున్నన్ని రోజులును చాలమంది గుడికి వచ్చి భగవద్దర్శనమును జేయుచుండిరి. ఒకనాడొక యుదారుడు 'కడాహప్రసాద' మును గావించెను. హిందువులందరును పాల్గొని ప్రసాదమును స్వీకరించిరి. విశ్వేశ్వరుని మందిరము లీ విశ్వమంతటను విరాజిల్లవలెను. ఈరానులో నుండుట ఆశ్చర్యము కాదుకదా ?

## చందాదారులకు సూచన

గత సంచికలో సూచించిన ప్రకారము కొందరు తమ చందాలను పంపినారు. తక్కిన వారికి వి. పి ద్వారా పంపుచున్నాము. వి. పి లు తిరుగగొట్టి మా బీద కార్యాలయమునకు నష్టము గలిగింపవలదు. ఫాల్గునమాస సంచిక వెలువడలేదు. కావున దానికొరకై వ్రాయుట వ్యర్థము. పత్రికావ్యవస్థకు సంబంధించిన సమస్తజాబులు మేనేజరు పేరను, వ్యాసములు మున్నగువానికి సంబంధించిన జాబులు సంపాదకుల పేరను, వ్రాయవలెను. చీటికి మాటికి అనవసరముగా ఆలోచించకుండ వ్రాయగూడదు. విశేషవిషయములు గావలసినపుడు రిప్లయి (జబాబు) కార్డులను వ్రాయవలెను. కేవలము శ్రీ శర్మగారికి వ్రాయు జాబులమీద మాత్రమే వారిపేరు వ్రాయవలెను. వేరువిధముగ భావించక దయతో నీ విషయములను చిత్తగింపగోరుచున్నాము.

ఇట్లు మేనేజరు,

విభూతి

నర్జలాల్ వీధి, సికింద్రాబాదు, దక్కన్.

# నన్నయభట్టారక సమాజము

శ్రీ నందూరి బంగారయ్యగారు బి. ఏ.



శా. చైతన్యంబును గాంచి యాంధ్రమయవిశ్వం బెల్ల నుద్యత్ప్రభా
స్ఫీతంబై గనుపట్ట సత్కవులు జేజేవెట్టగాఁ బుట్టె నే
జ్యోతిర్మూర్తి రసజ్ఞమండలి తపస్సుల్ పండ చండాంశువై
యా తేజంబు కవిత్రయాత్మకము హర్షావేశముల్ గూర్చుతన్! †

చ. సరసమనోజ్ఞభావముల సంస్కృతశబ్దసమాసమాధురీ
పరిణతి నాంధ్రభారతి తపఃఫలరాసుల మౌక్తికోక్తులన్
గురిసిన నన్నపార్యకవికుంజరమూర్తికి సత్యకీర్తికిన్
గురుపద మిచ్చి కొల్చెద నకుంఠితభక్తివికాస మేర్పడన్. 2

చ. ముదమున నన్నయాదికవిముఖ్యుల యంకము నెక్కి కింకిణీ
మధురమనోజ్ఞనిస్వనసమంచితయై మును రాజరాజహృ
త్సదనము లెల్ల గల్లురన సల్పిన భారతి నృత్యకేళి మీ
హృదయములన్ బ్రతిధ్వనుల నీనదె నేటికిఁ బండితోత్తముల్ ? 3

సీ. చాళుక్యనరపాల సామ్రాజ్యవిభవంబు, కన్నార గాంచిన ఘనత తోడ
రెడ్డివిభుల రసోద్రిక్తచిత్తత మెచ్చి, నివ్వాళు లిచ్చిన నీటు తోడ
వివిధ దేశాగత విద్వత్కవీంద్రుల, కాశ్రయం బొసఁగిన యశము తోడ
నవకావ్యశిల్పవిన్యాస వైభవలక్ష్మి, సీమంత మొనరించు చెలువు తోడ
గీ. ఆంధ్రకవిరాజులను గొల్వ నక్షతలను, దాల్చి యుత్కంఠరవముతో బిల్చుచున్న
దాంధ్ర యువకుల నెల్ల నిస్సాంద్రకవన చంద్రికాధౌత రాజమహేంద్రపురము.

ఉ. పావనగౌతమీసలిలపాన మొనర్చిన పుణ్యరేఖతో
సేవ కుపక్రమించి యిదె చేతులు మోడ్చితి మాంధ్రవాణికిన్
జీవితముల్ సమర్పణము చేసిన ధన్యుల దివ్యమూర్తులన్
భావనచేయఁగా గలుగు భాగ్య మొసంగుము శారదాంబికా. 5

† శ్రీనన్నయ భట్టారక సమాజము స్థాపించు సందర్భమున రచించిన పద్యములు. ఆంధ్రమహాకవుల వర్ధంత్యుత్సవములు జరుపుచు ప్రజలలో వాఙ్మయాభిరుచి పెంపొందించుటకు ఆదికవి యగు నన్నయభట్టారకుని పేర రాజమహేంద్రమున నీ సమాజము స్థాపితము. సం॥ బం॥

# నిజాం రాష్ట్ర కవులు

## (శేషాద్రి రమణ కవులు)

### 1 రాపాక వెంకట దాసకవి

ఆంధ్రకవుల చరిత్రములోఁ గాకతిసీమ యనందగు నిజాము రాష్ట్రములోని ప్రసిద్ధకవులందు ఎందఱో చేరలేదు. చేర్పఁబడినవారి చరిత్రములలో నందందు స్థల నిర్ణయమునఁ గొన్ని పొరపాటులు జరిగినవి. కొన్ని నూతన పరిశోధన ఫలితముగ సవరింపఁ బడినవి. ఇంకఁ గొన్నిటిని సమకాలికులు తప్పుగా స్థల నిర్ణయమునఁ బ్రమాదపడుచున్నారు. కాకతీయుల కాలమునను, వెలమరాజుల యేల్బడియందును, తరువాతి కాలమునందును బేరెన్నికఁ గాంచిన కవులు నిజాము రాష్ట్రమునఁ బెక్కండ్రు గలరు. ఈ రాష్ట్రమున సమగ్రముగాఁ బరిశోధనము జరిపి లిఖిత గ్రంథములు, స్థానిక వృత్తాంతములు సేకరించు వఱకుఁ బరిశోధకులకీ రాజ్యమునఁ జేతి నిండఁ బని దొఱుకఁజాలదు. ఎన్నటికేని ఈ రాజ్యమున సమగ్ర లిఖితపుస్తక భాండాగారము నెలకొల్పబడక పోవునా యని తలంతుమన్న నిప్పటికే లిఖిత గ్రంథము లంతరించుచున్నవి. ఇఁక నొక తరములోఁ దాళపత్ర గ్రంథము లపరూపములు కాఁగల వనుటలో వింతలేదు. కానఁ బ్రతి భాషాభిమానియుఁ దమ గడఁగల గ్రంథ సముదాయమును బరిశోధకులకుఁ జూపి వాని వివరములు పత్రికలలోఁ బ్రచురించుటయు మాతృకలకుఁ బ్రత్యంతరములు వ్రాయించి నలుగురి కందుబాటులో నుంచుటయుఁ గర్తవ్య మనుట సోదరాంధ్రులు విస్మరింప కుందురుగాక!

రాపాకవారను వైదిక బ్రాహ్మణులు పరకాలలోఁ గలరు. వీరి కుటుంబములో నేటికిని గవులు కలరు. రాపాక లక్ష్మీపతికవి భద్రాద్య్రభ్యుదయము, శంకరాచార్యచరిత్రము, శ్రీకృష్ణ విలాసము, మున్నగు ప్రబంధములను విరచించెను. ఇందు దోమకొండ సంస్థానాధీశ్వరుల ప్రోత్సాహముచే రచింపఁబడిన భద్రాద్య్రభ్యుదయము మాత్రము ముద్రితము. రమణీయముగా ముద్రితమైన భద్రాద్య్రభ్యుదయమును దోమకొండ సంస్థానాధీశ్వరులు పాఠకలోకమున కుచితముగా నొసంగి ధన్యులైరి. ఈ గ్రంథరాజమునకుఁ బాఠభేదములు, హెచ్చు పద్యములు గల మాతృక, వనపర్తి సంస్థానమున లిఖితగ్రంథ సముచ్చయమునఁ గలదు. ఓరుగంటి శైవప్రచారిణి పత్రికాధిపతుల గ్రంథనిలయములో వ్యాఖ్యానసహితముగఁ బ్రత్యంతరము

గలదు. ముద్రితగ్రంథములోఁ బీఠిక లేకుండుటచేఁ గవిచరిత్రము గ్రహింప నవకాశము గలుగకున్నను, గాలము, గ్రంథవిశేషములు వార్తాపత్రికలలోఁ బ్రచురించి యుంటిమి. రాపాక లక్ష్మీపతి కవియు, వెంకటదాస కవియు సోదరులు. ఇందు లక్ష్మీపతి పెద్దవాడు. ఈ యంశము ఉభయుల వంశచరిత్రములవలనఁ దెలియును. కవు లిరువురు తమ నివాసస్థలము చెప్పుకొనకున్నను పరకాలలో నున్న రాపాక వారను పరాశరగోత్రు లగు వైదికులు ఈ యుభయకవులు తమకుఁ బూర్వులనియు గృహదహనకారణమునఁ దాళపత్రగ్రంథములు నశించినవనియుఁ జెప్పిరి. వంశజుల సాక్ష్యము విశ్వసించినచో నీ సోదరకవులు పరకాల నివాసులు. పరకాల నిజాము రాష్ట్రములో కరీమునగరము జిల్లాలోఁ దాలూకాకు ప్రధానస్థలముగా నున్నది. ఇఁక వెంకటదాసకవి చరిత్రమును బరిశీలింపుదము.

వెంకటదాసకవి రచించిన గ్రంథములలో నొక శివరహస్యఖండము మాత్రము లభించినది. 230 తాళపత్రములు గలిగి దేవకాండము, అసురకాండము, సంభవకాండము, యుద్ధకాండము అని నాలుగు భాగములు గల ఈ గ్రంథము కవి వ్రాసినంతలో సమగ్రమనియే తలంపవచ్చును. కవి తన వృత్తాంతమును గ్రంథారంభము నందీ క్రిందివిధముగాఁ జెప్పుకొని యున్నాఁడు.

సీ॥ ప్రభమీరుచునట్టి యాపస్తంబసూత్రుండ, చదివినమాత్రంబు జదువువాఁడ
లింగమాంబికయందు లింగసూరికటాక్షమున సంభవించిన పుణ్యయశుఁడ
శ్రీ పరాశరగోత్ర చిహ్నాంకితుండ వేం, కటదాసుఁడను పేరు గాంచువాఁడ
పుడమి రాపాకాన్వయుఁడ నల్వురన్నలు, గలిగిన విలసితాకారఘనుఁడ
గీ॥ అచ్చనామాత్యు ననుమతి నాంధ్రసౌర, వాక్కవిత్వనిరూఢి భావంబు దనర
శ్రీకరంబుగ రచియింతు శివరహస్య, ఖండము (ను సు) ప్రబంధంబు గాఁగ భువిని,

ఉ॥ దానికధీశ్వరుండు కవితాగణనైకనిధానుఁడైన వి
ద్యానిధి విశ్వనాథుఁడని యాత్మగుతించి తదంఘ్రిపంకజ
ధ్యాన పరాయణుండ నను నర్మిలి లేములవాడ-పట్టణ
శ్రీనిధి రాజశేఖరుఁడు చెల్వుగఁ బ్రేరణ సేయుచుండఁగన్.

గద్యము. ఇది శ్రీ మదనగోపాల నిస్తంద్రకరుణాసాంద్ర కరుణాకటాక్ష వీక్షణ సంప్రాప్తోభయభాషా కవితావిలాస భాసుర రాపాకాన్వయ పయఃపారావార రాకాసుధాకర శ్రీ పరాశరగోత్ర పవిత్ర లింగనార్యపుత్ర వేంకటదాస కవి ప్రణీతంబైన శివరహస్య ఖండంబునందు......

4

గ్రంథభాగమువలనఁ గవి చందాపురమునందలి విశ్వేశ్వరస్వామి భక్తుఁడని తెలియవచ్చును. గ్రంథము లేములవాడ రాజేశ్వరస్వామికి అంకితము. శివున్నూరి వీరనామాత్యుని కుమారుఁడగు అచ్చనామాత్యుఁడు ప్రోత్సహింప నీ కృతి రచింపఁబడెను. ఈ ప్రాంతములలో చందాపురములు పెక్కులు గలవు. చందాపుర మిద మిత్థమని నిర్ణయించుటకుఁ గాని అచ్చనామాత్యుని చరిత్రము గ్రహించుటకుఁ గాని యవకాశములు లేవు. భద్రాద్రియురభ్యుదయములో నొక గద్యమునందు లింగనార్యుని లింగనామాత్యుఁడని ముద్రాపకులు ప్రమాదమునఁ గూర్చిరి. అది సంస్కరింపఁదగి యున్నది. లక్ష్మీపతి కవికి వేంకటదాసు కడగొట్టు తమ్ముఁడు. అన్నయంత ప్రౌఢకవి గాకున్నను గవిత్వము మాత్రము పురాణాంధ్రీకరణోచితముగ మృదుమధురముగా నుండె ననవచ్చును. కోడూరి వేంకటాచలపతి శివరహస్యఖండమునే రెండు మూఁడు మాఱులు ముద్రించిరి; గాని భాషాభిజ్ఞులు విస్మృతప్రాయమగు నీ యుత్తమ గ్రంథము పయి దృష్టి ప్రసరింపమి విచారకరము. శైలి తెలియుటకు రెండు పద్యము లుదాహరించెదము.

ఉ॥ శ్రీకర భారతీకుచ విశిష్టసుగంధివిపంచి సంశ్రిత
శ్రీ కలితాంగ శీతకరశేఖర ముఖ్య విరించి సన్నుత
శ్రీకర కారణస్థల విశేషధరోత్తమ కాంచి భాగ్యసు
శ్రీకరణార్థమై వెలయుఁ జెల్వుగఁ గాంచి సమంచితంబుగన్.

చ॥ శరదంభోధర మండలాంతర లసచ్చందోప్రమానుండు, పాం
డుర నాసోజ్జ్వల కర్ణసీరజ దళోష్ఠద్వంద్వవక్త్రుండు, స్వే
ద రసాకీర్ణ శిరోజచారు పలితోద్యత్సూక్ష్మకుబ్జచ్ఛిఖా
భరశీర్షుండును జర్ఝరీకృత తనూభాగుండునై యొప్పుచున్.

## ౭. చిత్తారు గంగాధరకవి

ఈ కవివర్యుఁడు వీరశైవుఁడు. కొలను పాకక్షేత్ర మాహాత్మ్యమును ద్విపద కావ్యముగా వ్రాసినాఁడు. ప్రథమ ప్రయత్నము కావునఁ గాఁబోలు కవిత్వ మంత ప్రౌఢముగా లేదు. * వ్రాతలోపములు విశేషించి కలవు. కొలనుపాక జైనవాఙ్మ

* ఈ కవియే రచించిన శృంగార బల్లాణచరిత్ర యను చక్కని ద్విపద కావ్యమును మద్రాసు శృంగార గ్రంథమాలవారు ప్రకటించినారు. ఈ కవి వంశస్థులగు మాహేశ్వరులు చిత్తారువారు నల్లగొండ జిల్లాకు చేరువగా చర్లపల్లి గ్రామములో నేడు కలరు॥ సం॥

యము నందును వీరశైవ వాఙ్మయములందును బేరెన్నికగన్న చరిత్రస్థలము. ఇచటి జైన విగ్రహముల సౌందర్యము, జైనులనుండి గైకొని సంస్కరించి పునఃప్రతిష్ఠ గావింపఁబడిన వీరనారాయణ దేవాలయ నిర్మాణక్రమము, అతిప్రాచీన మనఁదగు సోమనాథాలయము, కులక్రమముగాఁగల వీరశైవమఠములు, జయస్తంభములు, శాసనములు ప్రత్యేక దర్శనీయములు. ఊబిగడ్డపయి కల జయస్తంభము దానిపయిగల శాసనము ప్రశస్తతరము. చాళుక్యులు, చోళులును కాకతీయులు స్థాపించిన విలువగల సంస్కృత కర్ణాటశాసనములు పెక్కులుగలవు. క్షేత్రములలో వీర విగ్రహములు విశేషించిగలవు. శైవగురు పరంపరలోఁ బ్రశంసనీయుఁడగు శ్రీ రేణుకాచార్యుల వారికిది జన్మస్థలము. చితారు గంగాధరకవి ఈకొలనుపాక మాహాత్మ్యమును పురాణమువలె రచించినాఁడు. ఈ కవినిగూర్చిన వివరములు గోలకొండ కవుల సంచికలో వివరముగాఁ గలవు. కొలనుపాకక్షేత్రమాహాత్మ్యము అయిదు ఆశ్వాసముల గ్రంథము. కాసెట్టి వీరభద్రయ్యయను రసజ్ఞుని ప్రోత్సాహముచేత గంగాధరుఁ డీ గ్రంథమును రచించినాఁడు. పెద్దపల్లిలోని వీరశైవమఠమును గూర్చిన ప్రశంస యిందుఁ గలదు. సీలగళరాజు కొలనుపాకను బాలించుచుండెను. ఒక కాలమున మాధవాచార్యు లను వైష్ణవుఁడు శివదూషణము జేసి శివరామయ్యచే శపింపఁబడి శిలయై జినదేవుఁడుగా మాఱెనఁట. మొత్తము మీఁద గ్రంథములోఁ జరిత్రాంశములు స్వల్పముగను సందిగ్ధముగా నున్నను ప్రజాసామాన్యమునందు వాడుకలోనున్న కథలు సమయోచితముగఁ గూర్పబడినవి. జూపూడి సంజీవరాయకవి గనుగు సీసములతో "కొలనుపాక వీరనారాయణ ముకుంద విశ్వతుంద" యని యొక శతకము రచించినాఁడు. ఈ యూర నెట ద్రవ్విననను అమూల్యములగు జైనవిగ్రహములు, ఆలయభాగములు, రాజమందిరచిహ్నములు వెలువడుచున్నవి. కొలనుపాకను శాసనములలో కొలిపాక అని వ్యవహరించిరి. ఈ కవి చరిత్రము ఆంధ్రకవుల జీవితములలోఁ జేరలేదు.

## 3. రెడ్డి రెడ్డి మల్లారెడ్డికవి

ఈయన గంగాపురక్షేత్ర మాహాత్మ్యమును మూఁడాశ్వాసముల పద్యకావ్యముగా రచించెను. గంగాపురము మహబూబు నగరమండలములో జటచర్లకు మూఁడుమైళ్ళ దూరములో నున్న యొక ప్రసిద్ధక్షేత్రము. ఈ గ్రామములోఁ గల శిల్ప రమణీయమగు చెన్నకేశవాలయము, అసంఖ్యాక శిలాశాసనములు, సమీపమున మీనాంబరీనదీతీరమునఁ గల శిథిల బౌద్ధవిహారములు, జైనవసతులు, మఱియు మన్నను మఱవునకురావు. పశ్చిమచాళుక్యులలో జేరిన కుమారశైలపదేవుఁడు

పెర్మాడి కోడూరిలోనుండి యిచటి యాలయముల మిగుల నభ్యున్నతికిఁ దెచ్చెను. గంగాపురము హిందువులను విశేషించి యాకర్షింపఁగల క్షేత్రములకాస్పదము. దీని మాహాత్మ్యమును పురాణధోరణిలోఁ బ్రబంధముగా వ్రాసిన కవి మల్లారెడ్డి. కథాంశము స్కాందపురాణములోని దనియు సూతుఁడు శౌనకాదులకుఁ జెప్పిన కథాంశము నారదమహర్షి ధర్మరాజునకుఁ జెప్పినట్లు కవి వర్ణించినాఁడు. కవి పాల్వానగోత్రుఁడు. మోటాడ రెడ్డికులజుఁడు. కవివంశజులలో వంశక్రమముగా తిమ్మారెడ్డి, మండలరెడ్డియు మల్లారెడ్డియు, పర్వతరెడ్డి, రంగారెడ్డి యనుపురుషులు వర్ణింపబడిరి. తిమ్మారెడ్డి షోడశదానముల గావించిన దాత. మల్లారెడ్డి కుతుపుషాప్రభునిచే సత్కారముల నొందిన శూరుఁడు. తుదివాఁడగు రంగారెడ్డి కుమారుఁడే ప్రకృత గ్రంథకర్తయగు మల్లారెడ్డికవి. ఈయన వైష్ణవ మతస్థుఁడు. తిరుమల ఔబలాచార్యుల శిష్యుఁడు. కవి స్తుతిలో పింగళి సూరన్నను బేర్కొనినాఁడు. కవితాతమల్లన కుతుపుషాహి కాలము వాఁడు. కుమారులు నలుగురు ప్రయోజకులై వ్యవహరించుచున్న తన యుత్తర వయస్సున కవి యీ గ్రంథము రచించెను. గ్రంథరచన కాలము స్థూలదృష్టితో క్రీ.శ. 1680 ప్రాంతముగా నిర్ణయింపవచ్చును.

చెన్నకేశవస్వామి స్వప్నమునఁ బ్రత్యక్షమై గంగాపుర మాహాత్మ్యము పద్య కావ్యముగా రచింప నాజ్ఞాపించెను. పిదప కవి మేల్కాంచి పల్లెపల్లి పురవాసియు బూరుగుల దేశాయియు నగు తనతండ్రి రంగారెడ్డికి స్వప్నకథ వినిపించి తదనుమతిచే గంగాపుర మాహాత్మ్యము నీతఁడు రచించెను. కవి మహబూబునగరమండలము లోని బూరుగుల నివాసస్థలముగాఁ గలవాఁడు. కవి వంశజుల వలన నింకేమేని విశేషములు తెలియవచ్చునేమో ప్రయత్నింప వలసియున్నది. గంగాపురము కృతయుగమున మత్స్యనగరము, ద్వాపరమున మాయానగరము, త్రేతాయుగమున కోలాహలపురము, కలియుగమున గంగాపురము అని కవి చెప్పినాఁడు. గ్రంథమునఁ బ్రబంధములకుఁ దీసిపోని దీర్ఘవర్ణనములు, ఉభయభాషా కవితాపాటవము జూపు దీర్ఘసమాసములు గలవు గాని చరిత్రమున కుపకరించు విశేషాంశములు లేవు. మాకుఁ జిక్కిన ప్రతిలో మొదటిపత్రము లేదు. ఆకులు వ్యత్యస్తము గా నుంటచే రెండవ ఆశ్వాసమునకు మూఁడవ ఆశ్వాసమునకుఁ బొత్తు కుదురకున్నది. వ్రాత నలక్షణము గాదు. పద్యములలోఁ గొట్టివేతలు లుప్తపూరణములు గలవు. ప్రత్యంతరము సమగ్ర మైనది లభించినగాని గ్రంథము ప్రకటింప వీలుకాదు. అంతదనుక కవి జీవితమును స్మరించుటకైన యవకాశము ఆంధ్రసోదరులకుఁ గలిగించి యజ్ఞాతముగనున్న కవి జీవితమును దెలిసినంతవఱకుఁ బ్రచురించితిమి. శైలి తెలియుటకొక పద్యము.

శ్రీగంగాపుర చెన్నకేశవ దయాశ్రీలబ్ధ రంగాహ్వయా
పాగర్భాబ్ధి సుధామయూఖుఁడను శుంభచ్ఛబ్ద మాధుర్య స
త్ప్రాగల్భ్యాంచిత కావ్యనిర్వహణ భాస్వత్కీర్తి మల్లాఖ్యుఁడన్
ఆ గోవింద కథాసుధానుభవ లోలాయత్త హృత్పద్ముఁడన్.

గద్యము - ఇది శ్రీహరిగురుపాద పంకరుహ ధ్యానానంద చరిత్ర సరససంగీత సాహిత్య కవిత్వరచనావిచిత్ర తిరుమంత్రద్వయ నిత్యానుసంధానకౌశల హృదయ సౌందర్యగాత్ర శ్రీవ్యాసగోత్ర పవిత్ర కోనమ దేవీకళత్ర మోటాడవంశవారాశి జనిత కైరవమిత్ర బుధబంధు సుకవిజనస్తోత్ర రెడ్రెడ్డి పర్వతరెడ్డి పౌత్ర రంగారెడ్డి పుత్ర మల్లారెడ్డి దేశాయి ప్రణీతంబైన గంగాపురీ మాహాత్మ్యము.

# మాహురము

## ( శ్రీ శేషాద్రిరమణకవులు )

ఆంధ్రికావ్యములలో మిగుల విలువ గలదగు కళాపూర్ణోదయము అద్భుత కావ్యము. దానియందలి కథాంశములు శ్రీకృష్ణదేవరాయల చరిత్రముతో సమన్వయింప శ్రీయుతులు టే. అచ్యుతరావుగారు ప్రశంసాపాత్రమగు కృషి చేసిరి. శ్రీయుతులు కట్టమంచి రామలింగారెడ్డిగారు కథావిమర్శనము మిగుల నేర్పుగ నొనర్చిరి. శ్రీమార్ వింజమూరి రంగాచార్యులవా రొక విమర్శనము ప్రకటించిరి. ఇప్పుడీ గ్రంథరాజమును పీఠికాపురాధీశ్వరుల సమాదరణమున వావిళ్ళవారి ప్రతితో వ్రాతపుస్తకముల జతజేసి పరిశోధించి నూతన స్వరూపముతో ఆంధ్రిలోకమున కర్పింప బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు కృషి చేయుచున్నారు. ఈ మధ్య యొదవిన యేకాంతవాసమున కళాపూర్ణోదయము చదువ "మాహుర ము"ను "ధర్మపురి"ని గూర్చిన ప్రశంస గానవచ్చినది. ప్రసిద్ధ స్థలమగు మాహుర మును గూర్చిన వివరము లాంధ్రిలోకమునకు దెలుపుచున్నారము.

కళాపూర్ణోదయమున మాహుర ప్రశంసయు నచటి క్షేత్రిపాలకుండగు దత్తాత్రేయుని ప్రశంసయుఁ గలదు.

"మాహురీపురమున కేతెంచి యందు దత్తాత్రేయు
సకలయోగ విద్యారహస్యకోవిదు మహామహు" ... ... 5-132

"క్షితి దత్తాత్రేయు దయ కకృత్యముగలదే" ... ... 5-194

"దత్తాత్రేయ మహామునిని మాహురీపురనిలయుర్ ... 5-202

"కార్తవీర్యార్జునుఁడు చక్రవర్తియగుట
అంత ఘనుఁడౌట నా యోగి నాశ్రయించి.
కాదె తదాశ్రికులజుఁడఁగాన నేను
నమ్మునీంద్రు భజించితి నవ్విధమున ... ... 5-203

"ఆదత్తాత్రేయుండంతట నాకుఁ గలలోనం గానిపించి.........
దత్తాత్రేయ శబ్దంబు వినఁబడుట నిది తెలిసి ... ... 5-204

ఉదాహృతభాగముల వలన మాహురీపురము గొప్ప క్షేత్రిరాజమనియు, యోగాభ్యాసము గావించు మహాత్ము లచటఁ గృతార్థు లగుదురనియు, అచటి దత్తా

త్రేయస్వామి యోగిస్వరూపుఁడనియు, మాహురీపురమున నాలయముగలవాఁడనియుఁ దెలియును. కార్తవీర్యార్జునుని నాటికే దత్తాత్రేయుఁడు ఇష్టకామ్యములు భక్తులకుఁ బ్రసాదించువాఁ డనుటఁబట్టే దత్తాత్రేయాలయము పింగళి సూరన అభిప్రాయము ప్రకారము భారతకాలము నాటిది. సూరన భారతవర్షమునఁగల ప్రసిద్ధక్షేత్రముల నన్నింటినో పేర్కొనినాఁడు. అవి నేటికిని యాత్రాస్థలములుగా నుండి యాంధ్రులకుఁ బరిచితము లగుటచేఁ బ్రత్యేకించి వానినిగూర్చి చెప్పవలసినది లేదు. మాహురీపురము ఎచటనున్నది, అచటి విశేషము లేవి యని తెలిసికొనుటకు పాఠకు లువ్విళ్లు లూరక పోరు. తుళువ నరసరాజు మాహురమును జయించెనని వరాహపురాణమునఁ గలదు. క్రీడాభిరామమున మాహురము ప్రశంసగలదు. మాహురములోని రేణుకాదేవినే ఏకవీరయని కాకతీయులు తమ దుర్గమునఁ బ్రతిష్ఠించిరి. ఇపుడా యాలయము రూపుమాసినను మాహురముతోఁ గాకతీయుల కొక కాలమున సంబంధము గలదను కొనుట కిది నిదర్శనము కాఁగలదు. విజయనగరరాజుల పాలనములోనికి వచ్చినపిదప సూరన మాహురమును దర్శించి ఇష్టకామ్యములు పడసి, మాహుర దత్తాత్రేయునితోఁ దనకథాంశము ముడిపెట్టియుండునేమో అని తోఁచుచున్నది. మాహురము ఇపుడు మహారాష్ట్ర దేశముగాఁ బరిగణింపఁబడుచున్నను గాకతీయుల కాలమున నిది తెలుఁగువారికి నెలవై తెలుఁగుదేశముగ నుండెనని తోఁచుచున్నది.

మాహురము చేరుబాట సౌకర్యములు గల ఈకాలమునఁ గూడ దుర్గమముగా నున్నది. అందుచేతనే ధారాళముగా నాంధ్రులకు రాకపోకలు గల ఈక్షేత్రరాజము విస్మృతప్రాయమైనది. నిజాము రాజ్యములోని హైదరాబాదునుండి ఔరంగబాదునకుఁ బోవు చిన్నరైలులో నిజామబాదునకు 65 మైళ్లలో ఆదిలాబాదు గలదు. అచటి వఱకు దొరతనమువారి మోటరులు నడుచును. ఆదిలాబాదునుండి మాహురమునకు మంచిరోడ్డులేదు. కాన నిచటనుండి విడసత్రోడ, దుండ్యా, ఉమ్రి మున్నగు 22 గ్రామములు దాటి 50 మైళ్లు ప్రయాణము గావించినచో మాహురము చేరవచ్చును. మార్గమున అరణ్యములుంట మృగభయము మెండు. వేసవిలో మోటరులలోఁ బోవచ్చును.

మాహురముకోట చాల గొప్పది. ఇపుడు కోటగోడలలోఁ జెట్లు మొలచుటచే దుర్గమముగా నున్నది. మాహురము జనసంఖ్య 1515. ప్రతిసంవత్సర మిచట మూఁడు పర్యాయములు ఉత్సవములు జరుగును. దాదాపు 50,000 లకు మించిన ప్రజలు విశేషించి బీరారు చుట్టుప్రక్కలనుండి వచ్చెదరు. మాహూరులోఁ బ్రసిద్ధాలయములు రెండు.

1. రేణుకాదేవి మందిరము. ప్రకృత మీ దేవాలయము పూజా విషయమున వివాదములు పెక్కులు గలవు. ఈ యాలయమునకు బీరారురాష్ట్రమున రెండు గ్రామములు గలవు. అర్చకుల తగవులలో మున్ను కొన్ని హత్యలుగూడ జరిగెను. శ్రీరాజా జగరాజ జగజీవనుగారు తగవుల బరిష్కరింప మధ్యవర్తిగా నేర్పడిరి. పూజారులు ఆలయమునుండి వచ్చు ఆదాయమును ప్రజాహిత కార్యములకుగాని ఆలయమును బాగుచేయుటకుగాని వినియోగింపక పోవుట శోచనీయాంశము. పూజారీలు దేవధనమును సొంతమున కుపయోగించుకొనుటచే బ్రసిద్ధతర మగు నీయాలయము శిథిలదశకు వచ్చుచున్నది.

(2) దత్తాత్రేయాలయము. ఈ యాలయమునకు 6 గ్రామములు నైజాములోను 14 గ్రామములు బీరారురాజ్యమునందును గలవు. దాదాపుగ రాబడి రు 60,000. సిస్తుల బకాయి దాదాపుగా రు 40,000. మహంతుల వంశక్రమమున నిపుడు 27 వ పురుషుడు ఆలయాధికారిగా వ్యవహరించుచున్నాడు. ఈయన మంచి యోగ్యుడు. "మహాభావ" కులమునకు జెందినవాడు. ఆలయమునకు కానుకల వలన ధనము విస్తారముగా లభించుచున్నది. ఆలయము చెంతగల మోవాలచెఱువు క్రమక్రమముగా శిథిలదశకు వచ్చుచున్నది. మహంతును ధర్మాధికారిగా నుంచి ఆలయపాలనమునకు సభ్యుల నేర్పఱుప దొరతనమువారు సూచించిరి. సరియగు కట్టుబాటు లొనరించినచో ఆలయాదాయమునుండి యెన్నియేని ప్రజాహితసంస్థల నేర్పఱుపవచ్చును. మాహూరులో 20 పూజారిగృహములు గలవు. 4-5 గురు మాత్రము మహారాష్ట్రులు. ఒకడు గురవ్ * కులస్థుడు. ఈ యాలయమునే పికారి దేవాలయము అని వ్యవహరింతురు.

మాహూరు ప్రాంతమున జరిత్రప్రసిద్ధము లగు దేవాలయములు, దుర్గములు పెక్కులు గలవు. కొన్ని తావుల ఉష్ణగుండములుగూడ గలవు. ప్రసిద్ధము లగు క్షేత్రములందు నేటివఱకును మహోత్సవములు జరుగుచున్నవి. కేవలారణ్యమయ మగుటచే మాహూరునకు యావదాంధ్రదేశముతో సంబంధము తొలగి విస్మృతప్రాయమైనది. ఆంధ్రులకీ యాలయముతో సంబంధమున్నటుల ఈశ్వరనరసింహుని విజయగీతములు క్రీడాభిరామము తెల్పుచున్నవి. పింగళి సూరనార్యుడు అజరామరమగు కళాపూర్ణోదయములో మాహురమును అచటి దత్తాత్రేయుని, ఆ దత్తాత్రేయునితోగల కార్తవీర్యార్జునుని సంబంధమునుజూడ జరిత్రముల కందని పూర్వకాలమునుండిగూడ మాహురము సుప్రసిద్ధమనియు ఆంధ్రులకు జిరపరిచిత మనియు దెలియును. మఱియొకమాఱు సూరన పేర్కొన్న ధర్మపురినిగూర్చి వ్రాసెదము.

* మరాఠీదేశపు గురవలు మనదేశపు తమ్మడులు ఒకరే—సం॥

# శ్రీ ఆనందయ్య స్వాములవారు

శ్రీ కె. సుందరేశ్వరుఁడు గారు.

శ్రీ పరమేశ్వరుని లీలాజాల మత్యద్భుతమని చెప్పనక్కరలేదు. ఎపుడు ఏవిధముగ ఎవ్వరిచే నెందులకు ఈ లోకనాటకము నాడించి చూపించునో మనుష్య మాత్రులు తెలిసికొన జాలరు. మనము స్వార్థపరులము కావున తెలిసియో, తెలియకయో మన ఇచ్ఛవచ్చినటుల పనులను నెరవేర్చుకొనుచునే యున్నాము. కాని ఇష్టార్థములను బడయుటలేదు. సంసారసాగరాంధకూపమున బడి పరితపించుచున్నను దానిని త్యజించ జాలకున్నాము. మన మెంతటి యపచారము నేయుచున్నను పరమేశ్వరుఁడు దయామయుఁడు కావున మన వెనువెంట నుండి సమయానుసారము వివిధ రూపములతో సహాయము చేయుచునే యున్నాఁడు. తన సందేశమును వినుపించుచునే యున్నాఁడు. మహాత్ముల వేషముతో కనుపించుచునే యున్నాఁడు. ఇట్టి మహనీయులలో జేరువారే శ్రీ ఆనందయ్య మహాస్వాములవారు.

శ్రీ వారికి 'మహానందయ్య' "శివానందయ్య' 'బ్రహ్మానందయ్య' 'జ్ఞానానందయ్య' మున్నగు నామము లెన్నియో కలవుగాని, ఆనందయ్యగారు అనుపేరే సుప్రసిద్ధమై దేశదేశాంతరములలో వ్యాప్తి జెందెను. వీరు ఏ దేశములో పుట్టి, పెరిగి, విద్య నభ్యసించి, తపస్సొనర్చి, మహాత్ములైరో కాని, మన కేమియును తెలియరాదు. వారి గుణగణములు, యోగ్యత మున్నగు వానినే కాదు, చివరకు వయసును కూడా నిర్ణయింపలేము. ఐనను నా యల్పబుద్ధికి తెలిసిన యంశములను మాత్రము పొందుపరచుచున్నాను. షుమారు అరువది సంవత్సరములకు పూర్వము నిజాంప్రాంతము వరంగలు, కరీంనగరము జిల్లాలలో సహజముగా కనుపడిరి. వేషములోగాని, భాషలో గాని సామాన్యమైన మాహేశ్వరునివలె నుండిరి. ఆడంబర మెప్పుడును లేదు. క్రొత్తగా వచ్చినపుడు ౭౦ సంవత్సరముల ప్రాయముగల వారుగ నుండెడివారు. మామూలుగా పంచె, అంగి, తలపాగ, ఉత్తరీయములను ధరించుచుండిరి. ఎక్కడ వెళ్లినను వెంట నొక అశ్వసంచియు, ఆసనమును ఉండెడివి. ఇవియన్నియు మొదటినుండియు చివరదనుక నొకే తీరుగ నుండెను. శ్రీవారొక గొప్ప మఠాధిపతులకు శిష్యులై యుండి, ఇతర శిష్యుల యజాగ్రతవలన మఠాధిపత్యమునకు తిలాంజలి నొసగి యనేక వత్సరము లరణ్యావాస మొనర్చిన మహాసిద్ధపురుషుఁడని ప్రతీతి కలదు. వీరు చిన్న చిన్న

లోకోక్తులవలనను, మామూలు మాటలవలనను భక్తులకు సదాచారమును, వేదాంతమును, ఐకమత్యమును బోధించుచు వేనవేలజనమునకు ఆచార్యులుగా నుండిరి. ఇట్లయ్యును, అందరికి కడువినయముగా నమస్కరించు చుండిరి. శిష్యుల ప్రోత్సహించి తమ అడ్లూరి బేగంపేటలోని సందులమఠమున లక్షపత్రి పూజోత్సవము సందర్భమున నేమి, కొత్తకొండ శ్రీ వీరభద్రస్వామి యాత్రలో నేమి, ప్రతి మాసపు పౌర్ణమ నాడేమి, వేలు, లక్షలు సంఖ్యలుగల సమస్తజాతి సోదరులకు గావించుచు వచ్చిన అన్నదానములు లోకవిఖ్యాతములైనవి. మానవప్రేమ వీరి కపారము. అనేకులగు రోగార్తులను, దరిద్రులను, సంతానహీనులను, నాస్తికులను కడతేర్చి సౌఖ్యమొసంగిన మహానుభావులు. దుష్టులనుగాని, దురాచారులనుగాని, నిర్దాక్షిణ్యముగ శిక్షించి బోధించుచుండిరి. విద్వాంసులను, మహనీయులను సన్మానించుటలో వీరికి వీరే సాటి. వీ రెవ్వరినిగాని యాచనతో పీడించియెరుగరు. శక్తియుండియు స్వల్పముగ దానము చేయువారికి తగిన శిక్షలు జరుగుచుండెడివి. ఈ కారణమువలన సర్వమతస్థులును ఆనందయ్యగారి యద్భుతమహిమప్రభావముల నెఱిగి జాగరూకతతో మెలంగెడు వారు. ఏ కారణమువలననైనను సమాధానము కలుగని వాని యింటికి లక్షల రూపాయలు దొరకు నన్నను వెళ్లువారు కారు. పుణ్యాత్ముల యింట స్వంత ఖర్చులు పెట్టుకొనియైనను నివసించెడువారు. వీరి మాటయు, క్రియయు నేక మార్గమున నేగుచుండెడివి. దుఃఖ ద్వేష రాగ భోగములు లేనినిత్యానందులు వీరికి బేగంపేట, కరీంనగర్, దామెర, హుజూరాబాదు, హానకపర్తి, కాజీపేట, వరంగలు, ప్రాంతమున భక్తమాహేశ్వర వైశ్యులును, రెడ్లును మున్నగు సమస్త జాతులలో శిష్యబృందము కలదు. మన 'విభూతి' సంపాదకులయందును శ్రీవారి శ్రద్ధా ప్రేమోపకారములు మెండు. వీరశైవులకు గూడ నీ ప్రాంతమున నండగా నుండిరి. సిద్ధాంతశిఖామణి గ్రంథము (మూలశ్లోకములు) తెలుఁగు, కన్నడ, నాగరలిపిలో నచ్చువేయుటకై కాశీ జగద్గురువులవారికి రు. ౫౦౦ లను సమర్పించిరి. శ్రీవారు గత బహుధాన్య సంవత్సర కార్తిక మాసమున సమాధిస్థులై యపారమగు శిష్యకోటికి విషాదమును గల్గించిరి. సమాధి బేగంపేటలోని మఠమున నే యైనది. ఇటీవల సమాధి మహిమయు సమర్థముగా నున్నట్లు చెప్పుచున్నారు. ఆధునికాంధ్ర వీరశైవులలోని మహాజ్యోతియొకటి శ్రీవారితో కైలాసమున కేగినది. శ్రీవారిని గూర్చిన విశేష చరిత్రను ప్రత్యేకముగ బ్రకటింపవలసి యున్నది. ఇప్పటికీ సంక్షిప్తపరిచయముతో పాఠకులు సంతృప్తి నంద గోరుచున్నాను.



# 'శివతత్త్వసార' కర్త 'పండితుఁడు' కాఁడట!

## డా॥ చి॥ నారాయణరావుగారి విచిత్రయుక్తి!!



ఆంధ్రసాహిత్య పరిషత్తువారు ప్రకటించిన శివతత్త్వసారమను గ్రంథము శ్రీమల్లికార్జున పండితారాధ్య విరచిత మనుట ఆంధ్రలోక విఖ్యాతము. ఇది కేవలము ప్రవాదముకాక పాలకురికి సోమనాథకవి తన పండితారాధ్య చరిత్ర దీక్షాప్రకరణ మున—

"అంతఁ బండిత మల్లికార్జున ప్రభువు..................
శివతత్త్వసార సంచిత మహామహిమ 'శివతత్త్వసారమ'ను శివకృతిఁ బొగడు".

ఈ వాక్యములతో సుస్పష్టముగా మల్లికార్జున పండితారాధ్యుఁడే శివతత్త్వసారము రచించెనని వచించియున్నాడు. ఈ గ్రంథమును కనిపెట్టిన శ్రీ వే॥ ప్రభాకరశాస్త్రిగారును పరిశోధించి ప్రకటించిన శ్రీ కొ॥ లక్ష్మణరావుగారును, మల్లికార్జున పండిత కృతమనియే నిర్ణయించిరి. ఆంధ్ర విద్వాంసు లందరును సయుక్తికముగ విశ్వసించి యిట్లే వ్యవహరించుచున్నారు. శ్రీ డా॥ చిలుకూరు నారాయణ రావుగారును, తమ పండితారాధ్య చరిత్ర పీఠిక ౭౮వ పుటలో "రుద్రసహస్ర నామము" మొదలయిన గ్రంథములపేళ్లను సోమనాథుఁడు మల్లికార్జున పండితారాధ్య రచితములుగా ధ్వనించేటట్లు సూచించినాడు. వీటిలో శివతత్త్వసార మొక్కటి మాత్రము బయలు పడినది. తక్కినవన్నీ ఏమయినవో తెలియదు. సోమనాథుఁడు శివతత్త్వసారమును పండితారాధ్యకృతిగా చెప్పడమే కాకుండా దానిలోని చాల భాగ మున్నదున్నట్లు ద్విపదలో ఇమిడ్చి పండితారాధ్య చరిత్రములో చేర్చి వేసుకున్నాడు. ఇట్లే తక్కిన వాటిలో అనేకములున్ను పండితారాధ్య చరిత్ర బసవ పురాణములలో చేరిన వేమో చెప్పలేము"—అని వ్రాసి ఇది పండిత కృతమే యని స్వీకరించినారు. మరియు నదే. పీఠిక ౫౮౯వ పుటలో 'వీరశైవవాఙ్మయము' అను శీర్షికలో పాల్కురికి సోమనాథుని తర్వాత బయలు దేరిన గ్రంథముల జతకు మల్లికార్జున పండితకృతమగు శివతత్త్వసారమునుగూడ చేర్చినారు. ఇది పొరపాటువలన జరిగిన స్వవచనవ్యాఘాత మని భావించియుంటిని. కాని శ్రీ చి. నా. రావుగారు బుద్ధిపూర్వకముగ, సాధారణముగ నాంధ్రులకు దెలియ కుండుటకై చేసిన చమత్కార మని యీ క్రింది వ్రాత తమకు నివేదింపగలదు.

అనంతపురము కాలేజిలోని కర్ణాటకసంఘమున 15—8—1939 తేదిని శ్రీ నారాయణరావుగారు "వీరశైవ వాఙ్మయావతారము" అను విషయమును గూర్చి కన్నడభాషలో నుపన్యసించినారట. ఆయుపన్యాసము మైసూరు విశ్వవిద్యానిలయము వారి "ప్రబుద్ధ కర్నాటక" పత్రికలో మొన్ననే అచ్చుపడినది. వీరశైవ వాఙ్మయ మంతయు క్రీ. శ, 13 వ శతాబ్దికి తరువాతఁ బుట్టినట్లుగ నా యుపన్యాసమున వ్రాసినారు. వీరశైవ వాఙ్మయమును వారు సరిగా జూడనందున ననేక ప్రమాదములు దొరలినవి. వారి కన్నడ యుపన్యాసమును కన్నడ పత్రికలోనే విమర్శింపగలను. కాని, శివతత్త్వసారమును గూర్చిన వారి యభిప్రాయ మాంధ్రుల కెరింగించుట ముఖ్యమని తలంచుచున్నాను. కన్నడమున వారిట్లనిరి.

"శివతత్త్వసార మను గ్రంథము మల్లికార్జున పండితారాధ్యుని దే యైనచో ఆ గ్రంథమున నిది (షట్‌స్థల సిద్ధాంతము) కొంచెము మట్టుకు సూచితమైనది మల్లికార్జున పండితారాధ్యుఁడు బసవేశ్వరునికంటెను వృద్ధుఁడై యాతనికి సమకాలికుఁడై యుండెనని పాల్కురికి సోమనాథుని గ్రంథములచే తెలియుచున్నది. అయినను పండితారాధ్యుఁడు శివతత్త్వసారమును వ్రాయలేదనియే నా యభిప్రాయము. సోమనాథుఁడు తెలుఁగులో మహాకవి. ఆ భాషలో నతఁడు బసవపురాణ, పండితారాధ్యచరిత్రలను మహాగ్రంథములనూ, ఇంకను అనేకకృతులనూ రచించినాడు. ఆతని 'పండితారాధ్యచరిత్రలో శివతత్త్వసార మంతయు ప్రత్యక్షరమూ చేరినది· సోమనాథునివంటి మహాత్ములకు ఇట్టి గ్రంథచౌర్యము నాపాదించుట న్యాయము కాదు. 'పండితారాధ్యుఁడు శివతత్త్వసారమును రచించె' నని సోమనాథుడు చెప్పినది సత్యమే యైనను, తానే తన గ్రంథమునుండి కొన్ని భాగములను దీసి పండితారాధ్యుని పేర ప్రకటించి యుండునని తోచుచున్నది."

(ప్రబుద్ధకర్నాటక, కామన సంచికె 1940. పుట 2.)

శ్రీ నారాయణరావుగారి పాండిత్యమును గూర్చియు, పరిశోధనా పరిశ్రమను గూర్చియు ఆంధ్రులు గర్వింపదగిన విషయము నిర్వివాదము. నేనును కొన్ని బహిరంగసభలలో వారి యాంధ్రభాషాచరిత్రమును గూర్చి ముక్తకంఠముగ బొగడియుంటిని. వారి వ్రాతలకు చాల విలువయుండు ననియును లోకము భావించుచున్నది. ఇట్టి మహానుభావులు శివతత్త్వసారమును సోమనాథకృతముగ నిరూపించుటలోని యుక్తులు క్షుద్రాతిక్షుద్రము లని సామాన్యులకును తెలియగలవు. సోమనాథు నంతటి మహాత్ముఁడు గ్రంథచౌర్యమును చేయుటకు పనికిరానపుడు తాను సృష్టించిన గ్రంథమును గురుకల్పుఁడుగ నున్న పండితశిరోమణి మల్లికార్జునుని పేర లోక

మున బ్రకటించు నసత్యమైన దుర్మార్గకార్యమును సోమనాథుఁడు గావించెననుట జూడ "మద్యము ద్రావలేదు కాని మాంసము దినె' నన్నట్లున్నది. పండితారాధ్య చరిత్రకు వ్రాసిన వీరి పెద్దపీఠికలో నీ విషయమును సుస్పష్టముగ దెలిపినచో నాంధ్ర పండితులు పరిహాసము గావింతురని భావించి కాబోలు, తెలుగు వాఙ్మయ పరిస్థితుల నరయని కర్నాటకులలో దమ యభిమతమును రావుగారు ప్రకటించుకొనినారు. అఖండపండితుఁడగు మల్లికార్జునుఁడు రచించిన యనేక గ్రంథములలో సౌభాగ్యవశమున శివతత్త్వసార మొకటిమాత్రము లభించినది. అది శైలియందును, విషయనిరూప ణమునందును ప్రత్యేకత గలదై, సోమనాథుని కృతులకంటె భిన్నతను సుస్పష్టముగ దెలుపుచున్నది. దానిని జూచియే ప్రప్రథమమున 'అనుభవసార' మను గ్రంథమును సోమనాథుడు రచించి యున్నాడు. పండితారాధ్య చరిత్రను నిర్మించునాటికి సోమనాథుఁడు ప్రౌఢుఁడు. కావున వేదసారమును నిరూపించునపుడు కేవల వేదవాక్యములతోడను, పురాణాదులను దెల్పునపుడు, శాస్త్రపురాణ వచనములతోడను, తన ద్విపదను నిబద్ధముచేయు ప్రజ్ఞాశాలియని యాతని కృతులే సాక్ష్య మిచ్చుచున్నవి. అటులే పండితారాధ్య చరిత్రలో శ్రీ మల్లి కార్జున పండితునియొక్క యుపదేశ విశేషములను దెలుపుటకై యాతని శివతత్త్వ సారమునే గ్రహించి తత్సిద్ధాంతములనే సాకల్యముగ సోమనాథుఁడు నిరూపించుట సయుక్తికముగను సంప్రదాయ శుద్ధముగను ఉన్నది. పండితుని సిద్ధాంతమును పండి తుని వాక్కులతోడనే ఇముడ్చుట మెచ్చదగిన యంశముకదా! ఇక గ్రంథచౌర్య మెట్లగును? ఇదియే గ్రంథచౌర్య మగుచో సుప్రసిద్ధులగు నాచార్యాదుల గ్రంథము లన్నియు నపబద్ధములే! విద్యారణ్యుని పంచదశ్యాది వేదాంత గ్రంథములలో శంకరాచార్యుని సూత్రభాష్యములోని సమస్త సిద్ధాంత వాక్యములును ఇమిడి యున్నవి కావున, విద్యారణ్యాదులే శంకరభాష్యమును రచించి యుండవలెను కదా! అప్పయ్యదీక్షితుని రత్నత్రయపరీక్ష, శివాద్వైత నిర్ణయము, శిఖరిణీమాల మున్నగు గ్రంథములలో శ్రీకంఠ శివాచార్యుని భాష్యపంక్తులును, సిద్ధాంతమును కలవు కావున శ్రీకంఠభాష్యమును అప్పయదీక్షితులే విరచించిరా? విలక్షణమైన యుక్తులతో నిట్టి సిద్ధాంతముల నెన్నిటినైన నిలవేయవచ్చును. శ్రీరావుగారు గొప్పవారు కావున వారు వ్రాసిన వ్రాతలను సహజముగ నందరు ప్రమాణము లనియే యంగీకరింతురు. ఇక పరిశోధనాపద్ధతి పాతాళమునకు జేరవలసినదే! వీ రిట్లు వ్రాయుటకు ప్రబల కారణ మేమనగా, రావుగారు మధ్వమతస్థులు. మాధ్వులకు వారి యాచార్యు లుద్భవించి సంప్రదాయమును స్థాపించిన పదుమూడవ శతాబ్దము మిక్కిలి మహ

త్త్వము గలది. వీరికి నితరమతస్థుల గ్రంథములను జూచినచో నవి శ్రీ మధ్వా చార్యులవారి తర్వాతివిగా గన్పడుటయు, అట్లు సిద్ధాంతింప బడుటయు సహజముగు. శివతత్త్వసారమును ఎటులనైన సోమనాథుని కంటగట్టుచో వీరశైవుల ప్రధానపురుషులనందరిని 13వ శతాబ్దమునకు నీడ్వవచ్చును. శ్రీపతి పండిత భాష్యాదులకాలమును గూడ సహజముగ దింప వీలగును. దీనితో బాటు వీరశైవవాఙ్మయ మంతయు సోమనాథునికి తరువాత క్రీ. శ. 14 శతాబ్దమున బుట్టినదను తమ వాదమును నిష్ప్రమాణముగ నిలవేయ వచ్చును గదా! బెంగళూరు మధ్వమతస్థులు శ్రీ సి. హయవదన రావుగారు శ్రీకరభాష్యపు ఇంగ్లీషు పీఠికలో తప్పులతడకల నల్లుచు శ్రీకరభాష్యమును, శ్రీపతి పండితుని 14 వ శతాబ్దమునకు లాగిరి. వారి వ్రాతలను నప్రమాణముగ విమర్శించి కన్నడమున గ్రంథమును ప్రకటించియున్నాము. కావున నదియా దేశస్థులకు సరిగా తెలియును. నారాయణరావుగారు హయవదనరావుగారి కోసిన్ని యమును పైకి ద్రోసిపుచ్చినను ఒకదెబ్బతో శివతత్త్వసారమును క్రిందికి బడవేసికొనుచున్నారు. కావున అంతరంగమున హయవదనరావుగారికి సహాయముచేసి వీరశైవ మతగ్రంథములను 14 శతాబ్దమున బుట్టించుటకు గడంగియే యున్నారు. స్వమత ప్రేమ యనిన నిట్లుండవలెను! నారాయణరావుగారు వీరశైవమత గ్రంథములను చాలకొలదిగా చూచి నట్లున్నారు. సోమనాథుని గ్రంథములను సైతము సరిగా చదువలేదు. పరిశోధకులు ఎక్కువగా చదివి తక్కువగా వ్రాయవలెను. వీరు తక్కువగా జదివి ఎక్కువ విశేషములను వ్రాయుచున్నారు. అందునను తమకు పరిచయము లేని వాఙ్మయమును మిక్కిలి పరిశోధించినగాని వ్రాయఁగూడదు. సంస్కృతాంధ్ర కర్నాటక మహారాష్ట్ర భాషలలో నచ్చుపడిన వీరశైవగ్రంథజాల మొక బండెడు కలదు. పరిశోధన ఎంతకలదో చెప్ప నవసరము లేదు. వాఙ్మయమందిరమున నిష్కల్మషమైన దృష్టితో బ్రవేశించి నిష్పక్షమైన పరిశోధనలను గావించి సత్యము ప్రకటింపవలెను. కీర్తికొఱ కెప్పుడును ప్రయత్నింపఁ గూడదు. పరమత పరిశ్రమాదు లవసరము లేనివారు స్వమత గ్రంథములనే వ్రాసికొనవచ్చునుకదా! ఈ సత్యమును ప్రకటించుటలో ననివార్యములగు విమర్శనా భాగములు అట్టి వ్యక్తులకు గుఱియగుచో సహజ మని పండిత లోకము నన్ను మన్నించుగాక!

చి. మ. వీరభద్రశర్మ.




**గృహలక్ష్మి:**—సంపాదకులు: డా॥ కె. యన్. కేసరిగారు. సంవత్సరచందా 3-0-0 చక్కని అచ్చు కాగితములును, రాయపేట, మద్రాసునుండి వెలువడును.

ఈ మాసపత్రిక స్త్రీ జనాభ్యుదయమునకై పండ్రెండు సంవత్సరములనుండి వెలువడుచు ఆంధ్రలోకమునకు సుపరిచితమై యున్నది. ప్రస్తుతము 13 వ సంపుటము ప్రథమసంచిక విమర్శనార్థము మాకుఁ జేరినది. కొన్ని సంవత్సరములనుండి శ్రీ డా॥ కేసరిగారు మహిళా విదుషీమణులకు ఈ "గృహలక్ష్మి" ద్వారా స్వర్ణకంకణ బహుమానము నొసంగుచు ఆంధ్రలోకమున నొక యపూర్వోత్సాహమును గలిగించుచున్నారు. ఈ వత్సరమునను సభలో 'సరస్వతీ రామాయణ' ప్రబంధమును రచించిన శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి కవయిత్రిగారికి స్వర్ణ కంకణము బహూకరింపబడినది. ఈ దృశ్యము లోకరంజకముగను, అభిమానాస్పదముగను ఉన్నదనుటలో సందియము లేదు. ఏతదుత్సవమును పురస్కరించుకొని యొసంగబడిన ఉపన్యాసములు, సందేశములు, అభినందనములు, కవయిత్రీ ప్రశంసలు, ఒకటి రెండు ఇతర వ్యాసములును గలిసి మొత్తము 90 పేజీలును, అనేక చిత్రపటములును గలిగి ఆకర్షణీయముగా సంచిక ముద్రింపబడినది. స్త్రీ జనాభ్యుదయము గోరువా రందరును ప్రచారము చేయదగిన పత్రిక యనుటలో సందియము లేదు. ఈ పత్రికలో వెనుక చక్కని వ్యాసములు వెలువడుచుండెను. ఇటీవల పరిశ్రమ పూర్వకముగ వ్రాయబడిన వ్రాతలు విరళము లైనవి. సంపాదకులు శ్రద్ధవహించి విజ్ఞాన ప్రదముగ ప్రకటింప గోరుచున్నాము.

**తెలుఁగుతల్లి:**—(పోతన సంచిక) సంపాదకులు: రాచమళ్ళ సత్యవతీదేవిగారు. సంవత్సర చందా 1-8-0, ఈ సంచిక 0-8-0, బన్సీలాలుపేట, సికింద్రాబాదు. పుటలు 160. అచ్చుకాగితములు సామాన్యము.

హైదరాబాదు శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయమున 17-2-40 తేదిని శ్రీ పోతన మహాకవి వర్ధంతి (బ్రతికినవారికి వర్ధంతి, దివంగతులగు వారికి జయంతి యనుట సంప్రదాయము కలదు కాని, నిలయమువారు వర్ధంతి యనియే వ్యవహారము) గావించిరి. అధ్యక్షులగు డా॥ చిలుకూరు నారాయణరావు గారియొక్కయు, ఇతర కవిపండితుల యొక్కయు అనేకోపన్యాసములు పోతనను గూర్చి చదువబడినవి. మహోత్సాహముగ నీయుత్సవము నెరవేరినది. సహజముగ లభించిన ఈ వ్యాసముల నన్నిటిని పోతన సంచికయను పేరతో మిక్కిలి ధనవ్యయము గావించి తెలుగుతల్లి సంపాదకులు ప్రకటించి ప్రశస్తమైన కార్యమును నిర్వహించినారు. ఈసంచిక ఆంధ్ర భాషాభిమానులందరిచేతను ఆదరింపఁదగియున్నది. ఈ మాసపత్రిక పుట్టి ఐదు మాసములే యైనను శక్తిని మించిన సంచికను ప్రకటించినది.

వ్యాసము లన్నియు పరిశ్రమతో వ్రాయబడినను పోతనను గూర్చియు, పోతనగ్రంథములను గూర్చియు ప్రాతవిషయములే కాని నూతన విజ్ఞాన మేమియు కనపడదు. ఇతర విషయములను గూర్చిన కొన్ని వ్యాసములు బాగుగనే యున్నవి. మొత్తము సంచికలో ననేక విమర్శనీయాంశములు కలవు. వానినిట వివరింపజాలము. అచ్చు తప్పుల విషయములో నికముందు సరియైన శ్రద్ధవహింపగోరుచున్నాము.

సుకవీ! యను పద్యములలో కర్ణాటకరాజులకు నీచశబ్దము వాడఁబడినది. పోతనగారి "కర్ణాటకిరాట కీచకుల కమ్మ" అనుటలోని స్వారస్యము నరయక నీచశబ్దము అన్యాయముగ వాడఁబడినది. పోతనగారి కాలమున ఆంధ్రకృతికన్యలను (పాండవభార్యను కీచకునివలె) కర్ణాటకు లపహరించు పరిస్థితి యేర్పడి నందున మహాకవి యాలోచించి యట్లు పలికెను గాని, అసలు కర్ణాటరాజులే నీచులని కాదు. అధ్యక్షోపన్యాసములో అనవసరముగ పోతనయొక్క వీరశైవత్వమును గూర్చియు, సోమనాథుని పాల్కురికిని గూర్చియు విపరీతములు వ్రాయబడినవి. పోతన వీరశైవుఁడని వీరశైవు లెవరును వివరింపలేదు. పురాణమైన భాగవతమునకు కావ్యత్వసిద్ధి గలిగించుటకును, పోతనకవియొక్క సహజమైనకొన్ని యప ప్రయోగములను శుద్ధములే నని చెప్పి యాయనను తమ నవ్యసాహిత్యసంప్రదాయమునకుఁ జేర్చుకొనుట కును, అధ్యక్షులవారు తంటాలు పడినారు. ఇదియే సుపద్ధతి యగుచో నిక ప్రమాదములు ఎక్కడను లేవు. వీరభద్రవిజయమును గూర్చిన వ్యాసమును ఆమహానుభావుఁ డెవరో కాని బలాత్కారముగ వ్రాసి నట్లున్నది. అభిమానములేని, అక్కరలేని గ్రంథమును గూర్చి వారేల వ్రాయవలెనో తెలియదు. గ్రంథసమీక్షలో ఈ 'విభూతి' పత్రికను పొగడుచు "బం. తమ్మయ్య, వీరభద్రశర్మ గారలవంటి ఉత్సాహవంతులగు పండితు లుండగా వీరశైవమతసిద్ధాంతములకు తెలిసియో, తెలియకయో అపార్థ ములు కల్పించుట దుష్కరమైన పనియే! ఇరువురు పండితులు వ్యక్తిగత విమర్శనా విధానము పొందక లోక ఆంధ్రభాషాసేవ, శైవమతసేవ చేయవలయునని కోరుచున్నాను" అని వ్రాసినారు. ఈయుభయ పండితులు వ్యక్తిగత విమర్శన చేయుచున్నా రనుట పొరపాటు. మఱియొకమారు వీరి వ్యాసములను అన్వేషింప గోరెదము. పరమతీయులు తాము ప్రఖ్యాతుల మను అహంభావముతో గోముఖవ్యాఘ్ర వేషమును ధరించి నిరంతరముగ వీరశైవమును, గ్రంథములను, వ్యక్తులను గూర్చి అపప్రచారము చేయుచున్న సంగతిని మున్ముందు పాఠకులు ప్రత్యక్షముగ తెలిసికొనగలరు.

ఆంధ్రి:—సంపాదకులు, మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారు. పుటలు 24, మాస పత్రిక, సంవత్సరచందా రు 1—0—0 పల్లిపాలెం, వయా కాకినాడ. కాగితములు సామాన్యము. సైజు, డబలుక్రౌను.

మా 'విభూతి' పుట్టిన మాసములోనే ఈ "ఆంధ్రి" అవతరించినది. సమర్థులైన సంపాదకులు విద్వాంసులయొక్క చిన్నచిన్నవ్యాసముల నిందు బ్రచురించుచు జనమనోవినోదము నొనర్చుచున్నారు. నాల్గుపుటలకు మించిన వ్యాసములేదు. మాకుజేరిన పదుమూడవ సంచికలో 'ఏఁగుధాతువు' 'సుగ్రీవ విజయము' 'కళలు-కావ్యకళ' అను గద్యవ్యాసములును, 'పెడచూపు' 'సంధ్యారాధన' 'విజయ గానము' 'అంటుమామిడిమొక్క' అను పద్యవ్యాసములును విశేషతను ప్రకటించుచున్నవి. ఆంధ్రు లందరును 'ఆంధ్రి'ని పోషింపవలసి యున్నది. సం॥ ౧ సం॥ ౧౩ అను పద్ధతి సరిగా లేదు. పత్రిక చిరునామగాని, చందా విశేషముగాని తెలుగులో ముద్రింపకుండుట లోపమనితలంతుము. విరోధము లున్నపుడో, విశేషాంశముల వివరించునపుడో సంపాదకీయము లుండవలెను. గాని, ప్రతివాక్యముక్రింద నేదో కొంత వ్రాయుట సమగ్రముగా లేదని మనవి.

హృదయ విహంగము:—కర్త; రెండుచింతల లక్ష్మీనరసింహశాస్త్రిగారు, పేజీలు 26. అచ్చు మంచిది. సైజు సింగల్ క్రౌను. వెల, దొఱకుచోటు తెలియదు. కాకినాడలో ముద్రితము.

దీనియందు కొన్ని పద్యములును, కొన్ని గేయములును కలవు. "హృదయవిహంగము, భగ్న మనోరథుడు, ప్రకృతి, విలాసిని" మున్నగు విషయములను గూర్చి ఈయువకవిగారు భావపూర్ణముగను, ప్రణయమధురముగను పాడుకొనిన ఖండకావ్య మిది. శైలిలో గ్రామ్యసంమేళన మున్నను కవితలో స్పష్టమైన సంస్కారము, ప్రతిభ గోచరించుచున్నది. కావున, పరిశ్రమను సాగించుచో పురస్కార పాత్రులు గాఁదగి యున్నారనుటకు సందియము లేదు,

"రాజహంస"

విశయస్తు—కారణత్వం సర్వాధిష్ఠానస్య బ్రహ్మణః? తత్రారో పితప్రధానసత్త్వగుణప్రతిబింబిత కల్పితేశ్వరస్యవా? సర్వాధిష్ఠానస్య బ్రహ్మణో నిర్గుణత్వా జ్జగతశ్చ నిత్యత్వాత్తన్న సంభవతి। సావయవస్య కల్పితస్య మిథ్యాభూతస్య సుతరాం న సంభవతి.

కించ—"జ్ఞాజ్ఞౌ ద్వావజావీశనీశౌ" (శ్వే.౧-౯) "న కదాచి దనీదృశం జగత్" ఇత్యాదినా జగజ్జీవయో రజాతత్వనిత్యత్వవ్యపదేశాత్ కథం పరమేశ్వరస్య కారణత్వం? కారణత్వే "ఉత్పత్త్యసంభవాత్" (౨-౨-౮౨) ఇతిసూత్రే భగవతా సూత్రకారేణ శ్రుతిస్మృతి విరుద్ధత్వేన జీవోత్పత్తిప్రధానవైష్ణవమతస్య నిరాకృతత్వాత్ తన్న సంభవతి। అకారణత్వే—"యతో వా ఇమాని" (తై. భృగు. ౧) ఇత్యాదిశ్రుతివిరోధః స్యాత్। "అసద్వా ఇదమగ్ర ఆసీత్, తతో వై సదజాయత (తై. అను ౭) సదేవసోమ్యేదమగ్ర ఆసీత్" (ఛాం. ౬-౨-౧) "న సన్నచాసచ్ఛివ ఏవ కేవలః" (శ్వే. ౪-౧౮) ఇత్యాది శ్రుతిషు అసత్కారణత్వ సత్కారణత్వ సదసద్వ్యతిరిక్తపరశివకారణత్వశ్రవణాత్ బహువిప్రతిపత్తిర్దృశ్యతే।

పూర్వపక్షస్తు-న చ పరమేశ్వరస్య జగత్కారణత్వం,నిర్గుణత్వాత్। తథాత్వే జగద్విలక్షణత్వేన? తదంతర్యామిత్వేన వా? సాకారస్య? నిరాకారస్య వా? నాద్యః—సర్వవ్యాపకత్వభంగప్రసంగాత్, నిరుపాధికత్వేన నిరాధారత్వేన చ కులాలకువిందాదిభ్యో ఘటపటాద్యుత్పత్తేరసంభవాచ్చ। న ద్వితీయః — ఘటాదివత్పరిచ్ఛిన్నత్వప్రసంగాత్, ఆధేయత్వప్రసక్తేశ్చ। న తృతీయః—సావయవస్య బ్రహ్మణః నిరవయవాకాశాదికల్పనాయోగాత్, పూర్వవత్పరిచ్ఛిన్నత్వప్రసంగాచ్చ। నాపి చతుర్థః — నిరవయవస్య సావయవప్రపంచకల్పనాసంభవాత్, "నిష్కలం నిష్క్రియం శాంతం నిరవద్యం నిరంజనం" (శ్వే-౬-౧౯) ఇత్యాదిశ్రుతివిరోధప్రసంగాచ్చ।

కించ—సత్యజ్ఞానానందాత్మకపరశివజన్యత్వాంగీకారే జగతో
సచ్చిదానందాత్మకత్వం స్యాత్. తదంగీకారే జగతో జన్మా
అనృతజడదుఃఖాత్మకత్వం చ న స్యాత్. మృదాదివద్వికారిత్వప్ర
గశ్చ। కించ కారణత్వం నిమిత్తత్వముపాదానత్వం వా? తదుభయత్వం
వా? కించ తద్ద్వివిధకారణత్వం బ్రహ్మణః? ప్రధానస్య వా? నాద్యః
నిమిత్తత్వే "సర్వం ఖల్విదం బ్రహ్మ" (ఛాం. 3-౧౪-౧) "సర్వో హ్యేష
రుద్రః" (మహానా. అను. ౧౬.) ఇత్యాద్యద్వైతశ్రుతిభంగప్రసంగాత్।
న ద్వితీయః—"ఏకో హి రుద్రో న ద్వితీయాయ తస్థుః" (శ్వే-3-
"ఏకమేవాద్వితీయం" (ఛాం. ౬-౨-౧) ఇత్యాదిశ్రుతిసిద్ధాధిష్ఠాతృ
నిరాసాసంభవాత్। న తృతీయః—తమఃప్రకాశవత్పరస్పరవిరుద్ధస్వభా
త్వాత్। ప్రధానస్యాంగీకారే అచేతనత్వాదసత్త్వాచ్చ। కులాలా
వన్నిమిత్తోపాదానత్వాసంభవః. విరుద్ధత్వాత్తదుభయత్వాసంభవః।

కించ—"ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్, ఆనందాద్ధ్యేవ ఖల్వి
మాని భూతాని జాయంతే" (తై. భృగు ౬) "సదేవ సోమ్యేదమగ్ర
ఆసీత్" (ఛాం. ౬-౨-౧) న సన్న చాసచ్ఛివ ఏవ కేవలః" (శ్వే. ౪-౧
ఇత్యాదిశ్రుతిసిద్ధానందాదీనాం బ్రహ్మత్వే వికల్పస్సముచ్చయో వా
వికల్పత్వే కృతహానాకృతాభ్యాగమప్రసంగోఽవ్యవస్థా చ। వ్యస్త
వికల్పే అనేకబ్రహ్మత్వప్రసంగశ్చ। సముచ్చయే తేషామానందాదీనాం
ధర్మరూపత్వాత్, జగజ్జన్మాదికారణత్వాసంభవః।

కించ—క్షీరాదివత్పరిణామ్యుపాదానత్వాంగీకారే బ్రహ్మసచ్చిదా
నందాదిభంగప్రసంగః। సువర్ణకుండలాదివదారంభోపాదానత్వే పు
వద్వికారిత్వప్రసంగః। ప్రాగసద్రూపప్రధానాదిప్రపంచస్య రజ్జుసర్ప
వర్తత్వాంగీకారే శశశృంగాదీనాం కిం న స్యాత్? అతః ప్రపంచ
నోత్పత్తిర్విధీయతే। తథాపి "అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం
ప్రపంచ్యతే" ఇతి పూర్వాచార్యోక్తన్యాయమనుసృత్య శిష్యబోధా

వేదప్రామాణ్యసిద్ధ్యర్థం చ "అజామేకాం లోహితశుక్లకృష్ణాం" (శ్వే. ౪-౫) ఇత్యాదిశ్రుతావచేతనమాయాయా జగత్కారణత్వోపదేశాత్తస్యా ఏవోపాదానకారణత్వం వక్తుం శక్యం । బ్రహ్మధ్యస్తప్రకృతిసత్త్వగుణప్రతిబింబితకల్పితేశ్వరస్య వా తత్కారణత్వం? ఇతి చేద్బ్రూమః।

సర్వాధిష్ఠానసచ్చిదానందషట్స్థలపరశివబ్రహ్మణ ఏవ జగజ్జన్మాదికారణత్వం యుక్తం । "అపాణిపాదోఽహమచింత్యశక్తిః పశ్యామ్యచక్షుః స శృణోమ్యకర్ణః । అహం విజానామి వివిక్తరూపో న చాస్తి వేత్తా మమ చిత్సదాఽహం" (కైవల్య. ౨౧.) "ఆకాశశరీరం బ్రహ్మ । సత్యాత్మప్రాణారామం మన ఆనందం" (తై. శిక్షా. ౬)"సర్వాణి హ వా ఇమాని భూతాన్యాకాశాదేవ సముత్పద్యంతే। ఆకాశం ప్రత్యస్తం యంతి" (ఛాం. ౧-౯-౧) "ఆకాశో హ వై నామరూపయోర్నిర్వహితా తే యదంతరా తద్బ్రహ్మ తదమృతం స ఆత్మా" (ఛాం.౮-౧౪-౧) ఇత్యాదిశ్రుతికదంబేన నిరవయవస్యాపి బ్రహ్మణో బాహ్యకరణనిరపేక్షతయా సర్వకర్తృత్వం సూచితం । "ఆకాశశరీరం బ్రహ్మ" ఇత్యత్ర ఆకాశశబ్దేన తత్స్వాభావికచిచ్ఛక్తిరుచ్యతే; న భూతాకాశః; జడస్య తస్య కారణత్వాసంభవాత్ । సత్యాత్మా—సత్యస్వరూపః, "ఋతం సత్యం" ఇతిశ్రుతేః' ప్రాణశబ్దేన సకలజగదధిష్ఠానచిచ్ఛక్తిర్వ్యపదిశ్యతే. తస్యాం రమతేయః స ప్రాణారామః । మనశ్శబ్దేన పరాశక్తిరుచ్యతే. తస్యామానందోయస్య । అనేన బాహ్యకరణనిరపేక్షతా సూచితా । నిరవయవస్య వాయోర్వృక్షాది కంపనశక్తి దర్శనాచ్చ । అనంతశక్తివిశిష్టస్యాఘటితఘటనాసామర్థ్యం కిము వక్తవ్యం ? మూర్తస్య ప్రభాకరస్య హ్యమూర్తకాలకల్పనదర్శనాత్ । భక్తానుగ్రహార్థం ధృతకారివ్యవద్దివ్యమంగళవిగ్రహధరస్య మహేశ్వరస్య మూర్తామూర్తప్రపంచకల్పనేఽప్యదోషః ।

"సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాంత ఉపాసీత" (ఛాం. ౩-౧౪-౧) ఇతి శ్రుతౌ సముద్రోత్పన్నఫేనతరంగాదివత్ సర్వజగ-దుత్పత్తిస్థితిలయకర్మతయా తదాత్మకత్వమితి శ్రూయతే। జగదు-దాన పరమేశ్వరశక్తేస్తు ఏకదేశవృత్తిత్వం, "పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి" (తై. ఆర. ౩-౧౨) ఇతి శ్రుత్యా ప్రదర్శితం। తస్మాన్మహాకాశాంతర్భూతపవనాదీనామివ పరమేశ్వరా-ర్భూత జగతాం పరమేశ్వరకారణత్వం । "లింగమధ్యే జగత్సర్వం లింగబాహ్యాత్పరం నహి" ఇతిశ్రుత్యాపి తథా సూచితం.

"యతో వా ఇమాని భూతాని జాయంతే" (తై. భృగు. ఇత్యనేన శివస్య బ్రహ్మణో నిమిత్తకారణత్వం, "యత్ప్రయంతి" ఇత్యనేనోపాదానకారణత్వం చోపదిశ్యతే । తస్మాదవిరుద్ధమభి-నిమిత్తోపాదానకారణత్వం । న త్వేకకారణత్వం, నాధ్యాసత్వం, మిథ్యాత్వం చ విధీయతే.

నను—"జ్ఞాజ్ఞౌ ద్వావజావీశనీశౌ" (శ్వే. ౧-౯) ఇత్యా-పరమేశ్వరవజ్జీవస్యాప్యజత్వోపదేశాత్, "యతో వా ఇమాని భూతాని జాయంతే" (తై. భృగు. ౧) ఇత్యాదిశ్రుత్యా పరమేశ్వరస్య పంచమహా-భూతమాత్రకారణత్వమితిచేన్న । సృష్టేః ప్రాక్ స్వాత్మని కుసూల-ధాన్యవద్వర్తమానజీవానాం బహిర్నిర్గమనాదికర్తృత్వదర్శనాత్ జన్యత్వాజన్యత్వవిధాయకశ్రుతీనాం న విరోధః । "మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరం । తస్యావయవభూతైస్తు వ్యాప్తం సర్వమిదం జగత్" (శ్వే. ౪-౧౦) "మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః" (గీతా ౧౫-౭) ఇత్యాదిశ్రుతిస్మృతిదర్శనాత్ శక్తిసంకోచతయా సృష్టేః ప్రాక్ పరమేశ్వరస్య నిర్గుణత్వాత్ "నిష్కలం నిష్క్రియం శాంతం" (శ్వే. ౬-౧౯) ఇత్యాదినిర్గుణశ్రుతీనాం తత్కాలపర్యంతం । "స ఈక్షాం చక్రే" (ప్రశ్న. ౬-౩)

సగుణశ్రుతీనాం సృష్ట్యున్ముఖపరమేశ్వరశక్తివికాసకాలపరత్వం । సత్యజ్ఞానానందస్వరూపస్య శివస్య బ్రహ్మణో జగత్కారణత్వే మృదాదివద్వికారిత్వం స్యాదితిచేత్ —"మాయాం తు ప్రకృతిం విద్యాత్" (శ్వే. ౪-౧౦) ఇత్యాదిశ్రుతిషు మాయాయా జగదుపాదానత్వం పరమేశ్వరస్య నిమిత్తత్వం చోపదిశ్యత ఇతి న విరోధః।

చిదాత్మకపరశివే కథం జడప్రపంచకల్పనమితి—"యథోర్ణనాభిస్సృజతే గృహ్ణతే చ" (ముండక ౧-౧-౭) ఇత్యాదిశ్రుతౌ చేతనోర్ణనాభేరచేతనతంతూత్పత్తిదర్శనాత్ । అఘటితఘటనాశక్తివిశిష్టపరమేశ్వరస్య కిము వక్తవ్యం? తస్మాజ్జడచేతనయోః ప్రపంచపరశివయోః కార్యకారణభావస్య, ఐక్యస్య చ పూర్వోదాహృతైః "సర్వంఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాంత ఉపాసీత" (ఛాం ౩-౧౪-౧) ఇత్యాదిశ్రుతివచనైః ప్రతిపాదితత్వాత్ స ఏవ వైదికసిద్ధాంత ఇతి ఘంటాఘోషః।

అధ్యారోపాపవాదాంగీకారే— "స దేవసోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయం" (ఛాం. ౬-౨-౧) "తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి" (ఛాం. ౬-౨-౩) "ఏకోఽహం బహుస్యాం ప్రజాయేయ-ద్యావా పృథివీ జనయన్ దేవ ఏకః (మహానా. అను ౧) ద్వా సుపర్ణా సయుజా సఖాయా (శ్వే. ౪-౬)"ప్రధానక్షేత్రజ్ఞపతిర్గుణేశః సంసారమోక్షస్థితిబంధహేతుః (శ్వే౬-౧౬) తథా విద్వాన్నామరూపాద్విముక్తః పరాత్పరం పురుషముపైతి దివ్యం"(ముండక ౩-౨-౮)"సర్వో వై రుద్రః" (మహా. అను ౧౩) ఇత్యాది బహుశ్రుతివిరోధాత్ బౌద్ధాదివద్వేదబాహ్యమత ప్రవేశః స్యాత్ ।

జడాజడయోరేకత్వాసంభవాత్ప్రపంచస్యాధ్యాసికత్వేన మిథ్యాత్వం సంభవతీతి యత్ తత్తుచ్ఛం । తథా హి—అన్యత్రాన్యధర్మారోపః ఖల్వధ్యాసః. తత్ర ఆత్మన్యనాత్మ ప్రపంచారోపో వా ? అనాత్మన్యాత్మారోపో వా ? నాద్యః —పూర్వదృష్టసత్యసర్పసంస్కారేణ

రజ్జుసర్పభ్రాంతి రుపపద్యతే । తద్వదాత్మవ్యతిరిక్తసత్యప్రపంచా
గీకారాత్, తదతిరిక్తప్రదేశాభావాచ్చ । న ద్వితీయః— అ
త్మన్యాత్మారోపే ఆరోపితాత్మస్వరూపస్య బ్రహ్మణోమిథ్యాత్వాపత్తే
జడత్వాదిబహుదోషప్రసక్తేశ్చ । న చ పూర్వదృష్టత్వమేవ నియా
మితి వాచ్యం। బీజాంకురన్యాయవత్పూర్వపూర్వాధ్యాసస్యోత్తరో
ధ్యాసహేతుత్వాత్ । అధ్యాసస్సంభవతి ఇతిచేత్, తర్హ్యనవస్థాప్రసం

కించ—"యత్ర యద్దృష్టం తత్ర న తస్యారోపః" ఇతి
మాత్ తద్దృష్టప్రపంచస్య తస్మిన్నారోపః కథ ముపపద్యతే?
సర్పత్వారోపాసంభవాదనుపపత్తిర్దుర్వారా । అపి చ బ్రహ్మ
యోరనాదిత్వే-"యతో వా ఇమాని భూతాని జాయంతే" (తై.భృ
౧) ఇత్యాదిబహుశ్రుతివిరోధాత్ కార్యకారణత్వప్రయుక్తపౌ
పర్యనియమప్రతిపాదకయుక్తిభంగప్రసంగశ్చ । దృశ్యత్వేన ప్రపం
మిథ్యాత్వాంగీకారే బ్రహ్మణోఽపి మిథ్యాత్వాపత్తిః, దృశ్యత్వా
షాత్ । దృశ్యత్వానంగీకారాన్నోక్తదోష ఇతిచేత్ —
బ్రహ్మానుభూతిర్న స్యాత్ । కించ "అస్మత్ప్రత్యయవిషయత్వాదప
త్వాచ్చ।ప్రత్యగాత్మప్రసిద్ధేః"ఇత్యుక్తివిరోధాత్ నాహంప్రత్యయవిష
బ్రహ్మ,ఇతిచేన్న. జీవబ్రహ్మణోః భేదానంగీకారాత్। "కశ్చిద్ధీరః
గాత్మానమైక్షత్" (కఠ ౨-౧-౧) "తరతి శోకమాత్మవిత్" (
౭-౧-౩) "ఆత్మా వా అరే ద్రష్టవ్యః" (బృహ ౪-౪-౫) "దృశ్య
త్వగ్ర్యయా బుద్ధ్యా" (కఠ ౧-౩-౧౨) "పశ్య మే యోగమైశ్వర
(గీతా ౯ - ౫) "శివాత్మకమిదం సర్వం సదాపశ్యంతి సూరయ
ఇత్యాది శ్రుతిస్మృతిపురాణవచనై ర్బ్రహ్మదృశ్యత్వప్రతిపాదనా
బ్రహ్మణో వ్యావహారికదృశ్యత్వాంగీకారే నిరధిష్ఠానభ్రమప్రస
తస్మాన్నాధ్యాసోఽంగీకరణీయః.

నను- "మాయాభాసేన జీవేశౌ కరోతి" ఇతి కల్పిత

జగతో మిథ్యాత్వమంగీక్రియతే ఇతిచేన్న। "జ్ఞాజ్ఞౌ ద్వావజావీశనీశౌ" (శ్వే ౧-౯) "మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః"(గీతా౧౫-౭) ఇత్యాదిశ్రుతిస్మృతివిరోధ ప్రసంగాత్, అచేతనస్య ప్రధానస్య చేతన జీవేశ్వర కర్తృత్వాసంభవాచ్చ. "అంతవత్త్వమసర్వజ్ఞతా వా" (బ్ర. సూ. ౨-౨-౪౧) ఇతి సూత్రవిరోధః, కృతనాశాకృతాభ్యాగమ ప్రసంగశ్చ.

పరమేశ్వరసత్తావశాత్ప్రధానస్య జగత్కారణత్వ మితిచేన్న - ఈక్షత్యధికరణే "తదైక్షత" (ఛాం. ౬-౨-3) ఇత్యాదిశ్రుతి ప్రామాణ్యమంగీకృత్య వేదబాహ్యత్వేన ప్రధానజగత్కారణత్వ మతస్య నిరాకృతత్వాత్.

కించ —మిథ్యాత్వంనామ —అసత్త్వం? అనిర్వచనీయత్వం? బాధ్యత్వంవా? నాద్యః —వేదాప్రామాణ్యప్రసంగాత్ । న ద్వితీయః—మానిత్వాపత్తేః। న తృతీయః - కిమిదం బాధ్యత్వం? త్రైకాలిక నిషేధప్రతియోగిత్వం? జ్ఞాననివర్త్యత్వం వా? నాద్యః— ప్రపంచస్య విద్యమానత్వాత్, అర్థసిద్ధిక్రియాసిద్ధిసత్త్వాచ్చ। అనాదిత్వాన్న పూర్వ కాలనిషేధః, అనుభుజ్యమానత్వాన్న వర్తమానకాలనిషేధః, సంకోచ రూపేణ వేదరాశేః ప్రలయేఽపి పరమేశ్వరే సత్త్వాన్న భవిష్యత్కాల నిషేధః । న ద్వితీయః — జ్ఞానినాం పూర్వవత్ప్రపంచస్య భాసమానత్వాత్, తేషాం క్షుత్పిపాసాదికస్య దృష్టత్వాచ్చ.

న చ — దగ్ధపటన్యాయేన జీవన్ముక్తస్య దేహేంద్రియాది భేదజ్ఞానసంబంధ ఇతివాచ్యం। మరుమరీచికాదా భ్రాంతినాశేఽపి జల త్వేన ప్రతీయమానత్వమివప్రకృతే న వక్తుం శక్యం యథా దగ్ధపటోఽపి పటవద్భాసతే శీతనివారకత్వాదిక్రియాసిద్ధ్యభావాత్, లోకే మరుమరీచికా జలవద్భాసతే పిపాసాశాంత్యాది ధర్మాణా మయోగ్య త్వాత్, తద్వజ్జీవన్ముక్తానాం భేదజ్ఞానసత్త్వేఽపి శరీరకంపనక్షుత్పిపాసాద

కం న సంబధ్యేత। లోకే దండనాశేఽపి తజ్జన్య భ్రమణవదవిద్యా
శేఽపి తత్కార్యప్రారబ్ధశరీరాదేర్భోగైకనాశ్యత్వమితిచేన్న, తే
పటాదివదవిద్యాయా ఉపాదానకారణత్వాత్, తస్మాత్తథా న యు
తథాదూర్వాసీయే—

"అనాద్యవిద్యయా బద్ధం బ్రహ్మతత్కాలకారణం।
స్వావిద్యయా సంసరతి ముక్తిః కల్పితవాక్యతః॥
ఏవం ప్రకారణం శాస్త్రం సర్వమాహాత్మ్యనాశకం।
ఉపేక్ష్యం శివభక్తైస్తు శ్రుతిస్మృతివిరోధతః॥
ఫలనాశాదిదం తస్య ఫలం వై ముఖ్యతస్తమః।
జ్ఞాననాశ్యత్వసిద్ధ్యర్థం తదేవ హి నిరూపితం॥
తదన్యథైవ సంసిద్ధం విద్యాఽవిద్యానిరూపణైః॥
తన్మాయికత్వకథనం పురాణేషు ప్రదృశ్యతే।
తథేంద్రజాలపక్షేఽపి మతాంతరమిదం ధ్రువం॥
నాస్తి శ్రుతిషు తద్వార్తా దృశ్యమానాసు కుత్రచిత్।
వాచారంభణవాక్యాని తదనన్యత్వబోధనాత్।
నమిథ్యాత్వాయ కల్పంతే శివోపాదానకారణాత్॥
జ్ఞానార్థమర్థవాదశ్చేజ్జగత్సృష్ట్యాదికారిణి।
శక్తేరనంగీకరణాద్విధిమాహాత్మ్యయోర్న తత్।
అపవాదార్థమేవైతదారోపో వస్తుతో నహి
దృఢప్రతీతి సిద్ధ్యర్థమితిచేత్తన్న యుజ్యతే।
ముఖ్యార్థబాధకం నాస్తి కార్యదర్శనతశ్శ్రుతేః।
ఇంద్రజాలికపక్షేపి తత్కర్తృత్వం తదీరితం॥
మాయాదీనాం చ కర్తృత్వం శ్రుతిసూత్రైర్నబోధ్యతే।
అకర్తృత్వం చ యత్తస్య మాహాత్మ్యజ్ఞాపనాయ వై।




సచిత్ర మాసపత్రిక

| | | |
|---|---|---|
| పుండ్రిము ౨ Vol. 2 | శా. శా. ౧౮౬౨, విక్రమ సంవత్సర వైశాఖమాసము 22 మే 1940 సికింద్రాబాద్, | రేఖ ౩ No. 3 |

# మాలకరి

## శ్రీ శేషాద్రి రమణకవులు

"తొలుకరివానమబ్బు తఱితో నుఱిమెన్ వనమెల్ల సాంద్రపం
కిలమయిపోయె నెండజిగి క్రేవ పయోధర పంక్తినుండి క్రొం
జెలువముతోడ వెల్వడి కృశించిన తీవవెలంది మేనిపైఁ
దలతలలాడు వాఃకణ వితానముతో నొనరించె వియ్యమున్." 1

"తోఁటమాలి నేలదున్ని పూఁదోఁటను, జక్కపఱచుచున్న సమయమందు
వచ్చి రానివేళ్ళ వల్లిక నొకదాని, నాటితిని గృహాంగణంబునంద." 2

"పోసిరి నీరు నా సుతులు ప్రీతిక నిత్యము కొన్నినాళ్ళకున్
వేసెఁ జివుళ్ళు మొగ్గలొదవెన్ దరుణారుణ కాంతితోడనే
గోసియెఱుంగ నెన్నఁడును గుత్సల మొక్కటియేని యింతలో
వాసన పిక్కటిల్లఁ బ్రసవంబులు గూర్చెను దీవె కందముల్. 3

"అల్ల శకుంతల ప్రియమండనార్థ మెపుడు, చిదిమియెఱుఁగదు వనములో జివురుటాకు
వలదు కోయకుఁ జివురేని వన్నెతఱుఁగుఁ దీవెకని పుత్రితో నేనుదెల్పుచుందు." 4

"మునుపార దేవదారు కుజమున్ బ్రియమారఁగఁ బెంచెఁ గౌరి దా
నిని బశు వొక్కనాఁడొఱసి నిగ్గులఁగూర్చెడి త్వక్కురాల్ప లో

చన యుగ ముబ్బఁగాఁ గొమరుసామిని రక్కసులేయ నెట్టు లే
డ్చెనొ యటులేడ్చె గౌరి యనిజెప్పితిఁ బూవులుగోయు పుత్రుతోన్." 5
"తరులపయి నున్న పూవుల దైవమునకు, మనసుతో నర్పణ మొనర్చుకొనిన బుద్ధ
దేవుఁ గారుణ్య చిత్తవృత్తిని వచించి, విరులఁ గోసెడి సతిని మాన్పించినాఁడ." 6
సీ॥ అరవిచ్చు పూవుల పరిమళంబును వింత, చెలువంబుఁగాంచ నచ్చెరువు గలుగు
పత్రపుటంబు లుబ్బగఁ బూఁత నీరొల్మియు, పూగుత్తు లెదకు నద్భుతముగూర్చు
పూర్తిగావిచ్చు నవ్వుమొగంబు సిరిగేరు, ముదురుపూలెద మోదమునుఘటించు
పద్మరాగములలోఁ బచ్చలవలెనున్న, గుచ్ఛముల్ మదికి మక్కువలు నించు
తలిరుదీవియ సుకవి గ్రంథంబుఁబోలె, ముగ్ధశాబకు ముద్దు నెమ్మోముబోలె
పూజ్యమతియౌ పతివ్రత ముఖముబోలె భావమున నిర్భరానంద పరతఁగూర్చు.
"శలికాఁ డొక్కఁడు నన్నుం బిలుచుచు ముంగిటికి వచ్చి విచ్చిన పూవుల్
తలిరులు గుత్తులములు చేఁ గొలదిగ లతవంచి కోసి గుచ్ఛము లల్లెన్. 8
"పాదు తొలంగెఁ దీవె, ప్రసంబులు రాలె, వృథావలోక నో
న్మాది యతండు కల్పిత సుమ స్తబకాంకిత హస్తయుగ్ముఁడై
నాఁడట నన్నుఁ గన్గొనియె నాతనిచేతకు మందలింపఁగా
రాదె! దురంత కర్మ మనరాదె! యుపేక్ష యొనర్పవచ్చునే" 9
"విచ్చిన పూవులున్ సగము విచ్చిన పూవులు లేఁత మొగ్గలున్
విచ్చియు విచ్చనట్లు గనిపించెడి పూవులు గోయ చే యెటుల్
వచ్చినదోయి నీకుఁ బ్రసవంబులపై మమకార మున్నచో
నిచ్చటఁ దీర్చికోవలయునే మఱి వేఱొక చోటు లేదొకో" 10
"పరుని గృహంబులోని ప్రసవంబుల నంటులె తప్పు ప్రేమతో
నరయు రసప్రలుబ్ధ హృదయాంబుజు గాదిలితీవె కిట్టి దు
స్తర దురవస్థ గూర్చిన తప్పు క్షమింపఁగ రానిదంచు నీ
వెఱుఁగవె యంచు మాలకరికే వినిపించితిఁ గొన్ని పద్యముల్" 11
"వెన్నెలవెల్గుతీవె కొదవించు వికాసము, మంచువాన పూఁ
గన్నియ నేద దేర్చు నొడికంపుటొయారము, మందవాతముల్
గ్రొన్ననలన్ గదల్చు తెఱఁగుల్ దిలకింపఁగ నెండెగాదు వే
గన్నులు చాలవేల లతికా సుభగత్వము రూపు మాపెదో" 12
కవియును జిత్రకారుఁడును గావ్యరసాశ్రయజీవి, సృష్టి నై
భవములఁజూచి మెత్తురెద భావవిమాన విహారు, తోట యు

త్సవకరమైన వస్తుసమదాయము మెంతయు జన్మభూమిలోఁ
జవులు వెలార్చు, స్వార్థపరు సంగతిచేఁ జెడుఁ దద్విలాసముల్. 13
అడవిలో నున్నయప్పుడ గోచరించును, సారంగముల విలాసప్రవృత్తి
చివురుదొప్పలలోన నవతరించిన యంతేఁ దనరు తుషారముక్తాఫలములు
తొలకరి నీటిదాల్పుల చెంతనే చూచి, తీరగావలె మించు దీవెహాయలు
జలపూర్ణకాసారములలోన నేలోచ నోత్సవంబిడును నీలోత్పలములు
తరులతాజీవనము సుధార్ద్రింబొనర్చు, మధురమధుయామినులనె సుమప్రతాన
సుస్వరూపంబు పల్లవస్తోమచుండ, కానఁబడు నీ రహస్యంబు కవిమెఱుంగు. 14
"చేతులతీటకై లతిక చెల్వము బాప దలంతువేని యే
ప్రేతవనంబునందొ కసిపించు లతల్ తెగటార్పఁబొమ్ము నీ
చేతకు నడ్డురారు కవిశేఖర దివ్యకవిత్వజీవన
జ్యోతిని నార్పఁబోకు మిది యొక్కరసాశ్రియ జీవిధర్మముల్." 15
"చెలువ మెఱుంగు కైశ్యమునఁ జేర్పఁగ దేవికిఁ బూజసేయఁగా
వలసిన యన్నిపూల్ దొఱుకవా వెలయీయ బజారులోన నీ
తలఁపున కిద్ది యర్హమగు స్థానముగాదు సకామభక్తికిం
గలుగదు సత్కవీశ్వరుని కావ్యవనంబునఁ దావులోభికిన్." 16
"హరిణతరుణిని, గవి, ఋషీశ్వరుఁడు, వేఁట
కాఁడు సింగంబుగాంచు దృగ్గతులు వేఱు
తలిరుదీవియకడ భిన్నదర్శనులము
మనము ముందేని యీ చేతమాను కొమ్మ." 17
"మాలకరి చిత్తమునఁ గొంతమార్పుగలిగె
నాదు బోధంబుఁ జెవిచేర్చునాఁటనుండి
ఏటికో నేనెఱుఁగ మఱునాఁటినుండి
యేను వగఁజెంద క్రమముగానెండె లతిక." 18
ఊఱకసాకుఁబూల యుపయోగ మెఱుంగడు సత్కవీంద్రు శృం
గార రహస్య మిట్టిదని కావ్యరసగ్రహణైకదూరులౌ
తారు వచించిరన్ దెనఁగుతల్లి యెఱుంగదె నా స్వభావమీ
నేరము మోపు మాలకరి నిన్ను క్షమించుట నాకుఁ గష్టమే. 19

# నన్నిచోడ కుమారసంభవకాలము

## శ్రీ దేవరపల్లి వేంకట కృష్ణారెడ్డిగారు.

తేంకణాదిత్య కవిరాజు తన జాను తెనుఁగు కుమారసంభవ ప్రబంధావతారికలో:

"—దైవజ్ఞ నల్లు (నేనును) శుభోదయమున దివ్యసుకృతిఁ బ్రతిష్ఠింతు" నని ప్రతిజ్ఞ చేయుటయే కాక, తద్దృష్టాంతములతో కుమారసంభవ రచనాకాలమును "అలంకార - గూఢ (ము)" గా ప్రతిష్ఠించి, ప్రతిజ్ఞాపాలనము గావించి యున్నాడని నే నీ వ్యాసములో సహేతుకముగా నిరూపింప దలచినాను.

### దైవజ్ఞ శుభోదయకాలము

షణ్ముఖ—తారక యుద్ధవర్ణనలో :

"—విస్ఫురదవదాత ఖడ్గలత పూఁచెనొ నా జయచైత్రసంపదన్". (ఉత్ప్రేక్ష)

"—ప్రశస్త శాసనలిఖితాక్షరంబు లయ్యె" నని నా పరిశోధన చెప్పుచున్నది. ఇది "అలంకారము గూఢవస్తుమయ కావ్యముగా—చెప్పి" నందు కుదాహరణమని తోఁచకపోదు.

౧. "—జయచైత్రసంపదన్ విస్ఫురదవదాత ఖడ్గలతపూఁచెనొ నా" అనునది సులభాన్వయము. ౨. "విస్ఫురత్—జయచైత్రసంపదన్ అవదాత ఖడ్గలత పూఁచెనొ నా" అనునది దూరాన్వయము.

ఈ యన్వయ విభాగమందలి సందేహ మేమనగా: మొదటి సులభాన్వయ ప్రకారము—"జయసంవత్సర చైత్రసంపద"ను మన ముపయోగించుకొనవలెనా! లేక, రెండవ దూరాన్వయప్రకారము-- "వి-యుపసర్గాక్షరముతో (స్ఫురించుచున్న) ప్రకాశించుచున్న జయసంవత్సర చైత్రసంపద"ను మన ముపయోగించుకొనవలెనా! అని జిజ్ఞాస కలుగుచున్నది. కాని, ముస్ముందు నిరూపింపబోయే దైవజ్ఞకవి విక్రమశకవర్షంబులు దూరాన్వయ మయి నప్పటికిని, రెండవదగు "వి - (స్ఫురించుచున్న) జయసంవత్సర చైత్రసంపద"కు చక్కఁగా సరిపోవుచున్నవి. అనగా- "విజయ సంవత్సర చైత్రసంపద" కొక్క శకవర్ష వ్యత్యాసముకూడ లేని, విక్రమశకవర్షంబులు నన్నిచోడ కుమారసంభవములో కలవని సారాంశము. కనుక సులభాన్వయమయినప్పటికిని, మొదటిదగు "జయసంవత్సర చైత్రసంపద"ను స్థూలదృష్టితో గ్రహింపకూడదు.

ఇంతకీ దూరాన్వయపద్ధతి క్రీ. శ, ౧౧-వ శతాబ్దమునాటినుండి మన మాతృ భాషలో శ్రీకృష్ణ దేవరాయాది కవితాప్రవీణుల కాలమువరకు వ్యాప్తిలోనున్నట్లు చెప్పక తప్పదు. ఇది దైవజ్ఞగణిత దూరాన్వయ మని మరచిపోకూడదు.

ఇక, నీ "విస్ఫురత్ —జయచైత్రసంపద" లో: (౧) "విస్ఫురత్ జయ—" వి (-స్ఫురించుచున్న) జయ (విజయ) సంవత్సరమును: (౨) "చైత్ర—చైత్ర మాసమును: (౩) "(అవదాత—అవదాత (శుద్ధ) పక్షమును): (౪) "జయ— జయ తిథి యును: (౫) "జయ—జయ వారమును: "గూఢ వస్తుమయ (ములు)" గా నిమిడియున్నవి.

ఇందలి "అవదాత ఖడ్గలత పూచెనో నా," అనే యుత్ప్రేక్షాలంకారము శ్లేషార్థద్యోతకముగా శరవణభవుని జన్మప్రకారమును సూచించుచున్నదని నాకు తోచుచున్నది. వైద్యనిఘంటువులలో "ఖడ్గలత"కు—బృహత్కాశము (పెద్దరెల్లు) అని వృక్షపర్యాయార్థము కలదు. "శరవణభవు"ని కనగా "కుమారస్వామి"కి "రెల్లు చూలి" యని రూఢ్యర్థము కలదు. కాబట్టి "తెల్లరెల్లనెడి స్త్రీ రెల్లుచూలిని ప్రసవించెనో యన్నట్లు తెల్లరెల్లుపూతను పూచె" నని గూఢార్థము.

ఏది యెట్లయినను, "విజయ సంవత్సర, చైత్ర, శుద్ధ, జయతిథి, జయవార శుభోదయమున దివ్యసుకృతిని ప్రతిష్ఠిం(చె)"నని మనము గుర్తింపవచ్చును.

ఇది "తారకవి"యం దెల్లునగు "కవితా విశేషము" కాదేమో? "బరసి చూచి" చెప్పుడు.

దైవజ్ఞ శకవర్ష కాలము

ఇంత కీ "వి (స్ఫురత్) జయ చైత్ర సంపద"కు సరియగు విక్రమశకవర్షంబు లయ్యుదయగిరి శిలాపట్టములో. ప్రశస్తశాసన లిఖితాక్షరంబు లయ్యె"నని దైవజ్ఞ గణితము చెప్పక చెప్పుచున్నది.

షణ్ముఖ—త్రినయనాలింగన వర్ణనలో:

"ఉదయదశ శతకిరణుఁ డయ్యుదయనగముఁ గిట్టి దశశతకరములఁ జుట్టినట్లు.

(ఉపమానము)

"—ప్రశస్త శాసనలిఖితాక్షరంబు లయ్యె" నని పరిశోధనాఫలితము చెప్పు చున్నది. ఇది "అలంకారము గూఢ వస్తుమయ కావ్యముగా—చెప్పి"నందు కుదా హరణము.

ఇందలి శ్లేషచరిత్రను ముచ్చుందు పరిశీలింతము. "ఉదయకిరణుఁ డయ్యుద యనగముఁ గిట్టి నిజకరములఁ జుట్టినట్లు ఉదయ (తేంకణ) ఆదిత్యు డయ్యుదయగిరిని

సమీపించి నిజకరముల ముట్టడించెను.'' అని శ్లేషచరిత్రి చెప్పుచున్నది. "అయ్యుదయగిరి—పాకనాటియం దిరువదియొక్క వేయిటికి'' రాజధాని యని గూఢపన్నమయకావ్య సంఖ్యాచరితము చెప్పుచున్నది. కాని దీని నిక్కడ వివరింప నవకాశము లేదు. ఏది యెట్లయినను, అయ్యుదయగిరి పాకనాటి కధీశుండు నాఁజను తేంకణాదిత్య నన్నిచోడకవివంశీయునికి (అయిదవతరము మనుమనికి) "కందుకూరిపురవరేశ్వర—పాకనాఁటి విషయ ఏకవిశంతి సహస్రి (౨౧౦౦౦) గ్రామావనీవల్లభ" బిరుదు లున్నట్లు పెద్ద చెఱుకూరు శాసనప్రమాణము చెప్పుచున్నదని మరచి పోకూడదు.

మరియు, తేంకణాదిత్యకవి తన గురువగు జంగమ మల్లికార్జునముని - నివాసస్థానము "శ్రీనగ" మనగా పాకనాటికి పడమటి సరిహద్దున తగిన "శ్రీశైలపర్వత" మని శ్లేషార్థచరిత్రిను సూచించియున్నాడని కూడ మరచిపోకూడదు.

ఇంతకు, అ య్యుదయగిరి శిలాపట్టణములో :

(౧) "దశ శత'' మనగా :

| | |
|---|---|
| "దశోత్తరశత'' మని శ్లేష | ౧౧౦ |
| "దశ శత" మని సహజము | ౧౦౦౦ |
| | ౧౧౧౦ |

విక్రమశకము "దశ+శత+దశశత (౧౧౧౦) వర్షంబులు ప్రశస్తశాసన లిఖితాక్షరంబు లయ్యె"నని "వి (స్ఫురత్) జయచైత్రసంపద" చెప్పక చెప్పుచున్నది. పైగా, ఇవి "జయచైత్రిసంపద''లో ప్రశస్త శాసనలిఖితాక్షరంబు లయ్యె" నని సమన్వయింప నవకాశ మున్నదా ? అని పరిశోధింపగా, "దశ + శత + దశశత (౧౧౧౦)'' విక్రమశకవర్ష సంఖ్యలలో ఒక సంవత్సర సంఖ్యాలోపము కాన్పించుచున్నది. కాబట్టి వెనుక దైవజ్ఞ శుభోదయ కాలములో వివరించిన ప్రకారము, దూరాన్వయ మయినప్పటికినిఁ "విస్ఫురత్ —జయచైత్రి సంపదర్క విజయ సంవత్సర చైత్రిసంపదన్'' అయ్యుదయగిరి విక్రమశకము "దశ + శత+దశశత (౧౧౧౦) కర వర్షంబులు ప్రశస్తశాసన లిఖితాక్షరంబులయ్యె" నని "దైవజ్ఞునట్లై'' మనము సిద్ధాంతము చేయక తప్పదు.

మరియు, "విస్ఫురత్ —జయచైత్రి సంపదర్క ఖడ్గలత (అయ్యుదయగిరివిక్రమ విజయమును) పూచెనో నా ఖడ్గలత (విశాఖుని—తెల్లుచూలిని) పూచె"నని గూఢాన్వయము చెప్పుచున్నది. ఇంత కిది "శుభోదయమున ప్రతిష్ఠింతు (ననిన) దివ్యసుకృతి'' కాదేమో ? "దైవజ్ఞునట్లే" సిద్ధాంతీకరింపుడు.

| కుమారసంభవ పాకనాటి చోడవంశము | నన్నూరు శాసన పాకనాటి చోడ వంశము | | చారిత్రిక వ్యక్తి సమనామములు | పెద్దచెరుకూరు శాసన పాకనాటి చోడ వంశము | నన్నూరు-పెదచెరుకూరు శాసనద్వయ పాకనాటి చోడవంశభేదము | చారిత్రక స్పష్ట కాలము | పురుషాంతర కాలము.(సుమారు) |
|---|---|---|---|---|---|---|---|
| మూలము | మూలము | సవరణ | సాదృశ్యము | మూలము | సమన్వయము | క్రీస్తుశకము | క్రీస్తుశకము |
| సూర్యవంశము | సూర్యవంశము | సూర్యవంశము | సూర్య — సూర్య | సూర్యాన్వయము | సూర్యాన్వయము | | |
| | చాగివెంకన | చాగివెంకన | | | చాగి వెంకన | | ౯౩౮ — ౯౬౮ |
| | బల్లెరాజు | కంటుప్రి వంకెరాజు | | | క(ం)టువంకెరాజు | | ౯౬౮ — ౯౯౮ |
| | (?) | (చోడ) | | | + | | + |
| చోడబల్లి | కంట్యవంక్యరాజు | బల్లెరాజు | బల్లె — బల్లి | చోడబల్లి నృపుడు | చోడబల్లిరాజు | | ౯౯౮ — ౧౦౨౮ |
| నన్నెచోడుడు | నన్నిచోడ | నన్నిచోడడు | నన్నె — నన్ని | నన్నిచోడడు | నన్నిచోడ (కవి) రాజు | ౧౦౫౩ — ౧౦౫౪ | ౧౦౨౮ — ౧౦౫౮ |
| | సూరపరాజు | సూరపరాజు | సూర — సూర | సూర భూపుడు | సూరపరాజు | | ౧౦౫౮ — ౧౦౮౮ |
| | రాజమహేంద్రిపా (తె) పిచోడు శక. ౧౦౧౦ - వర్షంబులు | (రాజ) రాజమహేంద్రుడు— (క్రీ. శ. ౧౦౮౮ ౧౦౮౯) | రాజ — రాజ పాత్తప్పి(పాకనాటి) చోడ వంశీకులు | రాజరాజమహీపతి | రాజరాజపాతపి చోడుడు | ౧౦౮౮ — ౧౦౮౯ | ౧౦౮౮ — ౧౧౧౮ |
| | | | | ఘటంకారనృపుడు | ఘటంకారరాజు | | —— ౧౧౧౯ |
| | | | | మల్లి దేవనృపుడు | మల్లిదేవరాజు | | ౧౧౧౯ — ౧౧౪౯ |
| | | | | నన్నిచోడడు | నన్నిచోడుడు | | ౧౧౪౯ — ౧౧౭౯ |
| | | | | మల్లిదేవ మహీపతి | మల్లి దేవచోడుడు | | ౧౧౭౯ — ౧౨౦౯ |
| | | | | కాకతియ్యగణపతి | కాకతీయగణపతి | ౧౧౯౯ — ౧౨౬౧ | ౧౨౦౯ — ౧౨౧౦ |

## గూఢకావ్య రచనాకాలము

అయ్యుదయగిరి పాకనాటి కధిపతి నాఁజను తేంకణాదిత్యకవిరాజు "దైవజ్ఞనల్లె" అయ్యుదయనగ ఖడ్గలత పూఁచిన విక్రిమశకము "దశశత—దశశతకరముల (వార్షికముల)" మీాద "విస్ఫురత్ — జయచైత్రిసంపద"ను కలిపి లెక్కించి, విక్రమశకము ౧౧౧౦ ("దశ+శత+దశశత") వర్షంబులగు నేటి విజయ సంవత్సర నిజ చైత్రిశుద్ధ జయాష్టమి జయవార ("విస్ఫురజ్జయ చైత్రినంద") శుభోదయమున ఖడ్గలత పూచిన త్రెల్లుచూలి దివ్యసుకృతిని ప్రితిష్ఠింతు" నని చెపినట్లే "ప్రితిష్ఠిం(చే)" నని మన మంగీకరింపక తప్పదు.

ఇంతకూ విక్రిమశకము ౧౧౧౦ ("దశ + శత + దశశత") వర్షఁబులగు నేటి విస్ఫురజ్జయ చైత్రిసంపదకు సరియగు నేటి క్రీస్తుశకము ౧౦౫౩ సంవత్సరము మార్చి నెల ౩౦ తేది మంగళవార శుభోదయమున కుమార సంభవ దివ్యసుకృతిని ప్రితిష్ఠించి(తి)"నని "దైవజ్ఞనల్లే" తేంకణాదిత్య కవిరాజ శిఖామణి చెప్పుచున్నాడు.

ఇంతేకాక తేంకణాదిత్యకవిరాజు దైవజ్ఞనల్లే అన్యతారక వితతుల నాదరించి-శుభోదయమున—కృతిఁ బ్రితిష్ఠింతు" నన్నట్లే, "అన్య జయాష్టమీా జయవార పుష్యమీా తార కవితతుల నాదరించి—శుభోదయమున—కృతిఁ బ్రితిష్ఠిం(చె)" ననికూడ మన మంగీకరింపక తప్పదు.

కనుకనే, తేంకణాదిత్యకవి తన ప్రిబంధపీఠికలో పాఠకసంస్తుతిమిషతో:

"గుఱు తెఱఁగి (అంధ) వస్తుచయమున క్రాఁగెడు నా దీపవర్తియును బోలె నిజ
మ్మెఱిగి కృత (గూఢ) వస్తుసమితికి వఱలఁగ మది నెఱుఁగు విబుధవర్గము దలతున్.
"అది యెట్లనిన
"అన్యతారక వితతుల నాదరిం (తుఁ.)"

అని తన గూఢ కవితాలక్షణమును వివరించియున్నాడని మనము మఱచి పోకూడదు.

ఇంతకీ నన్నిచోడకుమారసంభవ మనే గూఢవస్తుమయ కావ్యరచనాకాలమును, క్రీ. శ. ౧౦౫౩ "వి (-స్ఫురత్) జయచైత్రి సంపద"ను అన్యశాసన చోడవంశపురుషాంతరకాలము బలపరచు చున్నదని పైని శాసనకాలపట్టిక చెప్పుచున్నది.

ఇంతకీ శిలాశాసన చోడవంశ సాదృశ్యపుపట్టిక ప్రికారము— జాను తెనుఁగు కుమారసంభవ చోడబల్లి వంశమందలి "కవిరాజశిఖామణి—నన్నెచోడః" నికిని-పెద్దచెరుకూరు శాసన చోడబల్లి వంశమందలి "చోడబల్లి నృపస్తస్మాన్నన్ని చోడః" అనే నన్నిచోడునికిని వ్యక్తిభేదముగాని, వంశభేదముగాని, క్రీ. శ. ౧౧వ శతాబ్ది కాలభేదముగాని లేదని సూక్ష్మదృష్టికి గోచరము కాకపోదు.

ఇట్లే అయ్యుదయగిరి పాకనాటియం దిరువదియొక్క వేయిటి కధీశులు నాఁజను

కుమారసంభవ చోడవంశమునకును—కంద్ధుకూరి పురవరేశ్వర, పాకనాంటి విషయ ఏకవింశతి సహస్ర ("పాకనాటియం దిరువదియొక్క-వేయి") గ్రామావనీవల్లభు(లు)" నాజను పెద్దచెరుకూరు శాసన చోడవంశమునకును మూలపురుష భేదము లేదు.

మఱియొక విశేష మేమనగా పట్టికయందలి నన్నూరుశాసన చోడవంశములో సంకేతముగా "పా(త్ర)పిచోడు" వంశప్రస్తావముగల బిరుదు సూచింపబడియున్నది. దీనికి "పొత్తపియ చెన్నగువీఞుగవాలిపాకనాం డిరువదియొక్క-వేయిం జననేలుచు(న్న) పొత్తపి చోడవంశ శేఖరుం డినవంశకర్త" అనే కోణిదెన శాసనబిరుదు సమానార్థకముగా నున్నది. పైగా; దానకాలములేని నన్నూరుశాసన చోడవంశములో; "నన్నూరి హాోంకార దేవికి—సూర్యవంశులకుం ధర్మముగా(ం) ఒకనాంటి ప్రతిష్టగా(ం) నిల్పినది." అని కలదు. కాబట్టి; పట్టికయందలి నన్నూరుశాసనచోడ వంశముకంటె పెద్దచెరుకూరుశాసన చోడవంశము భిన్న మయినది కాదని శాసన ద్వయసాదృశ్యము చెప్పుచున్నది.

ముగింపు

ఇంతకీ ౩౦-౩-౧౧౫౩ తేదీ జాను తెనుగు కుమారసంభవ "కావ్యకర్త" తేంకణాదిత్య నన్నిచోడునికిని—౨౮-౧౧-౧౧౫౩ తేదీ నందమపూండిశాసన "కావ్యకర్త" నన్నియభట్టునకును మధ్య యెనిమిదిమాసముల కంటె కాలవ్యవధి లేదు. కాన, వీరిద్దరును "ఆంధ్రభాషాంగన దక్క-నేలిన మహత్త్వము లోకమునం బ్రసిద్ధిగా" కుమారసంభవ ప్రబంధమును, భారతపర్వత్రయమును రచించి కావ్యకర్తలయినా రని మన మంగీకరింపక తప్పదు.

మరియు, నన్నిచోడకవి వ్యావహారిక ప్రయోగములను నన్నియభట్టు సంస్కరించినందువల్లనే శబ్దశాసనబిరుదాంకితు డైనాడని కూడ చెప్పవచ్చునని నాకు తోచుచున్నది. నేడు మనము చేయవలసిన కృషి యేమనగా, నన్నిచోడ కుమారసంభవమును — నన్నియభట్టు చాముండికా విలాసమును సత్యదృష్టితో పరిశీలించినగాని, నన్నియభట్టు భారత పర్వత్రియ విశిష్టత మనకు గోచరించదని మనవి చేయుచున్నాను.

ఇంతకూ, క్రీ. శ. ౧౧-వ శతాబ్దము ౧౦౫౩ సంవత్సర ప్రాంతమందలి ఆది కావ్యద్వయ మన తగిన నన్నిచోడ కుమారసంభవమును, నన్నియభట్టు చాముండి కావిలాసమును మన కిప్పుడు పునర్ముద్రితములయి లభించుట లేదని చెప్పక తప్పదు.*

(భారతినుండి)

* శ్రీ వేంకటకృష్ణారెడ్డిగారు మిక్కిలి పరిశ్రమతో నీవ్యాసమును ప్రకటించినారు. ఈ యద్భుతమ్ములను విద్వాంసులు నిష్పక్షపాతముగ విమర్శించి సత్యమును నిర్ణయించుట పరమావశ్యకము.

సంపాదకుడు—విభూతి.

# చాటూక్తిముక్తావళి

శ్రీ బండారు తమ్మయ్యగారు

గీ॥ నాకుఁగలరు తల్లియుఁ దండ్రి ♦ మీకుఁగలరె
యనుచు వచియింప నుమ పరి♦హాసమునకు
నాకుఁ గల రత్తయును మామ ♦ నీకుఁ గలరె
చెప్పుమని నవ్వు శివుఁడు ర♦క్షించుమిమ్ము. ౧

చ॥ కనుఁగొనఁ దాను స్థాణుఁ డది ♦ గాకయు మూలవిహీనుఁ డారయన్
వనిత యపర్ణ యాత్మజుఁడు ♦ భావన సేయ విశాఖుఁ డైనఁ దా
ననయముఁ దన్నుఁ బూవులను ♦ నర్చన సేయ ఫలంబు లెన్నియో
ఘనముగ నిచ్చునంట మఱి ♦ కంచుమె యెందును నిట్టి చిత్రముల్. ౨

క॥ తనుజూడఁ బంచవదనుఁడు; తనయులు కరివదనషడ్వ♦దనులఁట, మఱి తాఁ
గనఁగ దిగంబరుఁ డెట్లిలు; చను శివునకు నన్నపూర్ణ ♦ సతిగాకున్నన్. ౩

మ॥ అరె హేరంబ! యదేల యేడ్చెదవా! యమ్మా! నా చెవుల్వట్టె మ
ష్కరతన్ నుల్మెను షణ్ముఖుండు; గుహా! దు♦ష్కర్ముండవై తేల ముం
దర నా కన్నుల నెన్నె వీఁడు, గణనాథా! నీవె గర్వ్యుండ వం
బరో! నా ముక్కునుగొల్చె వీఁడిటులు సం♦వాదించు పుత్రద్వయిన్
దరహాసంబున మందలించెడు నుమా♦తన్వంగి మిమ్మోమ్ముతన్. ౪

ఉ॥ ఇందుధరుండు తండ్రి, జగ♦దీశ్వరి తల్లి, గుహుండు భ్రాత, గో
విందుఁడు మేనమామ, యర♦విందభవప్రముఖామరుల్, సదా
వందిజనుల్ భటుల్, ప్రమథ♦వర్గము దేహమఖండ సచ్చిదా
నందమయంబు నీకు గణ♦నాథ! భవద్గుణకోటి నెన్నఁ బ్రో
డెందును లేఁడు జంతువుల ♦ మింకను మేము నుతింప నేర్తుమే. ౫

గీ॥ ఘోరసంసారదుఃఖ ని♦వారకంబు, మనుజులకు నెల్లఁ బరశివ స్మరణ మొకటె
అతిభయంకరమైన దా♦వాగ్ని నార్పఁ, వలఁతి తలఁప ఘనాఘన ♦ పంక్తి యొకటెఁ

గీ॥ ఏ యుపాయముచేనైన ♦ నేదియైన, బ్రాణికిని సంతసముగూర్చు ♦ పను లొనర్పఁ
బ్రాజ్ఞుఁ డెప్పుడు భువిఁ బాటు♦పడఁగవలయు, నదియ యీశ్వరపూజనం♦బనితలంచి.

గీ॥ అరయ సంసార విషభూరు♦హంబునకును, అమృతఫలములు రెండుమా♦త్ర మెతనర్చు
సరస కావ్యామృతపు రసా♦స్వాద మొకటి, జ్ఞానులగు వారితోడిసాం♦గత్య మొకటి.

గీ॥ అలుకయపకారిపై నీకు ♦ గలుగునకట ? కాని ధర్మార్థ కామమో♦క్షములనొకటఁ
గూల్చి యపకృతి సేయు నా♦కోపముపయి, నేల కలుగదో కినుక నీ కించుకయిన.

గీ॥ ఘనుల యాశ్రయమబ్బినఁ ♦ జనుఁడు తనదు, భాగ్యమును మీఱి ఫలమును♦ బడయలేఁడు
ఈశ్వరుని కంఠమును గౌఁగి♦లించియున్న, వాసుకికి గాలి మేఁతయే♦ ప్రాప్తమయ్యె.

గీ॥ ఒరుల కుపకృతి సేయఁగా♦ నొక్కయపుడు, కొలఁది జనుపోల్కిఁ జాలరు♦ గొప్పవారు
దాహశాంతికిఁ గూపమే♦ తఱుచుగాను, ఉపకరించెడుఁగాని యా♦యుదధి యౌనె.

గీ॥ అడవులను గాల్చు వేళలం♦దాప్తుఁడయిన, వాయువే యగ్నికిని గృశత్వంబు కలుగఁ
బ్రబల శత్రువై వెసను దీ♦పంబునార్చు, బళిర! నిక్కంపుస్నేహ మెవ్వానికిఁగలదు.*

(సశేషము)



*చాటు శబ్దమునకు మనోజ్ఞమని యర్థము. హృదయంగమము లగు భావములుగల పద్యములు చాటువులని వ్యవహరింపఁబడును. "జొన్నలలోనఁ జిన్నిపువు జొన్నియయట్లులు పద్దియంబులఁ మిన్నలు చాటువుల్ రససమృద్ధిననిర్వచనీయ మాధురిఁ" అనివసురాయ కవిశేఖరుఁడు. పయిశీర్షికతో నింతటి నుండి యప్పుడప్పుడు నేఁ బ్రకటించు పద్యములు చాలవఱకు ఆంగ్లగీర్వాణవాఙ్మయము లందలి మనోహర చాటు గద్యపద్యముల కనువాదములు. మఱికొన్ని నాస్వకపోల కల్పితములు. పాఠకులు వీని యందలి గుణముల గ్రహించి దోషముల మన్నింతురుగాక! బం. శ.

# ఆంధ్రవాణీ విలాపము

## ఆంధ్రవ్యాసనిపుణ, శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్యశర్మగారు,

## ద్వితీయాంకము (ఒకటవరంగము)

(ప్రదేశము : కొండవీటినగరము : రాజదర్బారు. అందు పెదకోమటి వేమారెడ్డి బంగారు సింహాసనముపైఁ గూరుచునియుండును. కాటయ వేమారెడ్డిగాఁగల రాజవంశీకులును, మంత్రులుఁగాఁ గలవారు నుచితాసనములపై నాసీనులై యుందురు.)

పెదకోమటి వేమారెడ్డి:—ఆర్యా! నేడు ప్రొద్దుపోవుటలేదు. హృదయమున కానందముఁ గలుగుట లేదు. మనసు చికాకుగా నున్నయది. అనేకరోజులక్రితము కవు లరుదెంచిరి. వారును నిప్పుడు కలలవైనటులఁ గోచరించుచున్నయది. రాజ్యాంగ వ్యవహారము లందు మనసు నెంతతిప్పినను బలవంతముగఁ ద్రిప్పినట్లే యగుచున్నది. కారణము నూహింపఁగలవా?

విన్నన్నమంత్రి:—మహారాజా! మనసు కానందముఁ గలిగించెడి వస్తువులు లేకఁగాదు. తాము పండితులును, కవులు నగుటంజేసి యెల్లప్పుడు పండితకవులతోఁ గాలమును వేఁగింప మీ హృదయము పురికొల్పుచుండును. హృదయానందమున కింపుఁ గలిగించెడి వస్తువులు భాండారమున వేనవేలుఁగలవు. చూచి, యనుభవించి యానందముఁ జెందవచ్చును. ఈ మధ్య పగతురతోఁ జరిగిన యుద్ధములో జయలక్ష్మి తమ్ము వరించినను, మన సైనికు లనేకులు మృతిజెందుటయు హృదయానందముఁ గలుగకపోవుటకుం గారణముఁగావచ్చును.

పె. కో:—మిత్రమా! సమయమునకుఁ జ్ఞప్తికిం దెచ్చితివి. ఆనాఁటి భీకర సంగ్రామమును తలంచినంతనే, నేఁటికిని గుండె లవియుచున్నవి. మన సైనికులు నమ్మినబంటులగుటంబట్టి యపజయముఁగాంచలేదు. లేనిచో యా తెలుఁగు వీరవనితల సంగ్రామభయంకర కృత్యములచే మనమెచటనుండియుందుమోగదా! ఆ పద్మావతి పురుషరూపధారిణియై, యశ్వము నధిరోహించి, కత్తిని సవ్యాపసవ్యములుగఁ ద్రిప్పుచు మన సైన్యమున విహరించునప్పుఁడు గాళికాదేవి యిట్టి రూపముఁ ధరించి వచ్చినదా యనుకొంటిని. ఆ వీరవనిత యుద్ధమాచరించునప్పుఁడు, కత్తిదెబ్బకు నసేకులశిరములుఁ దెగి బంతులట్ల యాఁడుచుండెడివి. అబ్బ! తలఁచిన ఘోరము.

ఏమఱియున్న నాపై యీ పద్మావతీ వీరలక్ష్మి ప్రయోగించిన కటారిదెబ్బ యిప్పటికిని, గాయము మానినను నొప్పి కలిగించుచునేయున్నది.

విస్స:—(చిరునగవున) ఆ గాయమింకను బాధకలిగించుచున్నదియా? అబద్ధము. ఆనందప్రదముగ నున్నదనియే యూహించుచున్నాను. మానిన గాయపుగుర్తు కంటికగుపడిన వెంటనే పద్మావతీ దేవి స్ఫురణకు వచ్చుచుండునుగదా! స్ఫురణకు వచ్చుటయేగాదు; అర్ధాంగియై సమస్తసౌఖ్యముల నొడఁగూర్చుచున్న ప్పుడింకను బాధ కలిగించుచున్నదనిన విశేష ముండకపోదు.

పె. శో:—మిత్రమా! నీ వనినటుల నంతయు నిజమునుమా! ఆ దెబ్బను తప్పించుకొని, పురుషుఁడే యను భ్రాంతితో సూటిగ హృదయముపై నేను బాణమును సంధించిన దెబ్బకుఁ దప్పించుకొనఁజాలకఁ నాథా! రక్షింపుము; రక్షింపుము, అనెడి యార్తనాదము దిక్కులు ప్రతిధ్వనించి, మదీయ హృదయకుహరమునందు ప్రవేశించి, ప్రతిధ్వనించిన ధ్వనులు నేటికిని మఱపునకు వచ్చుటలేదు. దగ్గఱకుఁ బోయి చూతునుగదా! నాథా! యని చేయి యందిచ్చినది. ఆ నాఁటి యా లేమ పాణిగ్రహణమే శాశ్వతానందముగఁ బరిణమించినది. ఆ వీరవనితను జెట్టపట్టుటకే యా యుద్ధము సంప్రాప్తమైన ట్లున్నయది. (కొంచెమాఁగి) మిత్రమా! యుద్ధమున మృతినొందినవారి వనితలకు మాసవేతనములను చక్కఁగాఁ బంపుచుంటిరా?

విస్స:—ప్రతి మాసము యుద్ధమృతులగువారి కుటుంబములకు వేతనములఁ బంపుచునే యుంటిమి. చిత్తగింపవచ్చును.—మీ యౌదార్యాది గుణములను కథలవలె నాబాల గోపాలముఁ జెప్పుకొను చున్నారు. కవులు గీతములఁ గీర్తించుచున్నారు—సభాముఖమున ననఁగూడ దేమో!—కాని,—ఆ నాఁటి యుద్ధవార్తలను, మీ మీ ప్రణయగాథలను శ్రీ మహారాజ్ఞి పద్మావతీదేవిగారు గేయరూపమున రచింపఁగఁ బుణ్యదంపతులు పారాయణ చేయుచున్నారు. ఆంధ్ర రాజ్యలక్ష్మినిఁ జెట్టపట్టి వీరపురుషసింహమువైతివి. పాపమనక నిల్లాండ్రఁ జెరవెట్టెడి పులిందాదులఁ బారఁద్రోలి యాంధ్రసతుల మానములఁ గాపాడిన పద్మావతీ దేవి వీర ప్రతాపౌదార్యమును ననంతముఖములఁ బ్రకృతి గానము చేయుచున్నది. ఆంధ్రపుత్రులు—(ఇంతలోఁ ద్వారపాలకుఁడు ప్రవేశించును.)

ద్వా:—(వంగి నమస్కరించి) జయము జయము మహారాజా? ఎవరో కవీంద్రుఁడట; శ్రీనాథుఁడఁట; తమ దర్శన మపేక్షించి యున్నవాఁడు. సెలవైనఁ బ్రవేశ పెట్టఁగలను.

పె. శో:—సత్వరముగఁ బ్రవేశపెట్టుము.

ద్వా:—చిత్తము. (నిష్క్రమించును.)

రామయమంత్రి:—రెడ్డిప్రభుల సంకల్ప మమోఘమునుకదా! కవులువచ్చుట లేదని యిప్పుఁ డనుకొనుటః వచ్చుటలు జరిగినవి. వచ్చెడివాఁడు కవీంద్రుఁడట; శ్రీనాథుఁడఁట. ఇచ్చట నున్నవారిలో నొకరు కాళిదాసత్రయమునకు వ్యాఖ్యాన కర్తలు. మఱియొకరు యమరుక కావ్యవ్యాఖ్యాన రచయితలు. కొల్వుకూటము సరస్వతీ కూటముగ మారునేమో!

విస్స:—సందేహమేమి? సరస్వతీ కూటముగ మారిన యాంధ్రవాణీసేవా సదనము లాంధ్రభూమిపీఠమున వేనవేలుగ ప్రతిష్ఠింపఁ బడును.

కాటయవేమారెడ్డి:—(నవ్వుచు) అట్టి భారము నెవరు వహించెదరో!

విస్స:—ఎవరో యననేల! పండిత వంగడమునకుఁ జెందిన మీ యట్టి ప్రభువులుండ పెరవార లందులకుఁ దగుదురా?

రామ:—నిశ్చయము సిద్ధాంతము.

(శ్రీనాథుఁడు ప్రవేశించును. అందరు లేచి నమస్కరింతురు. అందరిని యాశీర్వదించును. శ్రీనాథుని యుచితాసనముపైఁ గూరుచుండఁబంచి యందరు కూరుచుందురు.)

శ్రీనాథుఁడు—దేవరవారి దర్శనభాగ్యమున నేఁటికి దరిద్రబ్రాహ్మణుఁడు ధన్యుఁ డగుచున్నవాఁడు. వంగడములు తరింపఁజేసికొన సిద్ధముగ నున్నవాఁడు.

సీ. కపటకంఠీరవాకారనారాయణ, క్ష్వేళానినాదంబు గేలిసేయు
కల్పాంతదుర్దాంతకాలభైరవభేరి, డమరుకోన్మాదం బడంగఁజేయు
ప్రళయకాలాభీలపటుఘోరనిర్ఘాత, పటుపుటారావంబుఁ జటులపఱచు
కుహనామహాకాల కోలాహలోత్తాల, పాతాళనినదంబు భంగపఱచు
గండుమెఱసిన రిపుకోటిగుండె లవియఁ, జండగతిమ్రోయు నీరణోద్దండభేరి
జయరమాసంగరాయ వేశ్యాభుజంగ, యతులబలధామ పెదకోమటన్న వేమ!

(సభలోఁ గరతాళధ్వనులు)

పె. కో:—(సింహాసనమునుండి దిగ్గున లేచి, వచ్చి, తన మెడ నున్న రత్నాల హారమును శ్రీనాథుని కంఠమున వైచి) కవీంద్రా! ఈనాటికి మాజన్మములు ధన్యము లైనవి. శ్రీనాథుఁడను నామము తమపట్ల సార్థకమైనట్లుఁ దోఁచెడిని. ఎచ్చటనుండి విచ్చేసితిరి? జన్మగ్రామ మెద్ది? మాతాపితరు లెవ్వరు? కులగోత్రము లెవ్వి—విన వచ్చునా? వినఁదగిన జెప్పఁగోరుచున్నాను.

శ్రీనా:—మహాప్రభూ! కులమునకుఁ బ్రాహ్మణుఁడ, ఆరువేల నియోగి శాఖకుఁ జెందినవాఁడను. తల్లి దండ్రులు భీమాంబికా మారయామాత్యులు.

తమ పరిపాలనములోఁ బడిన కాల్పట్టణము స్థలము. తాతలనాఁటినుండి నావఱకుఁ గ్రామకరణీకము కులవృత్తి, శ్రీ పరమేశ్వర కరుణచే లభ్యపడిన కవితామతల్లి యనుగ్రహమున రాజకంఠీరవులఁ దర్శించి వచ్చుచుంటిని. అడుగ వచ్చునా? ఆ రాజ కుమారుని నామ మెయ్యది?

విస్స:—కాటయ వేమారెడ్డి. రానున్న కాలమున కీ చిరంజీవియే ప్రభువు.

శ్రీనా:—(సంతోషముతో) వేమారెడ్డి ప్రతాపగుణ సంపదలను వింటిని. వినిన దానికి, చూచినదానికి సరిపడినది. ఎన్నఁడో, యీ చిరంజీవి ప్రభువుమీఁదఁ గొన్ని పద్దెము లల్లితిని. వానిలో జ్ఞాపకమున్న దొక్కటియె. దానిఁ జదివెదను. చిత్త గింపుఁడు.

* ఉ. మానుష దానమానబల ♦ మానితధర్మ రమామనోజ్ఞ రే
ఖానుతి భూతి విత్తములఁ ♦ గాటయవేమునిఁ బోల్తు వానవిఁ
వానివిరోధి వానివిభు ♦ వాని విపక్షుని వాని యగ్రజుఁ
వానిమఱంది వానిసుతు ♦ వాని యమిత్రుని వాని మిత్రునిఁ.

కాట:—(లేచి శ్రీనాథునివైపు నడచుచు) కవిరాజా! ఇదివఱ కిట్టి సుగుణ ములు లేకున్నను, నిప్పుఁడు స్తుతి రూపకముగఁ జెంపలు వాయించితివి. నిరంకుశుఁ డవు సుమా! (అనుచు మెడనున్న పచ్చలహారము దీసి శ్రీనాథుని మెడను వైచి, పదము లంటి నమస్కరించి) నా దోసఁగులను మన్నింపుము. (పెదకోమటి వేమారెడ్డిఁ జూచి) పూజ్యపాదుఁడా! ఈ కవిచక్రవర్తి మన పాలనమునకుఁ లోఁబడినవాడు. ఆకృతిఁ జూడ దరిద్రుడుగఁ గోచరించుచున్న యది. ఉపాయము నూహింప సమయము. అట్టిది కలదా?

---

* పాఠకుల సౌకర్యార్థ మీ పద్యమున కీ క్రింద యర్థము వ్రాయుచున్నాను.

మానుష = పౌరుషమునకు, దాన = దానమునకు, మాన = శౌర్యమునకు, బల = బలమునకు మానితధర్మ = ప్రసిద్ధిగలధర్మమునకు, రమా = శ్రీలకు, మనోజ్ఞ రేఖా=మనోజ్ఞలావణ్యమునకు, నుత భూతి = ఐశ్వర్యములకు, విత్తముల = ధనములకు, (అనఁగా నీతఁడు) మానుషము (పౌరుషము)నకు నిందురుఁడు, దానమునకుఁ గర్ణుఁడు, (కర్ణుఁడర్జునునకు విరోధి కావున నిందునకును విరోధియే యగును) మానము (శౌర్యము)నకుఁ దుర్యోధనుఁడు (కర్ణునివిభుఁడు) బలమునకు భీముఁడు (దుర్యోధనునకు విరోధి) మానితధర్మము (ప్రసిద్ధిగలధర్మము)నకుఁ ధర్మరాజు (భీముని కగ్రజుఁడు) శ్రీలకు (రమా) శ్రీకృష్ణుఁడు (ధర్మరాజునకు మఱఁది) మనోజ్ఞలావణ్యములకు (మనోజ్ఞ రేఖా) మన్మథుఁడు (శ్రీకృష్ణుని కుమారుఁడు ఐశ్వర్యములకు నుతభూతి) శంకరుఁడు (మన్మథునికి ప్రబలశత్రువు) విత్తము (ధనము)లకుఁ గుబేరుఁడు (శంకరునికిఁ బరమమిత్రుఁడు) (ఇట్టివారలతో) కాటయవేమునిఁబోల్తు = కాటయవేమునిఁబోల్చి చెప్పెదను.

—ఆ. సు. శ.

పె. కో:—ఉపాయము లేకేమి ? కవులు నిరంకుశులు. స్వేచ్ఛాప్రవర్తకులు. అని నాసంశయము. (శ్రీనాథుని జూచును.)

శ్రీనా:—రెడ్డిరాట్కులతిలకా ! స్వేచ్ఛాప్రవర్తకు లను మాట నాపట్ల సర్వదా త్యజింపఁదగినదని తాము విశ్వసింపగోరెదను. నిరంకుశత్వ మీనాఁటిదిగా దని నమ్మ వేడెదను. ఆపైని—(సందేహించును.)

పె. కో:—సంశయించెద రేల ?—గ్రహించితిని. (అని కమ్మ నొకదానిని లిఖించి, ముద్రవైచి విస్సన్నమంత్రి కిచ్చును.)

విస్స:—(కమ్మ నందుకొని, సంతసముతో)

"బ్రహ్మశ్రీ పూజ్యులగు శ్రీనాథకవి సార్వభౌములకు—

మహాశయా ! తమ్ము సర్వకాల మీ కొండవీటిరాజధానియందు సర్వవిద్యాధికారులుగ నుండఁగోరుచు నట్టి యనన్యగౌరవప్రదమైన విద్యాధికారిపదము నొసంగుచున్నారము. గ్రహింతురుగాక ! సంస్థానమున నెట్టి భేదాభిప్రాయములులేక సంచరింప వచ్చును. ఈ యుద్యోగముతోఁ బాటు నుభయభాషలయందుఁ బాండిత్య ముండి కైతసెప్పఁగల నేర్పుగలిగిన కారణముచేత "కవిసార్వభౌమ" బిరుదమును ప్రసాదించుచున్నారము. రెడ్డిరాజ్యము సుస్థిరతర మైనది కావునను, స్వాతంత్ర్యమునకు గొంచె మైనను భంగముచేయనందునను, ప్రత్యేకాగ్రహారము లిచ్చుట యనవసర మని తోఁచినందున నట్టి ప్రయత్నమును విరమించుకొనుట యైనది.

ఇట్లు, పెదకోమటి నేమారెడ్డి.

(అని చదివి శ్రీనాథుని హస్తమున నుంచును.)

శ్రీనా:—(కమ్మ నందుకొని కన్నుల నద్దుకొని) ధన్యోస్మి. మదీయ భాషామతల్లి కిప్పటికి రాజాశ్రయముఁ గలిగినందులకు గర్వించుచున్నాను.

కాట:—కవిసార్వభౌమా ! అడుగ మఱచితిని. మా విస్సన్నమంత్రిగారికి శృంగార నైషధమును కృతిఁగూర్చిన శ్రీనాథ కవివరేణ్యుఁడ వీవె యగుదువా !

శ్రీనా:—అవును, ఏలకో విస్సన్న మంత్రిగారు మౌనముద్ర ధరించిరి. కారణము దుమహ్యము.

విస్స:—కవివృషభుల గుర్తింపకపోవుటయే కారణము. అప్పటి యాకారమునకు, నిప్పటి యాకారమునకు హస్తిమశకాంతరముఁ గలదు. అస్మదీయ ప్రమాదికములను మన్నింపుఁడు. (అనుచు పదముల నంటి నమస్కరించును.)

పె. కో:—(ఆశ్చర్యముతో) మా విస్సన్నమంత్రి కృతిపొందిన శృంగార నైషధ కావ్యకర్తయా ? ఆశ్చర్యము ! ఆశ్చర్యము ! శ్రీనాథకవిసార్వభౌమా ! ప్రస్తు

తమ సంస్థానము నీపట్ల గావించిన దోసగుల నన్నింటిని బారద్రోలి, త్రొంటి భోగ్యాకారముగ మీ తనువును పోషించుకొనుఁడు. వలయు సంభారముల నన్నింటిని భాండారము నుండి యిచ్చవచ్చినప్పుడెల్లను గొనిపోవచ్చును. (అని మరియొక కమ్మను లిఖించి విస్సన్నమంత్రి కిచ్చును.)

విస్స:—(అందుకొని) తిప్పయసెట్టికి—

మనసంస్థానమునందు విద్యాధికారిగ నూచే నియమింపఁబడిన శ్రీనాథ కవిసార్వభౌములకు వారి యిచ్చవచ్చినప్పుడెల్లను, వారెయిచ్చవచ్చిన వస్తువుల నన్నింటిని లేదనక నిచ్చునది. లేనివానిఁ దెప్పించి యిచ్చునది. అట్టి వ్యయమును సంస్థానమే భరింపఁగలదు.

పెదకోమటి వేమారెడ్డి.

(అని చదివి, ముద్రవైచి భటుల కిచ్చును, వా రద్దానిఁ గొంపోవుదురు.)

శ్రీనా:—ప్రభువర్యా! నాపైఁ దమకుఁ గలిగిన యిట్టి యవ్యాజానురాగమునకు సర్వదా కృతజ్ఞుఁడను. ఏమిచేయగలను, చేతనైనది యాశీర్వదించుటయే. శాశ్వతశ్రీర్భూయాత్.

(కోటలోపల మంగళవాద్యములు మోగియును.)

జై! కవిసార్వభౌమునకు జై!, జై! ప్రభువర్యులకు జై! యని వందిమాగధుల కైవారములు వినంబడును.)

ద్వా!—(మఱల ప్రవేశించి) ప్రభువులవారి యాజ్ఞకై వేశ్యాస్త్రీలు నిరీక్షించుచున్నారు.

పె॥ కో:—మంత్రివర్యా! కళావంతులు వచ్చిరట. ఇంతలోనే వసంతోత్సవములు వచ్చెనా?

విస్స:—నేఁడే వసంతోత్సవ ప్రారంభ దివసము. తిప్పయసెట్టి సర్వవస్తువులను భాండారమునఁ జేర్చినటుల నిన్ననే పట్టిక తమ సమక్షమునకు వచ్చినది. చిత్తగింపవచ్చును.

పె॥ కో:—(ద్వారికునితో) ప్రవేశపెట్టుము. (కాటయవేమునితో) వేమా! ఇంతటి విస్మయమున కా భయంకర యుద్ధమే కారణమా? అగుచో యుద్ధమెంత కాలముఁ జరిగినది?

కాట:—యుద్ధము పదిమాసముల పదునొకండు రోజులు జరిగినది. మనము విజయులమైన తరువాత ప్రణములఁ మాన్పుకొనుటకుఁ గొన్నిరోజులు; స్వాధీనమైన పరరాష్ట్రముల మంచిచెడ్డలు విచారించుటకుఁ గొన్నిరోజులు, నియమితుల నియ

మించుటకుఁ గొన్నిరోజులు చెల్లినవి. గత సంవత్సర వసంతోత్సవములు జరిగిన తరువాత నిదియే దర్బారు చేయుటకు మొదటిది.

పె॥ కో—అహో ! ఈ సంవత్సరము దుష్టులగు పరరాజుల నోడించుటతోఁ గాలము చెల్లినది. — స్వరాష్ట్రమునందు శాంతి యేవిధముగ నున్నదోఁ దెలియ రాదు. ప్రజలెట్టి కాటకములకుఁ జిక్కిరో వినంబడవు. మాలదైవము రాజులకీ రాజ్య తృష్ణ కల్పింపకున్న బాగుండి యుండునుగదా !

రామ:—ప్రభువు వారికి జన్మించిన యుమ్మలికమును బారద్రోలవచ్చును. రాష్ట్రము లన్నియు శాంతియుతముగ నున్నయవి, ప్రజలు సుఖముగ నున్నవారు. పాడి పంటలు సుభిక్షముగ నున్నయవి.

పె॥ కో:—నా మనమున కిప్పటికి కానంద ప్రద మైనది.

(ఇంతలో వేశ్యాస్త్రీలు, పురుషులు వారి వారి పరికరములతోఁ బ్రవే శించి, రాజులకు నమస్కరించి యొకచో నిలువంబడుదురు.)

పె॥ కో:—శ్రీనాథకవి సార్వభౌమా ! నీ ప్రజ్ఞ యమోఘ మని వింటిని. కాలక్షేపమునకై నను కొన్ని పద్యములఁ జెప్పఁగలరా ?

కాట:—కవి చక్రవర్తీ ! మీరు చెప్పనుండెడి పద్యములు భృంగపరము గను, మానవపరముగను నర్థము వచ్చునటుల, శృంగార పరముగ నైదుపద్యములలోఁ జెప్పెదు — చెప్పగలరా ?

శ్రీనా:—భవాదృశుల యనుగ్రహమున్న జెప్పఁగలను. పద్యములందలి భావములను మీరే విచారించు కొనుట లగ్గు.

ఉ॥ మాయురె ! భృంగమా ! వికచ • మల్లికలన్ విడనాఁడి తమ్మిలో
నీయెడఁ బూవుదేనియల • నింపు జనింపఁగఁ గ్రోలి సొక్కియున్
బోయెద నన్న భ్రాంతి నను • బొందుదు రా జుదయించె నిప్పుడే
తోయజపత్రముల్ వరుస • తో ముకుళించెఁ జలింపకుండుమా !

చ. అతులనభాంతరస్థిత బు • ధావళికెల్ల జోహారు, వీరరా
హుతులకు మేల్జోహారు సత • తోజ్జ్వల విక్రమసార్వభౌమ సం
తతికిఁ జోహారు వైభవ వి • తానపురందరుఁడైనయట్టి భూ
పతికి జోహారు, మానవపరి • పాల జోహారు ప్రధాన శేఖరా !

కాటయవేమభూపతీ ! నీ యభిప్రాయమునకుఁ దగిన వృత్తములఁ జెప్పి నాఁడను. నర్మగర్భోక్తులచేఁ జెప్పంబడినవి. కథను ప్రత్యేకించి యీ సభయందుఁ జెప్పరాదు. ఆజ్ఞ యైని—

పె॥ కో— అవసరములేదు. తెలిసినది. భవదీయ బుద్ధికుశలతకు సంతసమైనది. ధన్యవాదముల నర్పించుకొనుటతోఁ బాటు నీ ముత్యాలహారమును గ్రహింప వేఁడికోలు. (అని ముత్యాలహారమును శ్రీనాథుని కంఠమున వైచును.)

(సభలో శ్రీనాథ కవివర్యునకుఁ జే! యను ధ్వనులు.)

కాట:— ఆర్యా! శ్లేషగఁ జెప్పఁబడిన మీ వృత్తములు సంస్తవనీయములు. నా యథాశక్తి నీ పసిఁడిహారమును గ్రహింపుఁడు. (అనుచు శ్రీనాథుని పాదములపై నుంచును.) (సభలోఁ గరతాళధ్వనులు. జై! రసాశ్రయ కవిసార్వభౌమునకు జై!)

విస్స:— ప్రభువర్యా! తమ యానతిచేఁ గళావంతులు వచ్చివేచియున్నవారు. నృత్తమున కాజ్ఞ యివ్వఁగలరు.

పె॥ కో:— (వేశ్యలఁ జూచును. వారు నమస్కరింతురు. నాట్యముసేయ నాజ్ఞ యిచ్చును.)

కాట:— విస్సన్న మంత్రిగారు! శ్రీనాథకవి సంతసించునటుల నష్టపదులలోని శ్రీకృష్ణ శృంగారగాథలను గానముంజేయుచు నభినయింపు మని చెప్పుము.

విస్స:— పణ్యాంగనలారా! వింటిరా? శ్రీ కాటయ వేమభూపాలుని పలుకులను, అటులఁ గావింపుఁడు.

వేశ్యలు:— చిత్తము. (అని నమస్కరింతురు. మద్దెల, వీణ, గాఁగలవి మ్రోయుచుండఁగఁ గాళ్ళకుఁ గజ్జెలు సంతరించి యభినయించుచుఁ బాడుదురు.)

మోహన; వసంతరాగేణ గీయతే

పల్లవి: ముగ్ధే మధుమథనం రాధే । అనుగత మనుసర రాధే॥
విరచితచాటు వచన రచనం । చరణే రచిత ప్రణిపాతం,
సంప్రతి మంజుళవంజుళ సీమని। కేళిశయన ముపయాతమ్. ॥ముగ్ధే॥
శ్రీజయదేవఫణిత మధరీకృత । హార ముదాసిత వామం
హరివినిహిత మనసా మధితిష్ఠతు । కంఠతటీ మవిరామమ్ ॥ముగ్ధే॥

(పై పాటఁ బాడినతరువాతఁ గొంతవడకుఁ భరతాభినయములఁ బట్టి మహారాజులకు, సభికులకు నమస్కరించి యూరక నిలువంబడుదురు. సభలోఁ గరతాళ ధ్వనులు.)

కాట:— ఆర్యా! గాననాట్యాభినయములు బాగున్నవియా? తోఁచినరీతి వ్యక్తిత్వముగ యా తన్వీత్రయమును వర్ణింపుఁడు?

శ్రీనాథుఁడు:—
సీ॥ శ్రీరస్తు భవదంఘ్రి చికురంబులకు మహో, భూర్యబ్దములు సితాంభోజనయన!
వరకాంతిరస్తు తావక ముఖనఖముల, కా చంద్రతారకం బబ్జవదన!
మహిమాస్తునీకటి మధ్యంబునకు మన్ను, మిన్నుగలన్నాళ్ళు మించుబోఁడి!
విజయోస్తు నీ గానవీక్షుల కానీల,కంఠ హరిస్థాయిగా లతాంగి!
కుశలమస్తు లసచ్ఛాత కుంభకుంభ, జంభభిత్కుంభికుంభాభిజృంభమాణ
భూరి భవదీయ వక్షోజములకు మేరు, మందరములుండు పర్యంత మిందువదన!
(సభలో నవ్వులు, కరతాళధ్వనులు)

పెఃకోః:—మేలుమేలు. కవిసార్వభౌమా! మేలుమేలు. వర్ణన సహజస్వభావముగ నున్నయది. వారాంగనలకుఁ బెట్టుచు, కవుల కీయక నుండెడివారినిఁ గూర్చి కవి యేమనుకొనునో గదా!

శ్రీనా:—ఏ మనుకొనునా?

మ. కవితల్ చెప్పినఁ బాడనేర్చిన వృథాకష్టంబె యీభోగపుం
జవరాండ్రెగద? భాగ్యశాలినులు పుంస్త్వంబేల పోఁగాల్పనా?
నవరంగా సొగ సిచ్చి మేల్ యువతి వేషం బిచ్చి బుట్టింతువే
నెవరున్ మెచ్చి ధనంబు లిచ్చెదరుగాదే? పాపపుం దైవమా!

అని భగవంతునిఁ దూరును.

కాట:—బాగుబాగు. శ్రీనాథకవీంద్రా! నీవు నిజముగఁ గవీంద్రుఁడవే యగుదువు. భూపాలుఁడు దీర్ఘముగ నాలోచించియే కవిసార్వభౌమ బిరుదమును బ్రసాదించినాఁడు—ఆర్యా! నీ వనేక దేశములఁ గ్రుమ్మరియుందువు. ప్రత్యక్షముగ చూచిన విషయములను సమక్షమున నున్నట్లు కన్నులకు గోచరించునట్లుగ వర్ణింపగలవా?

శ్రీనా—అడుగవచ్చును.

కాట:—పశ్చిమ దేశపు వ్యాపారులఁగూర్చి వర్ణింపుఁడు?

శ్రీనా:—శా. దస్త్రీలుర్ మసి బుఱ్ఱలుం గలములుం దార్కొన్న చింతంబళుల్
పుస్తుల్ గారెడు దుస్తులుం జెమటకంపుం గొట్టు నీర్కావులుం
అస్తవ్యస్తపుఁ గన్నడంబును భయంబై తోఁచు గడ్డంబులున్
వస్తూ చూస్తిమి రోస్తిమిన్ బడమటన్ వ్యాపారులన్ గూర్రులన్.

కాట:—అరవ దేశపిల్లను వర్ణింపుఁడు?

శ్రీనా:—గీ. మేతఁ గరిపిల్ల, పోరున మేకపిల్ల, పారుఁబోతుదనంబునఁ బందిపిల్ల,
యెల్లపనులను జెలుపంగఁ బిల్లిపిల్ల, యందమునఁ గోతిపిల్ల,యీ యరవపిల్ల.

పె॥ కో॥—కవిసార్వభౌమా! లోకవర్ణనము లింకఁజాలు. మన కొండవీటి దుర్గమునుగూర్చి వర్ణింపుఁడు? విన నభిలాష కలదు.

శ్రీనా:—అటులనే వర్ణించెదను.

సీ॥ పరరాజ్య పరదుర్గ పరవైభవశ్రీలఁ, గొనకొని విడనాడు కొండవీడు
పరిపంథిరాజన్య బలముల బంధించు, గురుతైన యురితాడు కొండవీడు
ముగురురాజులకును మోహంబుఁబుట్టించు, కొమరుమించిన జోడు కొండవీడు
చటుల విక్రమకళా సాహసంబొనరించు, కుటిలాత్ములకుఁ గాఁడు కొండవీడు
జవన ఘోటకసామంత సరసవీర, భటనటానేక హాటక ప్రకటగంధ
సింధురార్భట మోహన శ్రీలఁదనరు, కూర్మి నమరావతికి నీఁడు కొండవీడు.

(సభలో జై! ప్రభుపుంగవులకు జై! జై! కవిసార్వభౌమునకు జై! జై కొండవీటికి జై! జై! ఆంధ్రసామ్రాజ్యమునకు జై! యను ధ్వనులు.)

పె॥ కో:—ఈనాఁటి కింతవఱకుం జాలును. తమకు శ్రమ యిచ్చినందులకు క్షమింప ప్రత్యేక ప్రార్థనము. (మంత్రితో) మిత్రమా! సచివాగ్రణీ! ఈ నాఁ డేమైన విచారింపఁదగిన యభియోగములు కలవా?

విస్స:—ఈనాఁ డేమియు నట్టి యభియోగములు లేవు.

పె॥ కో:—గణికాజనమును వసంతోత్సవములు వెళ్ళువఱకు నుండ నియమింపుమని. ఈనాఁడు జరుగనున్న యుత్సవమున కన్నియు సిద్ధములైనవా? అట్టి యుత్సవ మేర్పాటులఁ జేయుట కెవరిని నియమించితివి? ఆతఁడు సమర్థుఁడగునా?

విస్స:—వసంతోత్సవ ప్రత్యేక మేర్పాటుల నన్నిఁటిని గావింపఁ ద్వితీయ మంత్రులగు రామనాథముగారు భారమును వహించిరి. ప్రజ లెల్లరు నుత్సవములందుఁ బాల్గొనుటకుఁ గుతూహలపడుచున్నవారు.

పె॥ కో:—మంచిది. ఈనాఁటికి సభను విరమింపవచ్చును. (అని లేచును.)

జై! ఆంధ్రమహాసామ్రాజ్యమునకు జై! జై! ఆంధ్రభారతికి జై!

(అందరు నిష్క్రమింతురు.)

## రెండవరంగము.

ప్రదేశము: బొడ్డుపల్లెలో నొక పూరియిల్లు.

శ్రీనాథుఁడు:—(విషాదముతో) మాలదైవమా! బాగుగ బ్రతికిన వానికేనా యిట్టి యిక్కట్టులు. నీకు నే నే మపకారముఁ గావించితిని? నీ నామమును నోరారఁ గీర్తించితినే! బ్రహ్మచర్యమును పాలించితినే! నీస్వరూపమగు నక్షరవాణిని

ననంతముఖములఁ దిక్కులు గీర్తించునట్లు గ్రంథములవ్రాసితినే! నావాణిని పోషించు రాజులు నీకు బరువైరా? ఎందర నీ పుడమిపై నుంపలేదు? మరి పదికాలములపాటు చల్లని యా రెడ్డిరాజుల బ్రతికింపలేకపోతివా? నీకు గన్నుకుట్టెనా? కన్నులలో నిప్పులఁ బోసికొంటివా?—నా వాణిని బోషించువార లెవరు? నన్ను సాకెడివార లెవరు?—ఈ శరీర పోషణార్థమై నన్నునమ్మి గుత్తకుఁగొనిన భూమియందలి పంటను సైతము నీపొట్టను బెట్టుకొనవలయునా?—మహారాజాదిభోగముల ననుభవించిన శ్రీనాథునకు యీనాఁటికి నేలయే శయ్యయా? ఈ మసిపాతయే పీతాంబరమా? ఉపవాసదినములే సుఖముగఁ భుజించినదినములా? - తండ్రీ! నా వాణి నిర్భాగ్యుఁడనైన నాకేల జన్మింపవలెను? - అమ్మా! సరస్వతీ! నీ యక్షరము నశింపదు. నిన్ను, నన్ను పోషించిన ప్రభువుల శరీరములే రూపు మాసినవి - నేను నట్టిస్థితి యందే యున్నాను. తుదిపద్యములఁ జెప్పించి నీలోఁ గలుపుకొనుము - అమ్మా! కలుపుకొనుము - ఏదీ? నీ దయార్ద్ర వీక్షణములఁ బ్రసరింపుము తల్లీ! అయ్యో! చచ్చినను ఋణభారము తీరన ట్లున్నదియే! టంకము లెట్లు చెల్లింతును? - ఏదిగతి!

సీ॥ కవిరాజు కంఠంబు కౌఁగిలించెనుగదా, పురవీధి నెదురెండ పొగడదండ
సార్వభౌముని భుజాస్తంభ మెక్కెనుగదా, నగరు వాకిట నుండు నల్లగుండు
ఆంధ్రనైషధకర్త యంఘ్రియుగ్మంబునఁ, దగిలియుండెనుగదా నిగళయుగము
వీరభద్రారెడ్డి విద్వాంసుముంజేత, వియ్యమందెనుగదా వెదురుగొడియ
కృష్ణవేణమ్మగొనిపోయె నింతఫలము, బిలబిలాక్షులు తినిపోయెఁ దిలలుపెసలు
బొడ్డుపల్లెను గొడ్డేలి మోసపోతి, నెట్లుచెల్లింతు టంకంబులేఁడునూర్లు.

ఓ భగవంతుఁడా! ఇఁకఁ జీవింపలేను. నీ లోకమునకుం గొనిపొమ్ము. నావాణిని లోకమే కాపాడుకొనఁగలదు.

(ఉన్మాదముతో) వచ్చుచుంటివా? రమ్ము. రమ్ము—రమ్మనుచుంటివా? ఇదిగో వచ్చుచున్నాను.— దేవదూతలారా! నాకొఱకే వచ్చితిరా? నాకొఱకే వచ్చితిరా? గొనిపొండు. కొనిపొండు. వచ్చెదను.— వచ్చుచున్నాను. ఆగుఁడు. ఆగుఁడు. పోవుచుంటిరా? పోవుచుంటిరా? ఎచ్చటకుఁ బోవుచుంటిరి?— నేను మిమ్ములను విడువను.— వచ్చుచున్నాను.

(అనుచు నేలపై బడును. ప్రాణములు పోవును.)

ఇది ద్వితీయాంకము.

---

# గిరిజా పరిణయము *

విద్యాప్రవీణ శ్రీ బి. వి. వరప్రసాదరాయ శర్మగారు

పొలుపుగ పూర్వ పశ్చిమసముద్రములం జొరబారి ధాత్రికిన్
గొలతపుబద్దయై, విబుధకోటికి తా వయి, ఉత్తరమ్మునన్
జెలగు, సమస్తలోకనుతి జెన్నలరారుచు, దేవతాత్మతన్
వెలుగుచు, మంచుగొండయను పేరున ఒక్క శిలోచ్చయమ్మలన్.

ఎల్లగిరులు సమకూడి, హిమనగమ్ము, వత్సముగ, దోగ్ధగా మేరుపర్వతమ్ము
గూర్చి, పృథివిని పిదికియు కూర్చికొనియె, నోషధుల క్రమ్మి రత్నసముచ్చయముల

అంతములేని రత్నముల కాస్పదుఁడైన హిమాద్రికిన్ హిమ
మ్మెంతయు నేని భాగ్యముల కేకొఱతం గలిగింపఁబోవ ద
త్యంత గుణప్రకర్షమున యందున గొండొక దోష మున్న నొ
క్కింతయు కాననౌనె కన నిందుని వెల్గుల మచ్చకైవడిన్.

తన శిఖరమ్ములం జెలగు ధాతువు లంబుద సంచయమ్ము పై
గనుపడ చేసి రక్తిమ నకాలపు సంధ్య ఘటింప నచ్చరల్
మనము కలంగినం బ్రియసమాగమకాంక్షను రాత్రివచ్చె నం
చని భ్రమియింప భూషణ చయమ్ముల నగ్గిరి వాసి గాంచెడిన్.

ఏనుఁగుల జంపి సింగమ్ము లేఁగియుండు జాడ, సర్వమ్ము హిమ పంక్తి సమసి పోవ
గుప్పిళుల జారు ముత్యాలకోవ వలన హరుల మార్గమ్ము కందురి వనాటులచట.

నడుమ వరకును మేఘముల్ నడచు చుండ క్రింది చఱియల నీడల క్రీడ సేయు
సిద్ధు లవ్వర్ష ధార సంసిక్తు లగుచు ఆతప ప్రేమ శృంగమ్ము లధిగమింత్రు.

హస్తి గండ బిందుల కాంతి నవఘళించు భుజదళమ్ములయందు చిత్రజుని లేఖ
లన్ రచింతురు సింధూర రసముచేత లీల విద్యాధరాంగనల్ ప్రియతములకు.

తన గుహలందు వీచెడి సుదాత్త సదాగతి నా గిరీంద్రుఁ డ
త్యనుపమలీల వేణువులయందు నినాదము గల్గునట్లు నే
య నది మనోజ్ఞకంఠముల నచ్చట పాడుచునుండు కిన్నరాం
గనల మనోజ్ఞతాన మనుకార్యముగా కనునట్లు తోఁచెడున్.

* శ్రీ మహాకవి కాళిదాసుని సంస్కృత కుమారసంభవమున కిది తెనుఁగుసేఁత. సం—వి.

ఈ హిమాచలమందు మదేభములకు, గండకండూతి తీవ్రమై కలతపెట్ట
తత్ప్రశాంతికిగా దేవదారుతతిని, రాయ పాల్గారి వాసనల్ రాజు నచట.

రమణులతోడ వేడుక గిరాతులు మన్మథకేళి దేల న
త్యమల వికాసముల్ పరపు చందలి ఘోషఘులెల్ల తైలపూ
రము కనకుండగా కరమురాజిలు దీపికలంబలేక మనో
జ్ఞముగ ఘటిల్లు వారలు రసార్ద్రమనస్థ్సితి పల్లవింపగన్.

కరడుగట్టిన హైమమార్గములయందు, నేగు హయముఖు లంగుళు లెల్ల నొరసి
యుండియును వేగముగ నేగకుందు రచట, గురుతర నితంబ కుచభారగరిమ కతన.
పవలు సూర్యునివెల్గుల భయముపడెడు, తమము నాత్మీయదరులలో దాచునగము
క్షుద్రుడైనను శరణన్న చూతురెందు, సజ్జనుని రీతి నవ్వాని సాధుజనులు.
చంద్రకాంతులవోలె స్వచ్ఛమ్ములైన, తమదు వాలమ్ములను చామరముల జమను
లతని గిరిరాజశబ్దమ్ము సార్థకముగ, పరపుచుందురు భక్తి తాత్పర్యగరిమ.
ఆటవేళల వస్త్రమ్ము లపహరించు, దయితుచేష్టల లజ్జించు తలిరుబోండ్ల
మానమునుగాచు తోయద మండలంబు, దరులమూయుచు తమనీడ తెరలనంగ.

అనిమిషవాహినీ ఝరములందలి తుంపురుల న్మునింగి, త
త్క్షణము కదల్పజేసి సురదారువులన్, శిఖిపింఛజాల, మ
ల్లన మెలమెల్ల నూపుచును శ్రాంతిలియున్న కిరాతులన్ సుఖం
బును గనజేయుచుండు హిమముద్రిత పర్వత బాలవాతముల్.

సప్తఋషులును కోయగా సన్నవడిన, నలినముల క్రిందివైపున నడచుచుండు
ద్యుమణి, మేల్కొల్పుస్వీయమయూఖపంక్తి, నందుకొన్నింటిపై దిక్కునందుబరపి.
అవని భరణ సమర్థుడై యలరుచున్న, మంచుకొండను తా విలోకించి బ్రహ్మ
అచలములపైని ఆధిపత్యమ్ము నిచ్చి, యజ్ఞభాగార్హత నొసంగి యాదరించె.

అతడు పెండ్లియాడె మరియాదను తన్ సరిదాకునట్టి మే
నా తరుణీమణిన్, మునిజనమ్ములచే పొగడొందుదాని, సు
శ్రీశతి కల్గుదాని, పితృచిత్త సముద్భవ మైనదాని, వి
ఖ్యాత సమస్తలోకనుతి పూర్తిచెలంగిన దాని నిచ్ఛమై.

మనసు కింపైన యౌవనమున చెలంగు, ఆ ప్రియులకట్లు సురత కర్మానుభవము
కాలరీతి సుఖమ్ముగా గడచుచుండ, గర్భము ధరించె భూధరాగ్రిణి నెలంత,
ఆపె కనెనంత నాగవధూపభోగ్యు, పర్వతేశ్వరు జలనిధి బద్ధసఖ్యు
వజ్రి వజ్రాహతాచ్ఛిన్న పక్షయుగ్ము, ప్రకట మైనాకనాము సంభావ్యశీలు.

అంతకుమున్నె దక్షునికి నాత్మజయై భవు పూర్వపత్నియై
స్వాంతమునందు తండ్రియెడ సంజనిత మ్మగు క్రోధవహ్ని, అ
త్యంతము కాల్చివేయుతరి ప్రాణవియోగము నందినట్టి సీ
మంతిని జన్మ మందెను హిమాద్రివధూజ్జ్వలగర్భము క్తయై.
నరవి పరిశుద్ధనీతి నుత్సాహగుణము,నం జనించెడి సంపద నాగ నామె
ఆ గిరీంద్రుని మహిమ, వ్రతాదినిష్ఠ, దనరు మేనకయందున జననమందె.
ఆయమ పుట్టినట్టి దినమంతయు నిర్మలకాంతి శోభితా
శాయుతమై, ప్రశాంతమయశంఖరవ ప్రతిపాదితప్రసా
రాయత పుష్పవృష్టి యయి అంతట స్థావర జంగమాతత
ప్రేయము నై చెలంగె అతివిస్తృత సౌఖ్యవిధాయకమ్మునై.
క్షాంతి తతి కిక్కయైన ఆ కలికిచేత, వెలిగె జనయిత్రి క్రొంగ్రొత్త వింతచెలువు
నవ వలాహక శబ్దమునం జనించు, రత్న కణిక విదూరాచలావని బలె.
దిన దినమ్మును ఆపార్వతియు చెలంగె, చంద్రమఃకళవోలె నిస్తంద్రరీతి
స్వీయకళలను లావణ్య సీమ బెనిచె, మారువెన్నెల చాలుల తీరు లనగ.
పార్వతి యటంచు నామెను బంధుజనులు
ప్రణయసంబంధగరిమచే వ్యవహరింతుర
తల్లి 'ఉ! మ' యంచు మరలించె తపమునుండి,
దాననామె కుమాఖ్య సార్థకము నయ్యె.
పుత్ర పుత్రికాసంతతి బొందికూడ, అద్రి అగజాతపై తృప్తి నంద; దచట
ఎన్ని పూలైన దృష్టిలో నున్నయేని తియ్యమావిపై వ్రాలదే తేటిపిండు.
ఆ లతాతన్విచేత హిమాచలేంద్రు, డడరె; పూతుఁడై విలసిల్లె; అమలమైన
గంగసంగతి స్వర్గమ్ముకరణి; శిఖల, దీపగతి; పూతవాణి సుధీంద్రుభాతి.
ఆ నలినాక్షి నొందెను వియత్తల వాహినియందు సైకత
శ్రేణుల నెయ్యపుం జెలుల చెల్వపుటాటలు తాముతామయై
శ్రేణులుగా శరత్తున చరింపగ మానస మేగు రాజహం
సీ నవమండలంబువలె చెందెను ప్రాక్తనజన్మవిద్యలున్.
తనమృదు గాత్రవల్లరికి దాల్చు నయత్నవిభూషణమ్ము, కౌ
ముసికి సుమేతరమ్మయిన ముల్కి, అనాసవమౌ మదమ్ము సా
ధనమగు యౌవనోద్ధతిని దాల్చిన ఆమె శరీర మొప్పె, నూ
తనరవి భిన్నపద్మమున దద్దయు వ్రాసిన బొమ్మకైవడిన్.

ఉన్న తాంగుష్ఠ నఖకాంతు లుబ్బుకతన, అరుణకాంతుల విదజల్లు నట్టులున్న
తత్పదద్వంద్వ మవని పద్మమ్ము లట్లు, శోభ జెన్నొంది వీక్షణ శోభ గూర్చు.

నాణె మొలికించు తమదు నెన్నడల సొబగు, నాలతాతన్వి కిచ్చి రాయంచలెల్ల
శీత నగజాత మధురంపు శింజితముల, నేర్చుకొనుచుండు శుశ్రూష నెరపుచుండి
స్వీయచాతుర్య మెల్ల వెచ్చించి బ్రహ్మ, ఆ మనోజ్ఞాంగి జంఘాద్వయము రచించి
మిగులు సంగములెల్లను మేల్మిరీతి, నేయ యత్నించుచున్నట్టి చెల్వుదోచు.

అనంటి కంబమ్ము లెపుడు శైత్యమ్మునందు, చుంట; నాగేంద్రహస్తమ్ము లుంట గర్క
శత్వమున; నామెతొడలకు సాటిగావు, రెంటియందున దోషమ్ము లుంటకతన.

పడతిలోకము కెల్ల నపాప్యమైన, ఆ మహేశ్వరు రమ్య భవ్యాంకసీమ
నిజతపశ్శక్తిచే గొన్న నీరజాక్షి, పూర్ణ కటి దేశపు సొంపు పొగడవశమె.

నీవి నతిక్రమించి, కడు నింపు చెలంగు గభీరనాభి ప
ర్యావృతమై, సితేతరమయాంచితశోభల నించి, మేఖలా
పావృతమధ్య నీలమణియర్చి బలెక్ దగునవ్యసూక్ష్మ రో
మావళి కాంతిమై తనరె నా వనజాక్షికి యౌవనోద్ధతిన్.

అంగజారోహణమునకై యౌవనమ్ము, పరచు క్రొంగొత్త సోపాన సరణి యనగ
నడుమభాగమునందు అన్నాతి కెసగు, వళులు మూడును నూతన కళలు చెలగ.
ఒకడొకదాని స్పర్థమై ఒరయుచుండి, ఆమెకుచము లురస్సీమ నాక్రమించె
శ్యామముఖ కాంతి లసిత స్తనాంతరమున, ఒకక బిసతంతు మేనియు నుంపరాదు.

పొలతి కోమల సుందర భుజయుగమ్ము, దిరిసెనపుబూల సుకుమార సరణినవ్వు
చారు తద్బాహుయుగళియే సాధనముగ, హరునిబంధించెజితుడయ్యునాత్మభవుడు.
ఆపె కంఠమ్ము ముక్తాకలాపమునను, హారమునుగాంచె గళముచే జారుగరిమ
ఒకొకడొకదాన శోభించు చుండుకతన, భూష్యభూషణ భావము పొల్చెనచటి.

చంచలమైన ఆ సిరి శశాంకునిచేరియు పద్మగంధ మొ
కించుకయేని పొందదటులే జలజమ్మును జేరి చంద్రిమా
దంచితశోభ నించుకయు నందదుగా జలజాక్షి ఆస్యమో
కొంచక రెంటి శోభలను కూర్చుకొనెక్ మధురంపులీలలక్.

చిగురుటాకున తెలిదమ్మి చేర్చియున్న, పవడమున ముత్తియమ్ము నిల్పంగగన్న
తౌల్యముంబొందు నామె రక్తాధరస్థ, మధురదరహాస రమణీయ మంజిమమ్ము.

ఆమె స్వరమాధురి ఒకింత నరసియున్న, పికనినాదము చెవులకు వెగటు పుట్టు
విషమనాదమ్ముతో, శ్రోత్రవీనుదోయి, కిని రుచింపని వల్లకీ స్వనమ్మోలె.
గాఢ వాత విచాలిత కమల మట్లు, తళుకు బెళుకుల నొలికించు కులుకుచూపు
పార్వతియు లేటి నెలతలు ప్రాభవమున, నొండొరుల శిక్ష గ్రహియించియుండబోలు.
లీలల వెలింగి సుభగమ్ములౌ లతాంగి, కనుబొమల గల్గు నిండారు కాంతు లరసి
స్వీయచాప ప్రచోదిత మా యఖండ, గర్వమెల్లను వీడె ఆక్షణమె మరుఁడు.
లజ్జ తిర్యక్కులందు తారసిలు నేని ఆమె ఘనవేణి సౌందర్య మరసి, తమదు
వాలమందలి మమకార భావగరిమ, కడపకుండునె చమరీమృగమ్ములెల్ల.
ఉపమకుం దగు ద్రవ్య సముచ్చయమును,గొని యథాస్థానముగను దానిని ఘటించి
సృష్టి నిర్మించె నామె నశ్రాంత యత్న,మునను సౌందర్య మొక్కచో గనెడికోర్కె.

నారద మౌనిచంద్రుఁడొకనాఁడల తండ్రి సమీప దేశముం
జేరిన పార్వతింగని శుచిస్మితుఁడై, 'శివునంక పీఠిపై
జేరుదు ప్రేమమూర్తివయి, చెల్వ! తదీయ శరీరమందునం
గూరిమి నర్ధభాగమును గొమ్మని కొమ్మనుబల్కె ప్రీతితో.

నారద మౌనినాథు వచనమ్మునఁ జేసి పరాభిసంధి నం
భారము మానె నద్రియును ప్రాపిత యౌవనయైన పుత్రికిన్
నేరదు మంత్రపూతమయి నిల్చిన హవ్యము వీతిహోత్రునిం
జేరక, అన్య తేజములు చేర్పగ నాత్మఁ బ్రయత్న మందినన్.

ఆ హిమవంతుఁ డాత్మభవ నా శివుకోర్కె ఎరుంగ కీయ ను
త్సాహము సేయఁడయ్యె అది ధర్మమె, యాచన భగ్నమౌనొ అం
చూహ దటస్థభావమున నుండును సాధుజనుండు చూడగా
నీహితమందు కూడ రచియించును మానస మన్యథా గతిన్.

దక్షరోషసముద్భవ దహనునందు, సుదతి పూర్వభవమ్మున సురిగి పోవ
అన్యకాంతాసమాసక్తి నవలద్రోసి, విషయవాంఛాళిసంగమ్ము వీడె శివుఁడు.

అతఁడు ఇంద్రియమ్ముల జయమ్మున జేసియె జాహ్నవీతటీ
వ్యాతత దేవదారువయి, క్వాణితకిన్నరమై, మృగీమద
శ్రీకలిచే చెలంగు అతిశీతల హైమగిరీంద్రసాను వం
దే తపమాచరింప రుచి నింపెడి కోర్కె జేరె నచ్చటన్.

ప్రమథులు భూర్జవృక్షముల పట్టలదాలిచి సౌఖ్యమంది శీ
ఘ్రమున నమేరువృక్షగతులై శ్రమలం దిగనాడుకొంచు నా
హిమగిరియందు దర్శన మనీషను గొల్పెడి చిత్రవర్ణధా
తుమయ శిలాతలమ్ములను దృష్టినిగాంచి రసన్యకాములై.

ఆ శివు వాహనమ్మట శిలాకృతులం దగు హైమఖండముల్
తోసముమీర ఢాయుచు సుదూరము ఆకృతిగాంచి పర్వు ఆ
గో సదృశమ్ములౌ గవయకూటములం గని క్రోధమూర్తియై
రోసముమీర అంకెలను రువ్వగసాగెను ముట్టెవంచుచున్.

అష్టమూర్తులు తనయందె అమరియున్న, దానవొకదాని ప్రజ్వలితమ్మొనర్చి
ఇంద్రభావమ్ము స్వయముగా నిచ్చునట్టి, శంకరుండొక్క కోర్కెచే సలిపె తపము.

మూల్య మింతని తెలుపంగ బూనరాని, అమరవంద్యున కద్రి యర్ఘ్యమ్మొసంగి
అతని కార్యకలాపమ్ము నరయుడంచు, చెలులతోడను పుత్రిక న్నిలిపె నచట.

తనదుసమాధి భగ్నతకు దారియకాతగు కన్యకాలలా
మను ఘనసేవ లందికొన మానసమందు దలంచె సాంబుడున్
కనగ వికారహేతువులు కల్గినయేనియు చిత్తశుద్ధి నె
మ్మనము సమాధినిష్ఠ గరిమమ్మున నిల్పినవారె ధీరులౌ.

ఆ లలితాంగి పూజ కగునట్టి సుమమ్ములు వేదిమార్జనల్
నీళుల నిత్యకర్మ విధినిష్ఠతకై సమిధమ్ము లాది, శ్ర
ద్ధాళువ యౌచు గూర్చె నియతమ్ముగ తత్పరమేశమస్త లీ
లాలలిత ప్రసూనరసలాలిత దైహిక తాపరాశియై.

ఇది ప్రథమ సర్గము.



# శ్రీ శివకోటి వీరభద్రయ్యగారు

అనువాదకులు :—శ్రీమఠం సిద్ధి వీరయ్యగారు, ఉపాధ్యాయులు.

శ్రీ శివభగవానునిపై నకుంఠిత భక్తివిశ్వాసములు గల్గినకతన సమయాను సారము తమ జీవనమును ఘోరాతిఘోర సంకష్టముల పాల్జేయుటకు వెనుదీయని మహానుభావులు నున్నారు. ప్రస్తుత మొక వీరశైవమహాశయుని జీవితము సంక్షిప్తముగా నుల్లేఖింపబడుచున్నది.

శ్రీమంతంబగు నిజాంరాష్ట్రమునందు ప్రఖ్యాతమండలం బోరుగల్లు. దీనికి (ఏకశిలానగర) మను నామాంతరము. ఈ మండలమున గణపురమను స్టేషనుకు సమీపమునందు లింగంపల్లి యను నొక పల్లెటూరు గలదు. అచట కొన్ని సంవత్సరములకు పూర్వము శివకోటి వీరభద్రయ్యగా రను బీద వీరశైవ గృహస్థుడు వసించుచుండెను. వారు విశేష విద్యావంతులునుగారు, మాతృభాషయందు మాధ్యమిక తరగతివరకుఁ జదివి మాతాపితరుల యాదేశానుసారము వివాహ మొనరించుకొనిరి. తదనంతర మొక పాఠశాలయం దుపాధ్యాయవృత్తి నవలంబించి కుటుంబపోషణము గావించు చుండిరి. శైశవదశయందే వీరికి జ్ఞాన, వైరాగ్య, సత్సాంగత్యములందు సంపూర్ణప్రీతి. వీరివలెనే గృహిణియు సదాచారిణియై భగవద్భక్తి గల్గి యుండెడిది. అయిన నుభయులును గ్రామవాసుల ప్రేమాదరణకు పాత్రులుఁగాక పౌరులదృష్టియందు వీరి భక్తిజ్ఞానము లు కేవల డాంబికములని కాన్పించినవి. అందువలన వీ రచటనుండుట కయిష్టపడి రెండు మూడు సంవత్సరములలోనే బోధకవృత్తికి స్వస్తిచెప్పి స్వగ్రామ సమీపపర్వతోపరిభాగంబున వసించి యేదో యనుష్ఠానము జేయుచుండెను. కాని యచ్చోటనుండుటయు కష్టమైనది. కారణ మేమన జను లనేకులు వారిని దర్శింప నేతెంచుటచే యనుష్ఠానమునకుఁ బ్రతిబంధక మేర్పడెను. కొన్ని దినములలోనే అయ్యగారి ప్రభావము నల్దెసల వ్యాపించినది. తండోపతండములుగా జనులు వచ్చుచుండిరి. అయినను పారమార్థిక చింతఁగల ఋజుమార్గవర్తనము జనులను సంతోషపరుప జాలదయ్యెను. చివరకు అయ్యగారు పర్వతవిపిన వాసమును వదలి స్వగ్రామమునందే స్వగృహాభిముఖుఁడై కాలము గడుపుచుండెను. అచ్చోట నాలుగు సంవత్సరములు శివభక్తి ప్రబోధము జనులలోఁ గావించెను. ఏ గ్రామ మేగినను యచటి జనసామాన్యమునకు శైవధర్మము లుపదేశించి శివభజనసంఘముల స్థాపింపఁజేయును. బీదల కన్నదానము వస్త్రదానము సైతము చేయుట కేర్పాటుగావించును. వీరికి శివభగ

వానునియందు భక్తి మిక్కుటము. విశేషముగా శ్రీ వీరభద్రునియందు శ్రద్ధ మెండు. వీరికి శ్రీ వీరభద్రుఁడు భవిష్యత్తు నందనతికాలమునందే దుష్టశిక్షణార్థ మవతరింపగలడను భావన గలిగినది. వీరి యందనేక చమత్కారములు గాన్పించినవి. వీరు శైవులలోనే కాక సామాన్య ప్రజలందును వీరి ప్రసిద్ధి విస్తరించెను. వీరు తమ గ్రామమునందు సుందరమగు శివాలయమొకటి నిర్మించినారు. దాని కొఱకు సుమారు (౭౦) డెబ్బదివేల రూపాయలు వ్యయముగావచ్చును. ఒక బీద భక్తునకింతటి ధనముసంప్రాప్తమగుట చిత్రమే! రెండవ విషయ మేమనగా! ఇంత ధనమార్జించినను తానువసించు గృహము మిగుల పురాతనమైనది. అన్నవస్త్రములకును అభావమై నిప్పచ్చరంబులతో గాలము గడపును.

శ్రీ శివకోటి వీరభద్రయ్యగారొక యద్భుత మేధావి. విలక్షణమైన వ్యక్తి. సాధారణ విద్యావంతుఁడైనను స్వయంకృషిచే సంస్కృతాంధ్ర పురాణములయందు తంత్రశాస్త్రములందు మంచియోగ్యత సముపార్జించెను. వారికీ ప్రాంతమున గలిగిన కీర్తిప్రతిష్ఠలకు ముఖ్యకారణము వారు స్వయముగా రచించిన శివకోటి యను యద్భుతగ్రంథము. అందు గొప్పసైజులో (౧౦౮) పుటలుగల్గి శివ సంబంధమగు చిత్రములు గలవు. అందు విశేషమేమనగా సింహావలోకనగా నా పటముల దిలకించిన ఇతర పటములవలె ననేక రంగులును లతాదికములు గోచరించును. గమనించి శ్రద్ధతోఁ జూచినయెడల నందొక రేఖయైనను వ్యర్థమైనదిలేదు. ఆ రేఖలన్నియు వాస్తవముగా అక్షరములే. హస్త పాద నాసిక కర్ణ నయన వదన భూషణాదులు శిరస్సునందలి కేశములు కంటిబొమ్మలు సైతమక్షరములతో నిర్మితమైనవి. చిత్రకళాదృష్టితో జూచినను పటము నందే లోపముగాని దోసగుగాని కానరాదు. పుస్తకారంభమునందే గణపతియొక్క గొప్ప సుందర చిత్రము గలదు. ఆ చిత్రము నలుప్రక్కల లతాపుష్పాదికములతో పురాణమందలి గజానన జనన చరిత్రము విస్తరించి వ్రాయఁబడినది. మధ్యనుండిన గణపతిమూర్తియందు గణపతి సహస్ర నామములు గలవు.

చిత్రకారుని బుద్ధిబల మనుపమాన మైనది. కర్ణదంతకుక్ష్యాది ప్రత్యేకాంగములయందు యథావిధి శూర్పకర్ణాయనమః, ఏకదంతాయనమః లంబోదరాయ నమః, మున్నగు వర్ణములచే నిర్మితంబైనది. శివుని పంచవింశ లీలలు, ద్వాదశజ్యోతిర్లింగములు, స్వయంభూలింగము, కాశీఖండము, మఱియు శివపురాణములయందలి ముఖ్యఘట్టములు చిత్రరూపమున మిక్కిలి శుద్ధముగను సున్నితముగను రచింపఁబడినవి, వారి కుంచెయు భగవత్కృపచే చక్కగ సాగినది. ఎచ్చటనైనను యొకించుక

న్యూనాధికతల కాస్పదము గాలేదు. పొరపాటు జరిగిన కారణమున (రబ్బరుతో) చెఱిపి పునర్నిర్మాణ మొనరించిన చిహ్నములును కానబడవు. ఆరంభదశయందు వీరు సురమ్యముగ శివనామములు కోటి వ్రాసినందున శివకోటి యను బిరుదు గాంచిరి. తదనంతరము వీరు పది పండ్రెండువర్షములు కఠినతపోనియమము మూల మున పైనఁ బేర్కొనిన అద్భుతగ్రంథము సిద్ధమైనది. దీనిని రచించి శివకోటి బిరు దును సార్థక మొనరించుకొనిరి. శివకోటి అత్యంతాద్భుత గ్రంథము. సికిందాబాదు నందలి ఆంగ్లాధికారు లొకసారి (౫) వేల రూప్యములు సమర్పించి గ్రంథమును కొన సంకల్పించిరి. అయినను శ్రీ వీరభద్రయ్యగా రంగీకరింపరైరి. వీరు తమ విచా రమును సూచించుచు చెప్పినపలుకు లివి. "నే నీ పొత్తమును శ్రీ శివచరణసన్నిధిని సమర్పించినాడను. కావున దానిపై నా కధికారము లేదు. అర్చకునకు దేవతా మూర్తి నర్చించుట కధికార మున్నది కాని, యితరుల కా మూర్తినొసగు నధికారము లేదుకదా! అట్లే నా గ్రంథవిషయమై నా కుండిన యధికార మింతియ" వీ రెంతటి స్వార్థత్యాగులు; వీరిభావ మెంతటి పవిత్రము. వాస్తవముగ నీ గ్రంథ మమూల్యము. ఇందలి యొక్కొక్క పటమునకు ప్రత్యేకబ్లాకు లేర్పరచి దానితో ననేక చిత్రావళీ సిద్ధపరుప వీ లగును. ఈ విశాల భారత దేశమున పుణ్యాత్ములగు వితరణశాలుల సంఖ్యకు లోటులేదు. కాని పరమేశ్వరుడు వారి కిట్టి సదాశయముగలిగించి ౧౦ వేల రూప్యముల నీ సత్కార్యమునకు వినియోగించినచో గొప్పకీర్తి నార్జించినవా రగు దురు. శివకోటి వీరభద్రయ్యగారు తమ ౪౦ సంవత్సరముల ప్రాయమున ౫ సంవత్స రములు క్రితము నిహలోకము న్వీడి శివలోకప్రాప్తు లైరి. విచారకరము. కై॥ వా॥ శివకోటి వీరభద్రయ్యగారి స్మారకచిహ్న మనదగు శివకోటి యను నద్భుత గ్రంథ మును ముద్రింపించు భారము ఆంధ్రవీరశైవ మహాశయులయొక్కయు, ఆంధ్రమహా నీయుల యొక్కయు భుజములపై నున్నది.

ఆ గ్రంథమే ముద్రింపబడుచో నాధునికాంధ్రలోకమందలి యొక మహా శిల్పియొక్క రమ్యమైన కృతిని విశ్వమున కందించిన వార మగుదు మనుటలో సంది యము లేదు.

శివకోటి వీరభద్రయ్యగారి రెండవ కార్యము కూడ మహాద్భుత మైనది. వీరశైవమున్నంతవరకును మరపునకు రాజాలనిది. శ్రీ వీరభద్రయ్యగారు సౌరాష్ట్ర సోమనాథాది యాత్రలవలెనే జ్యోతిర్లింగమగు శ్రీ పరళీవైద్యనాథక్షేత్రమున కును గత రుధిరోద్గారి సంవత్సరమున వెళ్ళి శ్రీ శివలింగమూర్తికి రుద్రాభిషేకాదు లను గావించి వీరశైవులకును ప్రత్యేకముగ స్మార్తబ్రాహ్మణులకును సంతర్పణ

గావించిరి. కొంత కాల మచ్చోట నివసించి తమ జపతపోనుష్ఠాన శాంతికై యొక మహా రుద్రాభిషేక మొనరించ దలపగా స్మార్తులు వీరశైవులకు వేదాధికారము లేదనియును, వైద్యనాథమందిరములోనికి రా జనదనియును నొక క్రొత్తకలహమును లేవదీసిరి. దీనితో నచ్చటి వీరశైవులకును, స్మార్తులకును పెద్దసంఘర్షణ జరిగి వ్యాజ్యము హైకోర్టువఱకు వెళ్లి శ్రీ శ్రీ నిజాంప్రభువుగారి యనుమతివలన దీనిని శాస్త్రీయముగ విచారించుటకై యొక కమీషన్ ఏర్పరుపబడెను. ఇది అఖిలభారత వీరశైవుల సమస్యగా మారినది. క్రోధననామసంవత్సరమున హైదరాబాదు ప్రభుత్వముయెదుట శాస్త్రచర్చ ప్రారంభమయ్యెను. ఉభయమత పక్షములనుండి నూర్లమంది పండితులు పాల్గొనిరి. చాల దీర్ఘముగ మూడు మాసములవరకు అత్యద్భుతమైన శాస్త్రవాదము జరిగినది. వీరశైవపండితులు స్వమత వైదికత్వమును వేదాగమోప నిషత్పురాణేతిహాసములయొక్క సహస్రాధిక ప్రమాణములతో నిరూపించి విజయము నందిరి. ఈవాదమునకు సంబంధించిన సమస్తప్రమాణగ్రంథములను వాదపద్ధతిని ప్రభుత్వమువారు నాల్గువత్సరముల దనుక పరిశోధించి సత్యమును ఒప్పుకొని వీరశైవులకు వేదాధికారము నిర్వివాద మనియును, మహారుద్రాభిషేకము నొనరించుకొనవచ్చు ననియును తీర్మానము గావించి యనుమతి నిచ్చిరి. దానిమీద శ్రీపరలీ మహాక్షేత్రములో ప్రమోదూత సంవత్సరమునందు ఈ కలహ కారణముగనే వేదతీర్థపరీక్షాపట్టభద్రులైన శ్రీ పండితులు చిదిరెమఠము వీరభద్రశర్మగారి విధ్యుక్తమైన వైదికత్వముక్రింద శ్రీశివకోటి వీరభద్రయ్యగారు మహావైభవముతో శ్రీ వైద్యనాథునికి మహారుద్రాభిషేకమును గావించి కృతకృత్యులైరి. ఇమ్మహోత్సవములో కర్ణాటకాంధ్ర మహారాష్ట్ర దేశములనుండి ఇరువదివేల జనసంఖ్య పాల్గొని యుండె నన్నచో దీని మహత్త్వము దెలియగలము. ఈ కారణమువలనే ఈ వ్యాజ్యమునకు పరలీ ప్రకరణమని సుప్రసిద్ధి కలిగెను. శ్రీ శివకోటి వీరభద్రయ్యగారి ఘనతను దెలిసికొనిన వీరశైవలోకము శీఘ్రముగా శ్రీవారి శాశ్వత స్మారకచిహ్నమును నెలకొల్పుగాక యని నిరీక్షించుచున్నాను.

(హిందీ శివాంకమునుండి)



# వీరశైవ శిఖాసిద్ధాంతము

## పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారు

భారత దేశపు వైదికాస్తికమతములలో వీరశైవ మొక్కటి. వీరశైవాచార్యులగు పీఠాధిపతులలోను, తచ్ఛిష్యులగు భక్తమాహేశ్వరులలోను వైదికములగు దీక్షోపనయన సంస్కారములును వైదికమగు శివపంచాక్షరీ మహామంత్రోపదేశమును పరంపరగా వచ్చుచున్నవి. ఈ మతమునకు సంబంధించిన శివాగమములు, భాష్యములు, కారికాగ్రంథములు, ధర్మాచారప్రకరణగ్రంథములు మున్నగు వాఙ్మయము మహావిశాలమై వైదికసిద్ధాంతములతో నిండియున్నది. ఈ వీరశైవమతము శ్రీజగద్గురు రేణుకాది పంచాచార్యులచే స్థాపింపబడి తత్పరంపరాగతులగు మహాచార్యులచేతను, ఉపాచార్యులచేతను పరిపాలింపబడుచు నేడును సుప్రసిద్ధమై యున్నది. ఇట్టి విషయములను ధర్మశాస్త్రమువలనను, శిష్టులవలనను దెలిసికొనవలసియుండగా కొందరు పామరులను జూచి యపసిద్ధాంతమును నిలవేయ బ్రయత్నించుచున్నారు. ఇట్టి విపరీతభావనకులోనై వీరశైవ గృహస్థుడు తలలో శిఖను (జుట్టును) ఉంచదగదని కొందరు వాదింప దొడగిరి. రానురాను కొందరు బుద్ధిమంతులు, సద్వంశీయులుకూడ ఈ మూర్ఖులవాదమును నమ్మి ఈ దురాచారమును అవలంబించి మోసపోవుచుండిరి. ఇక పరమతీయులు ఇట్టివారినే చూచి వీరశైవమతమునే అవైదికముగ భావించి కొన్ని గ్రంథములలో అశాస్త్రీయముగ అసత్యవార్తలను ప్రకటించుటలో నాశ్చర్యములేదు. ప్రస్తుతము వీరశైవమతగ్రంథములలో నుండి శిఖాసిద్ధాంతము గూర్చిన ప్రమాణములను ప్రకటించి నిష్పక్షముగ చర్చింపదలచినాను.

వీరశైవమతమునకు శ్రుతులే పరమప్రమాణములు. వైదికములగు శివాగమములలోని సిద్ధాంత మను భాగము ననుసరించియే వీరశైవమతముయొక్క సమస్త విశేషములను దెలిసికొనవచ్చును. శివాగమములయొక్క వైదికత్వమును ప్రామాణ్యమును మఱొక వ్యాసములో నిరూపించగలను. వైష్ణవులకు పాంచరాత్రాగమములలో నెట్టిప్రామాణ్యమో అట్టి ప్రామాణ్యమే శివాగమములలో వీరశైవులకు నుండునని సామాన్యముగ దెలిసికొనిన జాలును.

వీరశైవ సదాచారసంగ్రహము, వీరశైవాన్వయ చంద్రిక, శివప్రసంగరత్నాకరము, శ్రీకరభాష్యము మున్నగు గ్రంథములవలన గర్భాధాన పుంసవన సీమంత జాతకర్మ (లింగధారణ) నామకరణ అన్నప్రాశన నిష్క్రమణ చౌల దీక్షోపనయన

వివాహము లను దశకర్మలు వీరశైవద్విజులకు పరమావశ్యకములు, "శివార్చా కర్మ విజ్ఞేయం బాహ్యం యాగాది నోచ్యతే" యను సిద్ధాంతశిఖామణి ప్రమాణమునుబట్టి కొందరు వీరశైవులకు కర్మ లేదని దుర్వాదన జేయ మొదలిడిరి. కాని యది కామ్యములగు వాజపేయాదియాగములను నిషేధించినదే కాని నిత్యములగు శివపూజాదులను పరమావశ్యకము లగు జాతకర్మాది సంస్కారములను వలదని చెప్పినదనుట మాధ్యము కాకమానదు. అట్లగుచో లింగధారణము శివదీక్షయు నొక కర్మ కావున వానినిగూడ వలదనియే చెప్ప వీలు కాదుకదా! శాస్త్రప్రమాణముల వలననే కాక యూథినిబట్టి కూడ వీరశైవులకు దశకర్మలు అవశ్యము లని సిద్ధాంత మగుచున్నది. ప్రస్తుతము శిఖకు సంబంధించిన చౌలవిధిని గూర్చి విచారింతము.

వీరశైవ సదాచార సంగ్రహము వీరశైవాచార కౌస్తుభము అను రెండు గ్రంథములయొక్క సంస్కార ప్రకరణమున చౌలవిధి ఇట్లు నిర్వచింప బడినది.

"తృతీయవర్షే చౌలం తదంగత్వేనోదగయన పూర్వపక్షే పుణ్యాహేషు ప్రాగాప్తినాదహ్నః స్వస్తివాచనం మాహేశ్వరారాధనం కుర్యాత్॥ జాతం కుమారమాయుష్యాభివృద్ధ్యర్థం చౌలకర్మణా సంస్కరిష్యే ఇతి సంకల్ప్య అథ నాపిత మనుశాస్తి॥ శివోష్ణాభిః సురభీకృతాభిరద్భిః అవసించ్య కుశలీ కుర్వితి॥ త్రిశిఖః పంచశిఖః ఏకశిఖః పురశ్చూడో వా యథాచారం భవతీతి కులధర్మ ఇతి విజ్ఞాయతే" (దీనికి తెలుగు=మూడవ సంవత్సరమున చూడాకరణ సంస్కారమును జేయ నెంచి తదంగముగ ఉత్తరాయణ శుక్లపక్షపు శుభదినములందు పూర్వాహ్ణమున స్వస్తివాచనమును మాహేశ్వరారాధనను జేయవలెను. ఆయుష్యాభివృద్ధికై బాలకుని చౌలకర్మతో సంస్కరించు చున్నానని భావించి తర్వాత మంగలివానిని "సువాసనగల పరిశుద్ధములైన ఉదకములచేత దడిపి భద్రాకరణమును క్షౌరమును జేయు" మని యాజ్ఞాపించవలెను. బాలకునికి మూడుగాని ఐదుగాని ఒకటిగాని ముందుగాని శిఖలను యథాచారముగా కులధర్మము ననుసరించి పెట్టవలెనని తెలియుచున్నది.)

ఇట కొంత చర్చకలదు. ధర్మశాస్త్రసంప్రదాయము తెలియనివారికి కొన్ని సందేహములు కలుగుట సహజము. శిష్టాచారము ననుసరించి బాలకునకు మూడవ వత్సరమున ఒకటి మూడు ఐదు శిఖలలో నెద్దానినైనను పెట్టవలె ననుట విధిగా తెలిసినది. తలను బోడిగా గొరిగించకూడదు. ఈ చౌలముననే చూడాకర్ణము అనగా జుట్టుపెట్టుట యను మరొక పేరుకలదు. దీనివలనకూడ శిఖ యుంచవలయు ననుట సిద్ధాంతము. పుట్టు వెంట్రుక లన్నియు దీయవలసియుండును కావున సంపూర్ణముగ క్షౌరము జేయదగుననియును ఇది ముండన మనియును కొందరు వివాదము

చేయవచ్చును కాని అది సరికాదు. శిఖాస్థానమున వెండ్రుకలను వదలి చుట్టు క్షౌరముజేసినను ముండనమే యనిపించుకొనును. కావలసినచో మధ్యమున కేశముల పొడవును కొంచెము తక్కువగా కత్తిరించి చుట్టు వపనము జేయించవచ్చును. మఱియు యథాచారముగా క్షౌరము జేయించుకొనవలెనని యుండుటచేత ఇష్టము వచ్చినట్లు జేయనగునుగాని శిఖ పెట్టవలెనని లేదుకదా యని మఱికొందరు సందేహింపవచ్చును. ఇదియును యుక్తివిరుద్ధము. యథాచారమనగా ఇక్కడ చెప్ప బడిన నాల్గు వికల్పవిధులలో దేనినైన యవలంబింపవలె నను నర్థమునే గ్రహింప వలెను గాని ఇష్టమువచ్చినతీరున అని యర్థముకాదు. ఇష్టప్రకారము జేసికొనుటకు శాస్త్రప్రమాణ మక్కరలేదు. మూడు శిఖలుగాని ఐదు శిఖలుగాని ఒక శిఖగాని ముందువైపుశిఖగాని తమ కుల సంప్రదాయానుసారముగా నొకటిని ధరింపవలెనని దీని నిక్కమైన యర్థము. అంతియకాని రెండు శిఖలనుగాని నాల్గు శిఖలనుగాని బోడితలనుగాని ఉంచుకొనగూడదు. "ఎనిమిదవ గర్భమందుగాని ఎనిమిదవ సంవత్సరమందుగాని శివదీక్షను తమ సంప్రదాయానుసారముగా నొసర్చవలెను" అను దీక్షావిధికూడ రెండువిధములైన వికల్పములు కలిగియున్నది. సంప్రదాయానుసారము అనుమాట ఈరెండింటిలో దేనినైన అను నర్థము నిచ్చునేకాని ఇష్టమువచ్చినపుడు అను విపరీత భావమును బోధింపజాలదు. ఇటులే చౌల విధియందును వికల్ప విధానముయొక్క సమన్వయము లెరుంగునది. ఈ మూడు ఐదు శిఖలైనను బాల్యము నందేకాని శివదీక్షయైన పిమ్మట ఏక శిఖ నుంచుకొనుట సర్వసంప్రదాయ సిద్ధము.

ఇట్టి శిఖాధారణము వైదికులగు స్మార్తులకును వైష్ణవులకును జెప్పబడినది కావున చౌలవిధికి వీరశైవులు మాత్రమే భిన్నార్థము చేయనక్కరలేదు. ఈ విధులన్నియు నొకే తీరుగా నున్నవి కావున విశేషముగ భిన్నభిన్న మతముల జెప్ప వీలుకాదు. ఒకవేళ చూడాకరణములో నట్టి సంపూర్ణక్షౌరమే విహితమగుచో స్మార్తవైష్ణవులలోను ముండనాచారము స్థిరము గావలసియుండెను. వైదికులలో నెక్కడను కేవల ముండనము తగదు. కావున వీరశైవులలోను శిష్టాచారముగ శిఖాధారణము సుప్రసిద్ధమయియే యున్నది.

పైనుదహరించిన దొక చిన్న శాస్త్రార్థము. ఈ విషయమింతమాత్రముననే విద్వాంసులకు స్పష్టము కాగలదు. కాని సామాన్యుల కొరకును వీరశైవవాఙ్మయము నుండి ప్రమాణము లుద్ధరించుట యావశ్యకమై యున్నది.

వీరాగమములో—

శ్లో॥ శిఖా సూత్రం జటా భస్మ దండాధారా కమండలుః
ఆసనం ధ్యానభవన మేవం జంగమలక్షణం॥ పటల ౯-౯॥

శిఖాయాం ధారయే న్నిత్యం తస్య పుణ్యాఫలం శృణు॥ వ. ౧౪-౩౦॥
అంగహీనం చాధికాంగం కేశహీనం తథైవచ
అర్చనాది క్రియాకాలే దీక్షితో నైవ దర్శయేత్॥ పటల ౨౫-౩౪॥

మున్నగు శ్లోకములలో శిఖ జంగమ లక్షణమనియు, శిఖలో రుద్రాక్షను ధరించుట పుణ్యప్రదమనియును, దీక్షా కాలమున కేశములు లేని వానిని (సంపూర్ణముగా తల గొరిగించుకొన్న వానిని) చూడగూడదనియును సుస్పష్టముగా జెప్పబడినది.

పారమేశ్వరాగమమునందు—వీరశైవబ్రాహ్మణులు శిఖాసూత్ర లింగభస్మ రుద్రాక్షలుగలవారై బ్రహ్మకర్మ నాశ్రయించువారని నిశ్చయింపబడినది.

శ్లో॥ బ్రాహ్మణా వీరశైవస్థాః శిఖా యజ్ఞోపవీతినః।
లింగరుద్రాక్షభస్మాంకా బ్రహ్మకర్మసమాశ్రితాః॥ వ. ౧౭-౬॥ యజుర్వేద శ్రీరుద్రమునందు గల "నమో హరికేశాయోపవీతినే" "విశిఖాసః కపర్దినః" అను మంత్రములతో రుద్రునకు శిఖగలదనియును రుద్రులు వివిధశిఖలు గల్గియుండిరనియును జెప్పబడినది. ఇక్కడ 'విశిఖాసః'కు శిఖలేనివాడు అను నర్థముజెప్పచో "విశిఖాః" అగునుగాని సకారాంత శబ్దము కానేరదు. వైదికవ్యాకరణమును భట్టభాస్కరభాష్యమును వివిధశిఖలుగలవారనియే బోధించుచున్నవి.

రుద్రాక్షజాబాలోపనిషత్తునందు—

శిఖాయా మేకరుద్రాక్షం త్రిశతం శిరసావహేత్॥ ౧-౧౫॥
(శిఖయందొక రుద్రాక్షను శిరమునందు మూడునూర్లను ధరింపవలెను)

శివపురాణ వాయవీయసంహితలో—

శౌచం శిఖోపవీతం చ ఉష్ణీషం చో త్తరీయకం (ఉ. ౧౨-౨౬)
(శిఖాసూత్రములు తలపాగ ఉత్తరీయములను ధరింపవలెను.)

లింగపురాణమునందు—

......శిఖాయుక్తః కుమారః శ్వేతలోహితః॥ అ. ౧౧॥
(తెల్లనెర్రనైన బాలకుడు శిఖాయుక్తుడై బ్రహ్మచే గనుగొనబడెను.)

శ్రీకరభాష్య ప్రథమసూత్రవ్యాఖ్యానములో—

భస్మరుద్రాక్షాదివచ్ఛివస్యైవ శిఖాసూత్రశ్రవణాత్ శివలాంఛనమితి సిద్ధం
(శిఖ శివలాంఛనము కావున భస్మరుద్రాక్షలవలెనే ధరింపవలె ననుట సిద్ధము.)

శ్రీకరభాష్యము ఏకోరామ జగద్గురువు వర్ణనలో శిఖకలదు.
"శ్రీమద్దండ శిఖోపవీత విలసత్కంథాజినాలంకృతః"

సిద్ధాంత శిఖామణిలో—

శిఖాయామేక మేకాస్యం రుద్రాక్షం ధారయేద్బుధః॥ (పరి ౭-౧౦)

(వీరశైవుడు శిఖలో రుద్రాక్షను ధరింపవలెను)

క్రియాసారములో

ఉష్ణీషీ కంచుకీ నగ్నో ముక్తకేశో మలావృతః

అపవిత్రకరోఽశుద్ధో విలపన్న జపేత్ క్వచిత్॥ ౧౨-౨౧౮

(వీరశైవుడు జపము చేయునపుడు తలపాగను కవచమును ధరించుటకాని నగ్నుడుగా జుట్టుముడి విడిచినవాడుగాని అపరిశుభ్రుడుగాని విలపించువాడుగాని కాగూడదని నిషేధింపబడినది.)

వేదాంతసార వీరశైవ చింతామణిలో (ఉ. ౧౨)

బ్రహ్మచారి వనస్థానాం జంగమానాంచ పార్వతి

పాశుపత్యాశ్రమాణాంచ యతీనాంచ మహావ్రతే॥ ౩౯

ఏతేషా మనిశం దేవి జటా త్వేవ ప్రశస్యతే

వ్రతాంతే తు పునస్సమ్యక్ శిఖీభవతి స గృహీ॥ ౯౭

(వీరశైవ జంగములు బ్రహ్మచారి వానప్రస్థయత్యాశ్రమస్థులైనపుడు జట (తలనిండ వెంట్రుకలు) యే ప్రశస్తము. గృహస్థాశ్రమములో చేరునపుడుగాని పాశుపతవ్రతాదుల సమాప్తియందుగాని శిరస్సునందలి చుట్టుగల భాగమును గొరిగించి మధ్యన చక్కగా జుట్టునుంచవలెను.)

"నిరాభార వీరశైవో బహిశ్శిఖాం పరిత్యజ్య॥ ప్ర. ౮

(వీరశైవ సన్యాసి జుట్టును తీసివేయవలెను.)

వీరశైవధర్మశిరోమణిలో—

ప్రక్షాల్య చరణౌ హస్తౌ సపవిత్రకరద్వయః

శ్వేతవస్త్రః సోపవీతః సుసంయత శిఖండకః॥

(శివపూజాకాలమునందు వీరశైవుడు శుచిర్భూతుడై తెల్లని వస్త్రముల ధరించి జుట్టును ముడివేసికొని యుండవలెను.)

వీరశైవ సదాచార సంగ్రహమున—

శిఖాసూత్ర జటాభస్మ శివలాంఛన లాంఛితః॥

(శివలాంఛనములగు శిఖనుగాని జటనుగాని కల్గియుండి భస్మాదులను వీరశైవుడు ధరింపవలెను.)

వీరశైవ దీక్షావిధిలో—

" బద్ధశిఖం కుమారం స్వదక్షిణభాగే సముపవేశ్య తన్ముఖం సమ్యగీక్ష్య" (జుట్టు ముడివేసుకొనిన బాలకుని తన కుడిప్రక్కన కూర్చొనజేసి వాని మొగమును సరిగా జూచి) "తిష్ఠ దేవి శిఖాబంధే చాముండే హ్యపరాజితే" (విజయశాలినియగు ఓ చాముండేశ్వరీ! నా జుట్టుముడియందు నివసించుము)

వీరశైవ సదాచార సంగ్రహములో

"సింహాసనాధిపతిభిః శిఖాముద్రాది సంయుతైః
పంచముద్రాన్వితో భూత్వా గురుః పట్టాభిషేచయేత్. ౧౪-౧౬

(శిఖాది పంచముద్రలుగల పీఠాధిపతులతో కూడుకొని గురువు శిష్యునకు పట్టాభిషేక మొనర్చవలెను.)

ఈ విధముగ శతసహస్ర ప్రమాణములను వీరశైవ వాఙ్మయమునుండి చూపించవచ్చును. వీరశైవాచార్యులును గృహస్థులును నిరాతంకముగ తమ శిరస్సు మధ్యమున గోష్పాదమంత జుట్టును తప్పక ధరించి తీరవలెను. కొందరు సగము పండితులును ప్రచ్ఛన్న బౌద్ధులును వీరశైవమతమున జేరి జుట్టు ఉండకూడ దను దురాచారమును బోధించు చుందురు, అది వారి మూర్ఖతయే కాని వేరొండు కాదు. మరికొందరు శిఖాశబ్దమునకు విపరీతార్థములను చేసి కొన్ని యబద్ధపు శ్లోకములను వీరశైవాచార ప్రదీపిక (తెలుగు) లో జేర్చిరి. అది నిజమని యింక కొందరు మోసపోవుటయు జరిగినది. ఇది కేవలము అశాస్త్రీయమైన మార్గము. నే నీ విషయమున శాస్త్రవాదము నొనర్చి యనేకచోట్ల సిద్ధాంత మొనర్చినాడను. సందేహముగల వారు గాని విమర్శకులు గాని నిర్భయముగా తమ సూచనలను పంపినచో ఈ పత్రిక ద్వారా సదుత్తరము లీయబడును. శిఖాసిద్ధాంతమున ఏ మాత్రమైనను సందేహము లేదు. సమస్త వీరశైవులును అవశ్యముగా ఈ సత్యమును గుర్తించి సత్యమార్గమును తప్పక అనుసరింపవలెను.






**గీతాసూత్రనవతి:**—కర్త, జమ్మలమడక మాధవ రామశర్మగారు, ఉపాధ్యక్షు సంస్కృతకళాశాల, తెనాలి; పుటలు, 100, 0-4-0 లు పంపినచో పుస్తకమును బడయగలరు. అచ్చు మంచిది.

విజ్ఞాన వివేకములకు భగవద్గీత భాండాగారమను విషయమును గూర్చి అన్యులకు జెప్ప నక్కరలేదు. దానిని వివిధపద్ధతులతో ప్రచారము చేయవలసి యున్నది. ఆంధ్రదేశమున నింకను తగినంత ప్రచారము గావలసియున్నది. పండితులు శ్రీ మాధవరామ శర్మగారు గీతలోని ముఖ్యము లగు తొంబది సూత్రములను సంగ్రహించి తెలుగులో చక్కని వివరణమును విరచించి ప్రకటించినారు. కొన్నిచోటులలో గల స్వానుభవ విశేషముల వలన శర్మగారి సాధువృత్తి, ఆధ్యాత్మిక ప్రతిభ గోచరించుచున్నది. గీతా హృదయము తెలియ గోరువారి కిది యవశ్య పఠనీయము. హిందువు లందరు ఆదరింప దగిన పొత్తము. పునర్ముద్రణమున సూత్రములకు కేవలము ఆంధ్రానువాదమును ప్రత్యేకముగ దెలిపి వివరణమును ప్రకటింప గోరుచున్నాము.

**తోరణము:**—కవి, మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు, ముద్దుపైన ముద్రణము, కమనీయమైన కాగితములు. పుటలు ౪౦, వెలగాని, నెలవు గాని పొత్తము పై తెలుప బడలేదు. బహుశః, పల్లిపాలెం వయా కాకినాడలో దొరకవచ్చును.

యువకవులగు శ్రీ శాస్త్రిగారి పరిమార్జిత స్వభావమును దెలిసికొనుట కీ చిన్నిపొత్తము దర్పణమువలె నున్నది. కవితలో సుకుమారమైన భావుకత, ప్రతిభ కనుబడుచున్నది. పితృశిక్షమున్నగు వానిలోని విషయము వ్యక్తిగతమైనను విజ్ఞానప్రదమై సుబోధముగ నున్నది. ఆంధ్రసేవాసముజ్జ్వలు లగు శాస్త్రిగారు తెలుగు తల్లికి సౌభాగ్యసూచకములగు మంజుల ప్రబంధమంజీరముల నర్పింతురుగాక.

**పుష్పసేన విజయము:**—అనువాదకులు; మఠం. సిద్ధివీరయ్యగారు, ఉపాధ్యాయులు, డాకూరు పోస్టు, జోగిపేట జి. మెదకు, నిజాం, పుటలు ౭౦ అచ్చు కాగితములు మంచివి; వెల 0-8-0.

ఇది మరాఠీనుండి తెనుగింపబడిన చక్కని నవల. ఇందలి ఆంధ్రభాషాశైలి మనోహరమై, సులభమై లోకోక్తులతో నిమిడి యున్నది. కథ యద్భుతమైన ఘట్టములతో నున్నది. రసికు లిద్దానిని పఠింపక తీరరు. నిజాం రాష్ట్ర వీరశైవులలో వీరు ప్రథమ నవలాకర్తలు, భాషాసేవకులు, మాధ్యమిక పాఠశాలలలో పాఠ్యపుస్తకముగా జేయదగియున్న యీ పొత్తమును అధికారులు గమనించి నిజాం రాష్ట్రాంధ్ర భాషాసేవకుల బ్రోత్సహింతురుగాక!

**అణాగ్రంథమాల ప్రచురములు:**—ప్రకాశకులు; కేర్గా తూప్ బజారు, హైదరాబాద్, దక్కన్, పుటలు 32 వెల 0-1-0 అచ్చు కాగితములు సాధారణము.

మన దేశమందలి బీదరైతుల కుపయోగించునట్లు చౌకవెలలో పుస్తకములను ప్రకటించి లోకజ్ఞానము గలిగింపవలసి యున్నది. ఇట్టి యుద్దేశ్యముతో పొత్తముల నందించువారి సేవాభిలాష ప్రశస్తమైనది. ఆంధ్రవీరులు, అణా కథలు అను రెండు చిన్న పుస్తకములు ప్రస్తుతము విమర్శా విషయములు. శ్రీ సి. రంగాచార్యులవారు, ... శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారి అన

వేమ భూపాలుఁడు, శ్రీ కురుగంటి సీతారామయ్యగారి తంజావూరు రఘునాథరాయలు, అను మూడు చరిత్రలు మొదటి పుస్తకమున గలవు. సుప్రసిద్ధులైన గ్రంథకర్తలు. వీరవర్యుల గాథలను సంక్షిప్తముగ నివేదించి ఆంధ్రభారతి నారాధించినారు. ఒక్కొక కథ నొక్కొక పుస్తకమున గొంత విపులముగ నైనను నిరూపించుట పరమావశ్యక మని మా తలంపు. అణా కథల పుస్తకములోని "మనమే గయ్యము, 'దేశమాత శిక్ష' "భారం" అను(కథలుకావు) వ్యాసములు కలవు. రైతులను ప్రబోధించు ప్రయత్నము శ్లాఘ్యము. ఫేస్ పౌడరు కథమాత్రము కృత్రిమముగా నున్నది. విభూతికి ఫేస్ పౌడరు నామము కల్పించుటయు శంకరయ్యయొక్క ఫ్యాక్టరిలోనుండి కృష్ణయ్య ఫేసు పౌడరును దొంగిలించి సత్యమ్మకు తెచ్చి యిచ్చుట మున్నగు నంశములు కేవల పరిహాసాస్పదములు. మనోరంజనకే సామగ్రి కావలయు నన్నచో జగత్తునందలి విచిత్రములవైపు తమ బుద్ధిని మరల్చవలెను.

**నగజా శతకము:**—కవయిత్రి చుక్కకోటి వీరభద్రమ్మగారు, వల్లూరుపాలెము-పోస్టు తోట్లవల్లూరు, బెజవాడ తాలూకా. వెల 0-1-0 అచ్చు కాగితములు మంచివి.

సరళమైన భాషలో నీతి, సదాచార, మత సేవలను నిరూపించు నీ శతకమును తన మేనకోడలగు నగజను సంబోధించుచు కవయిత్రిగారు రచించినారు. ప్రయత్నము ప్రశంసాపాత్రము. మాకు దెలిసినంతవరకు ఆధుని కాంధ్ర వీరశైవులలో శతకమును రచించిన మహిళ ఈ యమయే ప్రథమగణ్యయని యభినందించు చున్నాము.

**పద్మశాలి:**—సంపాదకులు; బూర్గుల రామకృష్ణయ్యగారు, సాఖర్ పేట, సోలాపూర్ పుటలు 40. 'విభూతి' సైజు. అచ్చు కాగితములు సామాన్యము. చందా 2-0-0.

ఈ మాసపత్రిక 17 సంవత్సరముల క్రితము బుట్టి మధ్య మధ్య నంతర్ధాన మందుచు గత మాసమున మరల గట్టిగా బ్రతుకదలచి తెలుగు మరాఠి భాషలలో ప్రకటింపబడుచున్నది. సాలె లేక సాలీలు అను వ్యవహారముగల పద్మశాలీయుల సంఘము నభివృద్ధి జేయుటకొఱకై యీపత్రిక ప్రయత్నించుచున్నది. స్వజాతికి జెందని సారస్వత వ్యాసములును కలవు. తెలుగుకంటె మరాఠీ సంపాదన పద్ధతి కొంత బాగుగ నున్నది. సోలాపురము తెలుగు ప్రాంతము కాకపోయినను పద్మశాలీయుల సంఖ్యా బలము వలన దీనికి పోషణ యేర్పడవలసి యున్నది. ఏతజ్జాతీయు లందరును ప్రయత్నించి తమ ఏకైకమగు నీ పత్రికను మార్కండేయునివలె చిరస్థాయిని గావించుకొందురు గాక!

**సంస్థాన సమస్యలు:**—కర్త; డా. భో. పట్టాభిసీతారామయ్యగారు. అనువాదకులు జానపాటి సత్యనారాయణగారు-పుటలు ౬౫ వెల 0-6-0 దేశోద్ధారక గ్రంథమాల. ఇమాంబాడా సికింద్రాబాదులో దొరకును.

మన భారతదేశము "బ్రిటీషురాజ్యము, సంస్థానములు" అను రెండు భాగములతో ప్రత్యేకింపబడి యున్నది. విద్యాబుద్ధి సంపన్నులగు బ్రిటిషు ప్రభుత్వమునే మన నాయకులు విమర్శించి దోషముల ప్రదర్శించుచుండ సంస్థానముల (స్టేటులు-రియాసతులు) సంగతి చెప్ప నవసరముండదు. సంస్థానములలో ప్రజల సౌకర్యమును గూర్చియేకాదు, తమ పరిపాలనా లాభమునుగూర్చియు వారు శ్రద్ధవహించరు. ఇక లోపములకా లెక్కలేదు. త్వరగా సక్రమమైన పరిపాలనము స్థాపింపబడకున్న ప్రజావిప్లవము శాంతింపజాలదు. ఈ విషయములను సప్రమాణముగా డా. పట్టాభిగారు నిరూపించినారు. సంస్థానములలో నివసించువారును దేశభక్తులును పఠింపదగిన గ్రంథ మిది.

**కాంగ్రెసు - సంస్థానములు:**—కర్త ప్రకాశకులు మున్నగునవి పై పుస్తకము వలెనే.

అఖిలభారత జాతీయ మహాసభ (కాంగ్రెస్) చేయుచున్న యాందోళనము లోక విఖ్యాతము. ఐనను సంస్థాన విషయమై నేటివరకు కాంగ్రెసువారు గాని, బ్రిటిషు ప్రభుత్వముగాని ప్రత్యేకమైన జోక్యము గలిగించుకొని ఒత్తిడి చేయలేదు. కాని అపుడపుడు సూచనలు మాత్రము చేయబడుచుండెను. ప్రభుత్వము, కాంగ్రెసు, సంస్థానము లనెడు త్రిపుటినిగూర్చి పరస్పర సంబంధములను బాధ్యతలను కొన్ని సంస్థానముల చరిత్రలను ఈ పొత్తము నిరూపించుచు మిక్కిలి యుక్తముగా నున్నది.

"రాజహంస"

విరుద్ధమర్థ్యారోపాది న యుక్తిస్తస్య కారణం।
మాయికత్వం పురాణేషు మోహార్థముపపద్యతే।
తస్మాదవిద్యామాయాత్వకథనం మోహనాయ వై॥
అసత్యమప్రతిష్ఠం తే జగదాహురనీశ్వరం।
అపరస్పరసంభూతం కిమన్యత్కామహేతుకం॥
సేశ్వరాద్వైతభావే తు సర్వం శివమయం జగత్।
జ్ఞానాద్వికల్పబుద్ధిస్తు లీయతే న స్వరూపతః।
భిన్నత్వం నైవ యుంజీత శివోపాదానతః క్వచిత్।
ఏవం వైదికసిద్ధాంతసేవ్యో నాన్య ఇతి శ్రుతిః॥" ఇతి,

ఏవమవిద్యామాయాప్రతిబింబితజీవేశ్వరవాదోఽపి న యుక్తః। తథా హి— అస్మత్ప్రత్యయగోచరశ్శారీరస్తు అవిద్యాప్రతిబింబితః? అంతఃకరణప్రతిబింబితో వా? అవిద్యావచ్ఛిన్నచైతన్యం? అంతఃకరణావచ్ఛిన్నచైతన్యం వా? ఈశ్వరస్తు మాయాప్రతిబింబితః? మాయావచ్ఛిన్నో వా? ఉభయోస్స్వాభావికత్వం? ఔపాధికత్వం వా? తదుపాధిస్తు మాయా? అవిద్యా? అంతఃకరణం వా? న తు స్థూలోపాధిః, పరలోకగమనానుపపత్తేః. "కార్యోపాధిరయం జీవః కారణోపాధిరీశ్వరః" ఇత్యుక్తేః తత్ప్రతిబింబపక్షోఽపి న యుక్తః। బ్రహ్మణో నిరూపత్వేన మాయాయా అసత్పదార్థత్వేన తత్ప్రతిబింబో న స్యాత్। న చ జలాకాశప్రతిబింబవత్, ఇతి వాచ్యం। "దృష్టానుసారిణీ కల్పనా" ఇతి న్యాయేన నీరూపస్యాకాశస్య ప్రతిబింబాసంభవాత్ తత్ప్రతిబింబప్రతీతిస్తు భ్రాంతిరేవ.। జలాదౌ మూర్తాత్మకసూర్యాదిప్రతిబింబదర్శనాత్। అన్యథా వాయోరపి ప్రతిబింబాపత్తేః। దర్పణరేఖావద్యత్ర యదస్తి తత్ర తత్ప్రతిబింబో నాస్తీతి నియమాత్సర్వగతస్య బ్రహ్మణస్సర్వగతమాయాయాం ప్రతిబింబః కథముపపద్యతే?

నచ — విభుపదార్థయోస్సంయోగాసంభవాత్ప్రతిబింబా

భావోఽయుక్త ఇతి వాచ్యం । సంయుక్తస్యాపి ప్రభామండలస్య …
తద్దర్శనాత్ । "గుహాం ప్రవిష్టౌ పరమే పరార్ధ్యే" (కఠ ౧-…
"గుహాం ప్రవిష్టావాత్మానౌ హి తద్దర్శనాత్" (బ్ర. సూ. ౧-౨-…
ఇత్యాదిశ్రుతిసూత్రాభ్యాం జీవేశ్వరయోరేకత్ర స్థితిర్నిర్ణీతత్వా…
బింబప్రతిబింబయోరేకత్ర నివేశాసంభవాత్తత్పక్షో న యుక్తః

కించ—మాయాఽవిద్యయోర్బ్రహ్మప్రతిబింబౌ జీవే… మాయాఽవిద్యానాశస్తయోర్మోక్షః ఖలు? తదంగీకారే జీవేశ్వ… ఏవ మోక్ష ఇతి సంపద్యతే అతః పాషండబౌద్ధమతప్రవే… హాననమపురుషార్థ ఇతి మోక్షస్యాపురుషార్థత్వమాపద్యేత జీవే… యోరలీకత్వం స్యాత్ । తథాత్వే పారలౌకికప్రయత్నం కో… కుర్యాత్ । ముముక్షుర్హి మోక్షార్థం న యతేత ఉభయస్వరూ… మిథ్యాత్వాత్ । సర్వస్య హ్యైహిక ప్రవృత్తిరేవస్యాత్ । సర్వాప్ర… ప్రవృత్తిమాత్రోచ్ఛేదః స్యాత్ । సర్వేఽపి విధినిషేధయోర్మిథ్యా… విశేషాత్ కుత్రాపి న ప్రవర్తేరన్ । తథా సతి సన్మార్గోచ్ఛే… స్యాత్ । జీవస్య ప్రతిబింబత్వేనాలీకత్వాత్, "ఐతదాత్మ్యమ్" ఇ… రభ్య "స ఆత్మా" ఇత్యంతేన తత్త్వంపదార్థం నిరూప్య "స త… మసి" ఇత్యేన వదేత్ । దర్పణప్రతిఫలితవహ్న్యాదివదర్థక్రియాకా… న సంభవత్యేవ.

కించ—"యో విజ్ఞానే తిష్ఠన్" (బృహ. ౫-౭-౨౨) ఇ… ద్యంతర్యామిబ్రాహ్మణవిరోధః । నిఖిలోపాధౌ ప్రతిబింబస్యైక… జీవైకాద్బంధమోక్షసుఖదుఃఖాదివ్యవస్థానుపపత్తేః తస్మాత్ప్రతి… పక్షోఽప్యనుపన్నః । జడాంతఃకరణావచ్ఛిన్నచైతన్యస్య జీవత్వాంగీ… ఘటపటావచ్ఛిన్నచైతన్యస్యాపి జీవత్వముపపద్యేత తస్మాదవ… పక్షోఽపి పూర్వోక్తదూషణగ్రస్తత్వాన్న యుక్తః । "ఏకధా బహు… చైవ దృశ్యతే జలచంద్రవత్" (బ్రహ్మబిందు. ౧౨) ఇతిశ్రుతిర…

శేవ పూర్వోదాహృత శ్రుతీనాం బలిష్ఠత్వాత్. "నహి దృష్టాంతే సర్వ సంభవః" ఇతిన్యాయేన బ్రహ్మణః సర్వగతత్వే దృష్టాంత ఉపలభ్యతే.

"మాయాభాసేన జీవేశౌ కరోతి" ఇతి వాక్యేన న జీవేశయోః కల్పితత్వముపపద్యతే "జ్ఞాజ్ఞౌ ద్వావజావీశనీశౌ" (శ్వే. ౧-౯) ఇత్యాది బహుశ్రుతియుక్త్యనుభవవిరోధాత్ । మం—శివం, అయతీతి మాయా, "అయ-వయ-గతౌ" ఇతి ధాతోః ప్రాప్త్యర్థకత్వాత్, "మః శంభౌ ధాతృచంద్రయోః" ఇతి నిఘంటుశ్రవణాత్, ప్రణవార్థవివరణే "అకారో బ్రహ్మా, ఉకారో విష్ణుః, మకారో రుద్రః" ఇతి శ్రుతేశ్చ । మాయా — పరశివశక్తిః, ఆభాసేన — పరమేశ్వర సమప్రకాశేన, జీవేశౌ కరోతి—ప్రకటీకరోతీత్యర్థః। అన్యథా సర్వశ్రుతి భంగప్రసంగః। పూర్వోక్తసత్యానందాదీనాం జగత్కారణత్వే న దోషః। తేషాం పరమేశ్వరస్వరూపత్వాత్తద్ధర్మత్వాచ్చ అగ్నేర్దాహి త్వోష్ణప్రకాశవత్ । తస్మాత్ప్రపంచస్య కర్తృజన్యత్వం ఘటాదివ ద్వక్తుం శక్యం।

యద్యపి జన్మాదికం జగన్నిష్ఠం వ్యధికరణత్వాన్న తద్బ్రహ్మ స్వరూపలక్షణం। తథాపి జగత్కారణత్వం పరమేశ్వరస్యైవ దేశాత్త టస్థలక్షణం స్వరూపభిన్నత్వే సతి వ్యావర్తకం తటస్థలక్షణం। యద్యప్య వ్యభిచారాజ్జగజ్జన్మాదికం ప్రత్యేకం లక్షణం సంభవతి । తథాప్యుత్పాద కత్వమాత్రం నిమిత్తే, అత ఉత్పత్తిస్థితిగ్రహణం న లయగ్రహణం। కదాచిదపి నిమిత్తకారణే న కార్యస్య లయస్సంభవతి। న చ తావ తైవోపాదానత్వలాభాదుత్పత్తిస్థితిగ్రహణం వ్యర్థమితివాచ్యం । న హ్యుపాదానత్వం సకలధర్మితయోచ్యతే। కింతు ప్రకృతివికారన్యాయే నాభేదప్రతిపత్త్యై । భవతు బ్రహ్మజగదుపాదానం, ఉత్పత్తిస్థిత్యోరన్య ఏవాధిష్ఠాతా స్యాత్, కుంభకార ఇవ కుంభోత్పత్తౌ రాజ్యవచ్చ రాజావ స్థానమితి ప్రాశంసికముత్పత్తి స్థితిగ్రహణమితి.

స్వరూపలక్షణం తు "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" (తై. ఆనం-౧) ఇతి శ్రుతిప్రతిపాదితం సత్యాదిస్వరూపత్వం । నను సత్యాదేః పరమశివస్వరూపాద్భేదేన పరమశివస్వరూపలక్షణత్వం, అఖండవాక్యార్థాసిద్ధిః గుణప్రధానభావాపన్నపదార్థసంసర్గో హి వాక్యార్థః; న చాభేదే తత్సంభవతి, ఇతిచేన్న । యత్ర పదార్థప్రత్యయః తత్ర సంయోగో వాక్యార్థః, యత్ర పదార్థప్రమితిపరః పదసంఘః తత్రాఖండపదార్థ ఏవ వాక్యప్రతిపాద్యః। యథా—"అస్మిన్ జ్యోతిర్మండలే కశ్చంద్రః" ఇతి ప్రశ్నే "ప్రకృష్టప్రకాశశ్చంద్రః" ఇతి వాక్యమఖండచంద్రస్వరూపప్రతిపత్తిపరం । న చ ప్రకృష్టప్రకాశవైశిష్ట్యం వాక్యప్రతిపాద్యం ప్రమేయం, మానాంతరసిద్ధత్వాత్ । న చంద్రత్వవైశిష్ట్యం, ఏకవ్యక్తికతయా చంద్రత్వజాతేరభావాత్ । న చంద్రశబ్దవాచ్యత్వవైశిష్ట్యం, తస్యాప్యదృష్టత్వాత్ । స్వరూపమాత్రప్రశ్నే తస్యాభిధానానౌచిత్యాత్.

వస్తుతస్తు—వాక్యానాం సర్వత్ర శ్రూయమాణపదార్థపరత్వనియమోత్పాదనాయ పదార్థమాత్రనిష్ఠత్వమపి స్వీకర్తవ్యమాపద్యేత। తచ్చ లక్షణావాచ్యం।తత్ర లోకే పదానాం విశిష్టార్థకత్వే పదార్థః సర్వోఽపి సఖండ ఏవ తథాపి న దృష్టాంతాసిద్ధిః, పదార్థమాత్రనిష్ఠత్వే వాక్యస్య దృష్టాంతత్వసంభవాత్ । ఏవం చాపి సత్యాదీని నైకబ్రహ్మపదార్థనిష్ఠాని. బ్రహ్మపదార్థశ్చ న విశిష్టః, అభేదే సహస్రాత్।

నను విశిష్టవాచకైస్సత్యాదిపదైః కథమఖండబోధః? కేవలం తల్లక్షణయేతి గృహాణ। ఉక్తంచ శివాద్వైతప్రకాశికే—"ఉపాధివైశిష్ట్యం అఖండచంద్రప్రతిపత్త్యా, తచ్చ విరోధాచ్చంద్రే న ... సత్యాదివాక్యేత్వనంతాదిపదైర్వైశిష్ట్యం బాధ్యతే" ఇతి । "నేనావనాదిలక్షణస్య నాఖండార్థకత్వమ్, నేనావనాదీనాం సముదాయ...

౧-౧-౨ రూపత్వే నాఖండార్థత్వాభావాదితి న లక్షణామాత్రస్యాఖండార్థత్వమ్' ఇతి నిరస్తం। తత్రాపి పదార్థమాత్రనిష్ఠత్వస్యావివాదాత్.

నను లక్షణయైకత్వపరత్వే సత్యాదివాక్యానామేకే నైవ తాదృగర్థబోధాత్పదాంతరవైయర్థ్యం,పర్యాయత్వప్రసంగశ్చ ఇతిచేన్న। విశిష్టశక్తానాం శక్యార్థేఽపర్యాయాణామేవ లక్షణయైకార్థపరత్వస్యార్థవాదానాం ప్రాశస్త్యపరత్వస్యేవావిరోధాత్। న చవైయర్థ్యం- వ్యావృత్తిభేదాత్। సత్యపదేనాసత్యవ్యావృత్తిః, జ్ఞానపదేన జడవ్యావృత్తిః, అనంతపదేన పరిచ్ఛిన్నవ్యావృత్తి రితి। సర్వత్ర వ్యావృత్తిభేదాత్ న పౌనరుక్త్యం.

నను కిం వ్యావృత్తయోఽపి బ్రహ్మాభిన్నా అభిన్నా వా? ఆద్యే హ్యైకశ్రుత్యనుపపత్తిః, ద్వితీయే తదేవ పదాంతరవైయర్థ్యం ఇతిచేన్న। ఏకస్మిన్ ప్రతియోగ్యనుయోగికారణవ్యాపకాదిశబ్దవదవైయర్థ్యోపపత్తేః। న హి కారణతాదికం ధర్మాంతరం। ఏవం వ్యావృత్తీనాం బ్రహ్మాభేదేఽపి ప్రతియోగిభేదాదవైయర్థ్యం। ఏతదభిప్రాయేణైవ శివాద్వైతప్రకాశకే సంగ్రహః—.

అవిశిష్టమపర్యాయా నేకశబ్దప్రకాశితం ।
ఏకం వేదాంతనిష్ణాతమఖండం ప్రతిపేదిరే॥ ఇతి,
తస్మాత్సత్యత్వాదికం స్వరూపలక్షణమితి సిద్ధం।

నను "ఆద్యస్య బ్రహ్మణః చతుర్ముఖస్య, యతో జన్మ, తద్బ్రహ్మ" ఇతిచేన్న । శ్రుతియుక్త్యనుభవవిరోధాత్ । చతుర్ముఖస్యాద్యత్వం నామ సర్వకార్యాపేక్షయా? చేతనాపేక్షయా వా? నాద్యః— "ఆత్మన ఆకాశస్సంభూతః" (తై. ఆనం ౧) ఇతి భూతసృష్టేః ప్రథమమభిధానాత్ । న చ హిరణ్యగర్భజననాంతరమేవ భూతసృష్టిరితి వాచ్యం। సమష్టిలింగశరీరాభిమానినో హిరణ్యగర్భస్య భూతసృష్ట్యనంతరం జననావశ్యకత్వేన తతః పూర్వముత్పత్త్యసంభవాత్ ।

తథాపి జనకత్వేఽస్య జ్ఞేయబ్రహ్మలక్షణత్వాసిద్ధేః రామస్య కృష్ణస్యే-
చతుర్ముఖస్యైవ జనకాపేక్షయా ఉత్కృష్టతాపత్తేశ్చ. విష్ణోరేవ హిర-
గర్భోత్పత్తిరితి వినిగమకాభావాత్.

"యో దేవానాం ప్రథమం పురస్తాద్విశ్వాధికో రు[ద్రో]
మహర్షిః। హిరణ్యగర్భం పశ్యత జాయమానం స నో దేవః శుభ[యా]
స్మృత్యా సంయునక్తు॥" (మహానా. అను. ౧౦) అస్యార్థః - మహ[ర్షిః] -
వేదకర్తా యః - సర్వజ్ఞత్వాదినా, విశ్వస్మాత్ - చిదచిత్ప్రపంచా[త్]
అధికో రుద్రః - పరమశ్శివః, సర్వేషాం దేవానామింద్రాదీ[నాం]
ప్రథమం హిరణ్యగర్భం - చతుర్ముఖం, స్వసంకల్పేన ప్రకృతి[రూప]-
త్మనా జాయమానం, సకలవేదోపదేశార్థమనుగ్రహదృష్ట్యా పశ్యత్, [సః]
శివః, నః - అస్మానపి, శుభయా - సంసారపాశమోచికయా [సు]-
నందస్వరూపయా వేదవేదాంతాగమసిద్ధయా, స్మృత్యా—దీక్షయా
సంయునక్తు—సంయోజయత్వితి తాత్పర్యం।

"యో దేవానాం ప్రభవశ్చోద్భవశ్చ విశ్వాధికో రు[ద్రో]
మహర్షిః। హిరణ్యగర్భం జనయామాస పూర్వం స నో బుద్ధ్యా
శుభయా సంయునక్తు॥" శ్వే. 3-౪ ఇత్యాదినా మహేశ్వరోత్పన్న-
హిరణ్యగర్భస్యావగమ్యతే, తస్మాత్తదర్థో న విధీయతే.

నను "ఏకో హ వై నారాయణ ఆసీత్, న బ్రహ్మా నేశా-
నాపో నాగ్నీషోమౌ నేమే ద్యావాపృథివీ" (మహా. ౧-౧)
మహోపనిషది నారాయణస్యైవ సర్వాతిశాయిత్వస్య సృష్టేః ప్రా-
సత్తాయా దర్శనాత్, "నారాయణాద్బ్రహ్మా జాయతే నారాయణా-
ద్రుద్రో జాయతే" (నారాయణ ౧-౧) ఇత్యాదినా సర్వకారణత్వ-
నాత్, "అథ కస్మాదుచ్యతే బ్రహ్మా బృహంతో హ్యస్మిన్ గుణాః"
ఇత్యాదినా తస్యైవ పూర్ణగుణత్వావగమాత్, "తదేవ బ్రహ్మా ప్రథమం
కవీనాం" (మహానా. అను. ౧) "అంతస్సముద్రే మనసా చరంతం"

(తై. ఆర. ౩-౧౧) ఇత్యాదినా సముద్రశాయిత్వాదిధర్మాణాం విద్వద్భిర్ధ్యాతస్యైవ ముఖ్యత్వాత్, "న సన్న చాసచ్ఛివ ఏవ కేవలః" (శ్వే-౪-౧౮) "బ్రహ్మవిష్ణురుద్రేంద్రాస్తే సంప్రసూయంతే" (అథర్వశిఖా.౧) "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్" (ఛాం.౬-౪-౧) ఇత్యాదివాక్యానాం ఛాగపశున్యాయేన సామాన్యవిశేషయోరేకత్వసిద్ధివత్తత్పరత్వస్యైవ యుక్తత్వాత్, "గచ్ఛతీతి గౌః" ఇతి వ్యుత్పత్త్యా నానార్థబోధకత్వేఽపి గవి రూఢివద్ బ్రహ్మశబ్దస్యాపి చతుర్ముఖబ్రహ్మప్రణవబ్రాహ్మణాదిషు ప్రవృత్తత్వేఽపి అనంతకల్యాణగుణవిశిష్టే నారాయణ ఏవ యోగరూఢత్వాచ్చ జగజ్జన్మాదికారణత్వం తస్యైవ సముచితం—ఇతిచేద్భ్రమః.

విష్ణోర్జగత్కారణత్వేఽపి న తద్బ్రహ్మలక్షణం, సూక్ష్మసృష్ట్యనంతరభావిదేవాదిసృష్టేః పూర్వం తజ్జన్మశ్రవణాత్। విష్ణోరుత్పత్తిః ఋగ్వేదే శ్రూయతే "విభురిత్థా పరమమస్య విద్వాన్ జాతో బృహన్నభిపాతి తృతీయం" (ఋగ్వేద. ౬-౫-౨౯) ఇతి. అస్యార్థః- అస్య-మహేశ్వరస్య, ఇత్థా-ఇత్థంభావేన, విద్వాన్-వేత్తా, బృహన్ విష్ణుః - ఆదివిష్ణుః, జాతస్సన్ తృతీయం - కైలాసం, అభిపాతి - రక్షతి। బృహచ్ఛబ్దేన ఆదివిష్ణురేవ వ్యపదిశ్యతే। "నమో విష్ణవే బృహతే కరోమి" (తై. ఆర. ౧-౧౨) "బృహత్తే విష్ణో సుమతిం భజామహే" (తై. బ్రా. ౨-౪-౩) ఇత్యాదిషు దర్శనాత్, అజాతపరమేశ్వరమేవముపస్థితం పరిత్యజ్య అనుపస్థితకల్పనే మానాభావాత్, "అజాత ఇత్యేవం కశ్చిద్భీరుః ప్రతిపద్యతే। రుద్ర యత్తే దక్షిణం ముఖం తేన మాం పాహి నిత్యం" (శ్వే. ౪-౨౧) ఇతి శ్వేతాశ్వతరోపనిషది. మహేశ్వరస్యైవాజాతత్వశ్రవణాచ్చ శంభోరాదివిష్ణుజనకత్వం యుక్తమేవ। ఋగ్వేదే "సోమః పవతే జనితా మతీనాం జనితా దివో జనితా పృథివ్యాః జనితాఽగ్నేర్జనితా సూర్యస్య జని

తేంద్రస్య జనితోత విష్ణోః" (ఋగ్వేద ౭-౪-౬) ఇతి "ధ్యాయీ
శానం ప్రధ్యాయితవ్యం సర్వమిదం బ్రహ్మవిష్ణురుద్రేంద్రాః ప్ర
సూయంతే" (అథర్వశిఖా - 3) ఇత్యాదిషు శివస్యైవ సర్వకారణ
శ్రూయతే "శివ ఏవ కేవలః" (శ్వే. ౪-౧౮) ఇతి వాక్యస్య మ
సృష్టిపరత్వం "నారాయణాద్బ్రహ్మా జాయతే" (నారా - ౧)
వాక్యస్యావాంతర సృష్టిపరత్వమితి తదుక్తం వాయవీయసం
తాయాం.

త్రయస్తే కారణాత్మానో జాతాస్సాక్షాన్మహేశ్వరాత్
చరాచరస్య విశ్వస్య సర్గస్థిత్యంతహేతవః॥
పిత్రా నియమితాః పూర్వం త్రయోఽపి త్రిషు కర్మ
బ్రహ్మా సర్గే హరిస్త్రాణే రుద్రస్సంహరణే పునః
తథాప్యన్యోన్యమాత్సర్యాదన్యోన్యాతిశయార్థినః।
తపసా తోషయిత్వా స్వం పితరం చంద్రశేఖరం।
లబ్ధ్వా సర్వాత్మతా తస్య ప్రసాదాత్పరమేష్ఠినః॥
బ్రహ్మనారాయణౌ పూర్వం రుద్రః కల్పాంతరేఽసృజ
కల్పాంతరే పునర్బ్రహ్మా రుద్రవిష్ణూ జగన్మయః।
విష్ణుశ్చ భగవాన్ రుద్రం బ్రహ్మాణమసృజత్పునః।
నారాయణం పునర్బ్రహ్మా బ్రహ్మాణం చ పునర్భవః ఇతి
(శి. వా. సం. పూ. భా. ౧

"స బ్రహ్మా స శివస్సేంద్రస్సోఽక్షరః పరమః స్వ
(మహానా. అను. ౧౦) ఇత్యాదిశ్రుతిశతేన మూర్తిత్రయ
స్యైవ బ్రహ్మత్వోపదేశాత్, నారాయణాద్యుపనిషత్సు మూ
యాతీతత్వేన నారాయణస్య వ్యపదేశాభావాత్, "ప్రపంచో
శాంతం శివమద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః
ద్వైతః" (మాం. ౧-౭) "ధ్యాయీతేశానం ప్రధ్యా



స చి త్ర మా స ప త్రి క

పుండ్రము ౨ | శా. శ. ౧౮౬౨ విక్రమ సంవత్సర జ్యేష్ఠమాసము | రేఖ ౪
Vol. 2 | 22 జూన్ 1940 సికింద్రాబాద్ | No. 4

# ప్రేమాంజలి

సా. వెం. నరసింహము, ఎం. ఏ.
(మద్రాసు & కలకత్తా) రాజమహేంద్రి.

* వికసితామ్లాన సద్గుణ ప్రకర పుష్ప
ములను నిన్ బూజ సేసెడు మునులె ఘనులు;
సత్తపోధూపమును భవత్సేదనమునను
జేరి యర్పించువారె సుధీర మతులు.

ప్రేమమోదాశ్రువుల పాద పీఠిఁగడుగ
గలుగు పుణ్యుల కీర్తి యఖండ మరయ;
దేహము మనంబు సర్వమున్ దివిరి నీదు
సేవల కొసంగు ధన్యులె సిద్ధజనులు.

నిన్ సమర్పింపఁ దగినట్టి స్నిగ్ధసుమము
లేమి నా యందు వికసింప వేమి సేతు!
నీ పవిత్రాంగణంబందు నిత్యధూప
మిడఁగఁ దగినట్టి సామగ్రి యేది; యిచట ?

* శ్రీ జ్ఞానానంద స్వామివారి యాంగ్లకృతి కనువాదము.

కఠిన పాషాణ మగు నెద గట్టిగాను
పిడిచినను జారదొక్క ప్రేమ బిందు వేని
నీ పదంబులఁ గడుగగ నోపు దెట్లు ?

కూ్రర మరుదేశమైన భాండారమందు
వస్తువే లేదు నీకు నర్పణము సేయ
స్వార్థ పరతయు మోహమ్ముఁ స్వల్ప వస్తు
కామమును, నీవొసంగిన ధామమందుఁ
జొచ్చి నన్నిటు లధమమౌ చోటి కీడ్చె.

ఇదియె నాగొప్ప, లుబ్ధుఁడ హీన జడుఁడ
నగుచు దుఃఖములను మున్గ నయ్యె నకట !
మత్ప్రభూ ! చాలు నీ శిక్ష, మఱియు నిటుల
దుఃఖఫలములఁ దినఁగ నాతురత లేదు !

దంభముల వీడి నా హృది దైవచింత
నిర్మలం బయి పరితృప్తి నెగడుగాక !
అన్నిట విరక్తి నీయందు నధిక భక్తి
నాదు హస్తద్వయంబుగా, మోదమునను
నిన్ను కౌగిటఁ బట్టుదు నిఖిల వంద్య
స్వాదు సుపవిత్రిభ ! ప్రభూ ! సారమహిత !

[డాన్యూబు నదియొడ్డున రచించినది.
వియన్నా, ఆస్ట్రియా: 6-6-1927 సోమవారము]



# పండితారాధ్య చరిత్రము

### ఆంధ్ర కర్ణాటక శివ తత్త్వ సారములు

### శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారు

శ్రీ మల్లికార్జున పండితారాధ్యుఁడు ఆంధ్ర శైవాచార్యులలో పండితత్రయ మని యెన్నికగన్న శ్రీపతి, మంచెన, మల్లికార్జున పండితులలో మూఁడవవాఁడు.

### జన్మాదికము

గోదావరీ మండల మందలి దాక్షారామ మీయన జన్మస్థలము. ఆ యూర వెలసి యుండు భీమేశ్వరస్వామివారి కీతని వంశము వారు పురోహితు లని సోమనాథుఁడు చెప్పినాఁడు. అర్చకులు, ఒండె స్థానపతులు కాఁ దగుదురు. శివతత్త్వ సారమునుబట్టి చూడ్కగా నర్చకులే యగుదు రని తోఁచును. ఆ నాఁడు కర్ణాటాంధ్ర దేశము లందుఁ బేరెన్నికగన్న వాణసవంశమున నీతఁడు జన్మించెను. చాళుక్య రాజులకు మంత్రులు, ఆస్థానకవులు నయి వన్నెకెక్కినవారు వాణసవంశమువారు. శాసనములలోఁ బలు చోట్ల తద్వంశ ప్రశంస యుండును. ఆంధ్రభారతకర్త యగు నన్నియభట్టారకుని సహాధ్యాయుఁడు నారాయణభట్టు వాణసవంశమువాఁడు. మడికి సింగన పాద్మోత్తర ఖండకృతికిఁ బతి కందనామాత్యుఁడు వాణసవంశమువాఁడు.

తే. కశ్యపబ్రహ్మ యన జగత్కర్త పుట్టె, నతని తనువున నుదయించె నఖిలజగము
నతనిగోత్రజులందుఁ బెం పతిశయింప, వాణసాన్వయ మొప్పారె వసుధమీఁద.

అని మడికి సింగన చెప్పినాఁడు. పండితారాధ్యుని చరిత్రము రచించిన సోమనాథుఁడు వాకొన లేదుగాని, వాణసవంశ్యులు కాశ్యపగోత్రులు గాన నారాధ్యదేవరకూడఁ గాశ్యపగోత్రుఁడే యనవలెను. 'చతుస్స్మర నిర్ణయ' మని యిటీవల ఓరుగంట ముద్రిత మయిన యొక చిన్ని పుస్తకమున నాతఁడు గౌతమ గోత్రజుఁ డని కలదు. గౌరాంబా, భీమనపండితు లీతని తలిదండ్రులు. భీమన పండితుఁడు తాను శ్రీశైలమునఁ బంచాక్షరీ మంత్రము జపము చేసి పడసిన సంతానముగాన, యీ పుత్రునికి మల్లికార్జునుఁ డని పేరు పెట్టెను. దాక్షారామము చేరువనే కోటిపల్లిలో నున్న యారాధ్య దేవర దగ్గఱ నీతఁడు శైవమంత్ర దీక్షఁ బడసినాఁడు. పండ్రెండవ శతాబ్ది యుత్తరార్ధమున 1150 నుండి 1180 దాఁక నీ మహనీయుఁ డాంధ్ర దేశమునఁ బ్రఖ్యాతుఁడై యుండెను. గుంటూరుమండల మందలి ధనదుపురమున (నేటి చందవోలు) వెలనాటి చోడని యాస్థానమున నీతఁడు బౌద్ధాచార్యులతో మత వివాదము నెఱపెను.

## బౌద్ధాచార్యలపై కక్ష

శ్రీకాకుళక్షేత్రమునఁ*గల మల్లేశ్వరాలయమునఁ (ఈ యాలయము నేఁడున్న శ్రీకాకుళమునఁ గలదు.)గల 'దివియ కంబమును' (దీపములు వెలిఁగించు లోహస్తంభమును) బౌద్ధాచార్యులు పెల్లగించికొని వచ్చి వెలనాటి చోడని వివాదసభలో నిల్పి రఁట. మల్లికార్జున పండితారాధ్యునితో వాదములందు శివనింద చేసిన దోషమును దీపార్చనాసాధనమును హరించిన దోషమును సైపఁజాలక పండితారాధ్యుల శిష్యులా బౌద్ధాచార్యులను జంపిరి. ఆ బౌద్ధాచార్యులు ప్రతిదినము సముద్ర మధ్యద్వీపమున గల బుద్ధప్రతిమను బూజింప నరుగుచుండువా రఁట! ధనదుపురమునకు సమీపమున గల సముద్రద్వీపము నేఁటి దీవి ఖండము. అక్కడ బౌద్ధస్తూప ముండెడిది గాఁబోలును. ధనదుపురమునకుఁ జేరువనే కల బుద్ధాము మొదలగు గ్రామములు గావచ్చును కాని యవి సముద్రద్వీపస్థములు గావు. బౌద్ధాచార్యు లా సముద్రద్వీపమునకు బుద్ధపూజ జరుప నేఁగి నపుడే పండితారాధ్యుల శిష్యులు వారిని జంపిరి. అట్లు వారిని జంపుటకుఁ బండితారాధ్యుఁ డా శిష్యుల కనుజ్ఞ యిచ్చె నఁట. శివదూషకులను జంపుట పాపముగా దని పండితారాధ్యుఁడు శివతత్త్వసారమున జెప్పినాఁడు.

క. శివనిందావిషయం బగు, నవమానము సెప్పునట్టి యప్పుస్తకముల్
అవిచారంబునఁ గాల్పఁగ, నవుఁ జెప్పెడివానిఁ జంప నగు నీశానా!

క. శివనిందారతుఁ జంపిన, జవమఱి తత్కారణమునఁ జచ్చిన నీరెం
డు విధంబుల నీ కారు, ణ్యవశంబున ముక్తిఁ బొందు నరుఁ డీశానా!

## రాజుగారి ఆగ్రహము

ఈ ఘోరకార్యమునకుఁ గోపించి రాజు పండితారాధ్యులవారి కనులు దోడించెను. శివానుగ్రహమున నారాధ్యులవారికి మరలఁ గనులు వచ్చిన వఁట! రాజును

* శ్రీకాకుళక్షేత్రమును గూర్చి యింతకుముందు నేను గొన్ని వ్యాసములు వ్రాసితిని. శ్రీముఖ శాతకర్ణి పేరఁగాని, 'సిరిక' యన్న బౌద్ధోపాసిక పేరఁగాని ఆ యూరు వెలసి యుండవచ్చును. సిరి-క-పేరు బౌద్ధప్రాకృత శాసనములలోఁ గాన నగును. కాఖంది, కాకతేయ, కాకొంది-కాళ్ళూరు కావలి- పేళ్ళు బౌద్ధశాసనములలోని "సిరిక" పేర వెలసియుండవచ్చు ననుట సంగతతరము. కాకతీయులుకూడ ఈ పేర వెలసినవారే యని నా తలంపు బౌద్ధశాసనములలోని కాకతేయులే యిటీవల కాకతీయు లయి యుందురు. సిరిక పేర కొలనితో వెలసినయూరు గాన 'సిరికాకొలను, శ్రీకాకొలను, శ్రీకాకొలను' అను పేళ్ళు పుట్టి, క్రమముగా వైష్ణవము ప్రబలిన తర్వాత కొలను 'కొళమ'ై శ్రీకాకొళము, కాకొళము, కాకుళము రూపములు పుట్టినవి. ఈ శ్రీకాకుళము తర్వాత ఉత్తర శ్రీకాకుళము, దక్షిణ శ్రీకాకుళము గ్రామములు వెలసి నట్లున్నవి. దక్షిణ శ్రీకాకుళము నందివర్మపల్లవ శాసనమునఁ గాన నగును. అది యెక్కడిదో గుర్తింప వలెను.

దద్రాజ్యమును నాశ మగు నట్లు శపించి యారాధ్యులవా రక్కడనుండి సశిష్యులై కల్యాణకటకమున వీరశైవ మతప్రచారకుఁడై ప్రఖ్యాతిఁ గనుచున్న బసవేశ్వరుని దర్శింప బయన మయిరి. బసవేశ్వరుని శివభక్తి పరాకాష్ఠకుఁ బరమాదరమును, వైదికవర్ణ ధర్మపరిత్యాగమునకు నప్రీతియుఁ గలవారై యాయనతోఁ జర్చించుటకే పండితారాధ్యు లట్లు వెడలి రందురు. 'భక్తిమీఁది వలపు బ్రాహ్మ్యంబుతోఁ బొత్తు పాయ లేను నేను బసవలింగ'యని బసవేశ్వరున కారాధ్యులవారు వార్త పంపి రఁట! అమరావతి, నడుగుడుములు (నేఁటి నడుగూడెము-మునగాల రాజావారి యూరు) పొనగల్లు పురముల మీఁదుగాఁ గల్యాణమునకుఁ బోవుచు వనిపుర మను గ్రామమున నుండఁగా బసవేశ్వరుఁ డప్పటి కెనిమిది దినములకు ముందు లింగైక్య మందుట పండితారాధ్యులకు తెలియవచ్చెను. పండితుఁడు చాల విలపించి యక్కడనుండి శ్రీశైలమునకు వెడలి యల్పకాలముననే యక్కడఁ దానును లింగైక్య మందెను. ఇది పండితారాధ్యుల చరిత్రసారము. దీనిని బెంచి పెద్దచేసి పాల్కురికి సోమనాథుఁ డయిదు ప్రకరణముల ద్విపదగ్రంథముగాఁ బండితారాధ్యచరిత్రము రచియించెను. సోమనాథుని ద్విపదగ్రంథమున పండితారాధ్యుల శివతత్త్వసారము చాలఁగా నను వాదముఁ బడసినది. సోమనాథుని ద్విపద పండితారాధ్యచరిత్రము ననుసరించి కవిసార్వభౌముఁడు శ్రీనాథుఁడు పద్యకావ్యముగా బండితారాధ్యచరిత్రమును శృంగారనైషధకృతిపతి యగు మామిడి సింగమంత్రి యన్నకు పెద్దిగడయ్యకుఁ గృతిగా రచించినాఁ డఁట! అది యిప్పుడు గానరాదు.

### పండితారాధ్యుని గ్రంథములు

శివతత్త్వసారము, శతకము, రుద్రమహిమ, భీమేశ్వరగద్యము, లింగోద్భవదేవగద్యము, స్తుతిశ్లోకపంచకము, అమరేశ్వరాష్టకము, పర్వతవర్ణన అన్న గ్రంథములు పండితారాధ్య రచితములుగా సోమనాథుఁడు పేర్కొన్నాఁడు. ఇందు భీమేశ్వరగద్యము 'యత్సంవిత్తి' అని యారంభశ్లోకము గలదిగాను, స్తుతిశ్లోకపంచకము 'తస్మై నమ శ్శ్రీగిరివల్లభాయ' అని మకుటము గలదిగాను సోమనాథుఁడే పేర్కొన్నాఁడు. పై గ్రంథములలో శివతత్త్వసారము, శతకము తెలుగుగ్రంథములు. తక్కిన వెల్ల సంస్కృతగ్రంథములే కాఁబోలును. ఇవిగాక, సంసారమాయాస్తవము, శంకరగీతము లని, పదము లని, ఆనందగీతము లని పదములు కూడ మల్లికార్జునపండితారాధ్యరచితము లనఁదగి నట్లు సోమనాథుఁడు పేర్కొన్నాఁడు. ఈ గ్రంథములు గాక మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తకశాలలో మల్లికార్జునపండితారాధ్య కృతి 'శ్రీముఖదర్శనగద్య' మని సంస్కృతగ్రంథ మొకటి గలదు. బసవపురాణవీఠికలో

దానిని నేను వెల్లడించితిని. ఆరాధ్యదేవర మల్లికార్జునశతకములోనిదిగా నీక్రిం
పద్యము లక్షణగ్రంథము లందుఁ గలదు.

ఉ. లోకములెల్ల నీ తనువు లోనివ, నీవట యెంత కల్గుదో
నాకపపద్మసంభవజనార్దను లాదిగ నెల్ల పెద్దలున్
నీకొలఁ దింతయంత యన నేరక మ్రొక్కఁ దొడంగి రన్న ని
న్నేకరణిన్ నుతింతుఁ బరమేశ్వర శ్రీగిరి మల్లికార్జునా!

సోమనాథుఁడు పేర్కొన్న శతక మీ శ్రీగిరి మల్లికార్జునశతకము గాఁబోలును.
ఇది సమగ్రముగా దొరకవలసి యున్నది. సోమనాథుడు తన పండితారాధ్య చరిత్ర
మునఁ జాలఁగాఁ దన ద్విపద కృతిలోనికి మార్చుకొన్నది, ఆంధ్రకందపద్యాత్మకము,
తిక్కనసోమయాజులవారి కించను నూఱేండ్ల ప్రాత కాలపు దగుటచే భాషాచరిత్ర
పరిశీలకుల కత్యంతోపకారకము, తత్కాలపు టాంధ్ర దేశపు టారాధ్యశైవ మత
సంప్రదాయనిరూపకము నగుటచే పండితారాధ్యుని గ్రంథములలో శివతత్త్వ
సారము ముఖ్య మయిన దనవచ్చును. ఇర్వదియేండ్లకు ముందు నరసాపురమున నొక
జంగము దేవర యింట దాని నేఁ గనుగొంటిని. చెన్నపురి ప్రాచ్య లిఖితపుస్తక
శాలకు సేకరించితిని. కీర్తిశేషులు శ్రీ లక్ష్మణరావుగారు దాని నప్పుడు సాహిత్య
పరిషత్పత్త్రికలోఁ బ్రకటించిరి. తర్వాతఁ బుస్తకముగాను బ్రకటించిరి. కాని యప్పు
డా దొరకిన పుస్తకముగూడ నసమగ్రమే. అందు నన్నూట యెనుబది తొమ్మిది
పద్యములు మాత్రమే కలవు. అం దింక నెన్ని పద్యము లుండవలెనో అప్పుడు తెలియ
నశక్య మయ్యెను. లక్షణగ్రంథము లందు పండితారాధ్యదేవర శివతత్త్వసారములో
నివిగా నుదాహృతము లయిన పద్యములు గొన్ని యీ ముద్రిత గ్రంథమునఁ గాన
రావు. ఆ పద్యము లివి.

క. జడ లల్లి భూతి పూయుని పొడవులఁ బొడగాన మాదిపురుషులలోనన్
నడు మంత్రపు సమయంబులు జడమతు లలరించుకొనిరి చంద్రాభరణా!

క. ఆ యెడఁ ద్రిపురాంతకదే, వా యని పిలుచుటయుఁ గటక మంతయు వినఁగా
బాయక కిన్నర బ్రహ్మయ, కో యని యెలుఁ గీవె తొల్లి యురగాభరణా!

క. పతి! సదృశాధిక తాప, త్రితయ, గుణత్రితయ, జన్మమృతి సుఖదుఃఖ
క్షతివృద్ధిబంధమోక్ష, స్తుతినిందాదులును లేవు ధూర్జటి నీకున్.

క. అంచితమతి నెవ్వారు ని,ర్మించిరి వంచితులు సురలు కృత్యాదికళా
భ్యంచితమై తనరారు ప్ర,పంచము నీ యట్ల వరద పరమానందా!

ఈ పద్యములఁ బట్టిచూడఁగా నింక నెంతో గ్రంథము దొరకవలసియున్న ట్లేర్పడును. ఈ పద్యము లిప్పుడు దొరకకున్న గ్రంథభాగములోని వగు ననఁ దగును.

కన్నడ గ్రంథము

ఆంధ్రపద్యాత్మక మగు శివతత్త్వసారము విషయ మిట్లుండఁగా కడచిన వత్సరమున నాకు కన్నడమున గూడ నీ కృతి గనుగొన నయ్యెను. చెన్నపురి ప్రాచ్యలిఖితపుస్తకశాలలో నేదో కర్ణాటక గ్రంథముతో పాటు, ఆద్యంత శూన్యమై యనామధేయమై కన్నడ కందపద్యముల గ్రంథభాగ మొకటి కానవచ్చెను. కన్నడ పండితు లా పద్యములఁ జదువుచుండఁగా వింటిని. తెలుఁగు శివతత్త్వసార పద్యములే యనిపించెను ఆనుపూర్వితోఁ బరిశీలించితిని. తెలుఁగుపద్యముల వరుసనే కన్నడ పద్యము లున్నవి. తెల్గుకృతిలో మల్లికార్జున పండితారాధ్యుఁడు తనపేర నీ క్రిందిపద్యము చెప్పికొన్నాఁడు.

క. ఒండేమి మల్లికార్జున, పండితుఁ డన నుండుకంటెఁ బ్రమథులలో నె
న్నండొకొ నీ యాజ్ఞోన్నతి, నుండం గాంతు నని కోరుచుండుదు రుద్రా!
ఇట్లే పండితారాధ్యుని పేరనే కన్నడ పద్యము నున్నది.

క. ధర యొళగె మల్లికార్జున, వరపండిత నెనిసు శివాలుదటిఁ నిన్నాజ్ఞా
భరమె సెయల్ ప్రమథరొళా, నిరలెం దీక్షిసువె నిమ్మ బయసువె నీశా!

ఈ కన్నడ కృతిని గూడ పండితారాధ్యుఁడే రచించెనో మఱి యిటీవలివా రెవరైన కన్నడీకరించిరో గుర్తింపవలెను. పండితారాధ్యుఁడు కన్నడమునఁ గూడఁ బండితుఁ డయినట్లు పండితారాధ్యచరిత్రమునఁ గలదు. కాన యాతఁడును రచించి యుండవచ్చును. ఈ కన్నడ గ్రంథమున గ్రంథాదిపద్యములు 183 లోపించినవి. 184 నుండి 491 దాఁక సరిగాఁ బద్యము లున్నవి. తర్వాత 725 వ పద్యమునుండి 740 వ పద్యముదాఁక గ్రంథము గలదు. ఈ పద్య సంఖ్యనుబట్టి చూడఁగా శివ తత్త్వసారము వేయి పద్యముల గ్రంథ మయి యుండునని తోఁచుచున్నది. సంస్కృత మున నుద్భటుఁడు 'హారలీల' యని వేయి శ్లోకముల స్తుతి గ్రంథమును రచించె నఁట. మన పండితారాధ్యుఁడు గూడ నీ విషయము చెప్పినాఁడు.

క. హారలీలాస్తవరచనా, స్థిరనిరుపమభక్తిఁ దనదు దేహముతోడన్
సురుచిర విమానమున నీ,పురమున కుద్భటుఁడు ప్రీతిఁ బోవఁడె రుద్రా!

మఱియు బ్రహ్మదేశవి యని కర్ణాటకవియు, పాల్కురికి సోమనాథుఁడు నీ వారలీలఁ బేర్కొనిరి. ఇది మూకపంచశతి, పాదుకాసహస్రము, లక్ష్మీ సహస్రము మొదలగు స్తుతిగ్రంథములఁ బోలినది కాఁబోలును. ఉద్భటగ్రంథచ్ఛాయను మన పండితారాధ్యుఁడు శివస్తుతిరూపముగా వేయి యాంధ్రపద్యములతో నీ శివతత్త్వసారము రచియించి యుండును. కన్నడ గ్రంథమును పండితారాధ్యుఁడో, మఱి యింకొకఁడో రచించినను, తొలుతటి గ్రంథము తెలుఁగు గ్రంథమే యనఁదగినట్లున్నది.

క. మానిస్పై దోల్గప్పిన, యీ నెపమున నున్న రుద్రులీశ్వరభక్తుల్
మానుసులె వారు లోకహి, తానేకాచారు లీశ్వరాజ్ఞాధారుల్.

క. మానుషచర్మంపు దిగి, ర్దీవెన దిందిప్ప రుద్రదీశ్వరభక్తర్
మానుషరె యివరు లోకహి, తానేకాచార రీశ్వరాజ్ఞాధారర్.

క. స్ఫుటశివతాంత్రికుఁ డపగత, కుటిలాత్మకుఁ డుద్ధరించు గోత్రము నెల్లన్
బటుగతి "రజ్జుః కూపాత్, ఘటం యథా" యనిన సూక్తి కారణమగుటన్,

క. స్ఫుటశివతాంత్రిక నపగత, కుటిలాత్మక నుద్ధరిపను గోత్రమనెల్లం
పటుగతి "రజ్జుః కూపాత్, ఘటం యథా" యంబ సూక్తి తథ్యమహుదఱిం.

క॥ నిర్మలపదార్థ మగుటను, నిర్మాల్యం బనఁగ నెగడు నీ నిర్మాల్యం
బర్మిలిఁ గుడుతురు భక్తులు, కర్మక్షయ మగుట మోక్షకాంక్షులు రుద్రా!

క॥ నిర్మలవస్తువహుదఱిం, నిర్మాల్యమెనల్కె నెగళ్గు నిర్మాల్యమదం
కూర్మెయ నుంబర్ భక్తరు, కర్మక్షయమహుదఱిం ముముక్షుగళ్ భవా!

క. పురుష ప్రతికూలత్వ, స్థిరదోషము సతికి దుర్గతిం జేయదు ద
త్పురుషుఁ డభక్తుఁడ యేనిన్, బురుషుని మీఱియును శివునిఁ బూజించు నెడన్.

క. పురుష ప్రతికూలత్వం, స్థిరదోషం సతిగె దుర్గతియ నీయదు త
త్పురుష నభక్తనెయాగళ్, పురుషననం మీఱి శివన నోల్పై పడియో.

ఆంధ్ర కర్ణాట పద్యములఁ బరిశీలింతు మేని యతిప్రాసములు రెండును గల తెలుఁగు రచనము తొలుతటి దగుట తెలియ నగును. కర్ణాటక పద్యములకు యతి నియమము తెలుఁగున కున్నట్టిది లేదు. కాని యిందు నేను జూపిన కర్ణాటపద్యములు ప్రాయికముగా నాంధ్రయతి సంగతి గలవే. యతిసంగతి గల తెలుఁగు పద్యములు ముందు రచించిన వగుటచే, నది కన్నడ పద్యములకుఁ గూడఁ బరివర్తి

మునఁ బొందుపడినది. ఈ యాంధ్ర కర్ణాట పద్యముల జోడించి శివతత్త్వ సారమును నేను మరలఁ బ్రకటింప నున్నాఁడను. *

(ఆం. వా.)

* మల్లికార్జున పండితారాధ్యుని ఆంధ్ర కృతి యగు శివతత్త్వ సారమును గోదావరిజిల్లా నర్సాపుర మందలి శ్రీ చదువుల బసవ శంకరయ్యగా రను మాహేశ్వరుల గృహమునుండి పూర్వము శ్రీ ప్రభాకర శాస్త్రిగారు సంగ్రహించిరి. ప్రస్తుతము కన్నడ శివతత్త్వ సారముగూడ వారికే లభించుట కుతూహలమును గలిగించుచున్నది. ప్రస్తుతము కర్ణాట కాంధ్ర గ్రంథద్వయము నొక్కచో ముద్రింప బూనుటయు సంతోషమైన సంగతి. శివతత్త్వసారమునకు శ్రీ శాస్త్రిగారు పీఠికనుగూడ విరచింతు రనుట నిశ్చయమైన విషయమే! అందలి శైవ వీరశైవ విషయములగూర్చి వీరశైవ పండితుల యభిప్రాయమును గమనించుటలో శ్రీశాస్త్రిగారు ఈసారి ఉదాసీనింప రనియే మా తలంపు. కేవలములైన కల్పితోహాపోహలను త్యజించి సప్రమాణముగ సౌహార్దముగ సత్యమైన విషయములను ప్రకటించుట పండిత ధర్మ మని వేరుగ జెప్పనక్కర లేదు. వారికి గావలసినచో మా యొద్దగల వీరశైవమతసామగ్రిని గ్రంథమూలముగా గాని, వ్యాసములు, జాబుల మూలముగా గాని యొసఁగఁ గలము. ఈ పండితారాధ్య చరిత్రము అను వ్యాసములో సైతము బసవేశ్వరునకు "వీరశైవమత ప్రతిష్ఠాపనాచార్య" బిరుదమును ఆంధ్రపత్రికలో వాడిరి. నేను దానిని "వీరశైవ మతప్రచారక" యని మార్చితిని. వీరశైవమును శ్రీ రేణుకాది పంచాచార్యులు స్థాపించి రనియు, బసవేశ్వరుడు స్థాపకుడు కాడు కాడు కా డని యనేక వ్యాసములలో పదునేను సంవత్సరముల నుండి వీరశైవ పండితులు నిరూపించుచునే యున్నారు. శ్రీ ప్రభాకర శాస్త్రిగారి యభిప్రాయములును విమర్శింపబడినవి. ఐనను శాస్త్రిగారు మరల మరల వీరశైవ హృదయ భేదకర మగు సిద్ధాంతములను నిష్కారణముగ నిలవేయ నుంకించుట పండిత ధర్మము కా దని మా మనవి. పర మతముల విషయములలో నెప్పుడును సావధానులై వ్రాయవలెను. తరువాత పరుషము లాడి రని పరుల నాక్షేపించిన క్షంతవ్యము కానేరదు. బసవనికంటె బూర్వమందు విరచితమైన సిద్ధాంత శిఖామణి యను గ్రంథములో రేణుకాచార్యునకు "శ్రీ వీరశైవ నిర్వాహ కృతపట్ట నిబంధనం" "మ దద్వైతపరం శాస్త్రం స్థాపయిష్యసి భూతలే" యను వాక్యములలో వీరశైవ మతస్థాపకత్వము కంఠోక్తిగ జెప్పబడినది. శ్రీకరభాష్య, పారమేశ్వరాగమ క్రియా సారాదులను శాస్త్రిగారు చిత్తగింపవలెను. అటులే పండితారాధ్యుని వాణస వంశీయునిగ జెప్పుట మున్నగు నంశములును సప్రమాణముగ లేవు.

— సంపాదకుడు.



# గిరిజా పరిణయము

( 2-వ సర్గము )

విద్యాప్రవీణ, బి. వి. ప్రసాదరాయశర్మగారు

గౌరి శంకరు పూజించు కాలమందె, తారకాసురు బాధల దవిలి మిగుల
నింద్రుతో గూడి దేవతలెల్ల బ్రహ్మ, ధామమున కేగుదెంచిరి త్వరితగతిని.

ముకుళిత పద్మసంతతుల పూర్ణరుచిం దనియించు బాలసూ
ర్యకరము లట్లు దుస్సహపరాభవ వహ్నిని దహ్యమానులై
వికలితచిత్తులై హృదయవేదనతో గనుపించు వారికిం
బ్రకటిత శాంత తేజుడు పరమ్మగు బ్రహ్మము ముందు నిల్చెనన్.

వారలు సర్వభర్తయును వాణీ విభుం డగు నర్థవత్త్వ సం
భారములైన వాక్యముల పల్కిరి సన్నుతు లెన్నొ సల్పి దే
వా రహి సృష్టికిం దొలుత నందియు మూర్తి నొకండు పిమ్మటం
గోరితి రూపభేదమును గూర్పగ సత్త్వర జస్తమమ్ములన్.

జలములం దీవు నిల్పు తేజమ్ముచేత, వెలసినది యీ చరాచర విశ్వమెల్ల
మూడుమూర్తులు నంద నీ మూర్తియొండె, హేతువైతి లయస్థితి సృష్టులకును.

చేయదలంచియు భిన్నపు సృష్టి నాత్మ, స్త్రీపురుష భేదమునను సృజించి తీవు
వారలే సృష్టినొందు ప్రపంచమునకు, తల్లిదండ్రు లటంచును తలపబడిరి.

ఏ పరిమాణ భేదమున నే యగు నీకును రాత్రియున్, దివ
మ్మా పరిమాణమందె ప్రజ లందరకున్ ప్రళయోదయమ్ములౌ
నో పరమేశ! లోకముల యుక్కికి యోని వయోని వయ్యు, అ
ప్రాపిత మృత్యు వయ్యు జగదంతకు డౌదు విదేమి చిత్రమో !

నిన్ను సృజించుకొందు వట నీవ యెఱుంగుదు నీవ నిన్ను నిం
దెన్నగ లీనముం గనెద నీవ భవన్మహనీయ మూర్తిలో
బన్నగ స్థూలసూక్ష్మముల భావము గౌరవలాఘవంబులున్
మున్నగు నీ విభూతులను బూనెద విచ్ఛ చెలంగు నట్లుగాన్.

స్వరవిశిష్టమ్ము కా వేదచయము కాంచ, కర్మమును దానిఫలమును క్రమము మీర
సవనమును స్వర్గ మంచును సమత దెల్పు, దాని పరిపాక మీవ గాదా పరాత్మ!

నీవె మూలంపు ప్రకృతివిగావె దేవ!, ప్రకృతికిని మూల మాదువు ప్రభువ నీవె
నీవె పితరుల పితవు వేధో విధాత, నీవె హవ్యము హోతయు నీవ యగుదు.

ఈవె భోక్తయు భోజ్యము నీవె దేవ!, ధ్యాతయును ధ్యేయమవుగూడ నౌదువనుచు
ననెడు వారల హృదయంగమార్థవచన, రచన కలరుచు నా పరబ్రహ్మ మనియె.

అమరవరులార మీకెల్ల స్వాగతంబె, ఏల మీ ముఖకాంతులు లీల దరిగె
ఈ మహేంద్రుని వజ్రమ్మదేల కుంఠి, తమ్మగుచు దైన్యమందిన దారి దోచె.

మంత్రి రుద్ధభుజంగముం బలెను దైన్య, మందె నేటికి వరుణు పాశాయుధమ్ము
భగ్నశాఖతరూత్తము భాతి ధనదు, బాహుబలశక్తియెల్ల ఏ వంక ననియె.

యముడు భూమిని గీయుచు నవనతాస్యు, డయ్యె కారణ మేమి ప్రభాకరులును
తమ ప్రతాపమ్ము పోవ శీతలత నంది, ఒప్పియుండిరి బొమ్మలై యున్నరీతి.

వ్యాకులములైన యీ సప్తవాతములును, నిజమహాగతి పోవ కాన్పించుటేల?
నతజటామౌళి లంబి చంద్రముని కళల, కిరవు రుద్రుల తలల హుంకృతులు లేవు.

మించి పేరు ప్రతిష్ఠ గడించుకొనియు, బాధ ముత్సర్గ శాస్త్రముం బాపురీతి
దర్ప దుర్జేయులైన శాత్రవులచేత, భిన్నవృత్తిని గాంచియు విముఖులైరో!

కాక మీరంద రిటకు రా గతమ దేమి, చెప్పుడో వత్సలార! సృజింప నేను
ఈ చరాచరమెల్ల పోషింప మీరె, కాద యీ యెడ కారాని కార్య మెద్ది?

అని యీ రీతి వచింప నాతఁడు కర మ్మానందముం బొంది మె
ల్లని వాతంబున నూగు పద్మరుచి వెల్గంగా సహస్రాక్షుల్
గనుగోఁ గా గురుపాదు నింద్రుడు, కడంకన్ భక్తితో మ్రొక్కి, ఇ
ట్లని పల్కెన్ నుతు లెన్నొ సల్పి నిగమాధ్యాత్మ స్వరూపం డంతటన్.

దేవ నీ వాడినట్లె మా దైవపదము, పరబలమ్మున నపహరింపంగ బడియె
అరికృత పరాభవమ్ము నీ యధికదుఃఖ, మంతట న్నిండియుండు నీ వరయవాక్కు.

భవదీయ వరప్రాప్తి న, నవరతముం దారకాఖ్యు డానుర డొక్కం
డవధీరిత మఘవుండై, భువనములకు తోకచుక్క పోల్పున దోచెన్.

దీర్ఘకాంభోరుహాదీప్తులు కలిగించు, వెలుగుల మలగించు నలినభర్త
శ్రీకంఠచూడామణీ కృతకళవీడి, హిమధాము డతని సత్కృతులు సలుపు
పర్యాయ సేవల వదలి పుష్పమ్ముల, ఋతువు లారును దెచ్చి నుతులు సేయు
అతని పుష్పోద్యాన మందాడు వాయువు, వ్యజనమై వీచు తత్పార్శ్వమందు
ఇష్టమైనట్టి రత్నమ్ములెల్ల దెచ్చి, తత్ప్రసాదంబు నందగా దలచు నుదధి
శిరములన్ మణిదీప్తులు చెలగ పాప,గములు నిశ్చలదీపికా గతుల వెల్గు.



మాటిమాటికి దూతలం బంపుచుండి, కల్పవృక్ష సుమంబుల కానుక లిడుచు
తత్ప్రసాదంబు నందగా దలచి యింద్రు, డతని కనుకూలమౌ రీతి బ్రతుకుచుండు

ఇటుల సేవింపబడుచు దా నెల్ల యెడల, మూడులోకమ్ముల నతండు పీడబెట్టు
కీడుసేతల కుజనుని గీటడంగు, మేలుసేతల సుంత శమింపబోడు.

అమరకాంతలు సదయలై యాత్మహస్త, ములను మెల్లగా చివురుల పుణికి తాల్పు
నా దురాత్ముండు నందన పాదపముల, సలుపుచున్నాడు మోళ్ళుగా జాలిమాలి

నిదుర బోమెడివేళ నిర్నిద్రదుఃఖ, భరిత బద్ధసురాంగనల్ పరితపింప
వారి బాష్పాంబుసిక్త నిశ్వాసతుల్య, తాళవృంతానిల సుఖాప్తి దనియు నతడు.

సూరవాజి ఖురక్షుణ్ణ మేరుశృంగ, ములను తనయింట నాటకొండలుగ నిల్పి
దిగ్గజమదావిలజలమ్మె తేర నదిని, పైడితమ్ముల తననూత బాతినాడు.

అతని భయకారణమున నీ యమరు లెల్ల, జగములం గాంచు కోరిక నలుపరైరి
అరయ నే మెల్లర మతండు యజ్ఞభాగ, ములను వహ్నిముఖమ్మున బూన్కిగొనును

చిరకాలోర్జితమూర్తి మద్ఘన యశశ్శ్రీలాగు చందమ్ముగా
స్థిర ముచ్చైశ్శ్రవమున్ హరించి విహరించెన్ వాని జంపంగ, దు
ర్ధరవిస్ఫోరక సాన్నిపాతిక వికార మ్మందు వీర్యౌషధో
త్కర మత్యంతము వ్యర్థ మౌగతిని వ్యర్థమ్మల్ ప్రయత్నమ్ములున్.

ఏ మహావిష్ణు చక్రమం దేము కరము, జయము గాంచెద మను నాశ నలిపి నా
మా మహావిష్ణుచక్ర మీ యసురకంఠ, ఖండనము మాని భూషణగతిని గ్రాలె

వానివారలు పుష్కలావర్తకముల, సలుపుచున్నా రలాఘాతములను తటుల
గర్భబంధవిదారియౌ ధర్మరీతి, చెనటి నడగింప సేనాని పనుపు మయ్య.

ఏ చమూపతి మున్నిడి యీ మహేంద్రు, డసురగత మైన తన సిరి నెనగ కనునో
అతని సృజియింపు డంచు దేవతలు పలుక, పలికె పరమేష్ఠి మేఘరవమ్ము లీల

క్షమ సేయం దగు కొంతకాల మిటు మీ కామ్యమ్ము సాధ్యమ్మె కా
ని, మదీయ మ్మగు సృష్టి యీ యెడను కుంఠీభూత మీ దైత్యునే,
సమయంజేయ నయుక్త మౌను గద, రక్షం జేసియుం దుష్టవృ
క్షమునైనం దన బుద్ధిపూర్వకముగా జాజూడ న్యాయ మ్మొకో?

అనిలో నాతని గెల్చుటెంతయు నశక్య మ్మాతడుర్ యుద్ధ నై
పుణి గుర్తించినవాడు కావున తమః పూర్తి న్విరాజిల్లు దే
వుని తేజమ్మున గెల్వ డానుకు స్వయంభూ బ్రహ్మ మాతండు వి
ష్ణునకున్, నాకు మహాపరిభావముల వే చోద్యమ్ముగా దోచెడిన్.

ప్రబలరుచు లీను నా తపోవహ్ని కపుడు, మూడులోకమ్ము లెంతొ యల్లాడి పోవ
అపు డవధ్యత్వ వరదాన మతని తపము, కిచ్చుటంజేసి వహ్ని శమించె గాదె.

కాన మీరు సుమారూప కారణమున, సంయమ స్తిమితమ్మగు శంభుమనసు
కన నయస్కాంత శిల లాగు నినుముపోలె,తత్క్షణమ్మున గొన బ్రయత్నమ్ముగనుడు.

మాదువీర్యమ్ము దాల్పగా ద్వామధ రేందు్రి,పుత్రికయు శైవజలమయమూర్తియొండె
అతని మూర్తియె వాహినీ పతియు నగుచు, సారకాంతాళివేణి మోక్షణము నేయు.

ఇటుల పల్కి పరంధాము డేగ సురలు, కార్యము న్నిశ్చయించి స్వర్గమున కరిగి
రచట మదనుని నేతగా నరసి యిందు్రి, డాత్మ దలంచె మనోవేగ మతిశయిల్ల.

రతివలయంపు చిహ్నముల రాజిలు కంఠమునందు కామినీ
వితతమనోహరభ్రువుల వీఅడి పుచ్చెడి విల్లుదాల్చి స్నే
హితమధుమూర్తి హస్తనిహితేష్ట నవోదితచూత బాణుడై
శతమఖు జేరె నమ్రగతి చయ్యన పుష్పశరుండు వేడ్కతో.

(సశేషము)



# బసవేశ్వరుని గూర్చిన శాసన సామగ్రి

శ్రీ బండారు తమ్మయ్యగారు

అపరనందీశ్వరుఁ డగు బసవేశ్వరుఁడు కల్యాణపట్టణమునఁ బశ్చిమ చాళుక్య రాజ్యమును బరిపాలించిన కలచుర్యబిజ్జలుని యొద్ద క్రీస్తుశకము 1162-1168 ప్రాంత మున మంత్రిగా నుండి వీరశైవమతము నుద్ధరించె ననుట సుప్రసిద్ధ చరిత్రాంశ విషయము. బసవేశ్వరుని శాసనములు లభింపని కారణమునఁ గాని, ఉపలబ్ధములైన బిజ్జలుని శాసనములలో బసవేశ్వరుని నామ ముదాహృతము కానంత మాత్రమునఁ గాని బసవేశ్వరుఁడు చారిత్రిక పురుషుఁడు కాఁ డని తలఁచుట సరికాదని చెప్పి యట్టి శాసనములు వెలువడకుండుటకుఁ గల కారణములను గూడ బసవేశ్వరుఁడు బిజ్జలుఁడు అను వ్యాసమునఁ (విభూతి సం ౧ నం ౭) జర్చించియుంటిని. కర్నాట సాహిత్య పరిష త్పత్రిక యొక్క బహుధాన్య సంవత్సర మార్గశీర్ష సంచికలో (దీని యాంధ్రాను వాదము విభూతి సం ౧ నం 3 లోఁ గలదు.) శ్రీయుత ఎస్. శ్రీకంఠశాస్త్రి M.A గారు బసవేశ్వరుని యనంతర మొక శతాబ్దిలో వెలువడిన—

హిరియూరుశాసనము (Epicar V Ak P 109)

చౌడదానుపుర శాసనము (Psoci No. 110)

కల్లె దేవపుర శాసనము (Epicar XI JL 30) మరడీపుర శాసనము (Epi car III Md 33) మున్నగు కన్నడ శాసనములలో నుదాహృతులయిన పూర్వ శివభక్తుల నామములలో సంగనబసవేశ్వరుని నామోల్లేఖన ముండుట చేతను కన్నడమున నేలిఖింపఁ బడిన అర్జునవాడ శాసనములో (Epi Indica Vol XXI P 9) బసవేశ్వరుని వంశ స్థులకు క్రీ॥ శ॥ 1260 సంవత్సరములో యాదవ కన్నడరాజు కాలములో దాన మొసంగఁ బడినట్లు కానవచ్చుటచేతను బసవేశ్వరుఁడు చారిత్రికవ్యక్తియే యని నిస్సం శయముగ నేర్పడు నని వ్రాసియున్నారు. పూర్వోక్త శాసనములలో అర్జునవాడ శాసనము చాల ముఖ్య మయినది. పాల్కుఱికి సోమనాథుని బసవపురాణమువలన బసవేశ్వరుఁడు కర్నాటదేశమందలి హింగుళేశ్వర భాగవాటి* (బాగెవాడి) వాస్తవ్యుఁ డగు మండెగ మాదిరాజునకు మాదమాంబికయందు దుదయించె ననియుఁ గూడ సంగమేశ్వరస్వామి జంగమరూపమున వచ్చి యాతనికి జననకాలముననే లింగధారణ మొనర్చి చనినది మొద లాతనియం దనన్య సామాన్యమగు భక్తి నెఱపుటచే "సంగన బసవన" యని వ్యవహరింపబడెననియుఁ దెలియనగును. చామరసు ప్రభులింగలీలవలనఁ గూడ నీవిషయములు విస్పష్టమగును. పూర్వోక్తమయిన అర్జునవాడ గ్రామము భాగ

* హింగుళేశ్వర మనునది బిజాపూరుజిల్లాలో బాగెవాడి సమీపమున నున్న యొక గ్రామము.

వాడికి సమీపముననే బొంబాయి రాజధానిలో బెల్గాముజిల్లా హుక్కేరి తాలూకాల్లో నున్నది. అచ్చటి హాలశంకర లింగస్వామి యాలయపుగోడలో పయిని నుదాహరించిన యర్జునవాడ శిలాశాసనము చెక్కఁబడి యున్నది. బసవేశ్వరునకు మూఁడవ తరమువాఁడో నాలుఁగవ తరమువాఁడో యగు హాలబసవ దేవునకు యాదవ కన్నడ దేవుని దండనాథుఁడు మంత్రియు నగు చవుండసెట్టి నాగరసు అనువారు కైలాసపురమును క్రీ॥ శ॥ 1260 సంవత్సరములో అగ్రహారముగా నొసఁగిన దాన మీ శాసనమున నుదాహృత మయినది. శివానుభవపత్రికా సంపాదకులు బిజాపూరు వాస్తవ్యులు నగు రావుసాహెబు పి. జి. హాళకట్టిగారీ శాసనమును మొట్టమొదట గుర్తించి యున్నారు. వీరు పంపిన ప్రతిబింబమును బట్టి దీనిని బూర్వోదాహృతు లగు శ్రీ ఎస్. శ్రీకంఠశాస్త్రిగారే 1933 సంవత్సరములో (Epigraphia Indica Vol. XXI, Part I) లోఁ బ్రకటించియున్నారు. శాసనముయొక్క యవతారికలో బాగెవాడి పురవరాధీశ్వరుఁ డగు మాదిరాజుని పుత్రుఁడు సంగన బసవన యని చెప్పి యాతని జంగమ లింగభక్తి ప్రశంసాపూర్వకముగ నొక కందపద్యము రచింపఁబడి యున్నది. ఇందుచేఁ బాల్కురికి సోమనాథుని బసవపురాణమునకుఁ గథానాయకుఁ డయిన సంగనబసవేశ్వరుఁడును బయి శాసనమునఁ బేర్కొనఁబడి ప్రశంసింపఁబడిన సంగనబసవనయు నిస్సంశయముగ నొక్కఁడే యని నొక్కి వక్కాణింపవచ్చును. ఇంతవఱకు దొరకిన శాసనములలో వీరశైవ మతోద్ధారకుఁ డగు బసవేశ్వరునిఁగూర్చి సరియైన వివరములతోఁ బ్రశంసించిన శాసన మిదియొక్కటే యని చెప్పదగును.

బసవేశ్వరుడు చారిత్రికవ్యక్తి కాడేమో యని యనుమానించువారిక దీనిని జదివి తమ యనుమానములను బూర్తిగా విడువ నొప్పును. కావున నీ శాసనము నాంధ్ర వివరణముతో నీవ్యాసమున కనుబంధముగఁ బ్రకటించుచున్నాను. దానప్రతిగృహీత హాలబసవ దేవునితండ్రి కలిదేవరసయ్యకు సంగన బసవేశ్వరునకుఁగల సంబంధమును బ్రకటించిన పద్యములోఁ గొన్ని యక్షరములు శాసనమున శిథిలము లవుటచే బసవేశ్వరునకుఁ గలిదేవరసయ్యకు నడుమనున్న తరములను సరిగా నిర్ణయింపరాకున్నది. శాసనమును బ్రకటించిన శ్రీకంఠశాస్త్రిగారు బసవేశ్వరుని పుత్రుఁడు సంగన, యాతని తనయుఁడు దేవరాజముని, యాతని కొమరుఁడు సంగన, యాతని కొడుకు కలిదేవరసయ్య యని తమ యభిప్రాయమును సూచించి బసవేశ్వరునకు హాలబసవ దేవునకు నడుమ నాలుగు తరములు చెప్పినారు. కాని ప్రభుత్వమువారి శాసన పరిశోధక శాఖయం దుద్యోగులగు శ్రీ ఎన్. లక్ష్మీనారాయణరావు M. A. గారు

శాసన ప్రకటన కాలముననే శ్రీ కంఠశాస్త్రిగారి యభిప్రాయముల కించుక సవరణలఁ బ్రతిపాదించి బసవేశ్వరుని యగ్రజుఁడు దేవరాజముని, యాతని పుత్రుఁడు కావరసయ్య, యాతని కొమరుఁడు కలిదేవరసయ్య యని యభిప్రాయపడి యందు కను గుణముగ నీ క్రింది వంశవృక్షమును లిఖించియున్నారు.




(దానప్రతిగ్రహీత) శ్రీ లక్ష్మీనారాయణరావుగారు శాసన కాలమగు క్రీస్తుశక వత్సరము 1260 నుండి తరమున కిరువదియైదు సంవత్సరముల చొప్పున వెను కకు గణించి బసవేశ్వరుఁడు బిజ్జలునితో పాటు క్రీ॥ శ॥ 1168 ప్రాంతమున మరణించి యుండు నను చరిత్రకారుల సిద్ధాంతమున కనుగుణముగ నాతని కాలము క్రీ॥శ॥ 1160–1185 మధ్యనైయుండునని సమర్థించిరి. కాని బసవపురాణమును బట్టి మండఁగి మాది రాజునకు నాతనిభార్య మాదమాంబికకు లేక లేక యీశ్వరానుగ్రహమున బసవే శ్వరుఁ డొక్కరుఁడే పుత్రుఁడయి యుదయించె నని కాననగును. ఆతనికి దేవరాజముని యనెడి యన్నగాని తమ్ముఁడుగాని యున్నట్లు కానరాదు.

బసవేశ్వరుని కాతని భార్య గంగాంబిక వలనఁ బుత్రు లెవరయిన నుద యించినది లేనిది కూడ సోమనాథుని బసవపురాణము వలనఁ గానరాదు. కర్ణాటకవి చరిత్రకారులు శ్రీ నరసింహాచారిగారు భైరవేశ్వర కావ్య కథాసూత్ర రత్నాకర మను గ్రంథము వలన బసవేశ్వరునకు బాలసంగయ్య యను పుత్రుఁ డుదయించె ననియు నాతఁడు చిన్నతనముననే మరణింపఁగా బసవేశ్వరుఁడు—

పుప్పవిద్దంతె మొగ్గెయ నప్పిసి కొండశివను,
పక్వవాదఫలవిద్దంతె కసుగాయ కొయ్దు శివను.

అని విలపించెననియుఁ దెలియుచున్నదని వ్రాసి యున్నారు. హరిహర (హరీశ్వర) కృతమని చెప్పఁబడు బసవరాజ రగళెలో బసవేశ్వరునకు సిద్ధరసు అను కొమరుఁ డుండినట్లు చెప్పఁబడిన దని శ్రీకంఠశాస్త్రిగారు వ్రాసి యున్నారు. ఏది యెట్లున్నను అర్జునవాడ శాసనములో ముఖ్యమయిన రెండు స్థానములలో నక్షరములు శిథిలము లవుటచే నీ విషయమున సరియగు నిర్ణయ మొనర్ప ననువు గాకున్నది. ఇందుకుసంబంధించిన పద్య మీాదిగువ నుదాహరించు చున్నాను. కుండలీకరణములలోని యక్షరములు శిథిలాక్షరములకు శ్రీ లక్ష్మీనారాయణరావుగా రూహించి యొసగిన పాఠములు.

క. సంగనబసవన యగ్ర(జ లింగై)కం దేవరాజ మునిపన తనయం,
జంగమపరుసం (కావ)*ర సంగంపిరియ సుత నెనిప్ప క్కలి దేవరసం.

ఈ పట్టున నిదమిత్థ మని నిర్ణయించుటకు ముందు మరల నొకసారి శాసనశిలను బరికించుట యవసర మని నా యభిప్రాయము. ఇందుకయి ప్రయత్న మొనరించి తెలియవచ్చెడి విశేష వివరము లున్న ముందు ప్రకటింతును. ఇంతకు శాసనమందలిదాన ప్రతిగ్రహీత సంగన బసవనకు మూఁడవ తరము వాఁడయినను నాలుగవ తరము వాఁడయినను దద్విషయ మీా శాసనము వలన నిర్ధారిత మగు బసవేశ్వరుని చారిత్రిక వ్యక్తిత్వమున కేమాత్రము భంగకరము కాదుగదా! ఈ స్వల్ప వ్యత్యాసము వలనఁ బూర్వ నిర్ణీతమయిన బసవని కాలమునకుఁ (క్రీ॥ శ॥ 1168 ప్రాంతము) గూడ బాధక మేమియు నుండ నేరదు.

అర్జునవాడ శాసనము దొరకక పూర్వము 1898-1899 సంవత్సరములోఁ బ్రకటితమయిన Epigraphia Indica, Vol.V. లో మనగోళిగ్రామములో లభించిన శాసనములను బ్రకటించు సందర్భమున డాక్టరు ఫ్లీటు దొరగారు బసవేశ్వరునిఁ గూర్చియు నాతని తండ్రి మాదిరాజును గూర్చియు సరిగాఁ బరిశోధింపక కొన్ని యసంగత వాక్యములను సంశయ సూచకముగ వ్రాసి యున్నారు. మనగోళియనునది బసవేశ్వరుని జన్మస్థలమగు బిజాపూరు జిల్లా బాగెవాడికి వాయవ్యముగఁ బదునొకండు మైళ్ళ దూరములో నున్నది. అచ్చట దొరకిన శాసనములలో బిజ్జలుని కాలమున క్రీ॥ శ॥ 1161, 1165 లలో వెలువడిన శాసనములు రెంటిని, ఆతని కొమరుఁడగు సంకమరాజు కాలములో క్రీ॥ శ॥ 1178, సంవత్సరములో వెలువడిన శాసన మొకటియు, యాదవ జైతుగి క్రీ॥ శ॥ 1200 శాసనము మఱొకటియు శ్రీ ఫ్లీటు దొరగారు ప్రకటించి యున్నారు. క్రీ॥ శ॥ 1161 నాటిఁ

* ఇచ్చట "శరణర సంగం" అని శ్రీకంఠశాస్త్రిగారి సూచన.

శాసనములో మునుముందంతకుఁ బూర్వము క్రీ॥ శ॥ 1142 సంవత్సరములోఁ బశ్చిమ చాళుక్య చక్రవర్తియగు రెండవ జగదేక మల్లుని కాలమున జరిగిన దానములు కూడఁ బేర్కొనఁబడినవి. శాసనశిలపయి మొదట రెండవ జగదేకమల్లు శాసనము చెక్కఁబడి యాపిమ్మట మఱికొన్ని సంవత్సరములకు బిజ్జలుని శాసనము చెక్కఁబడినట్లు కాననగును. మన గోళి గ్రామ మీ శాసనములలో మణిగవల్లి, మణింగవల్లి, మాణిక్యవల్లి యని కూడఁ బేర్కొనఁబడినది. ఈ మొదటి శాసనము బట్టి యీ గ్రామము త్రైలోక్యమల్ల ఆహవమల్ల బిరుదాంచితుఁడగు రెండవ తైలప దేవుని వలన నాతని పట్టాభిషేక సమయమున హారీత గోత్రుఁడగు ఈశ్వర ఘళిసాస గురునకు ధారా పూర్వకముగ నొసంగఁబడె ననియు, ఆ యీశ్వర గురుదేవుఁడు దానిని దనతోపాటు అయిదువందల మంది బ్రాహ్మణుల కాచంద్రతారార్కముగ నగ్రహారముగ నుండు నట్లొనర్చెననియుఁ దెలియవచ్చును. అటు తరువాత నా యీశ్వర గురుని వంశమున మాణిక్యవల్లీ పుర ప్రభుఁడను విఖ్యాతిని గైకొన్న మాధవుఁడను నతఁడు జనించె నని యా శాసనమునఁ జెప్పఁబడినది. ఆ పిమ్మట యా గ్రామ మహాజను లగు నయిదువందలమంది యగ్రహారికుల విద్యా వైభవాదికములు వర్ణింపఁబడినవి. వారిలో వాజి వంశ్యుఁడు, కాశ్యప గోత్రజుఁడునగు గోవర్ధనుఁడను నాతఁ డుండెననియు, నాతని పుత్రుఁడు దేవదాసనియు, అతనికి నాగదేవుఁడు, విష్ణుఁడు, గొయ్యరును, హుళిధుఁడు నను నలువురు కొమారులు గలరనియు వీరిలోఁ గడపటివాఁడగు హుళిధుఁడు చంద్రిమసుఁడను నామముతో విశేషవిఖ్యాతిని గడించెననియు, చండిరాజనికూడఁ బిలువఁబడు నీ చంద్రిమసునకుఁ జంద్రాంబికయందు బసవయ్యయను నాతఁడు జనించి గొప్ప శివభక్తిఁగలిగి మణింగవల్లి యగ్రహారికులలో నగ్రగణ్యుఁడయి విశేష గౌరవమును గడించి యా గ్రామమునఁ గైలాసము నతిశయించు కలి దేవేశ్వరాలయమును నిర్మించెననియుఁ జెప్పఁబడినది. అటుతరువాత రెండవజగదేక మల్లుఁడు తన దండనాయకుఁ డగు బమ్మణయ్య మనవిపయి మణింగవల్లి మహాజనులగు మహాప్రభు మాదిరాజు మున్నగువారి సమ్మతితోఁ దన నైదవ విజయరాజ్య వత్సరమును దుందుభి సంవత్సర పుష్య శుద్ధదశమి బృహస్పతివారమునాఁడు, ఉత్తరాయణ సంక్రాంతి వ్యతీపాతపుణ్యకాలమునఁ బూర్వోక్తమగు కలి దేవేశ్వరాలయమునకుఁగాను భుజంగావళీకులతిలకుఁడు నగు కాలాముఖనైష్ఠిక పరమతపోనిష్ఠ బ్రాహ్మ్యకుల బాలబ్రహ్మచారియు నగు శ్రీ సద్యోజాతపండిత దేవునకు ధారాపూర్వకముగ దానములొసంగెనని చెప్పఁబడినది. అటుతరువాత క్రీ ॥శ॥ 1161 సంవత్సరములో బిజ్జలుని కాలమున మణింగవల్లి యగ్ర

హారికులకోరికపయి నచ్చటి సెట్టులు మున్నగువారు పూర్వోక్తమగు కలిదేవేశ్వరాలయమున కొసంగిన దానములు పేర్కొనఁబడినవి. పయిసంగతుల బాగుగాఁ బరిశోధింపక డాక్టరు ఫ్లీటు దొరగారంతకుఁ బూర్వము బసవేశ్వరునకు సంబంధించిన శాసనము లేమియు లభింపనందున నీ మనగోళి శాసనమునఁ దాము స్థూలదృష్టితోఁ దిలకించిన బసవరసయ్యయే బసవేశ్వరుఁడు కాఁదగు ననియు, ఈశ్వర ఘుళిసానగురుని వంశ్యుఁడుగాఁ జెప్పఁబడిన మాధవుఁడే శాసనమున నటు తరువాతఁ బేర్కొనఁబడిన మాదిరాజు కానగుననియు, ఆతఁడే బసవపురాణమున బసవేశ్వరుని తండ్రిగాఁ జెప్పఁబడిన మండఁగి మాదిరాజు అయియుండుననియు భ్రమించి సంశయగ్రస్తముగఁ గొన్ని వాక్యములు లిఖించియున్నారు. మఱియు నీఫ్లీటు దొరగారు Epigraphia Indica Vol. V లోనే ప్రకటించిన (ఏకాంత రామయ్యనుగూర్చిన) అబ్లూరు శాసనమునకు దాము వ్రాసిన యవతారికలోఁ గూడ నీ గొడవయెత్తి, గోత్రవిషయమునను, దలిదండ్రిల నామములు విషయమునను గల వ్యత్యాసములకు సమాధానముగా శాసనస్థ వివరములే సరియైన వనియు, వీరశైవ గ్రంథములలో బసవేశ్వరుని తలిదండ్రిల నామములు మాదిరాజ మాదమాంబిక లని చెప్పియుండుట జనశ్రుతి వలన నేర్పడిన ప్రమాద మయియుండు నని లిఖించి యున్నారు. మనగోళి శాసనములను సరిగాఁ జిత్తగించినవారికి ఫ్లీటు దొరగారి వ్రాతలలోని ప్రమాదములు విశదము కాఁగలవు. రెండవ తైలప దేవుఁడు పశ్చిమ చాళుక్య రాజ్యమును క్రీ॥ శ॥ 973-997 ప్రాంతమునఁ బరిపాలించినవాఁడు. ఆతని వలన మణింగవల్లి గ్రామము నగ్రహారముగాఁ గొనిన హారీత గోత్రుఁడగు ఈశ్వరఘుళి సానుని వంశ్యుడగు మాధవుడే బసవనితండ్రి మాదిరాజు కాదగుననియు, మఱల గాశ్యపగోత్రుడగు చండిరాజపుత్రుఁడు బసవరసయ్యయే బసవేశ్వరుఁడు కాఁదగు ననియు దొరగారు తలంచుట కేవల మవిచార మూలకము. కలి దేవేశ్వరాలయము మణింగవల్లి గ్రామమున రెండవ జగదేకమల్లుని శాసన కాలమగు క్రీ॥ శ॥ 1142 సంవత్సరమునకుఁ బూర్వమే యుండి యున్నట్లు శాసనమువలనఁ గాననగును. అందుచే నా యాలయ నిర్మాణకర్తగా నం దుదాహరింపఁబడిన బసవరసయ్య జగదేకమల్లుని కంటెఁ బ్రాచీనుడని యందువలననే తెల్లము కాఁగలదు. కావున నాతనినే వీరశైవ మతోద్ధారకుఁ డగు బసవేశ్వరునిగాఁ దలంచుట వట్టి భ్రమయే యని చెప్ప నవసరములేదు.

పాలకురికి సోమనాథుఁడు బసవ శబ్దము వృషభ, పశుప శబ్దములనుండి ప్రాకృత వ్యాకరణ సూత్రములచే నేర్పడినదని సోమనాథ భాష్యమున వివరించియున్నాఁడు. అంతమాత్రముచే నీ శబ్దము బసవేశ్వరుని పుట్టుపుతోనే దేశమునందు. వ్యవహార

మునకు వచ్చెనని యంతకు ముందది. లేదని తలంపరాదు. బసవేశ్వరునికిఁ బూర్వము వెలసిన కొన్ని శాసనములను బరిశోధింప బసవేశ్వరాలయములు ఆంధ్ర కర్ణాట దేశములలోఁ బలు తావుల నదివఱకే యున్నట్టును, ఆ శాసనము లా యాలయము లందుఁ జెక్కఁబడినట్లును గాననగును. కావున బసవనామాంకితు లగు మహా పురుషులు (మణింగవల్లి బసవరసయ్య వంటి వారు) కొందఱు కర్ణాట దేశమున బసవేశ్వరునకు ముందే యుండిరని తలంచుట కెట్టి యాటంకమును లేదు. అర్జునవాడ శాసన ప్రకటన సందర్భమున శ్రీకంఠశాస్త్రిగారుకూడ ఫ్లీటు దొరగారి వ్రాత లందలి పొరపాటులఁగూర్చి యించుక ముచ్చటించి యున్నారు.*

సంగతి సందర్భము లిట్లుండ శాసనములను సరిగాఁ జిత్తగింపక యర్జునవాడ శాసనములే చూడక నా మిత్రులు డా చిలుకూరి నారాయణరావు పంతులు M.A గారు ఆంధ్రగ్రంథమాలికలో నూతనముగాఁ బ్రకటిత మయిన పండితారాధ్య

---

* బసవేశ్వరునితండ్రి మాదిరాజు బాగెవాడి పురవరాధీశ్వరుఁడు. అతని గోత్ర మేదియో బసవ పురాణమును బట్టిగాని అర్జునవాడశాసనమును బట్టిగాని మనకుఁ దెలియరాదు. మనగోళి శాసనములలో నచ్చటి యగ్రహారికులలో మహాప్రభు మాదిరాజొకఁడు రెండవ జగదేకమల్లుని క్రీ॥ శ॥ 1142 నాటి దాన సందర్భమునను, క్రీ॥ శ॥ 1165 నాఁటి బిజ్జలుని మఱియొక శాసనదాన సందర్భమునను గూడఁ జేర్కొనఁ బడినాఁడు. ఆ శాసనములఁ బట్టి యాతఁడు హారీత గోత్రుఁడు, అగ్రహార ప్రథమ ప్రతిగ్రహీత యయిన యీశ్వర ఘళిసాసగురుని వంశ్యుఁడయినది, కానిదికూడ నిర్ణయింపఁ జాలము. బిజ్జలుని పుత్రుఁడు సంకమరాజునాఁటి క్రీ॥ శ॥ 1178 శాసనములోను యాదవరాజగు మొదటి జైతుగి క్రీ॥ శ॥ 1200 శాసనములోను మణింగవల్లి పూర్వాగ్రహారిక వర్ణనములో వ్రాయఁబడిన పద్యములఁబట్టి యీశ్వర ఘళిసాస గురుని పుత్రుఁడు మాదిరాజని కాననగును. అతఁడే మాధవుఁ డని కూడ వ్యవహరింపఁ బడినట్లు లందువలన దోఁచును. ఈశ్వర ఘళిసాస గురుఁడు మణింగవల్లిని రెండవ తైలపుని కాలమున నగ్రహారముగఁ బడసి యుండుటచే నాతఁడు నాతని పుత్రుఁడు మాదిరాజు (మాధవుఁడు) రెండవ జగదేకమల్లుని క్రీ॥ శ॥ 1142 శాసన కాలము నాఁటికే చాలఁ బూర్వులని యేర్పడును. సంకమరాజు క్రీ॥ శ॥ 1178 శాసనకాలము నాఁటికున్న మణింగవల్లి మహాప్రభు పీశ్వర దేవుఁడని యా శాసనము వలనఁ గాననగును. కావున నీ యగ్రహారికులలో ఈశ్వరదేవ, మాదిరాజ నామాంకితులు వేర్వేఱు పురుషులు వేర్వేఱు కాలములలో నున్నట్లు స్పష్ట మగును, మణింగవల్లి బాగెవాడికి సమీపములో నుండుటచే బసవేశ్వరుని తండ్రి మాదిరాజునకుఁగూడ నా యగ్రహారములో నొక భాగ ముండిన నుండవచ్చును.

రెండవ జగదేకమల్లుని క్రీ॥ శ॥ 1142 శాసనములోను, బిజ్జలుని క్రీ॥ శ॥ 1165 శాసనములోను నప్పటి యగ్రహార మహాప్రభువుగఁ జేర్కొనఁబడిన మాదిరాజుకూడ నాతఁడయినఁ గావచ్చును, కాని యీ విషయ మిదమిత్థమని నిర్ణయింప మనకున్న సామగ్రి చాలదు. బసవేశ్వరుని తండ్రికి బాగెవాడితోనే యెక్కువ సంబంధ మున్నట్లు బసవ పురాణము, ప్రభులింగలీల, అర్జునవాడ శాసనము స్పష్టమొనర్చును.

చరిత్రికుఁ డాను వ్రాసిన పీఠికలో బహు ప్రమాదములకు లోనయి విచిత్రపు టూహాలతో బసవేశ్వరునిఁగూర్చి వింతవింత సంగతులు లిఖించుట యాశ్చర్యకరము.

"సోమనాథునికాలము"అను శీర్షికక్రింద 55-63 పుటలలో "కాని ఇంతమంది చారిత్రక వ్యక్తులపేళ్లు మనకు కనబడుతూవుండగా, ఆ వ్యక్తు లందరికిన్ని కేంద్రమం దుండెనని చెప్పబడిన ప్రధానపురుషుడైన బసవేశ్వరుడు నిరాకారుడై మనకు చిక్కకుండడమే అద్భుతములలో అద్భుతము" అను వాక్యముతో నారంభ మయి "పైదానినిబట్టి బండారు బసవన్న కోశాధ్యక్షుడుగా ఉన్నాడన్న విషయ మంత సులభముగా తోసివేయదగినది కాదని చెప్పవచ్చును" అను వాక్యముతో ముగిసిన వారి యుపన్యాస భాగమును జిత్తగించునది. నేఁటి విద్యాధికులకు తాలు అప్పులువలె మహాకవుల గ్రంథములు ప్రమాణములు కావు. శిలా తామ్రశాసన ములలోని వ్రాతలకు సరిపడిననే తప్ప గ్రంథస్థ ప్రమాణములను వారు విశ్వసింపఁ జాలరు విద్యాధికు లగు మన నారాయణరావుగారుకూడ నిందుకు విలక్షణ ముగ వర్తింపనేరరుగదా! వీరశైవకవుల గ్రంథములలో నంతగా వినుతికెక్కిన మతోద్ధారకుఁడు బసవేశ్వరుఁడు, బిజ్జలుని యమాత్యశేఖరుఁడు, శాసనముల కెక్కకుండుట వారికి మహాద్భుతముగాఁ దోఁచినది. ఈ శాసనాభావము ప్రాగభావముగాక ప్రధ్వంసాభావమో, ప్రచ్ఛన్నాభావమో యయియుండు నను తలంపుతో శాసనాన్వేషణమునకుఁ గడంగి బిజ్జలుని కాలమునకుఁ గొంచెము ముందు వెనుకలనున్న శాసనములఁ బరికింప దొరకొనిరి. బసవయ్య, బసవదండనాయ కుఁడు అను నామములు కర్మము చాలక యే శాసనములలోనయినఁ గానవచ్చినచో నాయా పురుషుల బసవేశ్వరునకుఁ బరకాయప్రవేశము గలిగించి వారితో నాతని కై క్యానుసంధానము ఘటింపఁ బ్రయత్నించిరి. Madras Epigraphical Reports వెదకఁగా వెదకఁగా 68 of 1904 లో బళ్లారిజిల్లా ఒరవాయి (Oruway) గ్రామ ములో బెణకప్ప (వెనకప్ప = విఘ్నేశ్వరుఁడు) గుడిలో హొయసలరాజగు రెండవ వీరబల్లాళుని సేనానియగు బసవన దండనాయకుఁడు ఈశ్వరసంవత్సరములో నొసంగిన దానమొక తాతిపలకపయి చెక్కఁబడినట్లు వ్రాఁతకనిపింపఁగనే యాతఁడే బసవేశ్వ రుఁడు కాఁదగునని యూహాలపయి నూహాలఁబన్ని క్రొత్త యొకవింత, ప్రాఁత యొకరోఁత" యనువాక్యము ననుసరించి కాఁబోలు వింత సిద్ధాంతమొకటి ప్రక టించిరి. హొయసల రెండవ వీరబల్లాళుని రాజ్యకాలములో ఈశ్వర సంవత్సరము క్రీ॥ శ॥ 1217 అగును. ఇందుచే బసవేశ్వరుఁడు బిజ్జలుని మరణానంతర మత్యంత సమీపకాలములో క్రీ॥ శ॥ 1168 ప్రాంతమున మరణించెనను చరిత్రకారుల ప్రాత

వ్రాతలఁ ద్రోసిపైచి, బసవేశ్వరుఁడు బిజ్జలుని మరణానంతర మాతనిపుత్రుఁడు రాయ మురారి సోవిదేవునకు భయపడి పాఱిపోయి కొంతకాలము దాఁగియుండి యాదవ వాతహొయసల రాజులవద్ద దండనాయకుఁడుగాఁ బ్రవేశించి బళ్లారి మండలములోని కలచుర్య రాజ్యభాగముల జయించి యా రాజ్యవినాశమునకుఁ దోడ్పడి పగసాధించె నని శ్రీ నారాయణరావుగారు సెలవిచ్చిరి. అతి సాహసముతో నిట్టి క్రొత్తసంగతి చెప్పఁబూని నప్పుడు శాసనమును స్వయముగాఁ జూడవలె ననెడి తలంపయినను మా మిత్రులకుఁ గలుగకుండుట శోచనీయము. వీ రుదాహరించిన యీ శాసనము South Indian Inscriptions Vol. IX Part I లో నె 334 రుగాఁ బ్రకటింపఁబడి నది. అవసరమయినభాగము నీక్రింద నుదాహరించుచున్నాను.

"స్వస్తి శ్రీమతు యాదవనారాయణం ప్రతాపచక్రవర్తి హొయ్సళ వీర బల్లాణ దేవరాజ్యసముద్ధర బసవణదండనాయక గుణప్రభావ వెంతెందడె.

మ. నుడివం సత్యవచోక్తియం సకలధర్మవ్యాప్తియిం దర్థమం
పడెవం విప్రసురాది శిష్టజనతాసంతుష్టి యాగల్కె తా
కొడువం ద్రవ్యమ నీ గుణాశ్రయమముం లోకంబ బాప్పెంబినం
పడెదం సద్గుణి దండనాథబసవం ప్రఖ్యాతియం కీర్తియం.

క. కలియమృత దండనాథర, లలితాత్మజ నెందొడొప్పుగుం కవితనముం
నలె సత్యానృతవాక్యం, కులతిలకం బసవదండ నాథాధిపనోళ్.

శ్రీమదీశ్వర సంవత్సరశ్రావణబహుళ అమావాస్యా శుక్రవార సూర్య గ్రహణదందు శ్రీవినాయకదేవర్గె రణధవళ బసవచమూపం ధారాపూర్వకం మాడికొట్టు............

మహాశయులారా! ఈ శాసనమందలి బసవదండనాయకుఁ డెవరో చూచితిరా! అతఁడు కలియమృత దండనాథుని పుత్రుఁడు, "రణధవళ" బిరుదాంచితుఁడు. వీర బల్లాణ దేవరాజ్య సముద్ధారకుఁడు. అతనికి వీరశైవ మతోద్ధారకుఁ డగు బసవేశ్వ నకు నేమాత్రము సంబంధము లేదని చెప్పనక్కఱలేదు గదా! శ్రీ నారాయణ రావు గారింతతో నూరకొనక యీ యొరవాయి శాసనములోని బసవదండనాయ కునిఁ బూర్వోక్త మయిన మనగోళి శాసనములోని కశ్యపగోత్రుఁడు, చండిరాజ పుత్రుఁడు నగు బసవరసయ్యతోఁ గూడ నైక్యమొనర్చుటకయి చేసిన ప్రయత్నము మఱింత పరిహాసనీయముగ నున్నది. ఫ్లీటు దొరగారి ప్రమాదములఁబుడికి పుచ్చు కొనుటయేగాక మఱికొన్ని క్రొత్త ప్రమాదములకుఁ గూడ శాసనమును సరిగా

జదువక వీరు లోనయిరి. ఆ శాసనములో రెండవ తైలపుని వలన నగ్రహారము వడసినట్లు చెప్పబడిన యాశ్వరఘళి సానగురుని వంశ్యుడగు మాధవుని (మాదిరాజును) వీరు తిన్నగా రెండవ తైలపుని వంశము వాఁడని చెప్పి యాతనికి క్షత్రియత్వము గూడఁ దెచ్చిపెట్టిరి. శాసనములో ఈశ్వర గురుని వర్ణనానంతరమున్న "ఆ వ్రభువి నన్వయ దల్లి" అను వచనమునకు సరియయిన యన్వయము చేసికొన నందువలనఁ గలిగిన యనర్థ మిది. నారాయణరావుగారి యీ క్రింది వాక్యములు చిత్తగింపుఁడు.

"ఇక ఆ శాసనములోనే మాదిరాజును గురించిన వృత్తాంత మిది:—చాళుక్య రాజయిన తైలుని (రెండవ తైలపుఁడు) వంశములో మాధవుఁడు పుట్టినాఁడు. అతఁడు మనిగవల్లి గ్రామమునకు మహాప్రభువు. ప్రఖ్యాత హారితగోత్రమునకు విష్ణువు వంటివాఁడు. అని ఈ మాధవుఁడే శాసనములో మాదిరాజని కూడ బేర్కొన బడినాడు. ఈ శాసనము బసవని కాలమునాఁటిది కాబట్టి విశ్వాసపాత్రమని చెప్ప వలెను. కాని, బసవనిది కాశ్యపగోత్రమనిన్ని అతని తండ్రి మాదిరాజుది హారితగోత్ర మనిన్ని ఉన్నది. బసవడు మాదిరాజుకొడుకు కాడు. చంద్రమునుని కొడుకు. మరొక్క చిక్కబసవడు బ్రాహ్మణమతమును ధిక్కరించినాడని వీరశైవపురాణములు చెప్పుతూ ఉంటే ఈ శాసనము మనిగవల్లిలోని ఏ నూర్గురు బ్రాహ్మణుల హృదయాబ్జముల కున్న అతడు సూర్యునివలె ఉన్నాడని చెప్పుతున్నది.

పై శాసనములోని విషయములే సత్యములు కావచ్చును. రాను రాను జన శ్రుతిలో తారుమారులు కలిగి యుండవచ్చును. మనిగోలి శాసనములోని కాశ్యప గోత్రజుడైన బసవడు షికార్పూరు శాసనములో కశ్యపుడని వ్యవహరింపబడ్డా డని నా యభిప్రాయము. జనశ్రుతిలో మనిగవల్లి మహాప్రభువైన మాదిరాజు బసవనికి తండ్రి అయినాడు.

మనిగవల్లి శాసనములోని మాధవ, మాదిరాజ, బసవరసయ్యలఁ గూర్చి వలసి నంత చర్చ యిదివఱకే చేసియుంటిని. దానివలనఁ జదువరులకు యథార్థము బోధ పడి నారాయణరావుగారి వ్రాఁత లందలి యప్రామాణ్యము తెల్లము కాఁగలదు. ఈ శాసనమందలి కశ్యప గోత్రజుఁడగు బసవయ్యయే బిజ్జలుని కాలమునాఁటి షికార్ పూరు శాసనములో కశ్యప నాయకుఁడుగా నుదాహరింపఁబడినాఁడని శ్రీ నారాయణ రావు తలంచుట మఱింత వింత. ఎవఁ డయినను దనకు వేఱొక పేరున్నప్పు డా పేరితోఁగాక తన మూల పురుషుఁ డయిన గోత్రకర్త నామముతోఁ వ్యవహరింపఁ బడునా? ఇందు కెందయిన దృష్టాంతములను నారాయణరావుగారు చూపఁగలరా? ధారి తెన్నులేని దుర్భ్రమలకులోనయి వీరిట్టి యసంగతములు వ్రాయుటకు నేనెంతయు

జింతిలుచున్నాను. పరిశోధన లిట్టి విచిత్ర పరిణామముల నొందుట కాలవైపరీత్యమే. ఇంతకు బిజ్జలుని సేనానాయకుఁ డసి వీరు చెప్పు కళ్యపనాయకునిఁగూర్చి వీ రుదాహరించిన షికారు పూరుశాసనమునకు వీరొసంగిన సంఖ్యాసూచనము (ఎపిగ్రాఫియా కర్నాటికా ఏడో సంపుటము నె 7 రు) నాకు రుజువు కాలేదు. నె 7 రు అనుబది నె 102 రుకు పొరపాటేమో యని నేఁ దలంచుచున్నాను. అందు బిజ్జలదేవ మహీపాలన శ్రీ పాదపద్మోప జీవియను విశేషణముతో "కసపయ్య నాయకుఁ"డొకఁడు పేర్కొనఁబడినాఁడు. అతని నేనారాయణరావుగారు కళ్యపుఁగావించినారు కాఁబోలు. మనగోలి శాసనమందలి బసవరసయ్య రెండవ జగదేకమల్లుని కాలమునకుఁ బాల్యబూర్వమందున్న వాఁడని యా శాసనము వలనఁ దెల్లమగు నని యిదివఱకే చెప్పియుంటిని. ఆతనికి బిజ్జలుని సేనానియగు కసపయ్య నాయకునకు నెట్టి సంబంధమునులేదు. శాసనములను సరిగాఁ జదువకుండఁ జారిత్రిక విషయనిరూపణమునకు, నంధపరంపరాభ్రాంత సిద్ధాంతములఁ దోసిరాజని క్రొత్తసిద్ధాంతముల వెలువరించుటకు సిద్ధముందయినను శ్రీ నారాయణరావుగారు పూనకుందురు గాకయని సుహృద్భావముతో విన్నవించు చున్నాను.

దుర్భ్రమలకు లోనయి యెవరెన్ని యసత్యములు వ్రాసినను, అర్జునవాడ శాసనమువంటి సరియగు శాసనముల వలన బసవేశ్వరుని చారిత్రిక వ్యక్తిత్వమేగాక యాతని కాలాదికములఁ గూర్చిచరిత్రకారులు పూర్వ మొనర్చిన సిద్ధాంతములు గూడ స్థిరీకృతము లవుచున్నవని పాఠకులు గ్రహింతురు గాక!

## అర్జునవాడ శాసనము

శ్లో॥ నమస్తుంగశిరశ్చుంబి చంద్రచామర చారవే
త్రైలోక్యనగరారంభ మూల స్తంభాయ శంభవే. ౧

స్రగ్ధర:—శ్రీయం శ్రీకల్లినాథం కుడుగె భవహరం భక్తబృందక్కె గౌరీ,
జాయాకాయానుషంగా కలిత లలితతాగ్రోల్లసద్వామభాగం,
స్వీయస్వాయత్త శక్తి త్రియమయ మహిమం దేవదాయాదమాయా,
పాయాభిప్రాయ లీలం ప్రణతజన దురంతాఘ సంఘట్టశీలం. ౨

వ॥ మత్తం తర్దవాడి మధ్యగ్రామ బాగవాడి పురవరాధీశ్వర మాదిరాజన తనూజం బసవరాజన మహిమ మెంతెందడె. ౩

క॥ మంగళకీర్తి పురాతన, జంగమలింగైకభక్తి • నిర్భరలీలా ౪
సంగం సంగనబసవం, సంగతియం మాళ్కె భక్తి • యొళ గనవరతం.

ఉ॥ యాదవభూమిపాల రిళెయం చతురబ్ధిపరీతెయం నిస
ర్గోదయరాళ్వరం తవ రొళశ్వచమూచయ వార్ధిసింహణ
క్ష్మాదయితం తదగ్రితనయప్రిభవం నృపకన్నరం సమ
స్తోదధివేలెయం పొఱగె బెళ్గొడె యొళ్నెళలం నిమిర్చిదం. ౫

క॥ సలె భూదేవర్కళ్గే, త్తలసదె గోభూమిహేమ వస్త్రాదిగళం
మలె వరసుగ ళొళ్కొంబం, బలవంతం కన్నరం ప్రితాపసహాయం. ౬

వ॥ స్వస్తి సమస్తభువనాశ్రియ శ్రీ పృథ్వీవల్లభ మహారాజాధిరాజ పరమేశ్వర, పరమ భట్టారక, ద్వారావతీపురవరాధీశ్వర, యాదవకులకమలకలికావికాసభాస్కర, అరిరాయ జగజ్జహంపె, మాళవరాయ, మదనత్రినేత్ర, గూర్జరరాయభయంకర, తెలుంగురాయ స్థాపనాచార్య, ఇత్యాది నామావళిసమలంకృత శ్రీమత్ప్రిథ ప్రితాపచక్రివర్తి శ్రీకన్నరదేవం, దేవగిరియ నెలెవీడినొళు సుఖసంకథావినోద ది నానవరతం రాజ్యం గెయ్యుత్తమిరె తత్పాద పద్మోప జీవి. ౭

క॥ చిక్కన చిక్కమగం విభ, వక్కె కుబేరంగె సెణసువం రాయరుమం
మిక్కం బీచుగి యాదా, ర్యక్కారిం పిరియనాతనణ్ణం మల్లం ఆతనతనూభవం. ౮

స్రిగ్ధర:—చావుండం పార్వతీవల్లభచరణ సరోజద్వయామోదభృంగం,
చావుండం త్యాగభోగానుభవ భవసుఖ శ్రీవధూనృత్యరంగం,
చావుండం సామభేదప్రిభృతి సకలమంత్రాంగ విద్యాసముద్రం,
చావుండం వీరవైరిప్రికర సమరసం ఘట్ట కాలాగ్నిరుద్రం. ౯

క॥ ఎనె నెగళ్దా చావుండన, మనదన్నం నాగరాజ నఖిలనియోగ
జ్ఞనెనిప్ప దివాకరదే, వన పుత్రం వానసాన్వయాంబరమిత్రం. ౧౦

ఉ॥ త్యాగముణక్కె తాయ్వెనె సమస్తనృపాల నియోగవర్తన
శ్రీగె నివాస మిప్పరవిశిష్టర తోషణపోషణంగళొ
ళ్పాగర మెందు బణ్ణిసువు దీదగె పండితపారిజాతనం
నాగన నాజనార్దనన భక్తిభరప్రిభవానురాగనం. ౧౧

క॥ సంగనబసవన యగ్రిజ, లింగైకం దేవరాజమునిపన తనయం
జంగమపరుసం (కావ)ర, సంగం ప్రియసుతనెనిప్ప కలిదేవరసం. ౧౨

క॥ కలిదేవ మునిప నాత్మజ, సలె మూజగదొళగె మెఱెవ మానవదేవం
గెలిదం అళనబెసనవం, ఛలరధికం హాలబసవి దేవమునీశం. ౧౩

వ॥ స్వస్తిసమస్తభువనాశ్రియం,మహామాహేశ్వరం, కైలాసపురవరాధీశ్వరరుం, సువర్ణ
వృషభధ్వజం, తేసత్తిపురాతన పాదార్చకరుం, మహాలింగమప్రసాదనియతరుం,
సమయభక్తిసంపన్న శ్రీబసవరాజాన్వయరుం, అప్ప తపశ్చక్రవర్తివీరవ్రతి హాల
బసవిదేవంగె, ఆ మహాప్రధానం, రట్టరాజ్యప్రతిష్ఠాచార్యనుం, అప్ప నాగరసరు
శకవరుషం సాసిరదనూఱ యెంభత్తయెరడనెయ సిద్ధార్థిసంవత్సరదచైత్రబహుళ
అమాసె సోమవార సూర్యగ్రహళదల్లి హులిగెరెయ సోమనాథదేవర సన్నిధి
యల్లి, ఆ చౌడిసెట్టియ రాతీర్థవిశేషమం బెసగొళలు నూలెనాడొలగిన మనిత
నాడి కైలాసతీర్థం, నాల్కుయుగద పురాణోక్తదిం బందక్షేత్రవదెం తెందడె
కృతయుగదల్లి కైలాసముని కైలాసనాథ త్రేతెయలి అంకరాజముని అంకనాథ
ద్వాపరదల్లి మహారాజముని మహాలింగదేవ కలియుగదల్లి కవిరాజముని కవిదేవ
నామ, ఈ మునిగళు ముఖ్యసమస్తగణేశ్వరరు ఆరాధిసి సాలోక్యసారూప్య
సామీప్య, సాయజ్యవం పడెద మహాదేవరిగె అంకనాథవెసరిం అంకవల, తళ
వృత్తికొట్టసి, కుఱువనిగె ఈ హళ్లిమాంధాతచక్రవర్తి చిట్ట ధర్మ ఆ తీర్థక్కదు
శాసనస్థ వెంబుదం చవుడిసెట్టియరు కేళ్దు నాగరసరు తావు ఏకస్థరాగి కైలాస
పురదొళగె స్వయంభుమల్లికార్జున సంగమేశ్వర, నాగేశ్వర ఈ మూరులింగక్కం
అంగభోగ రంగభోగ జీర్ణోద్ధారక్కం పారణేయ జంగమారాధనెగం, కొట్టసి
కుఱువనినెగె తళవృత్తి అంకవల కూండినాడొళు సలువంతె హెజ్జగ్గియ హబ్బవో
భత్తుదిన సుంకనూఱత్తిన పరిహార యింతినితుమం సర్వాబాధ సర్వనమస్యవం
మాడి చవుడిసెట్టియదు నాగరసరు యతిరాయహాల బసవిదేవంగె పూర్వదత్త
వెందు ధారాపూర్వకం మాడి కొట్టరు. ఆ చవుడిడిసెట్టియర నియామదిం నాగర
సరుపురదిం పడువలు తొఱెయ కూడిద హళ్ళనీరు వరియేమేరెయాగిమేగె కలుకటిగ
గెఱె బసవగోడి బాడగలు మొసరగుత్తి యేరారవిడిదు మూడలుజంబిగల్ల కణి
కుచ్ఛగోడియిం బంద హళ్ళనీరువరియే టెంకలు తొఱెయ కూడలు ఈ చతు
స్సీమాభ్యంతర కైలాసపురదల్లి సుంకసాద తళసారిగె, బట్టెయు, బాధె, గ్రామ,
బ్రియ, నిధి, నిక్షేప అంకె, టంక, ఆణె గోసనె, ముద్రె, నాగేశ్వరకె మల్లే
రకె కుఱువనిగె, సంగమేశ్వరకె పారణేయ జంగమారాదనెగెకొట్టసిగె ఈధర్మ
క్కె యిదు వివరవందు నాగరసరు కొట్టశాసన నాల్కుం పట్టణంగళు నూలె
నాడొళగె సంతెగళ ఆయదాయ ఋవంతు కోణన మెయిదెరెసుంకహాన్నెణ్ణు
సమయవు ఆఱువత్తమూవరు బణజు భకుతి భేదవిల్ల కైలాసపురవే శాసనాద్యనె
బసవరాజనే శాసని ఎందు ఉభయనానాదేశి ముమ్మురి దండంగళు కొట్టశాసన. ౧౮

# ఆంధ్రవివరణ సంగ్రహము

౧. ఉన్నతశిరము నలంకరించు చంద్రచామరమునఁ జారుతరుఁడయి త్రైలోక్య నగరనిర్మాణ ప్రారంభమునకు మూలస్తంభమగు శంభునకు నమస్కారము.

౨. ప్రాణేశ్వరియగు గౌరీదేవిని వామభాగమున ధరించి, శక్తిత్రయమహిమాన్వితుఁడయి రాక్షసహృదయల కపాయము గలిగించు లీలావిలాసములు గలిగి వినమితు లగు వారి పాపములఁబోనడంచి భవహారుండగు శ్రీకల్లినాథుఁడు భక్తబృందమునకు శుభంబు లిచ్చుఁగాక.

౩. తర్దవాడిసీమలో మధ్యనున్న బాగవాడి పురమున కధీశ్వరుఁడగు మాదిరాజున కుదయించిన తనయుఁడు బసవరాజు మహిమ యెన్నఁదగినది.

౪. మంగళకీర్తి విరాజితుండును, పురాతనజంగమ లింగైకభక్తి సంపన్నుఁడునగు నా సంగనబసవన యనవరతము భక్తియం దోలలాడుచుండెను.

౫. యాదవభూమిపాలురు చతురంభోధిపరీత మగు భూతలమునెల్ల శాసించిరి. వారియం దశ్వదళసంపన్నుఁడగు సింహణుఁ డగ్రగణ్యుఁడు. అతని జ్యేష్ఠపుత్రుని కొమరుఁడు కన్నరుఁ డీ యిలాతలమునకెల్లఁ దన శ్వేతచ్ఛత్రచ్ఛాయను రక్షణ మొసంగి పరిపాలించును.

౬. బలవంతుఁడు ప్రతాప సహాయుఁడునగు నా కన్నర భూపాలుఁడు బ్రాహ్మణులకు భూమిహేమవస్త్రాదికములు దాన మొసంగి కీర్తికెక్కెను.

౭. సమస్త భువనాశ్రయాద్యనేక బిరుదవిరాజితుఁడు యాదవకన్నర నృపాలుఁడు నిజరాజధానియగు దేవగిరినుండి శాంతిసుఖసంయుతముగఁ బాలించుచుండెను.

౮ ఆ మహారాజు పాదపద్మోపజీవియగు చిక్కనకుఁ బిన్న కొమరుఁడు బీచుగి యనునతఁ డైశ్వర్యమునఁ గుబేరు నతిశయించును. అతని యన్న మల్లనామాంకితుఁడు. ఈ మల్లన కొమరుఁడు చావుండసెట్టి.

౯. అతఁడు పార్వతీశ్వరపదపద్మసౌరభభ్రమరాయమాణుఁడు. త్యాగభోగానుభవజనిత సుఖలక్ష్మీనృత్యమునకు రంగస్థలమువంటివాఁడు. సామభేదప్రముఖ సకల మంత్రాంగ విద్యాసముద్రుఁడు. శత్రువీరులపాలి కాలాగ్నిరుద్రుఁడు.

౧౦ వానస వంశాంబరమిత్రుఁడు, దివాకర దేవుని తనుజుఁడు, నిఖలనియోగ నిపుణుఁడునగు నాగరాజను నతఁడు చావుండ సెట్టికిఁ బరమమిత్రుఁడు.

౧౧. ఆ నాగరసు త్యాగగుణమునకు స్థానము. సకలనృపాలనియోగ వర్తనమునకు నివాసము. పండితులపాలి పారిజాతము. శిష్టులకుఁ బోషణము, తోషణము గూర్చువాఁడు. జనార్దనునియం దెక్కువ భక్తిగలవాఁడు.

౧౨. సంగన బసవన యగ్రజుఁడగు దేవరాజమునికి కావరసను నతఁడు పుత్త్రుఁడు. అతఁడు జంగముల పాలి పరుసవేది. ఆతని కొమరుఁడు కలిదేవరసు. (ఇందుఁ గూర్చి వ్యాసములోని వివరములు చూడఁదగును.)

౧౩. కలిదేవముని తనయుఁడు హాలబసవదేవముని. అతఁడు ముల్లోకము లందలి మానవులకు దేవునివంటివాఁడు. అధిక తపస్సంపన్నుఁడు. క్షుత్పిపాసల రెంటిని జయించినవాఁడు.

౧౪. ఈ హాల బసవదేవ మునీశ్వరుఁడు సమస్త భువనములకు నాశ్రయమువంటి వాఁడు. మహామాహేశ్వరుఁడు. కైలాసపురమున కధీశ్వరుఁడు. సువర్ణవృషభ లాంఛనుఁడు. అఱువత్తుమూవురుభక్తుల పదపద్మముల సేవించువాఁడు. మహ లింగ జంగమ ప్రసాదములందు నిరతిశయ నిష్ఠగలవాడు. సమయభక్తి సంపన్నుఁడగు బసవేశ్వరుని వంశమువాఁడు. హుళిగేరిలోని సోమనాథాలయమున వసించి యుండఁగా శకవర్షము 1182 అగు సిద్ధార్థి సంవత్సర చైత్ర బహుళ అమావాస్య సోమవారమునాడు సూర్యగ్రహణ సమయమున రట్ట రాజ్య ప్రతిష్ఠాచార్య బిరుదాంకితుఁడగు మహాప్రధాని నాగరసయ్యయు చౌడి సెట్టియుగూడి వీరవ్రతుఁడు తపశ్చక్రవర్తి యునగు హాలబసవదేవుని నూలెనాడు లోనికైలాసతీర్థ పూర్వవృత్తాంతము చెప్పుమని ప్రార్థించిరి. దాని నాతఁ డిట్లు వచించెను. కృతయుగమునఁ గైలాస మునీశ్వరుని ప్రార్థనముపయి గైలాస నాథుఁడనియు, త్రేతాయుగమున అంకరాజముని ప్రార్థితుండయి అంకనాథుఁ డనియు, ద్వాపరయుగమున మహారాజముని ప్రార్థనమున మహాలింగ దేవుఁ డనియు, కలియుగమున గలిరాజముని ప్రార్థనమునఁ గలి దేవుఁడనియు నామములు దాల్చి మహేశ్వరుఁడీ కైలాసపురమున నధివసించియున్నవాఁడు. ఈ చెప్పిన మునీశ్వరులును, సమస్త గణేశ్వరులు నా దేవు నారాధించి సాలోక్య, సారూప్య, సామీప్య సాయుజ్యములఁ బడసిరి. అంకనాథం డని పిలువఁబడు మహాదేవునకు మాంధాతచక్రవర్తి కైలాసపురమను నీగ్రామము నొసంగి యందలి కొట్టసి, కుఱువనిగె, అంకవల, తళవృత్తిమొదలగు వన్నియ నెల్ల ధర్మము చేసెను. ఈ సంగతులు విని నాగరసయ్యయు, చౌడిసెట్టియు గైలాసపుర గ్రామమందలి స్వయంభు మల్లికార్జున, సంగమేశ్వర, నాగేశ్వర,

లింగముల యంగరంగ భోగములకుఁ దదాలయ జీర్ణోద్ధరణమునకు జంగమ సమారాధనమునకుఁ గాను బూర్వోక్తము లయిన పన్నులఁ బరిహరించి కూండినాడు నందు హెజ్జుగి పర్వ (పంటలు కోఁతకుఁ వచ్చునపుడు ఆశ్వయుజ పూర్ణిమనాఁడు చేయుపండుగ) సందర్భమున, దొంబది దినముల పర్యంతము జరుగు నుత్సవములో నూతెద్దుబండ్ల పయివచ్చు సుంకములతోఁగూడ హాలబసవదేవునకు ధారాపూర్వముగ నొసంగిరి. చాడిసెట్టి కోరికపయి నాగరసయ్య కైలాసపుర గ్రామము నలుదిక్కుల మధ్యను రాఁదగుఁ సుంకములనెల్ల దాన మొసంగెను. వానిలో సాద, తళ, సారిగె, బట్టెయ, చాధె, గ్రామ, బ్రియ, అంకె, టంక, ఆణె, గోసనె, ముద్రె, నిధి, నిక్షేప, అను వ్యవహారముగలసుంకములు నాగేశ్వరాలయమునకు, కుఱువనిగె యనునది మల్లేశ్వరాలయమునకు, కొట్టసిగె యనునది సంగమేశ్వరాలయమునకు జంగమపారణమునకు నొసంగఁబడెను. నాలుగు పట్టణముల వారు నూలె నాడులోని సంతలవలన వచ్చు నాదాయమును, దున్నపోతుల మీఁది పన్నులను నిచ్చిరి. అష్టాదశసమయముల వారు, అఱువదిమూఁడు బణజ భక్తకులములవారు భేదములెల్లఁ బోవిడిచి, దాన మిచ్చినది కైలాసపురమని ప్రతిగ్రహీత హాలబసవదేవుఁడని పాటించి పయి దానముల నొసంగిరి.







# శ్రీ శివానంద శాస్త్రిగారి సంగతి

గుంటూరు జిల్లా కొర్నిపాడు వాస్తవ్యులుగా చెప్పబడు శ్రీ పండితారాధ్య శివానంద శాస్త్రి గారొకరు కలరు. 3-4 సంవత్సరముల నుండియు వీరు నిజా ప్రాంతమునను ఇతర స్థలములందును సంచరించుచు తమ పని యేదో చేసికొ చుందురు. వారి స్వార్థమును గూర్చి మాకు జోక్యము లేదు. కాని వారు అనవస ముగ వీరశైవ మతమును గూర్చియు వీర మాహేశ్వరులను గూర్చియు మిథ్యా లా ముల నాడుచు లోకుల భ్రమింపజేయుచు కలహముల లేవదీయుచు నుందురు. క్షే వనేక గ్రామములలో గడిచినవి. సక్రమమైన శాస్త్రవాద పద్ధతిని వదలి వికట మార్గమున బడి వివదించుచుందురు. దామర యను గ్రామమున ఆ గ్రామస్థ ప్రార్థన ననుసరించి మద్గురువర్యు లయిన వేద కావ్య స్మృతి తీర్థ ధర్మా శ్రీ పండిత చిదిరె మఠము వీరభద్రశర్మ శాస్త్రిగారు శివానందశాస్త్రి గా వాదమున పరీక్షించి చూచిరి. శాస్త్రజ్ఞానముతో గాని మతగ్రంథములతో గా వీరి కేమాత్రము సంబంధము లేదని స్పష్టముగా దేలినది. ఈ వాద సమాచార నంతయు అపుడు నేను ప్రకటించిన "శివానందశాస్త్రి శృంగభంగము" అను పత్రి మున దెలిపి యున్నాడను. ఇది లోక ప్రసిద్ధమైన విషయము. తరువాయి నైన శివానందులు లౌకికముగ మెదలుకొనెద రనుకొంటినిగాని అక్కడక్కడ రహస్యము నింకను జంగమ మాహేశ్వరులను దూషించుచు గురుద్రోహమును గావించుచు ఇటీ మరొక చిన్న పుస్తకమును ప్రకటించినట్లు తెలియుచున్నది. వారికి ఈ వ్యాస ద్వారా సూచించు సంగతి యేమనగా.—

సుప్రసిద్ధ పండితవర్యు లగు బ్ర॥ శ్రీ॥ చిదిరెమఠము వీరభద్రశర్మగారు శ్రీ జగద్గురు రేణుకాది పంచాచార్య పరంపరాగతులగు వీరశైవ జంగమ మాహేశ్వరు యొక్క వైదిక బ్రాహ్మణ్యమును, శివలింగధారి సర్వజన గురుత్వమును, బోధించు టకును వాదించి సిద్ధాంత పరచుటకును సర్వదా సంసిద్ధులై యున్నారు. ఇట్టి వా సభకు భారతదేశపు సుప్రసిద్ధ సంస్కృత పండితు లెవరైనను వచ్చి పాల్గొనవచ్చు ఎవరోడినను తాము మొదలు వ్రాసియిచ్చిన నియమపత్రిక ననుసరించి శిక్ష పాత్రులు కావలెను.

ఈ సుపద్ధతికి గురిగాక ఉన్మత్త ప్రలాపముల నింకను సాగించుచుందురే ఈ పత్రికద్వారా వారి వాదము విపులముగా విమర్శింపబడగలదని తెలి కొందురుగాక !

జి. గురుసిద్ధశర్మ, కావ్యతీర్థ,

# కొన్ని సూచనలు

## మా క్రొత్త రాజపోషకులు

నిడదవోలు వాస్తవ్యులైన శ్రీ దేవిశెట్టి అమ్మన్నగారు మాపత్రికకు రాజపోషకులై ఒక నూరు రూపాయిల (100-0-0) వాగ్దానమును గావించినారు. వీరి యభిమానౌదార్యములు మిక్కిలి ప్రశంసాపాత్రములు.

## ద్రవ్యదాతలు

మాకు ఇదివరలో వాగ్దానము గావించిన ఈ క్రింద కనపరచిన మహనీయులు ఈ నెలలో తమ సహాయమును కొంత బంపించినారు. వారిపేరులను బ్రకటించుచున్నాము. తక్కిన దాతలుకూడ త్వర్వగా తమ తమ సహాయమును అందించగలరని మిక్కిలి నిరీక్షించు చున్నాము.

రు ౧౦౦లు శ్రీ ష॥ బ్ర॥ శ్రీ ముమ్మడి సిద్ధశంభు స్వాములవారి యనుమతిని శ్రీ శ్రీ మఠం
,, నడిపూడి నాగభూషణ దేవరగారు (రెండవసారి) చేబ్రోలు.
౨౦ ,, ఆరాధ్యుల మూటయ్యగారు, సామార్లకోట.
౩౦ ,, శరణార్థి గౌరయ్యగారు, సబ్‌రిజిష్ట్రార్ (రెండవసారి) తాడేపల్లిగూడెం.
౫ ,, చుక్కా కబ్బయ్యగారు, ,, నర్సారావుపేట.
౫ ,, నేలవల్లి నాగమల్లయ్య, కోటి వీరయ్యగార్లు ,, ,,
౫ ,, బొందెలపాటి కోటయ్యగారు, ,,
౪ ,, చందనము కోటయ్య, బొందెలపాటి శివయ్యగార్లు ,,
౧౦ ,, నేలవల్లి మల్లికార్జునుడుగారు ,,
౫ ,, చదువుల సోమయ్యపంతులుగారు సత్తెనపల్లి.
౨౫ ,, చుక్కా శనగల కోటివీరయ్యగారు (రెండవసారి) కొర్రపాడు.
౫ ,, చుక్కా కోటివీరయ్యగారు, గ్రామమునసబు ,, ,,
౫ ,, చుక్కా బసవకోటయ్యగారు ,,

## క్రొత్త దాతలు

ఈ క్రింద కనబరచిన వారు విభూతి పత్రికా సహాయార్థమై క్రొత్తగా వాగ్దానముల గావించి యున్నారు. త్వరగా సహాయమును బంపి యుపకార మొనర్ప గోరుచున్నాము.

౧౦ రులు శ్రీ గిద్దలూరి చెన్నబసవయ్యగారు, నర్సారావుపేట.
౧౦ ,, చుక్కా రాచమ్మగారు, ,,
౨౫ ,, చదువుల సోమయ్యపంతులుగారు, సత్తెనపల్లి.
౫ ,, కమ్మకల్లు పెదకోటయ్యగారు ,,
౫ ,, కమ్మకల్లు లింగయ్యగారు, ,,
౬ ,, గంతా నాగయ్యగారు, ,,
౧౪ ,, కమ్మకల్లు చిన్నకోటయ్యగారు, నూతికట్టు మల్లయ్యగారు,
చిలుగూరి బసవయ్యగారు, రేఖం పుల్లయ్యగారు. ,,

## చందాదారులకు

యుద్ధము హేతువుడివలన కాగితముల ధర విపరీతముగా పెరిగి పోవుచున్నది. కావున ఈ పత్రికలో 8 పేజీలు తగ్గించితిమి. స్వంతమైన ముద్రాక్షరశాల మున్నగు సౌకర్యములు లేని మా విభూతి పత్రికను సక్రమముగ ప్రకటించుటయే దుర్భరముగా నున్నది. పత్రిక యొక్క చందా రెండున్నరగా ప్రచారార్థమై నిర్ణయించితిమి కాని, అది సరియైన వెలకాదు కావున తామందరు అభిమానము వహించి క్రొత్త చందాదారులను, సహాయకులను జేర్చి తోడ్పడనిచో చాల చిక్కులు యేర్పడునట్లు కనుపడుచున్నవి. కొందరు మహనీయులు తమ పత్రిక చందానుకూడ పంపరైరి. ఇక వారి వాగ్దాన సహాయములమాట నెత్తనక్కరలేదు. ఇట్టి విపరీత పరిస్థితులలో వ్యయ ప్రయాసలు గల పత్రికా ప్రకటనమును గూర్చిన కష్టపరంపరలను దృష్టియందుంచి, కలవారైనను నిష్కపటముగ దోడ్పడ గోరుచున్నాము.

## సిద్ధాంత శిఖామణి

శ్రీ జగద్గురు రేణుకాచార్యుల మహోపదేశమును సర్వసమర్థమును, సుప్రసిద్ధమును అగు సిద్ధాంత శిఖామణి యను గ్రంథము చిన్నసైజులో పరిశుద్ధముగా ముద్రింపబడి అమ్మకమునకు సిద్ధమైనది. పదిరోజులలో పాఠకులకు జేరగలదు. మేము మొదట సూచించిన ప్రకారము వెల నాలుగణాలు మాత్రమే! బుక్ పోస్టుగా బంపినచో ఒక అణా చార్జి యగు నను కొంటిమి గాని బ్రిటిషు ప్రాంతమువారికి అణన్నర (0-1-6)యు, నిజాం ప్రాంతము వారికి రెండణాలు (0-2-0)ను పోస్టు చార్జి ప్రత్యేకముగా నగును. కావున ఆయా గ్రామస్థులు ౧౦, ౧౫ ప్రతులను ఒకేసారి తెప్పించి వీరశైవు లందరిలో దీనియొక్క పారాయణమును తప్పక ప్రచారము గావింప గోరుచున్నాము. ఇదివరకే చాలా ఆర్డరులు వచ్చియున్నవి కాబట్టి ప్రతులు కొలదిగా ముద్రింపబడినవి కావునను తమ తమ ప్రతులను త్వరగా రప్పించుకొనవలెను. వీరశైవుల కీ గ్రంథము కల్పవృక్షము వంటి దని తెలుప నక్కరలేదు.

మేనేజర్ - 'వి భూ తి'

4268 సజ్జలాల్ వీధి, సికిందరాబాద్ దక్కన్.






స చి త్ర మా స ప త్రి క

సంపుటము ౨ | శా. శ. ౧౮౬౨ విక్రమ సంవత్సర ఆషాఢమాసము | రేఖ ౫

Vol. 2 | 22 జూలై 1940 సికింద్రాబాద్ | No. 5

# అదృష్టము

శ్రీ కొమరవోలు వేంకట సుబ్బారావుగారు, బి. ఏ.

ఉ॥ ఓసి యదృష్టమా! యెచట నుంటివె? నిన్నొక పూర్వసంచిత
గ్రాసముగా వచింతురు పురాణములన్ రచియించినట్టి స
న్యాసులు కొంద ఱా నుదుల నారసి, పౌరుషమందు నమ్మికన్
బాసి, వృథావిచారములఁ బైకొని. నిర్ధృతు లైరి లౌకికుల్.

ఉ॥ రూకకు రూకఁ బెంచికొను క్రూర కుసీదుని పట్టుసెజ్జపైఁ
గేకిస లాడుచుం గనులగీటెడు నోసి మహేంద్రజాలినీ!
యాకటి చుమ్మలన్ సురుగు నట్టి దరిద్రుని గర్భవహ్నికిన్
నీకును నెంత దూరమె! ధ్వనించునె పేదలకూయి నీ చెవిన్.

శా॥ నీలో నున్న మహత్త్వ మెట్టిదియొ కానీ బిచ్చగాఁడాదిగా
శ్రీలోలుం డగు వానిదాఁక నిజదారిద్ర్యమ్ము నైశ్వర్యమున్
మేలుం గీళ్ళును నీదు కల్పనలుగానే యెంచి చింతింతురే!
కాలావస్థలు హేతుసూత్రములు భగ్నంబయ్యెనే సృష్టిలోన్.

చ॥ జనపతి స్వీయరాజ్యము ప్రజానిచయం బధికారివర్గమున్
ధననికరంబు లొడ్డి కదనం బను జూదమునందు నీదుకొం
గును గ్రహియింపఁగాఁ దలఁచి క్రుంగఁగఁ జేయు జగంబుఁ గాని నీ
వెన రెవనిన్ వరించునో గణింపఁగలేక తపించు నెప్పుడున్.

శా॥ ఆశాంతంబుల నిల్చి యత్నములకున్ స్వాధీనవుంగాక యా
కాశాంతర్నటియైన క్రొమ్మెఱుఁగుదీఁగన్ బోలి యింతింతలో
నాశమ్మౌచు మఱింతలో మెఱయుచున్ మాయా మహానాటక
ప్రాశస్త్యమ్ము వహించు నీ కిదె నమోవాకమ్ము భాగ్యేశ్వరీ.

*   *   *   *

శా॥ ఇక్కాలంబున ధాత మానవ భవిష్యత్వంబులన్ వ్రాయుచో
పెక్కం డ్రింగిత నష్టబుద్ధులకు డర్బీలాటరీ గుఱ్ఱపుం
డెక్కల్ గైకొని ఫాలపట్టికల సృష్టిన్ జేసెనో కాక యే
లెక్కన్ విత్తము చిత్తమున్ గెలువఁజాలెన్ జూడుడా ధీవరుల్

మ॥ జననస్థానము నత్తయైనది యదృష్టం బున్నచో ముత్తెమై
చనున ట్లీగతి యెల్లవారల కదృష్టప్రాప్తమై యుండునం
చునె చింతించునెగాని జీవితము సంశోభించు ధర్మప్రవ
ర్తన శిక్షారతి నంచు మానవుఁడు స్వాస్థ్యం బందగా లేఁ డహో!

గీ॥ పౌరుషమె ఫలప్రాప్తికి కారణ మగు, నడ్డగింపకయుంటె దైవానుమతము,
భాగ్యదేవత కొంగునేపట్టి జీరు, కాడువారికి లేదు మోక్షానుభవము.





# ఆంధ్రభాష, కవులు, వ్యాకృతులు

ఉభయభాషాప్రవీణ, శ్రీ పెరవలి లింగయ్యశాస్త్రిగారు

ఆంధ్రభాష సర్వతోముఖముగ గంగాస్రవంతివోలె నిమ్నోన్నత భావాఘాతములబడక యాంధ్రావనిలో జాలువాఱినది. కలగూరగంపవలె వివిధప్రాంతముల భాష లందున మేలవించినవి.

'రససిద్ధాః కవీశ్వరాః' "ప్రకృతిక్కి భావ్యప్రణేతల్ కవుల్॥

ఉండేది పల్లెటూరులయం దైనను నందనోద్యానమును బోలిన గృహారామములయందు రాజోద్యానములయందు పర్వతోపత్యకలయందు భర్మహర్మ్యములయం దున్నట్లు భావనాబలముచే మహాకవులు రససిద్ధులభాతి రమించినారు. ఒకటనేమి? చివరకు అసూర్యంపశ్యలగు రాజదారలు సైతము వారి కుపమేయాంశములైనారు. మహాకవుల వాగర్థప్రతిపత్తి, నాంతరీయక సంబంధముఁగలది. వారి కృతులవలోకించుతఱి యీ విషయము ప్రప్రథమతః సహృదయులకు గోచర మగును. మహర్షులు ప్రయోగించు వాక్కులవెంట అర్థము, తల్లివెంటఁ దగిలివచ్చు దూడవలె వారించితినను వర్ణనీయాంశమును విడువజాలదు. అందుననే గాబోలు భవభూతితన కృతిలో నేతదర్థకశ్లోకమును జేర్చినాడు.

"లౌకికానాం హి సాధూనా మర్థం వాగనువర్తతే
ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థోఽనుధావతి."

ఇచట తదర్థబోధకక్రియ లెన్నియున్నను భవభూతికిఁ గలిగిన యుద్గారము 'అనుధావతి' తోఁ దీరిపోయినది. ఇప్పట్టున నదియెంతయు నన్వర్థము. అన్వర్థతమము.

పూర్వకవుల ప్రబంధముల శ్రద్ధతో జూచితిమేని భాషకు మాఱుస్వభావము కలదని తోపకమానదు. తెనుఁగున జూచితిమేని నన్నయభట్టారకుఁడు మొదలగు నేకొందఱో తప్ప విమర్శనగ్రంథములు లక్షణగ్రంథములువ్రాసినవారు చాలతక్కువ. వ్రాసినవారే కొందఱోయున్నను అవిగూడ పరిమితములే. ఇప్పటికి భాష మారిన కొల్ది వ్యాకృతులు రచింపఁబడుచున్నవి.

ఇక్కడికి తీఱిపోయిందిరా దేవుడా యని యనుకొందామంటే ఇంకయు నెన్ని పుట్టనున్నవో తెలియదు.

నన్నయభట్టీయమును గూర్చి మహాభాష్య మంత వ్యాఖ్యానము వ్రాసిన 'అహోబలపతి'ఆంధ్రభాషను సర్వవిధాలా సంస్కృతంతో తులతూగిద్దామనీ, తాను గూడ సర్వవిధాలా పతంజలి ననుపించుకొనవలయు నని చాలా తంటాలుపడినాఁడు. అదేధోరణిలోఁ జాలాప్రమాణగ్రంథము లనుపించుకొనఁ దగినవి, విమర్శక దృష్టితో నప్రామాణ్యములైనవి. నన్నయభట్టారకుఁడు వాగనుశాసనుఁడై యాతని ప్రయోగము లె ట్లాదరణీయములో తిక్కన్నగారును అట్లే. ఆతని ప్రయోగము లును మాననీయములే. ఆయన వాగనుశాసనుఁ డైతే యీాయన తరువాతి కవుల కెన్నియో కవితారహస్యముల జాను తెనుఁగునఁ జాటి కవిబ్రహ్మమైనాఁడు.

సంస్కృతభాషలో "బాణోచ్ఛిష్టం జగత్సర్వ" మన్నట్లు తెలుఁగుఁదేటలు నానారీతులఁ దీర్చి దిద్ది భావికవుల కెందఱకో తొలిభిక్ష పెట్టినాడు సోమయాజిగారు. శ్రీనాథాది మహాకవు లందఱును భట్టారకుని ప్రయోగాలతోఁ బాటుగానో, హాని కన్న నెక్కువగానో సోమయాజిగారి ప్రయోగాల నాదరించుచు, నట్టివాటినే తమ గ్రంథాలలో వాడియున్నారు.

క॥ అగుననఁ గొమ్మ్రయతిక్కఁడు - జగతి నపూర్వార్థ శబ్దచారుకవితమై
నెగడిన బాణోచ్ఛిష్టం - జగ త్త్రియం బనిన పలుకు సఫలంబయ్యెన్.

అని పంచమవేదమునాఁ బరగిన మహాభారతాంధ్రీకరణ ప్రతిష్ఠాపితాంధ్రి వాగ్దేవతామంగళవిగ్రహుఁ డగు తిక్కనను వేనోళ్లఁ బ్రస్తుతించిరి. 'సిద్ధి ర్లోకా ద్దృశ్యా'యని వాగనుశాసనుఁడు వ్రాసినాడు. లోకసిద్ధ మగు శబ్దార్థజాలమును వదలి నూత్న సృష్టి యొనర్చుట 'మురారే స్తృతీయః పంథా' యను దానివలె విలక్ష ణముగాక పోయినా విశ్వామిత్ర సృష్టివలె సామిఘటితము కాక పరిపుష్టమై సహృద యోల్లాసి యగుచో నందనీయమే. కాని తిక్కనగారు ప్రతిభాస్ఫోరకము లగు స్వాతంత్ర ప్రయోగముల నెన్నిఁటినో వాడియున్నారు. అక్షౌహిణి అనేదానికి బదులు అక్షో హిణి యని తిక్కన్న'గారు మహాభారతములోనే అసకృదావృత్తిగా నుపయోగించి యున్నారు. పాణిన్యాచార్యుని దృష్ట్యా చూచిన మన సోమయాజిగారి యక్షోహిణికి క్షతి లేదుగాని "అక్షా దూహిన్యా ముపసంఖ్యానమ్" అను వార్తికాన్ని అతిక్రమించి నదే—యనుట సుస్పష్టము. ఇంతమాత్రముచేత కవిత్రయములోఁ జేరిన తిక్కయజ్వ మునిత్రయమును అతిక్రమించిన వాఁడని యనుట సాహసికమే? అయితే మహాకవి యే యభిప్రాయమును మనమున నుంచుకొని వాడియున్నాఁడో స్థూలదృష్టికి గోచరింపదు.

గురుకులవాసముఁ జేసి ఆభాష్యాంత మభ్యసించిన వైయాకరణులు ద్రష్టవ్యులు అయినా సంస్కృత వ్యాకరణశాస్త్ర మపార పారావారము వంటిది. 'నిరంకుశాః కవయః' అను నభియుక్తోక్తి మహాకవులయెడ వర్తించవలసినదే గదా?

కేవల సంస్కృతపదములతో వాడఁబడు "మయట్" అను ప్రత్యయమును గూడ "యజ్వగారు" శరపరంపరగా 'తనమయము' 'నెత్తురుమయము' 'పేగుల మయము' అను నిత్యాదులు వాడి యున్నారు. శిష్టవ్యవహృత మగుట నియ్యవి దుస్సాధములు కాఁజాలవు. మొత్తమునకు తిక్కయజ్వగారి యాంధ్రపు నుడికారపు వన్నెచిన్నెలు నిగని నిగని దేటలు గల పలుకులు. ఆంధ్రభారతీ కంఠాగ్రహారమున మధ్యమణు లని యనఁ జెల్లును. ఆంధ్రవ్యాకరణదీపము కడుంగడు చిన్నది. ఎందరు మహామహులు రచించినా 'త్రిలింగ లక్షణ శేషములు' పదంపడి పుట్టుచునే యున్నవి. చిన్నయసూరిగారు మాత్రము తన వ్యాకరణమునఁ బ్రకరణ విభాగమును 'సిద్ధాంతకౌముదీ' ఫక్కితోఁ బచరించినారు. చాల పరిశ్రమఁజేసి ప్రక్రియా భాగముతో సహా శబ్ద వ్యుత్పత్తి మున్నగువాటిని వ్రాసినారు. ఎన్ని వ్రాసినా సంస్కృతమంత కట్టుబాటు తెలుఁగున కెక్కడిది? క్త్వార్థేత్తునకు సంధి కలుఁగదని నాఁడు గాని, పసగా కవిత్వముఁ జెప్పఁగల మహాకవులు, కవులు అసకృదావృత్తిగా 'వరియించిట' 'మధురామృత మానిట' 'నానర్చిటు' అని వాడియున్నారు. ఇంకను కావలసివస్తే మోతబరి ప్రయోగము లున్నవి. అవి యన్నియు తజ్జ్ఞు లెఱుఁగనివి గావు. అందుననే గాఁబోలు శ్రీ శతావధాని, చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారు, 'జయంతిలో' నీ విధముగా వ్రాసియున్నారు.

తే.గీ. అఱవముననుండి,కన్నడమందునుండి, తురకముననుండియెన్నియో దొరలెనిందు
పదము లెట్టెటులోను,తత్పథము సరిగ, తెలుప నెవ్వరి కేనియుఁదరముగాదు.

తే. గీ. కవులు కొందఱు లక్షణ గ్రంథములను,వ్రాసి పెట్టిరి అవి కొంతవఱకు సాయ
మాచరించెడిఁగాని యీ యాంధ్రదాన శిక్షితముగాక పై పయిఁ జేయిసాచు.

చ. తెలుఁగున కున్న వ్యాకరణదీపము చిన్నది యంచు మున్ను నే
దెలిపితి, దానిఁ గా దనరు ధీపరు లిప్పటి మాకుఁ బూర్వపుం
దెలుఁగు మహాకవీశ్వరులె దిక్కు కవిత్వముఁ జెప్పువట్ల యిం
దులకు వివేకు లెల్లరును దోయిలియొగ్గుదు రేకవాక్యగన్.

వాక్సిద్ధి వాక్శుద్ధియుఁ గల మహానుభావులు, వంద్యులు కాని లాక్షణికులకు మాత్రము లాక్షణిక సమయాల నతిక్రమించిన కవులు ప్రాణగొడ్డ మనఁబడుదురు.

ఛాందన మనేదిప్పై దికులతోఁబాటు లక్షణ గ్రంథకర్తలను సైతము వదలినది కాదు. కాకునూరి అప్పకవి భాగవతము కంటే లక్షణ సమయాల నతిక్రమించిన యెందరో కవుల కృతులనుండి పద్యముల లక్ష్యములుగా నుదహరించినాడు. పోతన కవిని మాత్రము ససేమిరా యని సుతరాముగా నొప్పుకొనలేదు. అప్పటి నుండియుఁ గొందఱు ప్రయోగ మిట్లాంధ్ర భాగవతములో నున్నదనఁగానే 'లశునపలాండువు'ల వలెనే యేవగింపుచూపుతో చూడ మొదలుపెట్టినారు. దీనినిఁ జూచి సైరింపక కూచిమంచి తిమ్మకవి మహాప్రసాద మసి పోతనకవి బహిష్కారాన్ని తొలగించుటకు నే కారణమునుఁ బట్టి లాక్షణిక మహాశయులు వెలివేసినారో అవి యన్నియు 'హుళక్కి'యని యనినాడు. బహులాక్షణికులు తోసిరా జనినారు గదా సహజ పాండితీ ప్రశస్తుఁడగు పోతననంటే జవాబు—చెప్పేది కష్టమే! లేక పోతన విషయములో వారు మాత్రము సంకుచితదృష్టులే యని చెప్పుటకు సాహసించాలి. కాక పోతే గోస్తనీ పాకములోఁ బడిన పోతన మహాశయుని పద్యములఁ దమ లక్ష్య గ్రంథములలో తారహారములవోలె చేర్చుకునే భాగ్యమైనా వారికి పట్టలేదని తలంచవలసి యున్నది.

క॥ పురసతుల విలోకనములు, సరసాలాపములు నర్మ సంభోగంబుల్
మఱిగి హరి మనల నొల్లఁడు, నరవరు లో యమ్మ నూతన ప్రియులు గదే.

అను నీ పద్యమునుఁ (దశమస్కంధ పూర్వభాగము 1230) అహోబలపండితుఁడు ప్రాసమున రేఫశకటరేఫ సాంకర్యమైనది లక్షణ విరుద్ధ మనినాడు. కాని యిప్పుడు మనకు గనఁబడే నూత్న ముద్రితము లగు భాగవతములలో పరిష్కర్తలు "మరిగి" యని "ర" లఘు రేఫముతోనే సంస్కరించినారు.

కూచిమంచి తిమ్మకవి మాత్రము,

"కాకునూరి యప్పకవి యహోబలపతి, ముద్దరాజు రామ ముఖ్యులెల్ల
పోతరాజు కబ్బమున ఱాలు రేఫలు, గదిసె నంచు బలికి రది హుళక్కి"

అని వీ రన్నా 'అఖిల వేదాంత విద్యారహస్యవిదుండు, సహజ పాండిత్య విశారదుండు నైనను పోతనను పటుతర కవితా విభాసిత ప్రతిభుండు, సకలాంధ్రలక్షణ చక్రవర్తి' యనియే ఘంటాఘోషముగఁ బలికినాడు. అధిక్షేపించిన వార్లని అజ్ఞలని గూడ అనినాడు. పోతన మత్తక్షితీశాధమస్తోత్రవిముఖుండు గావున 'సర్వజ్ఞ సింగయక్ష్మావరుం'డంకితము నీయ నందులకు నలిగి భూమిఁ బాతించిన చివికిన భాగములఁ గొందఱతని శిష్యులు రచించిరి. అద్దానం జేసి ఖిలభాగముల రచించిన వారి

కవితయందే ఆయాయి పట్టుల రేఫ అకారసాంకర్య మున్నదని వారికవితనుండి యుదాహరణములఁ గూడఁ జూపియున్నాడు. పాపము! తిమ్మకవి యుదాహరించిన పద్యములయందు నేటి భాగవత నూత్నముద్రిత గ్రంథములయందు ప్రాస, యతి, స్థానములయందు ఆ రేఫల సాంకర్యము లేకుండ పద్యపాదము మార్చి సంస్కరించి నట్లు పొడకట్టును. భాగవత కృతికర్తల యపయశమును మాత్రి మీ సంస్కర్త మహాశయులు పోగొట్టినా, పోతనను ఈసడించిన లాక్షణికుల వ్రాతలన్నియు అసూయాగర్భితములో సత్యేతరములనియో నమ్మవలసి వచ్చుచున్నది. ఏదియుఁ దెలియని వారికి నద్యైతావుల కవి హృదయమేమో గోచరింపదు. ఇంతయు వ్రాయునదేమనగా సంస్కర్తలున్నదున్నట్లు వ్రాస్తే సత్యాసత్యములు గోచరించును. కవిహృదయము, ఆతనిపోకడలు, ధారాశుద్ధి, జిజ్ఞాసువులు తెలిసికొనెదరు. ఒకరిపోకడ లొకరికి రాఁజాలవు. 'ప్రాచి, ప్రాచియే ప్రతీచి ప్రతీచియే'.

ఇఁక మహాకవి నన్నెచోడఁడు తేనెసోనలు 'జల జల' పాఱినట్లు పద్యముల నల్లినవాఁడే. అటుసంస్కృతమున నిటు తేటఁదెనుఁగున నవరసముల సహామహామిక చే నలల తరబడిగా నల్లికఁగనినవి. కటుశబ్దమొకండునుఁ గంటఁబడదు.

జిబిబిలిపలుకుల కలయికలు రసపిపాసువులకు, మలికలై తలమునకలు గావించినవి.

కాని యాతఁడొక దీర్ఘసమాసములో

" అశ్రిమమున విఖండించి యరదసూత
రథ్య కేతన కోదండ రాజితోడ "

అని రథశబ్ద తద్భవమగు నరదమును దంచి ప్రయోగించినాడు. ఇచటనేగాక 'అరద' యను తద్భవమును, పౌనః పున్యముగా వాడియున్నాడు. ఇంతమాత్రముచే నీతఁడు అలాక్షణికుఁడేనా ?

'కవిరాజ మనోరంజన' గ్రంథకర్త యగు నబ్బనామాత్యుని కవిత్వము చాల సరసమైనది.

కాని కొన్నికొన్నిపట్ల అంటే సంస్కృతముపట్ల సుమండీ? దొరకుతాఁడు. ముద్దులొ మూటగట్టే కవితాధాటి, అంబరచుంబి యగు సమాసధోరణి. మచ్చున కొకటి చూడుడు.

"వలపించుటే కాని వలచి దక్కవుగదా ? కుసుమబాణునికైనఁ గోమలాంగి,
వినయమ్ములేకాని చనవు వేఁడవు గదా ? దేవేంద్రునైన నిందీవరాక్షి"

అన్నియు నోటికి నేర్వఁదగినవే యీయన పద్యములు. ఎంత క్లిష్టప్రాసముతో పద్యమునుఁ బ్రారంభినా, పోతరాజు అబ్బనామాత్యుఁడు యత్యర్థక ప్రాసార్థక పదములఁ బ్రయోగించి కుంటుపద్యమును రచింపరు. ఇంకయు మహాకవు లనూన శేముషీధన్యులు, పాతగలవోలె పద పద్యముల "గుమగుమ" పిసాళించు సూక్తి సుమముల నిలువఁజేసి యున్నారు. ప్రయోగములు దొరికితే ఏలాగైనా సాధుత్వము సంపాదింపవచ్చును.

"వైయాకరణ పిశాచాః ప్రయోగమంత్రేణ" అనే అభియుక్తోక్తి నేటిది గాదు. సర్వకవులకు సమ్మతమైనదే.

"శాస్త్రప్రయోగ వచసో శ్శాస్త్రం బలవ దుచ్యతే
అనిష్పన్నే పదే తేన ప్రయోగాఽశ్రయణం బలమ్."

శాస్త్రప్రయోగములు రెండును వ్యతిరిక్తము గాకయున్న శాస్త్రమే బల వత్తరము. శాస్త్రమువలన ప్రయోగము నిష్పన్నముఁగానిచో నద్దానికి ససాధుత్వము కల్పింపక ప్రయోగమునే ప్రమాణముగా గ్రహింపవలసియున్నది. ఇందుల కొక యుదాహరణమును జూడుఁడు.

...............లో కవ్యాపకుఁ డక్షురుఁడు శ
రవ్యుఁడు వినుఁ డతనిఁ గెల్వరా దెవ్వరికిన్

'లక్ష్యం లక్షం శరవ్యంచ' శరైః నీయత ఇతి శరవ్యం అను శరవ్యశబ్దమును (అమహదర్థవాచకపదమును) శరవ్యుఁడు అని మహదర్థకముగా పిల్లలమఱ్ఱి పిన వీరభద్రకవి ప్రయోగించినాఁడు.

శరవ్య మనగా గుఱి యని యర్థము. ప్రస్తుత మిట నది లక్ష్యమును లెస్సగా భేదించఁగలవాఁడనే యర్థములోఁ బ్రయోగింపఁబడినది......"అర్శ ఆదిభ్యోఽచ్" అను సూత్రాధారమున నైనను లేక ప్రస్తుతార్థబాధ కలిగినపుడు చెప్పుకొనఁదగిన లక్షణావృత్త్యంగీకారమువలన నైన సమాధేయము గా నున్నది. ఇంకయు నీ మహాకవి క్వార్థరేకారసంధులను గూర్చినాఁడు. సంఖ్యకు నెనిమిదింటికి తక్కువ లేవు. పూర్వలాక్షణికుల ననుసరించి సూరిగారు క్వార్థరేకార సంధినిషేధ సూత్రమును చేయుట యుక్తమేకాని మహాకవు లెంతవఱకు దీనిని పాటించినారో గమనించవలసి యుండెను.

బాలవ్యాకరణము సంధి ప్ర॥ ౮ వ సూత్రమున 'అత్తునకు సంధి బహుళముగా నగు' ఉ॥ మేన + అల్లుఁడు=మేనల్లుఁడు, మేనయల్లుఁడు ఇత్యాదులు.

'బహుళ గ్రహణముచే స్త్రీవాచక తత్సమ సంబోధనాంతములకు సంధి లేదు' అని వివరించి ఉదాహరణములు సంధిలేనివే యీయఁబడినవి. 'అథర్వణాచార్యులు సంస్కృతీయమునకు సంధి యగు నని చెప్పిరిగాని దానికిం బూర్వకావ్యంబులం బ్రయోగంబు మృగ్యంబు. ఆధునికకృతులం దొకా నొకచోట స్త్రీ వాచక తత్సమములకు సంధి గానంబడియెడు' నని సూరిగారు వ్రాసినది. సాహసమూలమనియే యనవచ్చును.

అని చదివి లవుఁడు రాఘవ మనుజేంద్రుని తల్లి వీర మాతట! సీతాజనని................

ఇచట 'వీరమాతట' తత్సమ స్త్రీ వాచకసంధి కలదు. ఇది గూడ పిల్లలమఱ్ఱి పిన వీరభద్రునిదే ? శ్రీనాథుని సమకాలికుఁడో, ప్రాచీనుడో యనఁదగిన పిన వీరభద్రుని ప్రయోగమును "ఆధునిక కృతులం" దనుట మహాసాహసమే యనిన సత్య దూరము గాదు. ఒకచోఁ బూర్ణాహుతనుచుఁ బ్రయోగించినాడు. ఇంకయు నెన్నో కుప్పతిప్పలుగా మహాకవులు సర్వతంత్ర స్వతంత్రులై ప్రయోగించినారు. ఇవి యన్నియు నాసికాంత ర్లోమోత్పాటన వంటివి కవులకు.

లాక్షణిక చక్రవర్తులు, వ్యాకర్తలు, ఎత్తుకోగానే చూచునది యీలాంటి వాటినే ?

శబ్దసాధుత్వాదులను వైయాకరణులకు వదిలితే రసతత్పరు లగు మహాకవులు చమత్కృతిజనకతాఽవచ్ఛేదకశబ్దజాలమునే సమయానుకూలముగాఁ దమ కృతులలో వాడుకొనియెదరు.

వాక్సిద్ధియు, వాక్శుద్ధియుఁ గల మహాకవుల సూక్తులు సానఁదీఱిన జాతి రత్నములే.

నిజమే ! శాణోల్లీఢమైననే మణి యనర్ఘ మగును. కాంతుల నలుకెలంకుల వెదఁజల్లును. ముతకమణిని మర్యాదఁ జేయువా రెవరు ? పుటము వేయుకొలఁది పసిఁడి, తూకమునకుఁ దగ్గినా మేలిమియై మిసిమిచాయల నీనును. వెల హెచ్చును.

కట్టెలు కదిలింపనిదే అగ్ని జ్వలింపదు. విప్రకృతమైననే పన్నగము ఫణమును విప్పును. ఉదాత్తచరితుఁ డగు జనుఁడు ఏదేని క్షోభ కలిగిననే తన నిగూఢ మహిమను ప్రకటించును.

"జ్వలతి చలి తేంధనోఽగ్ని ర్విప్రకృతః పన్నగః ఫణాం కురుతే
ప్రాయ స్స్వం మహిమానం క్షోభా త్ప్రతిపద్యతే హి జనః."

ఈ విధముగా మహాకవి కాళిదాస మహాశయుఁ డనినది సహజము. మహర్షుల వోలె మహాకవులును మాననీయులే. సానఁబట్టిన రత్నమును బంగారులో బొదిగి శిరోభూషణముగా ధరించిన, ధరించినవారికి అందము. దానికి గౌరవము.

లేక ఆవిద్ధముఁజేసి సూత్రములోఁ గ్రుచ్చి మెడలో వ్రేలాడగట్టుకుంటే యెవరి యిష్టము వారిది. వల దనియెడు వారెవరు ? విమర్శించిన కొలఁదియు మహాకవి ప్రయోగములకు విలువయే యెక్కుఁడగును. *



* కీర్తిశేషులైన మహాకవు లందరును నేదేని యొక వ్యాకరణము నాదర్శకముగా గొనియే తదనుకూలముగ కృతుల విరచింపబూని యుందురు. నిరంకుశ ప్రయోగములు కొన్ని యున్నను, ఛందోభంగభయమువలనను, ప్రమాదవశమునను దొరలిన దోషములే బహుళముగా గలవు. అప్రసిద్ధమైన మార్గమున ప్రయోగమును శరణముగ గొన్నను సుప్రసిద్ధమైన శుద్ధప్రయోగములను నాదరింపవలసియే యుండును. ఏకాలమునన్నైనను నీతి నియమబంధురమగు సుమార్గమున సంచరించువారి కృతిరత్నములే లోక శిరోభూషణము లగును అయితే నియతికృతనియమరహితమును, హ్లాదైకమయింగును, అనన్యపరతంత్రమును అగు సుకవితను ప్రసాదించు రససిద్ధులైన మహాకవులకు మేము నివేదించునది లేదు. కాని భాషామతల్లీ స్తనంధయులకు స్వేచ్ఛా రచనా వరముల బ్రసాదించి భస్మాసుర లీలలను బడయుటకు విజ్ఞులు వేడుకొనుటలేదు.

— సంపాదకుడు.



# చాటూక్తిముక్తావళి

## శ్రీ బండారు తమ్మయ్య

చ. రసనిధియైన సత్కవి విరాజిత కావ్యమునం గుణంబులన్
వెస శిరసావహించి బుధవీరులు లోఁగొనుచుండ్రు దోషముల్
రసనిధిలో జనించిన కళానిధి మౌళిని దాల్చి యాదృతిన్
అసమశరాంతకుండు గళ మందున హాలహలంబు నిల్పఁడే. ౧

ఉ॥ చిత్తజుఁజూపుమాపిన ప్రసిద్ధి గడింపఁగఁ జాలిరో, మదో
న్మత్తతఁ దూలుకాలుఁ బరిమార్చిరొ మిత్తిని నెత్తి మొత్తిరో
పత్తిరిసుంత బత్తిఁబడ వైచిన ముత్తినొసంగ నేర్తురో
చిత్తజువైరిఁగొల్వక భజింతు రిసీ! పెఱవేల్పులం జడుల్. ౨

చ॥ జనకునిఁ గ్రోలె నొక్కఁడు ప్రచండరుషన్ హృదయేశుఁగాలఁద
న్నె నొకఁడు; దాల్తురి వైరిణిని నిత్యము మోముల బాల్యమాదిగా
ననుదిన మర్థిఁ ద్రుంతురు శివార్చనకై తన యబ్జగేహమం
చనయముఁ బాయఁబోలుఁ జుమి సాగ్రహయై సిరి విప్రగేహముల్. ౩

చ॥ నిరుపముఁడౌట రామవిభునిన్ వరియించిరి కన్యకామణుల్
హరువిలువంచు వేళ మువు రర్మిలి, లజ్జయుఁ గీర్తి సీతయున్
బరిణయమౌ కనిష్ఠఁగని పమ్మిన కిన్కను జ్యేష యేఁగె భూ
వరులను గూడి; మధ్యమయు వైశమచేరె దిగంతసీమలన్. ౪

గీ॥ పండితుని పరిశ్రమంబును బండితుండె యెఱుఁగుఁగాక జడుండు దా నెట్టులెఱుఁగు
ప్రసవవేదన సంతానవతికెగాక యించుకైనను గొడ్రాలి కెఱుక యున్నె. ౫

గీ॥ కవితగూర్చుటయందలి కష్టములను ఇట్టి దనరాని యానంద మెనయు నొకటి
కవులుగానట్టి వట్టి మానవులు దాని తెఱఁగు నొకయింత యేనియుఁ దెలియలేరు.

గీ॥ ఇతర తాపశతంబుల నెట్టు లయిన నలువ! బాధింపు నను నిచ్చ కోలఁదీఁగాని
కవిత యరసికునకుఁ జెప్పుకష్టమొకటి వ్రాయ కెపుడు నా నుదుటను వ్రాయ కెపుడు.

గీ॥ దేని గన్నంతనే విటమానసంబు దేని విన్నంతనే కవి మానసంబు.
తరళము సరళమును నగు దత్క్షణంబ యదియ వనితయా గవితయా నదియ నిజము.

గీ॥ ఒడలు కృశియించి ముడుతలు వడినయపుడు, ఏచివ్యాధులు తనువు బీడించెనేని
ఘనతరౌషధమొక్క గంగా జలంబె యరయ వైద్యుండుపరుడు శ్రీ హరియొకండె

గీ॥ పెట్టిపోయనివారికి నిట్టి గతులె వాటిలునని లోకమునకుం జాటుపగిది
పాత్రహస్తులై ప్రతిగృహ ప్రాంగణమున సంచరింతురు భిక్షుకజనము లెందు.౧౦

గీ॥ ఒక్కవస్తువు రెండుగా వ్రక్కలించు, ధన్వులెందఱో యుందు రీ ధరణియందు
రెంటి నేకముగాఁగఁ గూర్చెడు నపూర్వ, ధన్వి కామదేవునకు వందనశతంబు.

చ॥ చిఱుతవయస్సునందొనఁగు జీవన మల్పము సంస్మరించి, దు
ర్ధరభర మూని మాళ్ళుల సుధామధురాంబుల నారికేళపుం
దరువులు జీవితాంత మగు దాఁక నొసంగు జనాళికెన్నఁడుర్
మఱవరుగాదె సాధు లణు మాత్రమె యైన గ్రహించు సత్కృతిన్. ౧౪

గీ॥ శౌర్యవంతుని వైధవ్య శంక విడిచి, పండితుఁ ద్యజించి సాపత్న్య భయముజేసి
దాత విడనాడి తనసిగ్గు తలఁపఁడనుచు, పరమలోభినె వరియించు సిరి సతంబు.

(స శ్లే ష ము)



# శివ పరివారము

అనువాదకుడు : శ్రీ మఠం సిద్ధివీరయ్యగారు. (ఉపాధ్యాయులు)

శ్రీ శివభగవానునివంటి అద్భుత పరివారముగలవార లింకెవరున్నారు? బ్రహ్మ చతుర్ముఖుడు. తాను పంచముఖుడు. తన పుత్రుఁడు షణ్ముఖుఁడు. రెండవ కుమారుని గజముఖునిగా నొనర్చెను. సంపూర్ణైశ్వర్యమునకు నేత; సాక్షాదన్నపూర్ణ భవాని వీరి కర్ధాంగి—భస్మాంగధారి; శ్మశానవిహారి; పులితోలుగాని, యేనుగు చర్మమే గాని వీరికి వస్త్రము. ఒకానొప్పుడా చర్మములనైన ధరింపక హిమాచ్ఛాదితగిరి శిఖరములయందు నగ్నముగానే సంచరించుచుండును. స్వారికై నొక ముదుసలియెద్దు నుంచినాడు. భూషణములు, సర్పములు మానవ కపాలములు. పరిజనులు, పిశాచాదులు. ఇట్టి యద్భుత పరివారముగలవారెవరైన గలరా? అయినను సంపూర్ణమగు దేవసేనకాధిపత్యము తన పుత్రున కొసంగెను. దేవతలందఱిలో మున్ముందు పూజ్యపదము రెండవకుమారున కిచ్చివేసెను. సంపూర్ణమగు ఐశ్వర్యమున కధిష్ఠాత్రి దేవీపదమునకు తన యర్ధాంగి నేర్పరచినాడు. స్వయముగా దేవాధిదేవుఁడైన మహాదేవుడైనాడు. ఇపుడింకే పదవిగలదు? మహాదేవుఁడు తాను; తనయర్ధాంగి మహాదేవి; విఘ్నవినాశకారియగు ప్రథమవంద్యుడు శ్రీ గణేశస్వామి; దేవతలసైన్యమున కధిపతి శ్రీ కార్తికేయస్వామి. అతని కోడండ్రు బుద్ధిసిద్ధియనువారు. హిమాలయమందలి యత్యున్నతశిఖర మాయన కాపురము. మహాకవి కాళిదాసు లిట్లు వర్ణించియున్నారు.

"శ్లో॥ కంపేన మూర్ధ్నః శతపత్రయోనిం వాచా హరిం వృత్రహణం స్మితేన
అన్యాంశ్చ దేవా నవలోకనేన సంభావయామాస త్రిశూలపాణిః".

"బ్రహ్మదేవుఁడు శివభగవానుని సన్నిధి కేతెంచినపుడు ప్రత్యుత్థాన సత్కారాదులేమియు లేవు. తల పంకించుటయే. విష్ణు భగవానుని రావడమునందు నోటితో యిట్లుచ్చరించును. "రండు, విశ్రమింపుడు క్షేమమా!" కాని నాల్గడుగులు ముందు నడచి లేచి స్వాగతము మాత్రము లేదు. దేవేంద్రుడరుదెంచినపుడతనినిఁ జూచి మందహాసము మాత్రి మొనరించును. ఇతర దేవతలేతెంచినపుడు వారివంక దృష్టి ప్రసరింపఁజేయును. ఇది శివదేవుని మహిమము. ఇదంతయు అన్నపూర్ణ భవాని కృపయొక్క ఫలమని కొందఱు పలికియున్నారు.

"శ్లో॥ స్వయం పంచముఖః పుత్రౌ గజానన షడాననౌ ।
దిగంబరః కథం జీవే దన్నపూర్ణా నచే ద్గృహే.

"తాను అయిదుముఖములు గలవాడు. కుమారు లిద్దరు గజముఖ షణ్ముఖులు తాను దిగంబరుడు. అన్నపూర్ణ లేనిచో జీవనము గడుచు టెట్లు ?''
శ్రీ శంకరాచార్యులుగారును ఇట్లే చెప్పియున్నారు.

"శ్లో॥ వృషో వృద్ధో యానం, విష మశన మాశా నివసనం।
శ్మశానం క్రీడాభూ ర్భుజగనివహో భూషణవిధిః।
సమగ్రా సామగ్రీ జగతి విదితైవ స్మరరిపో ।
ర్య దేతస్యైశ్వర్యం తవ జనని సౌభాగ్యమహిమా''.

"స్వారికొఱకు వృద్ధ వృషభము. తినుటకు విషము. వసించుటకు దిశలు. విహరించుటకు చితాభూమి. ధరించుటకు సర్పములు. ఇట్టి సామగ్రి గలవాని యైశ్వర్య మేమని చెప్పవచ్చును. జగదంబ యగు పార్వతీదేవి యున్న కారణముననే యితని యైశ్వర్యము రాణించుచున్నది.... పార్వతీదేవి యీ పరివారమును పోషించుటకు చాల కష్టపడుచున్నది. ఏలననగా ! పరివారము సామాన్యమైనది కాదు. ఒకానొక వేళ గణేశుడు కార్తికేయ స్వామిపై యభియోగము దెచ్చి తల్లితో నిట్లనును. "ఇతడు తన చేతితో నా కర్ణముల లాగుచున్నాడు." ఒక సమయమున కార్తికేయస్వామి గణాధిపతిపై వ్యాజ్యము తన మాతృదేవి చెంతకు గొనివచ్చును. అదేమనగా ! "గణేశుడు తన తుండముచే నా కన్నులను లెక్కించుచున్నాడు."

"శ్లో॥ హే ! హేరంబ కిమంబ రోదిషి కథం । కర్ణౌ లుఠ త్యగ్నిభూః,
కిం తే స్కంద విచేష్టితం మమ పురా సంఖ్యా కృతా చక్షుషాం"

ఈ శివ పరివారముయొక్క వాహనాదుల క్రీడా వినోదము దర్శనీయము.— అర్ధనారీశ్వరస్వామి తన కొఱకు వృషభమును తన సతీదేవికి సింహమును వాహనములుగా నుంచినాడు. సింహవృషభములకు పొందు కలియుటెట్లు ? గణేశస్వామి మూషికమును వాహనముగా నొసగి తాను సర్పముల ధరించియున్నాడు. కార్తికేయ స్వామికి మయూర వాహన మొసంగియున్నాడు. మూషిక సర్ప మయూరములు అన్యోన్య వైరివర్గములో జేరినవి !

భయంకరముగా గర్జించు భషకమును తన కొత్వాలు భైరవస్వామి కనుగ్రహించి యున్నాడు. ఈసందర్భమునం దీ వాహనాదులయందు శాంతిస్థాపనం బెంత దుష్కరమో పాఠకమహాశయు లూహించవలెను. భోలాశంకరు డేమి చేయునో

తెలియునా ? శాంతి యున్నపుడు శాంతముతోనే కాలముగడుపును. అశాంతిసూచన లగపడినచో తాను సమాధిలో లీనమగును. వీరు యోగు లగుట కిదియే కారణమై యుండును. అన్నియవసరములు శ్రీ జగదంబకే. ఆయమ మూలముననే గృహ నిర్వాహకత్వము. శ్రీగణేశస్వామి కుడుములకొఱకు తల్లిని విచారించినపుడు ఆయమ నాతనిని సమాధానపరచుట యెంతకష్టమో యూహింపవలెను. ఆ జగన్మాత రత్న గర్భయు వసుంధర యనం దగు భూదేవియొక్క సర్వోన్నతంబగు నాధారస్తంభమగు హిమాలయపుత్రిక గావున పార్వతీదేవి కుటుంబపోషణ ధర్మంబుల నన్నింటిని గ్రహించి సరియైన వ్యవస్థ గావింపుచున్నయది. బుద్ధి సిద్ధి యను వారలను తన స్నుషలనుగాఁ జేసికొనినది.

ఏ తత్కారణమున యార్థిక సమస్య సులభమై పోయినది. పార్వతీదేవి యీ విచిత్ర పరివారమునందలి ప్రతి యొక వ్యక్తిని సంతోషపరచును. శంకర భగవానుఁడు సుయోగ్యగృహిణికి కావలసిన పరికరములను ప్రసాదించియున్నాడు. బుద్ధి సిద్ధి యను వారలను తన కోడండ్రగాఁ జేసికొనియెను. వీరి ద్వారా కావలసిన విషయము లన్నిటి తోడ్పాటు కలుగుచున్నది. తన నివాసమును హిమాచ్ఛాదిత పర్వత శిఖరమగు కైలాసమునం దేర్పరచుకొన్నాడు. అచట నిరంతరము మంచు తప్ప మఱేవస్తువు కాన్పింపదు. ఏ భక్తుడైన నీ చల్లని స్థలమునకు కార్యార్థియై పోవుట దుష్కరమైన పని. మహా మాయాదేవిని గుఱించి శ్రీ శంకరాచార్యులు గా రీ విధముగా వర్ణించినాడు.

"శ్లో॥ సపర్ణా మాకీర్ణం కతిపయగుణైః సాదరమిహ
శ్రియ న్త్యన్యే వల్లీం మమ తు మతిరేవం విలసతీ,
అపర్ణైకా సేవ్యా జగతి సకలై ర్యత్పరివృతః
పురాణోఽపి స్థాణుః ఫలతి కిల కైవల్య పదవీమ్.

అనేక గుణవిస్తృత సపర్ణ (పత్రములచే కూడినది) లతల నెవ రాశ్రయించెదరు? నా యభిప్రాయ మేమన అపర్ణాదేవి (పార్వతీమాత)ను సేవించినయెడల పురాణ స్థాణురూప శివదేవుడును మోక్ష సామ్రాజ్యమును భక్తుల కొసగును.

స మా ప్త ము





# ఓ దా ర్పు

శ్రీ కె. సాంబసిద్దయ్యగారు, ఉపాధ్యాయులు.

ఉ॥ కన్నులనీరు గ్రిమ్ముకొనగా భవదీయ ముఖాంబుజంబునన్
విన్నదనంబు కోప దురపిల్లగ నే మగు నిన్ను బ్రేమతో
గన్నులగాంచి సంతసిలి గౌరవమున్ బచరింపుచున్ సదా
మన్నన జూచునట్టి యభిమానులె లే రిపు డో కృపాణమా! ౧

మ॥ సమరక్షోణిని శత్రుయోధవరులన్ జక్కాడి తద్వేడి ర
క్తమునన్ ని న్నభిషేకమున్ సలుపగా గంగాసుతుం డున్నె శౌ
ర్యము దీపింప కిశోరిచందమున సంగంభించుచున్ వైరి మూ
ర్థములన్ గానుక నీకు నీయగ సుభద్రానందనుం డుండెనే. ౨

తే॥ గీ॥ భార్య యావేశపూరిత వచనజనిత, రోషవివశత శత్రు విలుంఠనమ్ము
సలిపి నీ కన్నులకు విందు సలిపినట్టి, ఖడ్గతిక్కనగలడె యిక్కాలమందు. ౩

మ॥ ధర గోబ్రాహ్మణ సాధుకంటకుల విధ్వంసంబు గావించి భూ
భరమున్ మాన్పెడి పుణ్యకార్యమునకై భక్తిన్ సదా నిన్ను హృ
త్సరసీజంబున ధ్యానమున్ సలిపి నీదా ప్రేమకున్ బాత్రుడౌ
నరనాథుండు శివాజిఛత్రపతి కానన్ వచ్చునే యిమ్మెడన్. ౪

తే॥ గీ॥ ఇంతయేటికి ఆనాటి యింతులందు, వేరుగాని క్షాత్రమును జూపు వారిలోన
నొక్కరైనను యిప్పు డీయుర్విపైన, గలుగ నీ కిట్టి దుస్థితి గలుగగలదె! ౫

ఉ॥ కాల మదొక్కవేళ నొకకై వడి గ్రాలగబోదు దానికిన్
వీలుగ నుండులే బుధనివేదిత ధర్మముగాన నీవు ఆ
కాలపు వైభవోన్నతిని గౌరవమున్ స్మరియింపకుండ నే
లీలనొ జీర్ణపుఱయొఱ శరీరము దాచుకొనన్ శుభం బగున్. ౬





# కీరసందేశము

## శ్రీ శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు

నా వ్రాసిన యీ కీరసందేశమును గూర్చి గోలకొండ పత్రికలో నొక విమర్శకుఁడు సమీక్ష వ్రాసియుండెను. వ్రాసినవారిపేరు ప్రకటితము కాలేదు. పత్రికాధిపతియే వ్రాసె నని నేను మొదట భావించితిని. దానికిఁ బ్రతి విమర్శ వ్రాసి గోలకొండకుఁ బంపగా వారు ప్రకటింపరైరి. మఱియుఁ దత్పత్రికాధిపతి యగు ప్రతాపరెడ్డిగారు తా మీవిమర్శ వ్రాయలేదని సెలవిచ్చిరి. ఈవిమర్శయే కాదు, ఇదివరకు నా పంపిన యే గ్రంథమును గూడఁ దాము విమర్శింపలేదని తెలిపిరి. ఎవరు వ్రాసిరో తెలుపరైరి. గ్రంథసమీక్ష పండితులు సేయుదురుగానీ, యపండితులు గాదు గదా! పండితులు తమ పేరు ప్రకటించుకొనుటకు వెనుదీయ నేల? ప్రతాపరెడ్డిగారు తమ పత్రికయందలి గ్రంథసమీక్ష నపండితులే వ్రాయుదురని తెలుప సాహసింపరుగదా! ఆ పండితుని పేరు ప్రకటించుటకుఁ దమ కిష్టము లేకున్నచోఁ దామే విమర్శించితి మని చెప్పవలయును గానీ, తాము పత్రికాధిపతులై యుండియుఁ దమ బాధ్యత నేల త్రోసివేసిరి? గ్రంథము వెలువడిన పిమ్మట నెవరియిష్టానుసారము వారు విమర్శింపవచ్చును. తండ్రి గ్రంథమును, తనయుఁడు విమర్శింపవచ్చును. ఎవరును గాదనరు. స్వర్ణమునకు సానరాయి కావలసినదే; కానీ పత్రికాధిపతులు పరుల గ్రంథముపైని నేపాఠకులకుఁ దమ యభిప్రాయమును దెలిపియున్నారో యా పాఠకులకు గ్రంథకర్త యభిప్రాయములనుగూడఁ దెలుపు టవశ్య మగునో, కాదో న్యాయవాదు లగు ప్రతాపరెడ్డిగారు విచారింపవలయును. ఆ విమర్శన మరొక పత్రికలో వేసినచో నా పాఠకులు దీని నెట్లు చూడఁగలరు?

ఆ విమర్శకు నే నిచ్చిన జవాబును గోలకొండవారు ప్రకటింప మని తెలుపఁగా దివ్యవాణిలో ముద్రించితిని. దానిని లోకము చూచియే యుండును.

ప్రజామిత్ర, భారతి, దివ్యవాణి, హిందూపత్రిక మొదలగు పత్రికలు నా కీరసందేశమును విమర్శించినవి. కానీ గోలకొండ పత్రికవలె నేదియును విమర్శింపదయ్యె. ఆ పత్రికలం దిట్టి గండరగండఁడగు విమర్శకుఁడు లేడు. ఆ విమర్శకుఁ డీ గ్రంథమునందలి కథను, రసపోషణమును, బాత్రౌచితిని విమర్శింపక "ఇందలి పద్యములు, గీతములు, కందములే యనియు, వృత్తములు దక్కువనియు, సీసములు

లేనే లే వనియుఁ, గంద మనుటకు గీత మనియు, గీత మనుటకుఁ గంద మనియు నచ్చు తప్పులు పడిన వనియు పంచవన్నె మొదలగు నపూర్వప్రయోగములు గల వనియు విమర్శించిరి. "నిరీక్ష్య తే కేళివనం ప్రవిశ్య క్రమేలకః కంటకజాల మేవ" అను లోకోక్తి యిట వర్తించును. ప్రాజ్ఞు లగు ప్రతాపరెడ్డిగారి ఆధ్వర్యమున వెడలు పత్రిక యీ విధముగా విమర్శించు నని పండితలోక మూహించియుండదు.

ఆ విమర్శకుడు భాగవతకథను గీరసందేశకథను జూపి మేలుగీళ్ళను బాఠకులనే నిర్ణయించుకొమ్మని సెలవిచ్చినాఁడు. వ్రాతనుబట్టి నామార్పు ఆతని కర్థముగాలేదని తోఁచుచున్నది. కావున నా విమర్శకుఁడును, దదనుచరవర్గమును దెలిసికొనుఁగాక యని కథావిమర్శను జేసి చూపుచున్నాను.

విమర్శకుఁడు భాగవతకథను జూపుచుఁ "గృష్ణుఁడు రుక్మి గడ్డమును, మీసమును బట్టి రేవులువాఱ గొఱిగె" అను ముఖ్యాంశమును వదలివేసెను. ఇది బుద్ధిపూర్వకముగా వదలెనో ? యబుద్ధిపూర్వకముగా వదలెనో? తెలియదు." నే నేయంశమును బురస్కరించుకొని కథాభాగమును మార్చితినో యా యంశమును వదలివైచి చేసిన విమర్శ విలువ నెంతని చెప్పవలెను? రుక్మి వీరుఁడని సెలవిచ్చిరి. వీరు డెల్లపుడును ధీరోదాత్తుఁడై యుండును. రాముఁడు, ధర్మరాజు మొదలగువారు వీరులు. రుక్మి ధీరోద్ధతుఁడు. నాటకము లందు వీరశృంగారములలో నొకటి ప్రధానముగా నుండ వలయు ననియు, ధీరోదాత్తుఁడు నాయకుఁడై యుండవలయు ననికదా నియమము. కావున వీరుఁడు ధీరోదాత్తుఁడై యుండును. విమర్శకమతానుసారముగా రుక్మి వీరుఁడే యగుచో ఆంధ్ర మహాభాగవతమున

ఉ॥ బంధువు లెల్లఁ గృష్ణునకు బాలిక నిచ్చెద మంచు.........
...........................................దు
స్సంధుఁడు రుక్మి...........................................
...............................తలంచె నంధుఁడై.

అనికదా ! కలదు. దుస్సంధత్వ, మదాంధత్వములు వీరధర్మము లేమో విమర్శకుఁడు లెస్సగా విమర్శింపవలెను. రుక్మి అకారణముగాఁ గృష్ణునిపైఁ బగ గొని తల్లిదండ్రులను, బంధువులను జీఁతికి గొనకుండుట వీరధర్మ మేమో విమర్శకుఁడు లోతుగా విమర్శింపవలెను.

విప్రసందేశమునకు బదులుగాఁ గీరసందేశము నేల నే నీ గ్రంథమునఁ బ్రవేశ పెట్టితిని ? అను విషయము విమర్శకుఁడు విమర్శింప లేదు. దాని నిచట ముచ్చటింతును,

శాకుంతలమునఁ గాళిదాసు భారతదుష్యంతునిపైఁగల యసత్యవాదిత్వ దోషమును దొలఁగింప దుర్వాసశ్శాపమును, దద్విమోచనమును గల్పించెను. మఱి యును శాపమును బురస్కరించుకొనియే సానుమతీ ప్రవేశాదులును గల్పితములు. అట్లే భాగవత కృష్ణుఁ డొనర్చిన మంగలిపని నింద్యకర్మగదా! అవతార పురుషుఁ డని పూజింపఁబడిన కృష్ణుఁడు, భగవద్గీత నుపదేశించి విశ్వరూపమును జూపించు కృష్ణుఁడు మంగలి పనికిఁ (బరులచేఁ జేయించుటగాదు) దాను స్వయముగాఁ బూని నాడన్నకథ మన విమర్శకునకు రసవత్తరముగా,మనోహరముగాఁ, బాత్రోచితముగాఁ దోఁచియుండును. కావుననే యాతఁ డా విమర్శకుఁ బూనఁడయ్యె. ఆతని కయ్యది యట్లు తోఁచినను నాకుఁ దోఁచలేదు. కావున దానినిఁ దొలఁగింపవలె నని తలంచితిని. మఱియు నకారణముగా రుక్మిణిని శిశుపాలుని కిత్తు నని బంధువులను, దలి దండ్రులను గాదని దుస్సంధుఁడై, మదాంధుఁడై వర్తించిన రుక్మి మన విమర్శకునకు వీరుఁడుగాఁ దోఁచినను నాకుఁ దోఁపఁడయ్యె. కావున నాతని చరిత్రమునందలి దోషములఁ దొలఁగింపవలె నని తలఁచితిని. శ్రీకృష్ణుని మంగలి పనినుండి తప్పింపవలయు నన్న రుక్మిని నిరపరాధినిఁ జేయవలయును. అందువలన రుక్మి తన తలిదండ్రులవలెనే రుక్మిణినిఁ గృష్ణున కిచ్చుటకే సంకల్పించె ననియు శిశుపాలుని ధాటి కోర్వఁజాలక యిష్టము లేకయుఁ దనచెల్లెలిని శిశుపాలున కీయఁదలఁచె ననియు, నేకారణముచేతనేని యీ మనువు దప్పినయెడ వానికి సంతోషమే యనియుఁ గల్పింపఁబడినది. కృష్ణ రాయల ధాటి కోర్వఁజాలక గజపతి తనబిడ్డ నిచ్చి వివాహము నేసెనన్న చరిత్రమును మన విమర్శకుఁడు స్మరించుఁగాక.రుక్మిని బాగుపఱచుటకే శిశుపాలునికి ధార్ష్ట్యము, బలాత్కారమును గల్పితములు.అతని ధార్ష్ట్యబలత్కారములను బురస్కరించుకొనియే కీరము కల్పిత మయ్యెను. శిశుపాలుఁడు కోటను ముట్టడించినపుడు చిలుక దక్క వేఱు మనుష్యులీవలకు రాఁజాలరు. బ్రాహ్మణునిఁ బరిత్యజించి కీరమును గొనుటయందు మఱొక విశేషము గలదు. బ్రాహ్మణుఁడు శ్రీకృష్ణునితో రుక్మిణి నొడివిన మాటలు మాత్రము దెలుపఁ గలఁడు. ఆమెయు ముగ్ధ యగుటఁ దనప్రేమను సంపూర్ణముగాఁ దెలుపఁజాలదు. కావున బ్రాహ్మణుఁడు రుక్మిణీప్రేమ నామూలాగ్రముగా బోధింపఁ జాలఁడు. ఈ లోపమును సవరించుటకుఁ గీరము ప్రవిష్టమైనది. కీరము రుక్మిణి నొడివిన సందేశమే కాక తాను బాల్యమునుండియుఁ బ్రత్యక్షముగాఁ జూచిన రుక్మిణీప్రేమను బహుముఖముల వెల్లడించినది. రుక్మిణి పుట్టుక మొదలు కీరము విదర్భరాజగృహమునఁ బెరుగుటచే భిన్నభిన్నావస్థలలోఁ గృష్ణునియం దెట్లు వలపుగొని వర్తిల్లెనో కండ్లారఁ జూచినది. చెప్పినదానికన్నఁ జూచినది విశేష

ముగా హృదయమునకు నాటునుగదా! కావునఁ గీరము రుక్మిణి చెప్పిన నాలుగు మాటలుమాత్రమే చెప్పి యూరకుండక "దీనికి భాష్యప్రాయమ నా నొడివియున్న ప్రాక్కథ మెల్లన్" అని వేనోళ్ళ యామెవలపును వర్ణించి తెలిపినది. బ్రాహ్మణున కిది సాధ్యము గాదు. ఇందులకై కీరము ప్రవిష్ట మైనది. భాగవతమున శ్రీకృష్ణుని వద్దకుఁ బోయిన బ్రాహ్మణుఁడు తిరిగి వచ్చి రుక్మిణికిఁ దెలుపును. అట్లు తెలుపుట వలన రుక్మిణి యావేశము కొంత తగ్గును. ఇది రసభంగ హేతువు. మేఘసందేశమున సందేశహరుఁ డగు మేఘుఁడు మరలవచ్చి యక్షునితోఁ దెలిపినట్లు గానరాదు. ఇటఁ గీరము మరల రాదు. శ్రీకృష్ణుఁడు శయనాగారమునఁ గీరవృత్తాంతమును దెలుపు వఱకును శాపము రుక్మిణి విచారగ్రస్తురాలై యుండును. తన ప్రాణప్రియుఁడు వచ్చినను తనకీరము రామికి వగచును. దీన నాపె కృతజ్ఞత విశద మగును. చిలుక శాపాంతమును బొంది లక్ష్మికడకుఁ బోయిన దని చెప్పకున్నచో నది మరల రుక్మిణి వద్దకు వచ్చినట్లు చెప్పవలయును. ఆత్మ వశమున లేని యొక యంత్రరాయమునఁ గానీ రాయబారులు తమ ప్రభువులవద్దకు మరల రాకుండ నుండరు. తిరిగి చిలుక వచ్చినట్లు చెప్పినచో రసభంగ మగును. కావున శాపము, శాపాంతమును గల్పింప బడినవి. సామాన్య మగు కీరముగాక పంచవన్నెల చిలుక యేల కల్పిత మయ్యె నని మన విమర్శకునకు సందేహము గలుగవచ్చును. చెలికత్తె లక్ష్మీదేవియొక్క రంగుల చీరను దొంగిలినది. కావునఁ దత్స్ఫురకముగా నాచిలుక యొడలిపై రంగులు వెలసెను. పూర్వకాలమున వ్యభిచారాదిదోషములు గావించినవారికి ముఖాద్యవయవములందు యోన్యాదిరూపమునఁ గాల్పులు వేయఁబడుచుండినట్లు మనుస్మృతి నవమాధ్యాయ మునఁ గలదు. కావున రూపమును బట్టి దొంగతనము విశద మగునట్లు రంగుల చిలుక కల్పిత మయ్యెను. సామాన్యముగాఁ బచ్చనిచీరనే లక్ష్మీదేవి చెలికత్తె దొంగిలించిన దని చెప్పక రంగులచీరను దొంగిలించిన దని యేల చెప్పవలెను! అని సంశయింపవచ్చును. సామాన్య మగు వస్తువునం దాకర్షణ ముండదు. లోకోత్తర మగు వస్తువునందే యుండునని మన విమర్శకుఁడును నంగీకరించు ననుకొందును. కావున లక్ష్మీదేవికిఁగల యపురూప మైన యా రంగులచీరమీఁద నాపె దృష్టిపడి దొంగిలించినది. ఈ విధముగాఁ బరస్పర సంబంధము గలిగియుండునట్లు రసపుష్టికై యీ కథ కల్పింపబడినది. ఇది రసపుష్టిగా లే దని దీని యందున్న లోపములను జూపినచో నవి న్యాయము లగుచో సంస్కరించుకొనుటకు వెనుదీయను.

విమర్శకుఁడు తన ముసుఁగుఁ దీసి యీవలఁ బడి ప్రత్యుత్తరించు నని విశ్వసించు చున్నాను.



# గిరిజా పరిణయము

(౩ వ సర్గము)

శ్రీ విద్యాప్రవీణ బి. వి. వరప్రసాదరాయశర్మగారు.

వచ్చిన మన్మథుంగని నవప్రణయమ్మున వేయి కన్నుల
న్నచ్చటనున్న నిర్జరుల నందఱ కాంచక, గోత్రభేది తా
నిచ్చె నపూర్వగౌరవము, నేయెడ కార్యము తీర్చు భారమో
అచ్చటనే తదీశులకు నాదర మెంతయు వ్యక్త మయ్యెడిన్.

ఆ మదనుండు శక్రనిహితాసనమందున విశ్రమించి ఎం
తో ముద మంది శక్రుని అనూనగతిం గొనియాడి, పల్కె తా
నో మహితప్రభావ! సుఖ ముంటిరె భృత్యుని పిల్వబంపగా
నేమి కతమ్ము, దేవ! సెల వీయరె నిండుమనమ్ముతోడుతన్.

ఏ యసూయాపరుం డే శ్రమాధికతప,మ్ముల నీ పదమ్మును పొందగోరె
ఏ యనిష్టుడు భవ మ్మీద నశక్తుడై, ముక్తి కాంక్షించి తా పొందగోరె
ఏవాడు నీతిసంభావితుం డగు నిన్ను, మించుకోరికను సాధించగోరె
ఏ పతివ్రత లీల లించుక చూపి ని, న్నించువిల్తుని కప్పగించగోరె
వారి నెల్లర సుమబాణపాతహతుల, జేసి, ధర్మార్థములను నిశ్శ్రేయసమున
శక్తి సడలించి తార్తీయ రక్తి పెనిచి, నీకు సంతస మొనగూర్చి నిలుపువాడ.

కాక సురతాపరాధాన కామవశత, పాదపతితుని నిను తేర్చ పాలుపడని
ఆమె తనువల్లి దృఢతాప మంద జేసి, చిగురుటాకుల నలయించి చేర్చుజూతు.

స్వస్తి నీకును, నీ వజ్ర సారమునకు, నస్మదీయాస్త్ర నిచయ విన్యాసమునను
గరిమ భవదీయ విద్వేషి గణము నెల్ల, నెలతల కొసంగి వైరమ్ము నిస్తరింతు.

నీ ప్రసాదమ్ముచేత మన్నింపబడుట, నా వసంతు సహాయుగా నాత్మ దలచి
ప్రమథనాథునినైన ఆపంగ నేర్తు, నింక నితరుల పేర్కొన్న నేమిఫలము!

అంకముమీద నున్న పద మవ్వల పీఠము మీద దింపి, ని
శ్శంకగతిన్ స్వకీయకృతిశంసితవిక్రము మన్మథున్, నిరా
తంకపు గౌరవమ్మున శతక్రతు డిట్లను "నీవు వజ్ర మీ
వంకను సాధనద్వయము వజ్రము కుంఠిత మీయెడన్ సఖా!

నీ గురుసారపుందనము నిర్జరు లెల్లరు మెచ్చుచుండగా
నే గను గొందు మత్సముని, నీ దగు కార్యము నందు నిల్పితి
న్నా గద విష్ణు, డీ జగము లన్నియు మోయుటగాంచి శేష మా
భోగిని స్వీయశయ్యగను పూన్చికొనెం గద మిత్రిసత్తమా !

ఆ వృషాంకుని యుద్ధమందైన గెల్తు,నంచు వచియించు నీ వాక్య మదియె,మాకు
మోదముంగూర్చి కార్యసంపూర్తి తెల్పె,త్రిదశులకు నెల్ల నీప్సిత మ్మిదియె యగుట.

వీరలు శ్రీగిరీశు ఘనవీర్యమునం జనియించు దైత్యసం
హారు, కుమారు, శూరుని మహాధ్వజినీపతిగాగ నెల్లరుం
గోరిరి; శైవవీర్య మనుకూలత తాల్పగ శైలపుత్రియే
ధీర యటంచు బ్రహ్మ ఉపదేశ మొనర్పగ గంటి మింతలో.

ఆ హిమాద్రిపయిం దప మ్మాచరించు, దేవు పూజించుచుండు నా పూవుబోణి
నతని గూర్పుము'వర్ష మ్మునంది కాదె పుడమియందుండి బీజమ్ము మొలకగనుట'

ఆ యుపాయమ్ము నీవల్ల నౌను జుమ్మి, ఊరకుండగ లోకమ్ములొందు కీడు
నీదు చాపమ్మునకు నెదురేది కలదు, వీర్యవంతులలో నీవ వీరు డగుదు.

ఇంత యేకాక నీకు వసంతమూర్తి నెయ్యపుంజెలి; నిన్వీడి నిలుచువాడె
వహ్నిని రగుల్పుమంచు ఏవారలైన వాయుదేవుని పిల్చి చెప్పంగవలెనె."

నిజవిధిన్ మాళిదాల్చి నిర్నిద్రరూప, పరమసంతోషితాత్ముడై పయన మయిన
కాము, నైరావతాస్ఫాలకర్కశంపు, హస్తమున గౌరవించె బిడౌజు డపుడు.

ఆ మధుమూర్తితోడుగ రయమ్మున నా రతి గొంచు వెంట, నా
కాముడు శక్రునెట్లు కనగానగు కోరిక దీర్ప కంచు తా
నా మహనీయు నిందునిని మహత్తరకార్యము సేయు పూనికతో
హైమవతంబు శంకరుని ఆశ్రిమముండెడి తావు సేరగన్.

ఆ వనమందు మాధవు డవారిత చైత్రవిలాసభావ సం
భావనలన్ తపోధన సమాధులు వ్రీలగ, వారి కార్య దీ
క్షావిధు లించు కంతయును సాగకయుండగ నాత్మమూర్తి సం
భావన సేసె లోకములు మారినపుడ మోహావశంపు పెంపునన్.

దక్షిణపుదిక్కు సమయంబు తలగ త్రోసి,ఉష్ణకరు డుత్తరమ్మున కొదిగియుండ
దక్షిణాంగన ఆస్య పద్మమ్ము వెడలె, గంధవహ మను నిశ్వాసక వ్రజమ్ము.

మొదలున నుండి లేజిగురు మొత్తము, నాకులు, పుష్పగుచ్ఛముల్
తుదివర కయ్యశోకము విదూరితశైశిరహీనశోభమై
అదనగు సుందరీమణుల. అందపు టందెల కాలితాపులం
దొదుగక యే విలాసగతి నూర్జితరీతిని దాల్చె నద్దిరా!

క్రొం జిగురుటాకు పత్రము ల్గూర్చి, మధువు, మావిపూవును బాణమ్ముగా విధించి
భ్రమరపంక్తిని నామాక్షరాలుగాగ, దాన నిలిపెను మరుని ప్రతాప మెసగ.

గంధశూన్యత్వమున జేసి కర్ణికార మాత్మ నిందించుకొను రంగు లలరియుండి
గుణము లన్నియు నొక్కచో కూడియుంట విశ్వసృజున కనిష్టమై వెలయబోలు.

బాలేందూపమ వక్రశోభితములై ప్రస్ఫీతరక్తమ్ములై
పాలాశమ్ములు, వాసనారహిత సంపాద్యత్వముం బొందియున్
వాలాయమ్ముగ, దేవతల్ మధువు నభ్యర్థించి తత్క్రీడలన్
లీలన్ దాల్చు నఖక్షతమ్ము లన తల్లీలన్ విరాజిల్లెడిన్.

నెమ్మొగమ్మున తిలకమ్ము నించి కనుల, గండు తుమ్మెద కాటుక కలయ దీర్చి
చివురుటాకను పెదవిచే చెన్ను మిగిలి, లలితవనలక్ష్మి మధున కుల్లాస మొసగె.

అరయ బ్రియాళువృక్షముల యందలి పుష్పపరాగ మింతలే
చి, రయమునన్ కనుంగవల జేరగ, గర్వముచేత నింతయున్
వెరవక వేళ్ళు వాయు వెటు వీచునొ అట్లె చరింపుచుండె, మ
ర్మరనినదమ్మునుం గను నరణ్యములన్, మది కొంకు వీడుచున్.

మిసిమిలేమావి చిగుళుల మెక్కి మెక్కి, కూసె కోకిల మధురమౌ కూజితమున
అదియె మానవతీ హృదయముల జేరి, మదను ఘంటారవమ్మన మారుమ్రోగె.

శిశిరఋతు గమనమ్మున జేసి శుద్ధమౌ నధరములు పాండురమ్మైన మోము
దమ్ములుంగల్గు వనదేవతల మనోజ్ఞ గండముల నివాస మొనర్చె ఘర్మజలము.

గిరిశు తపోవనమ్మునను కేరు వసంతు నకాలవర్తనం
చరణము గాంచి, దుష్కృతివిసారణముం గని సత్త్వభావమున్
షరయక రేగు చిత్తముల, భూరితరమ్మగు క్లేశమందుచున్
మరలగ జేసి రెట్టులో యమాదివిధు ల్గను చత్తపోధనుల్.

ఎక్కిడు ధనువున మరుడా, దిక్కున రతితోడ జేరి దీపిల్లంగా
నెక్కడు రసానుభవమున, జొక్కుచు యుగ్మములు చూప జొచ్చెను లీలన్.

తేటితో గాటమగు కూర్మి తేటి యొండు, పూవు పాత్రను గ్రోందేన త్రావ జొచ్చె,
కృష్ణమృగ మొండు కొమ్మున గీక మృగిని, అదియు తత్ స్పర్శనంది సౌఖ్యమ్ముగనెడు.
కరిణియొక్కతె తన యాస్యగహ్వరమున, తమ్మిపూవుల నెత్తావి దనరుచున్న
జలము గండూషితమ్ముగా కలియ జేసి, విభుని కొక గ్రుక్కెడిచ్చెను వేడ్క లలర.
సగముభాగమ్ము తినుచు బిసమ్ము నొక్క, చక్రవాకమ్ము తన విభు చక్కగాంచి
'కొను మటంచును' మోము మోమున దగిల్చి అందజేసె మహానంద మొందుచపుడు
ప్రేమ మొలుక నొక్క ప్రియురాలు పాడుచో, గండములను ఘర్మకణము లొలుక
కిన్నరుం డొకండు కేరుచు, తుడుచు నెపమ్ము వెట్టి చుంబనమ్ము సేసె.

తరువులుకూడ; మీది కెద దార్చుచు నెట్టని యాకుమోవితో
మురువుగ పూవుగుత్తు లను పూర్ణకుచమ్ములతో విలాసములే
జరుపుచు హావభావతతి చక్కగచూపెడి వల్లరీప్రియా
దరమున సర్వసౌఖ్యవిధి తత్పరతం దనరారె యేపునన్.

అప్సరోగీతి తనకు శ్రావ్యమ్మె యయ్యు, హరుడు స్వసమాధినిష్ఠమై నాత్మనిల్పె
ఔ వశీకృతచిత్తున కరయ నెందు, విఘ్నము సమాధిభంగ మెవ్విధి నొనర్చు;

ఆయెడ నంది, తీవియల యల్లికముందర నిల్చి వామహ
స్తాయత వేత్రుడై నిజకరాంగుళి మోమున జేర్చి మాన్మథో
పాయన మందగోరు ప్రమథావళి శిక్షణ సేసి దౌష్ట్యమున్
సేయగబోకు డంచు విభు సేవల కానతి యిచ్చె వారికిన్.

అతనియానకు తరువు లల్లాడబోవు, అండజమ్ములు రెక్క లల్లార్పబోవు
కాననమృగమ్ము లించుక కదలబోవు, చిత్ర మయ్యె నరణ్యమ్ము చిత్రగతిని.

అంతట మన్మథుండు శివు నక్షిముఖంబున జేరబోక, యా
పాంతమునందు దట్టముగ నల్లిన దేవనమేరుశాఖలం
దెంతను జేరి దూరె దరిజేరగ భీతిలి, లోకులెట్టు ల
ల్లంతట శుక్రు గాంచుచు ప్రయాణముల న్మది శంక గూర్తురో.

దేవదారు ద్రుమాధః ప్రదేశమందు, అరుగుపై వ్యాఘ్రచర్మమ్ము బరచి అందు
స్వస్థచిత్తుండునై తప మ్మాచరించు, శర్వు గాంచెను మదనుండు సంభ్రమమున,
అమల వీరాసనమున పూర్వార్ధదేహ, మ్ముంచి చేతులు వెలకిల నుంచు కతన
అంకమధ్యమ్మునందు నత్యంతకాంతి, నొప్పు రాజీవ మట్టుల నుండువాని.

నాగసంబద్ధజటలె ఉన్నతముగాఁగ వర్ణమాల ద్వివారమ్ము వైచి చెవిని
కంధరారుచిలగ్ననికామనీల కృష్ణమృగచర్మముం దాల్చి ఎసఁగువాని

బొమలుచలింప కించుక, అపూర్ణరుచిఁ స్తిమితోగ్ర తారకా
సముదిత నేత్రియుగ్మమున జాలుఁబు వార నధః ప్రభాళి, ఘ్రా
ణము తగు లక్ష్యభూతము నొనర్చియు మూర్తిని ప్రాణవాయువుల్
స్తిమితము లౌట భంగతతి లేక చెలంగు సముద్రిడో యనఁ.

తన కపాలమ్మునుండి నేత్రములనుండి, బయలువెడలిన శిఖి శిఖాప్రతతిచేత
కాల్చి సిగపూవు జాబిల్లి కళ హరించి,వాడబారిన తామర తూడు జేసె.

తొమ్మిదా ద్వారములు నిరుద్ధమ్మొనర్చి, భక్తినెంతయు చిత్తమ్ము పదిలపరచి
అక్షరమ్మా పరబ్రహ్మ నాత్మవిదులు, ఎవని నరయుదు రాతని నెరుగువాని.

స్మరు డారీతి తపమ్మునేయు శివుగాంచబోయి ఒక్కింతయుఁ
దరిజేరంగ సమర్థతం గనడు, తద్ధైర్యమ్ము వీరిలేఁ మనం

బరసెఁ పెక్కులువేదనల్ వపువునం దందంద స్వేదంబు జే
రె, రసంబుం దిగజారె దానిపయిజారెం బాణచాపంబులుఁ
ఆలోనన వనకన్యలతో, లీలఁ శివుని గొల్వ తోతెంచెడి ఆ
శైలేశుపుత్రి గని తా నాలో నెద నిల్పికొనియె నంచితధృతియై.

ఆ యెలనాగ రమ్య కుసుమాభరణాంచిత దివ్యశోభకై
పేరియము మీర గైకొనియె. విచ్చిన కెంపు టశోక పుష్ప మ
త్యాయత హేమకాంతి నపహాస మొనర్చెడి కర్ణికారముఁ
జాయల ముత్తెముం దెగడు నవ్యలతాంతము సింధువారముఁ.

కుంచిత గాత్రివోలె బిగి గుబ్బల భారమున న్నవోదిత
ప్రాంచిత బాలభాస్కర విభావళి జిమ్మెడి నారచీర తో
పించగ కన్నుదోయి కొక విం దొనగూర్చుచు పూలగుత్తులఁ
సంచరణ మ్మొనర్ప భువి సాగి చిగిర్చిన తీవయోయనఁ.

అలమహేశుని గెలువంగ ననమశరుడు, స్థానమున నుంప నగు నల్లెత్రాడనంగ
మాటి మాటికి గటిసీమ దాటి పడెడు,పొగడమాలనుచేదమ్మిబిగియగొనుచు.

తన నిశ్వాస పరిమళమ్మున కమందమ్మైన పేరాసచే
గనుచున్ బింబఫలాధరమ్మును, మనః కౌతూహలమ్మొప్ప న
ద్దునకున్ వెంబడి నేగుదెంచు ఎలదేటు ల్గాంచి లీలాంబు జ
మ్మున బోనాడుచు వాని భీతిగనుచు న్ముగ్ధమ్ముగా చూపులన్.

సర్వగాత్రి సౌందర్య ప్రశస్తి గాంచి, రతికి గూడను సిగ్గగు వితము గూర్చు
శైలసుతజూచిఇంద్రియజయముగనిన, హరునియందునగార్యమ్మునరసెమరుడు.

కాబోవు పతియంచు కౌతుక మ్మొదనాట శివుగృహాంగణభూమిజేరె నామె
ఆలోన నాత్మపరిత్యక్తమ్మునం బరపురుషు దర్శన మంది హరుడు, నంత
గనులు విప్పియు నూర్ధ్వగతమైన ప్రాణమ్ములను నెల్ల స్వస్థానమునను నిల్పి
వీరాసనమ్మును భేదించి స్వస్థుడై కుశలియై అంతటగూరుచున్న

నందియే తెంచి వినయమెంతయు దలిర్ప, ననఘ! పార్వతి మీ సేవకరుగుదెంచె
ననగ, కనుసన్నగై కోలు కొన నతండు శీఘ్రగతి నామెనుం బ్రవేశింప జేసె.

అల వసంతుని శోభల వెలుగుచుండి, చిగురుటాకులతో గూడి చెలగుపూల
చెలులతో గోసి పార్వతి శివునిపాద, మూలమం దుంచె చేదమ్మి మాలికేర్చి.

అలకలమధ్య కాంతిలు మనోహర పుష్పము కర్ణికార మ
వ్వలకును జార్చి, లేజివురు వ్రాలగ వీనులనుండి, ఈశ్వరున్
వలగొని మ్రొక్క పార్వతిని బల్కె స్వయంప్రభు 'డన్యకాంతకున్
సులభుడుకాని నాథుగతి సొంపుల దేలెద'వంచు ప్రీతితో

అమ్మహాత్ముడు పల్కినయట్టి నర్మ, చిహ్నితచటూక్తి కాంక్షితసిద్ధి తెల్ప,
తళుకుచూపుల సిగ్గు వెన్నెలలు గాయ, చెలుల చాటున కేగెను చేడె అపుడు.

ఇది సమయమ్మటంచు మది నెంచి కుతూహలియౌచు వహ్నిలో
నొదుగు పతంగముంబలె ముహుర్ముహురాతతకార్ముకంబునన్
మది భయమింత నెంచకయె మార్వుని గూరిచి చేసె టంకృతిన్
మదనుడు, చిక్కె బాణపతనమ్మున కీత డటంచు గర్వియై.

భాస్కరుని రశ్మి నధిక సంభాసితమ్ము, దేవగంగా విరాజిరాజీవమాల
రాగ రుచిమీరు స్వీయకరమ్ముతోడ, అందజేసెను భవున కయ్యు నుపమాంగి.

అర్థి జనులందు ప్రీతిచే నతడు కొనియె, సమ్ముద మ్మలరించు నా జలజమాల
పుష్పధనువున శరము సమ్మోహనమ్ము, మోఘమగుదానిగూరిచె పుష్పశరుడు.

హరుడు నొకించు కంతె హృదయమ్మున క్షోభము కన్పడంగ ద
ద్దరిలియు చంద్రునిం గని ముదమ్మున బొంగెడి నబ్ధిరీతి, త
త్పరిసర దేశమం దొదుగు పార్వతి మోమున మూడుకన్నులం
బరపెను సాభిలాషగతి; పార్వతియుం గడుమోహ మేపుగన్.

తన సింగారపు భావముల్ మృదులతాస్థానమ్ము గాత్రమ్ము తె
ల్ప, నవోదంచిత లజ్జ మాటుగ, మనోభావమ్ములూరించు నా
తని చూపమ్మును మెచ్చి వాలుగనులం జారళ్య మందాక్షము
ల్గనుపింప న్నెమ్మిగ మట్టె తిప్పె సొగసుల్ వెల్గొంద నత్యంతమున్.

అంత సయుగ్మనేత్రుడు హృదంతరమందున చింతసేసి, యీ
ప్రాంతమునందు మన్మథుని భావము లేగతి చొచ్చెనంచు, దా
స్వాంతము నెట్లొ శక్తిమెయిబట్టి, వికారముత్రోసి హేతువుం
జింతనసేయ దిక్కుల విజృంభణచూపెను తీవ్రదృష్టులన్.

వామపాదమ్ము ముందుకు వంచి కొంత దక్షిణాపాంగముం దాక ధనువులాగి
చక్రముగ జేసి, తనపైన శరము నేయ సిద్ధసంకల్పుడౌ మనసిజుని గాంచె.

తపము నవమతిచేతన తత్క్షణమున బొమలు ముడివడ తేజంపు పుంజములను
మంటలెగయగ మూడవకంటినుండి యుగ్రరూపముతో వహ్నియురికె నపుడు.
ప్రభువ! ఆగ్రహ మింతేని వలదు వల దటంచు పల్కెడి దివ్యవాక్యమ్ములట్లె
యుండ రుద్రాక్షిభవమైన ఉగ్రవహ్ని కాముమాపంబు నిలువున గాల్చివైచె.

ప్రియభర్గుని రూప దర్శనముచేత మూర్ఛవోయె రతీదేవి ముమ్మరముగ
స్త్రీసహావాప్తి శివుడును రోసి చనియె పాదపము గూల్చి చసియెడు వజ్రరీతి.
హరుడు వరు డగునను తండ్రియాశతోడ తనదు లావణ్యమెల్ల వ్యర్థతనుగాంచె
చెలుల ప్రత్యక్షమందంచు సిగ్గుగొంచు చిన్నవోయెను నగజాత చెన్నుదరిగి

హరుని యాకృతిగాంచి భయమ్ముగొనెడు
పుత్రి నప్పుడె గిరిరాజు బుజ్జగించి
కొమ్ముకొన తమ్మితీగె తగుల్చుకొంచు
చనెడు గజ మట్టు లామెను గొనుచు చనియె.

ఇది "కామదహన"మను ప్రథమాశ్వాసము.





# ఆంధ్రపత్రిక - 'యథార్థవాది' గారికి,

## "విభూతి" - సమాధానము

రెండు మాసముల క్రితము ఆంధ్రవారపత్రికలో ప్రకటింపబడిన "పండితారాధ్య చరిత్రము" అను వ్యాసమును మా "విభూతి" పత్రికయొక్క జ్యేష్ఠసంచికలో నుద్ధరించి ప్రచురించుచు తద్వ్యాసకర్త లగు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారికి నికముందు ప్రకటింపబడనున్న శివతత్త్వసారమునుగూర్చియు, తత్పీఠికను గూర్చియు కొన్ని సూచనలను గావించియుంటిమి. మరియు వారి వ్యాసమును మా పత్రికలో బ్రకటించుటకు పూర్వము శ్రీ శాస్త్రిగారు తిరుపతిలో నున్నట్లు దెలియగా వారికి జాబు వ్రాసి పోస్టులో వేయగా అది తిరుపతినుండి "కేరాఫ్ వి. అప్పారావుగారు, ప్రిన్సిపాలు, యూనివర్సిటీ ఆర్టుకాలేజీ, విశాఖపట్టణము" అను చోటును గూడ చుట్టి మరల మాకు వాపసుగా చేరినది. కావున వారి యనుమతి త్వరగా నందునట్లు తోచ నందున సహజముగా పత్రికలకుండెడు ఆచారము ననుసరించి ఆంధ్రపత్రికనుండి యా వ్యాసమును మా పత్రికలో నుద్ధరించితిమి. దాని క్రింద గల సంపాదకీయ సూచనను జదువుకొనిన మహానుభావు లెవరో కాని జూలై మూడవ తేది ఆంధ్రవార పత్రికలో "పండితారాధ్య చరిత్రము" అను వ్యాసమును "యథార్థవాది" పేరుతో బ్రకటించుచు ఆంధ్రపత్రిక వే॥ ప్రభాకరశాస్త్రిగారికిని మా "విభూతి"కిని కోర్టుద్వారా కలహము గలుగునట్లు ప్రోత్సహించి తమ ప్లీడరీ (వకీలీ) స్వభావమును వ్యక్తపరచినారు.

మమ్ము గూర్చి యథార్థవాదిగారు అనవసరమైన భారతమును పెంచి బెదిరించినారు. అవి యస్థానప్రయత్నములు కావున వారి ముఖ్యమైన యాక్షేపములకు సమాధాన మీయబడుచున్నది.

ఒక పత్రికలోని వ్యాసములను వేరొకపత్రిక ప్రకటించుట దోషాస్పదము కానేరదు. ఏ పత్రికలోని వ్యాసమునైనను ఆ పత్రికపేరు వ్రాయక దొంగిలించినచో నపరాధమగునుగాని వ్యాసమును ఉద్ధరించుటయే తప్పని యిదివరకెవరును జెప్పలేదు. ఆంధ్రపత్రిక మున్నగు సమస్త పత్రికలును పత్రికాధిపతుల అనుమతి లేకయే ఇతర పత్రికలనుండి అనేక వ్యాసములను ప్రకటించుచున్నవి. మా 'విభూతి' నుండియును 'గృహలక్ష్మి', 'కళ' మున్నగు పత్రికలు వ్యాసములను ముద్రించినవి. ఇట్టి యాచార

మునుబట్టియే మే మా వ్యాసమును ప్రకటించితిమి. సహజమైన యీ విషయమును "గోరంతలు కొండంతలు" జేసి యథార్థవాదిగారు దావాకు సిద్ధమైనారు. వకీలుఫీజు వారికే దొరకు నట్లుండిన లాభకరమైన పని జేసికొనవలెను. వలదను యాచన లేదు.

ఇక శ్రీ ప్రభాకరశాస్త్రిగారి వ్యాసము తుదిని పాదచిహ్నమునుంచి మేము ప్రకటించిన సంపాదకీయము అక్రమ మనియును, ఆక్షేపములను వేరొక చోట దెలుపవలె ననియును, మామూలు మర్యాద పాటింపలే దనియును, వారి రెండవ యాక్షేపణ కలదు. ఇది సదాచార మనుట పొరపాటు. ఇట్లు కూడదని శాస్త్రముగాని, ఆక్టుగాని చెప్పుటలేదు. వ్యాసకర్త అడ్డదారిని బడినపుడు సంపాదకుడు సామర్థ్యము క ల దే ని సమంజసమైన అభిప్రాయముల నాయా వ్యాసములక్రింద ప్రకటించుటయే శ్రేష్ఠమని నేను నమ్ముచున్నాను. శ్రీలోక మాన్యతిలకుగారును, శ్రీ చిపట్ణాకర్ శాస్త్రిగారును తమ పత్రికలలో నిట్లే సంపాదకీయముల వ్రాసి ప్రబోధించియుండిరి. మహాత్ముడును ఆయా వ్యాసముల జాబులక్రిందనే వ్యాఖ్యలజేర్చుటకలదు. దుర్బలహృదయు లగు కొందరు వ్యాసకర్తల కీ పద్ధతి రుచింపక పోవచ్చునుగాని, తెలివిగల సంపాదకుడు మొగమాటముతో సత్యమును గప్పిపుచ్చుటయే మోసమగును. నిష్కల్మషమైన బుద్ధితోడనే ఇట్టి వ్యాఖ్యలనేకములు విభూతిలో ప్రచురింపబడినవి. శాస్త్రిగారి వ్యాసముక్రిందను అవసరమును బట్టి సూచన గావింపబడినది. దాన శాస్త్రిగారికి లాభమేకాని నష్టము లేదు. "నర్సాపురము శ్రీ చదువుల బసవశంకరయ్యగారి గృహమునుండి శివతత్త్వ సారగ్రంథమును శ్రీ ప్రభాకర శాస్త్రిగారు సంగ్రహించిరి" అని మా వ్రాయుటనుగూర్చి వ్యాసకర్తకు అత్యధికమైన కోపము గలిగినది. "గృహమునుండి సంగ్రహించిరి" అనుమాట తప్పట ! దీనితో శాస్త్రిగారిమీద దోషారోపణ మైనదట! ఆ దోష మెద్దియో తెల్పినచో సమాధానము చెప్పవచ్చును. శాస్త్రిగారే తమ వ్యాసములో "ఇర్వది యేండ్లకు ముందు నరసాపురమున నొక జంగము దేవర యింట దాని నేఁ గనుగొంటిని. చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తకశాలకు సేకరించితిని" అని వ్రాసియున్నారు. దీనితో వారును "యింటినుండి సేకరించి"రనియేకదా స్పష్టముగ దెలియుచున్నది ?/ దీనినే "గృహమునుండి సంగ్రహించి"రని వ్రాసితిని. ఇందలి ఘోరాపరాధ మేమియోకాని చిత్రముగా నున్నది. 'సేకరించు' అనుదానికి 'సంగ్రహించు' అను అర్థమున్నట్లు 'యర్థవాది'కి దెలియనిచో శబ్దరత్నాకరమును (1937 సంవత్సరప్రతి) జూడవలెను. శాస్త్రిగారు "ఒక జంగము దేవరయింట" అని అనామధేయముగ ననేక వ్యాసములలో వ్రాసిరి. దీని యనౌచిత్యము మన

యథార్థవాదికి దోచదు సరికదా! ఎవరినుండి ఏవిధముగ దెచ్చిరో ఆ వ్యక్తి పేరు శాస్త్రిగారేల వ్రాయకూడదు? "అచ్చువేయించిన ప్రతులతో బాటు తాటాకు ప్రతినిగూడ మీకు బంపెద"మని చదువుల బసవశంకరయ్యగారితో జెప్పికదా శాస్త్రిగారు సేకరించుట? అటు లేల జరుగలేదు? విషయ మిటులుండగా నా సంగ్రహించు శబ్దమున కపార్థముల వల్లె వేయుట సదాచారము కాబోలు! ఆంధ్రదేశమున జంగముదేవర లనగా ననేకశాఖలు గలవు. ఏదోయొక సామాన్యశాఖగ స్ఫురింపజేయుట కయియే శాస్త్రిగారు "జంగమదేవరయింట" అని వ్రాయుటలేదుకద! వీరశైవమతస్థాపకులైన శ్రీపంచాచార్యుల సంప్రదాయమునకు జెందిన మాహేశ్వరులగు చదువుల బసవశంకరయ్యగారు చాలకాలము క్రితమే తమ యింటనున్న శివతత్త్వసారము నెరిగి యున్నారు. నలుబదిసంవత్సరములకు పూర్వము అనకాపల్లి శ్రీ మహాలింగస్వాములవారును, ఆ గ్రంథమునకు మరొక ప్రతిని వ్రాయించినారు. ఈ గ్రంథము సంగతి విజ్ఞులగు మాహేశ్వరులకు దెలిసియే యుండెను. ప్రభాకరశాస్త్రిగారికిని వారే చూపించిరి.

ప్రస్తుతము కన్నడ శివతత్త్వసారమును ప్రభాకరశాస్త్రిగారికే దొరకి నందున కుతూహలముగలిగినదని వ్రాయగా కుతూహలము దేనియందని ప్రశ్నించి నారు. వారి పరిశోధనలో ననియును కుతూహల మనగా సముచితమైన ఉత్సాహమని యును యథార్థవాదిగారు గ్రహింపవలెను. తమిళములోను మరాఠిలోను శివతత్త్వ సారము దొరకుచో మరియును కుతూహలమెక్కుడగును. బసవేశ్వరునకు 'వీరశైవ మతప్రతిష్ఠాపనాచార్య' యని శాస్త్రిగారు వాడిన విశేషణమును 'వీరశైవమత ప్రచారక' యని మార్చినందులకు వీరికి అనుమతి నెవరిచ్చిరో యని ప్రశ్నించినారు. అట్లు విపరీతవిశేషణమును వాడుటకు శాస్త్రిగారి కనుమతి నిచ్చినవారే మాకును ఇచ్చినారు. ఇట్లు మార్చుట నింద్యము కాదు. వీరశైవమతాధిక్యము నరసి సంగమే శ్వర గురుకరుణవలన వీరశైవమతమును స్వీకరించిన బసవేశ్వరునకు మతస్థాపనా చార్య బిరుదము నంటగట్టుటయే అప్రామాణ్యము! దానికి చారిత్రిక పరిశోధన గాని వీరశైవ శాస్త్రప్రమాణమును కాని చూపి తమ యభిప్రాయమును ప్రకటింప వలెను గాని అనవసరమైన స్థలములో నట్టి విశేషణమును వాడుట యెందులకు? ఆయా మతగ్రంథములను జదువక వ్యర్థముగా నూహాపోహలను వ్రాసి తమకుండెడు పలుకుబడివలన దానికి 'పరిశోధన'నామకరణము గావించి నంతనే సత్యము కాజాలదు. ప్రభాకరశాస్త్రిగారి యనేకాభిప్రాయములను సప్రమాణముగ వీరశైవులు ఖండి చియే యున్నారు. శాస్త్రిగారు త్తరింపలేదు. ఈవిషయము దెలియని 'యథార్థవాది'

గారు అయథార్థమును వ్రాసికొనుట సహజమే! విషయాంతర పాండిత్యము గలవారు వీరశైవమత విషయముననూ, తాము పండితులమే యను యహంభావమును వీడి మూలగ్రంథములను పఠించి నిష్పక్షపాతముగను సప్రమాణముగను విషయనిరూపణ గావించు పండితులకు మేము సహర్షముగ స్వాగత మిచ్చుచున్నాము. వీరశైవ వాఙ్మయమున 'ఓనమ'లు రాని వారు సైతము తమ తమ యభిప్రాయమును ప్రకటించుట కధికారము కలిగి యుండగా చిరకాలము నుండి వీరశైవ వాఙ్మయమును పరిశీలించి జన్మతః వీరశైవాచార్యుల మైన మాకు స్వవిషయమున పరమతీయులు వ్రాసిన ప్రమాదములను సైతము దిద్దుట కధికారము లేదా! ఏమీ న్యాయ్యము ?

ప్రభాకరశాస్త్రిగారి ఆంధ్రపత్రిక వ్యాసములో "పండితారాధ్యుని శివ యోగసారము" అని వ్రాయబడినది. ఇది కూడ పరిశోధనయేనా! శివయోగ సారమును పండితారాధ్యుడు రచించినట్లు యే శిలాశాసనము చెప్పుచున్నది? కాకతి గణపతి దేవుని కృతిని పండితారాధ్యున కంటగట్ట వలసినదేనా? శాస్త్రి గారు పరిశోధకు లను నమ్మకము వలన ఈ వ్రాతను గూడ ప్రకటించినచో లోక మున నపప్రచారము గలుగునని తలచి "శివయోగ" శబ్దమును "శివతత్త్వ"గ మార్చి "విభూతి"లో సమంజసముగ ప్రకటించినాము. తప్పని దృఢముగ దెలిసి నపుడు పరిశోధించుట పండిత ధర్మ మనియే మేము భావించుచున్నాము. తప్పులను దిద్ది నందులకే యథార్థవాది గారికి ఆక్రోశము కలిగి ఇచ్చవచ్చిన విధముగ మమ్ము నిందించి అష్టోత్తర శతగాలీ ప్రదానము చేసి యున్నారే! మా మత గ్రంథముల గ్రంథమునైన చూడక ప్రతిష్ఠాపనాచార్యత్వముల నిర్ణయించు చున్నందులకు మేము సూచనలను గూడ మా పత్రికలో జేయగూడదా?

బసవేశ్వర మల్లికార్జున పండితారాధ్యులకంటె ప్రాచీను డగు శ్రీపతి పండితా రాధ్యుడు విరచించిన శ్రీకరభాష్యమున వీరశైవ మతస్థాపకు లగు శ్రీ రేణుకా ద్యాచార్యులు స్తుతింపబడుటయే కాక వీరశైవవాఙ్మయ మందలి సుప్రసిద్ధ గ్రంథ మగు సిద్ధాంతశిఖామణి నుండి యనేకప్రమాణము లుదహరింపబడి యున్నవి. సిద్ధాంత శిఖామణిలో

మ దద్వైతపరం శాస్త్రం వేదవేదాంత సమ్మతం
స్థాపయిష్యసి భూలోకే సర్వేషాం హితకారకం॥ ౩-౨౦
వీరసిద్ధాంత నిర్వాహ కృతపట్టనిబంధనం ॥౪-౮॥

అని శ్రీ రేణుకాచార్యునకు వీరశైవ మతస్థాపకత్వమును, వీరశైవాచార్య త్వమును స్పష్టముగ జెప్పబడియున్నది. నేటికిని రేణుకాద్యాచార్య పరంపరా

గతులైన పీఠాధిపతులే వీరశైవ మతాచార నిర్వాహకులై యున్నారు. వీరశైవుల సమస్త శుభకార్యములందు జరుగు పంచకలశములకు సంబంధించిన రేణుకాద్యాచార్యపూజలు సామాన్య వీరశైవునకు సైతము దెలియును. మైసూరు మహారాజుగా రగు శ్రీకృష్ణరాజ ఒడయరుగారు 1828 సెప్టెంబరు 27 తారీఖున శ్రీ రేణుకాచార్య సింహాసనాధిపతులకు వ్రాసిన జాబులో వారికి "శ్రీమద్వేద వేదాంత సిద్ధాంత పురాణాగమేతిహాససకలశాస్త్ర ప్రసిద్ధ శ్రీమద్వీరశైవ మత స్థాపనాచార్యవర్య" అని ఘంటాఘోషగ వాడబడియున్న విషయమును మైసూరు గవర్నమెంటువారి 1927 వ సంవత్సరపు అర్కి-యోలాజికల్ రిపోర్టువలన దెలిసికొన వచ్చును. స్వాయంభువాగమాది గ్రంథములు మున్నగువానివలన నింకను అనేక ప్రమాణములుగలవు. బసవేశ్వరుని కేవలభక్తుడైన పాల్కురికి సోమనాథుడు సైతము బసవనకు స్థాపకత్వము జెప్పక వీరశైవము పూర్వ మున్నట్టులే నిరూపించినాడు. ఇటీవల లభించిన అర్జునవాడశిలాశాసనమున గూడ బసవడు జంగమభక్తుడుగా పేర్కొనబడినాడు. బలవత్తరమైన ప్రమాణజాల మంతయు ఇటులు సుప్రసిద్ధమై యుండగా ఎవరైన అజ్ఞానమువలన బసవేశ్వరుడు వీరశైవమును బుట్టించె నని వ్రాసిన చో క్షంతవ్య మగును గాని పలుకుబడిగలవారు ప్రతిష్ఠాపనాచార్యు డని చెప్పుట పరిశోధన కాకపోగా జగద్వంచనయే యగును. అందు కనియే పరమతవిషయములు వచ్చినపుడు తొందరపడక తన్మతగ్రంథములను చక్కగ పరిశీలించి తెలియనివానిని సంప్రదాయస్థులనుండి సంగ్రహించి, సత్యమును వెల్లడింపవలెను గాని, గ్రంథములు, పాఠశాలలు, పత్రికలు, లోకము తమ యధీనములో నున్న వని బహుసంఖ్యాబలము వలన అసత్యములను ప్రచారము చేయుట సరి కా నేరదు. యథార్థవాదిగారికి ఇప్పుడైనను నా పూర్వవ్యాస మందలి సావధాన శబ్దార్థము దెలిసియుండును.

ప్రభాకరశాస్త్రిగారి వ్యాసమునకు సంబంధించిన విషయము గాకపోయినను మరొక ఆవశ్యకమైన సంగతిని యథార్థవాదిగారు ప్రశ్నించుచున్నారు. "వీరభద్రశర్మగారు బ్రాహ్మణసంబోధక మగు 'శర్మ' శబ్దమును వ్రాసుకొని లోకమును వంచింబూనుట పండితధర్మమేనా" యని వారు వ్రాసినారు. ఇది లోకవంచన కాదు. వీరమాహేశ్వరులవిషయమై లోకమునధూర్తులచేత ప్రచారింపబడుచున్న యజ్ఞానముదూరమయి "మాహేశ్వరులు బ్రాహ్మణులే" యను విజ్ఞానము స్పష్టముగ దెలియుటకయియే 'శర్మ' శబ్దము స్వాభావికమున వాడబడినది కాని వేరొకగుప్తార్థము లేనేలేదు. జంగమ మాహేశ్వరులు బెళ్ళిగావి, చౌడదానపుర మున్నగు శిలాశాసనములలో "జంగమ లింగావతారరూ, పార్వరుం (బ్రాహ్మణర్) పిరియమత దాచార్యర్" అని కంఠోక్తిగ

బ్రాహ్మణులుగానే వ్యవహరింప బడినారు. సద్యోజాతాది పంచబ్రహ్మ ముఖా విర్భూతులైన రేణుకాచార్యుల వంశపరంపరాగతు లగుటవలనను రేణుకగీత యన దగు సిద్ధాంత శిఖామణిలో స్పష్టముగ "స్వజాతీయా ద్విజాస్తు యే" (౯-౨౯) అని ద్విజత్వశ్రవణము వలనను, పారమేశ్వరాగమమున (౧౭-౬) "బ్రాహ్మణా వీర శైవస్థా"అని భేరీనినాదముతో మాహేశ్వరులకు బ్రాహ్మణశబ్దము శివప్రోక్త మగుట వలనను మాహేశ్వర విజ్ఞు లందరు మొదటినుండియు బ్రాహ్మణ వ్యవహారమును గలిగి యున్నారు. నన్నెచోడుని కుమారసంభవమున జంగమ మల్లికార్జునుడు బ్రాహ్మణుడుగనే అనేకమారులు పేర్కొనబడినాడు. ఆ మల్లికార్జునుడు వీరశైవుడా యను సందేహము కొందరికి కలుగవచ్చును గాని ఆతడును ఒక జంగమశాఖకు జెందినవాడే కావున నా కాలమున జంగమమూర్తులు బ్రాహ్మణు లనియే సుప్రసిద్ధియున్నట్లు తెలిసికొనవచ్చును. ఆంధ్రదేశపు భూపాలపట్నము రాజగురువులగు పరమారాధ్యుల వా రను మాహేశ్వర కుటుంబమువారు చిరకాలమునుండి శర్మయని వ్రాయుచు వచ్చినారు. మాహేశ్వరులవృత్తి నేటికిని బ్రాహ్మణవృత్తియే అయియున్నది. జగద్గురువులు, పీఠాధిపతులు, చర పట్టాధికారులు మున్నగు పూజ్యవర్గమువారీ వంశమునకు జెందియున్నారు. ఈ మతమునకు సంబంధించిన కొన్నిగ్రంథములు లింగి బ్రాహ్మణ ధర్మ గ్రంథమాలలో (సోలాపురము) బ్రచురింపబడియున్నవి. "పరళీ, ఎడియూరు మైసూరు మున్నగు స్థలములందలి స్మార్తులు మాహేశ్వరుల బ్రాహ్మణ్యమును గూర్చియు, వేదాధికారమును గూర్చియు ఆక్షేపించినందువలన అవి అత్యద్భుతమైన శాస్త్రవాదసభలుగామారి గవర్నమెంటువారి కమీషన్ ఎదుట తమబ్రాహ్మణ్యమును సశాస్త్రీయముగ నిరూపించి జంగమ మాహేశ్వరులు విజయము నందిన సంగతిని ప్రతిభగలవా రంద రెరింగియే యున్నారు. ఈ పరళి వ్యాజ్య సందర్భముననే వేదాధ్యయనము గావించి 'వేదతీర్థ' పట్టము నంది జన్మతః తన కున్న శర్మాధికారము కర్మతః గూడ నిరూపింపబడినది. వీరశైవ మహాసభా రిపోర్టులను కర్ణాటక మహారాష్ట్ర వీరశైవ పత్రికలను జూచువారికి విభూతి సంపాదకు లొకరు గాదు గదా ఇంకను వందలు వేల మాహేశ్వరులు చాలకాలము నుండి శర్మ వ్యవహారముతో నున్నా రని తెలియక పోదు.

యథార్థ మిటు లుండగా జంగమమాహేశ్వర శబ్దముల ప్రచార మెట్లు కలిగినదని ప్రశ్న రావచ్చును. మహేశ్వరుని పరంపరాగతత్వ ముండుటవలనను మహేశ్వరుని భక్తు లగుటవలనను మాహేశ్వరు లను వ్యవహారము కలిగినది. వైష్ణవ బ్రాహ్మణులుకూడ ప్రశ్నింపగా సహజముగ వైష్ణవుల మనియో శ్రీవైష్ణవుల మనియో చెప్పుచుందురు. అంతమాత్రముతో వారి జాతీయ పరంపరాగత మగు బ్రాహ్మణ్యము పోనేరదు. జంగమశబ్దము శివపాదపూజార్థము విప్పుచుండును. వీరశైవవాఙ్మయమున

జంగమ శబ్దమునకు ఎంతేని పూజ్యార్థము కలదు. గురులింగజంగమ వస్తుత్రయము వీరశైవులకు ప్రాణతుల్యము. శివుడు జంగమశబ్దవాచ్యుడుగా నున్నట్లును (పద్మపురాణ శివసహస్రనామాదులు) కొండవీటి జంగముడై నట్లును సుప్రసిద్ధము. బ్రాహ్మణశబ్దము కంటె నుత్కృష్టార్థద్యోతకమగు నీ జంగమశబ్దమును మాహేశ్వరులు వాడుచు వచ్చిరి. కేవల బ్రాహ్మణత్వమును జాతిని స్ఫురింప జేసుకొనవలయు నను వ్యామోహము లేని వారు కావున అమాయకు లగు మాహేశ్వరులు రాను రాను శర్మ వ్యవహారమును మానుకొనుటయు, పరమతీయులు విపరీతముగ భావించుటయు జరుగుచున్నది కాని వేరు కాదు. అటులే నియోగబ్రాహ్మణులు సైతము రాజ్యతంత్ర నిపుణు లగుటవలన, "రాజు, అమాత్య, రాయ" శబ్దములను తమ పేరుల చివర వ్రాయుచుండిరి. వారు కూడ ఇటీవల పత్రికా ప్రపంచ మారంభమైన పిదప మరల శర్మ వ్యవహారమును గావించిరి. వీరమాహేశ్వరులును పూర్వ స్మృతిని గని శతసంఖ్యయందలి పంచాశత్సంఖ్యనువలె తమ జంగమత్వమందుగల బ్రాహ్మణత్వమును నిరాఘాటముగ బ్రకటించుచున్నందులకు యథార్థవాదివంటి పరిమిత గ్రంథావలోకన గలవారు పరమత విషయమై అయథార్థముల వ్రాయుటలో నాశ్చర్యము లేదు.

ఆంధ్రపత్రికాధిపతులకును, ప్రభాకరశాస్త్రిగారికిని "విభూతి" మీద కేసుపెట్టవలసిన దని ప్లీడరుగారైన "యథార్థవాది"గారు సలహా నిచ్చుచున్నారు. శాస్త్రప్రమాణములవలనగాని ఐతిహాసికయుక్తులవలనగాని తమ మిథ్యావాదమును స్థిరపరచ లేనపుడు డబ్బుగలవారు కోర్టులో జయముపొంద నిచ్ఛగించుటయే సులభమైన మార్గము. వీరశైవమతమును గూర్చియు వ్యక్తులను గూర్చియు పర మతీయులు అవమానకరముగ నెంత వ్రాసినను వీరశైవులు నిర్ధనికులు కావున కోర్టులో కేసు వేయ జాల రనుట ప్రస్తుతము నిక్కమే!

మమ్ముగూర్చి వ్రాసిన పత్రికల ప్రతులు మాకంద జేయుట విమర్శకుల కర్తవ్యమైయున్నది. మాకు దెలిసినంతవరకు మా సంచికలను విమర్శనకు గురియైన ఆయా వ్యక్తులకు బంపుచునే యున్నాము. 'యథార్థవాది' మున్నగు కల్పితనామకులకు ఆ యా పత్రికల సంపాదకుల పేర బంపగలము. —విభూతి సంపాదకుడు.

'వీరశైవ మతచరిత్ర' యను మహాగ్రంథమున ననేక విషయములు చర్చింపబడును. అట్టి యున్నత కార్యసామగ్రి సిద్ధికై యథాశక్తిగ ప్రస్తుతము "విభూతి" "శివశర్మగ్రంథమాల" మున్నగు ప్రయత్నములు గావింపబడు చున్నవి. ఉదారహృదయుల యొక్క సాహాయ్యమునను ఆధార శివానుగ్రహమునను అది పూర్ణము గావలసియున్నది. ఏతద్విషయకమైన కర్ణాటకాంధ్రమహారాష్ట్ర సంస్కృత భాషాగ్రంథము లనేకములు బహు వ్యయ ప్రయాసములతో మాయొద్ద సంగ్రహింపబడియున్నవి. నిష్పక్షపాతముగ వీరశైవవాఙ్మయ విషయములను నెరుగగోరు వారికిగాని, వ్రాయ దలచినవారికిగాని యీ గ్రంథసామగ్రి ఉచితముగ సౌకర్యము గలిగింపగలదు. తొందరపడి యసత్యములను ప్రకటించు ... ఆంధ్రవిద్వాంసులకు విజ్ఞప్తి.



# శుభోదయము.

## శ్రీ కవిరత్న: లక్కన మల్లికార్జునుఁడుగారు

ఘనబంధనికరంబు కలికాల మహిమంబు, కలగల్పు నడకల కాకరంబు
నవిధేయతల బ్రాంబు యవగుణంబులడంబు, కృత్రిమభోగాల కీడ్పనింబు
నారోగ్యభిన్నంబు వైరాగ్యదూరంబు, చపలడంబములకు సాధనంబు
యుక్తిపైయుక్తుల నొలికించు నిలయంబు, సుఖరోగములకెల్ల ప్రకటితంబు
కట్టుకొయ్యను తగగుంజి కట్టుతెంపి, యిచ్ఛకొలదిని చరియించి ఎగసి మింట
పొంగి ధర్మంబులనిమెడి పొలములోని, మోక్షసస్యము మెరికెడు మొద్దుమెద్దు.

ఆహార నియమంబు లరయుదు మందురా, కాఫిహోటలు కంపు కాలఁదన్ను
సత్య శీలంబుల సాధింతు మందురా, కపట సాక్ష్యంబులు కాలఁదన్ను
ఏకపత్నీవ్రత మెసగింతు మందురా, కులుకు పాటల సొంపు కూలఁదన్ను
జప తపోవిధులను సాధింతు మందురా, కపట శిష్యుల సేవ కాలఁదన్ను
ధర్మమార్గంబు లరసి యా దారులందు,నడచి శుద్ధత నందెడు నడక విడిచి
వికట వాదము లాడుచు వేత్త పొత్తు, కాలఁదన్నుచు నున్నదీ కాలమహిమ.

బుద్ధి నిల్చినచోట కద్దయ్యె మోక్షంబు, దీక్షేల నాకంచు తెలుపు నొకడు
దొంగపోటులకంటె లింగపో టధికంబు, నంచింట కొయ్యకు నుంచునొకడు
పదిమంది నొకరీతి భావించియున్నచో, స్నానపూజ లవేల జనున కనును
ఇస్త్రీలుచేసిన వస్త్రంబు లున్నచో మడిబట్టలేలను మనుజుఁ డొకడు.
తల్లిదండ్రిలు, పెద్దలు, తాపసులును, పూర్వులందరు సంస్కారములను చేయ
దలప నెంచని మూర్ఖులు తలపులందు, వారినెంచుట యఘమని పలుకునొకడు.

తన శిష్య వితతిని తనయులవలె నెంచి, బోధల గావించి పుణ్యమెంచి
దీక్షలఁ దగనిచ్చి తిలకింతు రందుమా, యధికార గర్వంబు లతనిముంచు
గురుతత్త్వమును ఎంచి వరదీక్షలను గాంచి, సలలిత నిష్ఠల తలధరించి
శివలింగధారియై చెలగుదు రందుమా, తనబుద్ధిమూర్ఖత తనను ముంచు
అట్టి గురువును భక్తు డిప్పట్టునందు, తనరియుంటను, శివదీక్ష జననమాది
నలుబదేండ్లను గడచిన కలుగకుండ, వర్ణభ్రష్టతఁ జరియించు వరము లబ్బె.

మారుమూలలచేరి మర్యాద విడనాడి, చేయంగరానివి చేయునొకడు
కోటు సూటులవేసి బూటులఁ జేబట్టి, చెంపల వాయించు శ్రేష్ఠుడొకడు
చాటుగా త్రాగిందిని నీటంచు తెగత్రాగి, తెలియని శిష్యుల తిట్టునొకడు
కామాంధుడౌచు నేకాంతమునకు చీరి, కులకాంతఁ జెరబట్టు గుణుడొకండు
ఇట్టి మనుజులు చెలరేగ యిప్పు డకట, వన్నె గల్గిన వేదాంత పద్ధతులకు
యార్యధర్మములకు చేటు లబ్బఁ జేసె, ఏమి చెప్పుదు కలికాల స్వామి మహిమ.

ఆలి కన్నముపెట్ట జాలక సుఖమంచు సన్యాసియై జారు సరసుడొకడు
కట్నాలఁ దగద్రొబ్బి పట్నాలలో చేరి సుఖియింప మతిగోరు శూరుడొకడు
ఎద్దుమొద్దును వోలె గద్దరించుక డబ్బు దెమ్మంచు ఝుళిపించు దేవుడొకడు
వావివరుసలుమీరి వర్ణభ్రష్టుండయి రండలతో జేరు మిండడొకడు
ఇట్టివా రంత పెద్దలై యిపుడు నుంట
వారిసేవించు భక్తులు దారిలేక
దీక్షమంత్రంబు మర్యాద రక్షణంబు
కానకుండియు కుటిలమార్గాన బడిరి
ఏమిచెప్పుదు కలికాల స్వామిమహిమ.

ఈ వింతగాథల కే మాత్రమును జంకు, పడయక దీక్షతో నడుముకట్టి
నిరుపమ శీలఁబు వరధర్మములగాంచి, నుడివిన విధమున నడకఁబట్టి
శివమంత్రసిద్ధులై శివదీక్ష గైకొని, దుర్గుణగణముల దొలగగొట్టి
నిష్ఠలు విడవక నిరుపమస్థైర్యులై యార్యోద్ధరణకునై యడుగుపెట్టి
కడగి పురుషకారంబు నీ పుడమి నింపి,
ధీరజనములు మెచ్చగ పేరుమెరయ
యత్నములఁ గూర్ప లేవండి యాంధ్రులార!
వరశుభోదయ మగు మీకు వంతలేల.






కల్పవల్లికా:—(రామాయణవ్యాఖ్య) కర్త: బొమ్మకంటి నరసింహశాస్త్రిగారు, పుటలు 1౬0 అచ్చు కాగితములు బాగుగా నున్నవి. బాలకాండ టీక ఆంధ్ర తాత్పర్యముతో నున్నది, వెల 1-4-0. కల్పవల్లిక ఆఫీసు, రామారావుపేట, కాకినాడలో దొరకును.

వాల్మీకి రామాయణమునకు ప్రాచీన పండితు లనేకులు సంస్కృత టీకలను విరచించి లోకోపకార మొనర్చుటయే కాక తమ తమ ప్రతిభా సంపత్తివలన స్వస్వసంప్రదాయ సిద్ధాంతములను సైతము హృదయంగమముగ నిరూపించినారు. రమణీయమైన రామాయణమును విద్యానిధు లగు పండితులు దరచినకొలదియు నూతన స్వారస్యములు బైట బడుచునే యుండు ననుట కీ కల్పవల్లికయే సాక్షి. సుప్రసిద్ధులైన బొమ్మకంటి పండిత సోదరుల లోని వారగు నరసింహశాస్త్రిగారు రామాయణమునకు కల్పవల్లిక యను పేరుతో మరియొక క్రొత్త వ్యాఖ్యానమును శక్తిపరముగ విరచించి తమ యనుపమానమైన విద్యాశక్తిని వెల్లడించినారు. ఈ కాండము చాల భాగము నవలోకించి సంతసించితిమి. శాస్త్రిగారు శాక్త తత్త్వమును నిరూపించుట కీ వ్యాఖ్యానము రచించినను అనేక చోటులలోని విషయములు శైవానుకూలముగను కుదిరినవి. శాస్త్రిగారి పుత్రులైన శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారి మెచ్చనైన ఆంధ్ర తాత్పర్యము గూడ వెనువెంట నుండుటవలన పాఠకజనుల సౌకర్య మినుమడింపబడినది. రామాయణానురాగు లంద రీ కల్పవల్లి రామాయణమును తప్పక నవలోకింప గోరుచున్నాము—నిర్ణయ సాగరము వారి వలెనే సంస్కృతభాషలో స్పేసింగు పద్ధతి యుండుట మంచిది. వ్యాఖ్యానములో నుదహరింపబడిన ప్రమాణములకు ఆ యా గ్రంథములయొక్క అధ్యాయాది స్థలములను సూచించుట పరమావశ్యకము. ముఖ్యముగ నాగరిలిపిలో ఈ గ్రంథము ప్రకటింపబడు నపుడు మా సూచనలను గమనింప గోరుచున్నాము.

బ్రహ్మోపదేశవిధిః (సంస్కృతము):—కర్త: ఆస్థానవిద్వాన్, ధర్మరత్న పండిత మళిమఠద శంకరశాస్త్రిగారు పో. హరిహర. జిల్లాచిత్రదుర్గ, మైసూరుస్టేటు, గ్లేజు కాగితములు, పుటలు ౧౦౦ వెల 0—12—0 ఇది కన్నడ అక్షరములలో నున్నది.—

బ్రహ్మసూత్రములకు వృత్తిని ఈశ కేన సిద్ధాంత శిఖోపనిషత్తులకు వీరశైవ భాష్యములను వీరశైవ సిద్ధాంత సుధాకర (కన్నడ) మును విరచించి వీరశైవ పండితలోకమున శ్రేష్ఠమైన స్థానము నాక్రమించిన శ్రీకంఠశాస్త్రిగారి కృతి యనినచో దీని ప్రాశస్త్యము దెలిసికొనవచ్చును. వీర శైవులకు బాల్యమున జరుగు దీక్షోపనయనమున గావింపబడిన యుపదేశముతో కేవల మంత్రాక్షరముల గ్రహణము మాత్ర మగును. కావున అర్థగ్రహణమునకై ప్రౌఢావస్థలో మరల గురువు నాశ్రయించి సరహస్యముగ పరశివ బ్రహ్మతత్త్వమును గ్రహింపవలెనని శాస్త్రప్రమాణములతోడను యుక్తిసహ

ముగను దుర్వాదఖండన పూర్వకముగను విరచించినారు వీరశైవులందరును తప్పక సంగ్రహింపదగిన గ్రంథరాజము. వీరశైవ సమస్తదీక్షాతత్త్వములును విధికి సంబంధించిన అంగోపాంగములును చక్కగ వివరింపబడినవి. దీనికి సరళమైన కన్నడ తాత్పర్యమును శాస్త్రిగారే కూర్చి యుపకార మొనర్చినారు. పరమతీయ పండితులు సైతము పఠింపదగియున్నది. అచ్చుతప్పులను పునర్ముద్రణమున సవరింప గోరుచున్నాము.

హాలికుడు (నాటకము) కర్త- వ్యాకరణశిరోమణి చలమచర్ల రంగాచార్యులుగారు. 18 రాజు విలాస్, ఇసామియాబాజారు హైదరాబాదు దక్కను, పుటలు ౧౩౦. చక్కని యావరణపత్రము మంచి కాగితములు, ముద్దుగానున్నది వెల 0—14—0.

మాకు దెలిసినంతవరకు ఆంధ్ర కవులను గూర్చిన ప్రథమ నాటక మిది యని భావించుచున్నాము. ఐదంకములలో మహాకవి పోతనచరిత్ర సరసముగ ముగింపబడినది. పోతనకు హాలికు డను నామ మెంతయు దగియున్నది. హాలికశబ్దముతో నాటకీయవస్తువును హృదయంగమముగ స్ఫురింపజేసిన గ్రంథకర్తగారి పండితకవిత్వము ప్రశంసనీయము. ఇందు పోతనగారి సహజ పాండిత్యము, భగవద్భక్తి, నిర్మలమైన త్యాగజీవనము ఆదర్శముగ చిత్రింపబడుటయే కాక భాగవతము బాలిపెట్టించె నన్న సర్వజ్ఞసింగభూపాలుని యపకీర్తిసైతము సరసముగ కీర్తిగా మార్చబడినది. సందర్భానుసార మచ్చటచ్చట విరచింపబడిన పద్యములు హృద్యముగా నున్నవి. గద్యశైలి సరసముగా నుండి కవిగారి ప్రతిభాప్రాగల్భ్యములకు స్ఫోరకము గానున్నది. గత శరదృతువులో హైదరాబాదు నెరవేరిన పోతన జయంతిసందర్భమున రంగప్రదర్శనము గని మహాజనుల యాదరణకు పాత్రమైనదీ నాటకము. శ్రీ చెన్నకేశవుల హనుమంతరావునాయుడుగారి యౌదార్యమువలన ముద్రితమై ప్రచారము గనుచున్నది. నాటకములలో ముఖ్యముగ నుండవలసినశృంగారవీరరసములను పోతన్న వంటివారిచరిత్రను సంఘటింపజేయుట సుసాధ్యముకాదు కావున ప్రదర్శనసందర్భములలో సామాన్యజనచిత్తము నాకర్షింపజాల దనుట సహజము. ఇకముందు ఆంధ్రకవిజీవిత గాథలను దృశ్యకావ్యములుగ మార్చుట కెట్టి యవకాశములు గలవో విజ్ఞులకీ గ్రంథము సహకారి కాగలదు. పునర్ముద్రణలో స్పేసుల నొక నియమమునకు గురిజేయగోరుచున్నాము. అభినవమార్గములో చక్కని రచనను ప్రకటించిన కవిగారి ప్రశంసించు చున్నాము.

వేదమే ఈశ్వరీయజ్ఞానము :— కర్త, పండిత శివశంకరశర్మ కావ్యతీర్థగారు, అనువాదకులు, పం. భూ. రాజరత్నాచార్యులు, ప్రకాశకులు— వైదిక ధర్మగ్రంథమండలి:— ౫౦౧, దేవిదీక్ బాగ్, సుల్తానుబజారు, హైదరాబాదు, దక్కను పుటలు ౫౬, ముద్దయిన అచ్చు కాగితములు, వెల మూడణాలు,

ఆర్య సామాజికులైన గ్రంథమండలివారు దీనిని ప్రథమ ప్రచురణముగా పాఠకుల కందించినారు. వేద మొక్కటియే వారికి ప్రమాణగ్రంథము కావున మిక్కిలి మక్కువతో ఈ హిందీ పుస్తకమును తెలుగున అనువదించి ప్రకటించినారు. పరమేశ్వరుడను వాడు కలడేని అతడు బోధించినది వేదమ్ము తప్ప మరొక భాషాగ్రంథములు కానేరవని కొన్ని యుక్తులతో వేదముయొక్క సర్వశ్రేష్ఠత్వమును నిరూపించుటకై గ్రంథకర్తగారు ప్రయత్నించినారు. కావ్యతీర్థులుగారు తమ శక్తికొలది వేదభాష్యమును గొంతి కేవలము లౌకికయుక్తులతో తమ సిద్ధాంతమును నిర్ణయ మొనర్చినారు కాని వేదభాష్యములను గాని శాస్త్రదీపికాది మీమాంసాగ్రంథములను గాని పరిశీలించినచో ఇంకను యుక్తియుక్తముగను

గాంభీర్యముగను గ్రంథరచన సాగించెడివారు. ఎటులైననేమి వేదప్రాశస్త్యపక్షము మాకును ఇష్టమే కావున గ్రంథకర్తగారి ప్రయత్న మభినందనీయ మనియే చెప్పగలము.

ఆంధ్రానువాదము సరిగాలేదు. శుద్ధశైలిలో వ్రాయబోయినారు కాని కుదురలేదు. గ్రంథము తెరువగానే వికారముగా గనపడు ప్రకటన పత్రికలను తీసివేయవలెను. ముఖ్యముగా ఆక్షేపణీయాంశ మొకటి కలదు. గ్రంథమండలి ప్రకాశకసోదరులు సావధానమనస్కులై యీ సూచనల నాలోచింపగోరుచున్నాము. హిందువులలోని వివిధ సంప్రదాయాచారములలోను దేవతోపాసనములందును సిద్ధాంతములలోను విశుద్ధమైన విజ్ఞానము అంతర్హితమై యున్నది. అట్టివానిని తపోవిద్యా వైభవములచేత పరిశోధించి సత్యమును వెల్లడించవలసియుండగా కడు పేలవముగ తృణీకరించి తాము వ్రాయబోవు విషయమున నైతము అడ్డదారినిబడి పోరాదు. ప్రమాణబద్ధముగ నుండవలెనన్న బహుజ్ఞులైన పండితుల పరిశీలన పరమావశ్యకము. ఇట్టి పాత్తములమీద పెద్దవిమర్శన గ్రంథములను ప్రకటించుటకు మరియొక సత్యవైదిక సమాజమును బుట్టకుండునట్లు జూడవలెనని సస్నేహముగ సూచించుచున్నాము.

స్వామి దయానందసరస్వతి:— కర్త. వెల్దుర్తి మాణిక్యరావుగారు.

వినాయక సావర్కర్ కర్త. కె. రంగదాసుగారు. ఈ రెండును ఆణాగ్రంథమాల ౩౬౮౧ తూప్ బజారు, హైదరాబాదు, దక్కన్ వారిచే ప్రకటితములు. ఈ గ్రంథమాలపేరే ఈ పుస్తకముల వెల.

ఆర్యసమాజమును స్థాపించి వైదిక భక్తి నినుమడింపజేసి హిందూసంఘాభ్యుదయమునకై హృదయపూర్వకముగా పరిశ్రమించి సుప్రసిద్ధులైన శ్రీ దయానందులవారి పుట్టుపూర్వోత్తరములు, పాండిత్యము, గ్రంథరచన, లోకసేవ మున్నగు అంశములు, సంక్షిప్తముగ నీ పాత్తములో వివరింపబడినవి. అందరు నవలోకింపవలసియున్నది. దయానందులు సర్వోత్కృష్ట పండితుడని కాని; కాశిలోని సుప్రసిద్ధ పండితుల నోడించెనని కాని వస్తుపరిచయము గలవారెవరును అంగీకరింపజాలరు. వారి సిద్ధాంతము లనేకములు పరమతీయులచేత కాదుకదా స్వకీయులైన ఆర్యపండితులచేతను కొన్ని ఖండింపబడుటగాననగును. అయితే సరస్వతిగారు గట్టి పట్టుదలతో అసత్ శాస్త్రములనిపించు సేవగించుకొని హిందూత్వమును వదలుకొను పరిస్థితిలో నున్న కొందరిని ఆకర్షింప గలిగిరని మాత్రము చెప్పవచ్చును. ఇందులోనే వారి గొప్పతన ముప్పతిల్లినది. అచ్చుతప్పులు చాలా కలవు.

రెండవపుస్తకమున విఖ్యాతులైన బ్యారిష్టర్ వినాయక దామోదర సావర్కరుగారి బాల్య యౌవనములు హిందూసంఘ సేవ మున్నగునవి చిత్రింపబడినవి. అత్యంత సాహసములు గావించి ప్రపంచదృష్టి నాకర్షింప గలిగిన సావర్కరు వీరుని చరిత్ర నుపేక్షించు హిందువుండడని చెప్పవచ్చును. పుస్తక రచయితలకు మహారాష్ట్రము తెలియనందున గాబోలు, 'రానడె, చాపేకరు' మున్నగువానిని 'రనడే, చాఫీకరు' అని వ్రాసిరి. ఇంగ్లీషునుండి అనువదింపబడుటచేత గాబోలు, నాయకులపేర్లు మున్నగు పారిభాషిక పదములు ఆంధ్రమున నశుద్ధముగా వాడబడుచున్నవి. ఆయా భాషాభిజ్ఞులతో పరిష్కరించి ముద్రించిన మేలగును. సులభమూల్యమున నిట్టి పాత్తముల నందించుచున్న గ్రంథమాలవారి ప్రయత్నము ప్రశస్తము.

కాంతి మాసపత్రిక సంపాదకులు:- డా. పి. టి. జగన్నాధరావుగారు తిరుపతి. రఫ్ కాగితము పుటలు 42, చందావగైరా తెలియదు.

మూడవసంపుటము ప్రథమసంచిక మాకుజేరినది. ఇందు సారస్వత నైతిక సాంఘిక విషయములకు సంబంధించిన గద్యపద్య వ్యాసములును కథలును కలవు. ఆంధ్రభూమియైన తిరుపతిలో ఆంధ్ర పత్రికలేని కొరతనుదీర్చిన దీ పత్రిక. కాంతి తనచల్లని సంచారముతో తెలుగుతల్లి కీర్తి నినుమడింప జేయుచు విరాజిల్లుగాకయని కొల్లలుగా గోరుచున్నాము.

పెరికకుల ప్రకాశిక:— (మాసపత్రిక) సంపాదకులు, అంబటి కోటీశ్వర రావుగారు, బెజవాడ. పుటలు 16 రఫ్ చందా 2—8—0

స్వసంఘాభివృద్ధికై నైతిక విద్యాచారములకు సంబంధించిన విషయములును, చారిత్రిక చర్చలును గల వ్యాసములింద మే జూన్ నెలల సంచికలను జూడగా పెరికకులాభివృద్ధికై సంపాదకులొనర్చు ప్రయత్న విశేషములు దెలియవచ్చెడిని. స్వశాఖవారంద రీ కార్యమున తప్పక తోడ్పడుట కర్తవ్యము. అపుడుగాని ఈపత్రిక ప్రౌఢముగా నేరదు. పెరికకులమునకు గురువంశజులుగా చెప్పబడు మాహేశ్వరుల మఠమొకటి పెరికలమఠ మను పేరుతో చిరకాలమునుండి కొలనుపాక క్షేత్రములో కలదు. పెరికపురాణ మను పొత్తమును ఒకటి కలదు. ఏతత్సంఘీయులు వీనిని పరిశీలించి స్వశాఖ చరిత్రాదుల నిర్మించవలసియున్నది. ఈ పత్రికాప్రయత్నముల నభినందించుచు అభ్యుదయమును గోరుచున్నాము.

---

# శ్రీశైల జగద్గురు సింహాసన పట్టాభిషేకము

శ్రీమద్గిరిరాజ సూర్యసింహాసనాధిపతులును శ్రీజగద్గురు పండితారాధ్య పరంపరాగతులును అను శ్రీజగ్గురు నాగలూటి భిక్షావృత్తి శివాచార్య మహాస్వాముల వారు అతివృద్ధాప్యముచేత జీర్ణకాయు లగుట వలన తమయుత్తరాధికారమును దేనూరు బృహన్మఠాధ్యక్షులును సాహిత్య వేదాంతాచార్యులును అగు శ్రీ వాగీశశివాచార్యులవారికి ఇదే ఆషాఢ శుద్ధ ౧ భానువారమున (7-7-1939) గుంతకల్లు నందలి తమ పీఠమున ననుగ్రహించిరి. శ్రీమదుజ్జయినీ జగద్గురువులవారు మున్నగు ప్రముఖులును, భక్తమాహేశ్వరులును పాల్గొని మహావైభవముగా మహోత్సవము గావించిరి. దీనికి సంబంధించిన వ్యాసమును, చిత్రములును ముందు సంచికలో ప్రకటింపబడును.

పర్వతమఠము ఏజంటు:—గుంతకల్లు



సచిత్ర మాసపత్రిక

సంపుటము ౨ | శా. శ. ౧౮౬౨ విక్రమ సంవత్సర శ్రావణమాసము | రేఖ ౬
Vol. 2 | 22 ఆగస్టు 1940 సికిందాబాద్ | No. 6

# శనిగ్రహము

కీ. శే. ఖాసీం అలీషాగారు

సీ. అడవిలో జీవుల కన్నం బిడెడువాడు, కడుపులోఁ బిండంబు గాచువాఁడు
కట్టెలోఁ బుర్వుల పొట్టఁబోసినవాఁడు, మురికిలో దోమను మొగుచువాఁడు
పుట్టలో చేలకు బువ్వబెట్టినవాఁడు, బురదలోఁ గమలంబుఁ బ్రోచువాఁడు
గూటిలోఁ బక్షికిఁ గూడు దెచ్చెడివాఁడు, మంటిలో జెదలను మంచువాఁడు
జగములన్నింటి సృష్టింపఁ జంపఁ బెంప, భారవహుఁ డీశ్వరుఁడు నీదు బారినుండి
తొలఁగ నెల్లరకుఁ బ్రార్థనీయుఁ డరయ, నిగ్రహానుగ్రహంబ, శనిగ్రహంబ.

కవిసార్వభౌముఁ డా కాళిదాసునకే విపచ్చయంబుల నెన్నో దెచ్చినావు
సుకుమార సుకవిభాసురుఁడు శ్రీనాథునే విటరాయనిగ మార్చివేసినావు
వేదాంత కవితావినోది పోతన్ననే మలమల వస్తుల మాడ్చినావు
రసవత్కవిత్వ నిర్మాత తిమ్మన్నకే కడలేని యగచాట్లు గుడిపినావు
దిగకలోతు లెటింగియుఁ దినకరుచులు, కనుఁగొను కవుల నెత్తినే కాలుబెట్టి
కటకటంపడ జేతువుగాదె నీవు, నిగ్రహానుగ్రహంబ శనిగ్రహంబ.

నీకారణంబుననే హరిశ్చంద్రుండు, కాటికాపరి సేవఁ గడగినాఁడు
నీకారణంబుననేగదా నలరాజు, భార్యను నడుకానఁ బాసినాఁడు

నీకారణంబుననే ధర్మజుఁడు, నాడు శకునితో జూదంబు జరిపినాఁడు
నీకారణంబుననేగదా దుర్యోధనుఁడు, పెన్మడుగు దూఱి గడగినాఁడు
అంతటి మహానుభావుల నంతఁజేసి, నెత్తిపై కెక్కి యెన్నేండ్లొ నిలిచి యేడి
పించి సిరిదుంచి వెతలఁ గల్పించినావు, నిగ్రహానుగ్రహాంబ శనిగ్రహాంబ. ౩

పడియుండుటకు దూదిపరుపులుండి యుగూడ, పై బట్టచే నేలఁబండు నొకఁడు
మలిచిన పసిఁడి బొమ్మలవంటి సతులుండ, మాలముండలచెల్మి మఱుఁగు నొకఁడు
తొడఁగఁ గప్పగనుమేల్ దుస్తులుండియుఁగూడ, గడగడ చలికినై వడఁకు నొకఁడు
తినుటకుఁ గడుపారఁ దిండియుండియుగూడ, మలమల కూటికై మాడు నొకఁడు
ఎందఱెందఱో కలవార లీ విధమున, కుంది కనరాని యిక్కట్లు పొందుచుంట
నీ కతంబుననేగదా నిక్క మరయ, నిగ్రహానుగ్రహాంబ శనిగ్రహాంబ. ౪

పడుచుపెండ్లము పక్కకెడఁబాపి చెడుకూటి పడుపుగత్తెల యింటిపడకఁజూపి,
కులకామినులమాట వెలితిగాఁజూపించి కులటలమాటల గోటుఁ బెంచి
వంటకత్తియతిండిఁ దింటయే కడఁబాపి కుంటెనగత్తెల కూడుఁగుడిపి
కన్నబిడ్డల నోటగడ్డలం గొట్టించి రంకుటాల్ బిడ్డపై రాగ ముంచి
గురుజనంబులపై భక్తిఁదఱుగఁజేసి, బంధువులపైని ననురాగభరము దుంచి
యెందఱినో యేడిపించుచు నుందు వీవు, నిగ్రహానుగ్రహాంబ ! శనిగ్రహాంబ! ౫

అన్నదమ్ములలాగు నలరారువారికిఁ బెనుమచ్చరంబుఁ గల్పింతు వౌర
ప్రాణమిత్రములుగా భాసిల్లువారికి దరిలేనివెత్తి గన్పరతు వౌర
ప్రియబంధువులభాతిఁ బెంపొందువారికిఁ దెగరాని పెన్పగల్ దెత్తువౌర
మఱది బావలమాడ్కి మనుచుండువారికిఁ గడరాని పోరుల నిడుదువౌర
నీదు ప్రజ్ఞావిశేషంబు నీదు నేర్పు, నీ చమత్కారవర్తన నీగుణంబు
నవని నింకొక్కవానికిఁ దవులఁగలదె, నిగ్రహానుగ్రహాంబ శనిగ్రహాంబ. ౬

వంచినతలయెత్తి మించిపోవనివానిఁగాంచి తైతక్క లాడించి నావు
సతతసూనృత వచోరతుని రచ్చలకు రప్పించి బద్దులను బల్కించినావు
ఏకపత్నీవ్రతం బింపార నడిపెడి ధీరు జారుని జేసి త్రిప్పినావు
ఏ రోజునన్ నమోనారాయణా యను పరమభక్తుని బుద్ధిఁ జెఱిచినావు
నీటిలోపల మంట మండింపఁగలవు, నిప్పులో నీటియూట నిండింపఁగలవు
నిన్నువంటి వదాన్యుండుఁగన్న నెవఁడు, నిగ్రహానుగ్రహాంబ శనిగ్రహాంబ. ౭
పూలమ్మ కేలనే లీలమాలిమి మాలి కట్టె లమ్మింతువో కఠినహృదయ
పొదలాడు మొగలిపూపొదరిండ్ల మిన్నాగు లుండగా జేతువెట్టో దురాత్మ

అల్లారుముద్దుగా నలరారు నాల్మగళ్ళకు పగల్ దెత్తువో వికలబుద్ధి
సిరిసంపదలచేతఁ జెన్నొందు కాపురాల్ పాడుబెట్టింతువో పాపకర్మ
కాగడావేసి వెదకినఁగాని నీకు, కనికరము లేదు సత్యంబు గానరాదు
జాలియా లేదు తాలిమి జాడలేదు, నిగ్రహానుగ్రహాంబ శనిగ్రహాంబ. ౮

ప్రియివేటు పంతుళ్ల పడిపంచలం గాచి, సాక్షుల పనులెల్లఁ జక్కపెట్టి
ప్లీడరు లడిగెడి ఫీజు లిచ్చియు వారి క్లర్కుల వాకిళ్ల కావలుండి
కోర్టు గుమస్తాల కొ్రత్త చెప్పులు మోసి గ్రామాధికారుల కాన్కలొసఁగి
ముందమీనా గారి చందాలు చెల్లించి కడకు నాజరుగారి కాళ్లుబట్టి
కుడువఁ గట్టగఁ గూడును గుడ్డలేక, ఆస్తియెది లేక పెండ్లాల పుస్తె లమ్మ
యేడ్తురెందరో నెత్తిపై కెక్క నీవు నిగ్రహానుగ్రహాంబ శనిగ్రహాంబ. ౯

ఏ ప్రొద్దు సిరులతో నింపు పెంపెసలారు మేడమిద్దెల నెన్నొ పాడుజేసి
సరిసాటిలేని సంస్థానంబు లెన్నియో గబ్బిలంబుల కాటపట్టుజేసి
సుతులతో సుతలతో శ్రితులతో శోభిల్లు కొంపలనెన్నియో కూలఁజేసి
నవధాన్యముల నుంచ నవు గృహంబుల నెన్నొ గుడ్లగూబలు పండుకొనఁగజేసి
రత్నములఁ జెక్కబడు మందిరముల నెన్నొ, దిక్కులేని దివాణాలఁ దెరఁగుజేసి
సంబరముఁ జెందుచుందువు చాలుఁజాలు, నిగ్రహానుగ్రహాంబ శనిగ్రహాంబ. ౧౦

పెట్టిపోయఁగ జాలునట్టి పట్టి నశించెనంచుఁ గన్నీరు వర్షించువారు
పూర్వార్జితపుటాస్తి పాలివోయె నంచు భావించి లోలోన జింతించువారు
కడిపెడు బిడ్డలం గని కట్టకర్పించి మిడుకుచుం గుక్కిళ్ళు మ్రింగువారు
సుతులు లేకున్న సద్గతులు లేవంచు దుఃఖించుచుం జనుల యాచించువారు
గణనసేయంగ శక్యంబుగాకయుండి, రకరకాల యాపత్సంతానంబునందుఁ జావ
లోకులను వ్యాకులత ముంప నీకుఁ దగునె, నిగ్రహానుగ్రహాంబ శనిగ్రహాంబ. ౧౧

పాపమే లేని నిష్పాపాత్మునకుఁగూడ నెత్తిపైకే నిందఁ దెత్తు వొకట
చక్రవర్తినిగూడ సందుగొందులఁ ద్రిప్పి యింటింట బిచ్చమెత్తింతు వొకట
పరమ పావనుఁడైన ప్రాజ్ఞవర్యునిగూడ కలుషాత్మునిగఁజేయ నలతు వొకట
మేలుకొంపలు దివాలాలు దీయించి దీపము లార్పి సంతోషమందు వొకట
తల్లిఁ దండ్రికిఁ బుట్టలేదా దురాత్మ! బుడుతలం గన్నయటువంటి కడుపుగాద
పరులవేధించి బ్రతికెడి బ్రతుకు బ్రతుక నిగ్రహానుగ్రహాంబ శనిగ్రహాంబ.* ౧౨

* కవిగారి మిత్రులైన శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్య శర్మగారి ద్వారా అందినవి. —సం.



# శ్రీ మాణిక్యవాశగర్

## అనువాదకులు: మఠం సిద్ధివీరయ్యగారు.

౧

దక్షిణాపథమందలి మదురాపురి సమీపమున (నాథపూర)ను పేరు గల గ్రామ మొండు గలదు. అచట శ్రీమాణిక్యవాశగర్ భక్తుడు బ్రాహ్మణకులంబున జన్మించెను. షోడశవర్ష ప్రాయు డగు వరకు యితఁడు సమస్త శాస్త్ర రహస్యములు విద్వాంసులైన యా కాలపు పండితులచే గ్రహించెను. శైవధర్మ శాస్త్రముల విశేషముగాఁ జదివి జ్ఞాన సముపార్జన మొనరించెను. వీరి విద్యావివేకములను గుఱించిన ప్రశంస యా దేశపు పరిపాలకునకుఁ దెలిసినది. అత డా భక్తుని సాదరముగఁ బిలిచి తన ప్రధాన మంత్రిగా నొనరించెను. పాండ్యరాజేంద్రుని యాస్థానమునం దతనికి సమస్త సౌఖ్యములుఁ గల్గియుండెను. రాజమంత్రి లాంఛనములతో నాతడు సభ్యుల యొక్క, సైనికులయొక్క, గజాశ్వముల మధ్య విరాజిల్లునపుడు తారకాగణ మధ్యమందున్న చంద్రునిఁ బోలియుండును. ఇంతటి వైభవములను బొందినను మాణిక్యుఁడు తన పూర్వస్థితిని విస్మరింపలేదు. సర్వదా యతని జ్ఞప్తియందున్న విషయ మేమనగా? బాహ్యసుఖమ్ములన్నియు నాత్మను కేవలము బంధనమునఁ బడవేయును. ముముక్షువైన వానికి వీని నన్నింటినిఁ బరిత్యజించుటే కర్తవ్యము. జీవితాపేక్ష గల వానికి యావజ్జీవముఁ దటస్థించు నసంఖ్యాక వేదనలఁ సహింపుచుండుటఁ గాంచి యతడు మిక్కిలి విచారాక్రాంత చేతస్కుఁ డగును. అతని మానసము శివునిఁ జేరుటకు సదా వ్యగ్రమై యుండును. అతఁడు న్యాయ పూర్వకముగ రాజ్యమును సద్విధానమున పాలించు చుండెను. అయిన నతని మానసము సదా సద్గురు నాశ్రయించుట కభిలషించు చుండెడిది. ఏల యనగా? అతని మూలముననే తనకు ముక్తిమార్గము దొరకు నని విశ్వాసముఁ గల్గియుండెను. భ్రమరము పుష్పరసము సంగ్రహించుటకు మెత్తెఱంగున పుష్పముల చెంతకుఁ బరుగిడుచుండునో? తద్వత్ మాణిక్యభక్తుఁడు జ్ఞానరసముఁ గ్రోలుటకై వివిధ శైవ గురువరేణ్యుల శరణుఁజొచ్చినను యాతనికి నాత్మసంతుష్టిఁ జెంద దయ్యెను. ఒకానొక దినమునం దాతని కెవరో యిట్లు సూచించిరి.

"మంత్రివర్యా! ఒక నౌక సమీపవర్తి యగు రాజు నౌకాశ్రయమున నిలచి యున్నది. అందు పరదేశమునుండి యుత్తమాశ్వములు వచ్చి యున్నవి."

ఈ వార్తను పాండ్య భూపాలుఁ డాలకించి వలయు ధన మొసంగి మంత్రిని ఘోటకంబులఁ గొనుటకై పంపించెను. ప్రధానామాత్యుఁడు సైనికదళంబు వెంట నిడుకొని ప్రస్థాన మొనరించెను. ఇతని సాంసారిక జీవనమున కిదియే యంతిమ ప్రదర్శన మని చెప్పవచ్చును.

౨

ఆ సందర్భమున కైలాసపర్వతంబునం దుమాదేవీ సమేతుఁడై శ్రీ శంకర భగవానుఁడు కొలువుఁ దీఱియుండి జగన్మాతతో నిట్లనియె! "ప్రియురాలా! నేను మానవరూపంబున నొక ప్రియభక్తునకు నాచార్యుఁడ నగుట కేగుచున్న వాడను. అతఁడు దక్షిణ దేశము నంతటను (తమిళ) భక్తిసుధతోఁ బరిప్లావిత మొనరించును. అతఁడు ప్రస్తుతము కార్యాంతరాసక్తుఁడై పోవుచున్నాడు. కావున నే నతనిఁ గలిసి కొందును" అని పలికి శిష్యగణ సంసేవితుఁడై నాకాశ్రియస్థాన సమీప మందలి వనమునం దొక వటవిటపినికటంబున జటాధారియై యోగనిష్ఠయం దుపవిష్టుఁడై యుండెను. అచటి వృక్షలతాదులు ఋతుభేదమై యున్నను చిగిర్చి, పుష్పించి, శివదేవుని మహిమచే నొప్పారెను. వివిధ శకుంత సంతానముల కలకలారావంబులచే వనర్యామణీయకత కత్యంతశోభ నాపాదించెను. ఆ సమయమునం దా మార్గము ననుసరించి యువకమంత్రి బందరు పట్టణమునకు ససైన్యముగా నేగుచుండెను. వనమునుండి శివస్తుతి శ్రవణకుహరములఁ జేరిన, ధ్వని నాలకించి యా దివ్యగానము వినవచ్చు ప్రదేశము నన్వేషింప నొక యనుచరునిఁ బంపెను. అంత నాత డచటి కేగి యా వనమునందు శిష్యమండలితోఁ బరివృతుం డగు మహాత్ముని దిలకించి యా సమాచారము మంత్రికి దెలియఁ జేసెను. తత్క్షణమ మాణిక్యమంత్రి యశ్వావరోహణ మొనరించి యమ్మహానుభావుని సమీపించి సవినయముగ వటవృక్షచ్ఛాయఁ గూర్చుండియుండిన మునివరేణ్యునికి ప్రణామం బొనరించి ఫాలభాగమందలి దివ్య తేజస్సును గాంచి సాక్షాత్పరమశివుం డని తలంచెను. వారు శిష్యులకొనరించు దివ్య బోధల నాలకింపుచుండెను. ఉపదేశానంతరము మాణిక్యభక్తుఁడు భక్తిభావనలచే, ధర్మదీక్షచే బద్ధుడై యైహిక సుఖంబులఁ బరిత్యజించి గద్గదకంఠుఁడై సాశ్రుపూరిత నేత్రుఁడై గురుపాదంబుల బడి శరణుజొచ్చెను. సద్గురుమూర్తిమూలమున సాధనలఁ గావింపుచు నాతఁడు జీవన్ముక్తుఁ డయ్యెను. అతడు భస్మావలిప్తసర్వాంగుడై, జటాజూటధారియై, తాను పాండ్యరాజుచేఁ గైకొనిన ద్రవ్య మంతయు సాధువుల సేవకై వినియోగించెను,

### 3

రాజోద్యోగులు కొంద అరుదెంచి యతని కవరోధముఁ గలిగించిరి. మఱియు రాజద్రవ్యమును దానముఁ జేయుటకు నీ కధికారము లేదనిరి. కాని యందు కామంత్రి యిట్లనియె. 'మీరు నన్ను సంసార బంధమునం దేల బడవేసెదరు' అని పలుక రాజునకీవార్త నెరింగింప వారేగిరి. యావద్వృత్తాంత మతనికి నివేదించిరి. భూపాలుడతిక్రుద్ధుఁడై కఠినమైన యాజ్ఞాపత్రము వ్రాసి మంత్రి నతి త్వరితముగఁ బట్టికొని వచ్చుట కానతిచ్చెను. వా రా రాజశాసనముఁ జూపింప నా మంత్రి యిట్లనియె. 'నేను శివుని తప్ప నితరుల నెవరిని రాజుగా నెంచను. శివదేవుని చెంతనుండి యమభటులైన నన్ను గొనిపోజాలరు. అప్పు డా ఋషిరూపధారి యగు శివదేవుడు "వత్సా! ఏల భయ మందెదవు. మదుర కేగుము. రాజుతో గుఱ్ఱములు నిర్ణీత కాలమునకు నీ నగరమునకు వచ్చునని వచింపుము" అని పలికి యొక యశ్వము నొసగి యతని కమూల్యరత్నము నిచ్చి సాగనంపెను.

### ౪

రాజు పురప్రవేశము గావించిన మంత్రినిఁ జూచి తన గుఱ్ఱములు రాగలవని విశ్వసించెను. కాని యితర మంత్రులు విశదముగా దెలిపిన వార్తల ననుసరించి యాతనికి సందేహము గలిగినది. గుఱ్ఱములు వచ్చు నిశ్చిత దివసమునకు రెండు దివసము లాతనిని కారాగారబద్ధునిఁ గావించెను. శివ భగవానుఁడు తన శిష్యుని మఱు వక నక్కలగుంపును కూర్చెను. వానిని యశ్వరూపమున మార్చెను. దేవతలను యశ్వరక్షణకై నియోగించి తాను వర్తకుఁడై మదురాపురికిఁ జేరి రాజాస్థానముఁ బ్రవేశించిరి. రాజు వీరిని చూచిన వెంటనే ప్రసన్నవదనుడై మంత్రిని విముక్తుని గావించి, యతనిని క్షమింపుమని వేడుకొనెను. గుఱ్ఱముల నన్నిటిని వదలి యశ్వశాలయందు బంధించిరి. వారందరు వెడలిపోయిరి.

### ౫

ఉదయమైనది. సృగాలముల భయానకారావములచే నగర మందలి జనులు జాగరితులైరి. గుఱ్ఱములు నక్కలైనవి. అశ్వశాలలోని యశ్వముల గరవసాగినవి. రాజీ సంగతి గ్రహించి తనకు వంచన గావించినాడని మంత్రిని పిలువనంపి సూర్యాతపంబున నిలిపి శిరమున భారమగు శిలను మోపెను. మంత్రి శివదేవుని స్తుతిం

చెను. శివభగవానుఁడు తన జటనుండి గంగను వదలెను. గంగాభవాని నగర మంతటిని జలమయముఁగావించెను. రాజున కపుడు శివభక్తునికి యొనరించిన యపకారమునకిది శిక్షయని మంత్రిశిరమునుండి కఠినశిలను దొలగించి యతని నొకపీఠముపై నిలిపెను. నీటి నాపుటకై కట్ట వేయింప మొదలిడెను. రాజు కట్ట వేయించుట పూర్తియైనతోడనే రాజ్యమునంతయు మంత్రికి సమర్పించెను. కాని యంతకు పూర్వమే రాజ్యభోగముల వదలినమంత్రి తిరిగి రాజ్యమునుస్వీకరించి బంధనమునఁబడునా? గురుచరణములనాశ్రయించెను. శివుఁడేతెంచినపని పూర్తియైనది. కైలాసపర్వతమున కేగెను. తమిళప్రాంతమందు భక్తిధర్మముల జనులకు బోధించుటకై ప్రచారార్థము మాణిక్యవాశగరుని నియమించెను. నాటినుండి యీ మహాత్ముఁడు శివగుణగణముల గానమొనరింపుచు గ్రామగ్రామముఁ బరిభ్రమించుచుండెను. దీనిమూలమున వీరి ఖ్యాతి హెచ్చినది. అవసాన కాలమునం దీతడు చిందబరక్షేత్రమున కేతెంచెను. ఇచట ప్రతిదినము శివసాన్నిధ్యమున నృత్యమయ్యెడిది. వ్యాఘ్రపాదమహాత్ము నివాసస్థాన మియ్యదియే. అచట మాణిక్యవాశగరుభక్తుడు ప్రభు సందర్శన మగువరకు పడియుండెను.

## ౬

కొన్ని దినములైన పిదప యొక యాగంతుకు డగు గొప్పవిద్వాంసు డాకస్మికముగ కనపడి సింహళద్వీప విద్వాంసు లగు భిక్షుకుల నోడించెను. ఇతనిముఖమునుండి వెలువడిన దివ్యజ్ఞానప్రబోధముల నీ భక్తుఁడు వ్రాసికొనెను. ఈ పని పరిసమాప్తియైనతోడనే యా విద్వాంసుఁడంతర్ధానుడయ్యెను. ఈ యాగంతుకుఁడు శివుఁడు తప్ప మరెవరు? రెండవదినము ప్రాతఃకాలమున శివాక్షరములతో నొక ప్రతి కాన్పించినది. మందిరములోని భక్తులందఱు పుస్తకమును గొనిపోయిరి. శివమందిరమునందీశ్వరసాన్నిధ్యమువర కేతెంచి 'దీనిభావ మిదియే' యని మాణిక్యవాశగరు లంతర్ధానులైరి. అతని శరీరము మూర్తిరూపమైనది. ఇంతకంటె వారెవరికిని దర్శనమీయలేదు. మాణిక్యుని యొక సుందరవిగ్రహము ఇప్పటికిని దక్షిణమున తిరొచనగోడను ప్రదేశమునం దొక మందిరమున విరాజిల్లుచున్నది.

(ఓం తత్ సత్)



# శ్రీ వీరభద్రాష్టకము

( శ్రీ కీ. శే. కుంకులగుంట బసవకవి విరచితము )

దురితవనకుఠారో దుర్జనాచారదూరో
నిరుపమభుజసారో నిర్జితాశేషసూరః
ధరణిధరవిహారో దక్షయాగప్రహారో
విమలగుణసముద్రో వీరభద్రస్సహాయః ॥ ౧

నరమృగమదభేదో నాగమంజీరపాదో
నిరసితపరవాదో నిశ్చలజ్ఞానమోదః
గురతరగరళాదో గోగణార్ద్రప్రసాదో
విమలగుణసముద్రో వీరభద్రస్సహాయః ॥ ౨

నిగమచయతురంగో నీలమేఘోపమాంగో
నఖశిఖరసుసంగో నవ్యబాహాకురంగః
మృగయురతయుగాంగో మేదినీసచ్చితాంగో
విమలగుణసముద్రో వీరభద్రస్సహాయః ॥ ౩

పరమపదనివేశో భానుకోటిప్రకాశో
వరగగనసుకేశో వాక్పతిప్రీతికోశః
పరిహృతభవపాశో భద్రకాళీసతీశో
విమలగుణసముద్రో వీరభద్రస్సహాయః ॥ ౪

పరిధృతమునిజాలో భవ్యవిజ్ఞానశీలో
కరధృతకరవాలో గానవిద్యావిలోలః
పరితనయనఫాలో భక్తలోకైకజాలో
విమలగుణసముద్రో వీరభద్రస్సహాయః॥ ౫

కుటిలదనుజజైత్రో గుహ్యకాధీశమిత్రో
ఘటితనిగమస్తోత్రో గానవిద్యావిచిత్రః
పటుతరశివగోత్రో భానుచంద్రాగ్నినేత్రో
విమలగుణసముద్రో వీరభద్రస్సహాయః ॥ ౬

దివిషదవనకామో దేవతాసార్వభౌమో
భవనధనవిరామో భాసురోత్తంససోమః
భువనసుతలలామో భోగిభూషాభిరామో
విమలగుణసముద్రో వీరభద్రస్సహాయః ॥ ౭

శ్రీ వీరభద్రాష్టకమేతదగ్ర్యం ప్రత్యూషకాలేషు చ యే పఠంతి
విద్యాస్సమస్తా అపి తే లభంతే పరం మహాదేవపదం ప్రయాంతి.

* సాధ్యమైనంతవరకు సరిచేయబడినవి. ఒకశ్లోకము దొరకలేదు.



# గిరిజా పరిణయము

(4-వ సర్గము)

## విద్యాప్రవీణ శ్రీ బి. వి. వరప్రసాదరాయ శర్మగారు.

ఆ విధి మేలుకో బనిచె నవ్విధి మోహపు నిద్ర నా రతీ
దేవిని, తాల్పరాని ప్రియదీర్ఘ వియోగపు బాధగూర్ప, నం
భావన చేసి చూసె ప్రియు మంజుల మూర్తికి నాల్గువైపులం
దావివశాంగి అంత కనవయ్యె మనోహరు భస్మపుంజముల్.

కని భస్మమ్మును దుఃఖభారమున క్రింగం జాల కబ్జాక్షి; నే
లను బొర్లాడుచు నేడ్చె పెల్లుగ, ప్రశీర్ణమ్ముల్ శిరోజమ్ముల
ల్లన నెమ్మోమును గప్ప ధూసరరుచుల్ కాయమ్ముతాల్పంగ, బా
ధను భూదేవికి నాత్మదుఃఖ సమతాతంద్రత్వ మందించుచున్.

ఈ విధి నీదుమూర్తియగు టెంచియు నీ కఠినాత్మ ముక్కలై
పోవదు, వజ్రఘాతముల ముక్కలుకా రిసుమంత కాంత, లో
జీవితనాథ! పారముల జీల్చియు పద్మము వాయు తోయ మ
ట్లీ విధి నన్ను బాసి ఎటులేగితివో కడు జాలిమాలియున్.

నీకు నప్రియ మొనరింప నేను సుంత, అప్రియ మ్మింతయు న్నాకు నరయ నీవు
అట్టిచో నేమికారణ మ్మాత్మ దలచి, ఈ హతాశను రతి నలయింతు విట్లు.

సురత సమయాపరాధము జ్జరుపునపుడు, నిన్ను మేఖలచేత బంధించి ఉత్ప
లమ్మునం గొట్టి తంచు దలంచి యిపుడు, నాకు దర్శన మీయకున్నావె నాథ !

అనవరతమ్ము నా హృదయ మందు వసింతువు నీవటంచు నీ
వినిచిన వాక్యమెంచుదు నవిశ్వసితమ్ముగ నట్లు కానిచో
ననఘ ! శరీరనాశనము నందుట నీ విటు లీ హతాశ జీ
వీని అగుటెట్లు తెల్పు మనివృత్తవిచిత్రభవచ్చరిత్రమున్.

అన్యలోకసుఖమ్ముల నందుకొనగ, అరుగు నీ తోడ నే గూడ మరలుదాన
ఎల్లసుఖముల కధిపుండ వీవె అగుట, జగములెల్లను బ్రహ్మ వంచనము నేసె.

మేఘగంభీర ఘోషణ మిళితభయద, కాళరాత్రిల పౌరమార్గములయందు
వలపులూరిన అభిసారికలను ప్రియుల, కడకు నెవ్వారు పంపంగ గలుగువారు.

నేత్రయుగ్మమ్మునం దరుణిమ చటూక్తి, తోటుప్రాటును గూర్చు నింతులకు సౌఖ్య
దమ్ము శ్రీవారుణీయాసవమ్ము వమ్ము, గాదె త్వదభావమున నెల్లకాల మింక.

ఓ రతినాథ! నీదు మృదులోజ్జ్వలమూర్తి కథావశిష్టమై
మారుట, నిష్టబంధు డభిమానము మీర సుధాకరుండు సిం
గారము నింపు శుక్లతిథి గ్రాలడు తాను పదారు వెల్గులన్
తేరడు కృష్ణపక్షము గతించిన స్వీయకృశత్వభావమున్

హరితారుణ రోచివిభా, సుర వృంతమున న్వెలుంగుచుం బికనినద
స్ఫురితము సహకారసుమ, మ్మరయుగ నెవ్వరికి బాణమా? ప్రియనాథా!

ఈ ద్విరేఫాళి ధనువు నందీవు, పెక్కు, మారులుగ గూర్చియున్న ప్రేమమున నిష్ఠ
డనుసరించుచు నన్ను, రోదనము సేయు, చున్న రీతిని ధ్వనిసేయుచున్న వెంతొ.

మరల మంజులమూర్తి సౌమ్యతనుగాంచి, ఆనసేయుము నీ యిచ్ఛకైనరీతి
సహజమధుచాటువచన దోషజ్ఞమూర్తి, పరభృతమ్మును రతిదూతిపదమునందు.

శిరసునందున అంజలిసేర్చి వేడు, సాహసోల్లసితము లుపగూహనములు
నీ రహస్సురతమ్ములు నెమ్మినిపుడు, తలపునంబారి చిత్తమెంతయు బొగుల్చు.

త్వద్వినిర్మిత, మధుపుష్పతరళశోభ, లిప్డె నా మేన సొంపుల నీనుచుండె
కుసుమములకన్న మృదువును కోమలమ్ము, కాంతిదం బగు నీరూపె కానబడదు.

చరణమొకదాన లత్తుక బరపునప్పు, డర్థి విబుధులు కోరగా నరిగి, యిట్టు
లైతివో ప్రియనాథ! పూయం గరమ్ము, సవ్యపాదమ్మునందు లాక్షారసమ్ము

కాకయుండిన నగ్నిమార్గమున నిపుడె, నీదు నంకపీఠమ్ముపై నిలుచుదాన
చతురసురకామినీ కటాక్షములు నిన్ను వంచనము సేయుటకుమున్నె ప్రాణనాథ!

ఎట్లొ నీమార్గముం గమియింతుగాని, ఐన ఈనింద నాకు పాయదు, నిజమ్ము
"ప్రాణవిభు బాసి క్షణమాత్రమేని బ్రతికె, రతి" యటంచును జనులు పల్కంగలారు

అన్యలోకదిదృక్షచే నరుగు నీకు, అంత్యమండన మెట్లు చేయంగవలెనొ?
చెలగి కళలీను నెమ్మేను, జీవితమ్ము, నొక్కమారుగ నాశమ్ము నొందుకతన.

శరము నుత్సంగ మందుంచి సాధుగతిని, ఆ వసంతునిమృదుదరహాసములను
బలుకరించుట కడచూపు వెలయ గనుట, తలపునం బారి యెడద నెంతయు గలంచు

కుసుమకార్ముక నిర్మాత అసమబాణు, ప్రాణమిత్రము మధువేడ కరిగెనొక్కొ!
కాక, ఆ తీవ్రకోపియౌ కాలగళుని, ఫాలవహ్నిని నీ గతి బడసినాడొ!

ఇట్టులేడ్వగ రతిదేవి హృదయమెరియ, ఆపెశోకమ్ము తన శోకమంచు దెలిసి
మిత్రభార్యను నూరార్ప మేలటంచు, తత్క్షణంబున మధువు ప్రత్యక్షమయ్యె.

అతనిగని యామెకరము శోకాబ్ధి మునిగె, స్తనములొరయగ నురమును జరచుకొంచు
నాప్తజనముల కన్గొని నపుడు గాదె, వెల్లువై పారు దుఃఖమ్ము విస్తరించి.

హృదయమెరియంగ నేడ్చుచు నింతి మధుని,
బల్కె మధుమూర్తి కనుమోయి ప్రాణమిత్రు
గతి, కపోతవివర్ణంబు గాంచు బూది
చిమ్ముచున్నాడు పవనుండు దుమ్మువోలె.

ఈ మధుమూర్తి నిన్గనగ నెంతయు పాయగరాని వేడ్కతో
ప్రేముడివచ్చినాడు కనిపింపుమ దివ్య శరీరివౌచు, నా
థా! మది నెంచి చూడగ నుదారులకుం దమదారలందునం
బ్రేమలు చంచలమ్ము, లవె మిత్రులయందు స్థిరమ్ము లయ్యెడిన్.

అనుచు న్మన్మథు బిల్చి గద్గదిక, నాథా! లోకము ల్పుష్పమా
ర్గణముం గూర్పుము చాపమం' దనుచు మిత్రాస్యమ్మున న్వాచిక
మ్మును శీఘ్రమ్మున నంపె నీక్షణమ సంపూర్తి న్విలోకింపుమం
చని పూబోడి వసంతు గాంచి ఘనదుఃఖాంభోనిధి న్మగ్నయై.

గాలిచే నార్పబడు దీపకళిక వోలె, నేగె నీదగు ప్రియ మిత్రు డిద్ధచరిత
తద్ఘనవియోగ చితధూమ ధామ మగుచు, నిలచు కొడివోలె నే నిట నిలిచియుంటి.

మదను వధియించి నన్నిట్లు వదలుటెల్ల నగము కుత్తుక కోసెడి సరణికాదె
కుజము గజభగ్నమైనదై కూలిపోవ, పతనమే కాదె సంశ్రిత వల్లరికిని.

అనఘ నా మనవిని ఒండు నాలకింపు, మయ్య మా కీవు ప్రియబంధువైన కతన
అగ్నిదానమ్మొనర్చి నన్ననుగు ప్రియుని, అంతికంబున కనుపుమం చడుగు దాన.

అరయ వెన్నెల చంద్రుతో నరుగుగాదె, మేఘమున వెల్గి దానితో మెరపువోవు
ప్రాణపతితోన వరపతివ్రతయు వోవు, ఈ మహార్థమ్ము జడమేని ఎరుగదొక్కొ!

ఈ ప్రకాశించు ప్రియుభస్మమే ధరించి, అన్యమండన కాంక్షిత మ్మవలద్రోసి
లేజివురు శయ్యలంబలె లీల నిపుడె, అగ్ని దేవుని యందు దేహమ్ము నుంతు.

ఓయి మిత్రమ పల్మారు మా యిరువురం గుసుమశయ్యలగూర్చి సంతసము నింపి
తిప్పు డంజలి నే ఘటియింపుదాన, వేగ జేర్పుమ చితిగూర్చి ప్రియుని జాడ.

దక్షిణానిల తాళవృంతమున పిదప, చితి రగుల్పుము జాగేల చేయుదన్న
నన్ను వీడియు నీ మిత్రుడెన్నడేని, క్షణము నిల్చునె గూర్పు మీా క్షణమె మమ్ము.

ఇదియుకూడ మనస్సులో నెంచుకొమ్ము, జలమునింపిన ఒక్క అంజలినె ఇమ్ము
వేరుకాకుండగా మేము ప్రేమమీార, కలసి త్రాగుదు మూర్ధ్వలోకమ్మునందు.

ప్రేతకర్మావసరముల లేతచివురు, పొత్తులం జూతమంజరు ల్పొన్చి వెట్టు
మతడు చూతాప్తి నడరెడు నతడు గాన, నించు వేడుక నిన్ను మన్నించుకొఱకు.

ఇటుల జీవమ్ము విడనాడ నిచ్చగించు, కాముసతిగూర్చి పల్కె నాకాశవాణి
ఎండిపోయిన మడువులో నిడుము లొందు, చేప నూరార్చు ప్రథమ వృష్టియనఁబోలె.

ఓ రతీసతి ! విను నీ ప్రియుండు మరుడు, తిరిగి బ్రతుకును వేగ సందియము వలదు
మరుడు శివునేత్రవహ్నిలో మ్రగ్గునట్టి, హేతువెద్దియొ! తెలియుమీా యెడదలోన.

మరుని ప్రేరణచేత నాత్మసుతయందె, ఇంద్రియ వికారగతి పరమేష్ఠి యంత
తిరిగి మనసును వశుడౌట తిరుగబట్టి, మరుని శపియించె ఫలిత మిమ్మాడ్కి కాగ.

హరుడు పార్వతి నుద్వాహ మైన యపుడె, నిజ సురూపము నిచ్చి మన్నించు మరుని
విడుగు నుదకమ్ము నీనెడు కడుపు గలుగు, ఘనముపోలు మహాత్ముల మనము తీరు.

కాన నీవును ప్రియురాక మానసమున, గోరి, యీా మేను రక్షించుకోగదమ్మ
ఎండలందున జిక్కలేకుండ పోయి, తొొలకరింపుల నదులు నీళులను గనవె.

అనుచు వచింపు చిట్టుల రయమ్మున నేగగ నభ్రవాణి యా
త్మనిహతిపైన డెందమును తప్పగ దారిచి, యూర్పునర్ వసం
తు ననునయమ్ము వట్టి తరితోడుత, చంద్రుని రేఖగూర్చి గాం
చు నిశిముఖ మ్మటుల్ గడప జూచె రతీసతి దుఃఖకాలముఁ.

(సశేషము)





# నన్నెచోడ దైవజ్ఞ కవికాలము

శ్రీ దేవరపల్లి వెంకట కృష్ణారెడ్డిగారు.

తేంకణాదిత్య బిరుదాంకితుడగు నన్నెచోడదేవ కవిరాజు తన జానుతెనుగు కుమారసంభవకథలో "గూఢవస్తుమయకావ్యము"గా "దైవజ్ఞునట్లే" ప్రబంధరచనా కాలమును, స్వీయచరిత్రను ప్రతిష్ఠించి యున్నాడనుట గ్రంథాంతరంగిక ప్రత్యక్ష ప్రమాణమే కాని— అనుమాన ప్రమాణముకూడా కాదు. ప్రస్తుత మీవిషయ మును దైవజ్ఞగణిత దృష్టితో పరిశోధింతము.

## గూ ఢ కా వ్య ల క్ష ణ ము

'గుఱు తెఱఁగి వస్తుచయమున, గొఱఁగెడు నా దీపవర్తియును బోలె నిజ
మ్మెఱఁగి కృతవస్తు సమితికి, వఱలఁగ మది నెఱుఁగు విబుధవర్గముదలఁతున్.'

అని, తేంకణాదిత్య కవిరాజు తన జానుతెనుగు కావ్యపాఠకులను సంస్తుతించి యున్నాడు. కాని, ఈ పద్యభావము చక్కఁగా బోధపడవలె నన్నచో, మరల నొక సా రి పద్యమును (విధిగా చేర్చుకోవలసిన యధ్యాహారములతో) క్రిందివిధముగా చదువవలెను.

'గుఱు తెఱఁగి (అంధకార) వస్తుచయమున గొఱఁగెడు నా దీపవర్తియును బోలె నిజ
మ్మెఱఁగి కృత (గూఢ) వస్తుసమితికి, వఱలఁగ మది నెఱుఁగు విబుధవర్గముదలతున్.'

అను నధ్యాహారములు చేర్చుకోవలెను.

ఇందలి "దీప" శబ్దస్వారస్యమువల్ల వ్యతిరేకమగు "అంధకారము"ను, "నిజ" శబ్ద స్వారస్యమువల్ల-వ్యతిరేకమగు "అసత్యము (వంచకత్వము)"ను, "కృత" శబ్ద స్వారస్యమువల్ల-"(గూఢ) కృతి"యు వాచ్యముగా స్ఫురించుచున్నవి. "గూఢోక్తి"లో "వంచకత్వము"ను, "నిజమ్ము"ను మిశ్రమముగా నున్నవని మది నెరుగవచ్చును. ఇట్లు కాని పక్షములో, నన్నిచోడకవి తన జానుతెనుగు కావ్యపాఠకులను "...ఆ దీపవర్తియును బోలె నిజమ్ము......వఱలఁగ (ప్రకాశిల్లగా) మదినెఱుఁగు"డని, హెచ్చరించవలసిన యావశ్యకత లేదు. మరియు, నన్నిచోడకవి తన ప్రబంధావ తారికలో జానుతెనుగు కుమారసంభవమే—"అనూన (గూఢ) వస్తువిస్తారితోత్తమ కావ్య" మని వాచ్యముగా వ్యవహరించుకొని యున్నాడు. పరిశీలింపుడు :

"ఇట్లు విశిష్టగుణగణాలంకృతుండనై నెగడు నస్మదీయానూన ప్రతిభార్ణవోదీర్ణ రుచిర వస్తువిస్తారితోత్తమ కావ్యరత్న విభూషణంబు...అశేషజగజ్జన జేగీయమానంబు;" అని, వివరించి యున్నాడు. ఈ గద్యమందలి "అనూన" శబ్దము "ప్రతిభా" పక్షములో "గూఢ" మనియు, "అర్ణవ (సముద్ర)" పక్షములో "అగాథ" మనియు శ్లేషార్థముల నిచ్చుచున్నది. అంటే : ఈ "విశిష్టగుణగణాలంకృత" గద్యములోని "అనూన (గూఢ) ప్రతిభోదీర్ణ రుచిరవస్తువిస్తారితోత్తమ కావ్యవిభూషణంబు (కావ్యాలంకారము)" నకును, "అనూన (అగాథ) అర్ణవోదీర్ణ రుచిరవస్తు విస్తారితోత్తమ రత్నవిభూషణంబు (రత్నాభరణము)" నకును మధ్య భేదము లేదని (రూపకాలంకారముతో) కవి నిరూపించి యున్నాడు. సారాంశ మేమనగా : ఉద్భటకవి ప్రణీతమగు "కుమారసంభవ—గూఢవస్తుమయ కావ్యాలంకారము" నకును, నన్నెచోడకవి ప్రణీతమగు "కుమారసంభవ—గూఢ [అనూన] వస్తువిస్తారిత కావ్యాలంకారము" నకును నామసాదృశ్యము కలదని అంగీకరించవచ్చును. కనుకనే :

'అన్యతారకవితతుల నాదరించి......దివ్యసుకృతిఁ బ్రతిష్ఠింతు (నేను)......'

అని, నన్నిచోడకవి గ్రంథావతారికలో చెప్పుకోగలిగినాడని కనిపెట్టవచ్చును. అంటే "ఇతర గూఢకవి పంక్తుల నాదరించి"యు, "అనాదరించి"యు, [స్వతంత్రించి] దివ్య సుకృతిని ప్రతిష్ఠింతు" అన్నట్లే - నన్నిచోడకవి "ప్రతిష్ఠిం[చి]" నాడని తాత్పర్యము. ఇంతేగాక, నన్నిచోడకవి కథాభాగములో కథాభంగము లేనట్లుగా :

'తారకవిరచిత కృతియుం దారకవిరచిత సుకృతియుఁ దా నడగు......

అనగా—

'గూఢ కవిరచిత(కుమారసంభవ) కృతియును, గూఢకవిరచిత
(గూఢవస్తు) సుకృతియును(తనలో) తానణగు......'

అని, "గూఢవస్తుమయకావ్య" లక్షణమును వివరించి యున్నాడనవచ్చును. మరియు "అన్యతారకవి" వాక్యాన్ని క్రింది విధముగాగూడా అన్వయించుకొనవచ్చును.

"[అన్య] అన్యతారక—వి-తతులఁ—ఆదరిం [తుఁ]" అన్న వాక్యానికి—"అన్యోన్యాశ్రయములగు [గద్యపద్య] విశేషపంక్తులను ఆదరింతుఁ' అని, చెప్పినట్లు భావార్థము నంగీకరింపవచ్చును. అదే "నూత్నరుచిరకావ్యరత్న [తార] వీథి"!

## దైవజ్ఞ గణిత సిద్ధాంతము

తేంకణాదిత్యుని--అయ్యుదయగిరి పాకనాటి గ్రామసంఖ్యలను, ప్రబంధరచనాకాలమగు విక్రమశకవర్ష సంఖ్యలను శాలివాహన శకవర్ష సంఖ్యలను, సహేతుక వర్ష

సంఖ్యాశ్లేషముతో నన్నిచోడకవి "దైవజ్ఞనల్లే" గణితసిద్ధాంతము కావించియున్నా 'డని, క్రింది గీతపద్యశిలాశాసనము చెప్పుచున్నది.

'ద్వాదశార్ధార్ధనయను నా ద్వాదశార్ధ, వదనుఁడొగిచుట్టి నిజభుజద్వాదశమున నుదయ దశశతకిరణుఁడయ్యుదయనగముఁ, గిట్టి దశశతకరములఁ జుట్టినట్లు'

అని, "అఖిలభువనస్వామికుమారుల......ఆలింగన [ము]", కథాభాగములో వర్ణింపబడియున్నది. ఈ గీతపద్యమందలి సంఖ్యలను — గూఢవ్యంగ్య సంఖ్యలుగా ప్రత్యేకించుకొని, వీటితో నన్నిచోడ—దైవజ్ఞనల్లే" మనమును "గణితము" వేసి చూతము. కనుకనే :

'అన్యతారకవితతుల నాదరించి..................................

...దైవజ్ఞనల్ల శుభోదయమున దివ్యసుకృతిఁ బ్రతిష్ఠింతు (నేను)......'

అని, గ్రంథావతారికలో నన్నిచోడకవి చెప్పుకోగలిగినాడు. ఇది నిరర్థకమైన ప్రతిజ్ఞకాదు. పై గీతపద్య సంఖ్యలను గణిత సౌకర్యార్థము పూర్వార్థసంఖ్యలనియు, ఉత్తరార్థసంఖ్యలనియు క్రింది విధముగా లెక్కించుకొనవచ్చును.

## 1. గీతపద్య సంఖ్యా సంకేత పట్టిక

| గీత పద్య పూర్వార్ధసంఖ్యలు | సహజ సంఖ్యలు | గీతపద్యోత్తరార్ధ సంఖ్యలు | సహజ సంఖ్యలు |
|---|---|---|---|
| I. 'ద్వాదశార్ధార్ధ(ము)' | 21 | 1. 'దశశత(ము)' | 1000 |
| | 21 | | 1000 |
| II. 'ద్వాదశార్ధ(ము)' | 18 | II. 'దశశత(ము)' | 1000 |
| 'ద్వాదశము' | 12 | | 1000 |
| | 30 | | |

ఈ పట్టికలో వివరించిన ద్వివిధ పక్షసంఖ్యలతో "దైవజ్ఞనల్లే" క్రమముగా పెంపకము, తీసివేత లెక్కలను వేసి చూచినగాని—నన్నిచోడ కవిహృదయము బోధపడదు.

## 2. గీతపద్య గణిత చమత్కార పట్టిక

| గీతపద్య భాగము | పాకనాటి గ్రామ గణితము | శాలిశక వర్ష గణితము | గీతపద్య సంఖ్యలు |
|---|---|---|---|
| | పెంపకము | తీసివేత | |
| (1) ఉత్తరార్ధభాగము | 1000 | 1000 | + =2000 |
| (2) పూర్వార్ధభాగము | 21 | 30 | + =51 |
| | 21000 | 970 | |

ఈ గీతపద్యములో స్థూలముగా నున్న విక్రమశకవర్ష గణితమును, శాలిశక వర్ష గణితమును మరల సూక్ష్మదృష్టితో నూతన విధముగా పరిశీలించుట ముఖ్యావసరమైన విషయము. ఈ నూతన గణితములో ఒకపర్యాయము లెక్కించిన సంఖ్యలనే మరల లెక్కించవలసియుండును. ఇంతేకాక ఒక పక్షములో వాడుకొన్న సంఖ్యలను మరియొక పక్షములో విడిచిపెట్టవలసియుండును. కాని, ఈ విధముగా లెక్కించుట సహేతుకమైన దని గీతపద్య గణిత శ్లేషమువల్ల గుర్తించవచ్చును. ఇప్పుడిక్కడ మరల గీతపద్య సంఖ్యాసంకేతమును నూతనదృష్టితో లెక్కించుట విధియైయున్నది.

## 3. గీతపద్య సంఖ్యాసంకేతపట్టిక (పక్షాంతరము)

| గీతపద్య పూర్వార్ధ సంఖ్యలు | సంకేత సంఖ్యలు | షరా | గీతపద్యోత్తరార్ధ సంఖ్యలు | సంకేత సంఖ్యలు | షరా |
|---|---|---|---|---|---|
| (1) ద్వాదశార్ధార్ధ(ము) | 3 | విక్రమ శకవర్ష నిర్ణయములో వీటిని లెక్కింపబడు | (1) దశశత (ము) | 1000 | ద్వివిధశకవర్ష నిర్ణయములో దీనిని లెక్కింపుడు. శాలిశక వర్ష నిర్ణయములో దీనిని లెక్కింపకుడు. |
| (2) ద్వాదశార్ధ(ము) | 6 | | (2) దశ(ఉత్తర) శత(ము) | 110 | |
| (3) ద్వాదశము | 12 | | | | |
| | 21 | | | 1110 | |

పై పట్టికలో వివరించిన సంకేతసంఖ్యలతో "నన్నిచోడ-దైవజ్ఞునశ్లే" క్రమముగా మనమును కూడిక, తీసివేత లెక్కలనువేసి చూచినగాని-సత్యము బోధపడదు.

## 4. గీతపద్య చమత్కార గణితపట్టిక (పక్షాంతరము)

| గీతపద్య విభాగము | విక్రమ శకవర్ష గణితము కూడిక | శాలిశకవర్ష గణితము తీసివేత | షరా | ద్వివిధ శకవర్ష శేషము కూడిక | షరా |
|---|---|---|---|---|---|
| (1) ఉత్తరార్ధము | 1000 | 1000 | | | విక్రమశకము ప్రారంభమైన పిమ్మట-'135' వర్షములకు శాలిశకము ప్రారంభమైనట్లు శక వర్ష వ్యత్యాస చరిత్ర చెప్పుచున్నది. |
| | 110 | ... | ... | 110 | |
| (2) పూర్వార్ధము ద్వివిధ | ... | 21 | ... | 21 | |
| | | 979 | | | |
| | | 4 | అధికం | 4 | |
| | 1110 | —975 | = | 135 | |

మనమింతటితో తృప్తి చెందుటకు వీలులేదు. ఇదే, గీతపద్య సంఖ్యలతో "దైవజ్ఞులట్లే" నన్నిచోడకవి సంఖ్యారూపకాలంకారగణిత చమత్కారమును కూడ నిరూపించియున్నాడు. పరిశీలింపుడు :

## 5. గీతపద్య సంఖ్యారూపక సంకేత పట్టిక

| గీతపద్య విభాగము | గీతపద్య సంఖ్యారూపక గణిత సాదృశ్యము | | గీతపద్య సంఖ్యా రూపకము | సంఖ్యారూపక సంకేత సంఖ్యలు |
|---|---|---|---|---|
| (1) పూర్వార్ధము | 21+21+9 = | 51 | "ఏకవింశతి" సంఖ్యారూపక గర్భితము | 21 |
| (2) ఉత్తరార్ధము | 1000+1000 = | 2000 | "దశశత" సంఖ్యా రూపకము | 1000 |

గీతపద్యోత్తరార్ధమందలి "దశశత-దశశత" సంఖ్యలకు రూపకాలంకారము చెప్పినచో, ఇవి 'వెయ్యి' సంఖ్యలు మాత్రమే అగుచున్నవి. అనగా, మరియొక వెయ్యి లోపించుచున్నది. ఇట్లే, గీతపద్య పూర్వార్ధ భాగములో నున్న "ఏబదియొకటి"లో "రెండిరువదియొకట్లు"—"నలుబదిరెండు" సంఖ్యలు పోగా, శేషము "తొమ్మిది" మాత్రమే మిగులుచున్నది. ఐతే, కథానుసార మీ పూర్వార్ధ సంఖ్యలకు—"ఇరువదియొక్కటి" మాత్రమే లభ్యమగుచున్నది. కనుక, గీతపద్య పూర్వార్ధ మందలి సంఖ్యా రూపకాలంకార శేషము "తొమ్మిది"కి ప్రాధాన్యమివ్వ

నక్కరలేదు. అనగా : గీతపద్య పూర్వార్ధ భాగములో సంఖ్యారూపకాలంకార గర్భితమైన "ఇరువదియొక్కటి"ని మాత్రమే గ్రహింపవలెను. గీతపద్య మందలి సంఖ్యారూపకాలంకార సంఖ్యలతో "నన్నిచోడ-దైవజ్ఞునట్లే" మనమును పాకనాటి గ్రామ గణితమును, శాలిశకవర్ష గణితమును వేయవచ్చును.

## 6. సంఖ్యారూపకాలంకార గణిత పట్టిక

| గీతపద్య విభాగము | సంఖ్యారూపక వివరము | పాకనాటి గ్రామ గణితము పెంపకము |
|---|---|---|
| (1) పూర్వార్ధము | (1) 'ఏకవింశతి' ద్వయసంఖ్యా రూపకము | 21 |
| (2) ఉత్తరార్ధము | (2) 'దశశత' ద్వయసంఖ్యా రూపకము | 1000 |
| | | 21000 |

## 7. సంఖ్యారూపకాలంకారగణిత పట్టిక

| గీతపద్య విభాగము | సంఖ్యారూపక వివరము | శాలిశకవర్ష గణితము తీసివేత |
|---|---|---|
| (1) ఉత్తరార్ధము | 'దశశత' ద్వయసంఖ్యారూపకము | 1000 |
| (2) పూర్వార్ధము | 'ఏకవింశతి' ద్వయసంఖ్యారూపకము | 21 |
| | | 979 |

స్థూలదృష్టి కీ గీతపద్య సంఖ్యాగణితములో విరోధము కనుబడినప్పటికినీ, సూక్ష్మదృష్టి కిది మరల విరోధాభాసముగా కూడ కనుబడుచున్న దని మరచి పోరాదు. దీని కిం కొక యుదాహరణము నీయవచ్చును.

'......కాలఁగరువ,

పోలెఁ గాలనేమి.'

'ఇట్లు శతముఖదశశతకర పరిఘశోభితుండై యనేక విధాయుధ వర్షంబులు గురియుచుం దెరలనెత్తి వచ్చుట గని శార్ఙపాణియు వానికిం బ్రతిఘటించి నిలచిన.'

..................................విక్రమధనుండఁ

గాలవశమున నిజబాహు గర్వముడిగి, కాలగోచరుఁడయ్యె నక్కాలనేమి.'

అని కథాఘట్టములో కలదు.

ఇందలి 'కాలనేమి' నామవాచకమునకు- 'కాలచక్రి'మని శ్లేషార్థము చెప్ప వచ్చును. కనుక, దీనిని 'విక్రిమ-కాల' ఘట్టముగా గుర్తించుట దోషము కాదు.

ఈ 'విక్రిమ—కాలచక్రి' గద్యమందలి 'శతముఖ+దశశత-వర్షంబు'లకును, 'అయ్యాదయగిరి' గీతపద్య శిలాశాసనమందలి 'దశ[ఉత్తర] శత+దశశత-వర్షంబు' లకును మధ్య 'దశ' వర్షవ్యత్యాసము మాత్రిమే కలదు. అంటే గద్యములో స్థూల ముగా నున్న 'దశ' వర్షలోపమును పద్యములో సూక్ష్మముగా సవరించబడిన ట్లంగీక రించవచ్చును.

ఇంతెందుకు? గద్యములో స్థూలముగానున్న 'శతముఖ+దశశత-వర్షంబు'లనే మరల సూక్ష్మముగా 'శత (ముఖ)దశ+దశశత-వర్షంబు'లని విభాగించి, లెక్కించిన పక్షమందీ గద్యములో 'దశ' వర్షలోపము లేదని గుర్తించవచ్చును. 'అయ్యాదయ గిరి' గీతపద్య శిలాశాసనమందలి విక్రిమశకము 'దశ+శత+దశశత' వర్ష సంఖ్యా శబ్దాలంకారమునకును విక్రిమకాలచక్రి గద్యమందలి '[దశ] + శత+దశశత' వర్ష సంఖ్యా శబ్దాలంకారమునకును గల తారతమ్యములను గుర్తించి 'దశ' వర్షలోపమును పూరించుకొనవచ్చును. అనగా; గద్యసహజసంఖ్యల కనుగుణ్యముగా పద్యసంఖ్యలకు శ్లేష సహజార్థములు గ్రిహించుట దోషము కాదని సూచితము.ఇంతకును ఈగీతపద్య మందలి శకవర్ష గణితమును 'విస్ఫురత్ జయచైత్రి సంపద'లోనున్న 'విజయ సంవ త్సర, చైత్రిమాస సంపద'యు, 'శతముఖ దశశత-(అనేకవిధ)- వర్షంబులు'ను సూచించుచున్నట్లే—అయ్యాదయగిరి పాకనాటి గ్రామ గణితమును 'పాకనాటియం దిరువదియొక్క వేయిటి కధీశుఁడునాఁ జను చోడబల్లి...తనూజుఁ(డు), నన్నిచోడ తేంకణాదిత్య కవిరాజు' 'దైవజ్ఞునట్లె' సూచించియున్నాఁడని సిద్ధాంతము చేయ వచ్చును.

మరియు, నీ గీతపద్యములో శకవర్ష సంఖ్యాగణితముతో పాటు మిశ్రిమ ముగా నున్న 'తేంకణాదిత్యుని-అయ్యాదయగిరి పాకనాటి శ్లేషచరిత్రి' నిక్కడ సంగ్రి హాముగా నైనను వివరింపక తప్పదు.

'ఉదయ దశశత కిరణుఁ డయ్యాదయనగముఁ, గిట్టి దశశతకరములఁ జుట్టినట్లు'

అను, 'ఉపమాన' వాక్య మీ గీతపద్యములో వర్ణింప బడియున్నది. ఇందులో 'దశశతకిరణు (ఆదిత్యు)ని-అయ్యాదయనగము'నకును, తేంకణాదిత్యు (ఆదిత్యు)ని- 'అయ్యాదయగిరి'కిని శ్లేషార్థమున్నట్లీ గీతపద్యమందలి పాకనాటియం దిరువదియొక్క వేయి గ్రామసంఖ్యాచరిత్రి చెప్పుచున్నది. 'ఉదయ-కిరణుఁ డయ్యాదయనగముఁ

గిట్టి నిజకిరణముల జుట్టినట్లు యువరాజ తేంకణాదిత్యు డయ్యుదయగిరిని ('పాక నాటియం దిరువదియొక్క వేయి' గ్రామములకు రాజధాని యగు నయ్యుదయగిరిని) సమీపించి నిజభుజములతో చుట్టెను (ముట్టడించెను)' అని గీత పద్య శ్లేష చరిత్ర చెప్పుచున్నది. ఇంతే కాక, కథాభాగమందలి 'అభిషేకానంతరం'బను పద్యములో;

'.........రవి.........ఉదయాద్రి, ప్రభుశృంగం బెక్కనట్లు.....'

అను 'ఉపమాన' వాక్యముకూడా కలదు. దీనికి 'తేంకణాదిత్యుడు...ఉదయగిరిప్రభు ప్రభుత్వము నెక్కె'నని శ్లేషార్థము చెప్పవచ్చును. తేంకణాదిత్య నన్నిచోడ కవిరాజునకు 'అయ్యుదయగిరి పాకనాటియం దిరువదియొక్క వేయిటి కధీశు' డను గూఢ బిరుదముండగా—ఇతని కైదవతరము మనుమనికి '...కంద్దుకూరి పురవరేశ్వర...పాకనాంటి విషయ ఏకవింశతి సహస్రగ్రామావనీవల్లభ (కంద్దుకూరి పాకనాటియం దిరువదియొక్క వేయిటి కధీశుడు)...'అను శిలాశాసన బిరుదు కలదు. షుమారు, (150) నూటయేబది ఏండ్ల మధ్యకాలములో నెప్పుడో యొకప్పుడు అయ్యుదయగిరినుండి పాకనాటి చోడరాజధాని—తత్సమీప దేశమగు కందుకూరికి మారిన ట్లూహించవచ్చును.

## స మా ప్తి

'అయ్యుదయగిరి పాకనాటియం దిరువదియొక్క వేయిటి కధీశుడు నాజను తేంకణాదిత్య నన్నిచోడ కవిరాజు' తన పాకనాటి స్వీయసంఖ్యాచరిత్రలో 'దైవజ్ఞ నట్లె శుభోదయమున, (శుభోదయముయొక్క) దివ్యసుకృతిని ప్రతిష్ఠిం (చి)' యున్నాడని గ్రంథాంతరంగిక ప్రత్యక్షోదాహరణ చరిత్ర చెప్పుచున్నది.

'విక్రమశకము (శత+దశశత-లేక—దశ+శత+దశశత) ౧౧౧౦ వర్షంబులకు సరియగు శాలిశకము (970-979 వర్షముల మధ్యకాలమందలి) ౯౭౫ వర్షంబు (క్రీస్తుశకము 1053 సంవత్సరము) లయ్యుదయగిరి గీతపద్య శిలాశాసనములో విజయ ప్రశస్త శాసనలిఖితాక్షరంబులయ్యె' నని అయ్యుదయగిరి పాకనాటియం దిరువదియొక్క వేయిటి కధీశుడు నాజను తేంకణాదిత్య నన్నిచోడ కవిరాజు 'దైవజ్ఞ నట్లు' గణిత సిద్ధాంతము కావించి యున్నాడనుట చారిత్రక కాలము కాకపోదుకద!



# మద్యగర్హణము.

శ్రీ. కె. సాంబసిద్ధయ్యగారు, ఉపాధ్యాయులు.

సీ. బంధుమిత్రుల ప్రేమబాంధవ్యమును త్రెంపు, మాటల నాడగా నోట కంపు
తనువులోపల నుండు దారుఢ్యతను జంపు, ధీరత ధీశక్తి దూర మంపు
ఆలుబిడ్డలకంట నశ్రుధారలు నింపు, పరువు మర్యాద లావలకు నంపు
నలుగురిలో కేగ నగుబాటు దలవంపు, కడు మంచివే రధోగతికి దింపు

తే. గీ. న్యాయపథమును తప్పింపు నార్తి నింపు, కాలు నాస్థానమున కంపు కరుణ జంపు
కలుషముల బెంపు గావింపుఘనతరంపు, నరకమునముంపు మద్యపానముతలంపు

సీ. పిన్నపెద్దలు నిన్ను బ్రీతితో గనబోరు, పలురోగముల నోడ ల్పాడువారు
పాపకార్యాసక్తి పరికింప మితిమీరు, పరమాత్మపై నుండు భక్తి జారు
ఆలుబిడ్డలతోడ నతిఘోరమౌ పోరు, సతతమ్ము స్నేహసంచయము గేరు
కలవిత్త మెల్లను కల్లుకొట్టున జేరు, తాగిన నీ యొడ ల్తారుమారు

తే. గీ. లగును శౌర్యమ్ము దిగజారు నలపు మీరు, మంటిలో జేరు నీదగు మంచిపేరు
జనము నిను దూరు బుద్ధిచంచలత మీరు, వదలుడీమద్యమునుగోరు వాంఛ మీరు.

తే. గీ. శాంతమున కంతరాయి ధీజడిమదాయి, కంపునకు స్థాయి జముపీటి కంపునోయి
కలుషములగోయి విడనాడ గలుగు హాయి, కలను సారాయిగ్రోలగాదలపకోయి.

# తొలిచూపు

శ్రీ విద్వాన్ మేడిపల్లి లక్ష్మీకాంతం గారు

మబ్బులోనుండిపొడిచిన మామయటుల, ముసుఁగు తెరలించి నను గాంచె ముదితయోర్తు
ధూమశకటవాతాయనోత్తుంగ వీథి భ్రమసి నిలిచితి చాన విభ్రమము దోచ.

* * *

మూగబాసల నేమేమొ ముచ్చటించెః గనులు, కన్బొమలు, నొసలు, గళము, చెక్కి-
ళులు, చిరు నగవునుమోవి, లలన యింత పలుకు పలుకదు బంగారు చిలుకవోలె
వలపు నెఱుఁగని వాఁడని తలఁచెనేమొ!

* * *

మనము, సౌందర్యవారాశి మగ్నమయ్యెఁగ్రొత్త, బిడియము, సిగ్గు, నన్నొత్తి పట్టఁ
గాంక్షలూరఁగ నిలిచితి — కలికి నోర్తు పలుకరించెను మాపాలి వలపు తెలియ.

* * *

కడచె ముప్పది నిముసముల్ కన్ను మూసి తెఱచు నంతకు నాయింతి తఱలిపోయె-
నహహా! తొలిచూపు భావ రహస్య ఫణితి పాంథుఁ డెఱుఁగు; నెఱుంగునే పాంథవితతి.

# చాటువులు

## శ్రీ శతావధాని, చల్లా పిచ్చయ్యగారు

### ౧ తగినయిల్లాలు

సీ॥ సుఖపెట్ట మేలి జాజులు గుప్పిచుట్టి చేతంబెట్టు బాగాలు తగినయాలు
శ్రమ మార్పఁ జందనాచల సమాయాత వాతకిశోరముల జాలు తగినయాలు
కాపురమ్మను వేయిగాళ్ళబండిని దారి దలఁగనీయనిగాలు తగినయాలు
గోరముల్గెంట జక్కులజేని చెలికాని మగువ చేకత్తి డాల్ తగినయాలు
గీ॥ సర్వసుక్షేత్రముల ధర్మ జనకమైన బీజమును నాటఁ గంటకావృతులులేక
తనరు నాగేటిచాలు సంతతము దగినయాలు రెండవకే లనువైనయాలు

### ౨ సత్పుత్రుఁడు

సీ॥ గురుభోగ భరపురందర పురారరభిదాత్వరమాణ కుంచికాధార కుర్రి
అభ్రమచ్ఛభ్రాభ్రవిభ్రమాదభ్రి కీర్తిలతానికుంజ ప్రవృద్ధి పాప
గాఢమోహాధ్వాంత కశ్మలాయిత హృదంభోజ సూర్యప్రభాస్ఫూర్తి పట్టి
చక్షుశ్చకోర తృష్ణావార్ధితరణ రాకాసుధాకర బింబఘనత చిఱుత
గీ॥ బహువిధాపాయ విచల దపార ఘోర భారసంక్రాంత సంసారభూరుహోరు
బాహుసంవాహ దక్షిణ బాహు వరయ ముద్దులను మూటగట్టు సత్పుత్రరత్న.

### ౩ గండుకోయిల

ఉ॥ ఎంతయుఁ బంచమశ్రుతిని నింతగఁ గోయని కూయునంత నా
వంతయు నున్నదే ఫల మహా విను చెప్పెద నొక్కమాట పూ
బంతుల దొండపండులను బార్వణచంద్రునిఁ బూజఁజేసి జ
న్మాంతర మందునేని జవరాలయి పుట్టుము గండుఁ గోయిలా

# భావవీథి

## శ్రీ చుక్కాకోటి వీరభద్రమ్మ గారు.

సీ॥ మనములా చపలముల్ తనువులా నాశముల్, ఏలకో యీ యాశ ఎరుకలేక
కలియుగ మాయలో కన్నుమూసుక ముని, గుడ్డి రథంబుపై కోర్కెలూర
జరపెద నా యాత్ర జరుగునో జరుగదో, జరిపించు నాథుండు స్వాంతమందు
నుండెనో లేడొకో యుండిన నా జీవ,యాత్రకై నా కింత యలస మేల!
గీ॥ చేయదలచిన నీసేవ చేయుదాన, చెప్పదలచిన నా మాట చెప్పుదాన
ఫలమునాది యా ఫలదు డీ వగుదు వయ్య! విమలగుణముద్ర పట్టిన వీరభద్ర.



# డా. సి. మీనాక్షిగారి పొరపాటు

"Aministration and Social Life under Pallavas" అను ఆంగ్లభాషా వ్యాసము వ్రాసినందువలన మదరాసు యూనివర్సిటీవారు శ్రీ సి. మీనాక్షిగారికి 'డాక్టర్' బిరుదము నిచ్చినారు. ఆ వ్యాసము ప్రస్తుతము గ్రంథరూపముగను ప్రకటింపబడినది. ఆ గ్రంథముయొక్క "Religion & Religious Institutions" అను ప్రకరణమున వీరశైవ మతమును గూర్చియు, కొలదిగ ముచ్చటింప బడినది. అది యిటులు—

"In the Sixth, Seventh & Eighth Centuries of the Christian era, the Kapalikas, the Kalamukhas and the Pashupatas, the adherents of the Virashaivism, of the Tantric & Shakta form of worship, practised Religious rituals comprising offering of wine and blood to Bhairava and Kali"—Page 180.

(క్రీస్తు ౬,౭, ౮ శతాబ్దములలో వీరశైవమతమునకు జెందినవారును కాపాలిక, కాలాముఖ, పాశుపత, తాంత్రిక, శాక్తమున్నగు సాంప్రదాయికులు దేవార్చన కాలమందు భైరవ కాళి మొదలయిన దేవతలకు మద్యమాంస రక్తములను నివేదన చేసెడువారు.)

ఇది వ్యాసకర్త గారి అభిప్రాయము. ఈ విషయమును వివరముగా దెలియుటకు ప్రాచీన వాఙ్మయ ప్రమాణము లేమియు అట నుదహరింపబడనందున ఏ కారణములవలన ఇట్టి యభిప్రాయము వారికి గలిగినదో ఊహింప నవకాశములేదు. ఈ యొక్క వాక్యములోనే కావలసినంత యసంగతి కనుబడుచున్నది. మతములనుగూర్చి కూడా కొంత వ్రాయవలసి యేదో వ్రాయబడినదికాని దీనికి సంబంధించిన వాఙ్మయమును పరిశీలించి తెలిపిన సంగతులు కావు. కాపాలిక, కాలాముఖ, శాక్తాది మతములను పాశుపత, వీరశైవాది మతములను ఈ వ్యాసకర్తగా రేకమని భావించినటు లున్నారు. కాని యిది పెద్ద పొరపాటు. ఈ మతము లన్నియు వేరు వేరు వ్యక్తులచేత భిన్న భిన్న పరిస్థితులలో స్థాపింపబడి తమ తమ ప్రత్యేకతను దెలుపుచున్నవి. ఈ సంప్రదాయములయొక్క కాళి భైరవాది ఉపాస్య దేవతలు శివునికి సంబంధించిన పరివార దేవతలు కావున నివి యన్నియు ఒకే సంప్రదాయ మనుటకు వీలులేదు. కొన్ని విషయములలో బహిస్సామ్య మున్నంత మాత్రమున "ఏకరాశి"గ జెప్పుటయు, ఆచారములను సైతము పరస్పరముగ నంటగట్టుటయు

జరిగినచో ప్రపంచమున ప్రచారములో నున్న గొప్ప గొప్ప మతములయొక్క వైలక్షణ్యమును, విశిష్టతలను జెప్ప నవసరముండదు. ఇతరములకంటె గొన్ని విలక్షణ తత్త్వములో, ఆచారములో ఉన్నపుడే అది మఱియొక సంప్రదాయముగ గురుతించ వలసియుండగా, ఈ మతముల నన్నిటిని "వీరశైవతుల్యములు"గా జెప్పి ఈ వ్యాసకర్త భ్రమగొల్పు చున్నారు. పైగా కేవల శాఖాహారమున సుప్రసిద్ధులైన వీరశైవ మతస్థులను, మాంసాహారు లగు శాక్తాదులలోనికి ఈడ్చి, మీనాక్షిగారు తమ లోకజ్ఞానమును వెల్లడించినారు. పెద్ద పెద్ద గ్రంథకర్తలుగ పేర్కొనబడుచున్న మహాశయు లందరును నేడు పరిశ్రమించి గ్రంథములను వ్రాయుట లేదు. లేని పోని చెత్తను ఒకచోట గూర్చుట దప్ప ఆయా విషయముల సత్యపరిశీలనలో వారికి బాధ్యత లేనే లేదు. "The Adherents of Veerashaivism" అను మిథ్యావాక్యమును తమ పుస్తకములోనుండి సాధ్యమైనంత త్వరగా డా. మీనాక్షిగారు తుడిచి వేసికొని తమ సత్యప్రియతను వెల్లడింతురుగాక! మదరాసు విశ్వవిద్యాలయమువారు కాని, పండితులుగాని తమ కృతులకు ప్రామాణ్యము రావలె నన్నచో మంది వ్రాతలపై నాధారపడక ప్రత్యక్షానుభవము గల సిద్ధాంతముల ప్రకటించుట కర్తవ్యమని యెరుంగగోరుచున్నాము.—సం.

# శిఖాసంశయ నివారణము

"వీరశైవాచారములను నిస్సందిగ్ధముగ నిరూపింపవలయునన్న సామాన్య గ్రంథావలోకనము గలవారలకు దుస్సాధ్యము... తమబోటి సర్వశాస్త్రసమర్థులు మా యాంధ్ర దేశమున నివసించి సులభమైన శైలిలో ధర్మసిద్ధాంతములను బోధించుచున్నం దులకు మిక్కిలి సంతసము గలుగుచున్నది......వీరశైవులు శిఖ(జుట్టు)ను పెట్టవలె ననియును, అదిలేనిచో శివపూజార్హుడు కా డనియును తాము అనేక ప్రమాణము లతో వైశాఖసంచికలో సిద్ధాంత పరచినారు. తమవంటివారు కూలంకషముగ పరి శీలించి చేసిన సిద్ధాంతము కావున దీని ననుసరించుట సర్వవీరశైవజనుల కర్తవ్య మనుట నిక్కువము. కాని శ్రీ డా॥ రుద్రప్పగారిచే సంగృహీత మగు 'వీరశైవసిద్ధాంత శిరో మణి' అను గ్రంథముయొక్క ౩౦౦ వ పుటలో వీరశైవులు ముండనమే చేయించు కొనవలయు ననియును, కావలసినచో పూర్ణశిఖను (జటను) పెట్టుకొనవలెనుగాని, అర్ధ శిఖ (జుట్టు)ను ధరించకూడ దనియును వ్రాయబడియున్నది. కావున సామాన్యులకు గలుగుచున్న సంశయమును నివారించ గోరుచున్నాము"అని కంచిరేవుపల్లె నుండి శ్రీ శెట్టి పరమయ్యగారు వ్రాసియున్నారు. వీరు గాక ఇంక ఇద్దరు సోదరులును ఈ విషయమున ప్రశ్నించినారు. వారి సంశయ మీ క్రింద నివారింపబడుచున్నది.

సోలాపురము వారదవారి లింగి బ్రాహ్మణ గ్రంథమాలలో ననేక పొత్త ములు చక్కగా ముద్రింపబడినవి. వీరి 'వీరశైవాచార ప్రదీపిక'యను గ్రంథమును హైదరాబాదు నివాసు లగు కై.వా. శ్రీ గుదెపెల్లవారు తెలుఁగు తాత్పర్యముతో ముద్రించునపుడు అందులోని సంస్కృతశ్లోకములను వీరశైవులుగాని పండితుల చేత పరిశోధింప జేసిరి. ఆ పరిశోధకులకు వీరశైవులమీాద మంచి యభిప్రాయము లేక అవైదికముగా నుండుటకై అనేక శ్లోకములను తీసివేసి కొన్ని స్వకల్పిత శ్లోకములను దానిలో దూర్చి వికారముగ నా గ్రంథమును ముద్రింప జేసిరి. దీనిలోనే శిఖ యుండ కూడ దనుటకు గావలసిన శ్లోకములను, ఆగమ శ్లోకములని చెప్పుచు అసత్యమును వ్రాసిరి. నాగరి అక్షరములలో ముద్రించిన ప్రాచీన పుస్తకమును గుదెపెల్లవారి తెలుఁగుపుస్తకమును ప్రత్యక్షముగా జూచినచో నీవిషయము తెలియగలదు. దీనినే ఆధారముగాగొని కొందరు దుర్వాదము చేయుచు 'శిఖాసూత్ర విమర్శ'యను పొత్త మును కన్నడమున వేసిరి. దీనియొక్క సమస్తఅపసిద్ధాంతములను శాస్త్రీయముగ ఖండించుచు "శిఖాసూత్రసిద్ధాంతదర్పణ"అను గ్రంథము ప్రకటింపబడెను. ఈ విష యములను సూక్ష్మముగ డా॥ రుద్రప్పగారు గమనించనందున తమ 'వీరశైవ సిద్ధాంత శిరోమణి'లో ఆ శ్లోకములను పొరపాటువలన సంగ్రహించిరి. శివాగమములలో గాని, వీరశైవుల ఇతర గ్రంథములలోగాని శిఖా సిద్ధాంతమునకు విరోధముగ ఒక్క ప్రమాణమైనను లేదు. అన్ని ప్రాంతములలోను ముద్రితములైన వీరశైవ గ్రంథము లన్నియు మా ఆశ్రమములో కలవు. శిఖ యుండకూడ దని సప్రమాణముగ నిరూ పించువారికి బహుమాన మీయబడును. తెలుఁగు వీరశైవాచారప్రదీపికలోని కల్పిత శ్లోకములనుగూర్చి మరొకమారు విపులముగా చర్చింపబడును. —సం.




వారద సంస్కృత పాఠశాల రిపోర్టు:—ప్రకాశకులు సెక్రిటరీస్, బసవంతి ఎస్.ఎమ్. బి. కె. మాళగే గార్లు శ్రీ మల్లికార్జున దేవాలయము, సోలాపూర్ సిటి. పుటలు ౨౫ వెల లేదు. ఇది మరాఠీ భాషలో కలదు.

ప్రస్తుత మీసంస్థకు అధ్యక్షులైన శ్రీబండెప్ప రఘు జేష్ఠీదరు గారిద్వారా అభిప్రాయార్థము ఈ నివేదిక మా కందినది. బొంబాయి ప్రాంతమునను, వీరశైవ ప్రపంచమునను, విఖ్యాతులైన శ్రీ రావ్ బహద్దుర్ వారద మల్లప్పగారిచే నేటికి ౬౨. సంవత్సరముల క్రితము (1878 లో) సోలాపుర మున స్థాపింపబడి నేటివరకు వందలకొలది వీరశైవ విద్యార్థులకు విద్యాదాన మొనర్చి పేరువడసిన ఈ పాఠశాల పాఠశాల యవతరించిన కొన్ని సంవత్సరములలోనే సంస్థాపకులు అంతరించుట వలన పాఠశాల విపద్గ్రస్తమై యింతవరకు స్వంత భవనము లేక దేవాలయాదులలో తలదాచుకొను చున్న దనుచో విచారము గలుగక మానదు. ఇక మెచ్చుకొన దగిన విషయ మేమనగా ఆ నగరస్థులైన ప్రముఖులే శ్రద్ధతో విద్యార్థు లందరికి తమ గృహములలో నుచిత భోజన వసతుల గావించియు, అధ్యాపకుని వేతనము మున్నగు వ్యయములను చందారూపముగ భరించియు వారద మల్లప్పగారి కీర్తిని ఇంతవరకు పాలించుచు వచ్చినారు. ఐదు వేల రూపాయీలను ఇటీవల ఉజ్జయినీ శ్రీజగద్గురువులవారును అనుగ్రహించినారు. ఇతరుల వాగ్దానములు మున్నగు మొత్తము పదివేల రూపాయీల ఆస్తి ఈ పాఠశాల కున్నట్లు తెలియుచున్నది. కాని అదియును ఒకచోటగాని, ఒకరి నియమములో గాని లేక అస్తవ్యస్తమై యున్నది. శ్రీమల్లప్పగారి పుత్రు లున్నారు. కాని వారి కిటు శ్రద్ధ లేనటు లున్నది. ప్రస్తుతపు అధ్యక్షులు మిక్కిలి యభిమానము గలవారు. కావున, ప్రముఖుల యాదరమును సంపాదించి పాఠశాలాభవన నిర్ణయ ప్రయత్నముల గావింతు రని యాశించుచున్నాము. నివేదికలో వ్రాయబడినటులే పండిత నాల్వారు శ్రీజగదీశశాస్త్రులవారి దీర్ఘమైన యధ్యాపనము ప్రసిద్ధమై, వీరశైవుల కృతజ్ఞకు పాత్ర మైనది. రెండు సంవత్సరముల నివేదికవలన అనేకవిద్యార్థులు పరీక్షోత్తీర్ణులై నట్టును అధ్యయనక్రమము సరిగ జరుగుచున్నట్టును తెలియగలదు. ఈ సంస్థయొక్క సంపూర్ణాభివృద్ధిని కోరనివారుండరు. దీని పుట్టుపూర్వోత్తరములు, కష్టనిష్ఠురము, విద్యాప్రచారము మున్నగు సమస్త విషయములను సవిస్తరముగ సచిత్రముగ నొక పెద్ద పొత్తమున వివరించుట ఆవశ్యక మని తలంచుచున్నాము. శా. శ. ౧౮౬౧ వ సంవత్సరపు నివేదికకూడా సంతృప్తికరముగ నున్నది.

రామాయణసారోద్ధారః (బాలకాండ)ః ఉద్ధారకులు:—శ్రీ ములుకుట్ల నరసింహావధానిగారు, చీరాల గుంటూరు జిల్లా, పుటలు ౬౦౦ రఫ్ కాగితము. క్యాలికో బైండు వెల 2—8—0 ఇది సంస్కృతభాషలో నున్నది.

వాల్మీకి రామాయణమును ముఖ్యముగా నవలంబించి వశిష్ఠ రామాయణ, అధ్యాత్మ రామాయణములు మున్నగు ఇరువదినాల్గు రామాయణములలోని సారమును సంగ్రహించి అవధానిగారీ గ్రంథమును మిక్కిలి పరిశ్రమతో సిద్ధపరచినారు. రామాయణమునుగూర్చియు, రామునిగూర్చియు, పురాణాగమ మతసంప్రదాయములనుగూర్చియు అనేక విషయములు సవిస్తరముగ రెండు వందల పేజీలుగల పెద్ద పీఠికలో సంస్కృతభాషతో వివరించినారు. ఈ బాలకాండలోని శ్లోకములకు సంక్షిప్తమైన సంస్కృతటీకయు కలదు. అచ్చటచ్చట చిత్రములును, సంగృహీతము లగు వానిని

త్రిమాయణ, భారద్వాజ రామాయణ, శివరామాయణాదుల నామములను చెప్పియున్నారు. ఇదియొక అద్భుతమైన ప్రయత్నము. మిక్కిలి పట్టుదలతో విశేషమైన వ్యయముతో ఈ కార్యమును సాధించుచున్న అవధానిగారిని కొనియాడనివా రుండరు. రామభక్తు లీ గ్రంథముల గొని నిరాతంకముగ తోడ్పడవలసియున్నది. ప్రత్యేకముగ తెలుగు తాత్పర్యము గల కాండములు సైతము విడివిడిగా సిద్ధపరచినా రట.

అచ్చుతప్పులు చాలగా నున్నందున ముప్పది పేజీల పరిశోధన పత్రికను చివర జేర్చినారు. ఐనను వారు దిద్దని తప్పులును ఇంక గలవు. ఆ యా రామాయణముల పేర్ల నుదహరించినప్పుడు వాని వాని కాండసర్గ శ్లోకములను సూచించుచుట పరమావశ్యకము. ముఖ్యముగా నీ ౨౮ రామాయణములలో ఎన్ని ముద్రితములు ? ఎక్కడ లభించును ? లేక లిఖిత ప్రతులే లైబ్రరీలలో నున్నవి ? అను అంశములను వీటికలో దెలుపలేదు. పైగా ఇంకను నూర్లకొలది రామాయణములు గ్రంథాలయములలో తమచే చూడబడి నట్లు శ్రీ అవధానిగారు వ్రాసినారు. ఈ విషయము కొంత విపులీకరింపబడవలెను. ఇవి పరిశోధకులకు పరమావశ్యకములు. ఉపోద్ఘాతమందలి 72 వ పుటలో సమస్త శైవ వైష్ణవాగమములను బౌద్ధాగమములతో బాటు వేదబాహ్యరాశిలో జేర్చి తా మసత్య ప్రతిపాదనము చేయబడినది. ఒకవేళ గ్రంథకర్తగారి యభిప్రాయ మింతియ యగుచో నిది గొప్ప పొరపాటు. శైవ వైష్ణవాగమములలో వామము లనియును, సిద్ధాంతము లనియును రెండువిధములు గలవు. వామాచారములుగల భాగములు మాత్రమే తామసములు. తక్కినవిజ్ఞాన సదాచారాది శుద్ధసాత్త్విక ధర్మములను బోధించు సిద్ధాంతాగమములు; కేవల వైదికము లనియే సంప్రదాయాచార్యులు తమతమ భాష్యాదులలో సప్రమాణముగ స్థిరపరచినారు. కావున పునర్ముద్ర ణావసరమున సవరింప గోరుచున్నాము.

---

# కొన్ని సూచనలు

## చందాదారులకు

ఈ క్రింద కనబరచిన నంబరులుగల చందాదారులు గతసంవత్సరములో చెల్లించినచందా ఈ శ్రావణ సంచికతో పూర్తి యయిపోయినది కావున, ఈ సంచిక యందిన ౧౦,౧౨ దినములలో మరల క్రొత్త సంవత్సరమునకై రెండు రూపాయీల ఎనిమిదణాల(2-8-0) చందాను తప్పక రవానింప గోరుచున్నాము. కాగితముల ధర పెరిగినను పత్రిక మరింత అందముగా ప్రకటింపబడుచున్న సంగతి పాఠకులకు దెలియనిది కాదు. చందాదారు లందరును ఒక్కొక్క క్రొత్త చందాదారుని జేర్చినను పత్రిక నింకను అభివృద్ధి పరచుటకు వీలగును. వి. పి. గా దెప్పించుకొనినచో వ్యర్థముగా నాల్గణాలు ఎక్కువగును. అక్కరలేనివారు తెల్పవలెను. చందా పంపని వారికి ముందు భాద్రపద సంచిక వి.పి. గా పంపగలము. స్వీకరింపగలరని నమ్ముచున్నాము.

### బ్రిటిషుప్రాంతము నంబర్లు

739 745 746 747 748 749 750 752 759 763 765 766 767 772 773 777 778 779 784 785 789 790 791 792.

### నిజాంప్రాంతము నంబర్లు

౨౨౪ ౨౫౭ ౨౭౫ ౨౯౭ ౨౮౯ ౨౯౦ ౨౯౧ ౨౯౨ ౨౯౩ ౨౯౪ ౨౯౫ ౨౯౬ ౨౯౭ ౨౯౮ ౨౯౯ ౩౦౦ ౩౦౧ ౩౦౨ ౩౦౩ ౩౦౪ ౩౦౫ ౩౦౬ ౩౧౭ ౩౨౧ ౩౨౨ ౩౨౩ ౩౨౪ ౩౨౫ ౩౨౯.

### సిద్ధాంత శిఖామణి

సుప్రసిద్ధమైన ఈ గ్రంథము పారాయణ యోగ్యముగా నుండునట్లు పాకెటు సైజులో చక్కగా ముద్రింపబడినది. కావలసినవా రందరికిని బుక్పోస్టుగా బంపినారము. కొందరు దాని

బాపతు ఐదు అణాల చొప్పున ఒక్కొక్క ప్రతికి మాకు పంపవలసి యున్నారు. ఇంకొక సంతోష కర మైన వార్త యేమనగా, చెన్నూరు వాస్తవ్యులును, ఉదార చరితులును అయిన శ్రీ రుద్రశెట్టి గుండయ్యగారును, శ్రీ పెద్దశెట్టి వీరన్నగారి మనుమలైన శ్రీశాంతయ్యగారును, సిద్ధాంతశిఖామణి ఆంధ్రానువాదముతో గూడ చక్కగా ముద్రింపించుటకు సంపూర్ణముగా సహాయ మొనర్తు మని వ్రా యిచ్చినారు. త్వరగా పని యారంభము కానున్నది. ఈ గ్రంథరాజము పీఠిక మున్నగు సామగ్రితో రత్నమువలె ప్రకాశించ గలదు. శ్రీగుండయ్యగారి యౌదార్యమును అఖిలవీరశైవలోకము కొనియాడ ననుటలో సందియము లేదు.

## శ్రీకరభాష్యం — ఆంధ్రానువాదము

'విభూతి'లో ప్రకటింపబడుచున్న ఈ భాష్యముయొక్క యుత్కృష్టతను మేము చెప్ప నక్కర లేదు. ఇదిచాల గొప్ప గ్రంథము. ఈ సంచికలో చతుస్సూత్రీభాష్యము సంపూర్ణముగా ముద్రింపబడినది. దీని పీఠిక టైటిలు పేజీ మున్నగునవి ముందు సంచికలో చేర్చబడును. పరమతీయ పండితు లెట్టివారైనను శ్రీకరభాష్యమును జదువుకొని వీరశైవమత విషయమై తమ సంశయముల దీర్చుకొనవచ్చును. ఇట్టి యుద్గ్రంథము 'విభూతి' పాఠకులకు సులభముగా నందింపబడినది. దీ యాంధ్రానువాదము ప్రకటించవలసిన గొప్ప కార్య మింకొకటి కలదు. భాష్యానువాద మప్పుడే ఆరంభింపబడినది. అనేకవిశేషములతో విపులముగా సులభమైన శైలిలో ఇది వ్రాయబడుచున్నది. దాదాపు మూడునూర్ల పుటలతో నీ గ్రంథము ప్రత్యేకముగా వెలువడగలదు. ఇట్టి మహాగ్రంథమునకు సంపూర్ణమైన సహాయము సుప్రసిద్ధులైన హరికథా పితామహులు శ్రీచదువుల బసవశంకరదాసుగారి వలన లభించ నున్నదని తెల్పుటకు మహానందము గలుగుచున్నది. దీనితో శ్రీదాసుగారి కీర్తి చిహ్నము చిరస్థాయి యగుటయేకాక వీరశైవవాఙ్మయమునకు గొప్ప యుపకారము కాగలదు. శ్రీదాసుగారి పుత్రులైన శ్రీ చ. లింగయ్య ప్లీడరుగారును శ్రీ చ. కోటయ్యశాస్త్రిగారును ఈ విషయమై మిక్కిలి యౌదార్యముతో ప్రయత్నము సలుపుచున్నారు. త్వరగా ముద్రణ మారంభింపబడ గలదు.

## వైదిక శివపూజా విధి

ఇది పరమావశ్యకమైన గ్రంథము. దీనియందు శివపూజకు సంబంధించిన సమస్తవిషయములు వేదమంత్రములతో శాస్త్రీయముగ నిరూపింపబడుటయేకాక పారాయణ యోగ్యమగు చక్కని సూక్తములు, స్తోత్రము చేర్చబడినవి. ఈ గ్రంథ ముద్రణమునకు ఏలూరు శ్రీ అవధూత చంద్రశేఖ రయ్యగారును, శ్రీ అవధూత పర్వతాలయ్యగారును సంపూర్ణముగ తోడ్పడ నున్నారు. ఈ గ్రంథ రత్నము ప్రతివీర శైవుని గృహములో ప్రకాశించి సహాయకుల కీర్తిచంద్రికవోలె చిరస్థాయిగా మెరయ గలదు.

## సంక్షిప్త శివపూజావిధి.

ఇందు చాల ఉపయుక్తమైన విషయములు వివరముగా దెలుపబడియున్నవి. లౌకిక కార్య ములలో దగులుకొని యెక్కువ అవకాశము లేనివారి కిది తప్పక కావలసియున్నది. బెజవాడ శ్రీ డా. కంచెర్ల కన్నవీరయ్యగారి సహాయముతో నిది త్వరగా ప్రచురింపబడగలదు. దీనితో చాల సౌకర్యము కలుగగలదు.

ఈ విధముగ మా శివధర్మ గ్రంథమాలలో అనేకగ్రంథములు ప్రకటింపబడ నున్నవి. ఆయా గ్రంథములలో గ్రంథసహాయకుల యొక్క చిత్రపటములు, జీవితములు ప్రచురింపబడగలవు. ఇంకను చాల గ్రంథములను అచ్చు వేయించవలసియున్నది. ఉదారులగు మహాశయులు మతాభివృద్ధికరము లగు నిట్టి పుణ్యకార్యములకు తోడ్పడి ఒక్కొకగ్రంథమును ప్రకటించి స్వమతీయుల చిర కృతజ్ఞతకు పాత్రులు గావలె నని కోరుచున్నాము. వీరశైవ మతమునుగూర్చి లోకమునగల దురభిప్రాయము తొల గంటి విశుద్ధవిజ్ఞానము ప్రచార మగుటకు నీ గ్రంథమాల త్వరగా నొక ఏబది గ్రంథ పుష్పములను ముద్రింపదలచి ఉదారచరితుల నపేక్షించుచున్నది.

౧-౧-౩

మభయకారణత్వాసంభవాచ్చ బ్రహ్మణో వేదాంతవేద్యత్వం నిష్ప్రత్యూహం। "యతో వాచో నివర్తంతే" (తై. ఆ. ౪) ఇత్యాదివాక్యానాం తన్మాహాత్మ్యజ్ఞాపనార్థత్వం వివక్షితం। అన్యథా - "బ్రహ్మవిదాప్నోతి పరం" (తై. ఆ. ౧) ఇత్యాదివాక్యానాం వైయర్థ్యప్రసంగః.

నను—అగ్నేశ్శివస్య మాహాత్మ్యం తామసేషు ప్రకల్ప్యతే।
రాజసేషు చ మాహాత్మ్య మధికం బ్రహ్మణో విదుః॥
సాత్త్వికేషు చ కల్పేషు మాహాత్మ్య మధికం హరేః।
తేష్వేవ యోగసంసిద్ధా గమిష్యంతి పరాం గతిం॥

ఇతి మాత్స్యే శివపురాణానాం తామసత్వప్రతిపాదనాత్, "సత్త్వాత్సంజాయతే జ్ఞానం" ఇత్యారభ్య "బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధిస్సా పార్థ సాత్త్వికీ" ఇత్యంతేన సాత్త్వికబుద్ధేరేవ ముక్తిహేతుత్వదర్శనాత్.

" అగ్నేశ్శివస్య మాహాత్మ్యం తామసం మోహకారకం।
తయోరుపాసనాదేవ ప్రత్యవాయో భవేద్ధ్రువం॥

ఇతి పాంచరాత్రాగమవచనదర్శనాచ్చ శివతత్త్వప్రతిపాదకపురాణానాం తామసత్వం సిద్ధం। అతస్తత్పురాణానామప్రామాణ్యాత్. తత్ప్రతిపాదితస్య పరమేశ్వరస్య వేదాంతవేద్యత్వం కథముపపద్యతే? ఇతిచేన్న।శివపురాణానాం తామసత్వే ప్రత్యక్షికశ్రుత్యభావాత్, కల్పితప్రచ్ఛన్నబౌద్ధవాక్యానాం ప్రామాణ్యాభావాచ్చ। కించ—తమోగుణవిశిష్టదేవతావిషయకత్వేన, తమోగుణవిశిష్టవ్యాసకర్తృకత్వేన, తమోగుణావసరజన్యత్వేన వా శివపురాణానాం తామసత్వం? నాద్యః—ఋగ్వాదిసర్వవేదవేదాంతానా మపి రుద్రాగ్నిప్రతిపాదకత్వేన తేషామపి తామసత్వాపత్త్యా అప్రామాణ్యప్రసక్తిసంభవాత్ బౌద్ధాగమత్వప్రసంగస్స్యాత్ ।న ద్వితీయః—వ్యాసప్రోక్తవిష్ణుపురాణాదీనా మపి తామసత్వం స్యాత్। న తృతీయః—సాత్త్వికేన విష్ణుపురాణకల్పనే తామసేన

శివపురాణకల్పనే చ మానాభావాత్, సర్వవేదవేదాంతసారస్య పురాణరూపేణ వ్యాసేన ప్రపంచితత్వాచ్చ । నను మాత్స్య—

మాత్స్యం కౌర్మం తథా లైంగం శైవం స్కాందం తథైవ చ ।
ఆగ్నేయం చ షడేతాని తామసాని నిబోధ మే ॥
అగ్నేశ్శివస్య మాహాత్మ్యం తామసం మోహకారకం ॥ ఇతి.
యత్ర యత్ర జగన్నాథం ముకుందం విష్ణుమవ్యయం ।
వదంతి తాని శాస్త్రాణి సాత్త్వికాని మతాని వై ॥
యత్ర యత్ర హ్యుమానాథం శంకరం భైరవం యమం ।
దుర్గాం గణపతిం కాలం వదంతి యాని తాని చ ।
తామసాని మునిశ్రేష్ఠ వివిధాని ఫలాని వై ॥
పంచపూజాశ్చ దేవాంశ్చ తథా దేవీం సరస్వతీం ।
వదంతి యాని శాస్త్రాణి రాజసాని మతాని వై ॥

ఇత్యాదిమాత్స్యహారీతపాంచరాత్రాద్యాగమాదివచనేషు పురాణానాం తామసత్వవ్యపదేశాత్ కథం తత్ప్రతిపాద్యస్య మహేశ్వరస్య పరబ్రహ్మత్వం? సంహారస్య రుద్రధర్మత్వేన తామసత్వం తస్య నిష్ప్రత్యూహం ఇతి చేన్న । "అగ్నేశ్శివస్య మాహాత్మ్యం తామసం మోహకారకం" ఇత్యాదివచనానాం మత్స్యపురాణోక్తత్వే మత్స్యపురాణస్య తామసపురాణప్రకరణపఠితత్వేన తద్వాక్యానామప్రామాణ్యాత్ । "బ్రహ్మేంద్ర సూర్య చంద్రాగ్ని ... రాజససంభవాః" ఇత్యాదినా పాంచరాత్రాగమే అగ్నేః రాజసత్వ నిరూపణాత్, మాత్స్యపాంచరాత్రాగమవచనానాం పరస్పరవిరోధ దర్శనాచ్చ ద్వయోరప్యప్రామాణ్యం సిద్ధం.

కించ — బ్రాహ్మణానాం "అగ్నిరగ్రే ప్రథమో దేవతానాం" "యావజ్జీవమగ్నిహోత్రం జుహోతి" "అర్చత ప్రార్చత" "శ్రియ...

ద్రం యజామహే" "అంతరిచ్ఛంతి తం జనే" "రుద్రం పరో మనీష
యా గృభ్ణంతీ జిహ్వయా" "యో వై స్వాం దేవతా మతియజతే"
(తై.సం. ౨-౫-౪) ఇత్యాదినా రుద్రవైశ్వానరోపాసనమేవ కర్తవ్యమితి
చోదనాదర్శనాత్, అకరణే ప్రత్యవాయదర్శనాత్ "త్వం దేవానాం
బ్రాహ్మణానామధిపతిర్విష్ణుః క్షత్రియాణామధిపతిః" ఇత్యాదినా
స్వదేవతోపాసనాతిక్రమణే నరకప్రాప్త్యుపదేశాత్, రుద్రవైశ్వానరో
పాసనాపరిత్యాగే వర్ణచతుష్టయాతీతత్వప్రసంగాచ్చ ఏతత్కల్పితవాక్యా
నాం వేదవిరుద్ధత్వేన వేదవాదిభిస్తాని నాంగీకరణీయాని। "యస్య బ్రహ్మ
చ క్షత్రం చ ఉభే భవత ఓదనః" (కఠ ౧-౨-౨౫) "అత్తా చరా
చరగ్రహణాత్" (బ్ర.సూ.౧-౨-౯) ఇత్యాది శ్రుతిసూత్రేషు సంహారస్య
పరబ్రహ్మధర్మత్వేన నిర్దేశాత్, తదనంగీకారే విష్ణోరబ్రహ్మత్వ ప్రసం
గాచ్చ। "రుద్రో వా ఏష యదగ్నిః తస్య తేతనువౌ ఘోరాఽన్యా శివా
న్యా" 'అఘోరేభ్యోఽథఘోరేభ్యః' ఇత్యాదినా తస్యైవాఘోరముఖేన
సృష్టిస్థితికర్తృత్వస్య ఘోరముఖేన సంహారకర్తృత్వస్య చోపదేశాత్
తస్యైవ జగజ్జన్మాదికారణత్వేన పరబ్రహ్మత్వం సిద్ధం.

కించ — "యా తే రుద్ర శివా తనూ రఘోరాఽపాపకాశినీ
(తై. సం. ౪-౫-౧-౧) ఇత్యాదినా పరమేశ్వరస్య శుద్ధసాత్త్విక శివశరీర
ప్రార్థనాదర్శనాత్, "ప్రపంచోపశమం శాంతం శివమద్వైతం చతు
ర్థం మన్యంతే" (మాండూక్య ౧-౭) "ఉమాసహాయం పరమేశ్వరం
ప్రభుం త్రిలోచనం నీలకంఠం ప్రశాంతం" (కైవ. ౧-౭) ఇత్యాదినా
తస్యైవ పరమశాంతత్వోపదేశాచ్చ కేవలతామసత్వప్రతిపాదక
వాక్యానాం కాలరుద్రపరత్వమేవ। కాలరుద్రస్యాపి శివాంశత్వేన విష్ణో
రధికత్వం వేదశాస్త్రేషు ప్రసిద్ధం। తథా చ శ్రుతిః—

పరాత్పరతరో బ్రహ్మా యత్పరాత్పరతో హరిః। తత్పరాత్ప
రోఽధీశస్తన్మే మనః శివసంకల్పమస్తు॥ ఇతి.

"అజామేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీం" (శ్వే ఉ॥) ఇత్యాదిశ్రుతౌ పరమేశ్వరప్రాకృతశక్తేర్గుణత్రయాత్మకత్వం నిర్దిష్టం। అతస్సత్వగుణావలంబనేన నారాయణస్య బ్రహ్మత్వే అయుక్తత్వప్రసంగాత్ అప్రాకృతబ్రహ్మత్వ విధాయకసర్వవైదిక శాస్త్రభంగప్రసంగః స్యాత్. 'శుక్లధ్యానపరాయణః' ఇతిజాబాలోపనిషది శుక్లశరీరస్య ధ్యానస్యైవ ముముక్షూణాం విధేయత్వేన దర్శనాత్। సూతసంహితాయాం సూతగీతాసు—

అస్తి రుద్రస్య విప్రేంద్రా అంతస్సత్త్వం బహిస్తమః ।
విష్ణోరంతస్తమస్సత్త్వం బహిరస్తి రజోగుణః
అంతర్బహిశ్చ విప్రేంద్రా అస్తి తస్య ప్రజాపతేః
రజసా తమసాఽఽక్రాంతౌ బ్రహ్మనారాయణౌ ఖలు ఇతి

శివధర్మశాస్త్రే—

అంతస్సత్వగుణోపేతో బహిస్తామససంయుతః
శుద్ధసాత్విక ఇత్యుక్తశ్శంకరో లోకశంకరః
అంతస్తామససంయుక్తో బహిస్సత్వగుణాన్వితః
శుద్ధతామస ఇత్యుక్తో విష్ణుస్సాక్షాచ్ఛ్రియఃపతిః.

ఇతి నిర్దేశాత్తస్యైవ బ్రహ్మవిష్ణ్వాదేరప్యధికత్వం। శంకరసంహితాయాం శివరహస్యఖండే—

దశ శైవపురాణాని సాత్త్వికాని విదుర్బుధాః।
శ్రద్ధేయాని ద్విజవరైస్తేషాం ధర్మాస్తు తత్ర యత్.
సత్త్వం శుద్ధం సమాదిష్టం సుఖజ్ఞానాస్పదం తు యత్।
విద్యోపదేష్టా యోగిభ్యః శుద్ధః స్ఫటికసన్నిభః॥
స నిద్రాతి శివశ్చాపి బ్రాహ్మణాధిపతిశ్శివః।
బ్రువంత్యేవం పురాణాని బ్రాహ్మణానాం కథాః శుభాః

దశ శైవపురాణాని హింసాదోషపరాణి చ।
వైష్ణవాని చ చత్వారి తామసాని మునీశ్వరాః॥
క్షత్రియాణాం శ్రుతా ధర్మాస్తేషు తద్దేవతా హరిః।
తమగికృష్ణ ఉదాసీనః కూటకర్మవిశారదః
నిద్రాలస్య ప్రమాదాద్యాస్తద్గుణాః పరికీర్తితాః।
కృష్ణో విష్ణుః స్మృతశ్శేషశాయీ భక్తవిమోహకః॥
బ్రాహ్మే తు రాజసే వైశ్యధర్మాస్సర్వత్ర సంమతే॥
దుఃఖాస్పదం రక్తవర్ణం చంచలం చ రజః స్మృతం॥
గుణత్రియసమాయుక్తమాగ్నేయం సౌరమేవచ।
తస్మాచ్ఛైవాని విప్రాణాం పురాణాని హితానివై॥

ఇతి శివపురాణానామేవ సాత్త్వికత్వోక్తేః।

కించ— శివపురాణానాం కల్పాంతర ప్రసక్తిరితి చేత్ తదసంగతిమేవ। మాత్స్యే—

పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణాకృతం।
అనంతరం తు వక్త్రేభ్యో వేదాస్తస్య వినిర్గతాః ॥
పురాణమేకమేవాసీచ్ఛతకోటి ప్రవిస్తరం॥

ఇత్యాదినా బ్రహ్మకృత బ్రహ్మపురాణమేవ ద్వాపరాంతే వేదవ్యాసేన సంక్షోచ్య చతుర్లక్షాత్మనా సంక్షేపితమితి ప్రతిపాదనాత్. ధర్మసంహితాయాం—

బ్రాహ్మమేవ కృతేచాద్యే పురాణం శ్రుతిసంమతం
అష్టాదశవిధం తస్య కృతం కోటిప్రభేదతః ॥

ఇతి దర్శనాచ్చ। అత ఏవ శైవపురాణానాం కల్పాంతర విషయత్వమిత్యసంగతం।

నను నారాయణస్యైవ మత్స్యకూర్మవరాహాదిరూపేణ సకలభూ-
భారనివర్తకత్వదర్శనాత్పరమసాత్త్వికత్వం తస్యైవోపపన్నమితి చే-
న్నైవం—

ఏకాదశ్యాం తు మధ్యాహ్నే మాఘమాసే మహేశ్వరః
సర్వలోకహితార్థాయ విషం భుక్త్వా తతః శివః
శివయోగేన తద్రాత్రౌ స్థిత్వా చంద్రకలాధరః ।
పరివేష్టిత విష్ణ్వాదీన్ దృష్ట్వా తత్పాదసేవకాన్ ॥
ఉపోషితమహాభక్తాన్ ద్వాదశ్యాం నీలలోహితః ।
సముద్రమథనోద్భూత సుధాపానార్థమాదరాత్ ॥
ఆజ్ఞాం చక్రే మహాదేవస్సర్వలోకభయావహః ॥

ఇత్యాదినా పరమేశ్వరస్య అనన్యసాధారణకాలకూటభక్షణాం-
ధకాసురజలంధరాసురత్రిపురాసుర వ్యాఘ్రాసురగజాసురశూరపద్మా-
సురాదిమహాదానవసంహారపూర్వక భూభారనివర్తకత్వదర్శనాత్ తస్య
ఏవ పురాణాగమేషు శైవవైష్ణవానామేకాదశీవ్రతావశ్యకత్వం దృశ్యతే
తదుక్తం శివధర్మశాస్త్రే—

శైవవైష్ణవయోర్గ్రాహ్యమేకాదశ్యాముపోషణం ।
నందీశవిష్ణుప్రముఖా యతో వ్రతమథాచరన్ ॥
శేషం ప్రధానం స్మార్తానామేకాదశ్యాముపోషణం
సాయం ప్రధానం శైవానాం వేదమార్గైకవర్తినాం ॥ ఇతి.

తథా సిద్ధాంతాగమే—

ప్రదోషవ్యాపినీ శైవీ సమ్యగేకాదశీ స్మృతా
నాన్యా శైవైః పరిగ్రాహ్యా శైవశాస్త్రైకశాసనాత్ ॥ ఇతి

వీరాగమే చ—

సర్వేషాం వీరశైవానాం శ్రౌతస్మార్తానువర్తినాం
ప్రదోషవ్యాపినీ గ్రాహ్యా సమ్యగేకాదశీ శివే॥
శైవవ్రతానాం సర్వేషాం సాయం ప్రాధాన్యమేవ హి
అన్యథాచరణే దేవి ప్రత్యవాయో మహాన్ భవేత్॥ ఇతి.

కించ పద్మపురాణాదీనాం విష్ణుప్రధానత్వేపి తత్రాపి శివమాహాత్మ్యకథనాత్తేషామపి తామసత్వం కిం న స్యాత్ "త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున'' ఇతి గీతావాక్యేన వేదానామపి త్రిగుణాత్మకత్వదర్శనాన్మూర్తిత్రయప్రతిపాదకశ్రుతీనాం గుణత్రయాత్మకత్వముపపన్నమితి చేన్న। "వాచా విరూపనిత్యయా" ఇతి శ్రుతిదర్శనాన్నిత్యరూపస్య వేదస్య గుణత్రయాత్మకత్వమయుక్తం శ్రౌతవిధేయత్వాత్। "శివం ప్రశాంతమమృతం బ్రహ్మయోనిం" (కైవల్య) ఇత్యాదినా శివస్య వేదేషు పరమసాత్త్వికత్వోపదేశాత్। వేదానాం గుణత్రయాత్మకత్వకథనమధికారిభేదేన స్థూలసూక్ష్మకారణాత్మకబ్రహ్మోపాసనాపరత్వేన సాంఖ్యయోగశాస్త్రేషు వివక్షితత్వాదర్థో న యుక్తః.

కించ - కిమిదం తామసత్వం, తమోగుణజన్యత్వం? స్వేతరగుణాసంసృష్టతమోగుణజన్యత్వం వా? ఇతరానభిభూతతమోగుణజన్యత్వం? తమోగుణజన్యత్వవిశిష్టత్వం? తమోవిశిష్టకర్తృకత్వం? తమోగుణవిశిష్టప్రతిపాద్యకత్వం తమోగుణప్రధానప్రతిపాదకత్వం? అన్యద్వా? నాద్యః- గుణత్రయాతీతపరమేశ్వరనిశ్వసితరూపాణాం వేదానాం అనిత్యత్వమోహకత్వపౌరుషేయత్వాదిప్రసంగాత్. సర్వచిదచిత్ప్రపంచస్య గుణత్రయాత్మకప్రధానజన్యత్వేన విష్ణుపురాణాదీనామపి తామసత్వప్రసంగాత్ । న చ తమోమాత్రజన్యత్వం, ఏకస్య అనారంభకత్వేనా... । న ద్వితీయః— సర్వస్య గుణస్య గుణాంతర యుక్తస్యైవ ...త్వేన ఇతరాసంసృష్టతమోగుణజన్యత్వస్యాప్రసిద్ధత్వాత్ । న

తృతీయః— "యదా తమస్తన్న దివా నరాత్రిర్నసన్నచాసచ్ఛివ ఏవ కేవలః" (శ్వే.౪-౧౮) ఇత్యాదిశ్రుతిసిద్ధస్య శివస్య నిత్యశుద్ధత్వేన ప్ర... రసిద్ధేః । న చతుర్థః—

అష్టాదశపురాణానాం కర్తా సత్యవతీసుతః ।
ఆఖ్యానైశ్చాప్యుపాఖ్యానైర్గాథాభిః కల్పశుద్ధిభిః॥
పురాణసంహితాం చక్రే పురాణార్థవిశారదః ।

ఇతి విష్ణుపురాణవచనాద్వ్యాసకృతానాం సర్వేషాం పురాణానామపి తామసత్వాభావాత్, అన్యథా త్వదభిమతానామపి తా... సత్వప్రసంగాత్, తుల్యన్యాయత్వాచ్చ । న పంచమః- రుద్రస్య సం... రకర్తృత్వేన సంహారస్య తమోగుణకార్యత్వేన సర్వశాస్త్ర ప్రసిద్ధ... దితి చేన్నైవం । విష్ణోః సంహారకత్వాభావేనానీశ్వరత్వప్రసంగా... "యా తే రుద్ర శివా తనూః" (తై. సం. ౪-౫-౧-౧) ఇతి శ్రు... శివశరీరస్య తామసత్వనిషేధాచ్చ । "త్రైగుణ్యవిషయా వేదాః" (గీ... ౨-౪౫) ఇత్యనేన త్రిగుణాత్మకప్రవృత్తిధర్మప్రతిపాదకత్వేన ... వైశిష్ట్యం న యుక్తం ।

నను —"తమోగుణప్రచురేషు కల్పేషు తద్వైశిష్ట్యేన ... కృతపురాణాని తామసాని, తత్ప్రతిపాద్యత్వాచ్ఛివస్యాపి తామస... ఇతిచేన్న। తామసేషు కల్పేషు చతుర్ముఖకృతానాం పురాణానాం వర్తమానే శ్వేతవరాహకల్పే అనువర్తమానత్వే ప్రమాణాభావా... అస్మిన్నపి కల్పే అష్టావింశతితమేన వ్యాసేన ఇదానీం ... కరణస్య శ్రూయమాణత్వాచ్చ । తదుక్తం విష్ణుపురాణే—

వైవస్వతాంతరే తస్మిన్ ద్వాపరేషు పునఃపునః। వేదవ్యాసః తీర్ణోఽభూదష్టావింశతిసత్తమః॥ ఇతి. వర్తమానస్య పరాశరాత్మజ వ్యాసస్యప్రవర్తమాన సర్వపురాణకర్తృత్వం చ తత్రైవ "పురాణసంహితాం చక్రే పురాణార్థవిశారదః" ఇతి।

తాన్యష్టాదశపురాణాని తత్రైవగమయిత్వా ఉత్పత్తిక్రమాపేక్షయా క్రమ ఉక్తః — "ఏతద్వైష్ణవసంజ్ఞం వై పాద్మస్య సమనంతరం" ఇతి ఏవం సమస్తా అపి వర్తమానకల్పస్థా రామకృష్ణాద్యవతారా రఘువంశాదిసంభవత్వాత్, దక్షాధ్వరధ్వంసాదీనామేతత్కల్పమధ్యస్థత్వాత్ ఏతత్కల్పస్థశైవవైష్ణవప్రతిపాదకానామేతత్కల్పజాతేనాష్టావింశతితమేన వేదవ్యాసేన కృతానాం పురాణానాం పరస్పరం బలాబలచింతాయాం బహుకాలవ్యవహితానాం తామసాది బ్రహ్మకల్పనోపన్యాసో నిరర్థకః।

నను— "పురాణకారాణాం పురాణకర్తృత్వం బ్రహ్మణస్సకాశాత్పురుషార్థానధిగమ్యైవ" ఇత్యుక్తం సత్యం। తత్రాతీతకల్పస్థాః పురాణార్థా బ్రహ్మణా పురాణకారైశ్చ తత్రైవ ప్రతిపాద్యంతే యథా పద్మకల్పే మార్కండేయస్య పరమేశ్వరానుగ్రహః యే తు వర్తమానకల్పస్థాః పురాణార్థా రామకృష్ణవరాహావతార ప్రభృతయః తథాకాలకూటభక్షణదక్షాధ్వరధ్వంసాదయః తేఽపి ఏతత్కల్పస్థత్వేనైవ బ్రహ్మణోపదిశ్యంతే; పురాణకారైరపి తత్రైవ ప్రతిపాద్యంతే। తేషాం పరస్పరవిరోధే స్వాభిమతపురాణాధిక్యనిర్ణయహేతుత్వం నిరస్తం। బహుకాలవ్యవహితానామతీతకల్పానాం సాత్త్వికతామసత్వాద్యుపన్యాసః కుత్ర కేన సంగత ఇతి న జానీమః। నాపి షష్ఠః—రుద్రసంబంధినో ఘోరశరీరస్య సంహారకత్వేన తమోవిశిష్టత్వేఽపి తచ్ఛరీరిణః పరమేశ్వరస్య తమోఽతీతత్వాత్। తథాచ కైవల్యే—

"ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం త్రిలోచనం నీలకంఠం ప్రశాంతం। ధ్యాత్వా మునిర్గచ్ఛతి భూతయోనిం సమస్తసాక్షిం తమసః పరసాత్॥ (కై. ౧-౭) ఇతి.

యద్యపి దేవదత్తాదౌ తమోగుణప్రధాన శరీరాది విశిష్టే తామసత్వవ్యవహారో దృష్టః। తథాపి తత్ర తన్మాత్ర విశిష్టత్వేన

శాత్ । ద్వితీయాధికరణే—బ్రహ్మణస్సవిశేషత్వం, జగద్బ్ర
సృష్టిస్థిత్యవసరే భిన్నత్వం, లయావసరే నదీసముద్రవదభిన్నత్వం
పితం । తృతీయాధికరణే — పరమేశ్వరావిర్భూతభేదాభేదబో
వేదాంతాగమశాస్త్రమేవ బ్రహ్మసత్త్వే ప్రమాణమితి దర్శితం।

"ఇతి తృతీయం శాస్త్రయోనిత్వాధికరణం".



# సమన్వయాధికరణం ॥౪॥



షట్థ్సలపరశివబ్రహ్మవిషయభూత వేద వేదాంతానామింద్రోపేంద్ర చంద్రాదినానా దేవతాప్రతిపాదకత్వేన సర్వదా న పరశివైకపరత్వ మితి శంకాయాం తదతివ్యాప్తినివారణాయ సర్వస్య తత్రైవ సింధు ప్రవాహన్యాయేన సమన్వయాదవ్యభిచార ఇతి చతుర్థాధికరణ మారభ్యతే—

## తత్తు సమన్వయాత్

తచ్ఛబ్దేన—సర్వాధిష్ఠానం సర్వకారణం వేదాంతవేద్యం పూర్వ నిర్దిష్టం షట్థ్సలపరశివబ్రహ్మైవ వ్యపదిశ్యతే। తు శబ్దేన ప్రత్యక్షాది ప్రమాణాంతరం నిరస్యతే। సమన్వయశబ్దేన తదంతర్భూతచంద్రో పేంద్రదినేంద్రాది ప్రతిపాదకవాక్యానాం స్థూలారుంధతీన్యాయేన ఉపక్రమోపసంహారాదిషడ్విధతాత్పర్యలింగైః తత్రైవ తాత్పర్యముప దిశ్యతే। తద్బ్రహ్మప్రత్యక్షాదిప్రమాణాంతరనిరాకరణపూర్వకం సర్వ వేదాంతైః షడ్విధతాత్పర్యలింగోపేతైః ప్రతిపాద్యత ఇతి సూత్రార్థః।

అత్ర సర్వవేదవేదాంతాగమవాక్యాన్యస్య విషయః—"సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయం" (ఛాం: ౬-౨-౧) "ఏకో హి రుద్రో నద్వితీయాయతస్థుః" (శ్వేతా.3-౨) "అసంఖ్యాతాస్సహస్రాణి, స్మర్యతే న చ దృశ్యతే" (తై. ఆర.౧-౧౨) "దేవా హ వై స్వర్గం లోకమగమన్, తే దేవా రుద్రమపృచ్ఛన్ కో భవానితి, సోఽబ్రవీత్ అహమేకః ప్రథమమాసం వర్తామి చ భవిష్యామి చ నాన్యః కశ్చిన్మత్తో వ్యతిరిక్త ఇతి సోఽంతరాదంతరం ప్రావిశత్" (అథర్వశిరః౧) "ఋతం సత్యం పరం బ్రహ్మ పురుషం కృష్ణపింగళం ఊర్ధ్వరేతం

విరూపాక్షం విశ్వరూపాయ వై నమః" (మహానా అను-౧౩) "సర్వే వేదా యత్పదమామనన్తి" (కఠ. ౧-౨-౧౫) ఇతి.

భేదాభేద విధాయక సర్వవేదాంత వాక్యానాం సర్వజగదుత్పత్తి కారణ షట్స్థల పరశివబ్రహ్మపరత్వం కర్మశేషభూతేంద్రోపేంద్రాది నానా దేవతోపాసనపరత్వం వా? తదుపాదానభూతప్రధానాదిప్రతి పాదకత్వం వా? ఇతి బహుధా సందిహ్యతే.

పూర్వపక్షస్తు న సర్వథా బ్రహ్మణః పరశివస్య సర్వవేదాంత ప్రతిపాద్యత్వం సంభవతి, తేషాం విధిపరత్వాత్ । ఉభయపరత్వే వాక్యభేదాపత్తిః జగద్బ్రహ్మణోః కార్యకారణత్వదర్శనాదనుమానేన బ్రహ్మసిద్ధిరుపపద్యతే. తస్మాన్న వేదాంతైకప్రతిపాద్యత్వం.

కించ– నానాదేవతోపాసనాపరత్వమపి యుక్తం । "అగ్నిర్వై ప్రథమో దేవతానాం" "అసావాదిత్యో బ్రహ్మ" "నారాయణః పరం బ్రహ్మ" ఇత్యాదిశ్రుతిదర్శనాత్ । అపిచ–"సైషా విచిత్రా సుదృఢా బహ్వంకురా స్వయం గుణభిన్నా అంకురేష్వపి గుణభిన్నా సర్వగా బ్రహ్మవిష్ణుశివరూపిణీ" "అజామేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీః ప్రజాం జనయంతీం సరూపాం" (శ్వే. ౪-౫) ఇత్యాదినా సర్వదేవతా మయత్వస్య సర్వకారణత్వస్య చ ప్రధానస్యైవ నిర్దేశాత్తత్పరత్వమపి యుక్తం.

కించ–"అయంఘటః, అయం పటః" ఇత్యాదిలోకవ్యవహార పరంపరావృద్ధవ్యవహారజ్ఞానసాపేక్షత్వాత్ నిరస్తసమస్తోపద్రవసర్వ లాధారసిద్ధబ్రహ్మపరత్వే నిష్ప్రయోజనత్వసాపేక్షత్వయోః ప్రస త్తదుభయదోషవారణాయ వేదాంతానాం విధ్యుపాసనపరత్వం సి యతే । అథవా కర్తృదేవతాప్రతిపాదనద్వారా కర్మపరత్వం సిద్ధ ఇతి ప్రాప్తే బ్రూమః —

(రాద్ధాంతస్తు) వేదాంతానాం బ్రహ్మపరత్వం బ్రహ్మధ్యాన విధిపరత్వం చోపపద్యతే । అతో న వాక్యభేదదోషప్రసంగః. తదుభయవిధేర్దర్శనాత్ । తథా హి —ఉపక్రమాదిషడ్విధతాత్పర్యలింగేన బ్రహ్మపరత్వం । "ఆత్మా వా అరే ద్రష్టవ్యః" (బృహ. ౨-౪-౫) ఇత్యాదిషు తద్ధ్యానవిధిపరత్వం చ దృశ్యతే.

ఉపక్రమోపసంహారావభ్యాసోఽపూర్వతా ఫలం
అర్థవాదోపపత్తీ చ లింగం తాత్పర్యనిర్ణయే॥

ఇతి స్మృతావుపక్రమోపసంహారాదిభిర్వేదాంతతాత్పర్యనిర్ణయ శ్రవణమిత్యభిధీయతే.

అజ్ఞానప్రభవం దుఃఖం జ్ఞానం తస్యనివర్తకం ।
సర్వవేదాంతవాక్యానాం శ్రవణం తత్రప్రవర్తకం॥
శ్రవణం నామ వాక్యానాం వైదికానాం పరాత్పరే
ఉపక్రమాదిభిర్లింగైః కృతస్తాత్పర్యనిర్ణయః॥

ఇత్యుపక్రమోపసంహారావేకం లింగం । "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్" (ఛాం. ౬-౨-౧) ఇత్యుపక్రమః । "సయ ఏషోఽణిమైతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో" (ఛాం. ౬-౯-౪) ఇత్యుపసంహారః । పునః "తత్త్వమసి" ఇత్యభ్యాసః । "తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి" (బృ. 3-౯-౨౬) ఇతి మానాంతరాగమ్యత్వేనాపూర్వత్వం। "యేనాశ్రుతం శ్రుతం భవతి" (ఛాం. ౬-౧-3) ఇత్యాదినా ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానం ఫలం। "సేయం దేవతైక్షత హంతాహమిమాస్తిస్రో దేవతా అనేన జీవేనాత్మనాఽనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణీతి" (ఛాం ౬-3-౨) ఇత్యాది సృష్టిస్థితిసంహారతిరోధానానుగ్రహాది పంచకృత్యాన్యర్థవాదాః । "యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వం మృన్మయం విజ్ఞాతం స్యాత్" (ఛాం. ౬-౧-౪) ఇతి మృదాది దృష్టాంతా

ఉపపత్తయః। ఏవమన్యత్రాపి నారాయణీయే — "అణోరణీయాన్
మహతో మహీయాన్" (మహానా. అను. ౧౦) ఇత్యుపక్రమః
"సర్వో హ్యేష రుద్రః" (మహానా. అను ౧౬) ఇత్యుపసంహారః
"యః పరస్స మహేశ్వరః" (మహానా. అను ౧౦) "అంబికాపతయే
ఉమాపతయే పశుపతయే నమో నమః" (మహానా. అను ౧౮) ఇత్య
ద్యభ్యాసః। "విశ్వాధికో రుద్రో మహర్షిః" (మహానా. అను ౧౦)
ఇత్యాదౌ విశ్వాధికత్వాదేర్మానాంతరాప్రాప్తత్వాదపూర్వతా।
"పరామృతాత్పరిముచ్యంతి సర్వే" (మహానా. అను ౧౦) ఇతి ఫలం।
"సహస్రశీర్షం" (మహానా. అను ౧౧) ఇత్యర్థవాదః। "యస్మాత్పరం
నాపరమస్తి కించిత్" (మహానా. అను ౧౦) ఇత్యుపపత్తిః। ఏవం సర్వ
వేదాంతేషు ద్రష్టవ్యం। తస్మాత్ స్వరూపవ్యావర్తకతటస్థల
క్షణేన సర్వవేదాంతానాం బ్రహ్మప్రతిపాదకత్వం యుక్తం। ప్ర
ప్రత్యక్షకారణస్య నేత్రస్య ద్రవ్యసిద్ధివత్, విధిపరత్వేన వేదాంతా
సర్వాధిష్ఠానపరశివబ్రహ్మసిద్ధిః। తస్మాన్నోభయపరత్వవిరోధః। "నైషా
తర్కేణ మతిరాపనేయా" (కఠ ౧-౨-౯) ఇతి శ్రుత్యాఽనుమా
మాణస్య నిరస్తత్వాత్, అనుమానేన కర్తృకత్వసిద్ధ్యభావాచ్చ
ప్రామాణ్యేనానుమానం విధీయతే.

"విశ్వం భూతం భువనం చిత్రం బహుధాజాతం జాయ
మానం చ యత్। సర్వో హ్యేష రుద్రస్తస్మై రుద్రాయ నమో
అస్తు" (మహానా. అను. ౧౬) ఇత్యాదినా సర్వజగదుపాదానకారణ
జ్జగన్మయత్వం। "ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం" ఇత్యా
"సఏవవిష్ణుస్సప్రాణస్సకాలోఽగ్నిస్సచంద్రమాః స ఏవ సర్వం
యద్భూతం యచ్చ భవ్యం సనాతనం। జ్ఞాత్వా తం మృత్యుమత్యేతి
నాన్యః పంథా విముక్తయే॥" (కై. ౧-౯) ఇత్యాం తేన పరశివస్య బ్ర
సర్వదేవతామయత్వముక్త్వా తదుపాసనస్యైవ మోక్షహేతుత్వో

ఓం



శ్రీగిరిరాజ సూర్యసింహాసనాధీశ్వర
శ్రీ జగద్గురు వాగీశపండితారాధ్య మహాస్వాములవారి పట్టాభిషేకము.

**CORONATION OF Sri Giriraja Suryasimhasanadheeswara**
**Sri Jagadguru Vageesa Panditaradhya Mahaswamulu.**




స చి త్రి మా స ప త్రి క

పుంద్రము ౨ | శా. శ. ౧౮౬౨ విక్రమ సంవత్సర భాద్రపదమాసము | రేఖ ౭
Vol. 2 | 22 సెప్టెంబరు 1940 సికింద్రాబాద్ | No. 7


# ఆ కాంక్ష


శ్రీ విద్యాప్రవీణ బొద్దనపల్లి వీరభద్ర వరప్రసాదరాయశర్మగారు


ఈ పువుదోటలందున సుమేషుమనోహర భావగీతికా
లాపన షట్పదశ్రుతి కలస్వనమందున మేళవించి పు
ష్పాపచయ మ్మొనర్చు జవరాండ్రి నిగారవు సోగముంగురుల్
రేపెడి వాయుబాలకుని లీలల గాంచి సుఖించిపోదునా. ౧

పోసిన పండువెన్నెలల పోల్కి రహించెడి స్వచ్ఛకాంతి బా
భాసితముల్ పరీమళము పైకొన జల్లెడి క్రొత్తయందపుఁ
రాసులు వింతపూవుల నలరారు ఒయారి వసంతలక్ష్మినై
మోసులుగొన్న యీ ప్రణయము న్మనసారగ దీర్చుకొందునా! ౨

నెరసుల్ లేని సుకోమలంపు కవితం దేశాల ప్రాకించి, ఎ
ల్లరు 'శౌసా'నని మెచ్చుకోల్పడయ స్వారస్యమ్ము చిందించు, సుం
దర శృంగారపు నైజవర్ణనల నానందమ్మునం దేల్చి, యీ
పరిపూర్ణాఖిల శబ్దశాసన కవిబ్రహ్మమ్ము నైపోదునా! 3

చలదశ్వేభ రథపరికీర్ణక చమూసాహాయ్య మ్మహాక్షౌహిణీ
సలదాకాశ తరంగిణీమణి జయాంక స్తంభము ల్పాతి; ని
ఖిలబాహాబలపీఠి సర్వధరణీ చక్రంబు శాసించు భూ
తలదేవేంద్రుఁడనై ఇహాముష్మ చరితార్థత్వమ్ము నొందింతునా! ౪

పరదేశాధిప దాస్యపు న్నిగళ దార్భాగ్యాప్తి దారిద్ర్య దు
ర్భరమై స్వీయ సువర్ణరోచిమణి విభ్రాజత్కిరీటంబు పో
నిరతంబుం బరపాదతాడనల గన్నీ ర్వెట్టు మా దివ్యదే
శరమాదేవికి సేవకుండ నయి వాంఛాపూర్తి నెగ్గింతునా! ౫

నిరతధ్యానసమాధినిశ్చలగతిం దీపించి తాదాత్మ్యబం
ధుర సంసార మసార మం చరసి అస్తోకప్రభావాఢ్యు, నీ
శ్వరు,నీశాను నఖండపుణ్యచయ సాక్షాత్కార భావమ్ము న
న్నరయం జాలెడి సిద్ధయోగి నయి బ్రహ్మానందముం గొందునా. ౬

# అనృతమా!

శ్రీ. శెట్టి పరమయ్యగారు.

సీ. సత్యసంధుఁడు హరిశ్చంద్రు డుర్వీపాల
నము సేయ నెచ్చోట నమసి తీవు
రామచంద్రుఁడు నీతి రాజిల ధర నేలు
తరుణమం దెచ్చోట దాగి తీవు
నిషధేంద్రుఁ డురుకీర్తి నెగడ రాజ్యము నేల
నొంటిగా నెచ్చోట నుంటి వీవు
వరయుధిష్ఠిరుఁడు భూపరిపాలనము సేయు
కాలమం దెచ్చోట గూలి తీవు

గీ. పుడమి నిను నాశ్రయించిన జడుల కెల్ల
క్షణిక సుఖముల నిడు దుష్ట ఘనతయందు
నీదె కడు నేర్పు దలప భీతియును గొలుపు
ననృతమా! మెండి బ్రతుకు నీ యదియ సమ్ము!!

# సుప్రసిద్ధ శివక్షేత్రములు

అనువాదకులు:

మఠం సిద్ధివీరయ్యగారు

ఉపాధ్యాయులు

ద్వాదశ జ్యోతిర్లింగములే కాక మహాదేవుని ప్రధాన క్షేత్రములు కొన్ని యున్నవి. ఇవియును జ్యోతిర్లింగములభాతి భారతవర్షముయొక్క వివిధప్రాంతముల యందు విరాజిల్లుచున్నవి. అందలి కొన్ని క్షేత్రము లీ దిగువ నుదహరింపఁబడు చున్నవి.

(౧) మధురమీనాక్షీ దేవి, సుందరేశ్వర మహాదేవ మందిరము. (౨) తంజావూరు బృహదీశ్వర మందిరము. (౩) చెన్నపురి సమీపమందలి పక్షితీర్థము. (౪) ఏలోరా గుహలోని శివవిగ్రహములు, ఎల్ఫెంటాగుహలోని శివవిగ్రహములు. (౫) బొంబాయి ప్రాంతమందలి మహాబలేశ్వరమందిరము. (౬) కాశ్మీర ప్రాంతమందలి యమరనాథ మందిరము. (౭) కాంగడాప్రాంతమున నుండు వైద్యనాథ మందిరము. (౮) బంగాళ ప్రాంతమందలి తారకేశ్వర మందిరము. (౯) ఒరిస్సాలోని భువనేశ్వర మందిరము. (౧౦) బుందేల్ఖండములోని ఖజురాహోలోని శివమందిరము. పై నుదహరించిన వన్నియు విఖ్యాతిగాంచినవి. వీనిలో నొక్కొక క్షేత్రముయొక్క వివరము సంక్షిప్తముగ పాఠకమహాశయుల యుపయోగార్థము దిగువ వ్రాయఁబడు చున్నది.

## ౧. మధురమీనాక్షి సుందరేశ్వర మందిరము.

మధురానగరము చెన్నపురి రాజధానిలోనున్న వైగాయి నదీతీరమున నున్నది. ఇచ్చటి మీనాక్షి సుందరేశ్వరమందిరము మిక్కిలి విశాల మైనది. దాదాపు రెండు వందల యడుగుల యున్నతము గలది. దక్షిణ ప్రాంతమునందలి శ్రీ రామేశ్వరము శ్రీరంగము, చిదంబరము మున్నగు విశాలమందిరములలో నిది మిక్కిలి యున్నత మైనది. శిల్పకళాదృష్టితోఁ బరికించినను ఇదియే మిగుల శ్రేష్ఠమైన దని తెలియవచ్చు చున్నది. శ్రీ సుందరేశ్వరుఁడు మీనాక్షీ దేవి ( దుర్గామహాదేవి నామాంతరము) యొక్క భర్తగా నెన్నఁబడుచున్నారు. వీరి దివ్యలింగమూర్తి మిగుల తేజోవంతము. రజత త్రిపుండ్రములచే ప్రకాశింపఁబడి ధవళోత్తరీయము ధరింపఁబడినపుడు దర్శించిన చాల మనోహరముగఁ గాన్పించును. ప్రేక్షకుల హృదయమున భక్తిభావన లుత్పన్న మగును. మందిరమున నీరెండు విగ్రహములేకాక యితర దివ్యవిగ్రహములు లెక్కకు మిక్కుటముగా నున్నవి. మందిర ప్రాకారబహిర్భాగమునం దత్యంత సుందర సరోవరము గలదు. సహస్రస్తంభ సభామండపమును మందిరపువిశాల

గోపురము దర్శనీయ మైనది. ఈ సహస్ర స్తంభ మండపమునందు వాస్తవముగ నన్ని లేవు. సుమారు (౯౦౦) స్తంభము లుండనోపు.

## ౨. తంజూరు బృహదీశ్వర మందిరము

తంజూరు దక్షిణాపథమునందలి యత్యంత ప్రాచీన నగరము. ఇచ్చటి బృహదీశ్వర మందిర మతిప్రసిద్ధమైనది. మందిరపు బహిర్భాగమునం దొక యత్యంత విశాలోన్నత నందీశ్వరవిగ్రహము గలదు. ౧౬ అడుగుల నిడివి, ౭ అడుగుల వెడల్పు, ౧౨ అడుగుల యెత్తుఁ గలిగియున్నది. జను లీ విగ్రహమును ౨౫ టన్నులు లేక ౭౦౦ మణుగుల భారముగలదై యుండవచ్చునని యంచనా వేసియున్నారు. దీనిని దర్శించుటకై దూరప్రదేశములనుండి యాత్రికు లేతెంచెదరు. మందిరము వేయి సంవత్సరములకంటె పూర్వము నిర్మింపబడియున్నట్లు ప్రతీతి. ఈ మందిరము రమారమి రెండువందల యడుగుల యెత్తుండవచ్చును. మందిరపు నలువైపుల ప్రహరియు నున్నది. దాని నొక దుర్గమని చెప్పవచ్చును. మందిరమును ప్రవేశించుటకు మహాద్వారములనుండి పోవలసియున్నది. దీని ప్రధాన గోపురము ౯౦ అడుగుల యెత్తు గలది. ఈ మందిర నిర్మాణవిషయమై ఫర్గూసన నను యాంగ్ల విద్యాధికుఁడు విశేషాంశముల వ్రాసియున్నాడు. మందిర సమీపమునందే శంకర భగవానుని జ్యేష్ఠపుత్రుఁడగు సుబ్రహ్మణ్యస్వామి లేక కార్తికేయస్వామి మందిరము గలదు. ఇదియును శోభావంతమైనదియే. తంజూరు రాజమందిరము సుందరమైనది. మఱియు నిచటి గ్రంథాలయమునందు ౧౮ వేల సంస్కృత ప్రాచీనహస్తలిఖిత పుస్తకములు గలవు. వీనిలో ౮ వేల గ్రంథములు తాళపత్రములపై వ్రాయఁబడినవి.

## ౩. పక్షి తీర్థము

చెన్నపురి సమీపమున చంగల్పట్టు నామకస్టేష నున్నది. ఈ స్టేషనుకు ౧౦ మైళ్ళదూరమున సముద్రతీరమందు పక్షితీర్థముఁ గలదు. మార్గము పర్వతప్రభృతుల నుండియు సురమ్యమగు వనములమధ్యనుండియు నున్నది. పక్షితీర్థమునందు శంఖతీర్థ మను పేరుగల యొక్క పెద్దసరోవరము గలదు. ఇందు స్నాన మొనరించిన పిదప యాత్రికులు (౯౦౦) మెట్లెక్కి పర్వతశిఖరముఁ జేరవలసియున్నది. అచ్చట పక్షి తీర్థముఁ గాన్పించును. అచ్చట నొక ప్రాచీన శివమందిరము గలదు. మధ్యాహ్న సమయమున పాయసమును ఘృతమును హస్తమునఁబూని యర్చకుఁడు పూర్వాభిముఖుఁడై గంటవాయించును. ఘంటానాద మాకర్ణించినతోడనే శ్వేతవర్ణముగల పక్షులు రెండు యెగిరి యర్చకుని సమీపమునకు వచ్చి కూర్చుండును. ప్రసాదమును భుజించి జలపాన మొనరించి యెగిరిపోవును. ఆస్తికుల విశ్వాస మే మనగా, సాక్షాత్

శివపార్వతులు పక్షిరూపమున నచటికే తెంచి భక్తులను కృతార్థుల నొనరించిపోయెదరు. కొందఱు పలుకున దేమనగా ? ఈ రెండుపక్షులు ఋషులై యుండి శాపకారణమున పక్షులైనారు. ఈ మందిర మచటి శిలాశాసనానుసారము రెండువేల సంవత్సరముల కంటె బూర్వమున నిర్మింపబడి నట్లు తేటబడుచున్నది.

## ౪. ఏలోరా ఎలిఫెంటా గుహాంతర్గత శివవిగ్రహములు

ఏలోరాగుహలు హైదరాబాదురాజ్యమందలి దౌలతాబాదుస్టేషనుకు ౭ మైళ్ల దూరమున నున్నవి. స్టేషనునుండి గుహలవరకు మంచి రోడ్డు గలదు. సంపూర్ణమైన కొండను తొలిచి మందిరరూపమున మార్చినారు. మందిరనిర్మాణమునందు సున్నము నుపయోగించ లేదు. ఏలాటి (సీలలును) మొలలును వాడలేదు. మందిరములు 30 టిని మించియున్నవి. హిందూ దేవాలయములును బౌద్ధమందిరములును జైన మందిరములు వీనిలో నున్నవి. హిందువుల మందిరములలో కైలాసనామక మందిర మన్నిటిలో గొప్పదియు, అంద మైనదియు నై యున్నది. దీనిని ప్రపంచమందలి (అష్టమాశ్చర్య) మని జనులు పేర్కొనుచున్నారు. ఈ మందిరములను దర్శించుటకు దూర దూర ప్రదేశములనుండి వచ్చెదరు. పురాతత్త్వవేత్తల యభిప్రాయానుసారము యీ మంది రములు ౧౧ వందల సంవత్సరములకు పూర్వము నిర్మితములైనట్లు తెలియుచున్నది. ఈ మందిరము శంకర భగవానునిది. ఇందు మానుషరూపమును శిలారూపమునఁ దొలిచియున్నారు. ఒక ప్రదేశమునందు రావణుఁడు కైలాసమును మెత్తుచున్నట్లు శిల్పి నిర్మించినాడు.

రెండంతస్థుల మందిరముల నిర్మాణమునకు ౨౫ వర్షములైన కావచ్చును. మందిరకుడ్యములపై రామాయణ మహాభారత ప్రధాన ఘటనలను మూర్తుల రూపమున ప్రదర్శించియున్నారు. ఈ అపూర్వ శిల్పమును కొందఱు నష్టపరచినారు కాని ప్రస్తుతకాలమునందైనను ఆ శిల్పము చూపఱుల కాశ్చర్యముఁ గలిగించును. సామ్రాట్టగు దంతిదుర్గుఁడు ౮ వ శతాబ్దముయొక్క పూర్వార్థమున నీ మంది రమును నిర్మించియుండె నని చారిత్రికాధారములవలనఁ దెలియుచున్నది. కొందఱ మతానుసారము యేలోరా ప్రాచీన నామము శివాలయమనియు ఘుశ్మేశ్వర నామక జ్యోతిర్లింగ మిచ్చటనే యున్నదని దెల్పుదురు.

ఎలిఫెంటాగుహా మందిరములు బొంబాయి నగరమునకు ౬ మైళ్ళ దూర మందున్న ద్వీపములో నున్నవి. యాత్రికు లిచటికి నావలమీదను, స్టీమరుల పైనను వెళ్ళెదరు. ఈ ద్వీపమందు రెండు గొప్పపర్వతములు గలవు. వీని పై భాగములను

తొలచి ౧౫ వందల సంవత్సరములకు పూర్వము లేక రెండువేల సంవత్సరములకు బూర్వము హిందూశిల్పకారులు శంకర భగవానునియొక్క మందిరము లనేకముల నిర్మించిరి. ఈ మందిరములో శ్రీశంకరునియొక్కయు, పార్వతీదేవియొక్కయు అర్ధనారీశ్వర నటరాజమూర్తులను బ్రహ్మవిష్ణుమహేశ్వరుల విశేష రూపములఁ జూపినారు. 3 వందల సంవత్సరములకు బూర్వము బొంబాయి నగరమును, ఆ ప్రాంతపు దీవులును పుర్తగాల్ దేశీయుల యధీనమం దుండెను. ఆ సమయమునందు వారు విగ్రహముల నన్నింటిని, మందిరములను నష్ట మొనరించినారు. వానిని చూచినను ప్రాచీన శిల్పమునకు గౌరవము గలుగుటయేగాక స్మృతిపథమునకు వచ్చును. ఈ మందిరములలో శ్రీ శంకరుఁడు లింగరూపమున నున్నాడు. గుహల యధోభాగమున నిర్మలవారిచే నిండిన గుండ మొకటి కలదు. సముద్రతీరమునుండి గుహలవరకు సోపానములు గలవు. ఈ ప్రదేశమునకు బొంబాయి వాస్తవ్యులు ధారాపురి యనెదరు.

## ౩. మ హా బ లే శ్వ ర మం ది ర ము

ఈ ప్రదేశము బొంబాయి ప్రాంతమున చల్ల దనమైనది. బొంబాయి గవర్నరు వేసవికాలమునం దిచటనే వసించును. ఈ చిన్నపట్టణము బొంబాయికి దక్షిణదిశ ౨౦౦ మైళ్ళ దూరమున పడమటి కనుమ లను పర్వత శ్రేణిపై నున్నది. పూనా నుండి వెళ్ళవచ్చును. కొంతదూరము ధూమశకటము పై; గొంతదూరము యంత్రశకటము పై వెళ్లవలెను. మార్గ మతి రమణీయము. కాని కొన్నిచోట్ల భయంకర పర్వతముల మధ్యనుండి పోవలయును. బొంబాయినుండి పూనావరకు విద్యుత్ ద్వారా రైలుబండి నడచును. ఈ యమోమార్గమున ఖండాలఘాట్ దృశ్యే మత్యంతరమణీయమునై యున్నది.

మహాబలేశ్వరక్షేత్రము సుప్రసిద్ధ మైన కృష్ణాతరంగిణి యుత్పత్తిస్థానము. నదీయుద్గమన ప్రదేశ మొక ప్రాచీనమందిరము. ప్రతాపగఢ దుర్గమునందు శివాజీ చక్రవర్తి యిష్టదేవి యగు శ్రీభవానీ దేవ్యాలయము గలదు. ఇచటికి సన్నిహితముననే యున్నది. సింహగఢ దుర్గము సహితము సమీపమునందే యున్నది. అఫ్జల్ ఖానునిఁ జంపిన యనంతరము శివాజీ తన మాతృదేవిసహితముగ నిచటికే తెంచియుండెను. తాను దుర్దమునీయ శత్రుసంహారసంజనిత సంతోష ప్రదర్శనమునకు దేవాలయ శిఖరమును స్వర్ణమయమును గావించియుండెను.

(సశేషము.)



# నీతి పథము

## శ్రీ కవిరత్న : లక్కన మల్లికార్జునుడుగారు

మౌనదీక్షఁబూని మంత్రంబు జపియించి, శివునియందు గురిని చేర్చినిలపి
యెప్పుడు చరియించు యీశుభ క్తులకును, చెలగి మ్రొక్కి వారి సేవజేతు. ౧
నియమబద్ధమైన నేరుపు కల జీవి, ఋతువులందుపూచి క్షితిని మిగుల
వినతు లందు పూల విధమున వికసించు, జన్మలందు గొప్ప జన్మమనఁగ. ౨
మాటలందు తూచి మాటాడజాలక, నోటివెంట వచ్చు మాటలన్ని
పలుకుచుండువాని పలుకులు వ్యర్థమౌ, కుక్కయరపువలెను నిక్కమిద్ది. ౩
పక్షపాతబుద్ధి కక్షకు నిలయంబు, దాని కీర్తి కలయు ధరణియందు
మురికిపక్ష మగుచు పఱగెడి సలిలంబు, నేల గలియునటుల నీచముగను. ౪
భోగమందు హద్దు పోయినవానికి, యెంత కలిమియున్న నెప్పు డవని
కొరత లుండునుమ్మి పరగఁగట్టలు లేని, చెరువునందు నీటి కొరతవలెను. ౫
రూపు ధనము బలము రూఢియైయుండిన, మంచిగుణము లేని మనుజపశువు
జీవితమున చెడుట సిద్ధంబు చక్కని, పాము దుడ్డుదెబ్బఁ బడినయటుల. ౬
పిరికివానిబుద్ధి పరుగెత్తు నీరంబు, కటికవానిబుద్ధి కరకురాయి
ధీరవరునిబుద్ధి నీరధిగుంభము, ప్రేమపరుని బుద్ధి విశ్వమయము. ౭
చెట్లపూలు తెచ్చి శృంగారమాలగా, పూలమాలి గ్రుచ్చి భూమియందు
ముదముగూర్చునటుల పొలుపుగా సత్కవి, మంచిక్రియల పద్య మాల చేయు.
మదము చేటు తెచ్చు మానవజాతికి, కులట చేటు తెచ్చు గొప్పయింటఁ
గక్ష చేటు తెచ్చు గ్రామంపు సిరికిని, మంట దూదిఁజేరి మాడ్చినటుల. ౯
బీదజనులబాధ విజ్ఞానియేతీర్చు, మత్తు డెప్పుఁడు తెలిసి మనుప లేడు
దాహబాధతీర్ప ధరణి నీరముకాక, ప్రబలమత్తు లీను బ్రాంది యగునె! ౧౦
బలము గల దటంచు బలహీనులకు మోస, మెరిగి చేసి మరియు హీనజనుఁడు
పందిబలిసి తుదకు బంధియై మడిసెడి, భాతి చెడును సుమ్మి వ్యర్థుఁడగుచు. ౧౧
శుచియు శుద్ధి నెరిగి సుఖజీవనంబును, క్షమయు కష్టమెరిగి కార్యపూర్తి
ధర్మకర్మలెరిగి ధన్యభావంబును, పొందువాడె లోక పూజ్యుఁ డగును. ౧౨
గరిక మెక్కి గోవు నరులకు క్షీరంబు, లిచ్చినటుల ధరణి సచ్చరితుఁడు
స్వల్పసాయమునకె ప్రబలి మేలును చేయు, సంతసమున దీన జనుఁడు మెచ్చ. ౧౩

చెనటి పొత్తుచేత క్షేమంబు చెడిపోయి, నిర్మలాత్ముఁడైన నిందఁబడును
భువిని నిప్పునొద్ద నవనీత ముంచియు, కరుగకుండ నుంచగలమె యవని. ౧౪

తప్పుచేసి దాని కప్పిన దెలివిచే, బైటపడును పరులు పరిహసింప
తెల్లబొమ్మమీద నల్లరంగు నలంది, దాచగలడె? నరుడు ధనపుబలిమి. ౧౫

ధనికు డంచు లోభి దరిచేరి యాసింప, కాని డబ్బురాదు కవికినైన
మగువ యంచు కోరి మాచకమ్మను కూడి, సుతులఁబడయఁగలడె సుందరుండు.

తనకు వచ్చుకీడు తాను కానగలేక, పరులు తనకు లొంగి బానిసలుగ
నుండరంచు కీడు మొండియై చేసెడి, గర్వపోతు కెందు ఘనతలేదు. ౧౭

శాస్త్రశోధనంబు చక్కఁగా చేయకే, దురిత బుద్ధిచేత తోచినటుల
నిర్ణయములు చేయు నేర్పరి లిఖితంబు, మెప్పు బడయగలదె ? తప్పు గనక. ౧౮

కల్లలాడియైన గతినబుద్ధియునైన, పరుల హింసఁజేసి ప్రబలియైన
ధనముగూర్చు చెనటి ధరణి పూజితుఁడౌను, విటుల పూజలందు వేశ్యపగిది. ౧౯

పరులు చేసి నట్టి పద్యగద్యంబులు, దొంగిలించినట్టి దొడ్డదొరయు
పేరుపొందవచ్చు పెరచేలఁ బైరులు, మెక్కిఁబలిసి ఎద్దు నిక్కినటుల. ౨౦

తన మతంబు విడిచి కన యన్ని మతములే, యంచు పరమతమున నడుగు లిడుట
అంద రంగన లని యాలిని విడనాడి, గడుసు లంజఁజేరు కరణిసుమ్మి. ౨౦

ఓటు కిచ్చుధనము నాటిన కత్తితో, కోర్టు కిచ్చు కాని కోవిదులకు
దేశభాషలకు కాసైననీయరు, ఏమి వింత యుగము ఇద్దిచూడ ? ౨౧

కష్టకాలమందు ఘనుల సాయములేక, శుభముపొంద లేడు సుజనుఁడైన
నడుసులోనఁబడిన ఐరావత మ దెట్లు, ఒడ్డుచేరగలదు ? ఒంటరిగను. ౨౨

అల్పజనునిమాట లాత్మలో తఁగనమ్మి, గొప్పపనులు చేయఁ గోరుటెల్ల
బుడ్డ కలదటంచు పోయి యేటను బడి, ఈదబూని నట్లు ఇద్ది నిజము. ౨౩

పొట్టకూటికైన బుట్టని బీదింట, జగతి నుంటకంటె చావుమేలు
కుడువలేక గుక్క గడపగడప కేగి, చెప్పుదెబ్బ దినుట సిగ్గుగాదె ? ౨౫

కుడువ తిండికొరత కొంపయు లేకుండు, పుట్టు బిడ్డలన్న పుట్టె దుందురి
బీదవానిబాధ వివరింప విజ్ఞాని, తేలుకుట్టుబాధ చాల దనును. ౨౬

(సశేషము.)

# మఠములు, మందిరములు

## సాధక బాధక విచారము

### బోర్డు నిర్మాణము

ధర్మ అర్థ కామ మోక్షము లనెడు చతుర్విధ పురుషార్థములను సంపాదించుటయే భారతీయుల ముఖ్య కర్తవ్యము. బ్రాహ్మణాది చతుర్వర్ణములును గృహస్థాది చతురాశ్రమములును తమతమ యధికారముల ననుసరించి పురుషార్థములను నిర్వహించుట ముఖ్యవిధి. ఈ వ్యాసమున మఠములకును మందిరములకును సంబంధించిన వ్యక్తుల విషయములను గూర్చి ప్రధానముగాను, ఉదాహరణార్థము ఇతర వ్యక్తులను గూర్చి గౌణముగాను, చర్చింపబడును.

### మఠము లనగా నేమి?

మఠశబ్దార్థమును గూర్చి విపుల మైన చర్చయు, కొంత వివాదమును కలదు. సంక్షేపముగా జెప్పుటకు వీలులేక పోయినను చెప్పవలసియే వచ్చుచున్నది. ఆ యా శబ్దముల కుండెడు వ్యవహార వ్యాపకతను బట్టి విపులమైన అర్థసంగ్రహమును గావింప వలసియుండును. శబ్దమునకు సుప్రసిద్ధ మైన అర్థముకూడ మరొకప్పుడు నిరాఘాటముగ భిన్నముగా మార్పుచెందుచుండును. దీనికి కారణము భిన్నభిన్నస్థలములే! ఉదాహరణార్థము:— "శరణ" శబ్దమును తీసుకొందము. దీనికి "గృహము," "రక్షకుడు" అను రెండర్థములును సంస్కృత సాహిత్యమున (శరణం గృహరక్షిత్రోః) ప్రసిద్ధములు. అయినను, సామాన్యముగ నిఘంటుకారులకును, చాలమంది పండితులకును దెలియని వేరొక యర్థము వీరశైవ వాఙ్మయమున దీనికి గలదు. శరణుఁడనగా దృఢ మైన శివభక్తుఁడని యర్థము. ఈ మత వాఙ్మయమును, ఆచారములును తెలిసినవారికీ యర్థము సుపరిచితము. శైవమతముననుండు అర్థము వైష్ణవ, శాక్త, సౌర, గాణాపత్యము మొదలగు నితరమతములలో మారవచ్చును. ఆ యా మతముల చర్చలు వచ్చినపుడు ఆ యా అర్థములే ప్రమాణము లగును, కాని సామాన్యముగ ప్రచారములో నుండు అర్థములు (హిందూలా మున్నగునవి) గాని, బహుమతముగాని ప్రమాణము కానేరదు. ఇట్లు విపరీత మైన ప్రామాణ్యము స్వీకరించుచో అన్యాయ మైన తీర్పులను చెప్పవలసియుండును. అనగా ఒక ప్రధాన మైన మతము నాధారము చేసికొని తక్కిన మతములను ఒక్కసూత్రముక్రింద నరికట్టించుట సదోష మైన పద్ధతి యని గట్టిగా నిర్ణయ మగుచున్నది.

మఠముల గూర్చియు ననేకాభిప్రాయము లుండు ననుటకు మీది యంశముల గమనించుట పరమావశ్యకము. మఠ మనగా విద్యార్థులు మున్నగు వారు నివసించు స్థల మని జైనమతస్థు డగు అమరసింహుడు తన అమరకోశమున జెప్పియున్నాడు. కాని స్వాములు, యోగులు, యతులు, మఠాచార్యులు నివసించు ఆవరణమే మఠ మని సామాన్యముగ వ్యవహారము. ఋషుల నివాసమునకు ప్రాచీన కాలమున 'ఆశ్రమ' మనుటయే వాడుక. మఠ మన్నట్లు కానరాదు. మొట్టమొదట బౌద్ధమత స్థులే మఠములను కనిపెట్టి రని కొందరు అనుచున్నారు. ఇది పొరపాటు. బౌద్ధసన్యాసులకు సంఘములు, ఆరామము లుండెను. కాని మఠములు కావు. ఇక శ్రీశంకరాచార్యులు కూడ మఠములకు ఆవిష్కర్తలు కారు. వారికి పూర్వమే శివయోగులును వారి మఠములును కలవనుటకు 'సూతసంహిత' యను సుప్రసిద్ధ మైన గ్రంథము ప్రమా ణము. ఇది చాల ప్రాచీన మైనది. దీనికి విద్యారణ్యుని వ్యాఖ్యానము కూడ కలదు. శివరహస్యము, శివధర్మసంహిత, పారమేశ్వరాగమము మొదలగు ప్రాచీన గ్రంథముల లోను మఠామ్నాయము, మఠస్థలనిర్ణయము మొదలగు అర్వాచీన గ్రంథములలోను మఠములను గూర్చిన చర్చకలదు. ఈ పర్యాలోచనవలన మఠములయొక్క పద్ధతి మొట్టమొదట శైవులలోనో, వీరశైవులలోనో ప్రచారమునకు వచ్చి యుండు నని సహజముగ జెప్పవలసి యున్నది. శాక్త, వైష్ణవ సంప్రదాయము లందును ఆధుని కము లగు కబీర్, దాదూ, రాధాస్వామి మతస్థులందును ఈ మఠములు కలవు. క్రమశః వైదికాస్తికు లైన హిందువుల సమస్త శాఖలలోను మఠములు ప్రచారము నందినవి. ఈ విపుల మైన సామగ్రితో మఠముల చరిత్ర యను గొప్ప గ్రంథమును తయారు చేయవచ్చును.

## వీ ర శై వ మ ఠ ము లు.

వీరశైవమతస్థులకు మఠములతో సంబంధము చాల యెక్కువగా కలదు. ఇంత గాఢ మైన అనివార్య సంబంధము ఏ మతస్థులకును మఠములతో లేదు. కావు ననే భారతదేశమున వీరశైవుల సంఖ్య కొన్నిలక్షలేయైనను వీరికి వేనవేల సంఖ్య గల మఠములు కలవు. దీనికి కారణమేమనగా వీరశైవుల సమస్త శుభాశుభకార్యముల లోను మఠమయ్యలు ( మఠార్యులు ) అగు మహేశ్వరులు కావలెను. వీరికే గురు స్థలికు లనియును, మఠస్థలికు లనియును వ్యవహారము కలదు. వీరు లేకుండ యేకార్య మును జరుగజాలదు. మఠము అన్నంతమాత్రముతో, అక్కడ సన్యాసి నివసించు నను విపరీతార్థమును గ్రహింప కూడదు. వీరశైవుల శాస్త్రప్రకారము సన్యాసికి గురుత్వము లేదు. వ్యవహారమును లేదు. ఈ గురుస్థలికులు పుత్రవర్గీయు లనియును,

శిష్యవర్గీయులనియును ఇరుతెరంగులుగా నున్నారు. తమ వంశమున బుట్టిన వారికి దీక్షోపనయనము (కారణములు) గావించిన తరువాత అవసర మగుచో ఆచార్యత్వ సంస్కారమును చేయబడును. ఈ యాచార్యులు దేశిక చరమూర్తి పట్టాధ్యక్ష ఘనలింగచరమూర్తి సహస్రాధ్యక్ష మండలాధ్యక్ష జగద్గురువు అని పలు తెరంగుల నున్నారు. వీ రెవరును సన్యాసులు గారు. గోత్రసూత్రము లుండును. వివాహాది సమస్తకర్మలలో వీరు పాల్గొని నిర్వహింతురు. దేశికుఁడు వివాహ మొనర్చుకొను టకు స్వతంత్రుడుగా నుండఁగలఁడు. చరమూర్తి మొదలు తక్కినవా రందరును వాన ప్రస్థ సన్యాసాశ్రమముల నిచ్చుటకును అధికారము గలిగియుందురు. తమ పుత్రవర్గ సంప్రదాయము విచ్ఛిన్నమగు నను సంశయ మేర్పడినపుడు ఆపద్ధర్మముగా నెంచి చరమూర్తి మరియొకరికి తన యాశ్రమపట్టము గట్టి వివాహ మొనర్చుకొనుటయు కలదు. తక్కినవా రెవరును వివాహమును చేసికొనగూడదు. అట్టి యాచారమును లేదు. ఇందు జగద్గురువు లనువారు సర్వస్వతంత్రులు. వీరశైవులలో నివిగోత్రసంఖ్యను బట్టి యైదుమాత్రమే కలవు.

శిష్యవర్గ సంప్రదాయమున కూడ నిట్టి భేదములే కలవు. తారతమ్య మే మనగా- వీరి మఠములలో గృహస్థులు నివసింపరు. ఆస్తికి స్వామి యొక్కఁడే సర్వాధి కారి. పుత్రవర్గ మఠములలో గృహస్థులును నివసించి యుందురు. అధికారి భేదము లున్నను ఆస్తికి కుటుంబికు లందరును లా ప్రకారము ఔరసత్వము గలవారే! శిష్య వర్గ మఠముల కైనను కులశీల సంపన్నులైన మఠస్థలిక మాహేశ్వరుల వటువులనే ఎన్నుకొనవలసి యుండును. ఇవియును నేదియైన నొక గోత్రమునకు జెంది యుండును. శిష్యవర్గీయుల కన్న పుత్రవర్గీయులు శ్రేష్ఠు లనుకొను వాడుక గలదు. అధికారములు మాత్రము సమానముగనే యున్నవి. ఈ స్వాము లందరును సహజ ముగ నైష్ఠిక బ్రహ్మచారుల వలె పెండ్లిలేనివా రగుటచేత మామూలుగ యతీశ్వరు లనియును కొందరు వ్యవహారించుట కలదు. వీరిని గురుసన్యాసు లని పిల్వదగు నని యును కొందరు పండితు లనుమతించిరి. కేవల సన్యాసులు మాత్రము కా రనుటలో అభిప్రాయభేదము లేదు. వీ రందరు మొత్తము మీద గురుస్థలస్వాములై యున్నారు. దేశికుడు, చరమూర్తి మున్నగు స్వాములు లేని కేవల గృహస్థుల మఠము లును కలవు. వీ రింటిలోని యందరును వివాహితులే! వీ రా యా గ్రామములలో ఉపాచార్యులుగా నుండి వీరశైవుల సంస్కారముల నెరవేర్చుచుందురు. మఠమనగా రాతిగోడలుగల పెద్ద పెద్ద భవనములనుట పొరపాటు. అది వారి వంశమునకు గల గౌరవాధికారమేకాని వేరుకాదు. పూరిండ్లుకూడ నుండవచ్చును. అటులే మఠము

నకు స్వామిని జేసిరనుటయు వ్యవహారమే కాని సయుక్తికముకాదు. ఆస్తి, మఠభవనములు లేకున్నను చరమూర్తి, పట్టాధ్యక్ష మున్నగు సంస్కారములను పొంది స్వామిగా వ్యవహరింపబడగలరు. ఇది గురుత్వ చిహ్నమే కాని ఆస్తితో వచ్చునదికాదు, ఆస్తికి వాని వాని జన్మమునుబట్టి కాని, లేక ప్రత్యేకమైన దానపత్రాధికారముల ననుసరించి కాని అర్హత కలుగ వచ్చును.

వీర శైవులలో నిరాభారదీక్షను వహించిన కేవల సన్యాసులును కలరు. వీరికి గోత్రసూత్రము లుండవు కావున నెవరికిని గురువులు కానేరరు. లింగధారణ దీక్షాదులను వీరు చేయగూడదు. శుభకర్మలలో పాల్గొనకూడదు. ఇట్టి వ్యవహారమును లేదు. ధర్మశాస్త్రప్రకార మీ సన్యాసులు ఆస్తికలిగి యుండకూడదు, కాని వీరికి గల సహజమైన పూజ్యతనుబట్టి ఆస్తులును మఠములును కలిగినవి.

వీరశైవులు నివసించు కర్నాటక మహారాష్ట్రాంధ్ర దేశపు (బెళగాం మొదలు హైదరాబాదు వరకు) ముఖ్యములైన సమస్త గ్రామములలోను మఠములు కలవు. ఈ ప్రకారము వీరశైవుల మఠములు కొన్ని వేలసంఖ్యలో గలవు. జనసంఖ్యను బట్టి ఇన్ని మఠములు మరి యేమతమువారికిని ఇండియాలో లేవు. అనగా సన్యాసులు నివసించు స్థలములకే కాక గృహస్థుల స్థలములకును మఠము అను పేరుండుటచేతను, మఠమయ్యలు, ( మఠదయ్యానవరు, మఠాధికారి ) నిత్య దినకృత్యములతో సంబంధము గలవారగుటచేతను, వీరశైవులలో నిన్ని మఠము లుండుటకు కారణము.

స్మార్త మతస్థులైన సన్యాసులకును గృహస్థులయొక్క ఉపనయన వివాహాది కర్మలలో నధికారము లేదు. కాని ఖండన మండన బహిష్కారాది అధికారములు కలవు. సన్యాసులకే మఠములు కలవు. స్మార్తుల ముఖ్య మఠములు నాలుగే యైనను దశనామీ సాంప్రదాయములకు జెందినట్టియు ఉదాసీలకు జెందినట్టియు మఠములు చాల యెక్కువగా ఉత్తర దేశములో కలవు. స్మార్తుల మఠములు దక్షిణ దేశమున చాల తక్కువగా నున్నవి. శ్రీవైష్ణవ మఠములలోను గురుసన్యాస మఠములును కేవల సన్యాస మఠములును కలవు. గృహస్థులైన మఠాధికారులును అనేకులకు గురువులై యున్నారు. ఇటులే మాధ్వ రామానంద గౌరాంగ చైతన్య రాధాకృష్ణ, రామకృష్ణాది సాంప్రదాయకులలోను, గోరఖు గోసాయి సాధులు బైరాగులు మున్నగు వారిలోను వివిధ నియమములు గల మఠములు (అఖాడాలు) గలవు. మఠమను శబ్దమునకు ఒక సామాన్యమైన అర్థమును కల్పించుకొని అన్నిటిని ఒక నియమము క్రిందికి లాగ నెంచుట న్యాయ్యము కానేరదు. ప్రత్యేకముగ ఆ యా

సంప్రదాయముల చరిత్రలను పరిశీలించిన గాని మఠముల మఠాధికారుల కర్తవ్య ములు నిర్ణయము కాజాలవు.

దేవాలయములు

ఇటులే దేవాలయములు మందిరములు అను సంస్థలును అనేక భిన్నతలు కలిగియున్నవి. వ్యక్తిగతముగా నిర్మింపబడి అనాదిగా వ్యక్తిగతాధికారము గలిగిన వనియును అకస్మాత్తుగా దైవ మహిమలవలన స్వాధీనమైనవనియును, సార్వజని కము లనియును, కొన్ని కులములు సంప్రదాయములకు మాత్రమే చెందినవనియును నానావిధములుగా నున్నవి. దేవాలయ మున్నంతమాత్రమున ఆ పరిసరమున నుండు ఆస్తిగాని గృహములుగాని దేవాలయమునకు చెందినట్లుగా జెప్పి సార్వజనిక హక్కు లను స్థాపింపబూనుట ప్రమాదమే యగును. తమ తమ అవసరమును బట్టి అనేక జనము ఒక్క స్థలమునకు వెళ్లినంతమాత్రముచేగాని దానభోగముల నొనర్చిన మాత్ర ముచేగాని సార్వజనిక మనుట పొసగజాలదు.

సన్యాసులు, గృహస్థులు.

పాశ్చాత్య సంస్కారముల బలమువలన భారతీయుల ఆచారములకును అర్థము మార్పబడుచున్నది. రానురాను ప్రతిభావమునకును పాశ్చాత్యుల పోలికలను కల్పించు కొని వానినే ఆక్టుగా నిర్ణయించి నిరంకుశముగ పరిపాలింపబడు చున్నది. మఠములను మందిరములను విదేశీయుల 'చర్చి' మున్నగు సంస్థలతో బోల్చిన యనర్థము నొక యుదాహరణముగా జెప్పవచ్చును. స్వాములు, గురువులు, సన్యాసులు, మఠస్థులు లేక మఠములు ధార్మికము లనియును, సార్వజనిక సంస్థలనియును, వారు ధార్మిక ముగనే తమ జీవితమును నిర్వహింపవలె ననియును, గృహములు, గృహస్థులు ధార్మికములు కావనియును స్వేచ్ఛగ చరింపవచ్చుననియును కొందరు చెప్ప మొద లిడినారు. ఇట్టియూహాలు భారతీయ ధర్మశాస్త్రమునకు కేవలము విరుద్ధములు. 'బ్రహ్మచారి, గృహస్థ, వానప్రస్థ, సన్యాసి' అను నాలుగాశ్రమములకు జెందిన హిందువు లందరికిని ప్రత్యేకముగ ధార్మిక కృత్యములు కలవు. ఇందులో అధా ర్మికు డెవడును లేడు. సన్యాసికిని గృహస్థునకును గల ఆశ్రమములు ధార్మికములే! ఎవరైనను ధర్మమును తిరస్కరించి నడచుటకు ఏమాత్రము హక్కులేదు. గృహస్థు డెటులున్నను సన్యాసులు సరిగా నుండవలె ననుట నిరంకుశము గాకమానదు. ఈ మధ్యన పత్రికా వ్యాసములలోను నాటకము సినిమాలలోను స్వాములను, మఠాధి పతులను, పురోహితులను గూర్చి విచ్చలవిడిగా నిందించుటయు అతిశయముగా కల్పించి పరిహసించుటయు జరుగుచున్నది.

ఇది గృహస్థుల మెజార్టీ (అధికసంఖ్యాక) బలముయొక్క దురుపయోగ మని చెప్పవలసి యున్నది. ధన దారాపుత్రులు గల గృహస్థులు అధర్మముల నాచరించినను తప్పు లేదట; నిరాధారుడైన సన్యాసి మాత్రము తప్పు కూడదట! ఎవరి కృత్యములు వారికి శుద్ధములు గానే కన్పడును. సన్యాసు లందరు గృహస్థులకు దుర్మార్గులుగా నగుపడు చున్నారు. సన్యాసులకు గృహస్థు లెటు లగుపడుచున్నారో మన విమర్శకుల కక్కరలేదు. సన్యాసులు గురువులు స్వయముగానే ధర్మముల ద్యజించు చున్నట్లును, దానికి బహు సంఖ్యాకులైన గృహస్థుల ఆచరణములు కారణము గానట్లును భావించుట విచిత్రముగాదు. వేలకొలది విద్యార్థులకు విజ్ఞానమును ప్రసాదించిన మఠములు నేడు దురాచార స్థానము లైనవనియును మఠాధిపతుల నణచి వానిని స్వాధీన పరచుకొనవలె ననియును ఒక పత్రికలో వ్రాయబడెను. లక్షలకొలది అతిథులకు అన్నము నొసంగి ధర్మాచారవ్రత పరాయణులైన గృహస్థుల గృహములు నేడు నాటకములవలె విలాస స్థానము లగుచున్నవని ప్రచార మొనర్చుటకు సన్యాసులకు బలము లేదనుట నిక్కమే!

భారతీయులందరికిని ధర్మాచరణము కర్తవ్యము. మనుష్యుడు ప్రమాద పడుట సహజము కావున ఎవరికిని దురాచారము లంటకుండునటుల కట్టుదిట్టము లొనర్చుట సమాజ నాయకుల కర్తవ్యమై యున్నది. అధిక సంఖ్యాకులు దురాచారముల ననుభవించుట కవకాశముల గల్పించి, కొలది వ్యక్తులు మాత్రమే సదాచార సంపన్నులుగా నుండవలె నని బలాత్కారముగా శాసించినచో సఫలము కాజాలదు. ఏ యాశ్రమస్థుడైనను సుగుణము గలవాడగుచో కొన్ని సౌకర్యములు పొందు ననుట సహజమే! వ్యావహారికముగ గలుగుచున్న నమస్కారాదులవలన స్వాములకు గొప్ప సౌఖ్యము గలుగుచున్న దనుకొనుట యథార్థముకాదు. చక్రవర్తిత్వము వరకుగల గృహస్థుల సౌఖ్యములలో శతాంశమైనను వారికి లేదు. ఇవి యన్నియు విపులముగ నిరూపించుటకు మరొక గ్రంథ మవసరము. వేరు వేరు కర్తవ్యములు బోధింపబడినంతమాత్రమున సన్యాసులు తప్ప గృహస్థులు స్వతంత్రులనుకొనుట తప్పు. న్యూనాతిరేకభావములు, తరతమాచారములు జగత్తున్నంతవరకు తప్పక పోయినను అందరు ధర్మపరతంత్రులై స్వ కర్తవ్యముల తప్పకుండునట్లు జూచుకొనవలసియే యున్నది.

### మ ఠ ము ల సం ప త్తు

మఠముల యొక్కయు దేవాలయముల యొక్కయు ఆస్తినిగూర్చి లోకములో చాల అపోహాము లేర్పడినవి. ఒక వీరశైవులలోనే ఎన్ని విధములైన మఠములుకలవో

పాఠకులకు కొంచెముగా వివరింపబడినది. ఈవిశాలమైన భారత దేశమున వివిధమతస్థుల యొక్క మతముల నానాత్వమును గూర్చి ఎంతగా పరిశీలనావసరము గలదో వేరుగ జెప్పనక్కరలేదు. మతమన్న పేరున్నంత మాత్రమున అది సార్వజనిక సంపత్తు కానేరదు. కొన్ని సార్వజనిక ఆస్తులకును మతమను పేరు ఉండవచ్చును. , వీర శైవుల పుత్రవర్గ మతము లన్నియు స్వతంత్రములు. ఆ యాస్తిని అనుభవించుటకు వారికి సంపూర్ణములైన హక్కులుగలవు. ఇట్టి ఆస్తులు వ్యవహార సౌకర్యమునుబట్టి ఒకప్పుడు స్వామి పేరుతోను, మరొకప్పుడు గృహస్థుల పేరుతోను వెలయుచుండును. ఒకే కుటుంబములో కలహము గలిగినపుడు స్వాములును, గృహస్థులును, ఆస్తుల విషయమై తమదంటే తమదని నిరూపించుటకు తంటాలు పడుచుందురు. వీరిద్దరి పోట్లాటను గని అది సార్వజనికమని మరికొందరు వాదింపదొడగిరి. ఆ స్తికి వారి వంశానుసారము అందరును బాధ్యులు కావచ్చును. శిష్యవర్గ మతాధిపతులకును ఇంకను జగద్గురు మున్నగు పీఠాధికారులకును స్వత్వ హక్కులు గలిగిన సంపత్తు కలదు. ఇటులే అనేక సంప్రదాయముల మతముల సంపత్తునకు సర్వాధికారమును, దాన భోగాధికారమును గల వ్యక్తు లున్నారు. ఆస్తి లేక సంపత్తు ఈ మతము లకు లేక స్వాములకు ఎటులు సమకూడె నని యొక ప్రశ్న కలదు. నిక్కముగ నీ సమస్యను సరిగా దెలిసికొనినచో మతములను గూర్చిన వాదము చాల వరకు శాంతము కాగలదు. వీరశైవ మతస్థులు చాల వరకు పురోహితవృత్తి ననుసరించి యున్నారు. పురోహితుల ఆస్తులు సార్వజనికములు కానేరవు. వివాహాది కర్మల నాచరించుచు దానికి ప్రతిఫలముగా దక్షిణలను, దానములను పొందుచున్నారు. పురోహితుల ద్రవ్యము మీద సార్వజనిక హక్కు లున్నవనుచో అపుడు వీరశైవ మతములే కాదు. ఇతర మతస్థు లగు లక్షల కొలది బ్రాహ్మణులును వారి యాస్తు లును సార్వజనికములు గావలసివచ్చును. ఇది న్యాయ మెన్నటికిని కాదు. మరికొం దరు మతస్థులు భిక్షమువలనను, వైద్య జ్యోతిషముల వలనను, మంత్రశాస్త్ర ప్రజ్ఞ వలనను, పురాణ ప్రవచనముల వలనను ధనము నార్జించి మతములను కట్టుకొనిరి. మరికొందరు స్వాములు కఠినతరము లగు తపోనుష్ఠానముల గావించి తమ యపూర్వ మైన తపోమహిమల వలన, గో భూ హిరణ్యాదులను సహజముగ నార్జించిరి. ప్రజలు వారి వారి స్వార్థముల ననుసరించి స్వాములకు, తపస్సిద్ధులకు, ధన కనకాదుల నర్పించి ఆరోగ్యైశ్వర్య సంతానాదులను బడయుచుండి రనుటలో ఆశ్చర్యము లేదు. ఫలానా పనిచేయు డని కాని ఎల్లకాలము తమ స్వల్ప ధనము నిలవ యుంచ వలసిన దని కాని అట్టి మహామహులు మఠములలో సేవ జేయవలసిన దని

గాని ధనమెవ్వరును ప్రాచీనకాలమున నిచ్చియుండలేదు. కొందరికి విద్వత్తు వలనను సంపత్తు లభించెను. అనగా మఠాధికారులు నానావిధముగ కష్టించి తమ స్థలములు తమవే యను భావమున తమ యాస్తిని పెంపొందించుకొనిన వారును, వ్రియపరచు కొనినవారును కలరు. కొందరికి కొన్ని పనులనిమిత్తనే (సార్విసు లేక ఖిద్మతు కొరకు) వచ్చిన యాస్తులును ఉండవచ్చును. అవి యావిధముగనే వినియోగింపబడవలెను. కాని యవి యానువంశికములు మాత్రమే అయ్యున్నవి. వారినుండి ఆ యాస్తులను బలాత్కారముగ లాగుకొనుటగాని అర్చకత్వాది స్వల్పవృత్తులకొరకు సీయబడిన భూధాన్యాదుల యాదాయము లెక్కల నడుగుటగాని న్యాయ్యము కానేరదు. తమ యింటిలోని దేవాలయము ప్రజలకు గలిగిన లాభాదులవలన కాలక్రమముగ ప్రబల మగుచో దానిపై నా యింటివారి యనుభవాధికారములే యుండవలెను. సర్వజనుల ద్రవ్యము వచ్చినదను కారణమువలన వారి హక్కు హరింపబడగూడదు. అనేక శిష్యుల గృహములనుండి ధనము సంపాదించినారు కావున గురువుల ధనముమీద శిష్యులకైనను అధికార ముండవలెనని కొందరు చెప్పుచున్నారు. ఇక్కడ కొంత సహృదయతతో విచారింపవలసి యున్నది. కావున తొందర పడకూడదు.

ధనకనకాది వస్తువులును, ఆస్తియును లోకములో నెవరికి లభించినను బహుళః అది సర్వజనులనుండియె సంగ్రహింపబడును. ఒక వైద్యుడు గ్రామస్థులగు సర్వ జనుల ఆనుగుణ్యమువలన నొక భూమిని లేక గృహమును సంపాదించుకొను నను కొనుడు. కాలాంతరమున వైద్యుడు తన వైద్యవృత్తిని వదలుకొనినపుడు వాని యాస్తిమీద గ్రామజనుల కెట్టి హక్కును ఉండజాలదుకదా ? ప్లీడరును, (వకీలు)ను, సర్వజనులనుండి యర్థమును సంపాదించును. వైశ్యుడు (వ్యాపారి) సర్వజనులలో తన చాకచక్యము నుపయోగించి అధర్మములద్వారాను ధనరాసుల గడించుచున్నాడు. ఇక రాజులమాట చెప్పనక్కలేదు. ఇట్టి వ్యక్తులయొద్ద నుద్యోగముల (గుమాస్తాపని) జేయువారి యాస్తియు సకల జనులనుండి వచ్చినటులే యగుచున్నది. వీరి యాస్తి యంతయుస్వ స్వ వృత్తులవలన సంపాదింపబడినది కావున దానిపై సార్వజనికాధికారము రాదని చెప్పుదురేమో? స్వాములకు గురువులకు మఠాధికారులకు శిష్యోపదేశ పౌరోహిత్యాదులు వారి స్వవృత్తులు కావని యెట్లు నిర్ణయింపబడెను? సన్యాసుల ఆస్తి ధార్మిక మనియును ఇతరుల ఆస్తి అధార్మిక మనియునువెవరైన చెప్పినచో నది యవిచారిత రమణీయమే కాని సత్యము కానేరదు. ఒకవిద్యార్థి సకల జనుల చందాలవలన, భిక్షాటనవలన, బి. ఎ. పట్టమునంది ఉద్యోగము సంపాదించుకొని వివాహితుడై సంతానము నందు ననుకొనుడు. ఇట్టి వ్యక్తియొక్క ఆస్తి సార్వజనిక

మనియేనా న్యాయాధీశుల నిర్ణయము ? భిక్షము నెత్తుకొనుట సులభ మని కొందరు భావించిన ట్లున్నది. ఎందరి తిరస్కారములకులోనై ఎన్ని యిక్కట్టులనందినచో భిక్షము లభించునో, అట్లెంతకాలము పరితపించిన ఆస్తి యేర్పడునో సామాన్యులు గ్రహింప జాలరు. అనగా తమ యాస్తులను దుర్మార్గమున వ్యయపరచగలందులకై మఠస్థులను ప్రోత్సహించుచున్నా నని విపరీత భావన నెవరును గల్పించుకొనగూడదు. తమ వృత్తులవలన కష్టించి సంపాదించిన ద్రవ్యమును వ్యయపరచుటకు ఇతర మానవులవలెనే మఠస్థులకును వ్యక్తిస్వాతంత్ర్య ముండవలె ననియే నా ధార్మిక వాదము. ఏ వ్యక్తులకును అధార్మికముగ వర్తించుటకు నవకాశము లుండగూడదు. వీరశైవుల మఠములును, ఆస్తియును, ఇట్టిస్వతంత్రమైన వ్యక్తిత్వము గలిగియున్నవి. వీరి మఠములలో పూజ్యులైన యనేక పూర్వపురుషుల సమాధులును, వానిపై ప్రతిష్ఠింపబడిన లింగములును మంటపములును జూచి యివి దేవాలయము లనియును, వీని పూజాదిభోగములకై మఠములును ఆస్తియును ఇయ్యబడిన దనియును కొందఱు అతిసాహసముగ వాదింపదొడగినారు. ఇది కేవలము మిథ్య. ఆయా వ్యక్తులయొక్క పూజ్యతలనుబట్టి వారి వారి సమాధులకును ఆధిక్యము కలుగుట సహజము. తమ తమ మనోరథములు సిద్ధించుట వలన ఇతర జనములును కానుకలు సమర్పించుకొనియుందురు. సహజముగ లభించిన ఇట్టి స్వల్పధనమునకు మఠస్థుల పూర్వీకులైన పుణ్యపురుషులు కారణముగాని ఇతరులు కానేరరు. సమాధుల కర్పింపబడిన ద్రవ్యమువలన వీరశైవుల మఠములలోను ఆస్తి కుదుర లేదు. పైగా ఇట్టి సమాధి లింగపూజను సదా పూజించుటయు, వీరశైవాచారమునకు విరుద్ధము. ప్రతి వీరశైవునకును ఇష్టలింగధారణ కలదు. దీనికే నిత్యపూజ గావింపవలెను గాని ఇతర స్థావరలింగపూజను వృత్తిగా నాచరించుట దోషాస్పదము. ఇట్టి పరిస్థితులుండగా వీరశైవాచార్యులకు మఠములలోని సమాధి లింగపూజలు గావించుటకై స్థిరాస్తులు దాన మొసంగ బడినవని చెప్పుట ఎంత ప్రమాదమో ఆలోచింప దగియున్నది. కొందఱు తెలిసియో తెలియకయో "మఠమునకు భూమికల"దనియును "మఠమునకు ఆస్తి కల"దనియును చెప్పుదురు. మఠమే ఒకరి ఆస్తియైయుండగా మఠమునకు మరల నొక యాస్తియనుట పొసగదుకదా ? ఆస్తికి ఆస్తియుండజాలదు. ఒకడు తన గుర్రమునకు సౌకర్యము కొరకై కళ్ళెము గంతబొంతలు, ఆభరణములు వగైరాలను జేయించు ననుకొనుము. ఈ యాస్తి గుఱ్ఱముదని వాదించుట పరిహాసాస్పదము గాక మానదు. గుర్రముగలవాడే ఆ యాస్తిని సంపాదించెను. కాని గుర్రముకాదు. బహుశః మఠముల నన్నిటిని ఆ యా వ్యక్తులు తమ ప్రభావమువలన సంపాదించుకొని కాలక్రమమున స్థిరచరాస్తులనుగూడ గడించుకొన్నారని మఠములే ఆస్తిని సంపా

దించుకొన్నవని యెంచుట సత్యము గానేరదు. ఎక్కడనైనను సకలజనులు జేరి ఒక పెద్ద మఠమును గట్టించి ఆస్తినిగూర్చి ఒక గొప్ప స్వామిని అన్వేషించి తెచ్చియిచ్చిన ఉదాహరణములు ఒకటి రెండైనను దొరకునో లేదో! తపస్సంపన్నులైన పూర్వపు వీరశైవాచార్యులు తమ యిష్ట లింగపూజా వైభవముల కొఱకును నిత్య కృత్యముల కొఱకును సంపాదించుకొనిన స్థిర చరాస్తులను తమ వంశస్థులకో, శిష్యులకో సంక్రమింపజేయుట సహజమే కద! వారి వారి శక్తిపాతములను బట్టి ఆ యాస్తి వృద్ధి క్షయములను పొందుటయు గాన నగును. ఒక తండ్రి యాస్తిని అనుభవించుటలో పుత్రునకు గల హక్కులే ఒక గురుని యాస్తిని అనుభవించుటలో శిష్యునకును కలుగగలవు. అట్టి యధికారమే లేనపుడు లౌకిక భోగముల వదలి బ్రహ్మచర్య దీక్షను లేక సన్న్యాసాశ్రమమును స్వీకరించి మఠాధిపతి కా నవసరము లేదు. కావుననే మఠాధిపతులకును దేవాలయములలోని యర్చకులకును, చాల వ్యత్యాసము కలదు. ఫలానా పని కొఱకే ఇయ్యబడిన దనుటకు నిశ్చితమైన ప్రమాణములు లేనపుడు అది మఠాధిపతుల స్వంత ఆస్తి క్రిందనే పరిగణింప బడవల యును గాని గ్రామస్థులయొక్క వ్యక్తి గతములైన విరోధములనో అబద్ధపు సాక్ష్యములనో ఆధారము చేసికొని ఆస్తి సార్వజనిక మని నిర్ణయించుట సరికాజాలదు. ఒకవేళ ఒకప్రత్యేకమైన పనికొఱకే దానము పుట్టిన దని స్థిరపడి నపుడు దానిని ఆ వంశపరంపరాగతులైన కుటుంబికులో, స్వాములో, నిర్వహించు టకు సంపూర్ణాధికారములు కలిగి యుండవలెను కాని బలాత్కారముగ నింకొకరికి సంక్రమింపజేయుట అక్రమము. గ్రామాధికారు లగు మునసబు (పటేల్) కరణము లకును ఆనువంశపు (ఖ్యామలీ, ఖాందానీ) హక్కులు కలవుకదా! చివరకు కళా వంతు (గంధర్వు)లకు సైతము ఇనాంభూములు మున్నగునవి స్వాధీన పరుపబడినవి కదా! ఎన్నియో సంవత్సరములనుండి ఆస్తులను గడించి రక్షించుచు వచ్చిన మఠ స్థులయొక్కయు, కొందఱు అర్చకుల యొక్కయు అనుభవాధికారములు సురక్షిత ముగా నుండవలె ననుట న్యాయమే యగును. మఠాధికారుల యొక్కయు మఠముల యొక్కయు స్థిరచరాస్తులనుగూర్చి యెంత శ్రద్ధగా పరిశీలించవలసియున్నదో మఠ మన్నంత మాత్రమున ఒక సార్వజనిక ప్రదేశమనియో, సన్న్యాసినివాస మనియో నిర్ణయించుట ఎంతటి పొరపాటో గమనింపదగి యున్నది.

దానములు

దాన మనునది యొకపుణ్యకార్యము. హిందువుల సమస్త శుభాశుభకర్మ లందును చివరకు నిత్యమును ఇవి చేయబడుచున్నవి. పూర్వపుణ్య వశమునగాని మను ష్యులకు నిట్టిపవిత్రమైన దానావకాశము దొరకదు. భగవత్సన్నిధినిగాని, భగవ

ద్భక్తునకుగాని, మహనీయునకుగాని, గురువునకుగాని, విద్వాంసునకుగాని, వానిని శివస్వరూపునిగా భావించి తాను దాతననెడి భావములేక ఒకరి యాచనలేకయే సమర్పించు దానమునకు సహజదాన మని పేరు. ఇది అత్యుత్కృష్ట దాన మని శాస్త్రములలో ప్రశంసింప బడుటయే కాక పుణ్యపురుషు లందఱును ఈ మార్గమునే అవలంబించిరి. వీరశైవాచార్యులును, మఠస్థళికలును, గురుస్థళికులును, ఇట్టి సహజ దానముల వలన తమ మఠమందిరాది యాస్తులను సంపాదించినారు.

అనాధులగు కుంటి, గ్రుడ్డి, వారలకును, జీవజంతువులకును శివార్పణ బుద్ధితో దానము చేయుచో నది నిరుపాధిక దాన మనబడుచున్నది. ఇదియు నుత్తమమైన దానమేకాని వారికి హితము కలిగించవలె నను తలంపు అహంభావముతో కూడియున్నది. కావున నీదానము మధ్యమ తరగతికి చెంది యున్నది. తానిచ్చిన దానము శాశ్వతముగా నుండవలయుననియో ఫలానాకార్యమునకు మాత్రమే వ్యయపరచవలయుననియో ఇచ్చునది సోపాధిక దాన మనబడుచున్నది. దీనివలన లోకోపకారము గలుగుచున్నను, ఎవరికిని మనస్ఫూర్తిగ ననుభవించుట కవకాశము లేనిది కావున నీదానము కనిష్ఠమనబడినది. ఇట్టి దానములు చేసినవారును తీసికొనినవారును, ప్రాచీన వీరశైవలోకమున లేరనియే చెప్పవచ్చును. వీరశైవాచార్యులకు, గురువులకు లభించిన దానము శివార్పణబుద్ధితో వచ్చినది కావున అది శివస్వరూప మగు సమాజ కైంకర్యములలో వినియోగపడ వలెనే కాని, మఠాధిపతులు స్వయముగా ననుభవింప గూడదనియును, మఠములు సార్వజనికము లనియును ఒక వీరశైవ సోదరుఁడు మరాఠిపత్రికలో వ్రాసెను. కాని ఇది వీరశైవ తత్త్వమునకు విరుద్ధము. గురునకు తను, మనోధనములను నిష్కామ బుద్ధితో నర్పింపవలసి యుండగా ఒక మరతుతో కనిష్ఠదానము నొసంగవలసిన యవసరమే లేదు. గురుఁడు తన ద్రవ్యమును దుర్వ్యయము పరచుచో ఆ దోషము గురునకే కాని తనకు రాదు. తాను నిరపేక్ష బుద్ధితో సర్వము శివార్పణముగా నెంచిన ఈవిధమే సర్వశ్రేష్ఠము. యాచకులు సైతము దేవతుల్యు లని భావింపవలసి యున్నది. ఎట్టి పాపాత్ముని యింటికడనైన నేగి దానము చేయించి పుణ్యము నిప్పించు చున్నాడు. కాని నేటి కాలమున భిక్షును గర్హించుచు యాచకుని తెగదిట్టి నెట్టుచున్నారు. పెద్ద పెద్ద సంఘముల ద్వారా ప్రోగుచేసి దుర్వినియోగ పెట్టబడుచున్న లక్షలకొలది "చందాలు"ను మనుష్యులకు శ్లాపాంతరముతో చేయబడిన భిక్షయే యని మన అమాయకులు దెలియజాలరు. తన పోషణకై భిక్షము నెత్తినవ్యక్తి చాల జాగ్రత్తగా వాడుకొనుచున్నాడు. సంఘముల పేరిట ఎత్తబడిన చందాలు నిర్దాక్షిణ్యముగా వ్యయపెట్టబడు నను రహస్యము నెరిగిన వివేకధనులు కొలదిగా నుందురేమో! రాజాధిరాజులకు యాచన

తప్పక పోయినను బీద లగు యాచకులను నిరంకుశముగ బంధించుటకై ఆక్టు (ఖానూను) లను సిద్ధపరచు మహాశూరులు ఒకవైపు గుమిగూడుచున్నారు. నిరుద్యోగులకు ఉద్యోగమును జూపించు పురుషార్థ సాధకులు లేనందువలననే కులవృత్తులను దూరభార మాలోచింపక నడుగంటించుచు పాశ్చాత్యుల నంధముగ ననుకరించుచున్నా రనవలసి వచ్చుచున్నది.

## హిందూ ధర్మాదాయముల బోర్డు

లక్షలకొలది మఠములు గల ఉత్తర దేశమునగాని, బొంబాయి ప్రాంతమునగాని, మఠమందిరముల మీద నాధిపత్యము వహించు ప్రభుత్వమువారి సంస్థలు లేవు. కొన్నివేల చిన్నమఠములు గలిగినట్టియు, కొలదిగ మాత్రమే పెద్ద మఠములు గలిగినట్టియు మద్రాసు ప్రాంతమున మాత్రమే హిందూ ధర్మాదాయముల బోర్డు (Hindu Religious Endowment Board)అను ప్రభుత్వమువారి సంస్థ యొకటి పుట్టినది. హిందువులలో జాతిగత వైషమ్యముల వలననే ఇట్టి ధర్మాక్రమణ సంస్థ పుట్టి తమ కుండెడు హక్కులను అపార్థు లగు హిందువులు ప్రభుత్వమువారి యధీనము జేయుచున్నారు. స్వాతంత్ర్యపోరాట మొకవైపుండగా తమ యాస్తులను పరాధీన పరచుకొను అద్భుత సమాచారమునకు నీ ధర్మాదాయముల బోర్డు ఉదాహరణము కాగలదు. ధార్మిక విషయములలో జోక్యము పుచ్చుకొనమని బ్రిటీషు ప్రభుత్వము వా రిచ్చిన ఆశ్వాసనము శిథిలమగుటకు హిందువులలోని పరస్పర కలహములే కారణము. తమలో తాము సంప్రదించుటకును తమ సిద్ధాంతమును స్థిరపరచుకొనుటకును సామర్థ్యముచాలక చీటికిమాటికి ధర్మవిషయమైన తీర్మానములను గౌర్నమెంటువారి కౌన్సిళ్ళద్వారా నిర్మించుకొనుచున్నను, అవి హిందువులలో కలహములను పెంచుటకు తోడ్పడుచున్నవేకాని శాంతిని నెలకొల్పుట లేదు. ఏది యెటు లున్నను ధర్మాదాయసంస్థల భద్రతకై ఏర్పరుపబడిన ఈ బోర్డువలన కొన్ని దేవాలయములు కొలదిగ బాగుపడినను మఠముల స్థితిగతులు చాలవరకు అడుగంటిన వనియును, బోర్డు నిర్మాణవిధానములు అంధకారబంధురముగ నున్న వనియును చెప్పుటకు విషాద మగుచున్నది. ఈ బోర్డువారి శాసనప్రణాళిని (ఆక్టు) దెలుపు పుస్తకముకూడ లోపభూయిష్ఠముగ నున్నది. ఇందులకు కారణమేమనగా అనుభవము గల వివిధ సంప్రదాయపు మఠాధికారులనుగాని, ధార్మిక పురుషులనుగాని చక్కగా సంప్రతించి చర్చించి యీ యాక్టును సిద్ధముచేయ లేదని చెప్పవచ్చును. కొందరి ఆంగ్లవిద్యాబలమునే ముఖ్యముగా నవలంబించి వ్రాసినందున కాబోలు అనేక అనర్థములకు తావిచ్చుచున్నది. తమ యిష్టానుసారము పాలించుటకు గావలసిన నియమములను నిర్మించుకొనిరేకాని, మఠముల సౌకర్యములుగాని విశేషవివరణముగాని ఆక్టుకు గురియే కాలేదు.

ఈ బోర్డు అధికారులలో గొందరికి గొప్ప గొప్ప మాసికవేతనములు కలవు. కొన్ని వేలమందికి బోర్డు ఉద్యోగముల నిచ్చిన దని చెప్పినను చిరకాలమునుండి ఆనువంశికముగ తమ వృత్తులవలన పోషణ గలిగియున్న అనేకమంది మఠాధికారుల జీవితములు సంశయసాగరమున గూల్పబడిన వనుటయు సత్యేతరము కాదు. ఈ బోర్డు కేవలము ధార్మికసంస్థల పాలనకై పుట్టినను ధార్మికసంస్థల తగవునుండి యెన్నుకొన బడిన ఒక వ్యక్తిగాని బోర్డులో లేడు. ధార్మిక సంస్థలకు సంబంధించిన ఆచార ముల విషయములలో బోర్డుకు ఎంతవరకు ఆస్థ కలదో లేదో తెలియదుకాని ఇట్టి సంస్థలను స్వాధీనము చేసికొని తమ యిష్టానుసారము నిర్వహించుటకు ఎట్టి సక్రమ అక్రమ ప్రయత్నముల నైనను చేయుటకు బోర్డు వెనుదీయ దని మాత్రము గట్టిగా చెప్పవచ్చును. బోర్డువ్యవహార నాటక మిటు లుండును.

ఏ మఠమున కైనను దానియాదాయమునుబట్టి మొదలు కంట్రిబ్యూషన్ (బోర్డువారికి పరిపాలన రుసుమ్) చెల్లించ వలసిన దని సౌమ్యముగా చెప్పుదురు. ఇది యెందులకని యడిగినచో మీది ధర్మసంస్థ కావున చెల్లించవలె ననియును, మీ లెక్కలతో మాకు పనిలే దనియును బుజ్జగింతురు. అమాయకు లగు మఠాధికారులు ధర్మ సంస్థలవారు తమసంస్థ స్వతంత్రమా, సార్వజనికమా అను విషయమును తేల్చు కొనకుండగనే రుసుమును చెల్లించి బోర్డువారి వలలో బడుదురు. కొన్ని దినములు గడిచిన పిదప మఠవిరోధు లెవరైన బోర్డుకు పిటీషను నొకటి వేసిన చాలును. అధి కారి యొకరు రాగమించి ఒక గడియలో విచారణను ముగించి మఠాధికారి యొకరే సరిగా నిర్వహించజాల రనియును, వారికి తోడుగా సహకార ట్రస్టీని నియమించు చున్నామనియును ఇరువురు కలిసి లెక్కలను సరిగా నుంచ మనియును ఆర్డరు వేతురు. ఇక్కడినుంచి కథ అడ్డముగా తిరుగ నారంభించును. మఠాధికారికిని, ట్రస్టీకిని, అభిప్రాయభేదము లేర్పడును. ట్రస్టీ బోర్డువారి పక్షము నవలంబించును. గగ్గోలు జరుగగా మరియొక మేనేజింగ్ ట్రస్టీని వేతురు. ఇంతటితో బోర్డువారి బలము ప్రవర్ధమాన మగును. మఠాధికారికిని మతీయులకును విరుద్ధములైన ఎన్నిక్రియలను ట్రస్టీలు చేసినను ప్రజలు ట్రస్టీల అక్రమమునుగూర్చి యెన్ని మహజర్లు పెట్టుకొనినను విచారణ జరుగజాలదు. జరిగినను ఒకరోజులో నాలు గైదు మఠముల కేసులనో, నాలు గైదు గ్రామములనో బోర్డువారి యధికారి పరిశీలించవలసి యుండును. ఇకన్యాయము గలుగుట కవకాశ మెట్లుండునో చెప్ప నవసరము లేదు. మఠము ఆదాయము ట్రస్టీల చేతులలో నుండును కావున మఠాధికారిని పీడించుటకు మంచి అవకాశము దొరకును. ప్రజలచేత ఎన్నుకొనబడిన ట్రస్టీల అక్రమమును ప్రజలే మఱల దెలిపినను బోర్డు వారు వినరు. ఈ లోపుగ ట్రస్టీలు బోర్డువారును ఏక మయి నిరంకుశ పాలన మారం భింతురు. స్వామికి భోజనవసతి, నివాససౌకర్యములు కూడ పోవచ్చును. స్వాములు

బహుశః ఈ వ్యవహారము దెలిసినవారు కారు కావునను మఠము ఆస్తికాని కాగిత పత్రములుగాని ట్రస్టీలఅధీనములో నుండుటవలనను దావాలు వేసి కోర్టుద్వారా తమ యాస్తిని రాబట్టుకొన జాలరు. ఎవరైన తెలివికల వారు కోర్టు వ్యవహార మారంభించినను, అత్యధిక మైన వ్యయ ప్రయాసములే కాక దీర్ఘకాలమున కాని తేల జాలదు. బోర్డువారి ఆర్డరులు, విచారణలును సరియైనవి కానందున ఎవరైనను చివరకు కోర్టు కెక్కవలసియే యుండును. మఠాధిపతులు, దేవాలయ ధర్మకర్తలు అన్యాయముగ ప్రవర్తించినపుడు ఉపాయ మే మని యడుగవచ్చును. వ్యక్తిగతములైన మఠముల మీదను, ఆస్తుల మీదను ఇతరులకు సంబంధము లేదు కావున నావిషయమున వ్యర్థముగ సంబంధము కల్పించుకొన నక్కరలేదు. ఇక సార్వజనిక సంస్థల అన్యాయము గనుపడినపుడు ఆ యా తాలూకా కోర్టులలోనే సక్రమముగ వ్యాజ్యము వేసి న్యాయము తేల్చుకొనవచ్చును. కావున ప్రత్యేకమైన బోర్డు అవసరము లేదనియే తేలుచున్నది. బోర్డు వ్యవహార మన్ననో ప్రతి విషయమునను మద్రాసు ఆఫీసుతో వ్యవహరించవలసి యుండును. సంస్థలలో నెట్టి విపరీతములు జరిగినను త్వరగా పరిష్కారము కాదు. పైగా అనేక మఠములను స్వాధీన పరచుకొనుటకే బోర్డువారును పై అధికారులను మెప్పించుటకు బోర్డువారి చిన్న యధికారులును ప్రయత్నించుచున్నందువలన నేడు వందలకొలది మఠాధికారులు బోర్డువారి మీద దావాలు వేసుకొన్నారు. వ్యక్తిగతములైన ఆస్తులుసైతము అనేకముగా నిందు చిక్కుబడి యున్నవి. వీరశైవ గృహస్థమఠములును, పుత్రవర్గ మఠములును బోర్డు క్రిందికి లాగబడుచున్నవి. ఇది యంతయు నొక విపరీతమైన సమస్యగా పరిణమించుచున్నది. సర్వమతముల మఠాధిపతు లందరును ఒక మహాసభను గావించి బోర్డుయొక్క వ్యవహారముతో సంబంధములేకుండ కట్టుదిట్టములను జేయవలసి యున్నది. లేక అవసర మగుచో సత్యాగ్రహమునైన ఆరంభింపవలసి యుండును. ఏ ప్రాంతమునందును, ఏమతము వారి మీదను లేని ఈ బోర్డు మద్రాసు హిందువుల మీద నెందులకు బలాత్కారముగ స్థాపింపబడినదో తెలియదు. ఇట్టి లోపభూయిష్ఠ మైన ఆక్టు బొంబాయి ప్రాంతమునను నిజాంరాజ్యమునను ప్రచారమునకు తేబడు నని మరికొన్ని వదంతులు కలవు. ఆ యా ప్రాంతపు మఠస్థు లందరును త్వరగా మేల్కొని ఇట్టి యన్యాయములు జరుగనీయ కూడదు. అన్నిమతముల గృహస్థులందరును తమతమ ధర్మానుసారము నడచుకొనుటకు ఆక్టులు పుట్టినపుడే మఠస్థుల మీదను ఆక్టును వినియోగించ వలె ననుటయే న్యాయము కావున సకలజనులును నీ విషయమున చక్కగా నాలోచించి సార్వజనిక ధర్మమును నిర్వహింపవలె ననియే నా హృద్గతాభిప్రాయములను ప్రకటించినాను.

—విభూతి సంపాదకుడు

# శ్రీశైల జగద్గురు పట్టాభిషేకము

స్వస్తిశ్రీ శా॥ శ॥ ౧౮౬౨ విక్రమ సంవత్సర ఆషాఢ (మిథునాషాఢ) శు॥ ౨ భానువారము (7-7-1940) ప్రాతఃకాలము ౯ గంటలకు శ్రీశైల జగద్గురు సూర్య సింహాసనము యొక్క నూతన పట్టాభిషేక మహోత్సవము అత్యంత వైభవముగా జరిగిన వార్తను పాఠకులిదివరకే తెలిసికొని యున్నారు. పూర్వపు జగద్గురువుల వారైన శ్రీనాగలూటి భిక్షావృత్తి శివాచార్య మహాస్వాములవారు వృద్ధావస్థలో నున్నందున నాలుగైదు సంవత్సరముల నుండియే ఉత్తరాధికారమునకై యోగ్యుడైన వ్యక్తిని అన్వేషించుచునే యుండిరి. గతమాసమున తమ దేహాలస్యము కొంత యెక్కువ కాగానే ఉజ్జయినీ సద్ధర్మ సింహాసనాధీశ్వర శ్రీ జగద్గురు సిద్ధేశ్వర మహాస్వాములవారిని ఆహ్వానించుకొని ముందు నిర్వహింప వలసియున్న పట్టాభిషేకమునకు సంబంధించిన సమస్తాధికారములను అప్పగించిరి. తత్క్షణమునవే ఉజ్జయినీ జగద్గురువులవారు పట్టాభిషేక ప్రయత్నములను గావించుచు కేవలము టెలిగ్రాముల ద్వారా వీరశైవ ప్రముఖులందఱికిని ఆహ్వానముల బంపించి సమస్త సులక్షణములుగల వటువును సైతము నిశ్చయించి సర్వసిద్ధముగ నీ సుమహోత్సవమును నిర్వహింప జేసిరి. ఉత్సవమునకు బళ్ళారి, హోసపేట, బెంగళూరు, బీరూరు, హరిహర, దావణగెరె, బ్యాడిగి, హుబ్బళ్ళి, బార్సి, సొండూరు, ఆదవాని, హావేరి, సత్తిగేరి, కడకోళ్ళ, హిరేహాళు, హోళగంది, మోకి, సికిందాబాదు, మద్దిగేరి, మొదలైన దూరస్థలములనుండియు పరిసరములనుండియు. శ్రీ పట్టచరాధికారులును స్వాములును పండితులును ప్రముఖులును అగు భక్తమాహేశ్వరులు తండోపతండములుగావచ్చిరి. పట్టాభిషేకము వైదికవిధిని పండిత చిదిరె మఠము వీరభద్రశాస్త్రిగారు, వే॥ గురులింగశాస్త్రిగారు, వే॥ సోమశేఖర శాస్త్రిగారు, వే॥ అయ్యప్పశాస్త్రిగారును నెరవేర్చిరి. * సుముహూర్తపు దినమున శ్రీశైల జగద్గురువుల వారి యారోగ్యము సరిగా నున్నందున వారి యనుమతి ప్రకారముగానే శ్రీ ఉజ్జయినీ జగద్గురువులవారు సమస్తకార్యముల నాదేశించుచుండిరి. కావ్యతీర్థ వేదాంతాచార్య కవిరత్న బిరుదాంచితులును ధారవాడజిల్లా రాణిబెన్నూరుతాలూకా ముదెనూరు పెద్దమఠము అధిపతులును, శ్రీశైలపండితారాధ్య శాఖా వృషభగోత్ర సంభూతులును అగు శ్రీ వాగీశ శివాచార్యులవారికి విధ్యుక్తముగ పట్టాభిషేకము జేయబడి "శ్రీజగద్గురు వాగీశ పండితారాధ్యశివాచార్య మహాస్వాములవారు" అని ఉజ్జయినీ శ్రీజగద్గురువులవారిచే ప్రకటింపబడిరి. మంగళారతి మంత్ర పుష్పాదులతో విధి సమాప్తమై షడ్రసోపేతముగ గణార్చనయు జరిగెను.

సాయంకాలము ౭ గంటలకు సభామంటపమందలి సింహాసనముపై నూతన శ్రీజగద్గురువులవారును ఉజ్జయినీజగద్గురువులవారును ఆసీను లగుచుండగా క్రిక్కిఱిసినజనస్తోమము శ్రీజగద్గురు పంచాచార్యుల జయఘోషల జేయుచు తమ యానందమును వెలిబుచ్చుచుండెను. బళ్లారి శ్రీగురునివాస సంస్కృతపాఠశాలా విద్యార్థులు ఆచార్యస్తుతిని గావించిరి తరువాత ప్రముఖుల ప్రార్థన ననుసరించి శ్రీజగద్గురు వాగీశపండితారాధ్య మహాస్వాములవారు తమ భవ్యమైన దివ్యసందేశమును ఉపన్యాసమూలకముగా ననుగ్రహించిరి. తరువాత కానుక లర్పింపబడెను. శ్రీరంభాపురి (బాళేహళ్లి) శ్రీ ఉజ్జయినీ జగద్గురువులవారి కట్నములు చదివింపబడెను. బెంగళూరు మ॥ రా॥ షరాఫ్ బసవప్పగారు బంగారు కిరీటమును హుణసమారనహళ్లి శ్రీపట్టపు దేవరగారు ౧౦౧ంటల శివపూజా సామగ్రిని ఇంకను ఇతర ప్రముఖులు చాలమంది వెండిపాత్రలను రూపాయిలను కానుకగా సమర్పించిరి.

తరువాత పండిత చి॥ మ॥ వీరభద్రశర్మశాస్త్రిగారు నూతనజగద్గురువులవారి కాశీవిద్యాభ్యాసాది విశేషములను సదాచారాదులను గూర్చి స్వానుభవపూర్వకముగ కన్నడమున నుపన్యసించిరి. అక్కడి ఆంధ్రుల ప్రార్థనవలన శ్రీపండితారాధ్యపీఠచరిత్రను ఇతిహాసశాస్త్ర ప్రమాణములతో

---

* పట్టాభిషేక చిత్రము ఈ సంచికలో ప్రకటింపబడినది. చిత్రములో కుడివైపు విద్యానిధి శ్రీ చి. మ. వీరభద్రశర్మగారును, [illegible] వేదాంతాచార్య శ్రీ నీలకంఠ శివాచార్యులును కలరు.

రెండు గంటలవరకు ఆంధ్రమున నుపన్యసించుచుండ కరతాళధ్వనులు చెలరేగెను. పండిత శ్రీశంకర శాస్త్రిలవారు పీఠాచార్యుల లక్షణ కర్తవ్యములను గూర్చి సుబోధముగా కన్నడమున నుపన్యసించిరి. తరువాత బళ్ళారి వే॥ నాగేశశాస్త్రిగారును వే॥ సోమశేఖర శాస్త్రిగారును పి. ఐ. హిరేమఠము వకీలుగారును శ్రీ పరండకర్ స్వాములవారును కన్నడమునను, మరాఠిలోను సంభాషించిరి. ఉజ్జయినీ శ్రీ జగద్గురువులవారి ఆశీర్వాదాత్మకమైన ఉపన్యాసముతో మంగళము గావింపబడెను. మరుసటిరోజు సాయంకాలము ౬ గంటలకు నూతన జగద్గురువులవారి అడ్డపల్లకి మహోత్సవము (ఊరేగింపు) ప్రారంభ మయ్యెను. 3, ౪ వేల జనసమూహముతో గుంతకలు నలువీధులలోను తమ్మనచెర్లలోను పోలీసు ఇన్స్పెక్టరుగారి చక్కని వ్యవస్థవలన సులభముగా సంచరించి ఉత్సవము రాత్రి ౧౨ గంటలకు మరల సంస్థానపీఠమునకు జేరెను. (ఊరేగింపు చిత్రమును పత్రిక మొదట ప్రకటింపబడినది) పూర్వ జగద్గురువు లయిన శ్రీ నాగలూటి ఓక్షావృత్తి శివాచార్య మహాస్వాములవారు పట్టాభిషేకోత్సవము జరిగిన తరు వాయి ఇరువది దినములవరకు కొంత ఆరోగ్యముగా నుండిరి కాని 31-7-1940 రోజున శివైక్యమునందిరి. జీవితకాలముననే తమ యుత్తరాధికారమును మరొకరికి అనుగ్రహించి పీఠము సంగతులను సరహస్య ముగ బోధించి మాటలాడుచునే శాంతముగ కైలాసపతిని గలిసిన శ్రీవారి మహిమ విశేషములను గుణ గ్రహణపారీణులు తెలియకపోరు*

( పంచాచార్యప్రభ - వీరశైవగర్జనలనుండి )

# శ్రీ మటికె నాగయ్య ధర్మనిలయ వార్షికోత్సవము

ఇదే శ్రీ విక్రమనామసంవత్సర శ్రావణ బ॥ ౧౦ బుధవారమున (28-8-40) సికిందాబ్రాదు శ్రీ మటికె నాగయ్యగారి ధర్మనిలయముయొక్క వార్షికోత్సవము గత సంవత్సరమువలెనే వైభవముగ నెరవేరినది. నిలయమందలి శ్రీ వీరభద్ర భద్ర కాళీ లింగమూర్తులకు విధ్యుక్తముగా గురుకుల విద్యార్థులచే అభిషేక పూజాలం కారములు చేయబడినపిమ్మట మంగళ నీరాజన మంత్రపుష్పములలో జనస్తోమము పాల్గొనెను. సరిగా మధ్యాహ్నము వరకు గణార్చన భోజనము లారంభ మయ్యెను. మొత్తము సాయంత్రమువరకు హైదరాబాదు సికింద్రాబాదు నగరముల 3౫౦ మంది వీరశైవులు పురుషులు, స్త్రీలు, విద్యార్థులు, బాలురు పాల్గొనిరి. రాత్రి దేవాలయ సన్నిధిని శ్రీ శివభజన సమాజమువారి సంగీతభజనయు గావింపబడి మంగళారతి ప్రసాదములతో ముగింపబడెను. ఉత్సవము శుభముగ నెరవేరినది. శ్రీ మటికె నాగయ్యగారి ధర్మము చిరస్థాయియై యభివృద్ధి నందుగాక ! ఈ కార్యమున శివ సేవా బుద్ధితో తోడ్పడిన వీరశైవ మహాజనులకు శ్రీ పరశివుడు మహదైశ్వర్యారోగ్య భాగ్యముల ననుగ్రహించుగాక !!

---

* స్మార్త జగద్గురువులగు శ్రీ పుష్పగిరి పీఠాధిపతులును ఈ 7-7-40 రోజుననే శ్రీ గింజ పల్లి లక్ష్మయ్య అనువారికి ఉత్తరాధికారము నొసంగి 11-7-40 తేదిని బ్రహ్మీభూతులైరని తెలియు చున్నది. శ్రీశైల క్షేత్రమునకు సంబంధించిన ఈ యుభయ పదములలోను ఇట్టిమార్పు ఏకకాలమున జరిగినది. —సం.

౧-౧-౪

...ర్శనాత్, "యో రుద్రోఽగ్నౌ" (తై. సం. ౫-౫-౯) ఇత్యా...
...శివస్యైవ సర్వాంతర్యామిత్వోపదేశాచ్చ సర్వదేవతామయ...
...త్వాదికం తస్యైవ సిద్ధం.

ఉత్తమమధ్యమాధమాధికారిభేదేన నానాదేవతోపాసనం న
...ద్ధం। "భేదాభేదాత్మికా శక్తిర్బ్రహ్మనిష్ఠా సనాతనీ" ఇతి స్మృతౌ
...శక్త్యాత్మకశక్తేరివ బ్రహ్మాధిష్ఠానత్వోపదేశాత్, నిరధిష్ఠానశక్తే
...భావాత్, శక్తిశక్తిమతోరభేదాచ్చ తత్కర్తృత్వం, తదాత్మకత్వం
...తస్యైవోపపన్నమితి న ప్రధానస్య సర్వకర్తృత్వం.

పుత్రాదికుశలవార్తాశ్రవణవత్ సిద్ధజ్ఞానస్యాపి ప్రవృత్తిహేతుత్వ
...ర్శనాత్ న వృద్ధవ్యాపారస్యైవ ప్రవృత్తిహేతుత్వం। బాలానాంమాతా
...పిత్రాదిభిః "అయం ఘటః, అయం పటః" ఇతి నిర్దేశేనసిద్ధార్థజ్ఞానోత్ప
...త్తిసంభవాత్, కావ్యాలంకారజ్ఞైస్తచ్ఛిష్యాణాం తదుపదేశేనసర్వార్థ
...జ్ఞానదర్శనాత్ । తస్మాద్వేదాంతవాక్యానాంబ్రహ్మణి ప్రామాణ్యమితి
...ద్ధం.

నను – "సిద్ధబ్రహ్మవిషయే శాస్త్రాణాం ప్రయోజనాదర్శనా
...ద్వేదాంతానాం కర్మవిధిశేషత్వం యుక్తం, న చ పాశనివృత్తిః ఫలం।
...న చ పాశః తద్భిన్నో వా తదభిన్నో వా? పునస్స సత్యో వా మిథ్యా
...వా? నాద్యః– శక్తివిశిష్టశివాద్వైతహానేః। న ద్వితీయః– మాయా
...పాశస్య సత్యత్వాత్సర్వదాసంసారాపత్త్యాముక్తేరసంభవాత్ ।మాయా
...ప్రవృత్తౌ న కోఽపి యత్నం కుర్యాత్ । అత ఏవ న తృతీయః।
...ద్వితీయే, పరమేశ్వరస్య నిత్యసిద్ధత్వేన ముముక్షుప్రవృత్త్యసంభవాత్,
...మోక్షదశాయాం వైషమ్యాభావాచ్చ। సర్వథా వేదాంతశాస్త్ర
...ప్రవృత్తిర్న సంభవతి ఇతి చేన్న.

గుణత్రయాత్మకపాశస్తు పరమేశ్వరాద్భిన్న ఏవ। తస్మాత్తన్ని

14

౧౧౪

వృత్తౌ స్వాభావిక చిచ్ఛక్త్యవచ్ఛిన్నశివాద్వైతహానిర్నసంభవతి, మాయాపాశస్యసత్యత్వేఽపినానిర్మోక్షప్రసంగః. ద్వైతాద్వైత మతాంగీకారాత్। న చ తత్ర మానాభావః —“బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి” (ముండక. 3—౨—౯) “బ్రహ్మభవనకామో బ్రహ్మవేదనం కుర్యాత్” ఇత్యాదిశ్రుతిప్రమాణసద్భావాత్। అవిద్యాయా మోక్ష కారత్వేనచిచ్ఛక్తేర్భిన్నత్వాత్తన్నివృత్తిశ్శివోపాసనేనైవ సంభవత్యే నివృత్తిర్నామ తత్కారణీభూతచిచ్ఛక్తౌ లయః“నాశః కారణలయః”ఇతి న్యాయాత్ । చరాచరప్రపంచస్యోపాదానకారణత్వాదవిద్యాయా న్నివృత్తిః కదాపి న సంభవతి, అతః బ్రహ్మవిదామపి సంసారప్రవృత్తి స్సంభవతి— ఇతి చేన్నైవం। “అనీశయా శోచతి ముహ్యమానః” (శ్వే. ౪-౭) “బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి” (ముండక. 3-౨-) “న చ పునరావర్తతే న చ పునరావర్తతే” (ఛాం. ౮-౧౫) ఇత్యాది శ్రుతిశతేషు బ్రహ్మవిదాం తదాత్మకత్వస్య పునరావృత్తిరహితత్వస్య చోపదేశాత్ । న చ బ్రహ్మవాచకపదేన తద్‌జ్ఞానసంభవాన్న విధేః ప్రయోజనమితి వాచ్యం । మంత్రాధ్యయనమాత్రేణ హోతవ్యద్రవ్య దేవతాజ్ఞానే సిద్ధేఽపి తద్ధోమావసరే “మంత్రై రనుస్మర్తవ్యం” ఇతి ప్రయోగవిధిదర్శనాత్ । తథాత్ర వేదాంతవాక్యవిధేర్న విరోధః.

నన్వత్రఉత్పత్తివినియోగాధికారవిధీనా మదర్శనాత్కథం ప్రయోగవిధిస్సంభవతి ? ఇతిచేన్న । “అమృతస్య దేవధారణో భూయాసం” (తై. శిక్షా. ౪) ఇత్యాదా ప్రకరణాదపరిహార్యత్వేనోత్పత్తి విధేస్సిద్ధత్వాత్పరశివలింగధారణదీక్షాం లబ్ధ్వా పరమాత్మానం పశ్యే దితివినియోగవిధిరుపపద్యతే । “తస్యాభిధ్యానాద్యోజనాత్తత్త్వభావా ద్భూయశ్చాంతే విశ్వమాయానివృత్తిః” (శ్వే. ౧-౧౦) “జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః” (శ్వే. ౧-౮) ఇత్యాదా పరశివధ్యాన ధారణయుక్తో మోక్షాధికారీ విధీయతే । తస్మాన్మోక్షకామో లింగ

సదా సిద్ధశివలింగధారణాత్మక శాంభవదీక్షాం లబ్ధ్వా షట్స్థలపరశివ బ్రహ్మజ్ఞానం సంపాదయేదితి రాత్రిసత్రిన్యాయేన ప్రయోగవిధిరుపకల్ప్యతే.

నను — "ఆత్మా వా అరే ద్రష్టవ్యః" (బృ. ౨-౪-౫) ఇత్యాదౌ బ్రహ్మజ్ఞానస్య విధిర్న సంభవతి । నిర్వికారస్య బ్రహ్మణః కర్మకారకత్వప్రసంగాత్ । విధిసంభవేఽపి ఉత్పత్తిప్రాప్తి వికృతి సంస్కారభావో న యుజ్యతే । కించ సక్తున్యాయేన స్వతంత్రపలాయ "సక్తుభిర్జుహోతి" ఇతివత్ — "ఆత్మనా పశ్యేత్" ఇతి కరణత్వ కరణేనాపి వక్తుమయుక్తం । నిర్వికారస్య బ్రహ్మణోఽ వైష మ్యాన్న బ్రహ్మజ్ఞానవిధిరుపపన్నః— ఇతి చేన్న । సర్వాధిష్ఠానస్య పరమాత్మనః ఉత్పత్తివినియోగాధికారవిధిత్రయాసంభవేఽపి ముముక్షోర్మోక్షఫలాయ విధిర్న విరుధ్యతే। అత్ర కో విధిరాశ్రీయత ఇతిచేత్ — విధిత్రయమప్యూహనీయం.

నను—చక్షుషా ఘటసిద్ధివత్ వేదాంతానాం న తథా బ్రహ్మ సిద్ధిః నిరపేక్షతయా చక్షుస్సంయోగేన "అయం ఘటః" ఇతి వస్తుజ్ఞాన ముపపద్యతే । శబ్దానాం తాత్పర్యపర్యవసానేన ప్రామాణ్యం । అతో వేదాంత వాక్యానాం బ్రహ్మజ్ఞానవిధాయకత్వం, బ్రహ్మప్రమాపకత్వం చాయుక్తమితి చేన్నైతన్నం। "సమిధోయజతి" ఇత్యాది వాక్యానాం పంచప్రయాజవిధాయకత్వతదనుష్ఠానవిధాయకత్వయోరుభయోరపివిధి వాక్యసిద్ధివద్వేదాంతానామపి బ్రహ్మప్రమాపకత్వం మోక్షోపకారక బ్రహ్మజ్ఞానం ప్రతి విధాయకత్వం చ సంభవత్యేవ.

నను—వేదాంతవాక్యాదేవ బ్రహ్మజ్ఞానసిద్ధిదర్శనాత్తద్విధినా న కించిత్ప్రయోజనం తద్జ్ఞానాదేవ విధిప్రయోజనసంభవాత్ ఇతిచేన్న- వేదాంతవాక్యైః పరోక్షత్వేన తద్జ్ఞానే సిద్ధేఽపి తదపరోక్షజ్ఞానాయ విధ్యుపపత్తేః । వేదాంతశబ్దజన్యజ్ఞానాదేవ న బ్రహ్మసాక్షాత్కారో

విధీయతే । సద్గురుకరుణాకటాక్షలబ్ధతదుపాసనాత్మకజ్ఞానాదేవ త
త్సాక్షాత్కారసిద్ధిః । అయమేవ శ్రౌతమార్గః। "ధ్యాత్వా మునిర్గచ్ఛతి
భూతయోనిం సమస్తసాక్షిం తమసః పరస్తాత్" (కై. ౧-౭) "తస్యా
ధ్యానాద్యోజనాత్తత్త్వభావాద్భూయశ్చాంతే విశ్వమాయానివృత్తిః"
(శ్వే. ౧-౧౦) "శ్రద్ధాభక్తిధ్యానయోగాదవేహి" (కై. ౧-౨) "బ్రహ్మ
వేద బ్రహ్మైవ భవతి" (ముం. ౩-౨-౯) "జ్ఞానసిర్మథనాభ్యాసా
త్పాశం దహతి పండితః" (కైవ. ౧-౧౧) "జ్ఞాత్వా దేవం ముచ్యతే
సర్వపాశైః" (శ్వే. ౧-౮) "ఈశం తం జ్ఞాత్వా అమృతా భవంతి"
(శ్వే. 3-౭) "ఆత్మన్యేవాత్మానం పశ్యేత్" "శంభురాకాశమధ్యే
ధ్యేయః" (అథర్వశిఖా 3) "తజ్జలానితి శాంతఉపాసీత" (ఛాం.
3-౧౪-౧) "ఇతి ప్రాచీనయోగ్యోపాస్స్వ" (తై. శిక్షా. ౬) ఇత్యా
దిషు మోక్షఫలాయ పరమేశ్వరోపాసనాత్మకజ్ఞానం ముఖ్యకారణత్వేన
విధీయతే। తథా చ స్మృతిః—

శ్రోతవ్యశ్శ్రుతివాక్యేభ్యో మంతవ్యశ్చోపపత్తిభిః।
ధ్యాత్వా చ సతతం ధ్యేయ మేతద్దర్శనహేతుతః॥
జ్ఞానం వస్తుపరిచ్ఛిత్తిర్ధ్యానం తద్భావకారణం।
తస్మాజ్జీవో భవేచ్ఛంభుః క్రిమివత్కీటచింతనాత్।

ఇత్యాదినా శ్రవణమననవిశిష్టధ్యానానుగతనిదిధ్యాసనమప్యు
పరశివసాక్షాత్కారే తత్తాదాత్మ్యే చ పరమకారణమితి నిర్దిశతి.

తస్మాత్సర్వ కామ్యకర్మనిషేధపూర్వకశివముఖోద్గతనిగమా
మోభయవేదాంతచోదితవర్ణాశ్రమోచితశివార్పితసకలకర్మానుష్ఠాన
సంపన్నచిత్తశుద్ధిలబ్ధావ్యభిచారపరమశివభక్తిపరవశశాంభవదీక్షితము
ముక్షూణాం సర్వోపనిషత్ప్రతిపాద్యసకలజగదుభయకారణత్వలక్షణ
శివోపాసనస్య విధేయత్వాత్. "తదుపాస్య" ఇత్యాదిషు శ్రుతిషు
పాసనావిధిస్తేషామేవోపపద్యతే. "శివఏకో ధ్యేయశ్శివంకరస్సర్వమన్యత్

త్యాజ్య"(అథర్వశిఖాః.)ఇత్యథర్వశిఖాయాం ముముక్షూణాం శివాతిరిక్తో పాసనం నిరస్తం।' తస్మాన్నాన్యథా సంసారమాయాపాశనివృత్తి సంభవతి. "క్షరంప్రధానమమృతాక్షరం హరః క్షరాత్మనావీశతే దేవ ఏకః, తస్యాభిధ్యానాద్యోజనా త్తత్త్వభావాద్భూయశ్చాంతే విశ్వమాయానివృత్తిః" (శ్వే.౧-౧౦) యదా చర్మవదాకాశం వేష్టయిష్యంతి మానవాఃతదా శివమవిజ్ఞాయ దుఃఖస్యాంతోఽభవిష్యతి॥(శ్వే.౬–౨౦) ఇత్యాదిశ్రుతిషు శివధ్యానధారణజ్ఞానాదేవ మోక్షరూపఫలం విధీయతే। తస్మాచ్ఛివ ఏవ పరబ్రహ్మ మోక్షకామైర్ధారణీయో జ్ఞాతవ్యో ధ్యాతవ్యః శ్రోతవ్యో మంతవ్యోర్చనీయ ఇతి షడ్విధలింగతాత్పర్యేణ బ్రహ్మపరా వేదాంతాస్తదుపాసనపరాశ్చేతి నిర్ణయః।

నను —"బ్రహ్మ సత్యం జగన్మిథ్యా'' ఇతి న్యాయేన సర్వవేదాంత 'విచారలబ్ధజగన్మిథ్యాత్వ జ్ఞానపూర్వకస్వస్వరూపజ్ఞానమేవ ముక్తిరితి చేన్న—సర్వవేదవేదాంతిబాహ్యత్వప్రసంగాత్ । కిం నామ జగన్మిథ్యాత్వం ? బ్రహ్మజ్ఞానబాధ్యత్వం ? త్రైకాలికనిషేధో వా? నాద్యః–బాధ్యబాధకభావస్యైవ తయోరసంభవాత్, న బ్రహ్మజ్ఞానేన ప్రపంచనిషేధో విధీయతే। "సర్వో వై రుద్రః''(మహానా. అను.౧౬) "సర్వం ఖల్విదం బ్రహ్మ'' ఇత్యాదినా సర్వప్రపంచస్య శివాత్మకత్వోపదేశాత్.

కించ – "యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి" (ఛాం ౭-౨౪-౧) ఇత్యాది శ్రుత్యా ముక్తాత్మనాం ఇదంతారూపఘటపటాత్మక ప్రపంచత్వేన వ్యవహృతమాయాపాశఏవ సర్వశివాత్మకతాజ్ఞానేన తిరోధీయతే."శివో దాతా శివో భోక్తా శివస్సర్వమిదంజగత్" ఇత్యాదిశాస్త్రోక్తసర్వశివాత్మకతా సంపూర్ణజ్ఞానేన ఘటపటాద్యాఘటత్వాదిబుద్ధిర్నివర్తతే,నతు ఘటాదిః. తస్య శివాత్మకత్వాత్ ।తస్మాన్న బ్రహ్మజ్ఞాననివర్త్యత్వం ప్రపంచస్య। అతో మిథ్యాత్వమయుక్తం।

తత్స్వీకారే ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞాశ్రుతే ర్గర్తజలాంజలిత్వ ప్రసంగః । బ్రహ్మోపాదానకారణకత్వాత్ప్రపంచస్యైకవిజ్ఞానేన సర్వవిజ్ఞానప్రతిజ్ఞా శ్రూయతే। అతఏవ-"సర్వం ఖల్విదం బ్రహ్మ" "ఐతదాత్మ్యమిదం సర్వం(ఛాం. ౬-౮-౭) "సర్వో వై రుద్రః" ఇత్యాదిశ్రుతిః సర్వస్య శివాత్మకత్వముపదిశతి. తస్మాన్న బ్రహ్మజ్ఞానేన ప్రపంచబాధః। జనకాదిబ్రహ్మవిదామపి పూర్వవదేవ వ్యవహారో దృశ్యతే. తేషాం న ప్రపంచబాధః। జీవన్ముక్తానాం శరీరధారణాదివ్యవహారానుపపత్తేశ్చ। కించ దూర్వాసీయే—

అఖండాద్వైతభావే తు సర్వం బ్రహ్మైవ నాన్యథా।
జ్ఞానాద్వికల్పబుద్ధిస్తు లీయతే న స్వరూపతః॥
భిన్నత్వం నైవ యుంజీత బ్రహ్మోపాదానతః క్వచిత్।
వాచారంభణమాత్రత్వాద్భేదః కేనోపజాయతే॥
తస్మాదవిద్యామాత్రత్వకథనం మోహనాయ హి॥

ఇతి జగన్మిథ్యాత్వవాదినాం నిందా శ్రూయతే। "అసత్యమప్రతిష్ఠంతే జగదాహురనీశ్వరం।" (గీతా. ౧౬-౮) ఇతి గీతాయాం చ శ్రూయతే।

న ద్వితీయః— "అమూలమనాధారమిమాః ప్రజాః ప్రజాయంతే" "నకదాచిదనీదృశం జగత్" ఇత్యాదినా జగతో నిత్యత్వప్రతిపాదనాత్।

నను – "అసద్వా ఇదమగ్ర ఆసీత్, తతో వై సదజాయత" (తై. ఆనం. ౭) "సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయం" (ఛాం. ౬-౨-౧) ఇత్యాదిశ్రుతిశతేన సృష్టేః పూర్వం ప్రపంచస్యాసత్త్వోపదేశాత్ కథం తస్య త్రైకాలికసత్యత్వం? ఇతిచేన్న–

"అసద్వా ఇదమగ్రఆసీత్" ఇత్యత్ర సృష్టేః పూర్వం ప్రపంచస్య నామరూపవిభాగానర్హత్వేన బ్రహ్మణి సూక్ష్మరూపేణస్థితత్వాదసత్త్వో

తతో వై సదజాయత" ఇత్యనేన నామరూపవిభాగార్హత్వేన ప్రపం చస్య జన్యత్వం చోపదిశ్యతే.

కించ —అసత్పదేన గగనారవిందవదభావత్వాంగీకారే వంధ్యా పుత్రాదీనామపి జగత్కారణత్వం కిం న స్యాత్? సదేవేత్యవధారణేన న సవిశేషత్వనిషేధః। కింతు అసతో భ్రాంతిప్రసక్తత్వాత్తత్కార ణత్వనిషేధః.

కించ— "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్," ఇతి శ్రుతౌ కథం సవిశేషత్వనిషేధః? 'అగ్రే' ఇతి కాలవిశేషః, 'ఆసీత్,' ఇతి క్రియా విశేషశ్చ దృశ్యతే। ఏకమేవేత్యవధారణేనాధిష్ఠాత్రంతరనిషేధః।అద్వి తీయపదేన బ్రహ్మణో జగదుభయకారణత్వం విధీయతే। "ఏకో హి రుద్రో నద్వితీయాయతస్థుః॥ (శ్వే.3—౨)ఇత్యాదావప్యేవంబోద్ధవ్యం। అత ఏవ "విశ్వాధికో రుద్రో మహర్షిః" (మహానా. అను.౧౦)ఇతి శ్రూయతే. తస్మాన్న త్రైకాలికనిషేధ ఇతి రహస్యం।

## ॥ జగద్వ్యావహారికత్వఖండనం ॥

నను— ప్రపంచస్య వ్యావహారికమాత్రసత్యత్వం న తు పార మార్థికత్వమితి చేన్న। కిమిదం వ్యవహారసత్యత్వం? వ్యవహారమాత్ర సత్యత్వం? బాధితవ్యవహారగమ్యత్వం? త్రిచతురకక్ష్యాస్వబాధ్యత్వం వా। తత్త్వావేదకప్రమాణవిరుద్ధత్వం? అర్థక్రియాశూన్యప్రతీతిగోచ రత్వం? కరణదోషోపహితజ్ఞానవిషయత్వం వా? నాద్యః— బ్రహ్మ ణో వ్యవహారగమ్యత్వేనాతివ్యాప్తేః। అన్యథా గురుశిష్యయో రధ్యయనాధ్యాపనానుపపత్తేః। "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" "సదేవ సోమ్యే దమగ్ర ఆసీత్" "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" (తై. ఆనంద. ౧) ఇత్యాదిరూపేణ ప్రవృత్తాయాః శ్రుతిసూత్రఫక్కికాయా అభిత్తిచిత్ర న్యాయాపాతాచ్చ। "సర్వాపీయం ఫక్కికా సవిశేషవిషయా; నిర్వి

శేషం న కస్యాపి వ్యవహారస్య గోచరం” ఇతి చేత్ వ్యాహతమేతత్ । “న గోచరః” ఇతి వ్యవహారం ప్రత్యేవ గోచరత్వాత్ । వేదాంతానాం నిర్విశేషవిషయత్వాభావసమర్థనేన అస్మదనుకూలం చ తేషామపి వ్యవహారరూపత్వాత్.

నాపి బాధితవ్యవహారగమ్యత్వమితి ద్వితీయః బ్రహ్మణ్యవ్యాప్తేర్దుర్వారత్వాత్ సర్వోఽపి వ్యవహారో బాధిత ఏవ ప్రపంచాత్మకత్వాత్ । న చ బాధితత్వం వ్యవహారగమ్యత్వస్య విశేషణమితి శంక్యం తర్హి బాధితత్వస్యైవ లక్షణత్వే శేషవైయర్థ్యాత్ నచేష్టాపత్తిః ప్రాతిభాసికేఽతివ్యాప్తేః న చ బ్రహ్మాతిరిక్తవిషయక జ్ఞానాబాధితత్వే సతి బాధితత్వమితి పరిష్కారస్సాధుః జ్ఞానాబాధితత్వస్య జ్ఞానజన్య ధ్వంసప్రతియోగిత్వరూపత్వే ఉత్తరజ్ఞానజన్యధ్వంసప్రతియోగిషు పూర్వజ్ఞానేషు లక్షణావ్యాప్తేః జ్ఞానానపహృతధీవిషయత్వరూపత్వే తు “ఘటో నాస్తి పటో నాస్తి” ఇతిజ్ఞానాపహృతధీవిషయేషు ఘటపటాదిష్వవ్యాప్తిః తేషాం జ్ఞానానాం బ్రహ్మాతిరిక్తవిషయకత్వాత్ విస్తరేణ చోపరిష్టాన్నిరాకరిష్యామః ।

కించ నీలపృష్ఠత్వాది సత్తాయా అపి బ్రహ్మరూపతయా తద్విషయకజ్ఞానబాధ్యేషు రజతాదిష్వతివ్యాప్తిర్దుర్వారైవ । తేషామపి జ్ఞానానాం బ్రహ్మాతిరిక్త విషయత్వాభావాత్ । న చ నీలపృష్ఠత్వాదీనామబ్రహ్మరూపాణాం తద్జ్ఞాన విషయత్వాన్నాతిప్రసంగ ఇతివాచ్యం తర్హి నిర్విశేషత్వప్రపంచమిథ్యాత్వాది బ్రహ్మాతిరిక్త విషయకజ్ఞానస్యైవ ప్రపంచనివర్తకతయా వ్యావహారికమాత్రే లక్షణాసంభవప్రసంగాత్ । నిర్విశేషత్వాదీనాం సప్రతియోగికానాం నిష్ప్రతియోగి బ్రహ్మస్వరూప మాత్రత్వం దుస్సాధ్యం । స్వరూపమాత్రజ్ఞానస్యాశేషసహస్వప్రకాశానతిరిక్తవిషయతయా నివర్తకత్వాసంభవేనాశనివర్తకత్వాపాదకం చ అనతిరిక్త విషయవిజ్ఞానే వృత్తిత్వం, నివర్తకతా

...కసుత్యభ్యుపగమే జడాయా వృత్తేర్నివర్త్యత్వే జ్ఞానబాధ్యత్వసిద్ధాంత
...హాతిః| కథంచిత్, జ్ఞానత్వాంగీకారేఽపి స్వస్వరూపజ్ఞానసాధారణస్య
జ్ఞాననివర్తకతానవచ్ఛేదకత్వాదపసిద్ధాంతశ్చేత్యాస్తాం విస్తరః.

నాపి త్రిచతురకక్ష్యాస్వబాధ్యత్వమితి తృతీయః. బ్రహ్మణ్య
తివ్యాప్తేః| అబాధ్యం హి బ్రహ్మ త్రిచతురకక్ష్యాఽబాధ్యమేవ|
న చ త్రిచతురకక్ష్యాస్వబాధ్యత్వం, తథా సతి ప్రాతిభాసికవిశేషేఽ
తివ్యాప్తేః| సంభవంతి హి దీర్ఘకాలానువృత్తభ్రమవిషయాణి ప్రాతి
భాసికాని వస్తూన్యలాతచక్రగంధర్వనగరాదీని.

కించ—కక్ష్యాశబ్దోఽయంయుక్తిపరః?కాలపరః?విపరీతప్రమాపరో
వాఽఽద్యః-"ప్రపంచో మిథ్యా దృశ్యత్వాత్" ఇత్యేకయైవ కక్ష్యయా
ప్రపంచస్య బాధేనాసంభవాత్| "తత్పరత్వాత్పరత్వాచ్చ నిర్దోషత్వా
చ్చ వైదికం|పూర్వస్య బాధకం"ఇత్యేకయుక్త్యనుసంధానేనాపి బాధేన
...పత్తేశ్చ| నద్వితీయః-దీర్ఘకాలభ్రమవిషయే ప్రాతిభాసికేఽతివ్యా
ప్తేః| న తృతీయః—విపరీతప్రమావిషయశ్చ భవత్యబాధితశ్చేతి వ్యాఘా
తాత్|నచ బాధఃపదార్థనివృత్తిరితి యుక్తం|ముద్గరాదినివర్త్యేషు ఘటా
దిషు త్రిచతురవిపరీతజ్ఞానానివర్త్యత్వే సతి విపరీతజ్ఞాననివర్త్యత్వ
స్వభావేనావ్యాప్తేః| అపిచ—త్రిచర యుక్త్యబాధ్యత్వే సతి బాధ్యత్వ
మితి ప్రథమకల్పే బ్రహ్మణ్యతివ్యాప్తిః| తస్యాపి యుక్తిబాధితత్వాత్|
...జ్ఞానయోరేకవిషయత్వేన యద్విషయకమజ్ఞానం తద్విషయక
మేవ జ్ఞానం తాదృశాజ్ఞాననివర్తకం| ప్రకృతే బ్రహ్మవిషయకాజ్ఞానస్య
బ్రహ్మవిషయకజ్ఞానేనైవ నివృత్తిః| తథాహి—బ్రహ్మ దృశ్యమదృ
శ్యం వా? దృశ్యత్వే మిథ్యాత్వమవర్జనీయం| అదృశ్యత్వే బ్రహ్మవ్యవ
...చ్ఛేదః, తస్య దృగేకసాధ్యత్వాత్| అవిద్యానివృత్తిశ్చ
...త్వాత్, సమానవిషయకదృగభావాత్|నచవృత్తిజ్ఞానేన వ్యవహారాది
...సమర్థనసంభవతి. వృత్తేరజ్ఞానపరిణామభూతాయా అజ్ఞానత్వాత్|
న చ జ్ఞానత్వారోపమాత్రేణ వృత్తిః జ్ఞానకార్యాణి కర్తుమర్హతి.
...సంభాధిష్ఠానవహ్నేరపిదాహకత్వప్రసంగాత్|నచ జ్ఞానావచ్ఛేదకతయా
...ముఖ్యమేవ జ్ఞానత్వమితి శంక్యం. అవచ్ఛేద్యావచ్ఛేదకభావేన జ్ఞానభేద

స్యైవ సమర్థనేన వ్యాఘాతాత్, ఘటేఽప్యవచ్ఛేదకత్వాపత్తేశ్చ "ఘట వద్జ్ఞానం" ఇత్యత్ర ఘటోఽప్యవచ్ఛేదకః.

కించ—వృత్తేర్జ్ఞానపదముఖ్యార్థత్వే బ్రహ్మణో జ్ఞానభిన్నత్వైవ స్యాత్. న చ బ్రహ్మవృత్త్యోరనుగతం కించిత్ప్రవృత్తినిమిత్తము స్యేనోభయత్ర ముఖ్యం స్యాత్. న చ జ్ఞానత్వం అసిద్ధేరిత్యుక్తేః. న హి జ్ఞానాజ్ఞానపరిణామానుగతం జ్ఞానత్వం ప్రామాణికం. స్వవ్యాపక స్వప్రకాశత్వనివృత్త్యా జ్ఞానత్వనివృత్తేశ్చ। నిర్విశేషే చిన్మాత్రే తదభావే అజ్ఞానత్వప్రసంగాచ్చ। నాప్యవిద్యానివర్తకత్వం. జ్ఞానత్వస్య స్వవ్యాపకస్య నివృత్త్యా స్వస్యాపి నివృత్తేః। అధ్యాససహే చిన్మాత్రే తదభావేనావ్యాప్తేశ్చ। నాపి ప్రవృత్తినివృత్తిద్వయేనోభయముఖ్య త్వం, అనేకార్థత్వకల్పనాప్రసంగాత్। వృత్త్యవచ్ఛిన్నచైతన్యస్య జగదాభాసకల్పనావైయర్థ్యాత్। బ్రహ్మణో దృశ్యత్వేన మిథ్యాత్వా పాదనస్య వజ్రలేపత్వాపాతాచ్చ। జ్ఞానాజ్ఞానయోర్జ్ఞానపదముఖ్యార్థత్వ సమర్థనాయ ప్రవృత్తినివృత్తిద్వయకల్పనే ఘటపటయోర్ఘటపద ముఖ్యార్థత్వాపత్తేశ్చ। ఏవంచ వృత్తేర్జ్ఞానత్వాభావేన బ్రహ్మణో నిర్విషయత్వస్వరూపప్రకాశస్యాపి స్వావిషయత్వాద్బ్రహ్మణస్తుచ్ఛత్వం సర్వేషాం చైతన్యానాం స్వావిషయబ్రహ్మభిన్నతయా మిథో వ్యవహా రానుపపత్తేశ్చ। వృత్తేర్ముఖ్యజ్ఞానత్వేస్వప్రకాశస్వావిషయత్వే వా బ్రహ్మణో మిథ్యాత్వమవర్జనీయం.

న చ—"మిథ్యాభూతభేదవచ్చైతన్యవిషయత్వం న మిథ్యాత్వ ప్రయోజకం, ప్రపంచేఽపి తదసిద్ధేః। జీవస్య విశిష్టరూపేణ మిథ్యాత్వ మిష్టం- నిష్కృష్టరూపం తు న చిద్విషయం" ఇతి వాచ్యం। తర్హి ప్రపంచ విశిష్టమపి జ్ఞానం మిథ్యాత్వాన్న ముఖ్యా దృగితి న ప్రపంచేపి దృశ్యత్వ మితి జితమస్మాభిః। విశిష్టానన్యత్వే తస్యాపి వృత్తివిషయత్వాన్మిథ్యాత్వం అనన్యత్వే విశిష్టస్యమిథ్యాత్వాత్తస్య శుద్ధాభిన్నత్వాత్ప్రపంచస్య సత్య త్వం బ్రహ్మణో మిథ్యాత్వమితి విపరీతవృత్తిః।తస్మాద్విశిష్టానన్యత్వా న్యత్వాభ్యాం ప్రపంచబ్రహ్మణోః సత్యత్వమిథ్యాత్వవిపరీతవృత్తి ర్దుర్వారైవ।

కించ నిర్విశేషం బ్రహ్మ కిమస్తి? ఉత నాస్తి? ద్వితీయే మాధ్యమికమతప్రవేశః। ప్రథమే బ్రహ్మాస్తీతి ప్రతిజ్ఞాయాం ప్రవృత్తినిమిత్తభేదే నిర్విశేషత్వవ్యాహతిః। న చ ప్రతిజ్ఞాప్రవృత్తినిమిత్తయోః కల్పితత్వేన పరిహారః, నిర్విశేషం బ్రహ్మాస్తీతి ప్రతిజ్ఞాయా స్వవిశేషవిషయకత్వాత్కథనస్య ఉన్మత్తప్రలాపత్వాత్. అస్తిశబ్దప్రవృత్తినిమిత్తభూతాయా సత్తాయాస్త్వన్మతే మిథ్యాత్వాయోగాచ్చ। బ్రహ్మత్వస్య కల్పితత్వే నిర్విశేషస్యాబ్రహ్మతాపాతాచ్చ। యత్ర బ్రహ్మత్వం ప్రకల్పితం తదేవ బ్రహ్మేత్యుక్తేర్వ్యాహతత్వాచ్చ. నిర్విశేషస్య కల్పితసంబంధాయోగాచ్చ। ప్రవృత్తినిమిత్తాభేదే తు సామానాధికరణ్యాయోగః। "భిన్నప్రవృత్తినిమిత్తానాం శబ్దానామేకస్మిన్నర్థే వృత్తిస్సామానాధికరణ్యం" ఇతి వృద్ధాః। అభావరూపధర్మప్రవృత్తినిమిత్తకతాయామప్యయమేవ దోషః। అభావానాం స్వరూపానతిరేకే సామానాధికరణ్యహానేః, అతిరేకే సిద్ధాంతహానేః। ఏతేన నిర్విశేషః ప్రతిజ్ఞాదీనామవిషయోఽపి స్వతస్సిద్ధ్యతీతి నిరస్తం। దుస్సాధ్యేషు సర్వేష్వర్థేషు స్వతస్సిద్ధేర్దుర్వారత్వాపాతాత్. ఏతేన శ్రుత్యా నిర్విశేషసిద్ధిరపాస్తా। ప్రకృతిప్రత్యయభేదభిన్నాయాః శ్రుతేస్తత్ర ప్రామాణ్యాసంభవాత్. ప్రాగుక్తదృశ్యత్వానుమానగ్రాసాచ్చ।

అపిచ—మిథ్యార్థబ్రహ్మణోర్భేదః పరమార్థః? ఉతాపరమార్థః? ప్రథమవికల్పే భేదసత్యత్వాంగీకారాత్సిద్ధాంతహానిః। ద్వితీయే సత్యస్య బ్రహ్మణోఽపి మిథ్యాత్వం దుర్వారం। యయోర్భేదో మిథ్యా తయోరైక్యమితి వ్యాప్తేః। ఘటస్య స్వస్మాద్భేదే మిథ్యాభూతే హ్యభేదః పరమార్థః। న చ భేదాభేదయోర్మిథ్యాత్వాన్న దోష ఇత్యపి సాధు, పరస్పరవిరోధే ప్రకారాంతరానవస్థితేః। యద్యేవం స్యాత్తర్హి భేదాభేదయోరపక్షపాతినా భవతా జీవబ్రహ్మణోస్తదుభయమిథ్యాత్వం కిం న స్వీక్రియేత? నచాభేదశ్రుతిప్రాబల్యాత్తదసంభవః "సర్వం ఖల్విదం బ్రహ్మ" ఇత్యాదీనామేవ ప్రపంచబ్రహ్మాభేదశ్రుతీనామతాత్పర్యకత్వాత్.

కించ—నిర్విశేషం బ్రహ్మ జ్ఞానమజ్ఞానం వా? ద్వితీయే అప

సిద్ధాంతః। ప్రథమే తు సవిషయం నిర్విషయం వా? నిర్విషయత్వే త్వదభిమతజ్ఞానత్వవ్యాఘాతః. సవిషయత్వే విషయనిత్యతాప్రసంగః। నిత్యజ్ఞానస్య నిత్యవిషయావశ్యంభావాత్। తథా చ ముక్తావప్యపి ప్రపంచతాప్రసంగః। తదా విషయాణాం నివృత్తత్వాన్నిర్విషయమితి చేత్ తర్హి జ్ఞానత్వమేవ న స్యాత్. నిరాలంబనత్వజ్ఞానత్వయోర్వ్యాఘాతాత్। న చ— అతీతాదివిషయజ్ఞానవద్విషయనిత్యత్వపరిహారః। తద్వదతీతత్వాది కించిత్ప్రకారకత్వేన కించిదాలంబనత్వేన వా: నిర్విశేషత్వవ్యాఘాతాత్. విషయసంబంధనిత్యతాయాపవాపాద్యత్వేన దోషాపాతాచ్చ। నిర్విషయా నిరాశ్రయా చ సంవిదనుభవసిద్ధేతి తుచ్ఛం। "ఘటమహం జానామి" "అయం ఘటః" ఇతి సానుబంధత్వేనైవోపలంభాత్. అన్యా తు సంవిత్ త్వదభిమతా గగనకుసుమాదిసిద్ధికాలం వినా న సిధ్యతీతి దిక్.

అపిచ— ద్రవ్యమద్రవ్యం వా? ద్రవ్యం చేద్గుణాశ్రయత్వప్రసంగః ఉత్పత్తికాలావచ్ఛిన్నఘటవదుపపత్తిరితి ఫల్గు। ఆద్యక్షణసంయోగస్య తత్రాపి సత్త్వాత్। తద్వత్కదాచిద్గుణాశ్రయత్వేఽపి అగుణాశ్రయత్వవ్యాహతేః। గుణానాం కల్పితత్వేఽపి నిర్విశేషత్వవ్యాహతిః। అవిద్యోపాదానం వినా బుద్ధేస్తదసిద్ధేః। అద్రవ్యం చేద్ద్రవ్యాశ్రితత్వప్రసంగః। తథా చ —"స్వే మహిమ్ని" (ఛాం. ౭-౨౪-౧) ఇత్యాది శ్రుతివిరోధః। ఆశ్రయసంబంధాన్నిర్విశేషత్వభంగాచ్చ। తస్మాదేవంవిధాభిః ఖండనయుక్తిభిః ప్రథమద్వితీయకక్ష్యాంతరాళ ఏవాబాధితస్య బ్రహ్మణోఽపి తదుపరితనకక్ష్యాసు బాధ్యత్వసంభవాత్ప్రసక్తివ్యాప్తిర్దుర్వారైవేతి దిక్.

నాపి తత్త్వావేదకప్రమాణవిరుద్ధత్వమితి తురీయః— తాత్పర్యాదిషు శ్రోత్రాదిషు చ తత్త్వావేదకప్రమాణవ్యంజితేషు తత్త్వావేదకత్వేనైవ విరోధాదర్శనాత్। అథ తత్ప్రమేయవిరుద్ధత్వమిత్యపి న— వేదత్వేనైవ తత్త్వావేదకత్వే "నేహ నానాస్తి" (బృ. ౪-౪-౧౯) ఇత్యాదీనామపి "యస్మిన్ ద్యౌః" (ముం. ౨-౨-౫) ఇత్యాదితత్త్వావేదకప్రమాణ విరుద్ధార్థకతయా తదర్థప్రపంచాభావేఽపి వ్యావహారికత్వప్రసంగాత్

ప్రపంచాభావస్యాతిరిక్తస్య సత్యత్వే ద్వైతప్రసంగేన, మిథ్యాత్వే తద్బోధకప్రమాణస్య తత్త్వావేదకత్వవ్యాఘాతేన చ బ్రహ్మభేదస్యాంగీకార్యతయా బ్రహ్మణ్యతివ్యాప్తేశ్చ.

కించ — అత్ర తత్త్వావేదకతదన్యయోర్భేదస్సిద్ధో వాఽసిద్ధో వా? అసిద్ధౌ స్వోక్తివ్యాఘాతః, సిద్ధౌ తు అప్రమాణేన విషయాద్ధౌ ప్రమాణగోచరస్య భేదస్య సత్యత్వప్రసంగేన ప్రపంచ వ్యావహారికత్వభంగః। తదసత్త్వేతు స ఏవ తత్త్వావేదకాభేదాదుక్తి వ్యాఘాతః। యద్భేదస్య మిథ్యాత్వం తదభేదస్సత్య ఇతి హ్యుక్తం ప్రాక్.

నాపి—అర్థక్రియాశూన్యప్రతీతివిషయత్వమితి. పంచమః — తథా సతి త్వదీయాయాః ప్రవృత్తేర్లోకవేదగోచరాయాః సర్వస్యా అపి గగనకుసుమాయమానత్వప్రసంగేన స్వక్రియాస్వవచనవ్యాఘాత దండ ఏవ దుష్టఫణినమివ త్వాం న ర్తనాన్నివర్తయిష్యతి.

అథాయమభిప్రాయః— నఞః ప్రశ్లేషేణ అర్థక్రియాశూన్యత్వం అర్థక్రియాశూన్యత్వాభావః ఇతి। తథా సతి సర్వార్థమూలకందే బ్రహ్మణ్యతివ్యాప్తిః। న చ అవిద్యావచ్ఛిన్నస్య బ్రహ్మణోఽర్థక్రియాకారిత్వం న శుద్ధస్యేతి అవచ్ఛిన్నస్య చ వ్యావహారికత్వమిష్టమితి వాచ్యం। విశిష్టస్య జ్ఞానేన నివర్త్యత్వం తర్హి ప్రసజ్యేతేతి విశేషణస్య నివృత్తౌ శూన్యవాదసామ్రాజ్యప్రసంగః। న హి విశిష్టం విశేషణ విశేష్యసంబంధేభ్యోఽతిరిచ్యతే। అపి చావిద్యానివృత్తిరూపార్థక్రియాహేతౌ చరమాంతఃకరణ వృత్తివిషయశుద్ధబ్రహ్మణ్యతివ్యాప్తిః। ప్రకాశత్వేనావిద్యానివృత్తిత్వేన కార్యకారణభావః। అనాత్మవిషయప్రకాశత్వేనఅనాత్మవిషయావిద్యానివృత్తిత్వేన చాపరః।తథాచ వృత్తి స్వవిషయతాం వినాపి బ్రహ్మణః స్వరూపప్రకాశః అవిద్యాం నివర్తయతీతి త్వత్సిద్ధాంతః.

కించ— ప్రాతిభాసికే రజ్జ్వధిష్ఠానసర్పాదౌ భయకంపాద్యర్థక్రియాకారిణ్యతివ్యాప్తిః। ఉత్పన్నప్రధ్వస్తేషు ఘటాదిషు చావ్యాప్తిః। క్రియావ్యవహితపూర్వక్షణోత్పన్నేషు తేషు చ క్షణేష్వవ్యాప్తిః।

త్వాదిమద్విధధర్మావచ్ఛిన్నస్య పరశివస్య బ్రహ్మణః శివశర్వశంకరా నందజ్ఞానానంతాదిశబ్దానాం హస్తకరపాణ్యాదిశబ్దవత్పర్యాయత్వాత్ అఖండజ్ఞానస్వరూపపరమశివావలోకీ శుద్ధజీవస్తు తద్భిన్న సదభిన్నో వా? నాద్యః -ప్రభాకరప్రభాభాసమానస్య ఘటపటాదివత్ స్వప్రకాశ స్వభాసకప్రభాకరప్రకాశకత్వాసంభవవత్ పరమశివప్రేరితస్య తత్సా క్షాత్కృత్వాసంభవాత్ । న ద్వితీయః— చక్షురింద్రియవత్ స్వసాక్షా త్కారాసంభవాత్ । జీవస్య తద్భిన్నజ్ఞానస్వరూపత్వేన 'తత్సాక్షా త్కారసిద్ధిరితి చేన్న । జీవస్య తత్సాక్షాత్కారకర్తృత్వం తదుత్కృష్ట జ్ఞానాత్మకత్వేన తత్సమానజ్ఞానాత్మకత్వేన తదపకృష్టజ్ఞానాత్మకత్వేన వా? నాద్యః— శ్రుతియుక్త్యనుభవవిరోధాత్ । న ద్వితీయః— తదుపాసనా సంభవాత్. పూర్వోక్తదోషాపత్తేశ్చ । న తృతీయః— "జ్ఞాజ్ఞౌ ద్వా జావీశనీశౌ" (శ్వే. ౧-౯) "ప్రధానక్షేత్రజ్ఞపతిర్గుణేశః" (శ్వే.౬-౧౬) "ఈశాన స్సర్వవిద్యానా మీశ్వర స్సర్వభూతానాం" (మహానా. అను ౪౯) ఇత్యాదిశ్రుతియుక్త్యనుభవసిద్ధత్వేన తదపకృష్టత్వం సంభవతి తథాపి ప్రభాకరప్రభామధ్యస్థదీపవత్ తత్సాక్షాత్కారాసంభవాత్ తస్మాదుపాసనాజ్ఞానేన న బ్రహ్మసాక్షాత్కారసిద్ధిరితి చేన్న.

ప్రభాకరాంశచక్షుర్మాత్రేణైవ ప్రభాకరసాక్షాత్కారసిద్ధివత్ గురుదీక్షాశుద్ధస్య జీవస్యైవ పరమేశ్వరానుగ్రహాత్తత్సాక్షాత్కార సిద్ధేరవిరోధాత్ । నో చేత్— "జ్ఞాత్వా శివం శాంతిమత్యంతమేతి" (శ్వే. ౪-౧౪) "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" "ఏషోఽణురాత్మా చేతసా వేదితవ్యః" (ముం. ౩-౧-౯) ఇత్యాది శ్రుతిశతభంగప్రసంగః లోకే గురుశిష్యబోధప్రచారోఽపి న స్యాత్ । తస్మాత్పూర్వోక్త ఏవ సర్వవేదాంతతాత్పర్యమితి సిద్ధాంతః.

## ఇతి సమన్వయాధికరణం చతుర్థం.

# చతుస్సూత్రీ సమాప్తా.

బెజవాడ – ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలాంకితమ్, 1940.

ఓం



శ్రీగిరిరాజ సూర్యసింహాసనాధీశ్వర

శ్రీ జగద్గురు వాగీశపండితారాధ్య మహాస్వాములవారు, గుంతకల్లు.

**Sri Giriraja Suryasimhasanadheeswara**

**Sri Jagadguru Vageesa Panditaradhya Mahaswamulu.**




సచిత్ర మాసపత్రిక

పుండ్రిము ౨ | శా. శ. ౧౮౬౨ విక్రమ సంవత్సర ఆశ్వయుజ - కార్తికములు | రేఖ ౮-౯
Vol. 2 | 22 అక్టోబరు - నవంబరు 1940 సికింద్రాబాద్ | No. 8- 9

# ప్రేమాంజలి

శ్రీ సా. వేం. నరసింహముగారు, ఎం. ఏ.

౨

*నీ మహోదార దివ్య హృత్ సీమయందు
నీవు సంకల్పమును సేయ, దేవ! త్వద్గృ
హంబు వీడితి నంత ద్వారంబు మూయఁ
బడియె దీనతతో వెలిఁబడితి నేను;
మఱియు నొకద్వారమును జూచి మరలి రాఁగ
వలయు, నే మగు నొక్కొ! యా వలన భయద
కారణాత్మక కాలమేఘములు నిండె
యుగము లురిమెను దేశవిద్యుత్తు మెరసె
నామరూపముల్ నిష్ఠురోద్దామ ఘణితి
గురియుచుండఁగ నాచ్ఛాదనరహితుండ
నగుచు నిల్చితి దీనుఁడ నగుచు నేను
ఇంద్రజాలమొ యిద్ది మహేంద్రజాల
మగునొ నీ హ సనసంస్పర్శ నవతరించె



* శ్రీజ్ఞానానందస్వామివారి యాంగ్లకృతి కనువాదము, ౧ పూర్వము ప్రకటితము,

వరద నీ యోగదండప్రభావ మేమొ
అన్ని యాకర్షకములె స్వాదైన యవియె
వానిలో దూకి మున్గుదుఁ బర్విడుదును
దారి మఱతు నాలయమును జేరమఱతు
సంతసింతునుగాని తదంత మరయ
దుఃఖమే గాదె, ఇట్లు పొందుదునె నిన్ను
దేవ, ఈ మార్గమునె చూపి తివిరినావ ?
లేక నా దృష్టిలోపమా లీల' నెఱుఁగ
మంచిచెడ్డలు తప్పు నొప్పంచితముగఁ
జూడ లేనైతి; ఒకవిధిఁ జూడ మంచి
దియును జెడ్డది యట్టులే చెడుది మంచి
దగును లోకములో నిటే యన్నియుండు.
సారముగ దోఁచు నదియె నిస్సార మొకట
నైన నీ బోధముల సార మద్భుతంబు
కన నగాధముల్ మహిమల ఘనత నెఱుగ
నెవరి తర మగు ముమ్మాటి కవశము లగు
చింత సేయఁగ సేయఁగ వింతలగును
చింత సేయక యున్నను వింతలగు మ
హేంద్రజాలం బదెట్టిదో యెఱుగనయ్య
అహహ ! దేవాలయంబున యందు దాఁగి
కలతఁ జెందెడు నన్నీవు కలఁచుచుంటి.
దృశ్యమానము లోకము తీవ్రదుఃఖ
మయము మాయను; సణగుట మానివైతు
నీదు సంకల్ప మిట్టులె నెగడుగాక,
కాని నిండారు ప్రేమను బూని నన్ను
పూర్ణముగఁ బ్రోవుమయ్య నీ పూజ్యమైన
మధుర సంకల్పమునకు సమ్మతిని లొగి
త్యాగ మొనరింప నిమ్ము తత్త్యాగబంధ
బద్ధుఁడగుదును నీ పాదపద్మసరణి
స్వాదు సుపవిత్రభ ! ప్రభూ ! సారమహిత!

(21-12-1937 తేదీని డ్రెస్సెర్‌లో రచింపఁ బడినది.)

# సుప్రసిద్ధశివక్షేత్రములు

అనువాదకుడు:
శ్రీమఠంసిద్ధివీరయ్యగారు,
ఉపాధ్యాయులు

## (౬) కాశ్మీరమందలి యమరనాథమందిరము

కొందఱు అమరేశ్వరనామక జ్యోతిర్లింగము నిదే ప్రదేశమం దుండినట్లు సూచించెదరు. ఈ క్షేత్రమునం దొక విశేషాంశ మేమనగా, ఇచటి శివలింగమును మఱియు గుహామందిరమును దిలకించిన నివి మనుష్యనిర్మితములు గావనియు దేవతలచేఁ గల్పింపఁబడినట్లు ద్యోతకమౌను.

కాశ్మీరదేశమునకుఁ బ్రాగ్భాగమున సముద్రమట్టమునకుఁ బదివేలయడుగుల నెత్తున నుండు పర్వతోపరిభాగమున శ్రీ భగవానుఁ డగు నమరనాథుని గుహ విరాజిల్లుచున్నది. ఈ పవిత్ర క్షేత్రయాత్ర సంవత్సరమున కొకసారి శ్రావణ పూర్ణిమనాడు చేయవలెను. కాశ్మీరదేశమునకు ముఖ్యపట్టణ మగు శ్రీనగరమునకు నిది ౯౦ మైళ్ళదూరమున నున్నది. యాత్రయొక్క ౨/3 భాగము యంత్రశకటారూఢులై సుఖముగాఁ జేయవచ్చును. తక్కిన (౧/3) భాగము మార్గము దుర్గమ పర్వతప్రాంతమై యున్నది.

కాలినడకనే పోవలసి యుండును. మార్గమధ్యమున చందనవాడి, శేషనాగ, పంజతరణి యను 3 మజిలీలుఁ గలవు. చతుర్దశీ దినమున యాత్రికులు పంజతరణి మజిలీ చేరుకొనెదరు. ఈ ప్రదేశ మమరనాథ పర్వతమునకు దిగువ భాగమున ద్వారరూపమున నున్నది. పూర్ణిమనాడు యాత్రికులు పర్వతారోహణ మొనరించి గుహాలోని యమరనాథస్వామిని దర్శించి యానాడే తిరిగి పంజతరణీ ప్రదేశమున కేతెంచెదరు. పర్వతశిఖరారోహణమున సుమారు ౧ మైలు మంచుగడ్డలపై నడువ వలసియున్నది. ఈ హిమమయపథము గుహకు ౧ మైలుదూరమున సమాప్త మగును. అచ్చోట నీటికాలువ యొకటి ప్రవహించును. అట స్నాన మొనరించుటకు విశేషవిధి యొకటి కలదు. యాత్రికులు కౌపీనధారులై శరీరముపై గుడ్డలు వేఱే ధరింపక యా కుల్యయం దవగాహన మొనరింప వలెను. ఆర్ద్రశరీరులై మందిరప్రవేశ మొనరించి భగవానుని సందర్శించి యా వాఁగుయొద్దనే చేరి వసనముల ధరింప వలెను. అనేక వృద్ధ కాశ్మీర పండితు లిప్పటికి నిదే విధాన మవలంబించి దర్శనార్థ మేగెదరు. పాఠకగణ

మాశ్చర్యపడవలసిన యంశ మేమనగా అచ్చట నీ విధముగ స్నాన మొనరించువారు శీతబాధకు నిక్కిపోరా? వాస్తవముగ వారికిఁ జలిబాధ యినుమంత యైనఁ గలుగదు. ఆ నీటియందే పదార్థము సమ్మిళితమై యున్నదో కాని, యచ్చోట స్నానమొనరించు వారి నా పదార్థము శీతబాధనుండి రక్షించును. ఇందుకు నిదర్శన మేమనగా స్నానానంతరము స్నాన మొనరించువారి శరీరము వాయుస్పర్శచే తనంతట తానే తడియారి పోవును. అప్పుడా దేహముపై విభూతిలేపన మొనరించుకొన్నట్లు గోచరించును. గుహయొక్క యుపరిభాగము 3 హిమలింగముల వలె కాన్పించును. వీనిని జనులు శివ, పార్వతీ, గణేశులని పలికెదరు. పర్వతకందరము కప్పు నుండి బిందుబిందువులుగా జలము పడుచుండును. శుక్లపక్ష ప్రతిపత్తునుండి పూర్ణిమవఱకు చంద్రకళల ననుసరించి లింగములును క్రమేణ వృద్ధిఁజెందును. కృష్ణపక్ష ప్రతిపత్తునుండి వరుసగా క్షీణించును. అమావాస్యనాఁడివి బొత్తిగా నుండవు. ఇదే తరుణమున పక్షితీర్థములోని పక్షులవలె శుభ్రకపోత మిథునము పర్వతకందరమునుండి వెడలి యెగసి పోవును. యాత్రికులు బహుశ్రద్ధతో వీనిని శంకరపార్వతులుగా భావించి ప్రణామ మొనరించెదరు.... గుహలో నొక బ్రాహ్మణుఁడు అర్చకరూపమున పూజాదుల గ్రహించును. ఈ సజ్జనుఁడు శ్రీనగరమునుండి యాత్రికుల కంటె ముందుగాఁ బ్రవేశించును. ఇతని హస్తమున రజతదండమొకటి యుండును. ఇది వీరిపదవిని సూచించును. యాత్రనుండి మఱలి పోయిన పిమ్మట నీ దండము శ్రీనగర మందలి మందిరమున నుంచెదరు........

(౭) కాంగడా వైద్యనాథ మందిరము

కాంగడా ఘాట్ మఱియు సురమ్యమై నట్టి, ఆరోగ్యప్రదపర్వతీమయప్రదేశము. అచట నిరాడంబర జీవను లగు నాటవికు లగు గద్దిజాతివారుందురు. మఱియు నా ప్రదేశమున నెలకొని యుండిన జ్వాలాముఖీ భగవతీ కాంగడా దేవియును, శ్రీ వైద్యనాథస్వామిశివ మందిరముల నెఱిఁగినవారు బహుస్వల్పము. భారతదేశ మందలి యీ భాగ మత్యంత సుందర మైనది. ఇచట డల్హౌజి ధర్మశాల, షింల, కూలూ మున్నగు రమ్యమైన నగరము లున్నవి. కొద్దిదినముల క్రిందట పఠానుకోటనుండి యోగీంద్ర నగరము వఱకు రయోమార్గము నిర్మింప బడినది. సుప్రసిద్ధ మగు వైద్యనాథాలయము ఈ ధూమశకట మార్గమునందే యుండియున్నది. వంగదేశపు వైద్యనాథధామమునకు దీనికిని సంబంధము లేదు.......వైద్యనాథాలయము కీరగ్రామమున నిర్మింపబడి యున్నది. పురాతత్త్వవేత్తల యభిప్రాయ మీ మందిర నిర్మాణకాలము యించుమించుగ ౧౨ వందల సంవత్సరములు గాఁబోలు నని యున్నది. దేవాలయపు కట్టడము విచిత్రముగా నున్నది. సుందర మైనది. శ్రీ శంకరభగవా

నుఁడు లింగరూపమున విలసిల్లుచున్నాఁడు. పాంచాలప్రాంతీయు లగు హైందవులు లక్షల కొలఁది, ప్రతివర్షము, శ్రీ జ్వాలాముఖీ భగవతి, శ్రీ వైద్యనాథస్వామి మందిర యాత్రఁ గావించెదరు. పాంచాలప్రాంత శివమందిరములలో నిది యగ్రగణ్య మని చెప్ప నతిశయోక్తి కాఁజాలదు. దీని సమీపమునందే సిద్ధనాథస్వామి శివాలయము గలదు. ఈ యాలయము వైద్యనాథమందిరముకంటెఁ బ్రాచీన మని చెప్పుదురు. ఇందు యనగఢ శివలింగము విరాజిల్లుచున్నది......

(౮) తా ర కే శ్వ ర మ ం ది ర ము.

కలకత్తా సమీపమున యొక రైల్వే శాఖ యందు తారకేశ్వర భగవానుని మందిరము ప్రసిద్ధ మైనది కలదు. మందిర సమీపమునందే దూధ్ గంగానామకసరోవరము గలదు. దీని జలమునే యచటివారు వాడుకొనెదరు. తారకేశ్వరుని మహిమ దూర దూర ప్రదేశములకు వ్యాపించియున్నది. అసాధ్యరోగములచే విముక్తి గాంచుట కనేక యాత్రికు లచటఁ గాపుర ముండెదరు. మహాశివరాత్రియందును చైత్ర సంక్రమణమునకును గొప్ప యుత్సవము జరుగును. శివరాత్రినాడు భక్తులు నిరాహారులై రాత్రి యంతయు జాగరణ మొనరించెదరు. చైత్రసంక్రమణమునాడు జనులు తమతమ యిష్టకామ్యార్థ సిద్ధికొఱకు తమ వీపులయందు గొప్ప గొప్ప లోహపు చీలల బిగించుక వ్రేలాడుచుండిరి. కాని ప్రస్తుత మీ యాచారమును ప్రభుత్వము పక్షమున నిషేధింపఁ బడినది......

(౯) భువనేశ్వర మందిరము

కళింగ (ఒరిస్సా) ప్రాంతమున శ్రీ జగన్నాథక్షేత్రసమీపమున కటక్ స్టేషనుకు రెండు మూఁడు స్టేషనుల ముందు భువనేశ్వరస్టేషను కలదు. కలకత్తా నగరమునకు దక్షిణదిశ ౨౭౨ మైళ్ళ దూరమున నున్నది. ౯ గంటలు ప్రయాణము. పురీ ఎక్స్‌ప్రెస్ నామక ధూమశకటముపై ౮ గంటలు రాత్రి ప్రయాణమైన యుదయము ౫ గంటలకు భువనేశ్వరముఁ జేరవచ్చును. మద్రాసునుండి భువనేశ్వరము ౨౮ గంటల మార్గము. స్టేషనునుండి భువనేశ్వరము ౫ మైళ్ళ దూరమున నున్నది. మార్గ మతిమనోహర వనమునుండి యున్నది. భువనేశ్వరముయొక్క ప్రాచీన నామ మేకామ్రకానన మని యున్నది. భువనేశ్వరమునకుఁ జేరువ నొక విస్తృత సరోవరముఁ గాన్పించును. జనులు దీనిని బిందుసరోవర మనెదరు. దీనిసమీపమున భువనేశ్వర భగవానుని విశాల మగు నత్యున్నత మందిరము గలదు. ఈ స్వామిని లింగరాజని వ్యవహరింతురు. భువనేశ్వరము ఒరిస్సా దేశపు కేసరీ యను పేరు గల ప్రసిద్ధరాజ వంశమునకు రాజధానియై యుండినది. ఒకానొక సమయమున

నీ సరోవర ప్రాంతమున కనీస మేఁడువేల మందిరము లుండినట్లు తెలియ వచ్చు చున్నది. ప్రస్తుత మిచ్చోట ౭౦౦ మందిరము లున్నవి. వీనిలోఁ ప్రధాన మందిరము భువనేశ్వర భగవానునిది. దర్శనార్థ మనేక యాత్రికులును ప్రతిమాస మేగెదరు. శ్రీభువనేశ్వర దర్శనము, బిందుసరోవరమునందు స్నానము, తర్పణ, పిండప్రదానము మొదలగునవి యొనరించుట గొప్పపుణ్య మని బ్రహ్మపురాణ, పద్మపురాణ, కపిల సంహిత మొదలగు గ్రంథములలో వ్రాయఁబడియున్నది. సరోవర మధ్యమున నొక చిన్న మందిర మున్నది. ఉత్సవసందర్భమున భగవానుని యుత్సవమూర్తి నందు నిలిపెదరు. ఈ సరోవరమును భారతవర్షము యొక్క ౪ ప్రధాన సరస్సులలో గణన చేయుచున్నారు. తక్కిన 3 సరోవరము లివి......(౧) మానస సరోవరము (౨) పంపాసరోవరము (ఇది దక్షిణమున గుంతకల్ సమీపమున నున్నది.)......(3)నారాయణ సరోవరము (శ్రీద్వారకాపురీ సమీపమున నున్నది.) ఈ సరోవరము ౧౩౦౦ అడుగుల నిడివి, ౨౦౦ అడుగుల వెడల్పు గలదు. దీని సరాసరి లోతు ౮ అడుగులు. ఇందు భారత వర్షము యొక్క సరస్సుల జలము, పుణ్యనదీమతల్లుల తోయము మిశ్రమొనరింప బడినది. బిందుసరోవరమే కాక యీ పుణ్యక్షేత్ర సమీపమునం దనేక సరస్సులు గలవు. వాని పేళ్ళు యీ దిగువ నుదహరింపఁ బడుచున్నవి:— పాపనాశనీ, గంగాయమున, కోటితీర్థము, బ్రహ్మకుండము, మేఘకుండము, అలాబు కుండము, రామకుండము, దేవీపదహర, గౌరీకుండము, కేదారకుండము. వీనిలో నొక కోటితీర్థమున మాత్రము వర్షాకాలమున జల ముండును. తక్కిన వేళలందు జలశూన్యమై యుండును. గౌరీకుండమున నీటిఝుర ముండుటచేతఁ బండ్రెండు నెలలు శుద్ధజలము లభించును. ఈ జలమే కేదారకుండమునకుఁ బోవును. ఈ రెండు గుండములనీరు ఆరోగ్యప్రద మైనది. దేవీపదహరజలమును గుఱించి యీ దిగువ కథ వ్యవహారమున నున్నది. శ్రీ దుర్గాదేవి యిచట నిద్దరు దానవులతోఁ బోరి వధించెను. యుద్ధకాలమున దేవీపద ఘట్టనచే నీ పల్ల మేర్పడినది. జలపూరిత మైనది. ఒక చిన్న సరస్సై దేవీపద హర మను పేరఁ బిలువఁబడు చున్నది. భువనేశ్వర మందిర మతిప్రాచీనమైనది. కేసరివంశపు ప్రథమభూపతి జజాతి కేసరి క్రీ॥శ॥ ౬౧౦ లో దీనిని నిర్మింపఁబూనెను. ఇతని కాలమున నిర్మాణము పూర్తి కాకుండుటచే నితని యనంతరము పాలించిన యిద్దరు ధరణీశులు నిర్మాణమును సాగించిరి. సంపూర్తి కాకుండుటచే లలాటేందు కేసరి యను చతుర్థనరేంద్రుఁడు ౬౫౭ సంవత్సరమున నీ మహత్కార్యము సంపూర్ణ మొనరించెను. ఈ విధముగ సుమారు ౮౦ సంవత్సరములలో నిర్మాణకార్యము పరిసమాప్త మైనది. ఇందుకొఱకు ధనము ప్రవాహరూపమున ప్రవహింపఁబడిన దని చెప్పవచ్చును.

నృపతి కేసరి తన రాజధానిని కటకమునకు మార్చెను. నాటినుండి భువనేశ్వర నగరమహిమ చాలవరకు తగ్గిపోయినది. ప్రస్తుత మీ నగరము బాడై యున్నది. అయినను భగవానుఁడు అడవిలోనే శుభముఁ గలిగించువాడు కావున లింగరాజు కృపవలన నచటికి వేనవేలు యాత్రికులు వచ్చి స్వామిని దర్శించి నిత్యకల్యాణ మొన రించుచున్నారు. కేసరివంశపు చివరరాజు భువనేశ్వరుని భోగమందిరమును మఱియు నర్చకుల నివాసమునకు భవనములఁగట్టి స్వామిభోగములకును గట్టివ్యవస్థ గావించెను.

మందిరపు నలుగెలంకుల ౭ అడుగుల యెత్తున బలిష్ఠమగు రాతికట్టడముగల ప్రహరియున్నది. ౫౨౦ అడుగుల నిడివి, ౫౦౦ అడుగుల వెడల్పుఁగలదు. ఈ ప్రహరిలో ననేక మందిరములు సుమారు ౧౦౦ కలవు. ఆ మందిరముల మధ్యభాగమున శ్రీ భువనేశ్వర స్వామి ప్రధానమందిర మున్నది. ఈ మందిరమునకు నాలుగు భాగము లున్నవి. భోగమందిరము, నటమందిరము, జగమోహన, గర్భగృహము లని పేళ్ళు. ఇవి యొకదానితో నొకటి సంబంధించి యున్నవి. ఒక మందిరమునుండి వేఱొక మందిరమునకు మార్గము గలదు. భోగమందిరమునం దన్నదాన సమయమున విశేష భోగము సమకూర్చెదరు. విశేషోత్సవకాలమున నటమందిరము నుపయోగించెదరు. జగమోహన మందిరమున ప్రేక్షక వర్గము గుమిగూడెదరు. అచటినుండియే శ్రీ స్వామి దర్శనమగును. గర్భ గృహములో భగవానునిమూర్తి యున్నది. ఈ విధముగా నాలుగు భాగములు నాలుగుపనుల కుపయుక్తము లగును. మందిర ప్రాకారపు ప్రధాన ద్వారము (సింహద్వారము) యెట్టయెదుట నరుణస్తంభ మను పేర నొక గొప్ప సుందర స్తంభము గలదు............గర్భ గృహముపై ౧౮౦ అడుగుల యెత్తైన శిఖరము నిర్మింపఁ బడియున్నది. అది యొకే శిలతో స్థాపించినట్లు కానవచ్చును. అందెచ్చోటనైనను సున్నముతో లేపనమున్నట్లు, లేక రాళ్ళను కలిపినట్లు కాన్పించదు. మందిర శిల్పమందొకవిశేషము స్ఫురించును. మందిర మనేక లతాపుష్పాదికములతోడను విగ్రహములతోడను విరాజిల్లుచున్నది. మూర్తుల రామణీయకము ప్రేక్షక గణమునం దానందలహరిని రేకెత్తించును. స్థాపత్య కళా దృష్టితోఁ బరిశీలించిన మందిర మహిమ మెక్కువ యగును. భువనేశ్వర భగవానుని లింగవిగ్రహ మతి విశాలము. లింగవ్యాసము ౮ అడుగులు. ఉన్నతమును యించుమించుగా నంతేయుండును. ఇంత గొప్ప శివలింగ మెచ్చటను లేదనిన నతిశయోక్తి గాదేమో! లింగాకృతియును విచిత్రముగా నున్నది. అదియొక పాషాణ స్తంభమువలె కనబడును. అది మూడు భాగములుగా విభజింపఁ బడియున్నది. బ్రహ్మ విష్ణుశివాత్మకముగ ద్యోతకమగు చున్నది. లింగము యొక్కదిగువ ప్రదే

శమున జలము నిండి యుండును. దధిక్షీర జలములతో స్నాన మొనరించెదరు. జగన్నాథ మందువలె నిచ్చట యాత్రికులు జాతిమత విచక్షణ లేకుండ ప్రసాదమును (కచ్చీరసాయి) స్వీకరించెదరు. గర్భగృహ నిర్మాణము నితరగొప్ప శివాలయములవలె నుండుటచేత నందు వెలుతురు చాలాతక్కువగా వచ్చును. పట్టపగటి వేళ దీపసాహాయ్యమున శ్రీభువనేశ్వరస్వామి దర్శనమగును.

ఈ మందిరమే కాక యితర ప్రధానమందిరము లీ దిగువ నుదహరింప బడుచున్నవి.......కపిలేశ్వరము, అనంత వాసుదేవ, కేదారేశ్వర, ముక్తేశ్వర, బ్రహ్మేశ్వర, పరశురామేశ్వర, కపిలేశ్వర. మహాదేవుని దర్శనార్థము మెక్కువగ నసాధ్యరోగపీడితులు వచ్చెదరు. వారు తమ వ్యాధిపీడనుండి విముక్తులైపోవుట సాధారణముగా జరుగుచున్నది.

అనంత వాసుదేవుని మందిరమునందు శ్రీకృష్ణ బలదేవుల విగ్రహము లున్నవి. యాత్రికులు మొదట శ్రీకృష్ణ బలదేవుల సందర్శించియే భువనేశ్వరస్వామి దర్శనమున కేగెదరు. ఈ మందిరము బిందు సరోవర తీరమున నున్నది. దీని నిర్మాణము ౧౦౨౭ క్రీ|| శ|| వత్సరమున వంగదేశ వాసి యగు మహాదేవభట్టను బ్రాహ్మణుడు చేసెను. ఇతని వంశీయులు నింతవరకు చాబీస్ పరగణాలోని బరీసాలను గ్రామమున వసించుచున్నారు. కేదారేశ్వర మందిర మతి ప్రాచీనమైనది. భువనేశ్వర మందిరము కంటెఁ బూర్వ నిర్మితము. కలాదృష్టితోఁ జూచిన ముక్తేశ్వర మందిర మతి సుందరము. బ్రహ్మేశ్వర పరశురామేశ్వర మందిరములు ౯ వ శతాబ్దములోనివి. ఇవి స్థాపత్యకళ ననుసరించి యుత్తమ శ్రేణిలోఁ జేరదగినవి. ఇవియే కాక పార్వతీదేవి మందిరము సైత మతి సుందరమని తెల్పుచున్నారు. భువనేశ్వర నగర శీతోష్ణస్థితి చాలా యుత్తమ మైన దని చెప్పుచున్నారు. సముద్ర సమీపమం దుండుటచే నచట సమశీతోష్ణముగా నుండును.

ఈ మందిర ప్రసిద్ధి నాకర్ణించి యొకసారి భారతదేశపు భూతపూర్వవైస్రాయి లార్డు కర్జను అత్యుత్సుకతచే నిచటి కేతెంచెను. అయినను పాశ్చాత్యుఁ డగుటచేతను స్వధర్మీయుఁడు కాకపోవుట చేతను వారిని మందిరాంతర్భాగమునకు రానీయక ప్రాకార బహిర్భాగమునం దొక యెత్తైన తిన్నె గట్టించి దానిపైనిలిచి వైస్రాయిగారు మందిరమును దర్శించుటచే తనివొందెను.

భువనేశ్వరమున కైదు మైళ్ళ దూరమునం దుదయగిరి ఖండగిరి యను కొండలు గలవు. వీనిని దొలిచి యెన్నియో గుహామందిరములు భవనములు గట్టినారు. ఇచట మొత్తము ౫౦ లేక ౬౦ గుహాలుండవచ్చును. భువనేశ్వరమున కింతే

దూరమున నొక విఖ్యాత ప్రదేశము గలదు. దీనిని ధౌలిక యశ్వత్థామ పర్వత మందురు. దీనిని తొలిచి యనగఢ్ (హస్తిరూపము) గావించినారు. దీనిపై అశోక చక్రవర్తి సుప్రసిద్ధా దేశములు (బోధనలు) (Edicts) వ్రాసియున్నారు. భువనేశ్వరమునుండి ౨౦ మైళ్ళ దూరమున సముద్ర తీరమందు జగత్ప్రసిద్ధ మగు కోణార్క విశాల సూర్యమందిరము దర్శనీయమై యున్నది.

౧౦ ఖజురాహో యొక్క శివ మందిరము

పాఠక మహాశయు లనేకులు పై పేరుగల మందిరమును వినకయుందురు. కాని యీ ప్రదేశము రమారమి వేయి సంవత్సరములకుఁ బూర్వము (వేలకొలది సంవత్సరములనుండి వీరభూమిగా నెన్నుకొన దగిన బుందేల్ ఖండమునకు) రాజధానియై యుండెను. ఇచటి సువిశాల శివ విష్ణుమందిరములును జైన బౌద్ధ మందిరములు ప్రాచీన శిల్పకళయొక్క ప్రత్యేక నిదర్శనములై యున్నవి. మార్గ మతి దుర్గమమైన కారణమున ధ్వంసకారు లచటికి రాలేదు. లేనిచో ధ్వంసమొందియే యుండును. ప్రస్తుత మిది చెక్కుచెదరకుండ యథాపూర్వముగా నున్నది. సుప్రసిద్ధ చీనాయాత్రికుఁ డగు హ్యూన్‌సాంగ్, మహమూద్‌గజనీ వెంట వచ్చి యుండిన అబూరీహన్, మఱియు యిబ్న్ బతూత- వీరి యాత్రాగ్రంథములలో ఖజురాహోయొక్క సమృద్ధి, మహత్త్వముయొక్క వృత్తాంతము కానబడుచున్నది. ఇబ్న్ బతూత ౧౪ వ శతాబ్దపు పూర్వార్ధమున భారతదేశమున కేతెంచెను. ఇతఁడు వ్రాసిన దేమనగా ? ఖజూరాహోయందు గొప్ప గొప్ప జటాధారులును కృశశరీరులగు తాపసులు యోగులు వసించువారు. వారియొద్దకు యంత్రమంత్రముల నభ్యసించుటకు ముసల్మాను లేగెడివారట. విచారణీయాంశ మేమనగా! ప్రస్తుత మీ ప్రదేశము నిర్జనమై దీనావస్థయందున్నది. బందోబస్తు కాగిదములలో వానయోగ్యము గాని ప్రదేశమని వ్రాసియున్నారు. ప్రస్తుత మిచట 30 గొప్ప మందిరములు విరాజిల్లుచున్నవి. వీనిలో శంకరుని ౨ మందిరములు గలవు. కాండరీయ మహాదేవుఁడు విశ్వనాథమహాదేవుఁడు ముఖ్యముగా దర్శనీయులు. వీరిని గుఱించి సంక్షేపముగా వ్రాయఁబడును..........

మహాశివరాత్రి సందర్భమున గొప్పయుత్సవము జరుగును. ఇందు లక్షలకొలది యాత్రికులు దూరదూర దేశముల నుండి వచ్చెదరు. మైళ్ళకొలది దూరము జనాకీర్ణమై యుండును. కాండరీయ మహాదేవమందిరము మిక్కిలి గొప్పది. దీని నిర్మాణము శాస్త్రవిధి ననుసరించి జరిగినది. భువనేశ్వరమునం దున్నరీతిగా నిచ్చట చెక్కు శిలలను విగ్రహములుగా నిర్మించినారు. పురాతత్త్వ వేత్తల యభిప్రాయానుసారము

యీ యొకేమందిరమున ౧౦౦ విగ్రహము లున్నవి. లింగ విగ్రహము నాలు గడుగుల వ్యాసము గలిగియున్నది. పదవ శతాబ్దము మందిర నిర్మాణ కాల మని తెల్పుచున్నారు. శ్రీ విశ్వనాథుని మందిరము దీనిని పోలియేయున్నది. కాని కొంచెము చిన్నది. మఱియు దీనినాలుగు మూలలయందు నాలుగు (ఆలయము) లున్నవి. ప్రధాన మందిరమున శంకరుఁడు లింగరూపమున విరాజమానుడై యున్నాడు. గర్భగృహము నందలి నందీశ్వరునిపై భగవాను డారూఢుడైనట్లు మానుషరూపమున నున్నది. మఱియొక భాగమున హంసవాహనారూఢుడైన బ్రహ్మయు వేఱొక భాగమున గరుడవాహనారూఢు డగు విష్ణుమూర్తియును నున్నారు. మందిరబహిర్భాగమున చిన్నవియును పెద్దవియునగు ననేక విగ్రహములున్నవి. మొత్తము ౬వందలకు మించిన విగ్రహములు గలవని లెక్కించినారు...... (ఖజురాహో) ఛత్రపురరాజ్యము లోనిది. ఇచట కేగుటకు ఝాన్సి మాణిక్ పూర్ లైను యొక్క హరపాల పూర్ స్టేషను నుండి ౬౦ మైళ్ళ సడక్ యున్నది. శ్రీమాన్ ఛత్రపురరాజు కృపవలన నిచట వస్తు ప్రదర్శనశాల యొకటి స్థాపింపఁబడినది. దీనిలో ననేక ప్రాచీన విగ్రహములు సంగ్రహింపఁబడినవి. హరపాలపురినుండి ఖజురాహోవరకుఁ బోవునపుడు మార్గమధ్యమున ఛత్రపురి రాజధాని యున్నది. ఖజురాహోనుగుఱించి, చందబరదాయికవి, తన గ్రంథమునందు (పృథ్వీరాజరాసో) విశేషముగా వ్రాసియున్నాఁడు.

(ఓం శివమ్)

---

# యోధుఁడు*

శ్రీ ఎన్. కోటయ్య బి. ఏ, గారు

కవి:

యోధుఁడా! యెద్ది నీ మది బాధపెట్టె, నైజతేజము బాసి యొంటరిగఁ దిరుగ
నిచట సరసిదరిం దీఁగె లెండిపోయె, లేవు కలకంఠకుల కాకలీస్వనములు
పండె వరి, కోఁత లయిపోయె, నిండియుండె, నుడుత ధాన్యపుభాండార; ముల్ల మెంతొ?
వగలఁబొగుల భయదమూర్తి వయితి వెద్ది, బాధ పెట్టంగఁ గలిగె నిన్ యోధవర్య
కలువవలెఁ దెల్లఁబడె నీ నిటలము మంచు, బొట్లవలె వేదనాఘర్మము గననయ్యెఁ
జెక్కుల గులాబికాంతియుఁ జెన్ను దఱఁగి, సమసిపోవంగ నున్నది సత్వరముగ.

యోధుఁడు:

కంటిఁ బచ్చికబయలునఁ గాంత నొర్తు, నాకకన్యల మించు సౌందర్యరాశి
లేడిపిల్లలకన్నఁ దేలికగ నడచు, బారెడేసి కురుల్, కనుల్ చేరెడేసి,
కుసుమములతోడ మాలలఁ గ్రుచ్చి నేను, ఆమె తలమెడ కేల్గానులం దలంక
రింప, నది ప్రేమదృక్కుల నింపి యొక్క, మధురరుతమున నన్నుమై మఱవఁజేసె.
ఆమెఁ దురగము నెక్కించి యల్లనల్ల, నరిగితిని దినమెల్ల నన్యమ్ము మఱచి
నాఁడఁ బ్రక్కకు నొఱఁగి పూఁబోడి పాడు, దివ్యమోహన మధురగీతికల వినుచు.
ఆకె తినఁదెచ్చె నా కతిలోకమధుర, కందమూలముల్, పుష్పమరంద మమృత
ఫలరసమ్మును, మఱి దేవభాషఁ బలికె, 'నిన్ను వలఁచితి యోధుఁడా నిక్క' మనుచు.
తన గుహాలయమునకు నన్గొనిచనె; నట, జాల్గరుగ నేడ్చి నిట్టూర్చె వ్రాలె సోలె
నామె మృదుల విశాలనయన యుగళము, నాల్గుముద్దులతోఁ గప్పినాఁడ నపుడు.
ఆమె యొడిలోన జోకొట్టు లంది నిదుర, గంటి, కలఁగంటి బహుళదుఃఖాత్మకమ్ము;
శీతగిరి గహ్వరాంతరసీమఁ గనిన, కలయె దీర్ఘతమమ్ము నేఁ గనిన కలల.
కత్తిఁగోసిన నెత్తురు గానరాని, విగత తేజులు రాజులు వీరభటులు
కానవచ్చిరి; వారైకకంఠ్యముగను, 'బానిసీఁడైతె నిర్దయా! భామ!' కనిరి.
వారి యెండు పెదవులట్టె భయముగఁ దెఱచుకొని నను హెచ్చరించుటఁ జూచినాఁడ
నునువెల్గులోనఁ; దెలివిరా నుంటి నిచట, శీతలహిమాచల సరస్తటీతలమున.
కావుననె యిట్టిచోట విగతసఖుఁడను, గష్టమతి నయి యిటునటుఁ గడచుచుంటి
సరసిదరిఁ గనుపండువై మెఱయు లతలు, మాడియున్న శకుంతముల్ పాడకున్న.

*John Keats:— La Belle Dame Sans Merci.

# గిరిజాపరిణయము

(5 వ సర్గము)

శ్రీ విద్యాప్రవీణ బొడ్డనపల్లి వీరభద్ర వరప్రసాదరాయశర్మగారు

ఆ శివుఁ డట్లు మన్మథు నిజాంబక ఘోరతరార్చి భస్మపుం
రాశి యొనర్ప వ్రీలిన మనమ్మున శైలజ యెంచె స్వర్ణసం
కాశతదీయరూపము విగర్హిత మయ్యె నటంచు సత్యమం
తే! సతు లెందు నాత్మహృదయేశుల కింపని రూప మోర్తురే!

అన్యకాంత కలభ్యుడై నట్టి పతిని, అన్యకాంత కలభ్య మైనట్టి ప్రేమ
తన మహోజ్జ్వలరూప సార్థక్య గరిమ, మానికర్మను సాధింపఁ బూనె చాన.

ఆ శైలాత్మజ యీశు ప్రాణపతిగా నాత్మం విలోకించి తా
నాశం జేసెడి కష్టమౌ తప మటం చాలో విచారించి మే
నాశీతాంశునిభాస్య వక్షమున సన్మానించియుం గూతు తా
నాశీస్సుల్ కురిపించి పల్కు మన కమ్మా యేల మానిక్రియల్.

ఈ విధినే మదిం దలతు వేని కుమారి! గృహంబులో శచీ
దేవి మొదల్ సురాంగనలు దీపిల రే! కనగా శిరీషముం
దావికి జేరు భృంగపు పదాహతి నోర్చు- పతత్త్రిపాదము
న్నావిధి నోర్చుకోగలదె హా! ఎటు సైచెద విట్టికష్టముం.

తపము నీ రీతి సేయగా దలచుకూతు, తల్లి ఘరలింపలేదయ్యె దానినుండి
పల్లమున కేగు జలమును పైకిపాఱు, నట్లు సేయంగ నెవ్వరికైన తరమె.

తనదు మనోరథ మ్మెరుగు తండ్రిని పల్కెను చేటికాముఖ
మ్మున నొకప్రొద్దున న్నగజ; పూన్కి మహేశ్వరు భర్తగా మన
మ్మున వరియించితయ్య అది పూర్తిని గాంచెడిదాక కానన
మ్మున వసియింపుచుం నియమపూర్ణ తపోనియతాత్మ నయ్యెదం.

తా దలంచిన కార్యమ్ము ధన్యతగన, గురుడు పూజ్యుఁడు జనకుని వరములంది
ప్రజలలోపల పిదప పేర్గనిచెలంగు, గౌరిశిఖరమ్ము కేగె నా గౌరి అంత.

హృది వెలయించు గంధమును రేపెడి పేటలతోడి హారముం
వదలి సునిశ్చితాత్మ యయి పార్వతి తాను తపమ్మొనర్చుకై
ఉదయవిరాజి సూర్యకిరణోపమవల్కలముం ధరించె న
య్యది విడనాడె చిక్కదన మా గిరిజాస్తన సంతతాహతిం.

ఆ నలినాక్షి ముంగురుల యందమునన్ ముఖమెట్లువెల్గెన
ట్లే నెలవొందె పెంజడల నింపు వహింపుచు, ఖేదభావమున్
పూనునె పంకజమ్ము రుచిపూర్తిని, షట్పద భాసమానమై
పూను మనోహరత్వమును పొందదె శైవలసంగమమ్మునన్.

నియమపూర్తికై మువ్మూరు నిల్పికట్టె, తనువు పులకింపజేయు మౌంజి సహించి
అదియె కాంచీగుణంబుగా పదిల మగుట, కాంచి దేశమ్ము రక్తిమగా నొనర్చె.
చిగురుకెమ్మోవి లత్తుక జేర్పమాని, క్లేశ మొనగూర్చు కందుకక్రీడ మాని
దర్భలూనవ్రణమ్ముల దవిలి ఆమె, కరము జపమాల త్రిప్పగా గండుమిగిలె.

ఏ మహనీయ గాత్రి తన యిచ్ఛకు వచ్చిన తూగుటుయ్యేలం
దా మెయి సేర్చి జారిన మనఃప్రభవాస్త్రములం గలంగెనో
ఆ మృదులాంగి యిప్పుడు మహాశనిభూమి మృణాలబాహువు
న్నేమము మీర తల్గడగ నిల్పి కనుంగవ మోడ్చునిచ్చలున్.

నియమమందున తపముకై నిల్చుకతన, ఆమె తనగాత్రి సౌకుమార్యమును తీవె
లందు, చంచల దృష్టులు హరిణు లందు, నిల్పి మరలను తాగొన నిశ్చయించె.

తన కుచకుంభయుగ్మమున ధారగ గారెడి నీటిజాలుచే
నెనరున బెంచె పార్వతి అనిగ్రిత యాచను పిన్నమొక్కలన్
కన మొదటం జనించిన అగమ్ముల భాసురమైన ఆమె ప్రే
మను కడదోయి నించుక కుమారున కేనియు సాధ్యమానొకో!

ఆ తరళాయతాక్షి తన యంజలినిండ నరణ్యధాన్యముల్
మూతగబట్టి ఆ హరిణపోతములం దినిపింప గాంచి అ
త్యాతతమైన ప్రేమమున నవ్వియు నమ్మక ముంచె నామెపై
కౌతుకియైన ఆ నగజ కాంచగ స్వీయపరాక్షి భేదమున్.

స్నానహోమజపాదుల సరవి సల్పి, వల్కలముదాల్చి ఈశ్వరాభ్యాస మరయు
నామె గన వృద్ధమౌనీశు లరుగుదెంచి, రరయ జ్ఞానమ్మె వృద్ధతాప్రాపకమ్ము.

వని మెరయింప సర్వికచవారిరుహానన సత్త్వసంఘముల్
కనవు తదీయవైరము నొకంతయునేని నవప్రసూన రా
జిని ద్రుమసంఘమా అతిథి జృంభితమాచు రహించు నత్తపో
వనము నవోటజానలవిభాసితమై కడుపూత మయ్యెడిన్.

తన మనోగతమైనట్టి ఘనపుకోర్కె అంత తపమున సాధింప నలవిగామి
గాత్రి సుకుమార భావమ్ము కడకు ద్రోసి కఠిన తపమును సల్పగాఁ గడగె నామె.

ఏ లలితాంగి కందుకము నించుక కొట్టినయేని క్లేశ సం
చాలితమై కరంబు వెతసాగెనొ ఆమె తపంబు సేయగా
జాలిన దిప్పు దేహము విసర్పితకాంచనపద్మమాట దా
జాల గనున్ స్వభావమున సారమునున్ సుకుమారభావమున్.

నల్గడలయందు నగ్నుల నాల్గు నునిచి, మధ్యమున జేరి ప్రీతి సుమధ్య యపుడు
నియతి తప్పక దృష్టిని నిల్పి పంచ, మాగ్ని యనబడు నుష్ణాంశు నరయసాగె.

అటు తిగ్మాంశు సుతీక్ష్ణ రశ్మితతి నత్యంతంబు తాపంబునన్
చటులాపాంగముఖాబ్జ మెంతొ జలజచ్ఛాయ ల్విడంబించెడిన్
పటురశ్మిన్ సతతంబు గాంచుట లసత్పద్మాక్షి, క్రీగన్నులం
దట వాసంబును సేసె నల్పు కని యత్యంతంబు సంభ్రాంతితో.

ఆమె కాహారమయ్యె నయాచితమ్ము, జలము శీతమయూఖుని చలువకళలు
వృక్షవృత్తికి వ్యతిరిక్త రీతియైన, పారణావిధి కన్యమా తీరు గనదు.

వివిధములైన వహ్నులను వ్రేల్చుటచే సత మాకసమ్మునం
దవిరతముం జరించెడి ప్రభాకరవహ్నిని దప్తదేహ యై
నవజలబిందులన్ తపము నంత్యమునందున సిక్తగాత్రియై
భువి విడ నూష్మగాత్రమున బుట్టిన నూష్మను వీడె నామెయున్.

నలినదళాక్షి మోముపయిన న్నిలవొందిన వర్షబిందువుల్
నిలిచి యొకింత సేపటు వినీలపు పక్ష్మల జారి వాతెరన్
గలచి పయోధరమ్ముల ముఖమ్మున దొర్లుచు ముక్కలై, వళీ
గళితములౌచు నెట్లొ చిరకాలము నాభిని జేరి నిల్చెపో.

శిలలఁ బరుండుచున్ గృహము సేరక వర్షములందు, ఘోరరా
త్రుల పవళుల్ తపంబు నలతోయజలోచన సల్పనా తపం
బులు నిజమంచు తెల్పగ సమున్మిషితంబులు విద్యుదీక్షణం
బుల రజనుల్ మహాతపము ముందట సాక్షులవోలె కాంచెడిన్.

ఆ లలితాంగి పుష్యపు హిమాంచితవాయు సుశీతరాత్రముల్
లీలగనెంచి నీటను చలింపక పెద్దతపంబు సేసె దా

నోలి నిశాముఖమ్మునను యుగ్మత వీడుచు బిట్టు నేడ్చుచుఁ
జాలి హృదిం గలంచు నలచక్రిపుపక్షుల గాంచి ఖిన్నయై.
జలజసుగంధముల్ చిలుకు చక్కని నెమ్మగముఁ రహిఁ ప్రివే
ప లలితమైన నిద్దమగు వాతెఱ యఁ జిగురాకు వెల్గగా
నిల హిమవర్ష ణక్షత విహీనరుచిం దిగులొందుచుండు నా
జలముల నిల్చి పద్మముగ సల్పె తపంబు శ్రిమఁ జయించుచుఁ.

స్వయముగా పండిరాలిన పర్ణములను
మెక్కుచు, తపమ్ము సేయుటే మేటివిధియ
అట్టిదళముల కూడను అందుకొనమి
నాతుక 'అపర్ణ' యంచు నెన్నంగ బడియె.

అజినపాలాశములచేత నంది బ్రహ్మ, తేజ మొల్కగ జటిలుడై దీప్తవాగ్మి
యై తనువుగొన్న బ్రహ్మచర్యాశ్రిమ మన, వర్ణి యొక డేగుదెంచె ఆ భామకడకు.
ఆ ప్రియాతిథి పార్వతి ఆతిథేయ, మాతని కొసంగె పూర్వమర్యాదఁ గనుచు
అరయ స్థిరచిత్తులందు సామ్యంబు లున్న, వేరు వ్యక్తి విశేషపు గౌరవములు.
ఆమె యొసగిన పరిచర్య అందుకొనుచు, బడలికను కొంతసేపటు పాపుకొనుచు
ఋజుగతిని నామె గని వర్ణి యిట్లుపల్కె, మేఘ గంభీరరవములు మిన్నుముట్ట.
సమిధలు కుశమ్ము లుండునే సవిధమందు, జలము లనుకూలములె గద స్నానవిధికి
శక్తికి న్మించు తపమును సల్పవుగద, ధర్మసాధనహేతు వీ తనువె సుమ్మి:
నీచే జలమ్ము లీ బడి, ఓ చెలియ! సమృద్ధి గనుచునుండునె; సొగసౌ
ఈ చిగురులు లత్తుక వెలియై చెలగెడు నీ యధరము నంద మెనయుచుఁ.

చెలియా శాంతిని జెందునే మన ముమః శ్రీహారితంబుల్ కర
మ్ముల వెల్గొందు కుశంబు లొక్కటను దార్మ్యటెల్ ప్రిసారించి నే
ర్పెలయఁ లాగు కురంగ భామినులపై లీలం ద్వదీయేక్షణం
బుల సాదృశ్యము నెంచు టయ్యావి నినుం బూర్ణమ్ముగా నమ్ముటల్.

మంచి రూప మధర్మ సంబంధమునకు, కడగ దనియెడు పెద్దల నుడులు నిజమె
యిన నీ శీలమెంతయు నాయతాక్షి, మానులకుఁ గూడ నుపదేశమార్గ మౌను.

బలు లెల్లప్పుడు సప్తమానులును వైవఁ పద్మగంధంబులఁ
గళితంబౌ దివిజ ప్రివంతి తలపైఁ గల్గఁ హిమాద్రీంద్రు డెం

దుల శుద్ధుండయి గ్రాలబోడు భవదుద్ధూతాఘ సన్మాని క
ర్మలఁ దా నెంతయు వంశపావనుడుగా భ్రాజిల్లు నత్యంతముల్.

భావిని నీ మనమ్ము పరివర్తన గాంచగ నర్థకామముల్
పోవగఁజేసి ధర్మమునె పూర్ణముగాఁ గయికొన్న దానవే
కేవల ధర్మమే జగతికిం గడు శ్రేయదమౌను సుమ్మి మా
కీ విధియే కడుం బ్రియము నిచ్చును నీకు నభీష్ట మిద్దియే.

నీదు రమణీయ పూజాప్తి నెగడియున్న నన్ను అన్యునిగా నాత్మ నెన్నబోకు
మేల యంటేని జలజాక్షి ఏడుమాట లాడ సఖ్యము కల దందు రార్యజనులు.

బ్రాహ్మణుఁడ నౌట నాకును బహుళచాపలమ్ము గలదది క్షమియించి లలనమిన్న
అడుగఁబోనుంటి కొలదిగ నానతిమ్ము, ఏను వినదగనట్టివి లేనియెడల.

ఆది హిరణ్యగర్భుని మహత్తర వంశమునందు జన్మ సం
వేదితమే తలోదరి! త్రివిష్టపమం దసమాన మేయగుక్
నీదగు రూపగౌరవము నిస్తులభాగ్యము నూత్నయవ్వనం
బీ దెస నాత్మనెంచిన యభీప్సిత మిద్ది యెరుంగ జెప్పుమీ.

ధీరురాలగు సతికి ఈ తీవ్రతపము, సలుప నుచిత మనిష్టమ్ము తొలగకున్న
అట్టి యహితమ్ము నీయెడ నరయజాల, ఎంత చింతించియైన నే నిట్టి యెడల.

ఈ నవకమ్ముచిందు భవదీయపుమూర్తి ప్రియానురాగ స
మ్మానము పొందుగాని అవమానము పొందునె తండ్రియింట న
ద్దానికి తావె లేదు వనితామణి! ఇంకెటు గల్గనేర్చు, నెం
దేని జనుండు సర్పశిర మెక్కిన రత్నములాగ గోరునే.

ఏల ఈ లేతవయసున జాళువా మెఱుంగుభూషల విడనాడి రోయు వల్క
లమ్ము ధరియించితివి, సంజ లలితచంద్రి, కాంతి పోనాడి అరుణుని గాంచునొక్క!

స్వర్గముంగోరి తపమట్లు సల్పుదనిన అదియు నీ జనకుని భూము లంబుజాక్షి
వరుని యన్వేషణ లికేల వాంఛ, రత్న, మొరుని వెదకునె అద్దాని నరయు నతడె.

వేడినిట్టూర్పు వాయువే విశదపఱిచె, యిట్టి తప మెల్ల వరుగూర్చియే యటంచు
మోహనాకారమున నిన్ను ముగ్ధ జేసి, కానరాడెట్టి చిత్రమో కలికి అతఁడు.

ఇట్టి సుకుమారి వైన నిన్నిట్లు పెక్కు, కష్టముల పెట్టు నతఁడు కర్కశుఁడె ఘోర,
గండముల జారి స్నుతసంస్కార మేని, అరయజాలని జటల దా నరయుచుంట.

ఈ మునికర్మచే కృశత నెంతయు గాంచియు తీక్ష్ణరశ్మిత
ప్తామృతరశ్మిలేఖ బలె భాసురతన్ విడనాడియున్న నీ
బాములగూర్చ నెవ్వరు మనమ్ముల నింతురు సంతసమ్ము, తా
నా మహనీయుఁ డెంతటి దయాకలితుండొ యెఱుంగ శక్యమే.

తాన అందాలనిధి యంచు తప్ప కతఁడు, గర్వపడె నందు నావంత శంకలేదు
అట్లుకాకున్న పద్మపత్రాయతాక్షి, తనదు మోహమైన చూపగా తలచె నేల!

చాలగ నింక ఖేదపడ జాలవు నే బ్రిథమాశ్రమమ్ములో
జాల తపంబుగూర్చితిని సంతస మొప్పగ అర్ధ భాగమున్
లీలగ ధార వోసితిని నీకును గాంచు మభీప్సితంబు నీ
వేళ అతండెవండొ వినుపింపుము కర్ణరసాయనమ్ముగా.

ప్రీతి మెయి నాత డెంతయు వేడికొన్న, తెలుప జాలక అపుడె లేదీగబోడి
కజ్జల విహీనమౌ నేత్రకంజమునను, చెలిని పరికింప పల్కె నా జలరుహాక్షి.

ఘనతపఃపూర్తివిభవ! అఖండ తేజ!, మాన్య! విన నెంతువేని మా మాట వినుము
తన శరీరమ్ము నవయు నిస్తంద్రితపము, నీమె గైకొన్న కత మెల్ల నేర్పరింతు.

ఈ ననబోడి లోకముల నెల్లను నేలెడి లోకపాలకుల్
మానితకీర్తు లంచిత విలాస ధురీణులు నా దిగీశులన్
మాని, మనోజశాసను పినాకధరున్ గురు మానికర్మచే
కానగ గోరె నాత్మపతిగా విను మాట లికేల వేయియున్.

హరుని అసహ్యాహంకృతి భయమ్మున నాతని ప్రాప్తి సుంత దా
నరయక సత్వరమ్మున అనంగుని సాయక మీ లతాంగికిన్
నెరియలు వార దూరిన హృదిన్, భరియింపగరాని కాకతో
విరహదవానలార్చు లిటు వేగ్రిల్చెడు మా ననబోడి నెప్పుడున్.

అదిమొదలెంచి సంతత మనోగత దుర్భర మారవహ్నిచే
స్వేద తపియింప నెమ్మొగము నెల్ల కురుల్ విడిరేగ నెప్పుడున్
మదవతి మంచురాళ్ళపయినన్ వసియింపుచు దానిబాధలన్
గుదురు పడంగలేక తగు కోర్కెను కాంచగలేక కుందెడిన్.

హరునిచరితంబు పాడ కిన్నరలతాంగు, లీ లతాతన్వి వారితో నెట్లొ బాష్ప
కంఠయై పాడుచును బాష్పకలితనేత్ర, యనుచు వారలు దనలోడ నలయఁజేయు.

నాలవజామునందు నయనమ్ముల నెట్టులో మూసి రాత్రిఁ
లీలల గాంచుచుం గలల లేచుచు నప్పుడు నీలకంఠ యి
ట్లేల ననుం ద్యజించి యెటు లేగితివోయి యటంచు బాహువుల్
బాళి బహిఃప్రదేశమున బంధము వైచు వియోగ మేచఁగన్.

ఈశ సర్వగతుండవం చెల్లవారు, ననగ వినజాలు దిట్టి న న్నరయవాక్కు- అంచు సర్వేశు ప్రతిమ చిత్రించి విజన,మందు నిందించు మాగ్ధ్య మేపార నింతి.

పరమశివుభార్య కాగ నుపాయ మొండు, కానబడకయె మా తోడ కష్టపడుచు తపము సల్పంగబూనెను ధర్మనిష్ఠ, జనకు నానతి తలదాల్చి సన్నుతాంగి.

ఈమె పెంచిన యీ పెద్ద వృక్షచయమె, సల్పు నీమె తపమ్ము సాక్ష్యమ్ములౌను ఈశు ప్రియునిగ గోరిన యీ లతాంగి, కోర్కి ఎన్నడు చిగురుల గూర్చునొక్కొ.

ఓయి సఖా! ఎరుంగ మిటులూరక ఎంతటి కాలమౌనో మా
యీ యెలనాగ నెప్పుడు గ్రహించునో ప్రార్థితదుర్లభుండు, మే
మీయెడ నశ్రుపాతముల నెట్టుల నీమెను గాంచువారమో
ఆ యమ 'కృష్టభూమి జలదాగతి వేచిన చాయ' దోచెడిన్.

ఇటు లుచితరీతి నప్పు డక్కుటిలచికుర, పల్క 'పరిహాసమా'! అంచు వర్ణియుమను గాంచి చిరునవ్వు వ్యక్తమ్ము గాకయుండ, నందు నెలకొన్న సత్యమ్ము నడుగుటయును

నియతిగ వేళ్ళులందునను నిల్పి జపించెడి అక్షమాల ని
ల్పి, యమితవాక్కున న్నగజ వ్రీడ నొకించుక మోమువాంచి, కో
ర్కియ వారు నొందగా, 'నరయలేమొకో కామిత పూర్తి నెంతయున్
రయగతి' నంచు పల్కగను బ్రహ్మవిదుం డను నవ్వి యాకెతో.

ఈశ్వరుంగూర్చి పల్కుట లెల్ల దెలిసె, నీవు నాతని బొందుటకే దలంచి తీ యమంగళునందు నీ కీప్సితమ్ము, నాకు సంతస మీయ దింతయునుగూడ.

అనుచితమైన వస్తువున నాసను గూర్చిన వెఱ్ఱిదాన నీ
మనమున చింతనేయుము సమస్త సుమంగళ పాణిపీడనం
బున, దగు నీదు హస్త మెటు పూర్ణరుచిం గనజాలు భోగికం
కణుని కరమ్ముతో తొలుతగా నగు సర్వభయమ్ము నోర్చునో.

నీవె మనమ్మునఁ దగిన నిశ్చయమ్ముఁ బరికింపు మెప్పుడే
నీ విధి నీ యుగమ్ము రుచు లీనునె సంగతి నందియున్నచో?
నీ విమలంపు శోభల రహించు దుకూలము, హైమగాత్రి! ర
క్తావృత వర్షముం గురియు నట్టి అసహ్యపు హస్తిచర్మముఁ.

ఇమ్ముగ నీ సఖీజనము లెట్టని లాక్షరసమ్ముపూయ మో
దమ్మున పూలసెజ్జల గదల్చెడి ఎట్టని నీ పదమ్ములె
ట్లమ్మహనీయు కాటిని జయమ్ముగ నడ్గులు పెట్టజాలు నం
చిమ్మహి నెవ్వరేని పరులే యగుగాక సహింపనోర్తురే.

ఇంతకన్న నయుక్త మిం కెందుగలదు అతని యురమును నీ యుర మతిక్కొనిన కలితచందన లసిత వక్షమున గాఢ దీపితమ్మగు భస్మమ్ము తేజరిలదొ.

ఇదియు పరిహాసనీయమౌ గద పురంధ్రి, మదగజారోహణ మొనర్చి కదలు నీవు అతనితో వృద్ధవృషభమ్ము నధివసింప నెల్లవారల కాశ్చర్య మిరవుకొనదె.

శిరమున లేతజాబిలిని జేర్చి యతండు ముదంబు గాంచుటొం
డరయగ నీవు నాతని మనోహరుగా గొను టొండు దుఃఖమౌ
కరివరయాన! మోహనపు కాంతి నొసంగెడి జ్యోత్స్న వీవు, నీ!
మరలుపు మిట్టికోర్కి మతిమంతులు బంధులు నిన్ను మెచ్చగా.

లలన శరీర మెంతయు విలక్షణమౌగద మూడుకన్ను లెం
దుల జననమ్మొ! భాగ్యతతి తోపిలజేయు దిగంబరమ్మొ, ఓ
లలితమృగాక్షి! ఎంచ వరులంగల పుణ్యపులక్షణంపు లీ
లల గనకున్న మానె ఎటులం గనజాలుదు వందు కొన్నియుఁ.

కాంచి నీ పుణ్యలక్షణకాండగరిమ, మగువ యీ కోర్కి తలపక మరలు మింక సాధుజను లెందు యూప సంస్కారములను, సల్పజూతురే కాటిలో స్థాణువునకు.

ఈ రీతి నా ద్విజన్ముడు, వేరుగతిం బల్క లలన వేల్లిత మతియై మారధనుర్భ్రూయుగ్మము, జేరిచి ముడిగాగ పెదవి చెదరగ బలికెఁ.

నిజముగ నీవు నీశ్వరు ననింద్యుని నిందితు నేయుచుంటి వో
కుజను లెఱుంగ శక్యమె విగూఢ తమః ప్రతిభేదకమ్ములౌ
సుజన మహాచరిత్రములు సుప్రతిమై యిటులేల నూరకే
అజగవకార్ముకో త్తమున కాదల గూర్తు పతత్త్వవేదివై.

భూతిని పొందగా దలచు పూరుషు డీ భువి భూతి విఘ్న సం
ఘాతము సేయ నెంచి తగు కామితము ల్గొనుచుండుగాని ఆ
పూత సమస్తలోక పరిపోషణ దక్షున కిట్టి వ్యర్థవా
చాతతితోడ నేమి వ్యవసాయము సేకురజాలునో వటూ!

దర్విద్య మేమియు లేకున్న ధనికుఁడతడు, ప్రేతసద్మనివాసియు న్నేత యతఁడు
భీమరూపుఁ డె కాని అభీముఁ డతఁడు, అతని పరతత్త్వ మింతయు నరయగలరె.

సర్పపు కంకణమ్ములును జాలగ నొప్పు విభూషణమ్ములై
అర్పితమై తనర్చెడి గజాజినముం దగు పీత వస్త్రమై
దర్పముతోడి బ్రహ్మతల దాల్చిన నద్దియె పైడి గిన్నె, సం
సర్పిత సర్వవిష్టప విచక్షణునిం దెలియంగ శక్యమే.

అతఁడు జగన్మనోహరమునౌ ఘననృత్య మొనర్చు వేళ, నా
గతసురసంఘ మా విభుని గాత్రమునన్ దిగజారు ప్రేత భ
స్మతతిని మౌళి దాల్చును సుమా! అది ఆతని మేను దాకగా
నతిపరిశుద్ధి గొంట వినవా పలుమాట లికేల పూజ్యుఁడా!

ఆరయ మత్తవారణ సమన్వితుఁడౌ సురభర్త యైన మం
దార పరాగరక్తపు సదర్చి కిరీటమునన్ మహాత్ము పా
దారుణకాంతి వృద్ధిలగ దా నిటలమ్మున మ్రొక్కునట్టి వం
దారు జనార్తిహారు స్మరదర్పకహారు దలంప శక్తియే.

ఇతర మెరుగక ఈశు దూషించినాడ, వింతతడవైన నిజ మొక టెంచినాడ
వాత్మవిదు లెవ్వనింగాంతు రాత్మలందు, నతఁడు నీ కెట్టులైన లక్ష్యమ్ము గనునె.

ఏల వృథావివాదము లహీనుని యీశ్వరుఁ గూర్చి నీకు నీ
పోలినదారి పొమ్మతఁడు పూజ్యము నా మతి, నా మనోంబుజ
మ్మో లలితేందుశేఖరుని యందె వికాసమునందు నెంచగా
జాలునె స్వేచ్ఛతోడుత నెసంగుఁ జనుండు పరాపవాదముల్.

ఓ సఖి! 'ఈతఁడూరక యె యుండగ జాలఁడు కాంచ నెద్దియో
ఆ శివుగూర్చి పల్క తనదౌ అధరమ్ము కదల్పపోవు వాఁ
డీ శితశూలబాధ లిక నే సహియింపగ జాల నెవ్వఁడే
నా శివు నింద సల్పునెడ నందును శ్రోత్ర అఘమ్ము రెట్టిగా.



# శ్రీ బోధానందులవారి వ్రాతలు

శ్రీ. ము. గురుపాదం అయ్యవారుగారు

భగవద్గీతకు శ్రీకంఠ శివాచార్యుడు సంస్కృత వ్యాఖ్యను విరచించినాడనియును దానిని బెంగుళూరు వారొకరిచ్చినారనియును తెలుగు తాత్పర్యముతో గూడ జేర్చి కోటిపల్లి శ్రీ కంఠమఠము వారని చెప్పుకొను శ్రీ బోధానందులు ప్రకటించినారు. గ్రంథముయొక్క పద్ధతిని జూడగా బ్రహ్మసూత్రములకు భాష్యమును వ్రాసిన శ్రీ కంఠ శివాచార్యుడే దీనిని విరచించినట్లు చెప్పలేము. ఏ గ్రంథాలయములలో గాని, మఱి యెక్కడ గాని లేని ఈ పుస్తకమును శ్రీకంఠ కృతముగా ప్రకటించుటలోని తాత్పర్యమును,సత్యమును,లోకమెన్నటికైనను గ్రహింపక పోదు. పైగా శ్రీకంఠుడు వ్రాసిన ఉపనిషద్భాష్యము మొదలైన గ్రంథములు చాల రహస్యముగా కాశ్మీరములో కల వని గూడ బోధానందులవారు చెప్పుచుందురు. శ్రీ కంఠమఠమొకటి కాశీమణికర్ణికా ఘట్టములో నున్నదనియును,దానికి తాము పరంపరాధికారులమనియుచు మఱియొక యత్యద్భుతమైన అసత్యమును కూడ చెప్పుచు గ్రంథములలో బోధానందులవారు వ్రాయుచున్నారు. కాశీనిగూర్చిన యే చరిత్రలోను శ్రీకంఠుని సంబంధము కనుపడదు. మఠ మంతకంటెను లేదు. ' హంస ' పత్రికవారు ప్రకటించిన 'కాశీసంచిక' వంటి సుప్రసిద్ధమైన పాత్రములోగాని ప్రసిద్ధులైన శ్రీ బాబు భగవాన్

---

అటుల గాకున్న నెటకైన నరుగుదాన, ననుచు పయ్యెదజారిపో నామె కదలె
అంతలో స్వీయరూపమ్ము నవధరించి, చిరునగవుం దోప శివుండామె చేయింబట్టె.
అతని గని యామె విస్మయ మ్మంది మార్గ, మందలి నగమ్ము ద్రోసియు నరుగలేక
జలము మరలింపలేని శైవలిని బోలె, పాద మెత్తక డింప కా పగిది నుండె.

ఓ లలితాంగి నీ తపము నూర్జితశక్తిని నన్నుగొంటి, నీ
లీలల కింక దాసుడను రే బవలంచును చంద్రమఃకళా
మౌళి వచింప పార్వతికి మానస తాపసఖేదజాలముల్
వీలె నిజేష్ట సిద్ధి గన క్లేశముకూడ పరావృతమ్మయా.

"ఇది గిరిజాతపస్సిద్ధి యను ద్వితీయాశ్వాసము."

దానుగారి 'కాశీ వైభవ'మను గొప్ప వ్యాసములోగాని శ్రీకంఠుడు కాశీనివాసు డైనట్లు సూచనలైననులేవు. ఒక పుష్కరకాలము కాశీనివాస మొనర్చిన శ్రీ 'విభూతి' సంపాదకుల వలనగూడ శ్రీకంఠుని మఠము కాశిలో లేనట్లు రూఢిగా దెలిసినది.

శ్రీకంఠ శివాచార్యుడు అసలు దక్షిణదేశపువాడే కాని ఉత్తరదేశీయుఁడు కాడు. ఆతని ఆమర్దకమఠము మున్నగు స్మృతులును, పరంపరాగత శిష్యులును దక్షిణ దేశముననే ఉండిరి. శ్రీకంఠుడు పదవశతాబ్దమున అనగా నేటికి వేయి సంవత్సరముల క్రిత మున్నట్లును శివాధిక్యమును స్థాపించినట్లును శైవుడై నట్లును మదాసు విశ్వవిద్యాలయమువారు ప్రకటించిన "శ్రీకంఠుని శివాద్వైతము" (Sivadvaita of Sreekantha) అను చారిత్రిక గ్రంథమునుండి సరిగా దెలియ వచ్చును. సత్య మిటులుండగా శ్రీకంఠుడు ఆదిశైవ మతమునకు జెందినవాడనియును తమకు పూర్వాచార్యుడనియును అసత్య ప్రచారమును జేయుచు మహర్షి మున్నగు బిరుదములనుగూడ వాడుకొనుచున్నారు. శ్రీకంఠుడు తన బ్రహ్మసూత్ర భాష్య ములో నెక్కడను అదిశైవుడ నని చెప్పలేదు. కావున నిన్న నేడు క్రొత్తగా ఆదిశై వుల మని ప్రచారము చేసుకొనుచున్నవారికిని శ్రీకంఠ శివాచార్యునికిని సంబంధము లేదని స్పష్టముగా నిశ్చయించుకొనవలెను.

ఇక నీ యాదిశైవశబ్దవిచారము కొంత జేయవలసియున్నది. శైవములో అనేక శాఖలు గలవు. అందు, ఆదిశైవమును ఒకటి కావచ్చును. తెనాలి శ్రీ. ము. నాగలింగ శాస్త్రిగారు ప్రకటించిన "చంద్రజ్ఞానము" అను శివాగమము యొక్క పదియవ పటలములో

"శ్లో॥ శివార్చకత్వా దేతేషాం శైవత్వేపి పరిస్ఫుటం
.................................
తన్మలా ఇత్యుదీర్యంతే సర్వశైవేషు గీష్పతే.                                    ౨౧

తా॥ ఈ ద్విజులు శివార్చకులుగాన శైవులే యైనను శైవదీక్షను పొందని వారు సేయగూడని పదార్థపూజను చేయుటవలనను, శైవదీక్ష పొందనివారు గ్రహింప రాని ద్రవ్యమును భక్షించుటవలనను, శివుని పరిచర్య నేయునెడ అశ్రద్ధాది దోష ములవలనను ఎల్లశైవులలో వీరు తన్మలులు అని చెప్పంబడుచుందురు. తన్మలశబ్దమే తద్భవమున తంబళశబ్ద మయ్యెనని యెఱుంగునది" అనియును.

"వీరు కానీనులు గాన శివప్రతిష్ఠాది కృత్యముల యెడ ఆచార్యత్వమున నధి కారము కలుగదు" (కానీను లనగా వివాహముకాని కన్యకు బుట్టినవారు) అని యును ప్రమాణములు కనుపడుచున్నవి. ఈ శాఖవారికి ఆంధ్రదేశమున తంబళులు

తమ్మళ్ళు అను వాడుకయే కలదు. శివార్చన జేయుటయు, డోళ్ళువాయించుటయు వీరికి వృత్తి. వీరిలో ననేకకుటుంబములకు "ఆరాధ్యులు" గురువులై పరంపరగా వచ్చియుండుట లోకవిదితము. అనగా ఈ తంబళులకు లింగధారులైన వీరమ్మాహేశ్వరులు గురుస్వాములు లని తేలినది. ఇట్టివారియెడ భక్తిశ్రద్ధలు గలిగియుండుట శ్రీ బోధానందులు మొదలగువారి కర్తవ్యమై యుండగా తమ భగవద్గీతలో "వీరశైవులు లింగధారణము జేయు శూద్రజాతివారు" అను పరమ పాతకమైనట్టియు గురుద్రోహకరమైనట్టియు వాక్యమును గీచివైచినారు. తమ గురువులే శూద్రు లగుచో తాము (తమ్మళ్లు) పంచములైనను కావలసి యుందురుకదా! వీరశైవ మతగ్రంథముల నవలోకించనివారికి ఇట్టియజ్ఞానము తొలగ జాలదనుట సహజమే! తమకులమునుగూర్చి తా మెట్లు వ్రాసికొన్నను ఇతరులనుగూర్చి విమర్శనాహీనమైన విషయములను చెప్పి లోకమును వంచింపజనరాదు. వీరశైవుల పంచజగద్గురు పీఠములు పరంపరగా హక్కుభుక్తములు కలిగి ఆగమాదిశాస్త్రములలోను, రాజాధిరాజుల శాసనములు మున్నగు వాఙ్మయములోను సుప్రసిద్ధములై యున్నవి. కాశిలోని శ్రీ జగద్గురు విశ్వారాధ్యపీఠము సుమహా విశాలమైన స్థలముతోడను, జాగీరు భూములు మున్నగు సంపత్తుతోడను విరాజమానమై యుండుట గాంచనగును. ఈ బోధానందులు కాశిలో జూచి కాబోలు తమకుగూడ ప్రత్యేకముగ పీఠము లున్నచో గౌరవము వచ్చు నను తలంపుతో అక్కడక్కడ శ్రీకంఠమఠము లని పేరు బెట్టుటయు, శ్రీ కంఠ విగ్రహములను స్థాపించుటయు, భస్మ రుద్రాక్ష వ్యాఘ్రచర్మాదులను ఘనముగా ధరించి తెలియని దేశములలో పీఠస్థుల మనియును చెప్పినంతమాత్రమున విజ్ఞులు నమ్మజాలరు. ఆకాశ పురాణమునుండియు కల్పిత పురాణమునుండియు వ్రాయక సత్యమైన గ్రంథములనుండి తమ జాతి చరిత్రను నిరూపించినపుడు మాత్రమే పండితాదరణమును బడయగలరు. *

---

* ఈ విషయముల్లో రెండుసంవత్సరములనుండి మాకు అనేక వ్యాసములు చేరినవి. ఇటీవల శ్రీ బోధానందులు సికింబ్రాబాదుకు వచ్చియున్నారు. ప్రత్యక్షముగా విచారించి సత్యాసత్యములను కనుగొన వలెనని ఆహ్వానము పంపగా మా యాశ్రమమునకు వార రారైరి. మాడుసారులు పంపిచూచితిమి. చివరకు ప్రత్యక్షముగా వెళ్ళి సంస్కృతమున సంభాషించగా ప్రత్యుత్తర మీయరైరి. మాట్లాడుట కవకాశమే లేదనిరి. పండితుల యెదుట వారిట్లు ముఖపిధాన మెందుకు చేయుదురో తెలియదు. వారింకను సికిందాబ్రాబాదులో నున్నారు. వారు శివాధిక్యమును శివమత ప్రచారమును జేయుచున్నందులకు సంతోషమేకాని, కనీసము వ్రాతలలో నైనను సత్యమును ప్రకటింపవలెను. లోకమందలి ప్రతిభాసంపన్నులు రహస్యములను ఎన్నటికైనను తెలియగలరు, "గీతా పుస్తకమున వీరశైవ మతమును గూర్చి పొరపడితి" మనివీరు వ్రాసి యిచ్చినచో ఈ వ్యాసమును ప్రకటించు అవసరము మాకుండెడిది కాదు-సం.

# వీరశైవదాతలు

## ఆంధ్ర వీరశైవుల పరిస్థితులు.

* (౧) గుల్బర్గాజిల్లా దుబలగుండి యను గ్రామము దొరవారైన శ్రీ శ్రీ ఫత్తేపూరు శరణప్పగారు మొన్నటి విజయదశమినాఁడు ఇరువదివేల (౨౦,౦౦౦) రూప్యములను వీరశైవమత వాఙ్మయమును ప్రకటించుటకుగాను మహాదానముగా సమర్పించినారు. వీరు లక్షలకొలది శ్రీమంతులు. కావున ఈ దానము వారి క్రొత్త లెక్కలోనిదికాదు. శరణప్పగారు దానధర్మములలోను, పండిత సత్కారములోను చాల కాలమునుండి సుప్రసిద్ధులైనవారే. కాని వారికిట్టి చిత్తము అపూర్వముగా కలిగి వీరశైవ శ్రీమంతులకు నొక క్రొత్తపాఠమును నేర్పినది. వీరశైవవాఙ్మయము ప్రకటించుటకు వేలు కావుగదా లక్షలు కావలసియున్నవి. మిక్కిలి విస్తృతమైన ఈ వాఙ్మయము తెలియక ఒకటిరెండు, వంకరటింకర పురాణములను మాత్రమే పట్టుక పెనుగులాడుచున్నందువలన ఇతరులకును ఈ మతముపై దురభిప్రాయము కలిగినది. శ్రీ శరణప్పగారి ఈ యౌదార్యమువలన వీరశైవలోకమునకు గొప్ప యుపకారము కానున్న దనుట నిక్కువము. ఈ దానము కర్ణాటక మహారాష్ట్ర వీరశైవులకే సంబంధించినట్లు కనుపడుచున్నది. కావున, ఆంధ్ర వీరశైవ ప్రపంచము వైపును వారి దయాదృష్టి ప్రసరించవలె నని నివేదించుచున్నాము.

(౨) గద్వాలలో శ్రీ అవిజ పుల్లయ్యగారను వీరశైవ మహోదారులొకరు కలరు. వారిటీవల ఇరువదివేలరూప్యములనో, ఇంకా ఎక్కువగానో సార్వజనిక కార్యములకై దానమొసంగిరని పత్రికలలో ప్రకటింప బడినది. నేటికి మా ఆంధ్ర వీరశైవులలోను ఇట్టి మహాదాతలను చూడగలిగినందులకు మిక్కిలి సంతసించుచున్నాము. వై. వా. శ్రీ మటికె నాగయ్యగారి తరువాయి శ్రీ అ. పుల్లయ్యగారు ౨వ మహాదాత లని ఆంధ్ర వీరశైవ లోకము పొగడ గలదు. కర్నాటక మహారాష్ట్ర వీరశైవులకు, అనేక ప్రెస్సులు, గ్రంథమాలలు, పాఠశాలలు, ధననిధులు కలవు. ఆంధ్ర వీరశైవుల కన్ననో అన్నియు పూజ్యములే. కావున, అన్నివిధముల వెనుకఁబడియున్న స్వజాతి బాంధవుల యభ్యుదయమునకై శ్రీ పుల్లయ్యగారు తప్పక సహాయపడవలసియున్న సత్యమును వారు గుఱుతించియున్నారని భావించుచున్నాము.

ఆంధ్ర వీరశైవులకు ముఖ్యముగా కావలసినవి ఐదు సంస్థలు. (౧) ప్రెస్:- ఇది ముఖ్యాతిముఖ్యము. వార్తలను ప్రకటించు వారపత్రికకొఱకును, గ్రంథములను ప్రచురించుటకును, వీరశైవ మతప్రచారమునకును అవశ్యమై యున్నది. చిన్న చిన్న

* ఈ వ్యాసము వీరశైవులకై వ్రాయబడినను, సర్వమతస్థుల పరిస్థితులును ఇంతియ.

ప్రెస్సులతో లాభము రాకపోగా నష్టముకూడ వచ్చును. కావున పదివేల రూపాయలకంటె తక్కువ వెల గలప్రెస్సు పనికి రాదు. (౨) మహాపాఠశాల:—సంస్కృతాంధ్రములలో సరియైన పాండిత్యము సంపాదించి స్కూలు, కాలేజీ, విశ్వవిద్యాలయములలో నుపాధ్యాయపదవులను సంపాదించుటకొఱకును, "ధర్మప్రచార మొనర్చుటకును ఇట్టి మహావిద్యాలయ మొకటి పరమావశ్యకము. ఇది బాల బాలికల కుభయులకును విద్యాప్రదమై యుండును. (౩) బోర్డింగు:—ఆంధ్ర వీరశైవ విద్యార్థులనేకులు చదువ శక్తిలేక, ఉండ నీడలేక ఉన్నత విద్యాభ్యాసమునకు తిలాంజలి నొసంగుచున్నారు. రాజకీయముగను వీరశైవులు బ్రతుకవలసియున్నది. కావున ప్రభుత్వ విద్యలను, సైన్సు మొదలైన యాధునిక ప్రజ్ఞావిశేషములను, నేర్చుకొనుటకు ఉచిత భోజనవసతులు గల బోర్డింగుకూడ పరమావశ్యకము. (౪) ఆంధ్ర వీరశైవ మహాసభ:—నానా ముఖములుగ నుప్పొంగుచున్న ప్రపంచముయొక్క పరిస్థితులను తెలియఁజేసి ఆవశ్యకములైన విధానముల సూచించుచు జాతీయతను ప్రబోధించుటకు ముఖ్యముగా మహాసభయు, తచ్ఛాఖలును కావలెను. (౫) మహాగ్రంథాలయము:—విశ్వమునకు సంబంధించిన వివిధ విజ్ఞానము గ్రంథముల ద్వారా నేడు సులభముగా లభించుచున్నది. పరుల గ్రంథాలయములు వీరశైవుల యక్కరను తీర్చఁజాలవు. ప్రతి నిమేషమునకును నేడు గ్రంథాలయములు కావలసి యున్నవి.

ఈ వైదు కార్యముల నిర్వహించుటకు ప్రస్తుతము ఐదు లక్షల రూపాయిలైనను కావలసియుండును. వీని మొత్తము నొక సంఘముగా నేర్పాటుచేసి కట్టుదిట్టములు గల నియమములతో రిజిష్టరు గావించి స్వార్థత్యాగులైన ప్రతిభాశాలుర ద్వారా వ్యవహారింప వలసియుండును. ఈ విషయ మంతయు కొందఱకు స్వప్నమువలె దోచవచ్చును. ఎన్నటికైనను బుద్ధిమంతులు నా యనుభమునకు రాకపోరు. శ్రీమంతులయొక్క ద్రవ్యము బలాత్కారముగ కొల్లగొట్టియైనను ఇట్టి సార్వజనిక కార్యములు మున్ముందు నిర్వహింపఁబడఁగలవని ఇప్పటి కప్పుడే భయము గలుగుచున్నది. ధనకుబేర మహాశయులు ఇట్టి విపత్తులు రాకపూర్వమే తమ ఇష్టపూర్వకముగ ప్రజాహితమునకై దానధర్మముల నొనర్చి ఇహపరములలో కీర్తిని సంపాదించుట పరమ వివేకముకదా !

ఆంధ్రవీరశైవులలోను శ్రీమంతులు లేక పోలేదు. హైదరాబాదు, సికింద్రాబాదు, శంషాబాదు, జడిచెర్ల, జానంపేట, కేసంపేట, చౌదరిగూడెం, మహబూబ్ నగరం, గద్వాల, వనపర్తి, నారాయణపేట, తాండూరు, సదాశివపేట, వికారాబాద్, పూడూరు, శంకరపల్లి, జోగిపేట, మెదకు, తూప్రాణీ, రిమ్మనగోడు, చెన్నూరు,

వరంగల్, హన్మకొండ, వేలేరు, నల్లగొండ, చెరుకూరు, చేబ్రోలు, తెనాలి, వడ్ల పూడి, రేపల్లె, కనగాల, ఇంటూరు, పరిటాల, మైలవరం, తరిగొప్పుల, ఏలూరు, నిడదవ్రోలు, నర్సాపురం, మండపేట, సామర్లకోట, సత్తెనపల్లి, కొరప్రాడు, మాచర్ల నకరేకల్లు, అచ్చంపేట, నంద్యాల, కర్నూలు, గుంతకల్లు, అనంతపురం మున్నగు గ్రామములలోను అనేక పల్లెలలోను వేలు లక్షలు ఆస్తిగల వీరశైవ శ్రీమంతు లెందఱో ఉన్నారు. వీరిలో సహజముగ ౩, ౪ రు తప్ప తక్కినవారందరు గొప్ప దానములను (అనగా నూరురూ.లకు పైగా) చేసియెఱుగరు. కొందఱు అయ్యవారలకు భోజనములను మాత్రము చేయింతురు. కొందఱు తమ పుత్రులను సైతము సరిగా చదివించరు. కొందఱు తమ పెద్దయాస్తిని పురుషార్థములు, ప్రజ్ఞలు, లేని అబ్బ మనుష్యులకో, దత్తపుత్రులకో, దాయాదులకో వదలి పోవుచుందురు. కొందరు తా మైనను సరిగా భుజించరు. ఇట్టి మహానుభావులు ఇతరులకొక దమ్మిడియైన యీయజాలరనుట తథ్యముకదా? కొందరు రేపనిమాపని చెప్పుచు ఒప్పుకున్న దానము లను సైతము చెల్లించకయే కైలాసమునకు ప్రయాణింతురు. ఇట్టి పరిస్థితులవలన వీరెంత గొప్ప ధనికులైనను వీరు పుట్టినది, గిట్టినదికూడ లోకమునకు దెలియకపోవుటలో ఆశ్చర్యము లేదు. ఇక వీరి మతమునకు, కులమునకు వన్నెలు సున్న లగుచో వగవ వలసిన పనిలేదు.

ఇకనైనను ధనికులు తమ ప్రాతపద్ధతిని వదలి, లోకములోని సంచలనమును దెలిసికొని, శ్రీ శరణప్ప, శ్రీ పుల్లయ్యగారివలె గాదుకదా వారి దానములో సగము దానమును జేసినను మే మూహించిన మైదులక్షల రూపాయీలు కూడగలవు. ఒక్కొక రొక పుస్తకమును వేయించినను కావలసినంత వాఙ్మయము మూలనుండి ముంగిటికి రాగలదు. మతీయులకు మహోపకారమును, తమకు కీర్తియును, ఇతరులకు ప్రోత్సాహమును కలిగించినవా రగుదురు. బ్రతికియున్నపుడే ఈ పవిత్రవిషయమును త్వరగా ఆలోచించి ఆనందము నందుదురుగాక !

చి. మ. వీ.

# అఖిల భారత పండిత పరిషత్తు

బెజవాడలో ఇదే నెల 23 మొదలు 25 తేది వఱకు శ్రీ తి॥ శ్రీ॥ త్రిలింగ మహావిద్యా పీఠము వారిచే జరుపబడు అమృతానందనాథ జయంత్యుత్సవ సందర్భములో అఖిల భారతపండితపరిషత్తు సమావేశము కానున్న దనియును, ఆర్యవిజ్ఞాన సంరక్షణార్థమై సర్వతంత్ర స్వతంత్ర కళాశాల స్థాపింప బడుననియును, పండిత శ్రేష్ఠులు బహూకరింప బడుదురనియును కళా విశారదులును తదభిమానులును విచ్చేయ వలసినదనియును పండితరాజ డా. దంటు సుబ్బావధానిగారు తెలుపుచున్నారు.

# నీరక్షీరవివేకము




కమ్మతెమ్మెరలు:—సంపాదకులు, శ్రీ బూర్గుల రంగనాథరావు మొదలైనవారు. ప్రకాశకులు, ఆంధ్రకేసరి గ్రంథమాల, ౧౭౮ సుల్తాన్‌బజారు, హైదరాబాద్ దక్కన్. అచ్చు కాగితములు మంచివి, పుటలు ౧౦౦ వెల ౦—౮—౦.

గ్రంథమాలవారి ప్రథమ ప్రచురణ మిది. ఇందు పదుగురు యువకులు వ్రాసిన పది చిన్నకథలు కలవు. భాష ఆ యా ప్రాంతీయ ఘటనలకుఁ దగినట్లు వ్యావహారికము వాడఁబడినది. కాని వానియందు సంపూర్ణ సఫలత కలుగవలయు నన్న ఇంకను పరిశ్రమ అవసరము. భావములు కొంతవఱకు మొగ్గలవలె బాగుగనే యున్నవి. కుసుమములు కాలేదు. 'కోవెల్లో' వంటి కథలతో రసోత్పత్తి కానేరదు. అట్టివి వ్యాసములలో వివరించుకొనవచ్చును. ప్రేమగాథనే అవలంబించి నేఁడు సాగుచున్న కథారచనలు లోక కల్యాణము నొనగూర్చజాలవు. 'అడి బాప' కొంతవఱకు స్వాభావికముగ నున్నను 'నిష్ఫలం'లోని నాయికను చాల శుష్కముగా నిరూపించినారు. ఎంత శ్రీమంతుని కూతురైనను వ్యక్తులతోబాటు కామమును సైతము తిరస్కరించె ననుట స్వాభావికముగా లేదు. లేక ఇతర వ్యక్తులతోనైనను సంబంధమున్నట్లు ధ్వనింపఁ జేయ లేదు. మొత్తముమీద ఈ మాత్రము మంచికథల పొత్తమైనను నిజాం ఆంధ్రులలో అపూర్వము. ముద్దుగా ముద్రింపఁబడినది.

రెండో ప్రపంచయుద్ధమా?:—ప్రకాశకులు పై గ్రంథమాలవారే! పేజీలు ౧౨౦. కాగితములు రఫ్. వెల నాలుగణాలు మాత్రమే!

ఈ గ్రంథకర్త లెవరోకాని సమయానుకూలమైన పొత్తమును కూర్చినందులకు ప్రశంసాపాత్రులు. నేఁడు ప్రపంచమున చెలరేగిన పోరాటమునకు కారణములను సంక్షిప్తముగ దెలియవలెనన్నచో నీ చిన్నిపుస్తకమును ఒకసారి చదివి వేయవలయును. గత మహాయుద్ధానంతర మీ ముప్పది యేండ్లలో జరిగిన రాజకీయ చతురంగ ఖేలనమును సులభమైన శైలిలో ఒక గుక్కలో చదివేలాగున ఎదిమిది శీర్షికలలో నిది రచింపఁబడినది. ఈ విషయమును గ్రంథకర్త యెక్కడినుండి సంగ్రహించెనో లేక క్రమముగా వార్తాపత్రికలను సంరక్షించియుండెనో తెలిపిన బాగుండెడిది. ఇట్టి మంచి పొత్తము జన సామాన్యమున కందించ గలిగిన ఆంధ్రకేసరీ గ్రంథమాల వారి నభినందించుచు దీని రెండవ భాగమునకు స్వాగతము నిచ్చుచున్నాము.

దయ్యాల పన్నడ:—కర్త: వెల్దుర్తి మాణిక్యరావుగారు ౧౧౧ సుల్తాను బజారు, హైదరాబాదు దక్కన్. పాకెటుసైజు 80 పేజీలు, రఫ్ వెల, రెండణాలు.

వ్యావహారిక భాషలో వ్రాయఁబడిన ఆరంకములు గల చిన్ని నాటకము. సుప్రసిద్ధుఁడైన 'టాల్‌స్టాయి' యొక్క "First distiller" పొత్తము ననుసరించి యిది పరివర్తనము చేయఁబడినది. మద్యపానమును నిరోధించు వారిద్దానిని ప్రచారము చేయవచ్చును. తప్పత్రాగి కన్నుమిన్నెరుగక దయ్యాలపాలగుచున్న పిచ్చిలోకమునకు హితోపదేశము చేయఁబడినది. మద్యనిరోధకేంద్ర సంస్థలో ఉద్యోగిగా

నున్న గ్రంథకర్తగారు, స్వకార్యమువలె నీ ప్రచారమునకు బూని యట్టి వాఙ్మయమును వెలువరించి నందులకు ప్రశంసాపాత్రులు. ఇందలి వ్యావహారికము మెదక్ మండలములోనిది.

వైశ్యాభ్యుదయసంచిక:—సంపాదకులు, అన్నవరపు సుబ్బరావుగుప్తగారు. 'భారతీయ వైశ్య' కార్యాలయము, బెజవాడ, క్రౌన్, ¼ సైజు, పుట ౧౯౦, గ్లేజు, వందలకొలది చిత్రపటములు కలవు, వెల తెలియదు.

ఈ గొప్పసంచికను మిక్కిలివ్యయప్రయాసములతో ప్రకటించినారని సహజముగ దెలిసికొన వచ్చును. సాహిత్యము, సమాజము, వాణిజ్యము, ధర్మము, స్త్రీలు, పురుషులు, మున్నగు ననేకవిషయము లకుసంబంధించిన గద్య పద్య వ్యాసములు నూటికిపైగా గలవు. ఆంగ్లమున పేరెన్నికగన్న వ్యాసకర్త లెందఱో ఇందులో వైశ్యులుగా దెలిసికొని సంతసించనివా రుండరు. ఏబది సంవత్సరములలో వైశ్య సమాజము పొందిన యభ్యుదయము నీ సంచిక కొంతవఱకైనను ప్రత్యక్షము చేయగలదు. అనేక ప్రము ఖుల చిత్రములును, వ్యక్తుల పరిచయమును, గోత్రసూత్ర విషయములును కలిగి ప్రతి వైశ్యుడును వైశ్య చరిత్రాభిమానియును తప్పక సంగ్రహింపఁ దగియున్నది. ఇది "భారతీయ వైశ్యపత్రిక" యొక్క విశేష సంచిక. శ్రీసుబ్బరావుగారి ప్రయత్నము మిక్కిలి శ్లాఘనీయము. లక్ష్మీపుత్రు లనఁదగు వైశ్యులగూర్చిన ఇట్టి సంచిక లెన్నేని ప్రకటింపఁబడియుండవలెను గాని, వారిలోను తగినంత ప్రోత్సాహము లేక వైశ్యుల ఘనతను సముచితముగ చాటుటకీ సంచిక చాలియుండ లేదు. బ్లాకుల ముద్రణము సరిగా లేదు. చాల ముఖ్యులైన ప్రముఖుల చిత్రములును కొన్ని యిందు లేవు. వైశ్యులకు సంబంధించిన వాఙ్మ యము తక్కువగా ప్రకటింపఁబడినది. నీచకృత్యము మొదలైన వ్యాసములు సత్యముల నెఱిఁగి వ్రాయఁ బడినవి కావు. పునస్సంచికాసంపాదనావసరమున మా సూచనలను గమనింపఁగోరుచున్నాము.

గ్రామస్వరాజ్యమ్:—సంపాదకులు టంగుటూరి ప్రకాశముపంతులుగారు. ప్రకాశ్ భవన్, గోపాలదాసురోడ్, పోస్టు మౌంటురోడ్, మదరాస్. క్రౌన్ ¼ సైజు 16 పేజీలు రఫ్, సాలుచందా 4—0—0, అచ్చు మంచిది. ప్రథమసంచిక మా కందినది.

భారతీయుల జీవితము గ్రామజనముల బలముపై నాధారపడియున్న విషయము లోకవిదితము. కాని, నేఁడా గ్రామముల స్థితి దుర్భరముగనుండి దేశదౌర్భాగ్య ధ్వజములవలె నున్నవి. పట్టణములలోని యొయ్యారము లెక్కువైన కొలది పల్లెలలోని లొటారము పెరుగుచున్నది. ఇట్టి దుస్థితిని బోనాడుటకై మహత్తరమైన కార్యవాహిని సాగింపవలసియున్నది. ఈ విషయమున కర్తవ్యముల నుపదేశించి ప్రచార మొనర్చుటకై ఆంధ్రకేసరి శ్రీప్రకాశముపంతులుగారీ వారపత్రికను ప్రకటించుట ముదావహము. వారి పత్రికకు ప్రచారము తక్కువ యుండదు. కాని స్థిరముగా నుండునట్లు జేసినచో ప్రతి పల్లెలోనికిని ఈ పత్రిక పోఁగలదు. ఇందలి వ్యాసము లన్నియు అక్కరకు వచ్చునట్టివే! పల్లెలలో నైనను భార తీయ సంస్కృతిని సంరక్షింపుటకీ పత్రిక సమర్థము కావలె నని కోరుచున్నాము. చందా కొంచె మెక్కువగా నున్నది.

దేశాభిమాని:—సంపాదకులు; పాములపాటి వేంకటకృష్ణయ్యాచౌదరిగారు, గుంటూరు, సైజు సైదే. పుటలు ౧౬ రఫ్ సం. చం. ౨—౮—౦ ముద్రణము, సాధారణము.

సామాన్యముగ నిందు దేశవార్తలు, యుద్ధవార్తలు, సినిమావార్తలు, చిన్నకథలు, గేయములు కలవు. నవీనతగాని, ప్రత్యేకతగాని యేమియు లేదు. గుంటూరులోను ఇట్టి పత్రిక యొకటి యావశ్యక మని సంపాదకులు వెలువరించిన ట్లున్నారు. ఇదియు నొక క్రొత్తవారపత్రిక.

గృహలక్ష్మి (దసరాసంచిక):— సంపాదకులు; డా. కే. ఎన్. కేసరిగారు, రాయపేట, మదరాస్, పుటలు నూరు, రఫ్, వెల ౦—౮—౦.

ఈ మాసపత్రిక ప్రతి సంవత్సరము దసరా సందర్భమున నొక ప్రత్యేకసంచికను ప్రచురించుట యాచారమై యున్నది. ఇది వెనుకటి సంచిక లంతటి యాకర్షణీయముగ లేదు కాని, ముద్రణాసామగ్రి ధరలు పెరిగియున్న నీ సమయములో నిదియే యెక్కువ. ఎప్పటియట్లు మహిళావిదుషీమణుల గద్య పద్య వ్యాసము లనేకములు కలవు. సినిమాతారల చిత్రములును, నారీలోకమున నెక్కువగా నాదరము వడయుచున్నందున గాబోలు అవియే అలంకారముగా నున్నవి. మహిళాసమాజమనోభావములను దెలియగోరు వారికీ పత్రిక సంగ్రాహ్యము. కేవలస్త్రీజన హితమునుగోరి యిట్టి పత్రికను నిర్వహించు సంపాదకుల పరిశ్రమ సార్థకము.

శ్రీ సోమయాజిజయంతి నివేదిక:— ప్రకాశకులు: శ్రీ ఆ. ల. నృ. సో. జయంత్యుత్సవ ఆహ్వాన సంఘము, ఖమ్మంమెట్టు, నిజాం. పేజీలు 18 గ్లేజు, చక్కనిఅచ్చు, వెల లేదు.

వైశ్యులలో సుప్రసిద్ధపండితులును, స్వజాతికై జీవితమును పరిశ్రమింపఁ జేసి ధన్యులైన శ్రీ ఆత్మూరి లక్ష్మీనృసింహసోమయాజిగారి స్మారకముగా వైశ్యసంఘము వారొక గొప్ప జయంత్యుత్సవమును గావించి, యా కార్యోపక్రమోపసంహారములకు సంబంధించిన విషయముల నిందు పొందుపరచిరి. ఈ ప్రయత్న మితర నాగరిక వైశ్యసంఘములకు మార్గదర్శకము. స్వజాతీయమహాపురుషుల గౌరవించుట అభ్యుదయ హేతువుకదా ?

కేశవ క్యాలెండర్ ౧౩౫౦, ఫసలీ:—ప్రకాశకులు; కేశవపబ్లికేషన్సు అండ్ బుక్‌స్టాల్సు లిమిటెడ్, మొజంజాహి మార్కెటు, హైదరాబాద్ ద. పుటలు ౧౬ వెల అర్ధణా.

తెలుగు, ఇంగ్లీషు, ఫసలీ, తిథులు, తారీఖులు, వారములు కలవు. కొన్ని పండుగులు, సర్కారు తాతీళ్లు ఇందు తెలుపఁబడినవి. చాల సామాన్యమైన పాత్రము. ప్రకటనలు కూడ సమమైన స్థలము నాక్రమించియున్నవి. దీనిని పాకెటు సైజులో నైన వేసి పంచిపెట్టవలెను.

జాతకకథాగుచ్ఛము (రెండవ భాగము):— కర్త: శిరోమణి సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు, ౪౪ జీరా, గోకులము, సికిందాబాద్ ద. పుటలు ౧౧౦. మిక్కిలి చక్కనైన ముద్రణము, కాగితములు, రాయల్ సైజు. వెల ౧-౦-౦.

దీని ప్రథమభాగము నిదివరకె 'విభూతి' పాఠకులకు పరిచయ మొనర్చినారము. ఆగ్రంథ మాంధ్ర మద్రాసు విశ్వవిద్యాలయములలో బఠనీయమైన దనినచో శ్రీశాస్త్రిగారి కవిత్వ మహత్త్వముఁగూర్చి చెప్ప నవసరములేదు. ఈ ద్వితీయభాగము గూడ ఆర్యశూరుని 'జాతకమాల'కు తెలుగు సేత. ఇందు పది కథలు కలవు. ఇందలి "బ్రాహ్మణజాతకము" 'విభూతి'లో బ్రకటితమైనది. కావున తక్కిన తొమ్మిది కథలు (జాతకములు)ను ఆటులే నీతి, సదాచార, త్యాగ, దయామయ సిద్ధాంతముల బోధించుచు హృదయంగమములగు దృష్టాంతములతో నిండియున్నవి. సుపరిష్కృతమై, నానుడులతోగూడి, సాపు దేరిన శాస్త్రిగారి సరళ కవితాశైలి తెలుఁగుతల్లికి కర్ణభూషణమువలె చిరముగ వెలుగగలదని భావించుచు శిబి, మాంధాత, చైతన్యప్రభు మున్నగు త్యాగ ధనుల చరిత్ర ప్రబంధములను సన్నిధానమువారి కవితా మాధురితో గలిసి సహృదయుల మనముల తనియఁ జేయవలె నని ప్రతీక్షించుచున్నాము.

పార్వతీపరిణయము (హరికథ):—కర్త, శ్రీరామ కవచము అనంతశాస్త్రిగారు. నారాయణ పురము, జి. నల్లగొండ (నిజాం) పుటలు ౪౦. వెల ౦—౩—౦.

ఇందలి కథ దక్షయాగముతో నారంభమై హిమవంతు నింట పార్వతిబుట్టి తప మాచరించి శివునితో వివాహిత యగువఱకుఁగలదు. కథప్రాతదే యైనను శాస్త్రిగారి సలక్షణమైన కవితామాధురివలన కొన్ని విషయములకు వన్నె లేర్పడినవి. హరికథలో నిన్ని పద్యము లుండుట ఇంపు గాదేమో? అచ్చు కాగితములు బాగుగా నున్నవి. వెల యెక్కువగా నున్నది.

పార్వతీపరిణయము (నాటకము):— కర్త. కీ. శే. అబ్బరాజు వేంకట కోదండపాణి శాస్త్రి గారు. పు. ౧౦౦ వెల 0—12—0. దొరకుచోటు, అ. హనుమంతరాయ శర్మగారు. నెం. 20/188 చెట్లవీథి, గొర్నరుపేట, బెజవాడ.

ఈ గ్రంథకర్త పదారేండ్ల చిన్న ప్రాయమున నీ నాటకమును వ్రాసి పరమపదించె నని తెలిసి విచారించని వా రుండరు. కవిత్వము సలక్షణముగ, సరళముగ నున్నది. కొన్ని పద్యములు ప్రౌఢముగ గూడ నున్నవి. కథలో అటనట కొన్ని విశేషములు గలవు. బాల్యమున నిట్టి కవితాశక్తి గలుగుట అద్భుతము. కవి ప్రౌఢుడు కాక పూర్వమే కాలవశుడగుట ఆంధ్రభాషాదురదృష్టము, ఈ నాటకమును మద్రాసు విశ్వవిద్యాలయమువారు విద్వాన్ పరీక్షకు పాఠ్యముగా నేర్పరచి ప్రోత్సహించినారు. అచ్యుతుని వేంకటాచలపతిరావుగారి చక్కని పీఠిక ఈ నాటకాంగుళీయమునకు కుందనమువలె నందము నీనుచున్నది.

నామలింగానుశాసనం:—(అమరకోశః) కర్త: అమరసింహుడు, ప్రకాశకులు: ఓరియంటల్ బుక్ ఏజన్సీ 15 శుక్రవారపేట, పూనా. పు. ౨౦౦ చక్కని కాగితములు. వెల ౧-౮-౦ నాగరలిపిలో నున్నది.

సుప్రసిద్ధుడైన అమరసింహుని నామలింగానుశాసనములోని "యస్య జ్ఞానదయాసింధో" యను శ్లోకము ఆబాలగోపాలము పరిచితమైనది. కావున దీని ప్రాశస్త్యము క్రొత్తగా జెప్ప నవసరములేదు. "దేశము దిరుగవలెను, కోశము జదువవలెను" అని గదా సామెతమాట—వీరు ముద్రించిన ప్రతిలో విశేష మేమనగా శ్లోకములోని ముఖ్యశబ్దములను పెద్దచ్చులోను గౌణములైన తు. చ. అథ, మున్నగు శబ్దములను చిన్నచ్చులోను సంధులు విడదీసి విరళవిరళముగా నుండునట్లును, ప్రక్కన ఇంగ్లీషు అర్థము నమర్చి బహుసులభమైన పద్ధతితో ప్రకటించి చివరన చక్కని ఇంగ్లీషుశబ్దకోశము జేర్చినారు. సంస్కృతము నెరుగగోరు ఆంగ్ల విద్వాంసులకును, విద్యార్థులకును ఈ పుస్తకము చాల ఉపయోగకరము.

పా. రామకృష్ణయ్యపంతులజీవితము:—కర్త: సాహిత్యవిశారద కోన వేంకటరాయశర్మగారు. స్టూవర్టుపురము, పో. బాపట్ల, జి. గుంటూరు. పు ౪౪. వెల ౦—౨—౦.

గానశాస్త్రమున సుప్రసిద్ధ పండితులైన శ్రీ పారుపల్లి రామకృష్ణయ్య పంతులవారి జీవితచరిత్ర విశేషము లీ చిన్నిపొత్తమున దెలుపబడినవి. వివిధ పుస్తకములను విరచించి విశ్రుతులైన గ్రంథకర్త గారి సులలితమును, సలక్షణమును అగు శైలినిగూర్చి వేరుగా జెప్పనక్కర లేదు. ఆంధ్ర సారస్వత పరిషత్తువారు తాము బహూకరించిన మహనీయుల చరిత్రలను "ఆంధ్రాభ్యుదయము" అను గొప్ప గ్రంథమున జేర్పనెంచి ప్రస్తుత మీ చరిత్రను ప్రత్యేకముగ సైతము ప్రచురించి యాంధ్రాభ్యుదయ మార్గమును ప్రదర్శించినందులకు ప్రస్తుతించుచున్నాము.

కల్పవల్లికా (రామాయణవ్యాఖ్య, ౨, 3 భాగములు):—కర్త: బొమ్మకంటి నృసింహశాస్త్రి గారు. ఆంధ్రీకర్త; బొ. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, కల్పవల్లిక ఆఫీసు, రామారావుపేట, కాకినాడ. క్రమముగా పుటలు 172, 92, వెల 1—8—0, 1—0—0.

వాల్మీకి రామాయణమునకు శక్తిపరమైన సంస్కృత వ్యాఖ్యానమును, తదనుసారమగు ఆంధ్రానువాదమును ప్రథమభాగములోవలెనే వీనియందును గలవు. దీనితో యుద్ధకాండాంశముగూడ పూర్తియైనది. ఈ విధముగ రామాయణము సప్తకాండలలోని ముఖ్యమైన శ్లోకములకు విరచింపబడిన నీ కల్పవల్లికా వ్యాఖ్య యపూర్వ మని సంతసింపని భాషాప్రియు లుండరు. ఇది నాగరిలిపిలో సైతము ముద్రింపబడ గలదనియును, మణిమంజరీ విశ్లథము మున్నగు ప్రౌఢ గ్రంథములు ప్రచురింపబడగలవని యును తెలిసి శ్రీ సుబ్రహ్మణ్య శాస్త్రిగారి ప్రయత్న విశేషము నభినందించుచున్నాము.

# కొన్ని సూచనలు.

శ్రీకరభాష్యము:—'విభూతి' యొక్క గత సంచికలో శ్రీకర భాష్యము చతుస్సూత్రిని పూర్తిచేసి యున్నాము. త్వరగా పీఠికాదులను ప్రకటించెదమంటిమి. కాని అంత సులభమైన పనిగాదని తెలిసినది. శ్రీకరభాష్య కర్త యగు శ్రీపతి పండితారాధ్యుని గూర్చిన శిలాశాసనము, సంస్కృతాంధ్ర కర్ణాటకాది భాషలలోని చరిత్రములు, వ్యాసములు- మొదలగు సామగ్రి విపులముగా దొరకినది. వీని నన్నిటిని చర్చించి ౩౦—౪౦, పుటల పీఠికను సచిత్రముగ తయారు చేయవలసియున్నది. కావున కొంత యాలస్యము జరుగుట తప్పని సరియైనది. పుష్యములోపుగా పీఠిక పైటిలు పేజీలు, మున్నగువానిని మా పాఠకులకు ఉచితముగా బంపగలము. అంతవరకు తమయొద్దనున్న శ్రీకర భాష్యము ౧౨౦, పుటలు భద్రముగా నుంచి తరువాత పుస్తకముగా బైండు చేయవచ్చునని గ్రహింతురు గాక!

చందాదారులు:—'విభూతి'ని సక్రమముగ ప్రచురించవలె నన్నచో ఎంత ప్రయాస యగుచున్నదో కొందరికి దెలియదు. సంవత్సరముల పొడుగున ఉచితము గా తమదగ్గరకు ఎటులు వచ్చుచున్నదో మఱికొందరికి తెలియదు. చేసిన వాగ్దానమును సైతము కొందరు ఏమాత్రమును పంపరైరి. రే పిచ్ఛేదము, మా పిచ్ఛేదమని కొందరు శివలోకమును జేరిరి. ఏక్షణమున నేమి జరుగునో చెప్పలేముగదా! పైగా వాగ్దాన ఋణము చాల గొప్పది. త్వరగా తీర్చుకొనవలెను. ఇతరులను ప్రోత్సహించి యీ పత్రికను చిరస్థాయి యగునట్లు చూచుకొను భారము పాఠకుల ననుసరించి యున్నది. యుద్ధకారణముగా కాగితములధర విపరీతముగా పెరిగినది. అనేక పత్రికలాగి పోయినవి. కావున ఇట్టి కష్ట పరిస్థితులలో 'విభూతి' యెట్లు సాగునో ప్రతి మాసమును ప్రతీక్షలు లేకుండ జేయుటకై ప్రయత్నించుట పరమ కర్తవ్య మని సహృదయులు చిత్తగింతురుగాక!

# శివరాత్రి శ్రీశైల వీరశైవ మహాసభ

ఈ సారి మహాశివరాత్రి సందర్భమున శ్రీశైలములో శ్రీ గిరిరాజ సూర్య సింహాసనాధీశ్వర జగద్గురు వాగీశ పండితారాధ్య మహా స్వాములవారి అధ్యక్షత్వమున శ్రీశైలవీరశైవమహాసభ చాల వైభవముతో జరుగగలదు. కొన్ని వేలమంది స్త్రీ పురుషులు రాగలరు. పండిత ప్రకాండుల ధర్మోపన్యాసములును, జగద్గురువులవారి దర్శనమును సులభముగా లభించగలవు. ప్రేక్షకులు సదస్యులు, మున్నగువారికి ప్రత్యేకమైన ఏర్పాటులును, రుసుములును ఉండును. ముందుసంచికలో విశేషములు ప్రకటింపబడును. తమతమ విశేషములను "శ్రీ ఏజంటుగారు, శ్రీ జగద్గురు పర్వతమఠము, గుంతకల్లు." అని వ్రాసి కనుగొనవచ్చును.

# అత్యుత్తమ గ్రంథములు

| | | |
|---|---|---|
| ౧ వీరశైవగోత్ర సూత్రపటము | ... | ౦-౨-౦ |
| ౨ వీరశైవ వివాహవిధి | ... | ౧-౦-౦ |
| ౩ లింగధారణవిధి | ... | ౦-౬-౦ |
| ౪ లింగధారణ సిద్ధాంతము | ... | ౦-౨-౦ |
| ౫ వీరశైవరత్నము | ... | ౦-౮-౦ |
| ౬ शिवरहस्यम् (सं) भा १ | .... | २-०-० |
| ౭ " " २ | .... | १-८-० |
| ౮ काशी पीठाचे प्राचीनत्व (मराठी) | .... | ०-२-० |
| ౯ సిద్ధాంత శిఖామణి (మూలం) | ... | ౦-౪-౦ |
| ౧౦ శ్రీకరభాష్యం చతుస్సూత్రీ | ... | ౧-౦-౦ |
| ౧౧ ఉమామహేశ్వర వ్రతకల్పము | ... | ౦-౪-౦ |
| ౧౨ మఠములు - మందిరములు | ... | ౦-౨-౦ |
| ౧౩ శ్రీ రేణుకాచార్య చరిత్ర | ... | ౦-౨-౦ |
| ౧౪ వీరశైవ సిద్ధాంతశిరోమణి | ... | ౨-౦-౦ |
| ౧౫ 'Lingayat For Virashaiva' | ... | 0-1-0 |
| ౧౬ Mutts & Mandirs | ... | 0-2-0 |

మేనేజరు - శివధర్మ గ్రంథమాల,
౪-౨౬౭ సజ్జన్‌లాల్ వీధి, సికింద్రాబాద్, దక్కన్.

---

వెలువడినది! **1941** త్వరపడుడు!!

# హైద్రాబాద్ స్టేట్ డైరి

చక్కని కాగితములు, అందమైన అచ్చు, ఉపయుక్తమైన అనేక విషయములతో తెలుగు, ఇంగ్లీషు, అరవము, ఫార్సీ, ఉర్దూ తారీఖులతోను అందమైన అట్ట క్యాలికో బైండుతోను కూడియున్నది. పూర్వప్రసిద్ధమై యున్నదే కావున కాపీలు త్వరత్వరగా అమ్ముడు పోవుచున్నవి. వర్తకులు, పటేల్ పట్వారీలు, గుమాస్తాలు, శ్రీమంతులు, సర్కారీ అధికారులు, వకీళ్ళు, విద్యార్థులు, ప్రచారకులు, ప్రయాణికులు త్వరగా కొనవలెను. ఆలసించినచో దొరకదు. ఈ డైరీకి మఱియొక డైరి సాటిగాని, పోటిగాని లేదని నూటిగా చెప్పగలము.

పుటలు 600 వెల ఒకరూపాయి (కల్దారు)

## శ్రీ రామా బుక్ డిపో

మార్కెటువీధి సికింద్రాబాద (దక్కన్)



డాక్టరు ఎ. వి. కె. మూర్తి, యం. ఎ., ఎన్. డి.

## ప్రకృతి వైద్యము! ప్రకృతి జీవనము!!

జీవితంలో నిరాశ, నిస్పృహ చెంది మానసికంగా ఆధివ్యాధులతో కుమిలి కుళ్లిపోతున్నా, దుర్భరమై దుస్సహమై ఏ వైద్యముతోనూ కుదురని మొండి వ్యాధులతో పీల్చి పిప్పి చేయబడుతున్నాసరే నవజీవనము, నవ్య తేజస్సు, ఉత్సాహము, ధైర్యమూ, శక్తి. సామర్థ్యమూ, ఆరోగ్యమూ, ఆనందమూ, కావాలంటే !



ఆరోగ్య సౌధారోహణము—ఉన్నతాశయం

మృత్తికాచికిత్స, జల చికిత్స, సూర్యకిరణ చికిత్స, వాయు చికిత్స, యోగ వ్యాయామచికిత్స, సూర్యనమస్కార చికిత్స, ఆహారచికిత్స, ఇంకా సర్వవిధములైన ప్రకృతి చికిత్సలను గురించి సర్వవిధములైన వ్యాధులకూ సలహా కావాలంటే వీరిని సంప్రదించండి.



గురి తగిలి తీరాలి

డాక్టరు :
ఎ. వి. కె. మూర్తి,
యం. ఎ., ఎన్. డి.,
బిసెంటురోడ్డు,
గవర్నరుపేట, బెజవాడ.



ఆనందము — ఆరోగ్యము




స చి త్ర మా స ప త్రి క

పుండ్రిము ౨ | శా. శ. ౧౮౬౨ విక్రమ సంవత్సర మార్గశీర్షము | రేఖ ౧౦
Vol. 2 | 22 డిశంబరు 1940 సికింద్రాబాద్ | No. 10

# గి రి జా ప రి ణ య ము

శ్రీ వ్యాకరణ విద్యాప్రవీణ బి. వి. వరప్రసాదరాయశర్మగారు

## ఆరవ సర్గము

ఆ కనకాంగి ఆ శివున కంచితభక్తి సఖీలలామతో
లోకనిదాన ! వేగ నను లోగొన తండ్రికి నిష్టమయ్యె నం
చాకుల పాటులేక కబురంపె వసంతమునందు మావిపై
తేకువతోడ మోదమున దేలెడి కోయిలభంగి నొప్పుచున్. ౧

ఆతఁడాసతి సందేశ మాలకించి, ఇష్టముం జూపి ఉమపాణి యిచ్ఛయించి
శాంతపావనమాని తేజః ప్రభూత, సప్తఋషిమండలంబును స్మరణచేసె. ౨

అంత నరుంధతీ సహితులై ఋషు లేడ్గురు పూలతావి న
త్యంతము హాయిగూర్చు కకుబంత మదేభ మదాంచితమ్ములౌ
వింత రుచిన్వెలుంగు వినువీథిని పారెడు ఏటిజాలులం
దంత కృతావగాహులయి ఆతత నిత్యవిధుల్వెలార్చుచున్. 3

ముత్తెపుంజందెముల్ పైడిపుట్టములను, రత్నమయములు అతునూత్రముల, తాల్చి
నతసహస్రార్క సేవలం దనరి నైజ, కాంతులేపార నెంతేని గ్రాలి రవుడు. ౪

ప్రళయమందున ఆదివరాహదంష్ట్ర, యందు నిల్చియు నిత్యమౌ అవనితోడ;
తద్వరాహదంష్ట్రను నిల్చి తాముకూడ, సేదదేరుటచే చిరంజీవు లగుచు. ౫

స్రష్ట సృష్టికి మిగిలిన సృష్టినెల్ల, చేయుటన ధాతలంచు వచింపబడుచు
ప్రార్జనన లబ్ధ నిర్మలపక్వ బహుళ, విమల సత్తపోవిభవమ్ముల వెలయుచుండి. ౬

తమ్ముపూజించు దేవతాతతికినెల్ల, నిజమహః కాంతు లెంతో అక్కజముగొల్ప
అమ్మునీంద్రులమండలం బపుడువచ్చి, అమ్మహేశ్వరు ప్రత్యక్ష మందునిలచె. ౭

సప్త ఋషుల నరుంధతీసాధ్వి యపుడు, పతిపదంబుల దృష్టులు బరపు చెదుట
లబ్ధమైనట్టి తపము ఫలమ్మనంగ, కరము వెల్గొందె నల్గడల్గప్ప రుచులు. ౮

వారికిని గౌరవమ్మిచ్చుపగిది శివుడు, నామెకుంగూడ గౌరవమ్మటులనిచ్చె
అరయ స్త్రీపుం వివక్ష మర్యాదకగునె, పూజ్యులందున సద్గుణస్ఫూర్తికాక. ౯

వారలం గనినంతన పరమశివున, కధిక మయ్యెను పత్నీసమాశ్రయంబు
సవనకృతులాది సత్క్రియా సంచయముల, ధర్మపత్నులె మూలంపు దైవతములు. ౧౦

గౌరిని గోర నీశ్వరుడు కాముని బొందిని ప్రాణవాయువుల్
జేరెను సప్తమానులును శ్రీ శివుభక్తి రసార్ద్రచిత్తులై
భూరి నుతింపు చిట్లనిరి పూర్వ మధీతములైన వేదముల్
పూరితిగన్న సత్తపము పూజ్యమహంతంబులు నెల్లగూడి మా
కారయ నీదు దర్శనము నందగ కారణమయ్యె నేడిటన్. ౧౧

లోకవిభూ! ఏ కతమున నీకడకుం బిల్వబంచి తీ వరయ నియా
యేకోరిక పక్వమ్మయి చేకురవలె నానతిమ్ము శీఘ్రమ్మె శివా! ౧౨

సోముని పదమును సూర్యుని ధామముగతి మీరియుండు ధామము భగవత్
ప్రేమమున గాంచగల్గుట నేమీ యెడసార్థకత్వ మెంతుము దేవా! ౧౩

నీయెడగల ప్రేమమ్మును ధ్యేయమునౌ మూర్తిగాంచి, తెల్పగతరమే
కాయము పులకలుగాంచెడు నీయెరుగనిదేది? దేవ! నిఖిలేశ! విభో! ౧౪

ఏయంశమ్మున సృష్టిని, సేయింతువొ, పోషణమ్ము సేయించెదవో
ఏయంశ మ్మందియు నీ వాయంశమ్మున నెలయము నందింతు వహో! ౧౫

ఏకోరిక పూరింపగ, నీకోరిక ఆనతిమ్ము నిర్మలకరుణన్
మాకన, దంతమరీచులు, ప్రాకగ శశికాంతితోడ పరమేశుడనున్. ౧౬

ఆరయ నష్టమూర్తుల పరార్థపరత్వమె నా స్వభావమం
చీర లెరుంగలేరె! దనుజేశుడు తారకు డెల్ల వేల్పులన్
ఘోరత నొంప రక్షణము గోర సురల్ తగుశాంతి, దాన నే
గోరెద పార్వతిన్ సురల కోరికదీర్ప కుమారు సృష్టికై. ౧౭

ఈ మనోరథ సిద్ధికై హిమనగమ్మ, గాంక్షసేయుడు సంబంధగరిమ మెరియ
సత్ప్రతిష్ఠాస్పదుడు సిద్ధచరితుడతని సంగతిని నాకు మర్యాద చాలగలదు. ౧౮

తన ప్రగల్భత ఎంతేని తనర నార్య,పూన్కి నీ కార్యపూర్తికై పూను గాత
ఈ మహాకోశిపాతమం దేము మరల, కలిసెదమటంచు శివుడేగె కామగతిని. ౧౯

వార లంతట వియత్పథమున కెగిరి మానస వేగులాచు సంతసమునిండ
నలకాప్రతిస్పర్ధియై విరాజిల్లుచు గంగాప్రవాహ సంకలిత దేవ
దారు వృక్షంపుసంతతిచేత వెల్గొంది మణిరత్నమండితమ్మైన దాని
మిళిత నాగమృగేంద్ర మృగపక్షి సంకులమ్మై తనర్చెడు దాని నధికపూత
శిఖరలగ్నాంబు వాహ సంసేవితమును, కల్పవృక్ష విచిత్రిత కనకతోర
ణమును స్ఫాటికాపాన భూసముదితమును, ఓషధీభ్రాజితమును, సంభూషితమును. ౨౦

యౌవనాంతస్థ వయః పరిణామమై అతనుడే అంతకుండగును నెచట
వలరాచ కేళిలో కలిగెడి సొలపులే నిత్యానుభవమున నిద్రలెచట
బొమముడి మాత్రాన పువుబోండ్ల ప్రేమకై మొక్కెడి ప్రణయి సమూహమెచట
ఛాయాద్రుమోపేత సౌగంధివాసితనందన కాననమ్ములౌ వనము లెచట
అట్టి హిమగిరిపురి గాంచి అధిక మోది, తాత్మలై మానిమండల మ్మాత్మదలచె
అన్నిటంగూడ జేర్గాంచి ఎన్నబడెడు స్వర్గమునకిద్దియౌ ప్రతిస్పర్ధియంచు. ౨౧

చిత్రగతవహ్నులన జటల్ చెలగ వారు గిరిగృహమ్మునదిరిగి వేగిరము మెరయ
ద్వారపాలకు లబ్బురపాటుతోడ, శీర్షములనెత్తి తముగాంచ చిత్రరీతి. ౨౨

జలదాంతర్విలసిత నిర్మల భాస్కరపంక్తిరీతి మహనీయరుచిన్
వెలుగొందె ఋషిపరంపర లలి వృద్ధపురస్సరముగ లాలిత రీతిన్. ౨౩

ఆ పరమర్షుల మర్యా,దాపూర్వక మాతిథేయ ధర్మవిధులచే
నా పురిజేరిచి స్వాస్థ్య ప్రాపితులంజేసి పల్కె పర్వత విభుడున్. ౨౪

జలదములేని వర్షగతి చాడ్పున పూల్గనరాని కాయలుం
బలె ధనరాశి దర్శనము మానితు నన్నొనరింపనంచు నే

దలతు మునీంద్రులార ! దయదాల్చుట నాపయి భూమినుండి ది
వ్యుల నిలయమ్ము కేగినటులుంటిని మీకు నమస్సహస్రముల్. ౨౫

ఇది మొదలెంచి భూతగణమెల్లను శుద్ధినిబొంద జాలెదర్
విదళిత పాపు లీగతిని ప్రీతిగనర్ స్పృశియించి యుంటచే
నెద దలపోతు శుద్ధుగ మునీశ్వరులార శిరమ్మునందు పు
ణ్యద దివిషన్నదీ పతనమందుట మీపద సేవలందుటన్. ౨౬

స్థావర జంగమాత్మకత దాల్చిన యీ తనువెల్ల మీదు సం
భావన పూర్తిసేయుటకె మానికులేశ్వరులార ! మీ ప్రసా
దావహమాచు గాత్రము ముదావహమయ్యెను మీదుదర్శన
మ్మావిధి నాతమమ్ము నశియింపగ జేసెద రీతమమ్ముతోన్. ౨౭

నాచేయుకార్య మేదియొ, తోచదు సేయంగ పాపదూరునిగా న
న్నీచోటికి వేంచేయుట, వాచంయములార భృత్యుపని గొను డింకన్. ౨౮

ఈయమ నాప్రియ నా సుత, యీయది కులజీవితమ్ము నిదియే కొనుడ
య్యా ! యవసరమని మరలన్, మోప్రియగ దరులందు బలుక భూధరవరుడున్. ౨౯

అంత కథాప్రసంగముల నార్యుడు నాంగిరసుండు భూధరున్
స్వాంతమునందు మెచ్చి యిటు వల్కుట నీకె తగున్ మహాత్మ ! య
త్యంతము నీ చరాచర కులావళి కాశ్రయ మీవు పాపతే
డింత ధరాభరమ్ము నెటు లీదును నీ బలపూర్తి లేనిచో. ౩౦

ఈ యవనీతలంబు భవదీయ యశస్సులు నిమ్నగాతతుల్
సేయగజాలు శుద్ధిగొన శీర్ష నిపాతిత దివ్యవాహినిం
ధ్యేయుడవైతి విష్ణుగతి నిల్పితి వాతని లలలెల్ల నా
ప్యాయుడవైతి భక్తి, విమలాఢ్యగుణా విను, మాక్రియార్థముల్. ౩౧

సార్ధచంద్రాంకుడీశ్వర శబ్దవాచ్యు డష్టగుణ శోభితుండు విశ్వావనుండు ౩౨
సర్వభూతాంతరుడు కర్మసాక్షి నీదు నాత్మజన్ గోరి మమ్మిట్టు లడుగ బంచె.

వారినిద్దర గూర్పుము, వాణినర్థ ములను గూర్చినరీతిగా, భూధ రేంద్ర ౩౩
అఖిల భూతమ్ములకు తండ్రి హరుడు కాన నీ మెయును తల్లి గాగ కల్పింపుమయ్య.

నీలకంఠున కెరగి దేవాళి పసిడ నీవిశాలాక్షి పాద రాజీవములను ౩౪
కమ్రచూడామణీ రత్నకాంతితతుల కరము రంజింపజేతురు మెరయభక్తి.

కావున వధు వీ పార్వతి, నీవోదాతవును శివు డనింద్యుడు వరుడా
నీవిధి యాచకులము మే, మో వసుధాధరకులంబు నున్నతి యిదియే. ౩౬
చెలగి జగములు సన్నుతుల్ సేయదగిన, వాడు నీయింట నల్లుడైనాడు కాన
లోక గురునకు శివునకల్లోల మతిని, గురుడ వోచును కీర్తి గైకొనగదయ్య. ౩౭
అని యీ రీతి వచింపుచో ముని పితృప్రాంత ప్రదేశమ్మునం
దున తత్పుత్రియు హస్తపద్మ దళసంచోహమ్ము లెక్కించె, ల
జ్జను శైలమ్ము వధూముఖమ్ము గని తత్స్వాంతమ్ము గైకోలుచే
ననె నవ్వేళ నలంకృతర్ల దన యనిష్టార్థమ్ము వ్యక్తమ్ముకాన్. ౩౮
రమ్ము నాపుత్రి! ఈశుపేరిమమ్మునకు, నిధానమైతివి నాజన్మ ధన్యమయ్యె
అంచు మునులకు నద్రి మ్రొక్కించె సుతను, ఈ త్రిలోచన వధువు దీవించు డనియె.
సిద్ధతుల్య ఫలమ్ము లాశీస్సు లామె కొసగి రా మానులును సిగ్గుగొనెడు గౌరి
నంకవీఠి నరుంధతి ఆదరించి ఆమె జనయిత్రి మేనక నాశ్వసించె. ౩౯
వారలుమూడు నాళ్ళకు వివాహ ముహూర్తము నిశ్చయించి, త
ద్వ్యాపారవివర్త మానులయి పన్నగభూషణుతోడ చెప్పి, స
త్కారముతో నతం డనుపగా చని, రప్పరమేశ్వరుండు క్రొం
గూరిమి పార్వతీ సుఖపుకోర్కిని కాలము వెళ్ళబుచ్చుచో. ౪౦

ఏడవ సర్గము

శుభతిథిని సప్తమంబున శుద్ధిచెలగ, శుక్లపక్షమ్ము నందు సంస్తుత్యరీతి
సకలబంధులతో నాత్మజాతకపుడు, భూధర స్వామి యుద్వాహపూర్తి సేసె. ౪౧
ఆ నగరమ్మునుం జనము, లందరు స్వీయగృహమ్ము నంబలెన్
బూనిక వొల్చుచున్ భువన మోహనపూర్ణ సమస్త శోభలన్
రాణచెలంగ తోరణములన్ వెసగూర్చిరి చిత్రచిత్రముల్
గా నగుపించు ముగ్గులిడి కంబళముల్ జముఖాణ లెల్లడన్. ౪౨
పరచిరి, కొందరంతిపురి బాహ్యపు దేశపు భేదభావమున్
మరుగగునట్లు చేసి రుచిమత్సుకుమార లతాంతగుచ్ఛముల్
పరచిరి, రాజవీథులను మహ్యదుకూల చయమ్ము గట్టి స్వ
ర్గ రమహసించెనం చనిరి రాజిలప్రోలు మనోహరమ్ముగాన్. ౪౩
ప్రాప్తకల్యాణ రేఖ నయ్యతివమిన్న, శైలయుగ్మమ్ము కపుడు నిశ్వాసమయ్యె
తిరిగి జన్మమ్మునందినకరణినాఘు, పుత్రతతిమించు వారికి పొల్పెనంగె. ౪౪

అంకమునుండి అంకమ్ము నందెగౌరి, భూషలనువీడి భూషల పోడిమిగనె
పుత్రిరాగమ్ము వీడి సంపూర్తినెరపె, నా యపత్యమ్ము నంద అయ్యాద్రివిభుడు. ౪౫

మైత్రి ముహూర్తమందున హిమాంశుని నుత్తరఫల్గునీభముల్
చిత్రపురీతి యోగమును జెందగ, మంచిది లగ్నమంచు నా
పుత్రివతుల్ పతివ్రతలు పూర్ణతదంగమునందు భక్తితో
చిత్రవిచిత్రరీతుల సృజించిరి మించు పసిండి సొమ్ములన్. ౪౬

ఆ జలజాక్షి గౌరములు నైదగు దూర్వల లేజిగుళ్ళచే
భ్రాజితగాత్రియై అవయవంబుల కాంతులభంగు లేర్పడన్
రాజిత బాణచిహ్నిత వినవ్యదుకూలము దాల్చె నాభిపై
నోజ నలంకృతింగన దనూచితరీతి వగాహ వేషమున్. ౪౭

ఆ వికచాక్షి సంస్కరణ మందెను నవ్యవివాహపుణ్యదీ
క్షావిధి కర్మచేత నలచంద్రుని పక్షమునందు నవ్యకాం
త్యావృతుడౌచు నర్క కిరణావళిచేతను వృద్ధినొందు రా
జీవ విరోధిరేఖవలె చెల్వముమై పరిపూర్తినొందగన్. ౪౮

లోధ్రచూర్ణమ్ముచేత నల్గులను బెట్టి, పూతమౌ శుష్కగంధమున్ పూసి మేన
స్నానయోగ్యమౌ వస్త్రమ్ము సంస్కరించి, అగజ స్నానగృహమ్మున కనిపి రపుడు. ౪౯

రత్నముక్తామరీచుల రంగులోలుకు, మణిశిలాతలమందున మంగళాంగి ౫౦
నునిచి పూబోడు లంతట కనకరుచిర, కుంభజలముల పోసి రకుంఠితముగ.

నళినదళాక్షి మంగళము నందగుస్నాన విశుద్ధగాత్రియై
చెలగి హృదీశు ప్రేమమయ చిత్తము మెచ్చెడి వల్వదాల్చి సం
కలిత జలాభిషేక యయి కమ్రవిపాండుర కాంతి సంతతిన్ ౫౧
వెలిగెడి రెల్లుపూలుగల పృథ్వినిబోలె వెలింగె నెంతయున్.

జలజాస్య లంతట చయ్యన నా లలితాంగి జతుస్తంభ దర్శితమయి
మణికాంతి మయమగు మంటపంబునుజేర్చి, వేదిమధ్యమ్మున పెంపెనంగ
ప్రాఙ్ముఖగానిల్పి భ్రాజితభూషల, నెదురనుంచినకూడ నే మెరుగని
ముగ్ధచిత్తలవోలె ముసిముసినవ్వుల, క్షణకాల మొండొరు గాంచి పిదప
నగరు పొగవేసియును తడియారనొత్తి, దూర్వవిలసిల్లు పాండుమధూకరామ ౫౨
మర్థచంద్రాకృతిగ ముడి నమరవెట్టి, వేణి బంధమ్మునందున వేగనల్లి.

లలితంబగు ముంగురులను, లలనాస్యము చెలగె భృంగ లావణ్యాలసత్
జలజమునుబోలె మేఘా, కలితంబగు చంద్రరేఖ కాంతియు బోలెన్. ౫౩

గోరోచనారుణితమై, గౌరశ్రీలోధ్రచూర్ణ కల్పితరుచితో
మీరెడు గండంబుల దా, జేరి యవాంకురము కర్ణసృష్టినిగ్రాలెన్. ౫౪

తనదు నెమ్మేన సితహరిద్రాభలొప్ప, నగురు గోరోచనములుంప నగజ అప్డు
చక్రవాకాంకితములగు సైకతముల, పరిఢవిల్లెడి జాహ్నవీ ప్రభవహించె. ౫౫

లత్తుకబూసి నెచ్చెలులు లాలనమై చిగురాకు మోవిపై
హత్తిరి సిక్థకంబు నిసుమంతగ న య్యధరమ్ము నంతటన్
గ్రొత్తదివోలె వెగ్గె నుపగూహనవేళల భర్తృపీడనా
కృత్తములౌ వ్రణమ్ములను కేరినదింబలె కంపమందుచున్. ౫౬

చెలియ ఒకర్తు ఓసి సరసీరుహనేత్రి మనోజ్ఞ లాక్షచే
జెలగు పదమ్ము నెత్తి విభుశీర్షమునందలి చంద్రమఃకళన్
నిలుపుమటంచు హాస్యముగ నేర్పొలయం బలుకంగ పార్వతీ
లలనయు పూలదండ సవిలాసముగా చెలిపై చె నీసునన్. ౫౭

మంగళమంచును బోటులు, రంగగు కళలీను కజ్జలమ్మం గనులన్
మంగళగాత్రికి గూర్చి ర,భంగగతిన్ కాంతిద మను భ్రాంతిదొలంగన్. ౫౮

మెరసెడి తారకాతతుల మేల్మిరహించు త్రియామయట్లు సుం
దరతర చిత్రపుష్పములదాల్చి చెలంగెడి తీవయట్లు జా
గరితములైన పక్షిగమి గ్రాలెడి పెన్గొలనట్టు లామె యా
భరణములెన్నొ దాల్చి తన బంధుజనాళికి విందొనర్చెడిన్. ౫౯

లలనలంగంబు లన్ని అలంకరింప, నిల్వుటద్దమ్ములో తన చెల్వు జూచి
అభవురాకకై మదిగోరె నద్రిజాత, తమ్మప్రియుడెంచ కాంక్షింతురి తలిరుబోండ్లు
పిదప హరితాలచూర్ణంబు ప్రేమమీర, ధాతుమయచూర్ణమును గొనిమాత మేన
ముద్దులొల్కెడి పుత్రి నెమ్మొగమునెత్తి, తీర్చి దిద్దెను కల్యాణతిలకరేఖ. ౬౧

యౌవనమాదిగా హృదయమందున పార్వతి ఎట్టికోర్కె నిం
పావహిలంగనించినదొ ఆయమతల్లియు ప్రేమమీరగా
నావిధి సేయబూనుట ప్రియాత్మజకున్ సువివాహకర్మ దీ
క్షావిధిచే జెలంగు తిలకమ్మునిచెన్ ముదబాష్ప నేత్రయై. ౬౨

నయనాబ్జమ్ముల బాష్పముల్నిలిచి హాస్యమ్మొందగా దృష్టి, త
న్నియతస్థానము తప్పగట్టెను మహాంకీమాత, మాంగల్య, భా
వ్యయ సూత్రిమ్మను ధాత్రి దాని నవరింపన్ క్లేశపూర్వమ్మజా
మయమున్ హారిత వర్ణశోభితము సంబద్ధ ప్రసూనమ్మునన్. ౬౩

నూతనమైన వస్త్రము వినూత్నరుచిం జెలువొందు దాని, నా
పూతనుగాత్రిదాల్చి పరిపూర్ణ రుచి ప్రవికాస చంద్రికా
స్ఫీతమనోహరమ్మయిన పెన్నురువుం గల పాలవెల్లినా
జేతను నిల్వుటద్దమును చేర్చి చేలంగె నవోదిత ప్రభన్. ౬౪

లలితాంగి నంత నలంకృత గావించి కులదేవతల నెల్ల గొలువ జేసి
పతిపుత్రి వతులకు పాదాబ్జములు మొ్రొక్క గాజేసె మేనయు కౌతుకమున
నాలతాంగులు పార్వతీలలామనుబిల్చి ఐక్యకంఠమ్మున ననిరి యిట్టు
లతివ! అఖండితమ్మైన ప్రేమను భర్తృవాల్లభ్యమున నీవు పడయు మంచు
అట్టి దీవన తన మౌళియందుదాల్చి, తల్లి యానతి నామె ఆస్థానయయ్యె
వారి యాశీః పరంపర లేరహించి, భవుని యర్ధాంగభావమ్ము పడసె నామె. ౬౫

భూధరేశ్వరు డంత సమ్మోదమలర బంధుగణములు తనచుట్టుబలిసి కొల్వ
సభనుగావించి అమ్మహేశ్వరుని రాకకై ప్రతీక్షించె గౌరవవ్యాప్తమతిని. ౬౬

ఆసమయమ్మునన్ మదనుహారు నలంకృతునిం బొనర్ప సం
తోసము మీర మాతృకలు తోడగుచొక్కొకరంత పూనికన్ కై
లాసమునందు పార్వతి కళాలసనమ్ము బలెన్ విభూషణా ౬౭
లా శివుముందునిల్పి విమలాశిషము లుక్కరిపించి రొక్కటన్.

మండనలక్ష్మికై కొనక మాతృకలందలి గౌరవమ్మునన్
కుండలి భూషణుం డపుడు కోమలతన్ స్పృశియించె నంత నా
తండు తలంప శుద్ధభసితాదులు స్వర్ణ విభూషణలయ్యె నా ౬౮
నొండెటు కల్గనేర్చును మహోర్జితసత్త్వులగల్గు కోరికన్.

ఆ రాజిల్లెడి భస్మమయ్యెను తదీయాంగాంగ రాగంబుగా
మీరంజాలె కపాలహారమును పేర్మిన్ జాళువాభూషగా
శ్రీ రాజిల్లు దుకూలశోభలగతిం జెల్వొందె నాచర్మమున్ ౬౯
మూరాకారత మీరె గాత్రిము జగన్మాన్యత్వమున్ బొందుచున్.

అమలతారకాయుతమునై విమలకాంతి, జెలగు నిటలేక్షణమ్ము నా శివునకపుడు
కలిత హరితాలమయ మూచు లలితకాంతి, కమ్రకస్తూరితిలకమ్ము గతినిగాంచె. ౨౦

జాహ్నవాభూషలం బలెమేలుగాంచు, భుజగరాజుల తనువె మార్పులనుపొందె
నిజశిరమ్ములసెలగు నిర్ణిదర్రిరత్న, కాంతిగమి సుంత వికృతిని గాంచలేదు. ౨౧

దినమున నర్కరోచులను దీప్తితొలంగగ బాల్యపుందనం
బవధిగలుప్త లక్షుమ్ముడు హిమాంశుడు నిల్వగ శీర్షమందునీ
భవునకు నవ్యశీర్షమణి మండన మందలిగోర్కి యేలకో
తవిలి జగమ్ముకోరుకొను దారిని అన్యవిభూష లేలకో. ౨౨

విమలములైన వేషములు వేయగనేర్చిన ఆ గిరీశు డా
ప్రమథగణార్పితమ్మయి విరాజిత దివ్యకృపాణమందు మో
దమున స్వకీయబింబమును దర్పణమందలి రీతిగాంచె. బ్రే
మముపసజేసి నెమ్మదిని మన్మథభావము లేపుమీరగాన్. 23

నంది భుజావలంబియయి నందితుడై వృషభేశుపీఠి న
స్పంద విసారితమ్మయిన వ్యాఘ్రపు చర్మము సాచియుండ సం
క్రందన వైభవమ్ము లొలుకన్ తన యున్నతశైలశృంగ మె
క్కందగు రీతినెక్కె జయకాంతులు దిక్కుల పిక్కటిల్లగన్. ౨౪

గిరిశునివెంట నంటుచును క్షేపిత వాహనలొచు మాతలా
భరణము లట్టిటుల్ సెదర పద్మరుచు ల్వెలుగొందు నెమ్ముగం
పురుచులు మీరగా గగన భూమిని తామరపుం గొలంకుగా
బరగగ నేయుచున్ ముదిత మానసలొచును నేగి రంతటన్. ౨౫

బంగరు మేనికాంతులను భాసిలు వారల వెన్కయందు న
ల్లంగను పట్టికాళి తనలంబ కపాల విభూషణాళితో
రంగుగ విద్యుదంగనల రాపిడినేయక శ్యామలమ్ములౌ
గొంగలుకల్గు కార్మొయిల గుంపులవోలె వెలుంగు చెంతయున్. ౨౬

పిమ్మట నగ్రిగాములగు భృత్యగణమ్ములు కౌతుకోద్ధతిన్
నెమ్మది చింతచేసి జయనిస్వనము న్మొరయించు రమ్యతూ
ర్యమ్ముల గొట్ట బాల్పడిరి యానములం బయనించు దేవ సం
ఘమ్ములకెల్ల 'సేవ కవకాశ మిదే' యని చాటనేయుచున్. ౨౭

2

మిత్రుండు త్వష్ట్రునిర్మిత నవ్యశుక్లాత పత్రంబు వినయ సంపత్తిబట్ట
శిరముపై నురికెడు శ్రీగంగవోలె నయ్యది నూత్నకాంతుల నవధరింప
వాహినీ రూపమ్మువదలియు రాజహంసలదండు తమలోన చెలగుచుండ
గంగయు యమునయు కమనీయకరధృత చామరగ్రాహిణీ సరణికనగ
అపుడు జయజయ నినదమ్ము లాశలంట, నతనికడ కరుదెంచిరి ఆది బ్రహ్మ
అమల శ్రీవత్సలాంఛితుండైన విష్ణు డతని కీరితి బల్మరు నాడుకొంచు. ౮

తను వొకడే ధరించినది తద్దయు మూర్తులు మూడు వీరలం
జను ప్రథమావరత్వముల సామ్యము తుల్యమె ఆ శివుండు వి
ష్ణునకు నొకప్డు పెద్దయగు జూడగ శర్వునికంటె విష్ణుడే
కనబడు పెద్దగా ఘను డొకప్పుడు బ్రహ్మ, ఒకప్డు వారలున్. ౯

నందిత చిత్తులై శచిమనః ప్రియభర్తృ ముఖామరాళి ఎ
న్నందగు దేవకుంజరులు నవ్యవిభూషణము ల్వదల్చి దే
వుం దరి జేరగోర తన భ్రూకుటిసంజ్ఞను నంది తెల్ప, నా
నంద మెదం తగుల్పడ బ్రణామమునల్పిరి చంద్రమౌళికిన్. ౨౦

శిరసు కదల్చి బ్రహ్మమును జేసెను పృచ్ఛవచించి విష్ణువున్
సరసపు మందహాసముల శక్రుని సర్వసుపర్వకోటులన్
గురుకరుణాయుతామల సుకోమలదృష్టిని గారవించె నా
తరియుడు రాడ్విభూషణు డుదాత్తతనెల్లరు ప్రీతినందగా. ౨౧

అపుడు సప్తర్షిగణము జయమ్ముపెట్ట, స్మితముఖుండయి వారలజేరి శివుడు
ఈ వివాహ ముఖమ్మున నే మతింతు, నీర లధ్వర్యులయి నిర్వహించుకొరకు. ౨౨

అపుడు విశ్వావసుండు లోకాధనాథు, త్రిపురదహనకథాళి కీర్తింపుచుండు.
నధిగమించెను తోవ తారాధిరాజు, శకలశేఖరు డుద్వాహ సక్తమతిని. ౨౩

(సశేషము)

# శ్రీ కర భా ష్య ము

శ్రీకర భాష్యముయొక్క పీఠిక మొదలైనవి ముందుసంచికలో లేక ౧౨ వ సంచికలో టైటిల్ పేజీతోసహా పంపబడును.

— సం. విభూతి.



# నన్నెచోడకవిరాజు

శ్రీ గడియారం రామకృష్ణ శర్మగారు



శ్రీయుత మానవల్లి రామకృష్ణ కవిగారి పుణ్యమున 'నాంధ్ర కుమార సంభవ' ప్రచురణముతో, నాంధ్రభాషాయోష కొక అమూల్యాలంకారమును, చరిత్ర ప్రియుల కొక అపూర్వావకాశమును లభించినది. సారస్వత సేవకులకు కవి కావ్యభాషయు, చారిత్రశోధకులకు కవికాలవిషయమును మథన యోగ్యము లైనవి. కాని గొప్ప గొప్ప పండితుల జిజ్ఞాసాజిగీషలచే, గాల విషయిక చర్చయే యెల్లఱ నాకర్షించినది.

మన పూర్వులు తమ కాలమును వాచ్యముగఁ జెప్పికొనకున్నను, చరిత్రకారులు వేఱు వేరు మార్గములఁ ద్రొక్కి యితరాధారములచే కాలనిర్ణయమును చేయుచున్నారు. అట్టిద యగు కుమార సంభవమును గూర్చియు, నింతవఱకు విమర్శకులు ముఖ్యముగా,

(౧) కవి బేర్కొన్న తన తల్లి దండ్రులు.
(౨) కృతి భర్తయు, గురువు నగు జంగమ మల్లికార్జునుడు.
(౩) దేశికవితనుఁ బుట్టించిన సత్యాశ్రయుఁడు లేక చాళుక్యరాజు.
(౪) ఈతని సమకాలికులు, పూర్వకాలికులు.
(౫) అనుకరించిన గ్రంథములు.
(౬) కావ్యములోని భాష.

అనునవియే నన్నెచోడుని కాలనిర్ణయమునకు ప్రధానాధారములుగ గ్రహింపబడినవి. వీనిలో నే యేవిషయముల నెవరెవరు చర్చించి యే విధమున సమర్థించిరో అవి యెంతవఱకు సమంజసములో కనుగొందము.

(౧) కవి తల్లిదండ్రులు.

అరినవపాలమాళిదళితాంఘ్రియుగుం డయి పాకనాటి యం
దిరువది యొక్క వేయిట కధీశుఁడు నాఁజను చోడబల్లికిన్
జిరతరకీర్తి కగ్రమహిషీ తిలకం బన హైహయాన్వయాం
బరశశిరేఖయైన గుణభాసిని శ్రీ [illegible]

అను పద్యమునఁ దనతండ్రి చోడబల్లి యనియు, తల్లి శ్రీసతి యనియు చెప్పి కొనియున్నాడు.

ఇంతవఱకు ఆంధ్రచోడుల శాసనము లెన్నో బయలుపడినవి. కొన్నిటిలో చోడబల్లి పేరు కనఁబడినను శ్రీసతిపేరెచ్చటను గన్పట్టుటలేదు. చోడబల్లి, అను పేరు గలవారు పలువురు గనఁబడుచున్నారు. శ్రీ బుట్టా శేషగిరిరావుగారును, శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారును అప్పటికి తమ కుపలబ్ధము లగు వానిలో సమంజసములని తోఁచిన వాటి నాధారములుగ గ్రహించి యేదోయొక విధముగ కాలనిర్ణయము చేసియున్నారు. అప్పటి కింకను పెద్దచెఱుకూరి శాసనము బయలుపడలేదు. శ్రీ జయంతి రామయ్యపంతులుగా రీ శాసనముపై తమ అభిప్రాయ మిచ్చిరి. తదుపరి శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగా రా శాసనమునే కొన్ని సవరణలతో చదివి, నన్నెచోడుని, నన్నయ, తిక్కనల నడిమికాలపువాఁడను శ్రీ పంతులుగారి వాదనను సమర్థించిరి. తరువాత శ్రీ నడకుదుటి వీరరాజుపంతులుగా రదే శాసనమును గ్రహించి పురుషాంతరకాలమును పొడిగించుటేగాక, నింకొక పురుషాంతరమునే యెక్కువచేయుటకై 'తస్యానుజో ఘటంకారః' అనుపాఠము సక్రమముగ లేదని తన వాదనను నిలఁబెట్టుకొనుటకైఁ 'తస్యాత్మజో ఘటంకారః' అని యుండవలె నని శిలాశాసన పాఠమునుకూడ శాసించిరి. * పాపము వారెంత సాహసమున కైన నొడి గట్టి నన్నెచోడుని నన్నయకుఁ బ్రాచీనునిఁ జేయఁ బాటుపడిరి. మొదటినుండియు వీరరాజుపంతులుగారి అడుగుజాడలనే వచ్చుచుండిన శ్రీ దేవరపల్లి వెంకట కృష్ణా రెడ్డిగా రింకను నదేవాదమున నున్నారు. పై చెరుకూరిశాసనమువలన నన్నెచోడుని కాలము ౧౨ వ శతాబ్దపు ప్రథమభాగ మని స్పష్ట మగుచున్నది. దొరకినంతవఱకు శ్రీ వీరేశలింగం పంతులుగా రుదహరించిన శాసనముల నీ చెఱుకూరి శాసనముతో సమన్వయించికొన్నచోఁ గవికాలము చక్కగా తేలును. శ్రీ వెంకటకృష్ణా రెడ్డిగారు నన్నూరు పాకనాటి చోడశాసనములోని పురుషులతో చెఱుకూరి శాసనపురుషులను సరిపోల్ప యత్నించిరి. ♦ అందు నన్నెచోడుని తండ్రి కంటుప్రవంక్యరాజు, తాత బల్లె రాజు అనియు నుండగాఁ దాతను తండ్రిగాను, తండ్రిని తాతగాను సవరించి వారివారి కాలములు కూడ తెలిపిరి. ఆ శాసనములో కాలమే కన్పట్టుట లేదు. ఇవి యన్నియు ముఖ్యముగా శ్రీ రెడ్డిగారి కపోల కల్పితములు. ఈ చెఱుకూరి శాసనము బయల్పడి చరిత్రకారుల మార్గము నొకింత సులువు చేసినది. ప్రతి విమర్శకుని దృష్టియు దీనిపైననే కేంద్రీకరింపఁబడియుంట ప్రబల ప్రమాణము.

* ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక ౧౪ సంపుటము, ♦ విక్రమ వైశాఖ భారతి.

(౨) కృతి భర్తయగు జంగమ మల్లికార్జునుఁడు.

ఈతఁడు శ్రీరామకృష్ణకవిగారు పేర్కొన్న ఆదిమునిగాక రెండవ కాలాముఖ మల్లికార్జునుఁడు. శా॥ శ॥ 1037 వ సంవత్సర ప్రాంతమున నుండినవాఁడు. శ్రీ వీరేశ లింగం పంతులుగారు ఉదహరించిన కొప్పరపు శాసనములో నీ కాలాముఖ మల్లి కార్జునుఁడు కానవచ్చుచున్నాఁడు. "ఈ శాసనమునుఁబట్టి చూడఁగా నన్నెచోడుని సోదరుని కాలములో కాలాముఖ మల్లికార్జున యోగి యుండినట్టును, నన్నె చోడుని తండ్రి చోడబల్లి అనబడెడి త్రిభువనమల్ల బల్లిచోడు డయినట్టును, రెండంశ ములు స్థాపింపఁబడినవి. ఈచోడ బల్లికి 'త్రిభువనమల్ల' చోడబల్ల అను పేరు వచ్చుట కతఁడు త్రిభువనమల్ల చాళుక్య చక్రవర్తి పాలనలో నుండుట కారణ మని మనము సులభముగఁ తెలిసికొనవచ్చును." * అను శ్రీ వీరేశలింగం పంతులుగారి వ్రాత యిక్కలి సమంజసముగా నున్నది.

ఈ శాసనము 1037 శా॥ శ॥ వర్షముల నాటిది. దీనినే శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారును ఉద్ధరించి నన్నెచోడుని కృతిపతి యీ మల్లికార్జున యోగియే అని సిద్ధాంతీకరించి యున్నారు ♦ నన్నెచోడుఁడు నన్నయకుఁ బ్రాచీనుఁ డను వా రెందు చేతనో ఈ శాసనమునే చల్లగ జారవిడచిరి. వారు ముఖ్యముగా నీ శాసనయోగి కృతిపతి గాదని నిరూపింపవలసి యున్నది.

శ్రీ వెంకటకృష్ణారెడ్డిగారు తమ గూఢవస్తుమయకావ్యము నుండి 'జయచైత్ర సంపర్క' శాసన లిఖితాక్షరంబు లయ్యె', నను నిట్టి పదములఁ గొన్నిఁటిని గ్రహించి కవి గ్రంథరచనాకాలమునుఁగూర్చి వింత సిద్ధాంతమును జేసి యున్నారు. వారి జయసంవత్సరము శాలివాహనశకమున కనుకూలింపక పోవుటచే నా కాలమున నంతగఁ బ్రాచుర్యము లేని విక్రమశకమును లాగుకొని వచ్చి యప్పటి కిని సరిపడ కుండుటచేఁ గొలఁది వ్యత్యాసమును సందేహింప నక్కఱలేదు. † అని వ్రాసిరి.

వినోదమునకై వారి వాదము నొప్పుకొందము. శా॥ శ॥ వర్షంబులు 1037 నాటి కొప్పరపు శాసనము జయ సంవత్సర చైత్ర బహుళ అమావాస్యనాఁడు లిఖింపఁబడినది. సరిపడని విక్రమ శకంబున కంటె, సరిపోవు నీ శాసన లిఖితాక్షరం బుల నెందుకు వా రంగీకరింపఁ గూడదు ?

(౩) దేశికవితను బుట్టించిన సత్యాశ్రయుఁడు లేక చాళుక్యరాజు రాజ రాజ

* ఆంధ్రకవుల చరిత్ర ప్రథమభాగం 150. పుట. ♦ ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక ౧౮ సం, ౧సం,
† ఆంధ్రభూమి 1939 ఫిబ్రవరి సంచిక.

నరేంద్రుడే యని A శ్రీ రామలింగారెడ్డిగారునూ, B శ్రీ బుఱ్ఱా శేషగిరిరావుగారును C శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారును వ్రాసియున్నారు. మఱియు D శ్రీ క్షాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు తమ ఆంధ్రకవితాపిత అను వ్యాసమున యుద్ధమల్లుని శాసనమును సహేతుకముగ ఖండించి, రాజ రాజ నరేంద్రుడే సత్యాశ్రయు డని, నిరూపించి యున్నారు. రాజ రాజ నరేంద్రుని పూర్వు లయిన చాళుక్య రాజులు తెలుఁగు కవిత్వమునకు జనకులుగగాని, పోషకులుగగాని ఉన్నట్టు నిరూపించు ప్రమాణములు గానరావు. ఉన్నదనుకొన్న యుద్ధమల్లుని శాసనముపై శాస్త్రిగారి విమర్శనముతో నిటీవలిదని తేలినది. ఆ యుద్ధమల్లులు పీఠికాపుర పతు లగు చాళుక్య వంశములోని వారని శ్రీ శాస్త్రిగారు నిర్ధారించియున్నారు. యుద్ధమల్లు అను పేరు గలవారు చాళుక్యవంశములో పలువురు గన్పట్టుచున్నారు. కరీంనగరం జిల్లా వేములవాడ గ్రామమునందు అరికేసరికాలపు శాసన మొకటి కలదు. అందులో యుద్ధమల్లులని పేరుగల తాతమనుమ లున్నారు. ఆ భాగమును మాత్రమె వ్రాయుచున్నాను. చరిత్రకారులు బాగుగ పరిశోధింతురుగాక.

"వినయాదిత్యనామధేయః. ప్రసాధితాశేషదిఙ్మణ్డలశ్చ పరమణ్డలైకరామ
శ్చాలుక్యకులతిలకః, శ్రీ యుద్ధమల్లోనామ రాజా బభూవ.........
తస్యాత్మజో దక్షిణబాహుదండ శ్చండాసిధారా హతవైరిమండః।
బలా ద్గృహీతాఖిలవేంగిదేశః పాతిస్మ పృథ్వీ మరికేసరీశః॥
భూయోఽస్మి న్నరసింహధర్మనృపతి ర్బ్భామిం సతాం పాలయ
రాజాదిత్య ఇతి క్షమాపతి రత శ్శ్రీయుద్ధమల్లో నృపః" అని వ్రాయబడియున్నది.

వీ రే కాలమున నుండిరో ఊహించుటకు శాసనమున సంవత్సరము వ్రాయఁబడియుండ లేదు. పూర్వ చాళుక్యుల పూర్వులుకూడ కర్ణాటకు లని వారి శాసనములే చెప్పుచున్నవి. మఱియు శ్రీ భోగరాజు నారాయణమూర్తిగారు తమ "ఆంధ్ర కవిత్వ చరిత్ర"యం దీ విషయమును విపులముగ చర్చించి యున్నారు. చాళుక్యరాజు రాజరాజ నరేంద్రునకు పూర్వు డని వాదించుచున్న శ్రీ వెంకట కృష్ణారెడ్డిగారు తగిన ప్రమాణములు జూపింప లేదు. చాళుక్యభీమునే చాళుక్యరా జని హాస్యాస్పదములగు వానిని కొన్నిఁటిని చూపిరి. శ్రీ బండారు తమ్మయ్యగారు పై రెడ్డిగారి వ్రాతలను సహేతుకముగ ఖండించి యున్నారు. *చాళుక్యరా జన్నను, సత్యాశ్రయు డన్నను రాజరాజ నరేంద్రుడేకాని, యితరుఁడు కాడని నిరూపించి యున్నారు.

* ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక ౨౯ సం. ౨ సంచిక.

A రాజ రాజ నరేంద్ర పట్టాభిషేక సంచిక. B 1911 సం॥ర. ఆంధ్ర సంవత్సరాది సంచిక. C ఆంధ్రకవుల చరిత్ర ప్రథమభాగం 190 పుట. D ఆంధ్ర సా॥ ప॥ పత్రిక ౧౦ సం. ౨ సం.

(౮) ఇఁక నితని సమకాలికులను, పూర్వకాలికులను గూర్చి చర్చింతము మల్లికార్జున పండితారాధ్యుఁడు, బసవేశ్వరుఁడు చందవోలు నేలిన రెండవ వెలనాటి చోడుఁడు నితనికి సమకాలికులుగఁ గన్పట్టుచున్నారు. ఈ వెలనాటి చోడుఁడు క్రీ॥ శ॥ ౧౧౬౩-౧౧౮౦ మధ్యన రాజ్య మేలినవాఁడు. ఇతనికి రాజేంద్రచోడుఁడు, కులోత్తుంగ రాజేంద్రచోడుఁడు, అనియు బేర్లు కలవు. ఇతని యాస్థానమున కేగిన పండితారాధ్యుఁడు కూడ 1170 క్రీ॥ శ॥ సంవత్సరము వఱకు జీవించి యుండెనని ♦ శ్రీ కొమర్రాజు వెంకటలక్ష్మణరావు పంతులుగారు వ్రాసియున్నారు. ఈ పండితారాధ్యుఁడు రాజేంద్రచోడుని ఆస్థానమునకుబోయి బౌద్ధమతమును ఖండించి రాజుచేతఁ గన్నులు వెరికించుకొనె ననియు,నతని ఘోరముగ శపించెననియుఁ బండితారాధ్య చరిత్రమువలనఁ దెలియుచున్నది. చందవోలు కైఫీయత్తులోఁ గొద్ది మార్పున్నను వెలనాటి చోడుని వీటికిఁ బండితారాధ్యుఁడు పోయి యతని చూచియుండెను అని నిశ్చయింప వచ్చును,

కేయూరబాహుచరిత్రమున నీ వెలనాటి చోడుని గూర్చి యింకొక విషయము దెలియవచ్చుచున్నది. కృతికర్త యగు మంచన వెలనాటి చోడుని మంత్రి యగు కొమ్మనామాత్యుని వర్ణించు పట్టున.

"అరుదందన్ వెలనాటిచోడ మనుజేంద్రాజ్ఞాపనం బూని దు
స్తరశక్తిన్ జని యేకవింశతి సహస్రగ్రామసంఖ్యాకమై
ధరణిం బేర్చిన పాకనాడు నిజదోర్దండైక లగ్నంబుగా
బరిపాలించె నమాత్య కొమ్మన జగత్ప్రఖ్యాత చారిత్రుఁడై."

అని వ్రాసియున్నాఁడు. 'పాకనాటియం దిరువదియొక్క వేయిటి కధీశుఁడగు, చోడబల్లి కుమారుఁ డగు నన్నె చోడుని జయించియో, చంపియో యీ రాజ్యమును వెలనాటిచోడుడు సంపాదించెననియు కొమ్మన దండనాథుని ప్రతినిధిగ నిల్పెననియుఁ బై పద్యము సాక్ష్య మిచ్చుచున్నది. కుమారసంభవ పీఠికలో శ్రీ రామకృష్ణ కవిగారు క్రీ॥ శ॥ 940 లో పాశ్చాత్యచాళుక్యులతోఁ బోరి నన్నెచోడుఁడు రణరంగమున హతుఁ డయ్యె నని వ్రాసియున్నారు. దానిపై నెందఱో విమర్శకులు తీక్ష్ణముగ విమర్శించి యున్నారు. శ్రీ కవిగారి కింతవఱకు తమ వాదనను నిలబెట్టఁగల ప్రమాణములు దొరుకలేదు. అప్పుడు చావకున్నను, ఈ వెలనాటి చోడునితో బోరి రణరంగముననే హతుడయ్యె ననుటకు పై పద్యమే ప్రమాణముగ నున్నది. ఈ ఘటనము పండితారాధ్యుఁడు చందవోలునకు రాకమునుపే క్రీ॥ శ॥ ౧౧౬౫ ప్రాంతముల జరిగి

♦ శివతత్త్వసారము పీఠిక.

యుండవచ్చును. ఈ విషయమును కనుగొన్న శ్రీ వీరేశలింగం పంతులుగారు చిర స్మరణీయులు.

పండితారాధ్యునిఁగూర్చి వ్రాయుచు "ఇతఁడించుమించు నన్నెచోడుని సమకాలపువాడు; అతనితో సమాన వయస్కుఁడు గాకున్నను అతనికి సమకాలికుఁడై యుండెననుట సిద్ధము" * అని వ్రాసిన శ్రీ వావిలాల వెంకటేశ్వరశాస్త్రిగారి వ్రాత మిక్కిలి సమంజసముగా నున్నది.

శ్రీ బండారు తమ్మయ్యగారు వ్రాసిన 'నన్నెచోడుని కాలము,' ♦ అను వ్యాసమున నింతవఱకెవరును దడవని నూతనాంశము నొకదానిని వెల్లడించిరి. కుమారసంభవములో నొకచోట నవనాథుల ప్రస్తావ మున్నది. దానిని వారు కనుగొని శ్రీ గిరికవి విరచిత మగు పద్య నవనాథ చరిత్రము తరువాయి కుమారసంభవ ముద్భవించి యుండునని యూహించినారు. †

వెలనాటి చోడ, బసవేశ్వరుల సమకాలపు వాఁడగు నన్నెచోడుని కాలము నాటికే ప్రసిద్ధులైన నవనాథులను పేర్కొనుటకు శ్రీ గిరికవి నవనాథ చరిత్రమునుగాని చామరసు కన్నడ ప్రభులింగ లీల గాని చదువనక్కరలేదు. పాలకురికి సోమనాథుఁడు క్రీ॥ శ॥ ౧౩౦౦ ‡ ప్రాంతము లందుండె నని 'కిట్టెల్ పండితుఁడు' తన కన్నడ నిఘంటువునందు వ్రాసి యున్నాఁడు. పండితారాధ్యుడు క్రీ॥ శ॥ ౧౧౭౦ సంవత్సరము వఱకు జీవించి యుండినవాడు కదా ? అట్టి పండితారాధ్యునకు కూడ కొంచెము పెద్దవాఁడగు నన్నెచోడుడు సోమనాథుని శిష్యుఁడగు శ్రీగిరికవి వ్రాసిన నవనాథ చరిత్రమును చదువుట అసంభవము. శ్రీ తమ్మయ్యగారు నవనాథులలోఁ గొందఱు మాత్రమే నన్నెచోడునకు ముందు ప్రసిద్ధినొంది యున్నట్లు జ్ఞాననాథ సిద్ధుని గ్రంథమును బట్టి యూహించిరి. కొందఱిని మాత్రమే పురస్కరించుకొని నవనాథు లనుట జరుగదుకదా ? తొమ్మండుగురును అప్పటికే ప్రసిద్ధినొంది యుండవలెను. శ్రీ నడకుదుటి వీరరాజు పంతులుగారొకప్పుడు నన్నెచోడునికి పాలకురికి సోమనాథుఁడర్వాచీనుఁ డని వ్రాసియుండిరి. అదియే సరియైనది.

---

* భారతి విక్రమ వైశాఖ సంచిక. ♦ 'విభూతి' ౧-౮. † అసలు నవనాథశబ్దము చాల ప్రాచీన కాలమునుండి వ్యవహరింపఁబడుచున్న దనియును, వారి కాలము 12 వ శతాబ్దమనుటకు వీలు లేదనియును మరాఠిజ్ఞానకోశమున గలదు. — సం. విభూతి.

‡ సోమనాథుడు 1300 ప్రాంతమున నుండెననుట పొరబాటు. 1190 మొదలు 1280 లోపుగ నుండి యుండును. కాకతీయుని సంచిక చూడుడు—సం. వి.

(౫) కవి అనుకరించిన గ్రంథములు.

"కిం కవే స్తస్య కావ్యేన, కిం కాండేన ధనుష్మతః।
పరస్య హృదయే లగ్నం న ఘూర్ణయతి యచ్ఛిరః॥

అను త్రివిక్రమభట్టుని నలచంపువులోని శ్లోకమునకు సంపూర్ణాను వాదముగ

క॥ ముదమున సత్కవి కావ్యము, సదరగ విలుకాని పట్టి నమ్మును పరహృ
ద్భిదమై తలయూపింపని యది కావ్యమె మఱియు పట్టినదియుం గరమే.

అను పద్యమును రచించెను. ఈ త్రివిక్రమ భట్టు 915వ క్రీ. శ. వర్షము వాడని శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు తమ సంస్కృతవాఙ్మయ చరిత్రమున వ్రాసియున్నారు.

శ్రీ పాద లక్ష్మీపతిశాస్త్రిగారు నన్నె చోడుని సంస్కృత కుమారసంభవాను వాదము లని కొన్నింటినిఁ జూపిరి. A అవి అనువాదములు కాజాలవు. పదసామ్యమును బట్టియో, భావైక దేశమును చూచియో అనువాదములని నిరూపింపరాదు. ఇట్లే శ్రీ శాస్త్రిగారు చాల పద్యములు అనువాదము లని చూపిరి. వీరు చేసిన విమర్శనా భాసములను బాగుగ ఖండించి శ్రీ వే॥ తి॥ అనువారెవరో చక్కని వ్యాసమును వ్రాసియున్నారు. B పాకనాటిలో నున్న నన్నెచోడుని గ్రంథము నందును తత్ప్రాంతీయులగు తిక్కన, కేతన మారన మొదలగు వారి గ్రంథముల యందును; ఒకేవిధ మగు పదము లుండుట అసంభవము కాదు. ఇంతమాత్రమునకే నన్నెచోడుని కేతన కంటెను అర్వాచీను డనుట సాహసము.

కం॥ క్రమమున నుద్భటుఁడు కవిత్వము మెఱయఁ గుమారసంభవము సాలంకా
రము గూఢవస్తుమయ కావ్యముగా హరులీలఁ జెప్పి హరు మెప్పించెన్.

అను నన్నెచోడుని పద్యము కాళిదాసుడే గాక ఉద్భటుడు గూడ సంస్కృతమునఁ గుమారసంభవము వ్రాసెనని చెప్పుచున్నది. పై పద్యమున గానవచ్చు కుమారసంభవము, హరలీల అనునవి వేఱు వేఱు గ్రంథములు గాక కుమారసంభవము గూఢవస్తువుగా గల హరలీలా కావ్య మొక్కటియే ఉద్భటుని గ్రంథమని తోఁచుచున్నది. తన లక్షణ గ్రంథమునకు లక్ష్యములుగా పార్వతీపరిణయ ఘట్టము నెత్తికొని కుమారసంభవము విషయముగాగల యీ హరలీలను వ్రాసియున్నారు. హరలీల యొక్కటే ప్రసిద్ధి చెందినది. శివతత్త్వసారమున మల్లికార్జున పండితారాధ్యుఁడు.

A కుమారసంభవ విమర్శనము. B ప్రతిభ ౨ సం॥ ౩సం.

కం॥ 'హరలీలా స్తవ రచనా, స్థిర నిరుపమభ క్తితోడ దేహముతోడన్
సురుచిర విమానమున నీ, పురమున కుద్భటుడు ప్రీతి బోవడె రుద్రా.
(శివత త్త్వసారము 410 పద్యము)

అని హరలీలనే పేర్కొన్నాడు. కుమారసంభవ మనునది యున్నచో దానిని గూడఁ బేర్కొనడా?

హరలీలకు వాడిన 'గూఢవస్తుమయకావ్య' మను విశేషణమును తెలుఁగు కుమార సంభవమున కన్వయించుకొని అకాశ హర్మ్యములు నిర్మించుచున్న దే॥ శ్రీకృష్ణారెడ్డిగారు హతాశులై రని చెప్పవలసి వచ్చినందుకు చింతిల్లుచున్నాను.

మల్లినాథ పురాణజగన్నాథవిజయాది కన్నడ కావ్యములను నన్నెచోడుడే అనుకరించె ననుట సమంజసము. పై కావ్యకర్త లితనికి సన్నిహిత కాలపువారు. ఐనను కర్ణాట భాషావేత్తయు, కర్ణాట భాషాభిమానియు నగు నితఁడు కన్నడిగుల ననుకరించె ననుటయే పాడిగాని కేవల కన్నడకవు లీతని ననుకరించి రనుట అసమంజసము *

తెలుఁగు కవులలో పలువు రీతని భావములను గ్రహించి తమ కవిత్వమునకు మెరుగు పెట్టికొని యున్నారు. జిక్కన, తిక్కన, కృష్ణకవి, సోమనాథుడు, రామకృష్ణుఁడు, మొదలగువారు ప్రముఖులు.

శ్రీ బండారు తమ్మయ్యగారు, 'నన్నెచోడుని కాలము' అనువ్యాసమున నన్నెచోడుడే సోమనాథు ననుకరించె నని కొన్నిఁటి నుదాహరించిరి. కాని సోమనాథుఁడే నన్నెచోడుని అనుకరించె నని ఆ పద్యములే చెప్పుచున్నవి.

(చూడుఁడు విభూతి ౧-౮)

పూర్వకవి భావైక దేశమును గ్రహించి సమర్థు లగు తరువాతికవులు తమ అనల్పకల్పనలచే మెఱుఁగుబెట్టుదురు. కాని బాగుగ వ్రాసినవానిని గుంచింపరు. పై పద్యములో నన్నచోడుఁడు విడిచిన విశేషణములు కూర్చి సోమనాథుఁడు తన అనుకరణమును సర్వాంగ సుందరము నొనరించుకొని యున్నాడు. సోమనాథుఁడు కుమారసంభవమును బాగుగఁ జదివియుండె నని యతని జాను తెనుగు పలుకుబడులే చెప్పుచున్నవి. శివకవులు భవికవులను పేర్కొనరు. కాని శివకవి యగు నన్నెచోడుని సోమనాథుఁడెందుకు స్మరింప డయ్యెనో చింత్యము. అల్లసాని పెద్దనయు శ్రీనాథుని

* ఇది సమంజసముగా లేదు. భావము బాగని తోచినపుడు ఒకరి నొకరు అనుకరింప వచ్చునుగదా! — సం. వి.

గ్రంథముల ననుకరించియు తన గ్రంథమున నాతని పేరుకూడ తలంపడమ్యెను. వీరి ట్లెందుకు చేసిరో దురూహ్యము.

(౬) కావ్యములోని భాషనుగూర్చి విచారింతము.

కర్ణాటదగ్రావిడ భాషాపదములు మెండుగ నీ గ్రంథమున ప్రయోగింపఁ బడినవి. ప్రాచీనాంధ్రి మిట్లే కర్ణాటక పద మిశ్రితమై యుండ వాగను శాసనుఁడద్దానిని సంస్కరించి సలక్షణభాషయందు గ్రంథరచనకు దారితీసె నని భాషాతత్త్వవేత్తలూహించు చున్నారు. దీని నాధారముగఁ జేసికొని కొందఱు మహాశయులు కావ్యశైలిని బట్టి నన్నెచోడుని నన్నయకుఁ బ్రాచీనుని జేయఁజూచిరి. వారిలో శ్రీ కుందుర్తి ఈశ్వర దత్తుగా రొకరు. వారు ప్రాచీనాంధ్ర క్రియా స్వరూపముఁ గూర్చి ప్రస్తావించిభావార్థక మైద్దియని చర్చించుచు 'ఉటంతమని' వ్రాసిన శ్రీ వీరేశలింగం పంతులుగారి వ్రాతలను ఖండించి 'ఉడంతమ'ని నిరూపించిరి. *

ఇదియొక గొప్ప విషయముకాదు. భావార్థకము 'ఉటంత'మని ఆంధ్రశబ్ద చింతామణి యందున్నది 'ఉడంతము' గ్రంథములలో శాసనములలో, విరళముగనే కన్పట్టుచున్నది. కావున భావార్థకమున 'ఉటంత' 'ఉడంత' ములు పూర్వము నుండియు ప్రయోగింపఁ బడుచుండె నని గ్రహింపవలయును.

"గ్రంథశైలిని బట్టియే కవికాలనిర్ణయము చేయవలెను" అనిన శ్రీ ఈశ్వర దత్తుగారి వ్రాత కతివ్యాప్తిదోషము పట్టుచున్నది. 18 వ శతాబ్దమున పుదుక్కోటను పాలించిన కోటిరాయ రఘునాథ తొండమాన్ భూపాలుడు తన పార్వతీ పరిణయ కావ్యమున నిట్లే భాషాసాంకర్యమును చేసియున్నాడు. శైలినిబట్టి యితనినిగూడ పూర్వకవులలో చేర్చవలసి యుండును. దేశకాలములు విచారింపక కేవలము గ్రంథ శైలిని బట్టియే కలికాల నిర్ణయము చేయబూనుట సరియుక్తికము కాదు.

గ్రంథభాషా విషయమునుగూర్చి కీ॥ శే॥ తంజనగరం తేవప్పెరుమాళ్ళయ్య గారు 'భారతకవులు నన్నెచోడుడు' * అను వ్యాసమున బాగుగ చర్చించియున్నారు. విస్తర భీతిచే నేను చర్చింపనైతిని. ఒక్కొక్కపట్టున నన్నెచోడుని పోబడిలీరులు తిక్కన కంటెను ప్రౌఢముగ నుండుటచే తిక్కనకు కూడ నర్వాచీనుఁడా అని పెరుమాళ్ళయ్య గారు సంశయించిరి. అప్పటి కిన్నీ ప్రమాణము లుపలబ్ధములై యుండలేదు. భాషా సంస్కరణము బాగుగ వ్యాప్తినందక పోవుటచే నన్నయ కచిరకాలముననే యున్న

* యువ సంవత్సరాది సంచిక.

* ఆంధ్రసాహిత్య పరిషత్ పత్రిక ౩ సంపు ౧ సంచిక.

నన్నెచోడుని కవిత్వ మితర భాషాపద మిశ్రితమై యున్నది. ఇది యాతనికి దోషాపాదకము కాదు.

ప్రబంధ యుగ కర్తయై, సోమనాథ తిక్కనాదులకు మార్గదర్శకుడై, కవిరాజ శిఖామణియై విరాజిల్లిన నన్నెచోడుడు క్రీ॥ శ॥ 12 వ శతాబ్ద ప్రథమభాగమును వెలిగించినవాడు. అజ్ఞాతుడైన యీ కవిశిరోమణిని బరిచితుని జేసిన శ్రీ రామకృష్ణ కవిగారికి యావదాంధ్రులును ఋణపడియున్నారు. విజ్ఞులు సత్యదృష్టి గలవారై నా వ్రాతలయందలి లోపములను మన్నించి సత్యమును మాత్రమే గ్రహింతు రని ప్రార్థించుచున్నాను. *

* నన్నెచోడుని గురు వగు జంగమ మల్లికార్జునుడు క్రీ॥ శ॥ 1037 లో నున్నట్లు వ్యాసకర్తగారు ప్రతిపాదించినారు. శిష్యుడగు నన్నెచోడుని నూరుసంవత్సరముల తరువాయి బుట్టించక పదునొకండవ శతాబ్ద మనియే స్వీకరింప వచ్చునుగదా! సం. వి.

## "విభూతి" సంవత్సరాదిసంచిక

ఇదే సంవత్సర ఫాల్గునమాసమున 'విభూతి' కి మూడవసంవత్సర మారంభమగును. కావున సంవత్సరాది సంచికను, మిక్కిలి చక్కని గద్య పద్య వ్యాసముల తోడను, నయనాభిరామములగు ముద్రణము చిత్రపటములు, కాగితములతోడను, ప్రకటింపదలచినారము. కావున వ్యాసరచనమునకై కవిపండిత మహనీయులును, సాహాయ్యప్రచారములకై ధర్మాత్ములును బద్ధకంకణులై ప్రయత్నమొనర్చి ఈ విక్రమ సంవత్సర పుష్య బ॥ ౩౦॥ (1940—జనవరి) లోపుగ మా కార్యాలయమున కందించి యెప్పటియట్లు ప్రోత్సహింప గోరుచున్నాము.

సంపాదకుడు - విభూతి, సికిందరాబాద్.

## మా దాతలు

ఇదివఱకు వాగ్దానము చేసిన వారిలో ఈ క్రింది మహనీయులు తమ సహాయమును పంపియున్నారు. తక్కినవారును త్వరగా పంపి యుపకరింప గోరుచున్నాము.

| | | | | |
|---|---|---|---|---|
| ౧౦౦ | శ్రీ | రుద్రశెట్టి గుండయ్యగారు | సిద్ధాంత శిఖామణి కొలకు | చెన్నూరు |
| ౧౦౦ | ,, | పెద్దశెట్టి శాంతయ్యగారు | | |
| ౫౦ | ,, | వే॥ బసవయ్య స్వామిగారు | | శ్రీశైలవాసులు |
| ౩౦ | ,, | డా॥ కె. రుద్రప్పగారు L. M. S. | | హైద్రాబాద్ |
| ౨౫ | ,, | శ. గౌరయ్యగారు (మూడవసారి) | | గిద్దలూరు |
| ౨౫ | ,, | ఒక వైశ్యమహాశయుల గుప్తదానము, | | సికిందరాబాద్. |

మేనేజరు —విభూతి.

# స్త్రీ విద్య

శ్రీమతి బి. శ్యామలాంబగారు

విద్యాలక్ష్మి సమస్తదేశములలోను సకల కవివరులచేతను పండితులచేతను, సజ్జనులచేతను బహుచక్కగా వర్ధింపబడి మహా ఉన్నతదశయందున్న సంగతి అందరికి తెలియని విషయముగాదు.

మన ప్రాంతములో అన్నిమతములలోను స్త్రీవిద్య కొంచముగానో, గొప్పగానో ప్రబలియున్నదిగాని వీరశైవ సతీమణులకు మాత్రము విద్యాదేవి స్నేహమెవరికో ఒకరికి గలదు. సామాన్యముగా అందరికి లేదన్నమాటే. యీ మహాదేవియెడల మిగుల ప్రేమగలవారై యీమెసహవాస మంగీకరించి, వెనుకటి సతీమణులవలె ఉన్నత దశయందుండుటకు పెక్కువిధముల ప్రయత్నింప వలసియున్నది.

మనము గృహకృత్యములు ముగించగా మిగిలిన కాలమును వ్యర్థపుచ్చక విద్యాకృషి చేయుటచే ఆ విద్యాలక్ష్మి స్నేహమార్జించిన వారమగుదుము. చిన్నప్పుడు మాతల్లిదండ్రులు విద్య నేర్పించలేదు గాన, మాగతి యింతే" అని నిరుత్సాహముతో నూరకుండక స్వయం కృషిచేత విద్యావిత్త మార్జించి దానిచే కీర్తిమయమగు సుగుణభూషణములను చేయించుకొని వాటిని ధరించుకొన్నచో బంగారు నగల కంటెను వేయిరెట్లు అధికముగా ప్రకాశించుననుటకు సందేహము లేదు.

మనవారు తమ బాలికలు ఇంటనున్న అల్లరిచేయుదురని పాఠశాలలకు పంపుదురుగాని నిజమగు విద్యాభిలాషచేగాదు. విద్యయొక్క మాహాత్మ్యమునెరిగి పంపెడువారెవరో యొకరుందురుగాని సామాన్యముగా చాలామందికి నట్టి సదుద్దేశ్యమున్నట్టు గనపడదు. బాలిక లెంత తెలివిగలవా రయినను అయిదు సంవత్సరముల వయస్సు గడచిన గాని గ్రహించు శక్తిగలవారలు కాజాలరు. అంత చిన్న వయస్సుననే విద్యయం దభిరుచియు, సత్ప్రవర్తనము నేర్పవలసి యున్నది. అయిదు వత్సరముల ప్రాయముగల బిడ్డలను బడికి పంపినచో అచటి ఉపాధ్యాయులు ఆ పసిపిల్లలయం దంతగా శ్రద్ధ వహించరు. ఆ స్థితిలో ఇంటగల తల్లులు విద్యావతులైన యెడల తమ బిడ్డలకు తగిన విద్య నేర్పుటకు సమర్థురాండ్రుగా నుందురు. గాని మనలో తల్లులకు గల విద్యాలోపముచే అంతటి భాగ్య మబ్బుటలేదు. ఆరు, ఏడు సంవత్సరముల వయస్సు రాగానే పాఠశాలకు పోనేర్చి విద్యావాసన చూడగలిగిన వారగుదురు. ఇక రెండు మూడు వత్సరముల వరకు వారు మొదట రెండు పాఠపుస్తకములు చదవగానే "మా బిడ్డయొక్క వివాహపువేడుక యెపుడుచూతుమా" యని కనిపెట్టుకొని యున్న తల్లిదండ్రులు ఆ శాస్త్ర కన్నులముచ్చట తీర్చుకొందురు. అటుపై అత్తవా రేమందురో యని బాలికను బడికి పంపుట మానుకొందురు. ఇంటిలో చదువు చెప్పువారు లేక వారు గవ్వలతోను, గచ్చకాయలతోను ఆడుచు అమూల్య సమయమును వ్యర్థపుత్తురు.

కొందరు తలిదండ్రులకు, అత్తమామలకు తమ పిల్లలను విద్యావంతు రాండ్రినుగా జేయ నభిలాష యున్నను కులాచారము కట్టుబాట్లకు, బంధువుల దూషణలకు లోబడి ఊరకుండవలసి వచ్చును.

గృహవ్యవహార సంబంధమగు విషయములలో స్త్రీలు కొంచెము జోక్యము కలిగించుకొని మాట్లాడబోయిన పక్షమున కొందరు పురుషులు "మీ తెలివి వంట యింటిలోనేగాని ఇచ్చట పనికిరావని" కసరుచుండుట గూడాకలదు. గాని ఆ యమాయకురాండ్రకు గల విద్యాలోపముచేగాని లేకున్న మనవలెనే వారును చాక చక్యము గలవారై ప్రతివిషయ మందును వారి తెలివి వెల్లడించు చుందురని తెలిసి కొనజాలరు. కొందరు సత్పురుషులు అట్టిమహానుభావులతో స్త్రీవిద్యా విషయమై ప్రసంగించిన యెడల విద్యనేర్చుటకు పురుషులేగాని స్త్రీలర్హులు కారనియు ఒకవేళవిద్య నేర్చిరా పురుషులను లక్ష్యము చేయరనియు; సరిగా వంట వండరనియు వాదింతురు. గాని; ఆహార పానీయములు స్త్రీపురుషవయో భేదములేక స్వీకరించుటకు ఎట్లు జన్మతః హక్కుగలదో; ఆట్లే విద్యయు స్త్రీపురుషభేదములేక అభ్యసింప దగినది.

విద్యయనగా జ్ఞానామృత మనియు దానినిగ్రోలి; వెనుక అత్యంత ప్రఖ్యాతి గాంచిన సతీనుతల్లుల; పుణ్యపురుషుల చరిత్రములు చదివిచూచి వారివలెనే తామును అట్లుప్రవర్తింప గోరుదురుగాని; పురుషులమాట లక్ష్యముచేయక; గృహకృత్యములు సరిగా నర్వహింపరని తలంచుట చాలా విచారకరము.

ఇంటి పనిబాటలు వదిలిపెట్టుకొని పుస్తకములు తిరుగవేయుచు గూర్చో వలయునాయని తలంతురేమో ? గాని గృహకృత్యములు నెరవేర్పగా మిగిలిన సమయమందే విద్యాప్రయత్నము చేయవలెను. సామాన్యముగా చాలా మందికి ప్రతిదినము పగలు పదిగంటలు మొదలుకొని సాయంకాలము నాలుగు గంటలవరకు తీరుబాటుగా నుండును. ఆ సమయములో ఇతరులతో వృథాగోష్ఠి సలుపుటకంటె విద్యాభివృద్ధి సలుపుట యెంతయు లాభకరము.

కొందరు విద్యావిహీనులగు సోదరీమణులు పురాణములు, హరకథలు, నాటకములు మొదలగు వానికి వెళ్ళినపుడు అక్కడ జరుగు కథాసందర్భము తెలియక కొన్ని మాటల కర్థము తెలియక అచ్చటజరుగు హాస్యములు, వారి వేషములు, దుముకులు మొదలగునవి చూచియే సంతోషపడవలసి వచ్చును. వారు రసవంతములగు చక్కని పాటలను పాడుచుందురు. గాని వారు పాడెడి పాటయందలి యర్థమే గ్రహింపజాలరు. ఇట్టి విషయము దలంచుకొన్నచో ఎంతయు విచారింప దగిన విషము. కావున మనము విద్య నభ్యసించి ప్రకృతి ధర్మములను, మత ధర్మములనుగూర్చియు దేశచరిత్రములను గూర్చియు తెలిసికొని మానవజన్మము సార్థకపరచు కొందముగాక !






గాంధీమహాత్ముడు:—(౧-౨ భాగములు): కర్త, "విష్ణుచక్రం". ప్రకాశకులు: దేశోద్ధారక గ్రంథమాల, ఇమాం బావి వీథి, సికిందాబాదు. మొత్తము పుటలు, ౧౨౦. వెల ౧ కి ౦—౬—౦. అచ్చుకాగితములు సాధారణము.

శ్రీ గాంధీమహాత్ముని గూర్చిన చరిత్ర పుస్తకములు మిక్కిలి విస్తారముగా ప్రకటింపబడు చున్నవి. అందు నిదియు నొకటి. సుప్రసిద్ధమైన 'ఆత్మకథ' ననుసరించియు, ౨౦ వత్సరముల నుండి యున్న జాతీయోద్యమమును బట్టియు గాంధిగారి జీవితము ఇందు సంక్షేపముగ వ్యాసములవలె స్వతంత్రించి వ్రాయబడినది. రచన బాగుగనే యున్నది. కాని, సంస్కృతశ్లోకములు చాల తప్పులుగ బడినవి. మహాత్ము డవతార పురుషుడుగా నిరూపింప బడినాడు. పాశ్చాత్యాచారములను తొలిగించి భారతీయాచారములను గాంధిగారు నెలకొల్ప బూనినట్లు గ్రంథకర్తగారు ప్రతిపాదించుచున్నారు కాని ధార్మికాచార విషయములో పాశ్చాత్యుల భావములతో మహాత్మునకు అభిప్రాయ భేదము లేనటులే మేము భావించుచున్నాము.

జాగీరులు:—కర్తలు: ఉమ్మెంతల కేశవరావుగారు. సురవరము ప్రతాపరెడ్డిగారు. ప్రకాశకులు, అణాగ్రంథమాల ౩౬౯౧, తురుపు బజారు, హైదరాబాద్. ద. పుటలు, ౪౨. వెల అణా.

చారిత్రిక ప్రసిద్ధమైన పరిపాలనగల నిజాంరాష్ట్రములో దాదాపు చిన్నవి, పెద్దవి రెండువేల జాగీరులు కలవు. (అనగా జమీందారీలు లేక సంస్థానములు) వీని ఆదాయము నాలుగుకోటి రూపాయీల పెద్దమొత్తము. పెద్ద రాజులకువలెనే వీనికిని సమస్తాధికారములు కలవు. జాగీరులలో జరుగని అసంభవము లేదని వాడుక. వీరి పరిపాలన అత్యద్భుతముగా నుండును. బ్రిటీషు ఇండియా వారెవరైనను, ఈ పుస్తకమును చదువుకొనినచో నవలాపఠనము వలె మనోరంజనము కాగలదు. జాగీరు ప్రజల స్థితిగతులు తెలిసికొన. గోరువారు ఈ పొత్తమును చిత్తగింపవలెను. ప్రబోధమునకు బనికివచ్చును. అనుభవము గలవారిచే వ్రాయబడినవి. బ్రిటీషిండియా లోని జమీందారీలను గూర్చి యిట్లే ఒకపుస్తకము ప్రకటించుట మిక్కిలి అవసరము.

కాంగ్రెసు చరిత్ర:— (౧-౨ భా.) కర్త: జానపాటి సత్యనారాయణగారు, మొత్తము పుటలు 75, వెల ౧ కి ౦-౧-౦, ప్రకాశకులు పైవారే.

భారతవర్షమును గాఢ నిద్రనుండి మేల్కొల్పిన కాంగ్రెసు (మహాసభ) చరిత్రను ఆంధ్రులు సులభముగ తెలిసికొనుట కయి ఈ చౌకరకము పుస్తకము ప్రస్తుతింప బడినది. ఆంగ్లేయుల ప్రవేశము మొదలు మొన్నటి సత్యాగ్రహారంభము వరకు జరిగిన ముఖ్యమైన ఘట్టములను సంక్షిప్తముగ సూచించినారు. గ్రంథమాల వారి ప్రయత్నము ప్రశస్తము.

మున్నూరు కాపుసంఘ కార్యనివేదిక:—ప్రకాశకులు: మిరియాల యాదగిరిగారు. కార్యదర్శి, ము. కా. సం. లాల్ దర్వాజ హైదరాబాదు. ద. పుటలు ౪౪.

ఈ సంఘమువారు స్వజాతీయ చరిత్రను నిర్మించుటకై మిక్కిలి పరిశ్రమించుచున్నారు. విఘ్నములు, వివాదములును కలిగినవి. కడచిన విజయదశమినాడు శ్రీ గొండ్యాల వెంటయ్యగారి అధ్యక్షత లోనిది. (1940) ప్రంపబడి భవిష్యత్కార్యములును నిర్ణయింప బడినవి. అధ్యక్ష పన్యాసమున గమనింపదగిన యంశములు గలవు, ఈ సంఘము శీఘ్రముగ సాఫల్యము నొందుగాక యని కోరుచున్నాము,

# శ్రీశైల వీరశైవ మహాసభ

గతసంచికలో దెలుపబడినప్రకారము ఈ మహాసభ శివరాత్రి పర్వదినమున శ్రీశైలక్షేత్రములో శ్రీ గిరిరాజ సూర్యసింహాసనాధ్యక్ష జగద్గురు శ్రీ వాగీశ పండితారాధ్యశివాచార్య మహాస్వాములవారి యధ్యక్షతలో జరుగగలదు. ఉజ్జయినీ సద్ధర్మ సింహాసనాధ్యక్షులైన శ్రీజగద్గురు సిద్ధేశ్వరశివాచార్య మహాస్వాముల వారును దయచేయగలరని నిరీక్షింపబడుచున్నది. శ్రీ పం. చి. మ. వీరభద్రశర్మ గారు మున్నగు విద్వద్వరేణ్యులును అనేక పట్టచరాధికారి స్వాములవార్లును, ప్రముఖులును నానా దేశములనుండి వచ్చుచున్నారు. అనేక ముఖ్యమైన విషయములు చర్చింపబడుటయేకాక సమయానుసారము మహిళాసభయు నెరవేర్పబడును. శ్రీగిరి మల్లికార్జునుని పవిత్రసాన్నిధ్యము, శ్రీశైలోజ్జయినీ జగద్గురువుల సందర్శనోపదేశ మహాభాగ్యము, పండితుల ధర్మోపన్యాసములు, అఖండ వీరశైవ మహాజనసమ్మేళనము అను చతుష్పాదపూర్ణమైన మహాధార్మికసభలో ఆస్తికులందరు తప్పక పాల్గొందురని విశ్వసించుచున్నాము. తక్కిన వివరములు ముందు ప్రకటింపబడును. వచ్చువారు విశేషములను తెలుపవలెను.

ఇట్లు:— ఏజంటు,

శ్రీ జగద్గురువులవారి పర్వతమఠము,

గుంతకల్లు.

---




సచిత్ర మాసపత్రిక

పుండ్రము ౨ | శా. శ. ౧౮౬౧ విక్రమ సంవత్సర పుష్యము | రేఖ ౧౧

Vol 2 | 22 ~~డిశంబరు~~ జనవరి 1940 సికింద్రాబాద్ | No. 11

# శ్రీమద్రేణుకాచార్య విజయము

శ్రీ నేమాన సూర్యప్రకాశ కవిరాజుగారు

## — కృతినాయక ప్రశంస —

సీ. శరదభ్ర శరశుభ్ర కరశుభ్ర గరుదభ్ర పాదపాదభ్ర విభ్రమము దెగడి
శేషాహి భూషావిశేషాఢ్య భాషాఖ్యయోషామణీ మహోన్మేష మెనసి
రంగత్తరంగ ప్రసంగతుంగాభంగ గంగా తరంగిణీ భంగి గేరి
యంభోజ జంభారి కాంభోజ కుంభీభ్ర శుంభత్సుధాబ్ధి సంరంభ మణచి.
యెవని సత్కీర్తి విస్ఫూర్తి యుద్ధరిత్రి, నింపుసొంపును బెంపు వహించి మించు
నతడు పటు శేముషీహాసితాహివరుడు, బాల సూర్యప్రసాద భూపాల వరుడు.

సీ. ఏ కళాజలధి యస్తోకవైఖరి లోకమాన్యుడై మహనీయ మహిమ మొందె
నే దేశబంధుండు మేదుర గీతారహస్యార్థ బోధకుండై వెలింగె
నే స్తుతగుణుడు సమస్త శాస్త్రములందు బరిపూర్ణ విజ్ఞాన పటిమ జెందె
నే నిత్యసత్యు డహీనార్య విజ్ఞానరచనకు ముఖ్యకారకత గాంచె.
నట్టి శ్రీ బాలగంగాధరార్యతిలకు, శిష్యుడై శాస్త్రవిజ్ఞాన శీలశమల
బొంది యే ద్విజరాజు వెల్గొందు నట్టి, బాలసూర్యప్రసాద భూపాల వరుడు.

ఉ. ఆ నళినాసనుండు సముదంచిత సంచితబుద్ధి నాత్మ వి
జ్ఞానమునం బ్రపంచమును సద్గతి మున్ను సృజంచినట్టు లి
మ్మానవనాయకుం డిపు డమానుషరీతి సృజించె నాంధ్ర వి
జ్ఞానకథా ప్రపంచమును సన్మతి వాగ్విభవం బెలర్పగన్.

—: కై లా స శై ల వ ర్ణ న ము :—

శా. నీలగ్రీవ శిరస్స్ఫురత్సురసరి న్నిత్యోర్మికామాలికా
ఖేలన్మత్తమరాళచంచు చరణా కీర్ణారుణాంశుచ్ఛటా
లీలాకుంకుమ పంకసంకలిత దిగ్లీలావతీవక్షమై
కైలాసాచలరాజ మొప్పును జగత్కల్యాణ సంధానమై.

సీ. పుండరీకప్రియ మండలసాహస్ర, సన్నిభోద్దండ తేజంబు గాంచి
చారు శరత్కాల సంపూర్ణిమాచంద్ర, శితసాంద్ర చంద్రికాచ్ఛవి వహించి
నిర్మలావిచ్ఛిన్న నీహార సంఛన్న, కమనీయ బహుకటకముల జెలగి
సురసరిదూర్మి శీకరసిక్త సువ్యక్త, ఘనతరోత్తుంగ శృంగముల నలరి
వ్యోమయానచర న్మరుద్గ్రామములును, సుప్రభావస్ఫురన్మునిస్తోమములును
గలిగి వెలుగొందుచుండు నఖండపాండు, రుచివిరాజిత మగుచు నయ్యచల మవని.

శా. శ్రీమాంధాతృ మహీశనిర్మితము గౌరీనాథ పాదోదక
స్తోమోపేత మశేషదోషహర ముత్తుంగోర్మికామాలికో
ద్దామం బుజ్జ్వలరాజహంసము పవిత్రంబున్ ప్రసిద్ధంబునై
శ్రీమన్మానస మన్సరోవరము రాజిల్లుం దదీయస్థలిన్.



శ్రీరేణుకాచార్యుని శ్రీ సోమనాథ లింగోద్భవము

మ. సముదంచద్గతి సంభవించె బరమాశ్చర్యం బవార్యం బపూ
ర్వ మచింత్యం బనవద్య మశ్రుత మపారంబై మహాదివ్య తే
జము సోమేశ్వర లింగరాజమున బూజానిష్ఠ మాహేశ్వ రో
త్తములు స్వభక్తులు సభ్యులున్ లిఖితచిత్రప్రక్రమం బొందగన్.

ఉ. ఎంత విచిత్ర తేజ మిది యెన్నడు నెవ్వరెరుంగ రబ్జినీ
కాంతసహస్రబింబరుచి కల్ప మఖండ మనల్ప మిట్లు లిం
గాంతరసీమ వెల్వడి శివాలయ మంతయు నిండె గారణం
బింత యెరుంగ మంచు జను లెల్ల వచించు నుండి రత్తరిన్.

సీ. పృథుభుజోపరిభాగ ధృతహారిద్రిచికంథ వితతఫాలస్థల వీక్షణంబు
మహితలింగాంకిత మస్తకం బురుజటానికర కల్పిత మహా మకుటవరము
నవరత్న ఖండమండలకుండలయుగంబు రుద్రాక్షమాలికా రుచిరవక్ష
మమల భస్మత్రిపుండ్రాంకశరీర ముత్కట కమండలుదండ కరయుగళము
హాసవదనంబు కరుణాదృగంచలంబు భూరితేజంబు గల దివ్యపురుషు డొకడు
కలశజలనిధి నల సుధాకరుడువోలె సమ్మహాలింగ మం దపు డవతరించె.

ఉ. మించిన వేడ్క దేవతలు మేదురరీతి బ్రసూనవృష్టి గ
ల్పించిరి దేవదుందుభులు పెల్లుగ మ్రోగెను నర్తనంబు గా
వించిరి నిర్జరాంగనలు వీచె సుగంధసమీరముల్ ప్రకా
శించె మఖాగ్నులున్ దెసలు జెందె బ్రమోదము లోక మయ్యెడన్.

శ్రీరేణుకాచార్యుం డగస్త్యునకు శైవమత ధర్మంబు లెరింగించుట,

గీ. పొందవలె ముందు సద్గురు పూర్ణకరుణ సాధన చతుష్టయమును విజ్ఞాననిరతి
నతడె పో ధన్యతముడు గృతార్థు డవని వాని జన్మంబు సఫలంబు మౌనివర్య.

క. పరమేశ్వర సమ్మతమై, పరగున్ సాంఖ్యంబు ధరణి బహుశాస్త్రోక్త
స్ఫుర దురుయోగోత్తమమై, పరమంబై నిత్యసౌఖ్యపదవీ ప్రదమై.

గీ. తనరు నయ్యాది పాంచరాత్ర త్రిరాత్ర, సంజ్ఞ బశుపతిమతహిత సంప్రదాయ
సహితమై యందు ముఖ్యమై శైవతంత్ర,మమరు శ్రుతిదైవత ప్రమాణముగ జగతి.

సీ. శివయోగి వర్యుల జేరి వా రెరిగించు నుపదేశవాక్యంబు లోలి వినుచు
త్రికరణశుద్ధిగ శ్రీ గిరీశునియందు భక్తిగల్గినవాడు భక్తవరుడు
శ్రవణ సంకీర్తన స్మరణాంఘ్రిసేవ నార్చనవందనములు దాస్యంబు సఖ్య
మాత్మనివేదనం బను నివి తొమ్మిది దైవతభక్తి ప్రధానవిధులు
పాపకర్ముల కది దుర్లభంబు పుణ్య, కర్ములకు సులభ బంది గలుగు నాత
డధముడైన నుత్తముడైన నవని బరమ,భక్తుడని పల్కుదురు బుధప్రవరు లనఘ.

క. విమల విభూతియు రుద్రా,క్షములున్ శివ చిహ్నములు లనన్మతి వానిన్
గ్రమమున శివభక్తుడు ని,త్యము ధరియింపగవలెన్ శివాగమరీతిన్.

విభూతి సంభవకథనము; తత్ప్రభావము.

వ. మునిజనశిఖామణీ! పరమ పవిత్రంబు లైన విభూతిరుద్రాక్షంబుల జన్మాది విశేషంబులును, తద్ధారణ ప్రకారంబులును నెఱింగించెద, నాకర్ణింపుము.

సీ. రాజావతంసు సద్యోజాత వామదేవా ఘోరతత్పురుషాననముల
నీశానముఖమున నెసగ జన్మించె నందయు భద్రయును సురభియు సుశీల
యును సుమనయు నగు నుత్తమ గోపంచకం బది క్రమమున గపిల కృష్ణ
ధవళ ధూమ్రారుణచ్ఛవి నల్లసిలె నందు సంభవం బంది ప్రశస్తి గాంచె
భవ్యగతి, విభూతి, భసిత, భస్మ, క్షార, రక్షలను సమాఖ్య లక్షయముగ
బూని సకల లోకపూజ్యమై పరమ పవిత్రమై విభూతి విమలహృదయ.

ఉ. భూరి విభూతి నిచ్చును, విభూతి, మహేశ్వర దివ్య తత్త్వవి
ద్యారుచిరత్వ మిచ్చు, భసితంబు సమస్త మహాఘ్రపాప సం
హార మొనర్చు, భస్మము చిరాయువు దేజము నిచ్చు, నిచ్చలున్
క్షారము సర్వరక్షణము సల్పును, రక్ష ధరించువారికిన్.

—: రుద్రాక్షజన్మ, ప్రభావ, ధారణ క్రమంబులు :—

గీ. ఆది రుద్రాక్ష సంభూత మైనకతన, నలరు రుద్రాక్షమను పేర నఖిలలోక
పావనం బయి యది నిజోత్పత్తి భేద, విధుల ముప్పది యెనిమిది విధము లయ్యె.

సీ. అభవు సూర్యాత్మకం బగు నేత్రమున గపిల ప్రభాకలితమై లలి వెలుంగు
పండ్రెండు చంద్రరూప విలోచనంబున బొందు ప్రభ నెసంగు పదియునార్గు
ననలాంబకంబున గనక సన్నిభవిభా స్ఫూర్తి వహించి మించు నవి పదియు.
నుదయించె నవి యన్నియుంగూడి ముప్పది, యెనిమిది విధములై యొసక మొసగె
నందు వహ్ని నేత్రమం దుదయించిన, పదియు గృష్ణకాంతి బరగు ననుచు
గూడ జెప్పబడియె గుణరూపజన్మ వి,భేదముల ననేక విధము లయ్యె.

క. భద్రప్రఖ్యంబును నచ్ఛిద్రంబు ననన్యధృతము శ్రీముఖమును నౌ
రుద్రాక్షమును ధరించిన, భద్రము లగు నరున కఖిల పాపము లణగున్.

ఉ. దక్షుడు వీరశైవమత ధర్మవిదుండు లసద్విభూతి రు
ద్రాక్షధరుండు శ్రీకర శివాగమ విజ్ఞుడు సర్వసద్గుణా
ధ్యక్షుడు నైన దేశికకులాగ్రణియొద్ద మహేశమంత్రమున్
దీక్ష వహించి భక్తు డుపదేశము నొందవలె న్మునీశ్వరా.

మ. దివిషద్బృందమునందు నింద్రుఁడు లసద్దివ్యగ్రహౌఘంబునన్
రవి, నానామృగరాజి సింహము, సరిద్వ్రాతంబునన్ గంగ, గో
త్రవితానంబున మేరుభూధరము, మంత్రశ్రేణి శ్రీమన్మహా
శివపంచాక్షరి యుత్తమం బని మునిశ్రేష్ఠా! శ్రుతు ల్వల్కవే.

క. ఆ సౌమ్యమంత్రి మంగ, న్యాసకర న్యాసహితమై యలరగ ను
ద్భాసితభక్తిన్భక్తుఁడు, పాసింపగవలయు శైవ పద్ధతులమెయిన్.

సీ. పాదోదకంబు ప్రసాదంబు, గురులింగజంగమార్చనములు శైవదివ్య
పంచాక్షరీమంత్ర పఠనంబు రుద్రాక్ష, ధారణంబు విభూతి ధారణంబు
నను నివి యెనిమిది యష్టావరణములు, నా బొల్చు శైవ తంత్రంబునందు
వీని నొనర్చుట వీరశైవాగమా, చారప్రకారంబు శైవు డిట్లు
సలుపవలయు మఱియు సరవి బంచాచార, తత్పరుడు దశావధానకలితు
డమల శీలసహితు డఖిల తత్త్వవిదుండు, నైన వాడు శైవు డగు మునీంద్ర.

సీ. శ్రీమహాలింగంబు హృదయాంగమున, బ్రసాదాఖ్యలింగము శ్రవణాంగకమున
ముదమున జరలింగము ద్వదంగమున, శివలింగరాజంబు దృగంగకమున
జిర గురులింగంబు జిహ్వాంగకమున, నాచారలింగంబు బెంపార నాసి
కాంగంబున న్ననుదంచితగతి, బ్రతిష్ఠితములై యుండు సంతస మటంచు
వీరశైవాగమంబులు వేయినోళ్ళ, జాటుచున్నవి తన్మత సంప్రదాయ
విధుల శివపూజ సేయుగోవిదుడు పుడమి, షట్స్థలజ్ఞాని యనబడు సన్మునీంద్ర! *



* వీరశైవ మతస్థాపనాచార్యులలో సుప్రసిద్ధుడైన శ్రీ జగద్గురు రేణుకాచార్యుని చరిత్ర యాంధ్రభాషలో లేనికొరతను శ్రీకవిరాజుగారు తీర్చుచున్నందులకు మిక్కిలి సంతసము కలుగుచున్నది. వారి ప్రబంధమందలి పద్యములు కొన్ని మచ్చునకు చూపబడినవి. వీరు దేవిడీ సంస్థానాధీశ్వరులైన శ్రీ రాజా కందుకూరి బాలసూర్యప్రసాదరావు బహద్దర్ గారి యాస్థాన కవీశ్వరులు, కృతియొక్క కర్తకును భర్తకును శ్రేయోదాయకమగు నీ ప్రబంధ రచనా శుభకార్యము శ్రీఘ్రముగా నెరవేరునని ప్రతీక్షించుచున్నాము. సం. వి.

# శ్రీకంఠుడు, ఆదిశైవులు, తన్మలులు

శ్రీ ముదిగొండ గురుపాదమయ్యావారుగారు

'విభూతి' పత్రికయొక్క 9 వ సంచికలో ప్రకటింపబడిన "బోధానందుల వారి వ్రాతలు" అను వ్యాసమును పురస్కరించుకొని 'ఆది శైవపత్రిక'లో రెండు విమర్శనలు ప్రకటితము లైనవి. నేను వ్రాసిన ప్రశ్నలకు సమాధానము వ్రాయుటకు వారికి ప్రమాణములు లభింపమినిగాబోలు. కోపోద్దీపితముగ అశ్లీల సంభాషణము గావింపబడినది. నన్ను నా వ్యాసమునే కాక 'విభూతి' సంపాదకులనుగూడ అత్యుగ్రముగ నధిక్షేపించినారు. ఇది మిక్కిలి యనుచిత మైన మార్గము. స్వజన్మానుగుణముగ మాటలు బయలుపడక తప్పవు. నేనట్టి వ్యర్థ ప్రలాపమునకు దిగ దలచలేదు. స్వసామర్థ్యమును జెప్పుకొన ననక్కర లేదు. అది వ్యాసములోనే సప్రమాణముగ నిరూపించినపుడు గోచరము కాగలదు. నాపూర్వ వ్యాసమందలి విషయములను వారి విమర్శతో నీ క్రింద స్పష్టపరచుచున్నాను. కావున సావధానముగ నాలోచించి సయుక్తికముగ నుత్తరించి నా యాశమును ఖండించినచో నేనును సత్యమును స్వీకరించగలను. లోకమునకు నూతనముగ ఇతిహాస మొకటి దెల్పిన వా రగుదురు. అట్లుగాక తిట్టులచే జయింపదలచువారు అసంభాష్యులు గాక మానరు. చేనులోని మట్టి బొమ్మలకు పిట్టలుమాత్రమే బెదరును.

(౧) బ్రహ్మసూత్ర భాష్య కర్త యగు శ్రీకంఠ శివాచార్యుని నేను అధిక్షేపించితి నని వారు వ్రాసినారు. అట్టి శబ్ద మొకటియైనను నా వ్యాసమున లేదు. మరి యొక సారి యవలోకింపవలెను. శ్రీకంఠుడు లోకప్రసిద్ధుడు. అట్టి యాచార్యునితో సంబంధము గల దనువారు ఈక్రింది యంశములను సరిగ నాలోచింపవలసియున్నది.

(౨) శ్రీకంఠ శివాచార్యుని బ్రహ్మసూత్ర భాష్యము మొట్ట మొదలు "కాశీపండిత పత్రిక"లో ప్రకటింపబడినది. 1903 లో మైసూరు ప్రభుత్వము వారు మరల పరిశుద్ధముగ నచ్చువేయించినారు. మూడవమారు శ్రీమదప్పయ దీక్షితుల 'శివార్కమణి దీపిక' యను సంస్కృత వ్యాఖ్యానముతోడను స్వకృతవృత్తి తోడను శ్రీహాలాస్యనాథ శాస్త్రిగారు శ్రీకంఠభాష్యమును 1908 లో ప్రకటించినారు. అనగా నాగరి లిపిలో మూడువిధము లైన శ్రీకంఠభాష్యములు ఇది వరకు ప్రచారము నంది యున్నవి.

ఇవి యన్నియు పరిశుద్ధముగా నుండుటయెగాక, ప్రామాణికములై పండితులలో ప్రచారము నందియున్నవి. ఈ గ్రంథములలో నెక్కడను శ్రీకంఠుడు ఆదిశైవు డనుటకు ఆధార మిసు మంతయు లేదు. భాష్యకర్త ఆదిశైవ మతీయు డగుచో స్వమత లక్షణములనో. వైశిష్ట్యమునో, ఆచారములనో స్వభాష్యమున సూచింపవలసి యుండెను. అట్టిదేదియును కాన రానపుడు శ్రీకంఠుడు సహజమైన శివసర్వోత్తమత్వ సిద్ధాంతస్థాపకుడైన మహనీయుడు మాత్రమే యగుచున్నాడు. "సర్వ వేదాంత సారసుగంధమును అనుభవించి యానందించెడు శివభక్తులైన ఆర్యులకు నీ భాష్యము మహానిధి" యని శ్రీకంఠుడు తన భాష్యారంభమున నుడివియున్నాడు.

శ్లో॥ సర్వవేదాంతసారస్య సౌరభాస్వాదమోదినాం ।
ఆర్యాణాం శివనిష్ఠానాం భాష్యమేతన్మహానిధిః॥

శ్రీ కంఠాచార్యునకు ఆదిశైవత్వమును ఆరోపించినంతమాత్రమున సాఫల్యము లభింపజాలదు.

శ్రీ బోధానందులు ఆంధ్రాక్షరములలో శ్రీకంఠుని సూత్రభాష్యమును అచ్చువేయించినారు. ఉన్నదున్నటుల యథావత్తుగా శుద్ధముగా ముద్రింపబడుచో ఆంధ్రదేశీయులకు ఉపకరించెడిది. అచ్చుతప్పుల కుప్పలు. స్పెసుల విపరీతములు ఒకవైపుండగా, ఆమర్దక శాఖా మఠమొకటి కాశీ మణికర్ణికా ఘట్టములో గలదనియు, దాని కధిపతులైన జగద్గురు శ్రీకంఠ శివాచార్యులకు పరంపరగా తాము శిష్యులమనియు ముఖపత్రములోను, ఆ శ్రీ కంఠుని యవతార మీ బోధానందు లనియును, శ్రీకంఠుడు ఆదిశైవు డనియును శ్రీ కంఠాచార్య స్తుతిలోను వ్రాయబడియున్నది. ఈ శ్రీకంఠస్తుతి నెవరు వ్రాసిరో! తమకు తామేనా? వీరు క్రొత్తగా వ్రాసిన గద్యపద్యములలోను భూమికలోను గల శబ్దదోషములతో నాకు బనిలేదు.

శ్రీకంఠుడు ఆదిశైవు డనుటయు బోధానందులకు పరంపరా గురు వనుటయు మున్నగు వైపరీత్యములే విమర్శనీయములు. ఇట్టి యసత్యములను ప్రచారము చేయుటవలన అనర్థము కాదా! శ్రీకంఠుడు ఆదిశైవు డనుటకు ప్రమాణములు లేవనియే నేను గట్టిగా తెల్పియున్నాడను. ఆధారము కలదేని యది యే గ్రంథాలయమందలి ఎట్టి గ్రంథమున ఏ ముద్రిత పుస్తకమున నున్నదో, స్థలనిర్దేశ పూర్వకముగ దెలుపవలెను. స్వకపోలకల్పితగాథలతో సమాధానము కాజాలదు. శ్రీకంఠుని మఠము కాశిలో లేదని నేను నిరూపింపగా "కాశిలో మఠములే లేవా? ఉన్నయెడల నందేది యైనను ఆదిశైవ మఠము కాగూడదా?" అని విమర్శకులు ప్రశ్నించుచున్నారు. ఇది యత్యద్భుతముకదా! ఉన్న దనుటకు పూర్వగ్రంథ ప్రమాణమును

గాని ఇతిహాసమునుగాని, స్థలపురాణమును గాని, మతమును గాని, ఆధారముగా జూపవలసిన బాధ్యత విమర్శకులపైననే కలదు. మతము లేనందుననే లేదని సత్యమును వ్రాసితిని, శశశృంగము లేదనుటకు లేకుండుటయే ప్రమాణము. ఆదిశైవమతము కాశిలో నున్నట్లు శ్రీ బోధానందులవారు భావించుచున్నారుగదా! యనుచో మఱియొకరు లండనులో నున్నట్లును సుఖస్వప్నము గాంతురు. ఇదియేనా ప్రమాణసామర్థ్యము? పామరజనమునకు జెప్పురీతిని భాష్యములలోను వ్రాయుట పరిహాసాస్పదము. శ్రీకంఠు డుత్తరదేశమున సంచరించి కాశిలో మతమును స్థాపించి నట్లును, ఆదిశైవుడైనట్లును ప్రమాణము జూపుచో నేను నిస్సంకోచముగ ధన్యవాదముల బ్రకటింపగలను. "శ్రీకంఠుడు మహాసీయుడు కావున తన కులగోత్రములను జెప్పుకొనలేదు" అనుచున్నారు విమర్శకులు. దీనితో ప్రతివాదులు నా సిద్ధాంతమును స్వీకరించినటులే యైనది. శ్రీ రామానుజాచార్యుడు, శ్రీ మధ్వాచార్యుడు మున్నగువారు తమ తమ భాష్యములందు స్వస్వమతముల నామధేయములను సిద్ధాంతములను ప్రతిపాదించినారు. శ్రీ కంఠాచార్యునకు అట్టి మత ప్రత్యేకత యుండుచో అవశ్యముగా పేర్కొనువాడు. అట్టి దేదియు లేదు కావుననే శ్రీకంఠుడు సహజముగ శైవుడుగానే పరిగణింపబడినాడు. కావున సహజశివభక్తినిష్ఠాగరిష్ఠులైన శ్రీమదప్పయ్య దీక్షితులు శ్రీకంఠుని భాష్యమునకు 'శివార్కమణి దీపిక'యను మహావ్యాఖ్యను రచించినారు. ఈశానశివ, సోమశంభు, హారదత్త, శ్రీకంఠ, అప్పయ్య దీక్షిత, సోమకంఠులు మున్నగువా రందరు దక్షిణ దేశమున నుండెడు శైవ బ్రాహ్మణ పరంపరల లోనివారే. కాని స్మార్తేతర శాఖకు జెందినవా రని గణింప వీలు లేదు. వీరి శివపూజానిష్ఠను జూచి ప్రత్యేకశాఖగా భావింప జనరాదు. అప్పయ్య దీక్షితుడు, శివార్చన చంద్రిక యను గ్రంథమున పార్థివలింగ, పాణిలింగ, పీఠలింగార్చనలను వివరించి యున్నారు. దీక్షితుల వంశపరంపర నేటికి ద్రవిడదేశమున నున్న సంగతిని ప్రాజ్ఞు లెరింగియే యున్నారు. దీక్షితాదులు ఆదిశైవులుగా రనుట సుస్పష్టమే!

"శ్రీకంఠభాష్యమును కొందరు వీరశైవ భాష్య మని భావించి అందు లింగధారణ సిద్ధాంతము లేనందున తమది కాదని రట" అని యొక వ్యంగమును విమర్శకులు విసరినారు. అది వీరశైవ భాష్య మని యెవరును భావించి యుండలేదు. శ్రీకంఠభాష్యపు కొన్ని ప్రాచీన ప్రతులలో "నను జీవముఖ్య ప్రాణలింగ" యను సూత్రభాష్యములో లింగధారణ సిద్ధాన్తపంక్తులు గలవనియును, ఆధునికులు వానిని తీసివేసి ముద్రించి యున్నా రనియును విమర్శకుల ఆదిశైవ పత్రికకు హితచింతకులే యైన

శ్రీ శ్రీ రాజా కందుకూరి బాల సూర్యప్రసాదరావు బహద్దర్ గారి సహాయ సమ్మతుల వలన ప్రమాణ పురస్సరముగ నొక వ్యాసము ఆప్పటి "శైవప్రచారిణి"లో ప్రకటిత మైనది. నీలకంఠ భాష్య శ్రీకర భాష్యములను గూర్చియే లింగధారిపండితులు చర్చించిరి. కాని శ్రీకంఠ భాష్య విషయమై యెప్పుడును భ్రమపడలేదు. పై శ్రీ బహద్దరుగారిని విచారింపవచ్చును. వీరశైవులు కారుగదా ! ఇపుడు తంబళులు శ్రీకంఠ భాష్యమును తమ దని గొప్పగా భ్రమించుచున్నారు. అది ప్రమయే యగుచో సప్రమాణముగ నిరూపింపవలెను. తిట్లచే జయము కలుగజాలదు. స్వకల్పిత శ్లోకములతో నంతకంటెను సాధింపజాలరు.

తమకు సామర్థ్యము కలదేని స్వయముగ భాష్యములను రచింప వచ్చును. మత సిద్ధాంతముల స్థాపించి జగద్గురుత్వము నందవచ్చును. తపోబలాధిక్యమునను, విజ్ఞానా విష్కరణము వలనను మహర్షిత్వమును పొందవచ్చును. ఇది ప్రాచీనపరంపర. ఇట్టి విషయములతో సంబంధము లేనివారు తమకు దామే మహర్షియని సంతకము జేసికొనుచు వాకొనుటయు, పూర్వ భాష్యకర్తల మతములను మార్చుటయు, మున్నగు కృత్యములు సాధువేనా? శ్రీ బోధానందులవారికి శ్రీకంఠ భాష్యమనిన ప్రేమ యుండుట ప్రశంసనీయమే కాని, శ్రీకంఠుని భాష్యారంభమున తమ చిత్రమును, తాము వ్రాసిన టైటిలు పేజీయొద్ద శ్రీకంఠుని చిత్రమును అతికించుట లోని రహస్య మేమి?

భాష్యము నారంభించువారికి ప్రత్యక్షముగా వలసిన మూర్తి యేది? ఈ వినిమయ పరివర్తనాధికారముతో సాధింప నెంచినది సామాన్యజనసంమోహనము కాదేని, ఇక "ఋషయ స్సత్యవచసః" అని పఠించవలసినదే! భాష్యమునకు మహాచార్యులు, మహర్షులు వ్యాఖ్యలను వ్రాయుటకు శక్తి లేక కాదు. ఆచారము లేక కానోపు ఉదాసీనించినారు. శ్రీకంఠ భాష్యమును తెలుగు అక్షరములలో ముద్రించునపుడు నామమాత్రమునకు నాలుగు పంక్తులు గల శ్రీకవి గణపతిశాస్త్రిగారి లఘుటిప్పణిని జేర్చినారు. ఈ టిప్పణి మహత్తును దెలిసియే పాఠకుల సంతోషముకొరకు శ్రీ బోధానందులు జేర్పించి యుందురు. ఏదో గొప్ప విశేషము లేనిదే శ్రీ బోధానందులంతటివారు శ్రీ గణపతిశాస్త్రి కవిగారిని సన్మానింతురా? శ్రీకంఠ భాష్యములోని ప్రథమ వాక్య మిది. "ఇహౌపనిషదీ మీమాంసా సమారభ్యతే" అనగా "ఇచ్చోట ఉపనిషత్తులలో ప్రతిపాదింపబడిన ఏ బ్రహ్మము కలదో ఆ బ్రహ్మమునుగూర్చిన చర్చయారంభింపబడుచున్నది" అని తాత్పర్యము. "ఇహ ఔపనిషదీ, మీమాంసా" అని దీనికి శబ్దచ్ఛేదము కలదు. ఔపనిషదీ యనునది ఈకారాంతప్రథమైకవచనము.

శ్రీ గణపతిశాస్త్రిగారి టిప్పణి యిట్లు కలదు. “ఇహౌపనిషదీతి ఉపనిషదీతి సప్తమ్యంతపాఠే లక్షణయా బ్రహ్మణీత్యర్థః” అనగా, “పై శ్రీకంఠ భాష్యమందలి ఇహౌపనిషదీ అనుటకు ఉపనిషత్తునందు అను సప్తమీవిభక్తి పాఠము జెప్పుకొనగా తాత్పర్యముచేత బ్రహ్మమునందు అని యెరుంగునది” అని గణపతిశాస్త్రిగారి లఘు టిప్పణి భావము. దీనితో పాఠకులకు సౌకర్యము కలిగినదా? లేక వ్రాయుటలోని పొరపాటా? ఇహౌపనిషదీ అనుటలో ఉపనిషది యని భావించి సప్తమ్యంత పాఠములో లక్షణతో బ్రహ్మార్థము చేసికొను మను చున్నారా? ఇహ — ఔపనిషదీ అను రెండు శబ్దములలో వృద్ధియైనట్లు శ్రీ గణపతి శాస్త్రిగారికి తెలియదా? తెలియుచో ఉపనిషది శబ్దమునకు అర్థమువ్రాసి ఔపనిషదీ శబ్దమునకు అర్థమును వివరింపలేదేల? రెండుశబ్దములకు వేరువేరు అర్థము లున్నటుల చిత్తగించినారా? ఔపనిషదీ శబ్దమున లక్షణా తాత్పర్యముల అక్కరలేకయే బ్రహ్మమని యర్థమయ్యెన్నా? శాస్త్రిగారు కవిగారు కాబట్టి ఇట్టి యర్థమును కల్పించినారు రంసమ్ ! ‘కవయః కిం న కల్పంతే’? వారు వ్రాసిన లఘుటిప్పణీవాక్యము తాము సంకల్పించిన యర్థమును సిద్ధపరచకపోగా అపార్థమునకు గూడ ఆశ్రయము నిచ్చుచున్నది. అసలు రహస్య మేమనగా అప్పయ దీక్షితుల టీకలో నుండియే కద వీరు సంగ్రహించినది. ఆ వాక్యములను ఆమూలాగ్రముగా వ్రాసినచో తమ చాతుర్యము తగ్గు నని భావించి కాబోలు నవీనముగ వాక్యరచన గావించి పొరపడినారు. అసలు దీక్షిత వాక్య మిట్లు కలదు. “ఉపనిషదీతి సప్తమ్యంతపాఠేఽప్యేవ మేవార్థః” దీక్షితులు ఔపనిషదీశబ్ద నిర్వచనమును పై వాక్యమునకు పూర్వమే విపులముగా జెప్పి యున్నారు. కావునను, అపి ఏవం ఏవ అను శబ్దత్రయమును ప్రయోగించినారు కావునను, దీక్షితుని వాక్యము హృదయంగమమై శాస్త్రీయమై యున్నది. గణపతి శాస్త్రిగారి టిప్పణి పూర్వాపరార్థాపేక్షారహితమై అసంపూర్ణముగను, అసమర్థముగను ఉన్నదనుటకు పండితులే ప్రమాణము. దీక్షితునంతటి మహావిద్వాంసుని సామగ్రిని స్వరచనలతో గట్టి చూపుటకు సునిశితమైన ప్రతిభ కావలెను. ఇట్టి గుణసంపదలు గలిగిన లఘుటిప్పణిని గొప్పగా భావించి శ్రీకంఠుని భాష్యముతో జేర్చి యచ్చు వేయించినవారి పాండిత్యగరిమను గొనియాడతరమే! ఈ లఘుటిప్పణి కన్న మూలభాష్యకారు దుద్ధరించిన శ్రుత్యాది ప్రమాణములయొక్క అధ్యాయాది స్థలములను ధనుశ్చిహ్నములలో సూచింపుట పరమావశ్యకమై యుండెను. నాగరిలిపి గ్రంథములలో నవి సూచితములైనవి. తెలుగులో ముద్రించినవారు వానిని యేలకో తొలగించినారు. ఈ విధముగ ప్రచురించి నందులకే కాబోలు శ్రీకంఠునికి పరంపరగా పీఠాధిపతులైనారు. ఇక ప్రమాణాదులతో బనియేమి?

శివార్చకులు (శివద్విజులు) కొందరు తమిళ దేశ మందలి గురుక్కళ్ శబ్దమును వాడుకొనుచు దీనిని గురుకుల శబ్దముగా సంస్కరించి జాతీయ శబ్దమని చెప్పదొడగినారు. గురు- కళ్ అనగా గురువుగారు అని యర్థమే కాని మఱొకటి కాదు. 'కళ్' అనునది తెలుగులోని 'గారు' వలె గౌరవవాచకమై ప్రథమాబహువచన ప్రత్యయమై యున్నది. కళ్ ను కులగా భావించుట వింతయే ! తమిళశబ్దములను ఎరువు దెచ్చుకొనుటకు తెలుగునుడి లేదనియా? మొదటినుండి వాడుకలో నున్న తమ్మళ తంబళ నుడులలో తప్పేమి కలదు ? పరంపరాచారముగ వచ్చిన వృత్తిని (డోలువాయించుటను) తప్పుగాభావింప నవసరములేదు. హరద్విజులాపని చేయకూడదనుటకు ప్రమాణమేమి ? శివసన్నిధిని భేరిని, నగరాను, ఢంకాను, ఢక్కిని, డోలును, వాయించినచో నదియును శివుని కైంకర్య మేలకాదు? అర్చనాదులే ముఖ్యవృత్తిగా గల ఈ దేవలకులకు ప్రతిష్ఠాది కర్మాధికారము లేదనియును, కానీను లని (కన్యకు జనించిన వారని) యును, చంద్రజ్ఞానాగమ ప్రమాణములతో నా పూర్వవ్యాసమున సూచింపగా ఆ శ్లోకమును సంపూర్తిగ నేల వ్రాయ లేదని విమర్శకులు ప్రశ్నించుచున్నారు. ఆ మాత్రము చాలు నని సూచించితినికాని మరియొక యుద్దేశ్యమే లేదు. ఇప్పటికైనను సరిగా పఠించుకొనవచ్చును.

దీక్షాణామిహ శైవీనాం పూర్వభాగోదితాత్మనాం
గ్రహణాగ్రహణాభ్యాం చ ద్వివిధాస్తే శివద్విజాః॥ ౧౪
అర్చకత్వే హి దేవస్య కైంకర్యకరణేఽపి చ
శివాగారపరిష్కారేఽధికృతాస్తే సురార్చిత॥ ౧౫
నాచార్యత్వే వ్యాధికృతాః ప్రతిష్ఠాదిషు కర్మసు
దీక్షితానామపి హ్యేషాం కానీనత్వాదసంశయం॥ ౧౬
అథ యేఽదీక్షితా ఏవ పరార్థయజనే రతాః
తే హి దేవలకాః ప్రోక్తాః సర్వకర్మవిగర్హితాః॥ ౧౭
శివాగారాదన్యదేశే తేషాం స్పర్శోఽపి దోషదః
శివార్చకత్వాదేతేషాం శైవత్వేఽపి పరిస్ఫుటం॥ ౧౮
అదీక్షితజనానర్హా పరార్థయజనాదపి।
తథావిధజనానర్హా శివద్రవ్యస్య భక్షణాత్॥ ౧౯
శివకైంకర్యవిషయశ్రద్ధాలోపాదిదోషతః।
తన్మలా ఇత్యుదీర్యంతే సర్వశైవేషు గీష్పతే॥ ౨౦
తేషు శైవేష్వవద్యత్వాత్తన్మలా ఇతి విశ్రుతాః।
(చంద్రజ్ఞానదశమపటలే)

"శైవదీక్షులను గ్రహించిన వారనియును గ్రహించని వారనియును శివద్విజులు ద్వివిధములుగా నున్నారు. శివు నర్చింటయందును శివాలయము శుభ్రపరచుట యందును వీరి కధికారము కలదు. ఈ శివద్విజులు దీక్షనొందినను వీరు కానీనులు కావున శివప్రతిష్ఠాది కృత్యములలో ఆచార్యత్వము వహించుటకు అర్హులుకారు. పరార్థపూజగావించుట వలన దేవలకులని చెప్పబడుచున్నారు. శివుని పరిచర్య సేయుట యందలి యశ్రద్ధాది దోషములవలన శైవులలో తమ్ములు లని చెప్పబడుచున్నారు" మున్నగు అంశములు జూడగా ఈశివార్చకులకు శివద్విజ, హరద్విజ, తమ్మల, శబ్ద ములే, సుప్రసిద్ధములై యున్నవి. ఆదిశైవమతీయులు వీరు కానేరరు, దానికి ప్రత్యేకమైన లక్షణములు, ఆచారములు, కలవని చంద్రజ్ఞానము నవలోకించు వారికి విపులముగా దెలియగలవు. తమ్మల శబ్దమునుండియే తంమళ తంబళ వ్యవహారము కలిగెననుట సహజమే! ఇట్టి యనూచానమైన వ్యవహారమును త్యజించుటకు కార ణము గనుపడదు. శివార్చకులు సరిగా సమన్వయము చేసికొనకయే క్రొత్తగా ఆది శైవ నామమును స్వీకరించినారు. కాని యిది సాధారముకాదు. నిజాంరాష్ట్రమందలి తమ్మళులకు పరంపరగా ఆరాధ్య వీరమాహేశ్వరులు గురువులై యుండుట సుప్ర సిద్ధమే! వాద్యముల వాయించినందువలన కానీనత్వము వచ్చినట్లుగా విమర్శకులు చెప్పుచున్నారు. కానీనత్వము జన్మకు సంబంధించినది కాని వాద్యమునకు కాదు. ఆ కానీనత్వము ఆంధ్రదేశమందలి సమస్త శివార్చక వంశస్థులకు శాస్త్రీయముగనే కలిగినట్లు తెలుసుకొనవలెను. నిజాంరాష్ట్రమందలి తమ్మళులు విమర్శకు లనుకొని నటుల అమాయకులేమియు కారు. చతురులై, వైద్యులై, సదాచార పరులై, గురు భక్తులై, శాస్త్రాచారములయం దనురాగముకలిగియున్నారేకాని, నవీన నామముల ధరించలేదు. గురువులు వారిని మోసగించిన దంతకంటెను లేదు.

భగవద్గీతకు శ్రీకంఠాచార్య కృతమని యొక సంస్కృత వ్యాఖ్యను తెలుగు తాత్పర్యముతో శ్రీబోధానందులు ప్రకటించినారు. ఇది శ్రీకంఠకృతము కాదంటిని. దీనిపై విమర్శకులు "ఆసేతుహిమాచల పర్యంతం గ్రంథాలయము లన్నియు గాలించినట్లున్నదే" యని ప్రశ్నించిరి. పాపమీ యమాయకులకు "మైసూరు, తంజావూరు, మద్రాసు, కలకత్తా, కాశీ, పటనా, లాహోరు, కాశ్మీరము, బరోడా, బొంబాయి, పూనా" మున్నగు నగరములందలి గ్రంథాలయములు కేటలాగులను ముద్రించి విక్రయించుచున్న సంగతి తెలియనట్లున్నది. శ్రీకంఠకృతమగు గీతా భష్యము పై గ్రంథాలయములలో నెక్కడను లేదుకదా! బోధానందులు ఇంకను శ్రీకంఠకృతమగు ఉపనిషద్భాష్యము కాశ్మీరములో కలదనియును చెప్పుచుందురు.

ఇది నమ్మినవారు నుండవచ్చును, బెంగుళూరు నివాసులైన శ్రీ నందీశ్వర దీక్షితుల వారినుండి బోధానందుల వారికి గీతాభాష్యము లభించినదట! వారు శివసాయుజ్యము నందినారు కావున చెప్పువారు లేరు. మైసూరు ప్రభుత్వమువారు శ్రీ కంఠుని సూత్ర భాష్యమును స్వయంప్రేరితులై ముద్రించినారుకదా! ప్రభుత్వము వారి కార్యాలయముననే యున్న నందీశ్వర దీక్షితులయొద్ద శ్రీకంఠుని గీతాభాష్యముకూడ లభించినపుడు, దానిని ప్రకటించు సదవకాశమును విడనాడరు. స్వద్రవ్య వ్యయముచే ప్రభుత్వమువారే పరిశుభ్రముగా భాష్యమును ప్రకటింతురన్న స్వర్ణసంధిని, నందీశ్వర దీక్షితు లెట్లు జారవిడిచిరి? అసలు రహస్యము కొంత వేరేయున్నది. నందీశ్వర దీక్షితుల తండ్రిగారైన శ్రీ నంజుండ దీక్షితులుగారే గీతకు శైవాగమ సిద్ధాంతపరముగ సంస్కృతటీకను చాలాకాలము క్రితము వ్రాయుచుండిరి. అదియే శ్రీకంఠకృతముగాను, నందీశ్వరదీక్షితుల టీకయే విశ్వేశ్వరాచార్య టిప్పణిగాను, లోకమునకు జెప్పబడుచున్నవి. గీతాభాష్యారంభములోని "పార్థాయ ప్రతిబోధితా" అను శ్లోకమును, దాని సంస్కృతటీకను గమనించినచో అది భాష్యమో కాదో తెలియుగలదు. గీతాభాష్యములో.

"శ్లో॥ పార్థాయ ప్రతిబోధితా భగవతా నారాయణేన స్వయం
వ్యాసేన గ్రథితా పురాణమునినా మధ్యే మహాభారతే
అద్వైతామృతవర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయనీం
అంబ త్వామనుసంధధామి భగవద్గీతే భవద్వేషిణీం॥"

శ్రీ బోధీనందులు ఇటులీ శ్లోకమును ముద్రించినారు. ఇది సుప్రసిద్ధమైన శ్లోకము. "ప్రతిబోధితాం గ్రథితాం మహాభారతం" అని యుండవలసిన శబ్దరూపములు అశుద్ధముగా నున్నవనుటను ఎవరైనను చెప్పవచ్చును. ఇవి యచ్చు తప్పులనుటకు పరిశోధనపత్రమున జూపబడలేదు. పైపెచ్చు ఈ యశుద్ధరూపములకు శ్రీకంఠ భాష్యమని చెప్పబడు టీకలో ప్రథమాంతములుగనే అర్థము వ్రాయబడినది. "త్వాం" అను కర్మపదమునకు విశేషణములైన ప్రబోధితాం మున్నగునవి ప్రథమాంతపదములుగా నెట్లు సమన్వయము కాగలవు? మధ్యేమార్గం, వంటి దేమైన, మధ్యేమహాభారతం, అను పదమును, మధ్యేమహాభారతే, అని వ్రాయుటయు వ్యాఖ్యానించుటయు కూడ జరిగినవి. భాష్యానుకరణము చేయబడినదికాని అది సామాన్యుని టీకయే. టీకాకర్తకు సునిశితమైన శాస్త్రజ్ఞానమున్నట్లు సూచనలైనను లేవు. ఇట్టి మాయ టీకను శ్రీకంఠునంతటి మహాచార్యుని పేరున కంటగట్టుట దోషాస్పదము.

శ్రీకంఠుని అవతారకాలనిర్ణయమును గూర్చియు, శ్రీ బోధానంద ధీవరులు అత్యద్భుతమైన చాతుర్యమును ప్రకటించినారు. స్కాందపురాణభవిష్యోత్త పురాణ ఉమామహేశ్వర సంహితలోనుండి యట కొన్ని శ్లోకముల వ్రాసినారు. కలియుగాబ్దములు ౧౪౮౯ స్వభాను వత్సర ఫాల్గున శుక్లపంచమీ రేవతీ నక్షత్ర కర్కటక లగ్నమున శ్రీ కంఠాచార్యుడు జన్మించినాడట! ఇది శ్రీవారి నిర్ణయము, దీని క్రింద కీర్తిశేషులైన నందీశ్వర దీక్షితుల పేరును వ్రాసినారేల ? గట్టిగా నడుగువారు వచ్చినపుడు "మాకు తెలియదు దీక్షితులకే తెలియు"ననుటకేనా ? దీక్షితులు కారుగదా దేవుడు దిగినను ఈ కాలమును నిరూపింపజాలడు. కలియుగాబ్దము ౧౪౮౯ లో స్వభానుసంవత్సరము గణనముతో రాజాలదు. చాంద్రమానప్రకారము రక్తాక్షి సంవత్సరమును సౌరమానప్రకారము ధాతృ సంవత్సరమును మాత్రమే సిద్ధాంతితము లగుచున్నవి. ప్రస్తుతము కలియుగాబ్దములు ౫౦౪౧ యు, విక్రమసంవత్సరమును కలదు. వీనిని ౬౦ సంఖ్యతో భాగించిచూడగా కలియుగాబ్దము ప్రమాథి వత్సరముతో నారంభమైనట్లు తేటపడగలదు. ఉత్తరదేశమున ప్రస్తుతము నందన సంవత్సరము వ్యవహరింపబడుచున్నది. ఆ ప్రకారము కలియుగాదివత్సరము నందనయే యగును. గణిత సిద్ధాంతానుసారము ఉభయవిధములైన సౌర చాంద్రమాన స్వభాను వత్సరములు కలియుగాబ్దము ౧౪౩౨ లోను, ౧౪౪౪ లోను మాత్రమే వచ్చియున్నవి. ౧౪౮౯ లో దొంగ లెక్కలబన్నినను ముమ్మాటికి స్వభాను రాజాలదు. గీతాభాష్యములో అచ్చుతప్పులు పడిన వనిమెదరేమో! అటులనుటకు వీలులేదు. సంస్కృత శ్లోకములలో 'చతుర్దశశతే చైవ పంచాశీత్యా చ సంయుతే. కలౌ యుగే గతేఽబ్దానాం స్వభానుర్నామకే తతః' అని యును తెలుగులో "కల్యాదినుండి పదునాల్గువందల యెనుబదియైదు సంవత్సరముల తర్వాత స్వభాను" అనియును విస్పష్టముగ వ్రాసికొనినారు. వారికి భయమే లేదుకదా! సంశయమూ ఉద్భవించలేదు! సంస్కృత శ్లోకములతో చెప్పిన చాలు ననుకొనినారు కాబోలు! 'స్వర్భానునామకే' 'చతుర్దశశతేఽతీతే శరాశీతిశ్చ హాయనే' 'పంచాశీతిశ్చ వత్సరే' మున్నగు వాక్యములలోని 'స్వర్భానుః, శరాశీతిః, పంచాశీతిః' అను శబ్దరాజములు నిరంకుశములు కాబోలు. దేనికిని విశేషణములు కాజాలక తమ యజ్ఞానమునకు వగచుచు అస్పృశ్యములై యున్నవి. ఆర్య మహాశయా! ఈ శ్లోకములను సంస్కృతము వచ్చినవారే రచించినారా? పైగా వ్యాస మహర్షి ప్రోక్తములా? కలియుగమహర్షి ప్రోక్తములనుటలో సందేహలవములేదు. శ్రీకంఠాచార్యుని జన్మకాలమును గూర్చిన శ్లోకములు స్కాంద భవిష్యోత్తరములలో



గలవనుటకన్న ఘోరము లేదు, ఇట్టి శ్లోకములను కల్పించి పామరజనములో పలుకు బడి సంపాదించినను పవిత్రములైన పురాణములను గూర్చి యగౌరవమును ప్రచార మొనర్చుచున్న వీరులకు కాలాగ్ని రుద్రుడు బహుమానముల నిడక మానడు.

కలియుగాబ్దము ౧౪౪౭ లో అనగా మూడు వేల ఐదువందల సంవత్సరములకు పూర్వమే శ్రీకంఠుడు భాష్యరచన యొనర్చి యుండుననుచో శ్రీకంఠ భాష్యమున పేర్కొనబడిన పూర్వాచార్యు లంతకంటె నెంత పూర్వులో? ఏమీయద్భుతము! పదవ శతాబ్దమున అనగా నేటికి వేయిసంవత్సరములకు పూర్వముండె ననుటకు "శ్రీకంఠుని శివాద్వైతము" అను మద్రాసు విశ్వవిద్యాలయమువారి ఆంగ్ల గ్రంథమును చదివి యథార్థమును గనుగొనమని నా పూర్వలేఖలో సూచించినను తెలిసికొనలేదు. "నీవన్ని గ్రంథములను దేశములను, జూచితివా! నీకు కం రాదు థం రాదు" మున్నగు బహు మానములను విమర్శకులు నా కొరకు వాడినారు. తమకు ఏ వాఙ్మయమున ఏవ్యక్తి యందు ప్రేమగలదో అట్టి వానిని గూర్చి యైనను శ్రద్ధతో పరిశ్రమింపవలదా?

గీతాభాష్యము భూమిక 13 వ పేజీలో "దేవాలయములందు శివుని బూజించు వారు ఆదిశైవులు, త్రైలింగ బ్రాహ్మణులు మహా శైవులు, క్షత్రియ వైశ్యులు అనుశైవులు, వీరశైవులు లింగధారణము జేయు శూద్రజాతివారు" అని వికట ప్రసంగము యజ్ఞానముతోడనే ప్రకటింపబడినది. ఒక్కొక జాతికి ఒక్కొక మతమునే అంటగట్టుటకు ప్రమాణమేమి? ద్వేషబుద్ధి లేనివారు అట్టి వాక్యమునేల వ్రాసిరి? వీరశైవమున జాతులు లేవని యెవరనిరి? 'విభూతి' సంపాదకులే వ్రాసిన వీరశైవులు లింగాయత శబ్దము'అను వ్యాసమును అవలోకించి యైనను సత్యము గనుగొనవలెను, వీరశైవుల నందరిని ఒక జాతిక్రింద గట్టి లింగధారణమును కారణముగ జూపుట పరిహాసాస్పదము కాదా! పార్థివలింగ పూజానిరతులు, పాణిలింగపూజా నిష్ఠులు, శివార్చకులు, శివలింగమును ధరించక స్పృశించకయే కైంకర్యము చేయుచున్నారా? వీరందరు స్మార్తాదులు కారా? 'ప్రమాదముగ వ్రాయబడెనని స్వీకరించుట ప్రాజ్ఞునికి భూషణముగాదా! తమ వ్రాతలు సమన్వయముగా నున్నట్లు తా నుకొనుటకాదు. లోకమునకు గోచరించవలెను. అపార్థము చేయబడలేదు. వ్రాయబడినది.

శివాగమములలో సమస్త శైవశాఖల ధర్మములును విరూపితములై యున్నవి. ఆగమములు తమవే యని విమర్శకులు అనుకొన వచ్చును. నష్టములేదు. శ్రీకంఠ మత వంశ సంబంధముల నసత్యముగ చాటుట యెందులకు? స్వనామస్థాపిత మతములకు గౌరవము స్వగుణాను సారముగ కలుగక పోదు. సంప్రదాయ పూర్వకముగ అభ్య

సించిననే తప్ప ఎరికిని విజ్ఞాన మబ్బనేరదు. నేర్వనివారు కావుననే గీతాభూమికలలో "మాకు ఆంధ్రగీర్వాణ భాషలయందు పాండిత్యము లేకున్నను కొంచముగా వ్రాసితిమి. తప్పులు చాలా ఉండవచ్చును" అని బోధానందులవారు వ్రాసికొనినారు. భాషాదోషములే కావు భావదోషములును మిక్కిలిగా కలవు. "శంకరుడు ప్రత్యక్షమై భాష్యముల నచ్చు వేయించమని యుదేశము" కలిగించినాడే కాని తప్పులు దిద్దుకొని శుద్ధమైన గ్రంథములను రచించు శక్తిని యిక ముందైనను అనుగ్రహింప గలడేమో! శివ చిహ్నములను నా పూర్వవ్యాసమున పరిహసించినానని విమర్శకులనుచున్నారు. శైవులు శాస్త్రములలో జెప్పబడిన భస్మరుదాక్షాదులను మాత్రమే ధరింపవచ్చును గాని వ్యాఘ్రచర్మము, సర్పము, విషము, కపాలాస్థులు, అర్ధనారి మున్నగు వానిని గూడ ధరింపవలెనా? విధాన ప్రమాణము కలదేని యుద్ధరింప వలెను.

విద్వద్వరేణ్యులును, విజ్ఞాన ఘనులును, వినయ సంపన్నులును, సరసులును, అగు, విభూతి సంపాదక మహనీయులు బోధానందులతో మర్యాదగనే సంభాషించి యుండిరి. గణపతి మందిర కార్యదర్శి మున్నగు వారందరును సంభాషణావసరమున నుండిరి. ఎన్ని సంగతుల బ్రస్తావించినను భోధానందులు "అవకాశో నాస్తి, తావత్" అనుట దప్ప మారులే దయ్యెను. సికిందాబాదులోని మరియొక రిద్దరును సంస్కృతమున మందలించి సారమును గ్రహించియే యున్నారు. వీరశైవగురుకులాశ్రమమును సందర్శించి అందలి దుర్లభ మహాగ్రంథరాశి నవలోకించుటకు సంచితమే కావలయును. ఆహ్వానములతో అనువుగాని మాట నిక్కువము. నా పూర్వవ్యాసములోని సూచనలను ప్రతిపక్షులు గమనించినచో నీ రహస్యములను ప్రకటింప వలసినపని యుండెడిది కాదు. వారి పుస్తకములో నుండి జూపవలసిన బండెడు యవకతవకలు యథావశము బయలు పడగలవు. నా వాదమును సత్యమైన యుక్తులతో ఖండించిచో నేను సంతసింప గలను. లేక తమవాదము నుపసంహరించుకొని యసత్య ప్రచారమును మానుకొన వలెను. ఇదియే శుద్ధుని లక్షణము. అసభ్యవ్యంగ్యములను నేను గణింపను*.

ఆనువాఙుంకురు తే ప్రతిధ్వనిం నతు గోమాయురుతాని కేసరీ

---

* ఆదిశైవపత్రికలోని వ్యాసమువగూర్చి నాల్గు విమర్శనలు మాకు జేరినవి. సప్రమాణముగనున్న ఈ యొక వ్యాసమును మాత్రమె ప్రకటిరించితిమి? తక్కినవానిని ప్రచురింప జాలము. ప్రతివాదులును యుక్తియుక్తముగ వ్రాసి పంపినచో ప్రకటింప గలము. ఏ ప్రమాణము లున్నను, గ్రంథముపేరు. పరిచ్ఛేదాదులు ప్రకాశన స్థలము మున్నగు వానిని సూచింప వలెను. — సంపాదకుడు.

# సంక్రాంతి

విద్యాప్రవీణ శ్రీ బి. వి. వి. ప్రసాదరాయశర్మగారు

ప్రతిగృహమ్మున నూత్న దీధితి వెలార్చు, కమలనయనల పాలిటి కల్పతరువు
భవ్య సౌధావరోహ సోపానసరణి, స్వర్ణసంక్రాంతి ఆ శుభప్రదదినమ్ము. ౧

భవ్యగేహమ్ములను మేఘపథమునందు, నెమ్మొగములను పున్నమ నెలపొడుపులు
నిగ్గుటద్దంబు లనెడి వెన్నెలలు గాయ, కలికితనమున మెరయు సంక్రాంతి లక్ష్మి. ౨

ఏ యింట గన్గొన్న యేని మంగళమూర్తులై, నిత్యకల్యాణు లైన చెలులు
ఏ చాయ గన్గొన్న యేని చిత్రమ్ములై, ముత్యాల బంతితో మొనయు ముగ్గు
లే వీట గన్గొన్న యేని పుణ్యశ్రవ, ణాసక్తులైయున్న యట్టి జనులు
ఏ తోటలం గన్న యేని హేమంతంపు, లక్ష్మికై తోరణా లట్టు విరులు
జగతి నే వంక గాంచిన సరసమధుర ప్రకృతి లక్ష్మీవిలాసముల్ పరిఢవిల్ల
ఎల్లజనముల కానంద మిరవు కొనగ కదలి విచ్చేసె నేడు సంక్రాంతి లక్ష్మి. 3

పచ్చని సస్యలక్ష్మి పయిపైని మెరుంగులు దిద్ద మెండుగా
విచ్చిన బంతిపూలు కనువిం దొనగూర్ప నిసర్గపుం రుచుల్
హెచ్చ సహాస్య లక్ష్మి ఘటియిల్లె నిలింపకిరీట పుష్ప ర
జ్యచ్చరణాబ్జ కల్పవిలస న్నవ మోహనపుష్పమూర్తియై. ౪

తళుకుం జూపుల సిగ్గుదొంతరల సౌందర్యంబు దీపింప, ని
ర్మలభక్తిన్ లలనామణుల్ సకలసంపత్సాధనావాప్తికై
కలుషమ్ముల్ నశియించుకై మహితమాంగల్యమ్ము వర్ధిల్లకై
ఇల ని న్నెప్పుడు పూజ సేసెదరు లక్ష్మీ వారి దీవింపవే! ౫

కలకూజితంబుల ఖగచయంబులు నీకు, అతిమోదమెలయు స్వాగతము గూర్ప
ప్రత్యూషవేళల భక్తులు నిన్ వంది, మాగధు లౌచు ప్రేమమున పొగడ
వికసిలామోదంబు వెదజల్లు క్రొవ్విరుల్, వల్లీతతుల్ తలంబ్రాలు పోయ
కల్యాణమూర్తులై కలికిమిన్నలు నీకు, భక్తి తళ్కొత్త నివాళులెత్త
భూమిదివిజు లాశీర్వాద పూర్తి నెరప, రత్నసింహాసనమ్ము పై రాణ నలరి
ప్రకృతిసామ్రాజ్యలక్ష్మికి పట్టమహిషి వై చెలంగు సుఖంపు కాణాచివగుచు. ౬



# నలుపు తెలుపయ్యె నారీవినమ్ర మహిమ!

కవిరత్న : శ్రీ లక్కన మల్లికార్జునుడుగారు



తినగా తినగా వేము తియ్యగా నుంటుం దన్నారు. అట్లే సాధనమున ఎంతటి పనులైన సులభము లగును. ఊరక చేతులు ముడుచుకొని కూర్చుంటే జీవితమెట్లా గడుస్తుంది ? ప్రతి జీవి ఏదో ఒక పని ఘనతరపు కట్టుపాటున సాధించవలె. సోమరి వలె ప్రవర్తించితే ఫలమేమైనా గలదా ? అని తన కుమారుని బుజ్జగించినాడు గృహమేధి. ఆ మాటలు కర్ణశూలము వలె వినపడినవి. హృదయ కోశ మంతా కోపానలముచే పైకుబికినది. తండ్రి కంఠం పిసకా లని ఉద్దేశించినాడు. కాని యింకా యంతటి ధైర్యముచిక్కలా. ముసముసలాడినాడు, ముఖము ముడుచుకొని పోయినది. వెంటనే తండ్రి ఎదుటనుండి తప్పించుకొని పెరటిదొ్రవను పట్టి షికారు కేగినాడు. పెద్దవారి మాటలు గణించెడి వారలెవ రీ కాలమున ?

నడివీథిలోకి చేరి ఏమేమో లేత సొరకాయలు తెగ కోసినాడు. నలుగురిలో నగుబాటు కలిగిన తానె ఘనుడని యుబ్బినాడు. అటనుండి ఒక సందు కేగి ఒక దిమ్మె మీద తిష్ఠవేసినాడు. సిగరెట్టు వెలిగించాడు. కూనరాగాలు తీశాడు. కంటిని సొగసుగా తిప్పుటకు ప్రారంభించినాడు. నీటుగా కట్టిన గూడకట్టు, ఇస్త్రీచేసిన షర్టు, నల్లటి దేహమున కందముగానె తోచుచున్నవి. చూడటానికి కోతిలాగా ఉన్నా, షోకిల్లా పురుషుడని చెప్పవచ్చును. సహజమైన శీవి లేకున్నను తెచ్చుకున్న బడాయి, ఎగురు పాటుతనము బాగానె ఉంది.

కన్ను మిన్ను తెలియని కావరము, కట్టుపాటులేని కామేచ్ఛలు, ముద్దుల ముచ్చటలు, క్రీడా రహస్యములు, వ్యభిచారపు గుట్టులు, పరులకు భయపడని పొగరుమోతు తనము, మగనికి మసిపూసెడి నేర్పరి తనము, గ్రహించిన జారిణీ శిరోమణి నీటుగా పక్కపాపడి తీసి ఇరువైపుల ఇనుపపిన్నుల గుచ్చి, పూలచెండు వాల్జెడమీద నవరించింది. విశాలమైన నుదుటిమీద క్రాపింగువలె ఎగదువ్విన వెండ్రుకలు తాండవ మాడుచున్నవి. ముక్కు లావైనను కన్నులు చిన్నవియె. బుగ్గ లుబ్బినందున పండిన బంగినపల్లి మామిడిపండువలె మోము ముద్దుగానే ఉంది. అవి కుంభకోణపు చెంబులవలె నిక్కనవి కాబోలు లోబాడీలో బంధించి చంకల కాను జాకెట్టు తొడిగింది. నక్కుభాయి చీరె కట్టింది. నీటుగా పూచిన పువ్వువలె కిలకిల

లాడుతు మెదటి వాకిలికి జేరినది. క్రోడిదూడవలె రంకెలు వేయు మన సోమరియన్నను చూచింది. తన పంట పండినదిరా యని ఉవ్వూళ్ళూరినది. తనువు పులకరించింది. సౌఖ్యము స్ఫురణకు వచ్చింది. ఇంద్రియములు గల్లంతు జేసినవి. మన సాపలేక పోయింది. వానివంక వారకంట చూస్తూ చిరునవ్వు నవ్వి కన్ను మీటింది. మన వా డది చూచి ఉబ్బిపోయినాడు, దేహం పులంకరించినది, ఆపె వంక దీక్షగా చూచి నాడు. కన్ను లాడించినాడు, అటు ఇటు తిలకించాడు, ఎవరు లేరుకదా యని నిర్భయు డైనాడు. వెంటనే నెమ్మదిగ ఆపె దాపు కేగి నిలబడ్డాడు. ఆపె చిరునవ్వున ఏం బావ గారు ఇవ్వాళ ఇలా వచ్చారు! రండి అని దొడ్డిలోనికి జేరింది. ఆపె వెంట మనవాడు నడచినాడు.

క్రిమక్రిమముగ మన సోమ రన్న స్వేచ్ఛా విహారంబులకు అలవాటు పడి నాడు. తల్లి దండ్రులకు పంగనామములు పెట్టినాడు. పనిపాటలకు స్వస్తి చెప్పాడు. లోకులను కాకులుగా భావించాడు. తన శరీరభోగమే స్వర్గపథ మనుకున్నాడు. పగలు రాత్రి యనకచేయు పలువ పనులు, తియ్యతియ్యని తిండ్లు, నీటుకలిగిన దుస్తులు, గాటు కలిగిన సిగరెట్లు, తనకు ప్రియము లనుకున్నాడు. పాపం గీవం లేదన్నాడు. దేముడు గీముడు లేదన్నాడు. పెద్దవారంతా వెఱ్ఱి లన్నాడు. ఇక ఇతని నడ్డగించు వారెవరు? సోమరుల పొత్తుతో, రౌడీల జట్టులతో, విపరీత భోగములతో బ్రహ్మానంద మనుభ వించుచున్నాడు. కాని మధ్య మధ్య తలిదండ్రులు అడ్డము వచ్చుచుండుట కంటక మనుకున్నాడు. పెద్దవాడైనా నని గర్వించి ఆ యడ్డు నతిక్రమించినాడు. వీరు డైనాడు, తనకు జయము లభించినదని గర్వించినాడు, కాని లోకము నిందించే విషయము మాత్రము గమనించినాడు కాదు.

కాల మెప్పు డొక రీతిగ నుండదు కదండి. అదిగాక 'ఎగరవేయు బంతి ఎం దాక నిలచురా' అన్నట్లు ఎన్నాళ్ళు ఈ భోగం జరుగుతుంది? సుఖానికి కష్టమూ, కష్టానికి సుఖమూ వస్తుంది యనెడి సామెత వృథయగునా? మన వాడికి ఏ మహా తల్లియో తగిలించింది ఒకటి కాదు, రెండుమూడు కాదు, నాలుగు రకాలు. కష్టమెట్టిదో ఎరుగని భోగి, రోగ మెట్టిదో ఎరుగని రసికుఁడు, పాపం బాధ కోర్వగలడా? పోటు లకు గిల గిల లాడేవాడు, రోగం గుట్టుగా ఉంచుదా మనుకుంటే వంటి నిండా పొక్కులు ప్రత్యక్షమై రోగం రట్టయింది. ఐతేమట్టికి యేమి? మొండివేస్తే మగ డేమి చేయగలడు సిగ్గువిడిస్తే శివుడేమి చేయగల'డన్నట్టు తన కిది యొక బిరు దని భావించినాడు దాని కేమి లెండి సహస్రాక్షు డని ఇంద్రునికి బిరుదురాలా?

రోగమువస్తే, ఊరకె పోదుగదండి! శిలుము వదలి తేగాని ఫలము దక్కదన్నా రుగా, అట్లే డాక్టరుగారికి ముడుపులు చెల్లించిటము ప్రారంభము చేసినారు. తల్లిదండ్రి

ఇదివరకు దయ్యాలలాగా కనిపించిన ఇప్పుడింత చాకిరిచేయుటకె అవసర మైనారు, కన్న కడుపులుకాన ప్రేమకు లొంగి బానిసలైనారు. రోజులు మంచివి లెండి. అరఘడియ సుఖం ఆరునెలల వ్యాధి యన్నటుల ఆరుమాసములకె నెమ్మదించినవి. మనిషి మళ్ళీ పుంజుకున్నాడు. తలిదండ్రులు ఇక పెండ్లి చేయకపోతే అబ్బాయి చెడతాడనుకొని సంబంధమునకై అన్వేషించినారు. "ఏగానికి ఏడుగురు, పైన ఇద్దరు కొసరు" అని భార్యలతొ కొందరు పురుషులన్నట్టుగా కన్యలకు కొరతలేదు. కాని రెండెకరముల మాగాని భూమితో రెండు వేలతొ కన్య నిస్తామని వార్తవచ్చినది. శుభ ముహూర్తమున పెండ్లి శోభనము వరుసగా జరిగినది. మనవాడు అత్తవారింటనె కాలము వినోదముగ జరుపుచున్నాడు.

కాని తిరిగే కాలు, తిట్టె నోరు ఊరుకోదన్నారుకాదు పెద్దలు. మనవాడు మరల పైరవేటః కొలువు సాగించటమువలన అతని చర్య యత్తమామలకు రోతనిపించింది. భార్యకు మనోవ్యాధి ఏర్పడింది భర్తని ఎలా చక్కపెట్టుకుందునా యని రాత్రింబగళ్ళు విచారించింది, కర్తవ్యమునకు లొంగినది. భర్తను విడనాడుటలేదు. నీతిని హితముగా బోధించటము ప్రారంభించింది. పాపిష్టి ముండలకు శాపముపెట్టింది. ఎప్పుడేవో కబురులో ముద్దుముచ్చటలో సరసములో విరజిమ్ముతు పతిని కదలనీయక వెంటాడినది. కాని మనవాడు తాడుకట్టిన కుక్కలాగ వీలః దొరికితె తప్పటడుగు వేస్తూనే యున్నాడు. కుక్కతోక వంకర ఎవరు తీయగలరు? ఇక మనవాడాటలు సాగుట కష్టమనిపించుటచే స్వగృహమునకు చేరుకున్నాడు. వెంటనె ఆమె తల్లిదండ్రులను తన్ను అత్తింటికి పంపుమని బాధించటము మొదలుపెట్టింది. పతియె గతియనెడి సతులకిది ధర్మమె గదాయని తలిదండ్రులు పంపినారు.

ఆమె ప్రతిరోజు కోడి కూతతోనే మేలుకొని కాల్యములు పాచి కళ్లాబు వగైరాలు చక్కబెట్టి శృంగారలక్ష్మిలాగా ఉతికినకోకతొ కుంకపుబొట్టుతో తయారై పార్వతిని ప్రార్థించి పతిసేవలకు దిగేది.

ఎప్పుడైనా మనవాడు కోపించితె చిరునవ్వులు విరజిమ్మి ఎందుకా కోపము? కూటికా? గుడ్డకా? అంటూ దగ్గర కేగి శాంతించండి యని రొమ్ము సవరించేది. మనవాడికి కోపమువచ్చి కొట్టితే ఆమె నవ్వుతు నాకేమి? కొట్టుతె నీ పెళ్ళానికి దెబ్బలు పడతవి సీకులేని బాధ నాకా? అని కన్నీరు విడిచేది అంతియెకాక అతని కేవేళ కేప దార్థములు కావలెనో అవియెల్ల శ్రద్ధతొసిద్ధ పరచెడిది. ఇట్టి భామారత్నము పై ప్రేమలేక ఎవరుండగలరు? మనవాడు ఆమె ప్రేమకు లొంగినాడు కాని బుద్ధికుదిరినది కాదు. తొడప్రేమ తొంబది 'ఏండ్లవరకుంటుంది అన్నారు. అందువల్ల వీలైనప్పు

డెల్ల పాత ఖాతాలు తిరగేస్తు ఉండెడివాడు. కర్మము తప్పరుకద! ఎంతటి వారికైన ననుభవించవలె, కట్టుపాటు లేని మవవాడికి శక్తి నష్టము, మలబద్ధకము, తగులు కొన్నది. దున్నవంటి మనిషి గోగు పుల్లగా మారుటకు ప్రారంభమైనాడు. పనిపాట లంటె భయమేసింది ఆహారమంటె ఎగటుపుట్టింది. ఇక శృంగారమా భంగమైనది. దిగులుపడ్డాడు. తన యవస్థ యంతయు ధర్మపత్నితో చెప్పుకున్నాడు. ఆపె ధైర్యము చెప్పి భర్తని ఓదార్చి అత్తమామల కీ విషయముచెప్పి మందు భక్షకిప్పించుచు పతిసేవకు లొంగినది. నాలుగు నెలలు జరిగినవి రోగముకుదిరినదికాదు. పాపము ఆపె భర్తరోగము నయముకానందుకు సదా దుఃఖతరంగములలో మునుగుచున్నది. మగడు మంచమెక్కినాడు అవసానకాలము చేరువకు వచ్చెనా అన్నట్లు ఆమెకు పొడగట్టినది. మామను బలవంతముచేసి పెద్దడాక్టరులను పిలిపించింది. వారు క్షయ లోనికి దింపినది. ఇచ్చట కుదరదు మదనపల్లికి కొనిపొండని చెప్పినారు.

ఆమెకు గుండెల్లో పిడుగుపడ్డట్టయింది గౌరీశంకరులను తలచుకొన్నది. పతిభిక్ష పెట్టమని మ్రొక్కినది కాని మనము శాంతింపలేదు. భర్తవద్ద కాళ్లువత్తుచు కన్నీరు కార్చినది. ఇంతలో మామ వచ్చి రేపు మదనపల్లి తీసుకొని వెళ్ళుతాము దుఃఖంపకు నయమగును లెమ్మన్నాడు. ఆమె వారివెంట ఎవరు వెళ్ళువారు? అన నేను మా అమ్మాయి వెళతాము అనినంతనె నేను రావద్దా? అని అతురతతో అడిగింది. ఆయన వద్దు నీ విప్పు డారోమాసము గర్భిణివి ఎలావస్తావమ్మా మీ నాన్నగారు ఎన్ని సారులు వచ్చినా నీవు వెళ్ళనంటివి ఇకనైన ధైర్యముతోనుండి మంచిరోజున పుట్టింటి కరుగు మన ఆమె కన్నీరు విడచుచు మామగారి కెదురుచెప్పక నిలబడ్డది.

భర్త మదనపల్లి వెళ్ళిన మూడుమాసములకె ఆమెపుట్టింట మగబిడ్డనుకన్నది. కాని సంతోషములేదు. పతిశుభవార్త ఎప్పుడువిందునా యని తహతహపడుచున్నది. పురుడు వెళ్ళినది. నెలలోనె అత్తగారొక్కర్తె ఉందని అత్తింటికి వచ్చింది. తదాది అత్తగారి చెప్పు చేతలందు మెలగుచు ముద్దుబిడ్డను ముద్దుగా పెంచుచు పతికారో గ్యము కలుగగలందులకు దేవతలను కొలచుచు అతిథి యభ్యాగతులకు మృష్టాన్న ములు పెట్టుచు లోకు లందరు పొగడునటుల ఏడాది గడిపినది.

నమ్మినవారిని దైవము చెరచునా? భర్త రోగము శాంతించింది ఇంటికి జేరి నాడు. తన బిడ్డను ఎత్తుకొని ముద్దు పెట్టుకున్నాడు. భార్యను చూచి నీమాట నీ హితము వినక నా శరీరము చెడకొట్టుకున్నాను కాని నీ నోముల మహత్తున కొంత వరకు చక్కబడినది. నిజముగా నా వంశము నిలపెట్టుటకు తగిన గృహలక్ష్మివి, నా వంశ రక్షువు నీవె అని కౌచుకున్నాడంటె నమ్మలేరా?








**వివాహశాసనము, నిజాంరాష్ట్రము:** బ్రిటిషు ప్రాంతమున ప్రచారము నంది యున్న శారదాగారి వివాహశాసనమును నిజాంరాష్ట్రములోను, చట్టముగ పరిగణింప బడవలె నని కొందరు ప్రముఖులు ప్రయత్నించిరి. సనాతన ధర్మావలంబులు ధార్మిక శాసనములను ప్రభుత్వముతో సంబంధింప జేయగూడ దని విరోధించిరి. మహాసభను నిర్మించి వందలకొలది శాఖలను స్థాపించి లక్షలకొలదిగ ప్రజామతములను సంపాదించి అత్యద్భుతమైన ధర్మాభిమాన ప్రయత్నములతో సనాతనులు తమ శారదా వివాహ శాసనముపైని అనిష్టతను సమర్థముగా బ్రకటించిరి. శ్రీ నిజాంప్రభుత్వ శాసన సభలో నీ బిల్లు విచారణకు వచ్చిననాడు మిక్కిలి యెక్కువైన అధికసంఖ్యానుమతితో శారదాబిల్లు పడిపోయినది. అధికసంఖ్యాకులు విరోధులని ప్రభుత్వమువారును స్పష్టపరచిరి. నిజాం దేశమందలి హిందువు లందరును స్వ శాస్త్రానుసారముగ వివాహములను నిర్వహించుకొనవచ్చును. ఈ మహావిజయ సందర్భమున సికిందాబ్రాదు (హైదరాబాద్ స్టేటు) సనాతన ధర్మసభ వారు, ధనసాహాయ్య మొసగిన ప్రముఖులు, కార్యకర్తలు, ప్రచారకులు మున్నగు ధార్మిక ప్రజాదేవతలకు మా ధన్యవాదముల నర్పించుచున్నాము. ఈ విధములైన ప్రయత్నములు పూర్వమునందే సల్పుచో బ్రిటిషు ప్రాంతమునను ఇట్టి శాసనము పుట్టకుండునది. విజ్ఞాన పరిపూర్ణత గలిగిన సనాతనసదాచారములను గేలిసేసి రూపుమాపుట కయియే విపరీత భావము కలవారు కొందరు కలరు. భావస్వాతంత్ర్య మందరికిని సమానముగ నుండవలెను. భారతీయ విజ్ఞానమును సనాతనులు తార్కికమని భావించుచున్నారు. సనాతనుల భావస్వాతంత్ర్యమును సంస్కర్తృ సోదరులు సహింప గోరుచున్నాము. తమ జీవితముతోబాటు పరులను బ్రతుక నీయవలెను. దేశ రక్షణకు ఆవశ్యకములైన సంస్కారములను అపేక్షింపక మనలో మనకు కక్షలు బెంచు విధానమును పరుల చేతినుండి తీర్మానించుకొనదలచినాము. మన భావమునకు విజ్ఞానమూలము కలదేని ఎన్నటికైనను ప్రపంచమున ప్రచారమునంది నిత్యము కాగలదు. తొందరలు బలాత్కారములు ఎంతవరకు బనిజేయగలవు? మన ప్రాతి నిధ్యములేని సభలలో మన భాగ్య నిర్ణయమా? ఇట్టి యభిమతమునే మల్కాపురపు నిజామాంధ్ర మహాసభలో నివేదించి యుంటిమి. విభూతి ప్రథమ సంచికలో "హిందువులలో పరస్పర విరుద్ధ భావములను బుట్టించుట కిది మూలమగును"

అంటిమి. దీనికి నిదర్శనములను వ్రాయదలపలేదు. ఇది సనాతనవాదులకు మాత్రమే విజయముకాదు. సంస్కర్తల విజయమును అయియున్నది. మన కార్య పాత్రలను ఏ రంగభూమినుండి ప్రవేశ మొనర్పవలెనో ఈ వివాహ శాసనసమస్య గుణ మయములైన వివాహములు మాత్రమే నెరవేరునట్లు సనాతన సంస్కర్తృభేదములవీడి సకలాస్తికులును సన్నద్ధులై స్వకర్తవ్యముల సాధింప గోరుచున్నాము.

జనపరిగణన (సెన్ససు - మర్దుం షుమారీ.)

భారత దేశమున ప్రజలు మిక్కిలి ప్రాచీన కాలమునుండి నివసించుచు వచ్చినారు. వీరికి గొప్ప ఇతిహాసము శాస్త్రరహస్యము, మానవవిజ్ఞానము బాగుగా తెలియును. వీరు :భోగభాగ్యముల ననుభవించినారు. ముందు ననుభవింపనున్నారు. కాని నేడు భారతీయులలో హిందువులలో జీవితాభిలాషలు లేనట్లు కనుపడుచున్నవి. ప్రతివారు నాయకులే! ప్రాతమతముల విడనాడజూచినను, ఎక్కువ సంఖ్యగల క్రొత్త మత ముల మాత్రము లేవదీయుచునే యున్నారు. ఇంతకు తమకు సంచితమైన నవీన ప్రతిభతో తమపేరు నొకేరీతిగ జెప్పుకొనుటకుగూడ సిద్ధముగా లేరు. తమపేరును ఇపుడు నిర్ణయించుకొనవలసి వచ్చినది. తమకు ప్రాచీననామమూ లేదు. ప్రచారనామమూ పనికిరాదు. క్రొత్తనామమూ అపేక్షితార్థము నిచ్చుటలేదు. ఆశ రహితము కాదు. దాతలు కనుపడరు. గతియేమి? పరస్పరముగ కలహించుకొని నచో తాళము వేయు మూడవగుంపు ముందే నిలిచియున్నది. చెప్పువారి కవసరము లేదు. వినువారి కిష్టములేదు. గణనము చేయనంతమాత్రమువ ఇది మనుష్య రహిత దేశముగ జెప్పబడదుకద! ఇది హిందూబంధువుల ఆనందసందోహము? సుప్రసిద్ధమైన హిందూశబ్దము, వేదాదుల విశ్వసించి వేదప్రతిపాదిత దేవతల నుపాసించువారం దరికిని వాచకమై ప్రచారము నందియుండగా ఇట్టి యల్పవిషయమున బ్రహ్మాస్త్ర మును ప్రయోగింపనేల? ఆచార్య పరంపర వంశగురువులతో లింగధారణ దీక్షలను బొందువారందరును మొదలు హిందువుల మని చెప్పి మతమును వీరశైవ ముగా జెప్పవలెను. యుక్తి హీనముగ హిందువులకంటె భిన్నమగు లింగాయత్ మున్నగు విచిత్ర శబ్దములను ప్లేగుదగిలిన మూషకమువలె దూరముగ విసర్జింప వలెను. ఇదియే సర్వ బుద్ధిమంతుల ఆశయము.






హనుమద్భగవద్గీత:—కర్త, కవిశేఖర అబ్బరాజు హనుమంతరాయ శర్మ పాకయాజిగారు, నెం 20/188, చెట్లవీధి, గొర్నరుపేట. బెజవాడ. పు. 300, చక్కని అచ్చుకాగితములు, బైండు. క్రౌను సైజు, కృతిభర్తలైన శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు, దీని నుచితముగా ముద్రించి యిచ్చినారు. వెల తెలియదు.

భగవద్గీతకు నిది యాంధ్రపద్యానువాదము కావున కవిగారి పేరుతోజేర్చి హనుమద్భగవద్గీతగా ముద్రింపబడినది. గీతకు పెక్కు యనువాదము లున్నను, ఇది ప్రచారమునకు రాదగిన ముఖ్య గ్రంథములలో ముఖ్యమైన దనవచ్చును. వివిధ గ్రంథములను రచించిన శ్రీ పాకయాజిగారి ధారాశుద్ధి ప్రసాదగుణ విశిష్టమైన శైలి, ఇందు సుపరిణామమును బొంది యింపు నింపుచున్నది. సంస్కృత శ్లోకములను గూడ జేర్చియున్నారు. కేవలము యాంధ్రపద్యములనే పఠించి పరీక్షించిన వారికి కవితలోని జిగిబిగువులు భావములు హృదయంగమము గాక మానవు. భావప్రధానముగ ననువాదింపబడినది. ఆంధ్రు లెవరైనను జదివి యక్కరను నొక్కించుకొనవచ్చును. ఇట్టి చక్కని కృతిరత్నమును ఆంధ్రభారతి కర్పించిన కర్తలును, భర్తలును తెనుగు దేశమునకు వెలుగులు. మచ్చున కొక పద్యము.

గీ॥ బ్రహ్మచర్యంబుతో భీతి బడయకుండ, మదిని గుదియించి నా యందు మనసు నిలిపి
యాత్మశాంతము బొందెడు నట్లుజేసి, యుక్తుడును మత్పరుండయి యుండవలయు. ౬–౧౪॥

మాఘ మాహాత్మ్యము:—కర్త: అబ్బరాజు శేషాచలం శర్మగారు పు. 250 డె. సైజు. సన్న అచ్చు. ముద్రణము కాగితములు మంచివి. వెల (సాదా) 2-0-0. పైవారియొద్దనే ఈ గ్రంథమును దొరకును.

పై హనుమద్భగద్గీతా కర్తలకు ఈ గ్రంథకర్తలు జనకులు. ఏతద్రచనమున బుత్రులును దోడు పడినారట! కాదంబరివలె దీనికిని ద్విజనకత్వ మన్నమాట. ఇది సంస్కృత పద్మ పురాణమందలి పేరెన్నికగన్న మాఘమాసకృత్య సంహితకు దెలుగు. కవిత్వము మృదు మధురముగ నున్నది. స్వతంత్ర ప్రబంధముబోలె నారాశ్వాసములలో నలరారుచున్నది. కవీశ్వరుడు గొప్పవాడే! పూర్వభాగమున వైష్ణవానుకూలముగను, ఉత్తరభాగమున శైవానుకూలముగను విషయ వైశద్యము కలదు కావున నుభయులును సేకరింప దగియున్నదీ గ్రంథము.

పం. జవాహర్లాలు నెహ్రూ:—కర్త, కె. రంగదాసుగారు.

మొగలాయి కథలు:—కర్త, సురవరము ప్రతాపరెడ్డిగారు. అణా గ్రంథమాల, 3౬౧, తూరుపు బజారు, హైదరాబాద్, దక్కను వారు, ప్రకటించినారు.

మొదటి పాత్రమున నెహ్రూగారి చరిత్ర సంక్షిప్తముగ తెలుపబడినది. "గాంధిగారి తర్వాత గాంధివంటివారు నెహ్రూ" అని లోకుల వాడుక. వారి విద్వత్తు, త్యాగ విక్రమములు, గ్రంథ రచ

నాశక్తి, ఐశ్వర్యములు లోక ప్రసిద్ధములు. వారే వ్రాసిన స్వచరిత్ర పెద్దగ నింగ్లీషులో కలదు. తెలుగువారీ పొత్తమైనను చదివి కుతూహలమును దీర్చుకొన వలెను. రెండవ పుస్తకమున శ్రీ రెడ్డి గారిచే నపు డపుడు వినోదార్థము రచింపబడిన "గ్యారాకద్దూ బారా కోత్వాల్" "బేఖాఫ్ మదారసాబు" "బంగారుగాడిద" "గోమాజీ గణేశ" "బీబీజాన్" 'కిచిడీజాగీర్' అను చక్కని కథలు కలవు. ఇవి రాజకీయ ధర్మమునుకూడ బోధింపగలవు. ఇట్టి కథలు నిజాం దేశపు ముసలి ములాజమతుల కంఠగతమై చాలగాకలవు. సంగ్రహించుట ఆవశ్యకమని భావింతుము, 'గోమాజీ గణేశ్' మాదిరిగానే 'వెంకటచలం పీతల్ ఖలం' కథనుగూడా చెప్పెదురు. పైగా ఉత్తరదేశమున గోమాజీ గణేశును గూర్చి పెద్దకథయొకటి కలదు. ఇవి నాటకములమధ్య ప్రహసనములకును పనికి వచ్చును.

వసంతము, రసాంజలి, శుభమస్తు:—కర్తలు, వివిధ కవిమిత్రులు, కృతిభర్తలైన "ఆద్దేపల్లి నాగగోపాలరావుగారు, తోటవారిహౌస్ గవర్నరుపేట బెజవాడ"లో రసికులకు కోరినమాత్రమున దొరకగలవు.

ఇవి యంద చందములుగల చక్కని లఘుకృతులు. వారి పరిణయముహూర్తమున శిష్యులు మిత్రులు సమర్పించిన కానుకలు. పెండిలి వేడుకలో అత్తరు, పన్నీరు, కిళ్లీలతో బాటు ఈ ఖండకావ్య, ఇక్షుఖండముల నందిన బందుగులు విందును పొందియుందురు, 'వసంతము' నావిష్కరించిన పెమ్మరాజు లక్ష్మీపతిగారిని ముఖ్యముగ పొగడనగును. పద్యములు గేయములు నవ్యభావసుధా భరితములు.

బాలికోన్నత పాఠశాలానివేదిక:—ప్రకాశకులు కార్యదర్శులు, బా. ఉ. పా. నారాయణగూడెం, హైదరాబాదు డెమ్మీసైజు 22 పేజీలు.

నిజాంరాష్ట్రమున ఆంధ్రుల పరిపాలనతో పేరు గడించిన బాలికోన్నత పాఠశాలయొక్క ౧౨ వ సంవత్సర నివేదిక యందినది, సాంగముగ మేమవలోకించి సంతసించితిమి, బాలికల సంఖ్య ౪౧౦, యనగా సామాన్యముగాదు, కళాశాలగా మారుటకు సమయ మాసన్నమైనట్లున్నది. బాలశిక్షమొదలు ఆరవఫారమువరకు విద్యాభ్యాసము చేయింపబడుచున్నది. కర్వేగారి పూనా మహిళావిద్యాలయ బోధనాక్రమమే యిందును గలదు. ఆంగ్లాంధ్రభాషలే కాక సంస్కృతభాషగూడ నేర్పబడుచున్నది. కుట్టుపని, శరీర పరిశ్రమాదులును కలవు. సర్వ జాతీయ బాలికలకును ఉచితముగ ప్రవేశము కలదు. విద్యాభిమానులగు ఉదార మహాశయుల దానముల మీద నాధారపడియే యిది సాగుచున్నది. ఇంతటి సార్వజనికమైన పాఠశాలకు వ్యయములోని నాల్గవ వంతైనను నిజాం ప్రభుత్వమునుండి లభించుట లేదు. చాలచోటులలో బ్రిటీషున నిట్టి యాచారము కలదు. మిక్కిలి పట్టుదలతో నీ మహోద్యమమును సాగించుచున్న శ్రీ. బి. రామకిషన్‌రావు గారును, శ్రీ మా. హనుమంతరావు గారును ప్రోత్రపాత్రులు; వంటపని; కొంత సంగీతము, అభ్యాస ప్రణాళికలో నుండవలెను, ఒక భగవద్గీత పరీక్ష చాలదు. హిందూ ధర్మాచార శీల ప్రబోధకరములైన ఉపన్యాసములో లఘు పుస్తకములో ప్రచారము కావలెను. కృత్రిమమైన మనస్సంచలనము విజ్ఞానమయము కావలెను. ఇట్టి జ్ఞానదాన సత్రములకు లోక సాహాయ్య మింకను మిక్కిలి యవసరము.



# సంవత్సరాది సంచిక

మార్చి నెలలో విభూతికి తృతీయ సంవత్సర మారంభమగును. అపుడు ఉద్బోధకరములైన అనేక గద్య పద్యవ్యాసములతోడను నయనాభిరామములైన చిత్రములతోడను చక్కని సంవత్సరాది సంచికను ప్రకటింపదలంచుచున్నాము. కావున దాతలు ఈ సత్పాత్రమును విచారించి యెప్పటియట్లు తోడ్పడ గోరుచున్నాము. చందాదారులు తమ తమ చందాద్రవ్యమును త్వరగా పంపించి యుపకరింపవలెను. వ్యాసకర్తలు తమ యమూల్యమగు జ్ఞానసంపదను కాగితమున కొకవైపున స్ఫుటముగ స్థలము వదలి వ్రాసి పంపి సహాయమొనర్చవలెనని ప్రార్థించుచున్నాము. ఫిబ్రవరిలో 12 వ సంచిక వెలువడిన తరువాత సంవత్సరాది సంచికా ప్రయత్నము చేయబడును. ఏప్రియల్ నెలలోగాని సంచిక పూర్తిగ వెలువడజాలదు. అంతవరకును, పత్రిక కొరకు జాబులు వ్రాయవలదని మనవి—

సం॥ విభూతి.



స చి త్రి మా స ప త్రి క

పుంద్రిము ౨ | శా. శ. ౧౮౬౨ విక్రమ సంవత్సర మాఘము | రేఖ ౧౨

Vol 2 | 22 ఫిబ్రివరి 1941, సికింద్రాబాద్ | No. 12

# గి రి జా ప రి ణ య ము

శ్రీ విద్యాప్రవీణ బి. వి. వరప్రసాదరాయ శర్మగారు

(౩ వ సర్గము. గతసంచిక తరువాయి)

పదమును గదలింప ప్రభవించు బంగరు, చిరుగజ్జియల మ్రోత చెవుడు పరుప
మేఘతుల్యమ్మైన మృత్తికాతటభూమి, తనవిషాణక్షతి దద్దరిల్ల
హరుని దృష్టివిశేషగరిమంబు లంతంత, ధర్మసూత్రపు ఠీవి పరిఢవిల్ల
కాలాంబుదంబుల గాంచి రోషంబునం, బరచు రంకెల దిశల్ మారువలుక
తోక ఝాడించి పర్వులతోడ నీశు, వాహనము నేరె శత్రులబ్ధమ్మ హైమ
శైలరక్షిత మఖిలశోభాలయమ్ము, నోషధిప్రస్థనగర వైద్యుతపథమ్ము. ౮౪

అప్పుడు పత్తనాంతికమునందు జరించెడి పౌరులెల్ల దా
రుప్పలు తెప్పలై గుములుగూడుచు నొక్కట నీలకంఠునిన్
దెప్పిరి చూచు వేడ్క నరుదెంచిరి, త్రైపురదాహవేళ తా
గప్పిన బాణమార్గమున కాలగళుండు భువమ్ముపై డిగెన్. ౮౫

బందుగు లాప్తమిత్రపరిపంథులు ప్రాంతమునందు నిల్వ న
ర్ధేందుశిరోవిభూషు, సవధీరితమారమనోజ్ఞవేషు, నం

బంధవిశేషగౌరవము వాద్యమె తెల్పగ మోదమూర్తియై
ముం దరుదెంచె కంటకితఫుల్లకుటమ్ముల నోషధీశుడున్. ౮౬

దైవపర్వతవర్గము ద్వారభూమి, జేర ఘూర్ణిల్లె పెల్లు గంభీరఘోష
మునను, కట్టలు తెగిపోవ మ్రోతలెత్తు, చేగు సలిలప్రవాహమ్ములాగు మిగుల. ౮౭

త్రిజగత్పూజ్యుడు లోకనేతయు ఘనార్తిచ్ఛేత్త శైలేశ్వరున్
ఋజుమార్గమ్మున వందన మ్మొనగ నద్రిస్వామి డెందాన న
క్కజమును బొంది కరమ్ము లజ్జపడి యోగ్యమ్మైన మూర్ధమ్ము న
ల్లి, జడాత్మం డయి వంచె నెంతయు మన మ్మేపార విభ్రాంతిలో. ౮౮

ఎడద ముదంబు నాల్గొనగ నించుక యేనియు శంకనంద కా
తడు తన యల్లుముందటను దర్పముమీరగ నేగు చప్పు డం
గడులను జానుదఘ్నముగ గ్రాలగ పూవులు రాజవీథి వెం
బడి మణిరత్నగేహము కమందగతిన్ చనుదెంచె నంతటన్. ౮౯

ఆ సమయమ్మునందు గజయానలమంద ముదంబు నందుచున్
భాసముపేతు ముగ్ధనవమంగళమూర్తిని గాంచు వేడుకం
జేసి మనమ్ములం దితరచింతలు మానుచు వీడి కర్జముల్
భాసిలు హర్మ్య పంక్తులను ప్రాలుచు నిల్చి రొకళ్ళొకళ్ళపై ౯౦

లలితమృగాక్షి యోర్తుక చలంబున నీశ్వరు గాంచగోరి సం
కలిత మనోజ్ఞ వేణి చెలగన్ కిటికీకడ కేగుదేరె తా
జలిత సుమంపు గుచ్ఛమును చాలితమౌ చికురంబు గాంచ కే
లలితగతుల్ చెలంగగ విలాసవతుల్ దను గేలిసేయగన్. ౯౧

చెలియ ఒకర్తు పాదముల చెల్వగు లత్తుక బూయుచుండ నా
జలరుహనేత్రి మానసవిసర్పితవేగమునన్ గణాది సం
కలితమనోజ్ఞ తూర్యముల గాంచి గవాక్షముదాక నంఘ్రిపై
జెలగెడి లాక్షచే నరుణచిహ్నితమౌ గతినేసె మార్గమున్. ౯౨

సన్నుతాంగి ఒకర్తు కంజనము పూసి, దక్షిణంబగు నేత్రపద్మంబునందు
ఎడమకంటికి పూయక యే శలాక, చేతబట్టుచు శివు గాంచు ప్రీతి వచ్చె. ౯౩

లలితనేత్రగవాక్ష మార్గముల గంచు, ముడిని వేయకయే చీర ముడుచుకొంచు
నవ్యరత్నపుకాంతులు నాభిజారగ, హస్తకీలితవస్త్రయై అరుగుదెంచె. ౯౪

శీఘ్రగతి నేగగా సరసీరుహాక్షి ఆమె కాంచీసుదామంబు అడుగునడుగు
కాగకాగక పడిపోవ ఆమె అపుడు, బొటనవ్రేలినె ముడిచేయు చటుల వచ్చె. ౯౫

కడు ముద మొందు వారల ముఖమ్ముల నాసవవాసనావళుల్
జిడిముడి రేగి గుమ్మనగ చెల్వగు నేత్రమధువ్రతోత్తముల్
గడబిడ సేయ జాలములు గన్పడె నూత్నరుచిం జెలంగు న
ప్పుడమి సహస్రపత్రములపోలిక చూపఱ వింత నందగన్. ౯౬

పవలనుగూడ వెన్నెలల భాసిలి రాజిత తోరణాళిచే
దివమును దోప చేయుగతి దీపిలు నప్పురరాజ మార్గమం
దవిరళమై జయంతులు మహాద్యుతి మీరి చెలంగ నప్పు డా
శివుడు పరివేశముం గనెను చిత్రవినిర్మితరాజమార్గమున్. ౯౭

ఆ మనోహర దృశ్యముల్ ప్రేమ గంచు, యువతు లన్యేంద్రియపుగతు లూరకొనిరి
కాని, అన్యేంద్రియమ్ము లొక్కటిగ కూడి, చాక్షుషమ్మాచు నత్యంత సౌఖ్యమందె. ౯౮

ఇగురుబోడి అపర్ణ యీ సుకుమారుకై కఠిన తపోవహ్ని గ్రాగె నెంతో
ఈ లోకమోహను నే వేళ పాదసేవల తృప్తి సేయంగ భాగ్యమెంతో
ఈతని మరుకేళి నేలగా జాలిన వనజాతనేత్రిగర్వ మ్మదెంతో
ఈ యంకపీఠమ్ము నెక్కగా భాగ్యంబు పూనిన జలజాస్య పుణ్య మెంతో
ఈ మనోహర యుగ్మంబు ప్రేమమీర కూర్పడేని విధాత సంకుచిత బుద్ధి
అన్యయుగ్మంపు విషయ మట్లగునుగాక వీరి సౌందర్య యత్నమ్ము వృథయె కాదె. ౯౯

ఈ నవమన్మథుండు కుసుమేషుని దగ్ధము సేసె నంచు న
న్యూన జనప్రవాద మిటు లూరక సాగెను గాని మన్మథుం
డీ నిటలేక్షణుం గని జయించెను నన్నసమాన కాంతి నం
చూనిన లజ్జచేత విడనోపును తా తనయంత ప్రాణముల్. ౧౦౦

ఇతని అనూనబాంధవము నేర్పి మహీధర చక్రవర్తి ధి
క్కృత విభవాభిరామత, దిగీశుల నెల్ల హసించి, భూనము
ద్ధృత నిజశీర్ష మెత్తియు, మరింతలుగా నిజగౌరవమ్ము నె
న్ని, తనకు తుల్యు డెం దనుచు నిండును మోదసుధాపయోధిలో. ౧౦౧

కుటిల కుంతల లెల్ల తన్గురిచి యిట్లు శ్రోత్రపర్వంబుగా బల్క శూలి యపుడు
అంగిదార్చిత లాజముష్టిం గలంగు హైమగిరి యాలయంబున కరుగు దెంచె. ౧౦౨

అంతట విష్ణుమూర్తి కనదంచిత హస్తము నందసేయ దా
నంత శరద్ఘనాంతరితుడై తరణింబలె నుతుపీఠినుం
డెంతయు సొంపు మీర దిగి యీశుడు వాసిత సారసాళిచే
వింత రహించు కక్ష్యముల వీడుచు లోపలి కేగు చుండగన్ ౧౦౩

అతని అనుపద మిందాద్రిదు లమరవరులు, సప్తఋషులును పరమర్షి సమితి, ప్రమథ
గణములుం గూడ లోపలి కరుగుదెంచి, రుత్తమార్థము లారంభ మొందురీతి. ౧౦౪

అచ్చట చంద్రశేఖరు డనర్ఘ్యవిభూషల మీరు విష్టరం
బిచ్చ చెలంగ గైకొని అహీనపు మేల్ రతనంపు టర్ఘ్యముల్
మెచ్చి పరిగ్రహించె మధుమిశ్రితగవ్యము నవ్య వస్త్రముల్
హెచ్చిన ప్రేమతో తన కధీశ్వరు డగ్గిరి అంది యీయగన్. ౧౦౫

భక్తితళుకొత్త భటులంత వధువు దరికి, చేర్చి నా శివు కూర్చుండ చేసి రెలమి
నప్పు డుదయించు చంద్రిసౌఖ్యపుమరీచి, బారముం జేరు నయ్యకూపారరీతి. ౧౦౬

ఆ సరసీరుహాక్షి మొగమందలి కాంతులు చెల్వు గూర్ప నా
శాసము పేతుడై తనదు చక్షులు మించులలీల గ్రాలగా
నా శివు, డంత సౌఖ్య మిడునట్టి శరత్తునయందు లోకముల్
తోషిత చిత్తులైన గతి దూర్ణగతిం గనె నవ్యభావముల్ ౧౦౭

ఒండొరుం గాంచ వేగిరమ్మొందు వారి లోచనమ్ములు చకిత భావాచితములు
పూర్వపశ్చాత్స్వభావంపు పోడిమగని, సిగ్గునా బంధనమ్ములో జిక్కిపోయె. ౧౦౮

శివుచే భగ్నత నంది పార్వతి మెయిం జృంభించి, అ మ్మారరసం
భవదంకూరమువోలె వెల్గుచును తామ్రస్ఫూర్తి చుంబించు న
య్యువతీరత్న కరాంగుళుల్ హిమగురుం డుత్సాహియై అందసే
య, వరుండున్ గ్రహియించె మన్మథవిలాసాంభోనిధిం దేలుచున్. ౧౦౯

అత్తరి గాత్రి ఘెల్ల పులకాంకిత మయ్యెను గౌరి, కల్లె న
న్మత్తవృషాధిచారునకు మై గనుపట్టెను ఘర్మబిందువుల్
చిత్తజు జీవముల్ మెయిని జేర నతండు తలంచి యుగ్మముల్
హత్తెను నైజభావము లుదాత్తత నిద్దరకు న్సమమ్ముగా. ౧౧౦

అజ్ఞలౌకిక దంపతు లాదిదంపతుల సమీపము నం దెంతో కళ వహింత్రు
అట్టిచో నాదిదంపతు లక్లెయుండ, వారి శోభల పొగడ నేవారితరము. ౧౧౧

అచ్చపు వెల్గులన్ జెలగు నగ్నికి నూతనయుగ్మ మాత్మలో
నచ్చగతిం బ్రదక్షిణచయమ్ముల మూ డొనరించి భక్తితో
హెచ్చె సువర్ణపర్వత సమీపమునందున రేయియుం బవల్
నిచ్చలు కాంతిపుంజముల నింపుచు గూడినరీతి నెంతయున్. ౧౧౨

ఒండొరు గాంచు చిద్దరు మహోత్సవరాగ తరంగడోలికా
కాండములందు నూగుచును గ్రాలగ వారి బురోహితుండు, న
మ్మండిత తేజు డగ్నికి నమస్కృతితోడి ప్రదక్షిణక్రియ
మ్మెండుగ జేయజేసె ఉమయుం జరిగించెను లాజ మోక్షమున్. ౧౧౩

వామాంగి ఆలాజధూమంబు గురుపురోహితు నాజ్ఞ నాత్మలో నెంచి తనదు
వదనంబు దెరచె నవ్వాసితగంధంబు, తనకిష్టమై ముదోద్ధతవహించె
ఆ ధూమ మొక్కింత నవకాశ మయ్యాలి, వేణి చెక్కిళులను వింతశోభ
లొలుక నుత్పలమట్లు చెలగె నచ్చటనున్న, చూపరకానంద మేపుమీర
ఆ విధూమంబుచే గండ మరుణిత మయి, నయనకాలాంజనము రక్తమయమునగుచు
వీనులందలి యవలేశ మూన నసిత,వర్ణముల మించి యా గౌరి వదన మమరె. ౧౧౪

ఆ ద్విజుండును వధువు నిట్లనుచు బల్కె, అమ్మ! ఈ వహ్నియే వివాహమున సాక్షి
భర్తయయ్యెను శంభుండు ప్రథితధర్మ, చరణ సలుపంగవలె నింక పరమభక్తి. ౧౧౫

ద్విజుడు వల్కిన వాక్యముల్ వీనుదోయి కింపు జనియింప పార్వతి సొంపుగాంచె
గ్రీష్మమున తప్తయై నెత్తె రేగ భూమి, ప్రథమబిందుల ప్రీతితో ద్రావుకరణి. ౧౧౬

అవిరళ రాగదర్శనమహాముదితాత్ముడు ముగ్ధగాత్రి డీ
ధ్రువు డగు భర్తతో కను తలోదరి! ఆ ధ్రువతారకం బటం
చు, విదితవేది వ్రేల్మడచి చూపగ నక్కలకంఠి 'చా ని దే
యవుపడె' నంచు సిగ్గు వెలయంగను సన్నయెలుంగుతో ననెన్. ౧౧౭

ఈగతి నవ్విధిజ్ఞుడు సమిద్ధ వివాహమహోత్సవమ్ము నం
దే గతిచే గొఱంత కన కిమ్మొనరింపగ నవ్యయుగ్మ మ
య్యాగమ సంఘువేద్యుడు సమస్తచరాచర జీవభర్తయున్
ప్రాగుదితుండునై తగు పరమ్మగు బ్రహ్మను సంస్తుతింపగన్. ౧౧౮

ఆ పితామహు డంత నయ్యగజ బల్కె, 'వీరజననయిత్రివై భవ్య! వెలయు' మంచు
అతడు వాక్పతియయ్యు నయ్యాదిదేవు కనుచు చింతాలసునిగతి కంచు నిలచె. ౧౧౯

రంగగు ముగ్గులుఁ బవాళరత్నపు కాంతులతో జెలంగు నా
బంగరు వేదిపైన ప్రతిభాసితమూర్తులు నవ్వధూవరుల్
మంగళవాద్యముల్ చెలగ లౌకికరీతిగ మోదవార్ధిలో
గ్రుంగు చొకళ్ళొకళ్ళపయి బోసిరి పచ్చని సేసబ్రాలుఁ. ౧౨౦

పత్రిలీనజలంబుల పద్మ యపుడు, లలితమౌక్తిక కాంతుల నొలుకబోసి
నైజనాళంబు యష్టిగా నాణ్యరీతిఁ గూర్చె ముత్యాలకెంపుల గొడుగనంగ. ౧౨౧

ఆ యుగమ్మును వాగ్దేవి అపుడుపొగడె, విపులభావార్థయుక్తముల్ విశ్వకర్ణ
పేయముల్ రసపూర్ణముల్ వీర్యవంత, సంస్కృత ప్రాకృత ద్విధా శబ్దగతుల. ౧౨౨

వార లొకింతసేపు రుచివర్తిల చూచిరి సాత్వికమ్ము లౌ
మారవిలాసభావమహిమమ్ముల సొంపుల నెల్ల, అప్సరః
స్త్రీరమణీయ నృత్యము లశేషమనోహరసన్నివేశముల్
సారరసప్రసారగతి చాలితకిన్నర కంఠగానముల్. ౧౨౩

దేవత లందరుఁ హరుని దివ్యపదంబుల దండవత్ప్రణా
మావళిగూర్చి అంజలుల మౌళిపయిఁ ఘటియింప చేసి, తా
రీ విధి వేడఁజొచ్చిరి, మహేశ ! కృపాపరిపూర్ణచిత్త ! హే
దేవ! సుమాస్త్రి సేవ కిక దేవి కనుగ్రహ మీయగా దగుఁ. ౧౨౪

కోప మొకింతయేని కనకుండ శివుండును మాన్మథమ్ము లౌ
చాపము సాయకమ్ముల ప్రసారణ మాత్మ ననుగ్రహించె, నౌ
నే పనినేని కాలమున నెవ్వరు దీర్తురొ, అట్టివారి వి
జ్ఞాపనయే ప్రభూత్తముల చక్కని సిద్ధిని గాంచజాలెడిఁ. ౧౨౫

అంతట నిందుమౌళి అసురారుల నందర వీడుకొల్పి, తా
స్వాంతమునందు సిగ్గిలెడి నయ్యువతీకరముం గ్రహించి, అ
త్యంత సువర్ణభూషణము లచ్చుగ విచ్చినపూల తావులుఁ
స్వాంతము హాయిగూర్ప శయనావసరమ్మున చేరె పాన్పునఁ. ౧౨౬

నూత్నపరిణయ లజ్జా వినోదగతుల, ప్రాణసఖుల కెటో నుత్తరమ్మొసంగు
గౌరి హ్రీవాప, గణచమత్కారవచన, రచన నామెను నవ్వించె రసిక హరుడు. ౧౨౭

ఈగతి పెండ్లియాడి పరమేశు డుమాసతి నామెకోసమై
త్యాగ మొనర్చుకొన్న తన తాపసధర్మము లోకపోషక

శ్రీ గరువమ్మ సూప సరసీరుహసంభవు డాదియౌ మహా
భాగుల కోర్కె నింప జయభావముతో గనుపట్టె నంతటన్. ౧౨౮

గద్య:—ఇది శ్రీ వేంకటేశ్వరగురు ప్రసాదలబ్ధ గీర్వాణాంధ్ర సాహితీ వైభవ, కనక
దుర్గాంబా వేంకట గుఱ్ఱాజేశ్వరామాత్య గర్భశుక్తి ముక్తాఫల,
బొడ్డనపల్లి వంశ పయఃపారావార రాకాసుధాకర, వీరభద్ర
వరప్రసాదరాయ శర్మాంధ్రీకృతంబైన గిరిజా
పరిణయ ప్రబంధంబునందు తృతీ
యాశ్వాసము సర్వము
సమాప్తము.
ఓం తత్సత్.



# ఆత్మపూజ

## శ్రీమతి సి. కె. వీరభద్రమ్మగారు.

గీ॥ మనము శివమయంబుగఁ జేసి మలము లుడిపి, సర్వమునకు లింగ మొకట్ట, సత్యదీక్ష
యే, సుశీలపు కర్తంచు నెంచి శుచిని, ప్రబల పంచేంద్రియములు నిర్మలముగాగ
హరుని యర్చనక్రియలకు నర్పణంబు చేసి, ప్రణవ పంచాక్షరి భాసురముగ
నాత్మ జపియించి నిజశాంత మనెడి జలము చె, శివలింగమునకు నభిషేకము బచ
రించి, తన వివేకమె వస్త్ర మంచునెంచి, సత్య మాభరణముగను నిత్యమైన
తనదు వైరాగ్య భావంబు ఘనతమీఱ, పుష్పమాలికగను గూర్చి పూజ్యతగను
తన సమాధి సంపత్తి యక్షత లనగ జేసి, శ్రద్ధహంకార రహితంబు ముద్దులొలుక
ధూప మని యిడి జ్ఞానమే దీపమంచు భ్రాంతిరహితంబునై వేద్యభావ మరసి
మౌన ముద్రను ఘంటగా తాను నెంచి,విషయ భ్రాంతుల విడనాడు విధముగనుట
సత్ప్రదక్షిణ మని యెంచి, స్వాంతమందు శివుని పాదంబు నిల్పుటే చెలువు మిగుల
దా నమస్కార మనుచును దలచి భక్తి యిహమునందున గురు పూజ లీశపూజ
ప్రమథ పూజలు చేయక భవము బాసి యాత్మ పూజను గావించు యాత్మవిదుడు.

# మతత్రయగీతాభాష్యములు

శ్రీ యతిరాజం వెంకటకృష్ణ దాసుగారు

౧. శ్రీ మద్భగవద్గీతా భాష్యకర్తలలో ప్రథములును, గౌరవనీయులును అగు శ్రీ శంకరాచార్యులవారు తమ అద్వైతమతమును స్థిరపరుచుటకై గీతాభాష్యమున 15 వ అధ్యాయము 16 వ శ్లోకము ("ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ, క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే") నకు వ్రాసియున్న వ్యాఖ్య గమనించతగినది. కనుక అందలి ముఖ్యవిషయము నీ క్రింద బొందుపరిచి యుంటిని.

తాత్పర్యము. లోకమునందు క్షరుడని, అక్షరుడని యిరువురు పురుషులు కలరు. అందు క్షరుః డెల్ల శరీరములే. అక్షరుడు (కూటస్థుడు) జీవు డని తెలిపియుండిరి. ఇచట మనము తెలియదగిన విషయ మేమన?

పై 16 వ శ్లోకమునందు గల "ద్వావిమౌ పురుషౌ లోకే" అను పాదమునం దిరువురు పురుషులు కల రనికదా చెప్పబడెను. అందు తెలుపబడిన పుంలింగ ద్వయమునం దొక పురుషపదమునకు (జీవుడు) పురుషుఃడని పుంలింగార్థమును, రెండవ పురుషపదమునకు ఎల్ల శరీరములేయని ప్రకృతి స్వరూపములను నిరూపించి స్త్రీ లింగార్థమును వ్రాసిరి. పై శ్లోకమునందు పురుషవాచకము నుపయోగించుటవలన లింగార్థ భేదమునుబట్టి పుంలింగమునే స్పష్టీకరించె ననియు, స్త్రీ లింగముగాని నపుంసకలింగము గాని వర్తించుటకు వీలులే దనియు, "పురుషుడు" అను పుంలింగ పదమునకు ప్రకృతి యను స్త్రీ లింగార్థమును వ్రాయుట వ్యాకరణాది శాస్త్రవిరుద్ధ మనియు వేరొకరు తెలుపకనే తెలిసికొనుట కెట్టి సంశయమును లేదని పాఠకమహాశయులే సులభముగా గ్రహించగల రనుట నిర్వివాదాంశము. శ్రీ శంకరాచార్యులవారు పురుషుడు అను పుంలింగపదమునకు ప్రకృతి యను స్త్రీలింగార్థమును వ్రాయుటయే సరి యని యీ మతాభిమాను లన్నచో, నయ్యది వారు బఠించిన పాణినీయాది శాస్త్రముల యందెచటనైన కలదో లేక యూహాశాస్త్రమో? లేక మతప్రభావముచే బురుషుని స్త్రీరూపముగా మార్చునట్టి సమర్థతగల దందురో మతాభిమానులే తెలుపగలరు.

౨. తరువాత శంకరమతావలంబకు లగు శ్రీ మత్పరమహంస బాల సుబ్రహ్మణ్య స్వాములవారు తమచే వ్రచురించబడిన శ్రీ మద్భగవద్గీతా గూఢార్థ దీపికయం దీ 16 వ శ్లోకమునకు టీకయందు "కూటస్థః" అను పదమునకు జీవుడు మాయాశక్తి యనియు, ఈ మాయాశక్తియే (అక్షరుడనియు) నశించనివా డనియు, "సర్వాణి భూతాని" అను పదమునకు సమస్తప్రాణులు అనగా సమస్తదేహములు (అచేతనములు) నశించుననియు, తాత్పర్యమున నశించునట్టి వికారములెల్ల క్షర మనంబడును గాన ప్రాణులు క్షరము లనియు, అక్షరు డనంబడు జీవునియొక్క యుత్పత్తికి మూలమైన భగవన్మాయాశక్తి నశించని దగుటం జేసి యక్షర మనంబడుననియు, కూటస్థ మనగా రాశి కాబట్టి సమస్త ప్రాణిరాసులను కూర్చునదిగాన మాయయే కూటస్థుడని చెప్పబడుననియు, సమస్తప్రాణులు లేక బ్రహ్మాది దేహములు మొదలుగాగల సమస్తములైన చేతనములు నశించునని స్పష్టపరచిరి. పరికింపుడు.

దేహములు చేతనము లనియు, నశించుననియు, నశించు జడపదార్థ మంతయు నొకక్షరపురుషు డనియు, దాని యుత్పత్తికి మూలమైన మాయాశక్తియే అక్షర పురుషు డనియు, పురుషుని మొదట నపుంసకునిజేసి తరువాత స్త్రీనిగా మార్చి, వ్యాఖ్యారచన మొనరించి నందున మానవమాత్రులకు దెలియ దరమా! ఈ స్వాములవారు సమర్థించి వ్రాసియున్న వ్రాతలకును, మతస్థాపకు లగు శ్రీ శంకరాచార్యులవారి యభిప్రాయమునకును గల భేదభావమును విమర్శకులే గ్రహించ గలరు. శ్రీ శంకరాచార్యులవారి యభిప్రాయములే ఈ బాలసుబ్రహ్మణ్య స్వాములవారు తమ గూఢార్థదీపికయందు బొందుపరిచి రని యన్నచో "ద్వావిమౌ పురుషౌ లోకే" అను పాదము నందుగల పుంలింగద్వయము నం దొక పురుష పదమునకు మాయాశక్తియే జీవుడనియు, అక్షరుడనియు, రెండవ పురుష శబ్దమునకు సమస్తప్రాణులు అనగా నశించు దేహము లనియు దెలుపు శాస్త్ర మేదియో? క్షరపురుషు డనియు అక్షర పురుషుడనియు నిరువురు పురుషులు కలరని పురుషద్వయంబును కనుపరుపగా, పురుష అనుపదమునకు క్షర అక్షర అనుపదములు పూర్వమందున్న వు డవి విశేషణములగునని తెలుపు వ్యాకరణ శాస్త్రము నిందు గ్రహింపరాదని ఎవరివలన తెలిసికొనిరో? శంకరాచార్యుల వారు స్త్రీ రూపముగా మార్చినట్టి పురుషుని నేను పురుషునిగా నొనర్పలేనా యని సాహసించి ప్రథమమున మాయాశక్తి యగు ప్రకృతిని పురుషునిగా మార్చి ఇదియే (పురుషుడు) జీవుడని స్పష్టపరచి, పిమ్మట రూపు మారక యున్న రెండవపురుషుని స్త్రీ లింగమగు ప్రకృతి దేహములుగా మార్చి, మార్చు టలో నే మాయెనో కాని ఆ రెండవ పురుషకు సమస్త ప్రాణులు లేక బ్రహ్మాది

దేహములు మొదలుగాగల సమస్తములైన చేతనములు నశించునని వ్రాసి ధీరతను జూపిరి. ఇది యూహా శాస్త్రమో? అద్వైత మతోద్ధారకులు తెలుప గలరు.

3. అద్వైతమతాలంకారు లగు శ్రీ లోకమాన్య తిలకు మహాశయులు తమ గీతారహస్యమున, 250, 251, వ పుటలయందు ఉత్తర వేదాంతగ్రంథముల యందున్న పంచీకరణము ప్రాచీనము లగు నుపనిషత్తులందు లేదనియు, తన్మాత్రలగు పంచమహా భూతంబుల నేనింటిని ఒప్పక ఛాందోగ్యోపనిషత్తులో, తేజస్సు, జలము, అన్న (పృథ్వి) అను నీ మూడుతత్త్వములనే కొని, ఈమూటియొక్క మిశ్రమముచే (అనగా త్రివృత్కరణముచే) బిదప వివిధ సృష్టియు నిర్మితమైన దని చెప్పబడిన దనియు, 251 వ పుటలో శ్వేతకేతువునకు అతని తండ్రి ఇట్లే తెలిపెననియు, ఈ విషయము ఛాందోగ్యోపనిషత్తు నం దేడవ అధ్యాయమున కలదని తెలిపిరి.

తరువాత "అజా మేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీః ప్రజాః సృజమానాః సరూపాః" అను ఉపనిషద్వాక్యమునకు "ఎరుపు రంగుగలదియు, (అనగా తేజోరూప మైనదియు) తెల్లనైనదియు (అనగా జలరూపము గలదియు) నీలరూపము (అనగా పృథ్వీరూపము) గలదియు; మూడు రంగులు (మూడు తత్త్వములు) గలదియునైన యజ (అనగా ఆడుమేక) యుత్పన్నమైనది. అందుండియే వివిధ సృష్టి జరిగెను. అని శ్వేతాశ్వతరమున త్రివృత్కరణము చెప్పబడె ననుచు, 252వ పుటలో 6వ పంక్తిలో శ్వేతాశ్వతరము త్రివృత్కరణమునకు వ్యతిరేక మగు పంచీకరణమును బోధించు గ్రంథములలో నొకటిగా కనుపరచిరి. ఇదేటి న్యాయమో?

తరువాత మూలములగు మహాభూతము లయిదింటినినంగీకరింపక పదార్థము యొక్క యుత్పత్తి వ్యవస్థను జేయు ఛాందోగ్యోపనిషత్తునందును నీ మార్గమే కల దనియే వేదాంతసూత్రములలో చెప్పబడిన దనియు, కావుననే పంచీకరణమును బాద రాయణాచార్యు లుపయోగింపరనియు తెలిపిరి. పిమ్మట తైత్తిరీయమునందును, శ్వేతాశ్వతరమునందును, వేదాంత సూత్రములయందును, గర్భోపనిషత్తు నందును, తుదకు గీతలయందును, మూడింటికి మారుగ పంచమహాభూతములు చెప్పబడిన వనియు వ్రాసిరి. మరియు, త్రివృత్కరణము మిగుల ప్రాచీన మనియు, అయినను మూడింటికి బదులుగ నేనింటి నంగీకరించినపిదప త్రివృత్కరణముయొక్క పద్ధతి ననుసరించియే పంచీకరణము వెలువడినదనియు, ఇట్లు కావున త్రివృత్కరణము వెనుక బడిన దని స్పష్టముగా కాన్పించుచున్నదని వ్రాసిరి. పరికింపుడు. పంచీకరణమును శ్రీ వేదవ్యాసు (బాదరాయణాచార్యు) లుపయోగింపరని ఒకమారును, శ్రీ కృష్ణ వచోఽమృతమును, శ్రీ వేదవ్యాస (బాదరాయణాచార్య) విరచితమును నగు శ్రీ

మద్భగవద్గీతయందు పంచీకరణము నుపయోగించి రని ఒకమారును వ్రాయు వ్రాత లలో నొకటికొకటి కేమైన సంబంధము కలదా?చదువరులే గ్రహించగలరు. మఱియు,

ఈ మహాశయులు వ్రాసిన త్రివృత్కరణము ప్రాచీన మగునేని అట్లే భూమి యందు ప్రథమమున మూడురంగులు గల ఆడుమేక యెచ్చట జనించెనో, ఆ మేక యందుండి మానవాదు లెట్లు యేతావునం జనించిరో, అట్లు మేకయందుండి ఇక్కా లమున గూడ వివిధ సృష్టి యేల జరుగకుండెనో, లేక నా ఆడుమేకయే పరబ్రహ్మ స్వరూప మని వీరి యుద్దేశమో, మఱియు, "అజామేకాం లోహిత శుక్లకృష్ణాం" అను ఉపనిషద్వాక్యమునకు, తేజస్సు, జలము, పృథ్వి అను నీ మూడింటిచే ప్రథమమున సృష్టి జరిగె నని వ్రాసిరిగదా! మహాభూతము లేనింటిలో ఆకాశము వాయువు అను నీ రెండును లేక నే తేజస్సు,జలము,పృథ్విఅను నీ మూడును ప్రథమమున కలిగియుండె ననుటకును, ఈ త్రివృత్కరణమునకు తరువాత పంచీకరణము వెలువడిన దనుటచే తేజస్సు, జలము,పృథ్వి అను నీ మూడింటి తరువాతనే వాయురాకాశములు రెండును కలిగియుండె నని తెలుపుటకును, ప్రథమమున మేక యందుండి వివిధసృష్టి జరిగె నను టకును, దృష్టాంతరము వీరిగీతారహస్యమేనా,మరి యే శాస్త్రములైననుకలవాయను విషయ మేదియు స్పష్టపరుపక యథోచితముగా జారవిడచినారు. మఱియు, నీ మహా శయులు మెరుపురంగుగలది(అనగా తేజోరూపమనియు) తెల్లనైనది(అనగా జలరూప మనియు) నీలరూపము (అనగా పృథ్వీరూప మనియు) వ్రాసిరిగదా, యోచింపుడు. క్షీరము తెల్లనై యుండునుగాని నీరము తెల్లనై యుండునా? ఆకసమునందలి వర్ణము నీలముగ నుండును గాని,పృథ్వి నీలముగ నుండునా? సూర్యచంద్రాదులయం దుండునది తేజస్సనంబడును గదా! ఆ తేజస్సు మెఱగనుండునా లేక వీరికట్లుకనబడెనా? మరియుఆడుమేక యందుండి జరిగెనని వీరువ్రాసియున్న సృష్టిక్రమము సైన్సు శాస్త్ర మునుగాని, ప్రత్యక్షానుభవమునుగాని, శారీరశాస్త్రమునుగాని, విజ్ఞాన శాస్త్ర మునుగాని అనుసరించి యున్నదని యిక్కాలమున కూడ నవనాగరిక ప్రపంచమే కాక విద్వాంసులుగూడ నంగీకరింతురా? చదువరులును ఇందలి భావ మూహింప తగియున్నది.

౮. తరువాత శ్రీమద్రామానుజాచార్యులవారు తమ విశిష్టాద్వైతమును స్థాపించుచు, భగవద్గీత 7 వ అధ్యాయమున "అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరాం, జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్" అను 5 వ శ్లోకమున గల "ప్రకృతిం" అను స్త్రీలింగపదమునకు చేతనప్రకృతి అనగా నీ ప్రకృ తియే (పురుషుడు) జీవుడని వ్యాఖ్యవ్రాసిరి. వీరిట్లు వ్రాయుటం జూడ, శంకరా చార్యులవారు "ద్వావిమౌ పురుషౌ లోకే" అను శ్లోకమున చెప్పఁబడిన పురుష

ద్వయంబులో నొకటి లక్షణశాస్త్రమును బహిష్కరించి స్త్రీనిగా మార్చగా, నా కట్టి సమర్థతలేదా యని తమ మతానుసారముగా "అపరేయ మితస్త్వన్యాం" అను శ్లోకమునందలి "ప్రకృతిం" అను స్త్రీలింగ పదమునకు జీవుడను పుంలింగార్థమును వ్రాసి స్త్రీని పురుషునిగా మార్చిరి. ఈ యర్థము నీ మతాభిమానులు సమర్థించుకొన దలచినచో, ప్రకృతి యను స్త్రీలింగపదమునకు జీవుడు, పురుషుడు అను పుంలింగార్థము నుపయోగింపవచ్చు నని నిర్ధారణచేయ గల శాస్త్రమేదైన నున్నచో స్పష్టీకరింప గలరా యని విశిష్టాద్వైతమతావలంబకు లగు పండితప్రకాండుల నెల్లరను గోరు చుంటిని.

౫. తరువాత శ్రీ మధ్వాచార్యులవారు తమ ద్వైతమతమును స్థాపింపుచు, నిరవయవమును రూపనామక్రియా విరహితమును నగు వానిని బ్రహ్మమనుట అసత్య మని నిశ్చయించి, వైకుంఠవాసుడైన విష్ణువే పరబ్రహ్మము కావున, పైన గనపర చిన "అపరేయ మితస్త్వన్యాం" అను ౫ వ శ్లోకమున గల "ప్రకృతిం" అను స్త్రీ లింగపదమునకు లక్ష్మియే (జీవభూత) అపరప్రకృతి యని వ్యాఖ్యానరచన మొనర్చి యున్నారు. కావున ఏకదేశస్థమైన లక్ష్మియే జీవభూత యగుట యందలి న్యాయ మెట్టిదో? వీరి అనుచరులే తెలుపగలరు. చదువరులును వీరి మతభావ మూహింపం దగియున్నది. సత్యాన్వేషకు లెల్లరు నే నిందు వెల్లడించిన విషయమును గమనించి న్యాయమును బ్రకటింపగలరనియు, న్యాయమును బ్రకటింపగల పత్రికాధిపతులెల్లరు తమతమ పత్రికలయందు విమర్శనలను వెల్లడింపుచు సత్యమును నెలకొల్పగల రనియు నమ్ముచున్నాను.*

---

* ఈ విషయము విచారింప దగినదియే. వ్యక్తిగతములైన ఆక్షేపములను వదలి సరళముగ సప్రమాణముగ వ్రాయబడు వ్యాసములను బ్రకటింతుము. —సం.



# ఆదిశైవవాదము

గత సంచిక యందలి "శ్రీకంఠుడు, ఆదిశైవులు తమ్ములులు" అను వ్యాసమును సావధానముగ అవలోకించక మున్నే ఆదిశైవ పత్రిక పుష్యమాస సంచికలో మరియును రెండు వ్రాతలు బైలుపడినవి. 'గురుపాదనిరసనము' అను బూతుల పంచాగము సంపాదకులు మిక్కిలి మక్కువతో మొదట బ్రచురించుకొని తమ సదభిరుచిని వెల్లడించినారు. సంతసము. అందు ప్రత్యుత్తరీయాంశము లేవియులేవు. గురుపాదమును .నిరసించు వారికి హరశాసనముకూడ లేదని బుధుల వలనగాని తెలియదు.

ఇక రెండవ వ్యాసము శ్రీబోధానందులది. ఇది యెప్పటి యట్లు విమర్శనా జ్ఞానముతో సంబంధము లేక, అత్యద్భుతములైన అసత్యములతో నిండి యుక్తి విరహితముగ నున్నది. వీరు కొన్ని సంస్కృత శ్లోకములను రచించి అవి సుప్రభేద, కారణ, విమల, కామిక, శర్వాగమములలో కల వని వ్రాసినారు. ఇట్టి వక్రమైన మార్గమును వదలి సక్రమమైన పద్ధతిని అంతరాత్మసాక్షిగ స్వీకరించుట వారికి శ్రేయస్కరము. ఆ యాగమములు ఆ సంహితలు ఎక్కడ ముద్రితము లయ్యెనో వారి శ్లోకము లే స్థలమున గలవో పరిచ్ఛేద నిర్దేశముగ నిరూపింపుచో వా రడగినంత బహుమాన మీయవచ్చును. చిరకాలమునుండియు ఇట్టి స్వకల్పిత శ్లోకములను ఆగమ శ్లోకములుగ తమ అనుయాయులకు జెప్పుకొనుచు మహర్షిత్వము నంటగట్టుకొనుచున్నారు. కొన్ని యాగమములు ముద్రితములైన సంగతిగూడ వారికి తెలియ నట్లున్నది. కొన్ని పేరులను వినిన ట్లున్నారు. ఏదో యొక ఆగమ మని చెప్పి భ్రమింప జేయుట మిక్కిలి సాహసము. సంస్కృత శ్లోకముల కూర్పు కొంత వఱకు నేర్చుకొన్నారు. కాని భాషాపాటవము, శాస్త్రజ్ఞానము స్వాధీనము కానందున వీరి శ్లోకములను పండితులు అవలోకించి నంతమాత్రముననే రహస్యములను బైట పెట్టగలరు. వారు క్రోధావిష్టులై సరవాదులను మ్రింగనెంచి క్రొత్త శ్లోకములను వ్రాసి ప్రచురించి నట్టెల్ల వలలో జిక్కి పోవుచుందురు. ఉదాహరణమునకై వారి శ్లోకములలోని కొన్ని ప్రయోగములను అవలోకింతము.

"శివశైవైక్యరూప" "అస్పృజక దేవి తాః" "ఇత్యాఖ్యో చోళభూపో" "అష్టాదశంభ వేత్" అనునవి క్రమముగా "శివశైవైక రూప" అస్పృజం దేవితాః "ఇత్యాఖ్యశ్చోళభూపో" "పద్ధత్యష్టాదశీభ వేత్" అని పరిశోధింప బడవలెను. వీనితో బాటు ఆయా శ్లోకములలోని పూర్వ వాక్యములు భావములు చాల వఱకు దిద్ద వలసియుండును. ఇవి యచ్చు తప్పులు గావు. వానిని నేను లెక్కించనే లేదు.

పాపము ఆదిశైవ పత్రికను అచ్చు వేయువా రెవరో కాని సంస్కృతము దెలిసిన వారిచే కరక్టు చేయించక తప్పుల తడికలను వేయుచున్నారు. అసలు శ్లోకములను రచించువారు మహర్షులు కావున సమర్థులైన పండితులతో సరిజేయించుకొననొల్లరు. పైగా ఆగమములుగా ప్రసిద్ధి రావలె ననుచున్నారు. భావదోషములా, పరస్పర విరోధములా లెక్కకు మిక్కిలిగా కలవు. ఆ వ్యర్థకాలహరణమును చేయదలచలేదు. సిద్ధాంత సారావళి పేరుతో కొన్ని యనుష్టుప్ శ్లోకముల వల్లి వేసినారు. సిద్ధాంత సారావళి మహర్షులకు చక్షుర్గోచరము కాలేదు. అంతరాత్మతో భావించి కాబోలు పిట్టకథగల శ్లోకము నల్లుకొనిరి. సిద్ధాంతసారావళి యను గ్రంథము త్రిలోచన శివాచార్య కృతమై ప్రసిద్ధమై యున్నది. మద్రాసులో ద్రావిడ టీకతోడను, మైసూరులో కన్నడ టీకతోడను ముద్రిత మైనది. ఆ గ్రంథమున జ్ఞాన, క్రియా, యోగ, చర్యా అను నాలుగు పాదములును, మొత్తము ౧౬౩ శ్లోకములును గలవు. శ్లోకములన్నియు స్రగ్ధరా, శార్దూల విక్రీడితములే తప్ప అనుష్టుప్ శ్లోక మొక్కటి యైనను లేదు. రాజేంద్రచోళుడు గంగాస్నాన మొనర్చి ఆదిశైవులను గూర్చి పల్కిన పిట్టకథ కాదుకదా! ఆదిశైవ శబ్దమైనను ఆగ్రంథమున రాలేదు. అది కేవల శైవ సిద్ధాంతమును నిరూపించు గ్రంథమేకాని మనుష్యుల కథలతో సంబంధము కలది కాదు. ఇట్టి యథార్థము కనుగొనుటకు తమకు వీలు లేనిచో మౌనము వహించుట శ్రేష్ఠము కాని, కల్పిత శ్లోకములను ఆగమములకును పూర్వాచార్యులకు నంటగట్టుకొని లోకవంచన సేయుట పాడియగునా?

ఆదిశైవ నామము ఆంధ్రదేశమందలి శివార్చకు లగు తంబళులకు చెల్లదు. శాస్త్రమునగాని, లోకమునగాని ప్రమాణము లేదు. వ్యవహార మున్నచో ఎవరికిని అభ్యంతర ముండజాలదు. సెన్సస్ రిపోర్టు జూచినచో తంబళ్ళు, శివార్చకులు అని చెప్పుకొన్నట్లు తెలియగలదు. తెలియక తాము క్రొత్తగా ఆదిశైవ నామమును ధరించుటలోని రహస్య మేమి? ఆదిశైవు లందరికి ఒకే బోధాయన సూత్రమేనట! ఏకగోత్రసూత్ర వివాహముల కీ సిద్ధాంత మాలవాలము. శుభమస్తు! ఆదిశైవులు ద్రావిడబ్రాహ్మణులట! అంగవంగ కర్ణాటక మహారాష్ట్రాది వివిధ దేశములలో నివసించు శివార్చకు లెవరు? ద్రావిడదేశము పుట్టిన తరువాయి పుట్టినందులకా ద్రావిడ బ్రాహ్మణత్వము? ఆదియందే శివత్వమునుబొంది మఱల ద్రావిడత్వమునకు దిగితిరేల? ఇట్టి విమర్శనాదూరము లైన విషయములకు లెక్కలేదు. ఇతిహాస విషయములుగాని ప్రపంచమున నుండు గ్రంథసామగ్రినిగాని తెలియక అగోచర వాదమున పరుగిడుట పరిహాసాస్పదము కాకమానదు. పైగా "పరోత్కృష్టత సహింపలేని పరమనీచులను పరమేశ్వరుడే శిక్షించుగాక" యని వ్రాసిరి తమ కలి

# సద్గతి

## శ్రీ బూసా వీరయ్యగారు

ప్రపంచమున జీవకోటులలో మానవజన్మ ముత్తమము. అందు పురుషుడై జన్మించు టుత్తమోత్తమ మనికదా పెద్దలు వచించుట. అట్టి పురుషుడై జన్మించి ధర్మమార్గాన్వేషణ మొనర్పక యితర మార్గాభిలాషియై దుర్వర్తనకులోనై దుష్కర్మ లాచరించి జీవహింసలు చేయుచుండిన పురుషు డనంబడడు. సద్ధర్మాచరణలోను దేవతల నారాధించి తద్దేవతలకు నోరులేని పశువులను బలులొసంగిన ముక్తిరాగలదను దురాచరణ విడచువాడే యుత్తమ పురుషుండని పేరెన్నికగాంచి సుగతిబొందుట కర్హుండగును. కనుక లోకమున ప్రతిమానవుడు సుగతిబొందుటకు దైవభక్తిపరాయణత్వము, సత్యమార్గాన్వేషణము, "ఆత్మవత్సర్వభూతాని" యను నార్యోక్తి ననుసరించి సర్వభూత దయాళుత్వము కలిగి నీతిపథమున ప్రయాణించుచు ధర్మార్థ కామమోక్షముల నార్జింపవలయును. సకలశాస్త్ర పారంగతుడైన, భూగోహిరణ్యాది దానములు పుణ్యము కలుగునని విరాళముగా యొనర్చిన కాశి, గయ, ప్రయాగ మున్నగు పుణ్య నదులయందు తీర్థమాడిన, ప్రపంచమున పరమేశ్వర వ్రతవిధానము లెన్ని యొనర్చిన, భూప్రదక్షిణత్రియ మాచరించిన జీవులయెడ దయాళుత్వము లేకయుండిన ఫలము విషలిప్తమగు క్షీరములయట్ల నిష్ప్రయోజనమై సుగతి నన్వేషింప జాలడు.

సర్వైశ్వర్యముల కాటపట్టయి యున్న మన దేశమున శూద్రసోదరులు కొందరు క్షుద్రదేవతారాధన లొనర్చెడి సమయముల జీవహింసలు చేయుట పూర్వాచారము లని, అట్లు చేయనిచో దేవత సంతృప్తి జెంది యిష్టకామ్యము లొసంగ దని పలుకువారు తద్దురాచారములు మాని యాయా దేవతల పత్రఫల పుష్పాది ద్రవ్యములచే పూజించినప్పుడే తన్మహనీయులు పాపదూరులై సుగతిగాంచు మార్గమును బొందగలుగుదురు. నవమాసములు మోసి కని యష్టకష్టముల కోర్చి

---

( 392 పేజీ తరువాయి )

యుగ మహర్షిత్వమును ప్రచురించుకొనినారు తప్ప వేరు లేదు. అసూయ పడుటకు వారి యందుగల ఘనత యేమి?

గత సంచికలోని నా వ్యాసమును జూచువారికి వారి పాండిత్య విశేషములును, వారు స్వయముగాను, పత్రికాద్వారాను, ప్రకటించుచున్న అశ్లీలముల గను గొనువారికి వారి యంతశ్శుద్ధియు స్పష్టముగా దెలియగలవు. శాంతచిత్తులై పండితుల సేవించి వాఙ్మయమును దెలిసికొని సత్యమైన సిద్ధాంతములను వెల్లడించవలెను. అవసరమగుచో వారి కల్పిత గ్రంథములలోనుండి యనేక యద్భుతములను సవిమర్శగ పాఠకుల కందింప గలను.

ము. గు. అ.

పెంచిన తత్ఫలితము తుదకు తత్పుత్రులు సకలోపచారములచే తనను సుఖపెట్టి సకల సద్గుణ సమన్వితమైన సుపుత్రులగాంచి సంతసించు తల్లిలాగు భూతదయాళుత్వము కలిగి సద్ధర్మముల నాచరించి యిష్టదైవముల సక్రమపద్ధతిని పూజించి నప్పుడే మన యాంధ్రమాతయు మన చేతలకు సంతసించగలదు.

సద్‌గతి యనగా మంచి గమనము అని యర్థ మగుచున్నది. మంచి యాచార ముండినగాని మంచిదిక్కు గలుగదు. సామాన్యముగ మంచినడవడి యందరియందు గోచరించు చున్నను విమర్శచేసి చూడగా వేయింట నొకరైనను మంచివారు దొరకుట కష్టమై యున్నది. ఉదాహరణార్థము అహింసను గూర్చి సూచించినాను గాని శక్తిదేవతల యెదుట జంతువధను గావించు వారిని మాత్రము గూర్చిగాదు. ఇతరులను మోసగించి నొప్పించి అవినీతికరములైన పన్నాగములతో తమ పనులను నొక్కించుకొను ఎల్ల మనుష్యుల గతులును ఇట్లే కలవు. తమకు కష్టము గలిగినను సహించుకొని ఒరులకు మేలుచేయు మహానుభావులు నేడు సున్నగదా! సక్రమమైన మార్గమున బొట్టబోసికొనువారైనను కనుపించరు. ఇక నీమాయల మానవులకు మంచి గతి యెట్లు పట్టును? బాలురు, విద్యార్థులు, పండితులు, పామరులు, వకీళ్లు, రైతులు, న్యాయాధీశులు, సన్యాసులు, రాజులు, రక్కసులు, అనుభేదమే నేడు లుప్తమగుచున్నది. వ్యక్తిగతమైన స్వాతంత్ర్యము పెరిగిన కొలదియు సుఖము మాయమై దుఃఖాధిక్యము అనుభవింప వలసి వచ్చుచున్నది. ఆనందానుభవము కొఱకు స్వారాజ్యము నపేక్షించుచు ఆత్మపతన మార్గములోనే అడుగుల నిడుచున్నాము. ఆత్మను ఆత్మయే యుద్ధరింప గలదని పెద్దలు వాక్కుచ్చినారు. ఎన్నటికైనను అహంభావము, చాంచల్యము చంపుకొని ఈశ్వరుని శరణముబొంది స్వధర్మాచరణము, దైవభక్తి, పరోపకారము, అల్పసంతృప్తి మున్నగు ఉపాయముల నవలంబించిన తప్ప సద్గతి కలుగజాలదు. అంతరాత్మలో నాలోచించిన వారి కందరకును నేటి మానవలోకము చేయుచున్న భీషణకృత్యములు గోచరములు కాగలవు. తమచేష్టలు మరియొకరికి తెలియ వనుకొనియే అందరికందరు అపమార్గముల బడుచున్నారు. తెలియనివాడు తెలియకను, తెలిసినవాడు అధికలాభాపేక్షతోను గోతిలో గూలుచున్నారు. ఎవరికివారే చల్లగా ఆలోచించినచో తెలియకపోదు. బుద్ధిమంతులందరును సాధ్యమైనంతత్వరగా ఇట్టి యద్భుతమైన దుర్మార్గముల నరికట్టుటకై ప్రయత్నింపరేని ఇంకను ఘోరమైన యాతనను ఈ లోకముననే అనుభవింపవలసియుండును. ప్రాచీనులు అడుగడుగునకు సన్మార్గమునే యాలోచించుచుండిరి. నే నెవరికిని తెలుపబూనలేదు. మహానుభావులు అజ్ఞానజడులను ఉద్ధరించుటకై బద్ధకంకణులై యుపదేశప్రదములగు పనులతో మాబోంట్లను సద్గతికి జేర్చలేరా యనియే ప్రతీక్షించుచున్నాను.

# విచిత్ర సంఘటనము

లక్కన మల్లికార్జునుడుగారు

ఏమమ్మా! రామయ్యగారి భార్య ఎక్కడికో వెళ్ళినదట, నీకు తెలుసునా?

ఏం కాలమో కాని "పిదపకాలానికి కుక్కమూతి పిందెలు పుట్టుతాయి" అన్నమాట నిజమేనమ్మ! పాపం ఆ ముక్కుపచ్చలారని అమ్మాయిని చూస్తే నాకెంతో ముద్దుగా ఉండేది. తల్లిలేని పిల్లను ఏడాదిక్రింద యాత్రి అని వంకపెట్టి నట్టడవుల పాలుచేసింది.

అవునమ్మా! దాని బుద్ధి పాడుగాను! బంగారువంటి పిల్లను మ్రింగివేసింది. ఎంత కఠిన మనస్సో గదా.

అందులో చిత్రమేముంది? తన కొడుకునకు ఏడాది వెళ్ళినదో లేదో, పాపం, ఆ పసికందుని దిగవిడచి పోలా?

ఈడు ముదిరిన తరువాత పెండ్లి చేసుకుంటే వచ్చే తిప్పలు ఇలాగే ఉంటవి.

ఈడు పాడు; అదంతా వాళ్ళవాళ్ళ గుణచర్యలనుపట్టి ఉంటుంది. అదిగాక నీతి నియామకము లేని స్వేచ్ఛలు, హద్దుపద్దులేని కథలు,సినిమాలు వచ్చినవి.పండంటికాపురాలు నాశనము చేస్తున్నవి. చూడు, ఈ కాలములో పెద్దవారన్న, తల్లిదండ్రులన్న, మగడన్న, భయముందీ ఆడదానికి? ఎప్పుడు షోకులు చేసుకోటము, ప్రియులతో వినోదముగా నుండటము, పాడుకథలు చదవటము, సినిమాలు చూడటము, అల్పభోగములకు ఆసించటము. పాడౌటతప్ప ఏముంది చెప్పు?

సరియె కాని, పాపం మీ తమ్ముడికి జబ్బంటగా, ఏమిటా జబ్బు?

ఏం చెప్పుకొనము. మన ఊళ్లో గులాబిపువ్వు చాలా మందికి బిరుదు లిచ్చిన దంటా. అందులో ఒక బిరుదు నా తమ్ముడిది.

పాపిష్ఠి ముండ దానికేమి చెడుబుద్ధి. బంగారువంటి మగడు పడుచువాడు ఉండగా.

అదేనమ్మా! నే నిందాక చెప్పలా. వాళ్ళ బుద్ధులు పట్టి నడుస్తారు.

సరే కాని, ఏమిటో బిరుదు లన్నావు కొస్త చెప్పు వింటాను.

నా తమ్మునికి అడ్డగర్రల అమరసింహ, గూనె సుబ్బయ్యకు గనేరియా గామా, చమ్మ చెక్కయ్యకు సవాయిపొక్కుల సావర్కార్, తిప్పయ్యకు పచ్చళగ బలభీమా,అని ప్రసాదించిదంట.

(పక పకా నవ్వి) బాగా చెప్పావమ్మ. ఇప్పుడీ రోగాల్లో గూడా బిరుదులు బయలు దేరినవి. మరచిపోయా. రామయ్య భార్యా సంగతి చెప్పావు కావు. ఎప్పుడు, ఎవడి వెంట వెళ్లినది.

ప్రతిరోజు ఇది సినిమాకు బస్తీకి వెళ్లి వస్తుందట, అక్కడ ఎవడో ఒక రౌడీ ఇలాకా ఐనాడట. దీనికా బస్తీలో మల్లిపువ్వు అని బిరుదుకూడా వచ్చిందట. ఇట్లా ఆరునెలలనుంచి జరుగుతుందట. ఇదంతా వాళ్ళ గుమాస్తాగాడికి తెలుసునంట. పాపం నాలుగురోజుల క్రిందట సినీమా కని వంకపెట్టి నగలతో పెట్టిలోనున్న వేయి రూకలతో ఆ రౌడీ వెంట వెళ్ళిందట. వెతుకులాడుచున్నారు. ఇంకా ఆజూకు దొరకలా?

పాపం రామయ్యకు బలే అవస్థ వచ్చింది, గౌరవముగా బ్రతికినవాడు-ఏంచేస్తాడు-కర్మ తప్పదు. (కన్నీరు విడచును.)

పొద్దెక్కినది పోదాం పదవమ్మా! నూవారు వస్తారు. (నిష్క్రమించును.)

ఏం బావా? దిగులుపడకు జరిగిన దానికి విచారించిన ఫలమేమి గలదు? ఇన్నిటికి నీరోజులు మంచివి కావు. ఏడిస్తే ఏంలాభం, మొత్తుకుంటే ఏం లాభం.

(కన్నీరు కార్చుచు) తుట్టతుదకు నా బ్రతుకు నగుబాటైంది. ఎందుకీ పాడుజన్మ, బంగారువంటి బిడ్డను పోగొట్టుకొన్నా, ఈ పాపిష్టి ముండవల్ల. అపకీర్తికూడా పొందా. ఇక చస్తేం బ్రతికితేం.

అట్లనకు ధైర్యము తెచ్చుకో; మహామహులకే విధివ్రాలు తప్పిందికాదు. ఇక మనమొక లెక్క.

సరియె కాని ఈ పసికందును, ఏమిచేయను? (ఏడ్చును)

ఏడువకు నే తీసికెళతాను. మా చెల్లి పెంచుతుందిలె.

సరి కాని ఏ దిక్కులేనా మా రే. కుర్రవానిని తీసికొని నీవు వెళ్ళు. నాకరులతో ఎట్లాగో అట్లాగు కాలం గడుపు కుంటా.

సరియే వెళ్ళివస్తా, వారంరోజులైనాక మా అమ్మాయిని పంపేస్తాలె. దిగులు పెట్టుకోకు.

సరిలెపో! నాకర్మం ఎలాఉందో అలా జరుగుతుంది.

(రామయ్య చెల్లిమగడు కుర్రవానితో పోవును)

## 6 సంవత్సరముల అనంతరము

ఏమీ! ఈ పెండ్లికూతు రెవరు? అరె! అనుదుట పుట్టుమచ్చ వున్నదే, మా అమ్మాయికి యిట్లాగే ఉండేది. నా ముద్దు బిడ్డ కాదు కదా?

నీకు ముసలితనములో మతిపోయింది. ఊరుకో మా అమ్మాయి అప్పుడే చచ్చి ఉంటుంది. మా యమ్మాయి వారింట్లో ఎందు కుంటుంది.

కాదోయి నిజంగా నా బిడ్డవలెనే ఉంది. ఉండు పెండ్లిగద్దెదగ్గర కేగి నిదానంగా చూస్తా. (దగ్గరకుపోవును)

నాన్న! నాన్న! (అంటు బిగ్గరగా అరచి పెండ్లిపీటనుండి తండ్రి దగ్గరకు వచ్చును)

అమ్మా! అమ్మా! నీవేనా? నీవేనా? నా బంగారు పాపవు నీవేనా? (అని కౌగిలించుకొని ఆనంద బాష్పములు విడచును) పెండ్లివా రందరు నిశ్చేష్టరపడి చూచుచుందురు.

బావగారు! ఇది మంచి శుభదినము. ఈ బిడ్డ నిజముగా నీ బిడ్డె అయిన నాకొడుకునకె ఇచ్చారు. కాన నీ కోరిక పండినదన్నమాటె.

ఓ ఆత్మీయులారా? ఈ విచిత్రసంఘటనము నాకు చాలా వింతగా ఉంది. ఈ అమ్మాయి ఆరేండ్ల క్రిందట తిరపతికేగి తిరుగ వచ్చునపుడు మాకు లభించినది. మాకు బిడ్డలు లేనందున మేము గారాబముగా పెంచుకున్నాము.

నాయనా! మా దంపతులకు అనేక దణ్ణాలు. నా బిడ్డను రక్షించారు. పెండ్లి కానీయండి బాబూ.

నీ వివాహ మహోత్సవ కాలమందు నీ మామగారు రామయ్య చదివించినది ౧౦ ఎకరముల పొలము-రెండు వేలు.

నీ వివాహకాలమందు నీ భార్యను పెంచిన పినమామగారు చదివించినది ఎకరము పొలము-ఒక వెయ్యి రూపాయలు.

(లగ్న మైనతరువాత)

అమ్మా ! అమ్మా ! నీ ఋణం నే తీర్చుకోలేను; మా అమ్మ ఎట్లాదొరికిందో చెప్పుతల్లి.

మేము రైలుస్టేషనుకు వచ్చేసరికి రైలు వెళ్ళినది. మళ్ళీ సాయంకాలముదాక రైలు లేదనుటచే ఆ స్టేషనులో ఒకమూల కూర్చున్నాము. మా దగ్గరలోనే కూర్చుని ఓనానో, ఓనానో అని ఎక్కి-ఎక్కి పెద్దగా ఏడుస్తుంది. అప్పటికి అయిదేండ్లుంటవి. నేను నెమ్మదిగా దగ్గరకేగి బుజ్జగించి అన్ని అడిగా.

ఏంచెప్పిందితల్లీ!

"మా నాన్న రామయ్య, మా అమ్మ చచ్చిపోయింది. ఇంకో పెండ్లి చేసుకున్నాడు. ఆ యమ్మ నన్ను చాలా బాధపెట్టేది. మా నాన్నకు తెలియదు. యాత్రికని వంకపెట్టి మా ఇంట్లో గుమస్తాను తీసుకొని నాతోవచ్చి నన్ను ఇక్కడ ఉండమని పోయినారు. ఏడుస్తున్నాను" అంది. అప్పుడు నాకు జాలిగలిగి పెంచాను. ఈసంబంధం మాట్లాడినాను. తరువాత విషయం మీకు తెలిసినదియేకదా!

ఇన్నిటికి నా రోజులు మంచివి తల్లీ! నా బిడ్డను చూచుకున్నా నీ పుణ్యాన.

దానికేం లెండి. ఈ అమ్మాయి వచ్చినాక మాకు బాగా కలిసి వచ్చింది. ఒక అబ్బాయి గూడా పుట్టాడు. ఆ ప్రేమవల్ల మంచి సంబంధం చేద్దామని విచారించితే మీరే దొరికారు. ఇదంతా ఆ పిల్ల అదృష్టం.

నాన్నోయి, నాన్నోయి, ఎవరో ఒక పిచ్చమ్మాయి వచ్చింది. నన్ను ఎత్తుకు పోతుందట, మాటి మాటికి నన్ను లాగుతా ఉంది.

ఎవర్తి పిచ్చిది. భయం లేదులే నాన్న, నా దగ్గర కూర్చో.

అదిగో అదిగో ఇంట్లోకే వస్తోంది.

ఏం ఎవరు నీవు? ఫో బయటికి ఫో, పో.

అయ్యా ! నే నొక మహాపాపిని. వంశభ్రష్టురాలను. ఉన్మాదిని. దిక్కు-గలిగియు దిక్కు-లేని దానను. నా దారి నే పోతా ఒక్క-సారి అబ్బాయిని ఎత్తుకోనీయండి. బాబు నీకు దణ్ణంపెట్తా.

ఛీ, పాపిష్టి ముండా! బంగారువంటి అబ్బాయిని పాడుచేద్దా మనుకున్నావటే 'తా చెడ్డ కోతి వనమెల్లా చెరచు నట్లు' నీ కుష్ఠురోగం మా వాడికి కూడా అంటిద్దా మనుకున్నావా? ఛీ, పో, పో. (అని కర్రతో గెంటును)

నా కర్మం, నా మదం నన్ను తింది, నా వల్లు నాకు తెలియలా; పాపం బద్ధలైనది. పుణ్యం పండింది. పాపుల కింతే కాబోలు. కాదు, కాదు. ఇంకా యమలోకములో ఉంది శిక్ష. (అంటూ ఏడుస్తూ పోవును)

## మరోనాడు

ఏ మండోయి మీ కుత్తరము వచ్చింది. ఇదిగో.

(కవరు చింపి) నాథా! సోదరీమణులారా! దండములు:

ఈ మహాపాపి కథ లోకానికి నీతి గలుపునని భావించి నే నీఉత్తరమును వ్రాస్తున్నా; నన్ను జ్ఞాపక ముంచుకొని నాకువలె చెడిపోకండి. బంగారువంటి కాపురము బాపుకొన్నా, నా సవతి బిడ్డను

దిక్కులేనిదాన్ని చేశా, కాని దైవసాయమున బలగములోనె పడింది. పసిపాపని కన్న బిడ్డని విడచిన కఠిన హృదయురాలను. మా ఇంట్లో గుమస్తాను నాకు చాలా చనువుగా ఉండేది. అతడు నన్ను మోహించాడు మొట్టమొదట. వాడు నీతి గీతి లేక యప్పటి కప్పటికి పుట్టే ప్రేమ, ఇంద్రియభోగము, స్త్రీ స్వాతంత్ర్య గాథలు, పలవ పనులతో గూడిన పుస్తకాలు తెచ్చి నాకిచ్చేవాడు. క్రమక్రమముగా నవి నేను చదివా. నాబుద్ధి మారింది. అప్పటినుండి అమాయకుడగు నామగడు నాకు ఫుల్ గా స్వేచ్ఛను ప్రసాదించాడు. ఎప్పుడు సినీమాలకో, యాత్రలకో పోవుచుండేవారము. 'కట్టులో లేనిగొడ్డు దొడ్డిలో ఉంటుందా?' నాకొక పచ్చిరాడీ దాపరించాడు. వాడివెంట పట్నంజేరా. నాచేతిలో డబ్బుయ్యేవర కొక ఏడాది బాగున్నాడు. తరువాత నన్ను కొట్టిన దెబ్బలకు అంతులేదు. తుదకు నన్ను ఒంటరిగా విడచిపోయాడు. 'చెడిందిరా అంటే చేరిందిరా తడికలబజారు, అన్నట్టుగా జేరా. ఎంతపాపం చేశానో నాకే ఎరుక. తుదకు రోగాలతో కుళ్ళిపోయింది నా తనువు. తింటానికి కూడు, ఉంటానికి కొంప లేక ఏడుస్తూ దేశాలు తిరుగుతు నేటికి నాబిడ్డని, మగని చూచా. నా సవతిబిడ్డనుచూచా. లో లోన ఏడ్చా. నాపేరు చెప్పుకుంటే తిడ్తారనుకున్నా, నా బిడ్డను ఎత్తుకుందామంటె కొట్టేరు, గెంటేశారు. ఏంచేయను? ఏడుస్తూ వచ్చా. ఇంక ఈలోకంలో ఉండలేను. ఈవూరి చెరువులో నేను — — నామగనిచే దహనము చేయించండి, దయగలిగితే.

ఇట్లు,

వంశభ్రష్టురాలు, మహాపాపిని అగు వెంకి.

మొన్న వచ్చిన పిచ్చిది నా పెండ్లామా? అబ్బా అట్లా ఉందేమి? నే గుర్తించలేదు. ఒంటినిండా పుండ్లు దుమ్ము చిరిగినబట్టలు చూచి ఏపాపిష్టిముండో అనుకున్నా.

పాపిష్టిది కాక మంచిదంటవే ?

ఊరిబయటనున్న చెరువులో నిన్న మనవూరు వచ్చిన పిచ్చిది చచ్చిందట. అందరు చూట్టానికి వెళ్ళుతున్నారు.

# కొన్ని సూచనలు

## కృతజ్ఞత

'విభూతి' కి ఈ సంచికతో రెండుసంవత్సరములు నిండినవి. పరమేశ్వరానుగ్రహమున ఎటులో ఇంతదనుక రాగలిగితిమి. ముద్రణాపరికరముల ధరలు పెరుగుటయు, సరిగా చందాలు వసూలుకాకపోవుటయు మున్నగు కారణములవలన మే మనుకున్న మాదిరిగ 'విభూతి' ని ప్రకటింపజాలమైతిమి. అయినను పోషకమహాశయుల సాహాయ్యముపై యాధారపడియే నిర్విఘ్నముగ ప్రచురణ సాగినది. 'విభూతి' సదా వెలువడుచుండునట్లు ప్రయత్నము లొనర్చుచునేయున్నాము. శివనిరూపణము ననుసరించి శక్తివంచనలేక సేవ యొనర్చుటయే మాకు ధనరాశి. మా ప్రయత్నమును తమదిగా భావించి తోడుపడిన పోషకులు, సహాయకులు, మిత్రులు మున్నగు వారికి మా హృదయపూర్వకమైన కృతజ్ఞతను సంక్షేపముగ సమర్పించుచున్నాము.

### సంవత్సరాది సంచిక

ముందు నెలలో 'విభూతి' యొక్క తృతీయ సంవత్సరాది సంచికను ప్రకటింప దలచినాము. చక్కని వ్యాసములు, అందమైన అచ్చు, కాగితములు, తదనుగుణమైన చిత్రములు మున్నగు ఎన్నదగిన సామగ్రితో ఈ సారి సంచిక ఆహ్లాదకరముగ నుండవలె నని ప్రయత్నము లారంభమైనవి. ముందు రాగల సంచికలలో

ఆనందము, ఆత్మోద్ధారము
ఆహారము, రుచి
సరస్వతికి భర్తయెవరు ?
వీరశైవ సంప్రదాయము (భాండార్కర్)
యతి స్వరూపము, అప్పకవి
సోమనాథుని బ్రాహ్మణ్య విమర్శ
ఆంధ్రమండలి వీరశైవ గ్రంథములు

ఆర్యద్రావిడ విభాగ విమర్శ
సదాచారములు, సైన్సు
కాల తత్త్వము
వీరశైవమత విజ్ఞానము
పితృపక్షములు, శ్రాద్ధతర్పణములు
నిజాం రాష్ట్రమున ఆంధ్రభాషా ప్రచారము
కలియుగ మహర్షి
మహాత్మాగాంధిగారి శ్రీ కృష్ణుడు
హిమాలయానుభవములు

మున్నగు వ్యాసములు రాగలవనిన పత్రికా ప్రకటనమందలి యభిరుచి యుపయోగములు తెలియగలవు. కాని ఇట్టి భారమంతయు కేవలము సంపాదకులమీద గాక పాఠకలోకముమీదనే ఎక్కువబాధ్యత కలదని మేము ప్రత్యేకముగ జెప్పనవసరము లేదు.

## చందాదారులకు

ఏ పత్రికలకైనను చందాదారులే ముఖ్యప్రోత్సాహకులు. ఎప్పటిచందాను అప్పుడు తాము చెల్లించి ఇతరులను ప్రోత్సహించి ప్రచార మొనర్చినపుడే పత్రికలు బ్రదుకగలవు. కావున చందాదారు లందరును ఈ సంచిక యందగానే తమతమ చందా ద్రవ్యము (రెండున్నర)ను మనియార్డరుద్వారా పంపగోరుచున్నాము. ౧౫ దినములలో చందా రానియెడల సంవత్సరాది సంచికను రెండురూపాయిల పన్నెండణాల (2-12-0)కు వి. పి.గా పంపగలము. చందాదారులే మనియార్డరుచేయుచో నాలుగణాలు మిగులగలవు. ప్రయాసమును తప్పును. ఏకారణమువలనగాని పత్రిక అక్కరలేనివారు కార్డువ్రాసి ఆ విషయమును తెలుపవేడెదము. వి. పి. లను అనవసరముగా తిరుగగొట్టి కార్యాలయమునకు నష్టము గలిగింపవలదు. ఈ క్రింద వ్రాయబడిన నంబర్లు గలవా రందరును తమ చందాలను పంపవలసి యుందురు. ఈ నంబర్లు ప్రతిమాసము తమకు వచ్చు పత్రికలమీద వ్రాయబడు చిరునామలకు మొదట గలవు.చందా పంపునపుడు మనియార్డరు కూపనులో తమ చందానంబరును చిరునామాను వివరముగ వ్రాయవలెను.

## బ్రిటిషు ప్రాంతములలో

29 30 31 35 37 38 39 40 41 42 46 47 52 53 54 56 58 59 60 63 79 80 81 84 85 86 87 92 93 94 95 101 104 110 111 112 113 114 115 116 117 119 120 121 123 134 141 142 501 502 503 504 505 506 507 508 509 510 511 512 513 514 515 516 517 518 519 520 521 522 523 524 526 527 528 529 530 531 532 534 535 536 539 542 543 544 548 549 550 552 553 554 555 558 559 560 561 562 564 565 566 568 569 570 571 572 573 574 575 576 577 578 579 580 582 583 584 585 586 587 588 589 590 591 594 595 597 598 600 601 604 605 606 607 608 610 611 612 619 620 651 652 654 655 656 660 661 663 664 665 664 665 666 667 668 670 674 675 676 678 680 681 683 683 684 689 691 692 693 694 695 697 698 700 702 704 709 710 712 713 715 717 719 722 724 726 727 728 729 731 734 735 736 738 741 742 744 745 746 751 753 754 755 756 757 758 760 761 762 763 764 765 767 769 770 771 772 774 775 776 778 779 780 782 783 785 786 787 788 789 791 792 793 794 795 796 798 802 804 820 821 822 823 833 835 836 840 852 853 855 876 880 884 886 891 895 898 903 905 906 907 912 914 918 922.

## నిజాం ప్రాంతములో

౨౦౧ ౨౦౨ ౨౦౩ ౨౦౪ ౨౦౬ ౨౦౭ ౨౦౮ ౨౦౯ ౨౧౦ ౨౧౨ ౨౧౩ ౨౧౪ ౨౧౫ ౨౧౮ ౨౧౯ ౨౨౦ ౨౨౧ ౨౨౨ ౨౨౩ ౨౨౪ ౨౨౬ ౨౨౭ ౨౨౮ ౨౨౯ ౨౩౧ ౨౩౨ ౨౩౬ ౨౩౭ ౨౩౮ ౨౪౨ ౨౪౩ ౨౪౪ ౨౪౬ ౨౪౭ ౨౪౮ ౨౪౯ ౨౫౨ ౨౫౩ ౨౫౪ ౨౬౦ ౨౬౧ ౨౬౪ ౨౬౫ ౨౭౧ ౨౭౩ ౨౭౪ ౨౭౭ ౨౭౮ ౨౮౨ ౨౮౮ ౨౮౯ ౨౯౨ ౨౯౮ ౩౦౦ ౩౦౨ ౩౦౫ ౩౦౬ ౩౦౭ ౩౦౮ ౩౦౯ ౩౧౦ ౩౧౧ ౩౧౨ ౩౧౩ ౩౧౪ ౩౧౫ ౩౧౬ ౩౧౭ ౩౧౯ ౩౨౦ ౩౨౨ ౩౨౩ ౩౨౪ ౩౨౫ ౩౨౬ ౩౨౭ ౩౨౮ ౩౨౯ ౩౩౦ ౩౩౧, ౩౩౨ ౩౩౩ ౩౩౪ ౩౩౫ ౩౩౬ ౩౩౭ ౩౩౮ ౩౩౯ ౩౪౦ ౩౪౧ ౩౪౨ ౩౪౩ ౩౪౪ ౩౪౫ ౩౪౬ ౩౫౨ ౩౫౪ ౩౫౫ ౩౫౬ ౩౮౧ ౩౮౨ ౩౮౩ ౩౮౫ ౩౯౦ ౩౯౨ ౩౯౫ ౩౯౮ ౪౦౨ ౪౦౪ ౪౦౫ ౪౦౬ ౪౦౭ ౪౧౪ ౪౧౬ ౪౨౦ ౪౨౬ ౪౨౭ ౪౨౮ ౪౨౯ ౪౩౦ ౪౩౨ ౪౩౬ ౪౩౮ ౪౫౦ ౪౫౨ ౪౫౩ ౪౫౪ ౪౫౬ ౪౬౨ ౪౬౪ ౪౬౫ ౪౬౮ ౪౭౨ ౪౭౩ ౪౭౬ ౪౮౧ ౪౮౪ ౪౮౬ ౪౮౮ ౪౮౯ ౪౯౦ ౪౯౧ ౪౯౨ ౪౯౪ ౪౯౬.



ఓం

# విభూతి

( సారస్వత ధార్మిక సచిత్ర మాసపత్రిక )

ద్వితీయ సంపుటము

ప్రమాధి మాఘము నుండి

విక్రమ మాఘము వరకు

వెల:

2 రూపాయల 8 అణాలు

సంపాదకులు:

వేదకావ్యస్మృతితీర్థ, ధర్మాచార్య, విద్యానిధి, విద్యారత్న

పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారు

శ్రీ మటికె నాగయ్యగారి ధర్మనిలయము,

౪-౨-౬౭ సజన్‌లాల్ వీధి సికింద్రాబాదు (దక్కను)

# VIBHUTI

( A Cultural Telugu Monthly Magazine )

SECOND VOLUME
February 1940
TO
February 1941

PRICE : Rs. 2-8-0 ONLY.

Edited by

Vedakavyasmrititeertha, Dharmacharya,
Vidyanidhi, Vidyaratna

Pandit C. M. Veerabhadra Sharma,

Sree Matika Nagayya's Dharmanilayam,

4268, Sajanlal St., Secunderabad, Dn.



## విభూతి — ద్వితీయ సంపుటము

# వ్యాసముల అనుక్రమణిక





* ప్రతివ్యాసకర్తయొక్క పేరు మొదట శ్రీకారమును, చివర గారును చదువుకొనవలెను.

(సవరణ ౨౬౭ పేజి తర్వాత పేజినంబరు ౨౯౮ పడినది; ౨౬౮ గా దిద్దవలెను)

## —♦ ప్రతిష్ఠాపకులు ♦—

శ్రీజగద్గురు శివానంద రాజదేశికేంద్ర శివాచార్యమహాస్వాములు, బాళేహళ్ళి
శ్రీజగద్గురు పంచాక్షర శివాచార్య మహాస్వాములు, కాశి
శ్రీజగద్గురు వాగీశపండితారాధ్య మహాస్వాములు, గుంతకల్లు
మ॥ బ్ర॥ శ్రీ చెన్నవీరశివాచార్య సావిరదేవరస్వాములు, బిచ్చాలి
మ॥ బ్ర॥ శ్రీ ముమ్మడి సిద్ధశంభుస్వాములవారు చేబ్రోలు

### మహారాజపోషకులు

శ్రీమాన్ జి. హెచ్. వీరన్నగారు గుబ్బి
,, ఆరాధ్యుల మూటయ్యగారు సామర్లకోట
,, చుక్కాశనగల కోటివీరయ్యగారు కొరప్రిపాడు
,, నేలవెల్లి కోటయ్యగారు దుగ్గిరాల
,, రాచంశెట్టి కోటివీరయ్య, కొలగాని నాగయ్యగార్లు దుగ్గిరాల

### రాజపోషకులు

శ్రీమాన్ అందెల కోటివీరయ్యగారు చేబ్రోలు
,, అందెల కోటినాగయ్యగారు ,,
,, సిద్దాని అంకన్నగారు, మ్యు॥ కమీషనర్ గుడివాడ
,, శరణార్థి గారయ్యగారు, బి. ఎ., సబ్ రిజిష్ట్రార్ గిద్దలూరు
,, సాయం సిద్ధరామప్పగారు శంషాబాదు
,, డా. కె. రుద్రప్పగారు, ఎల్. ఎం. ఎస్. హైదారాబాద్
,, దేవిశెట్టి అమ్మన్నగారు, నిడదవోలు
,, ధూళాధూళ్ల వీరయ్యగారు నిడదవోలు
,, పట్నంశెట్టి మల్లప్పగారు, మెదక్
,, రుద్రశెట్టి గుండయ్యగారు చెన్నూరు
,, దొడ్డ కోటయ్యగారి వీరన్నగారు నల్లగొండ

### సహాయకులు

శ్రీమాన్ అవధూత బసవరాజుగారు నూజవీడు
,, వే॥ బసవయ్యస్వామిగారు శ్రీశైలము
,, అవధూత పర్వతాలయ్యగారు రంగాపురం
,, చిలువూరి శంభయ్యగారు చిలువూరు
,, చదువుల బసవశంకరయ్యగారు నరసాపురం
,, చుక్కా పాపయ్యగారు వల్లభాపురం
,, ఎస్. సోమేశ్వరరావుగారు, హైకోర్టు వకీలు, వికారాబాదు
,, రావికోటిమఠం వీరభద్రయ్యగారు హైదరాబాదు
,, పాలకొల్లు చెన్నబసవయ్యగారు కనగాల
,, కుంచాల నాగయ్యగారు ,,

Regd.No. M. 4122, H. E. H. Nizam's 165.
"VIBHUTI"
SECUNDERABAD Dn.
Editor:—PANDIT C. M. VEERABHADRA SHARMA.

# 'విభూతి'–సంరక్షకులు

## ప్రతిష్ఠాపకులు

| | |
|---|---|
| శ్రీజగద్గురు శివానంద రాజదేశికేంద్ర శివాచార్యమహాస్వాములవారు, | బాళేహొన్నూరు; (మైసూరు) |
| శ్రీజగద్గురు పంచాక్షర శివాచార్య మహాస్వాములు, | కాశి |
| ష॥ బ్ర॥ శ్రీ చెన్నవీరశివాచార్య సావిర దేవరస్వాములు, | బిచ్చాలి |
| ష॥ బ్ర॥ శ్రీ ముమ్మడి సిద్ధశంభుస్వాములవారు | చేబ్రోలు |

## మహారాజపోషకులు

| | |
|---|---|
| శ్రీమాన్ జి. హెచ్. వీరన్నగారు | గుబ్బి |
| ,, ఆరాధ్యుల మూటయ్యగారు | సామర్లకోట |
| ,, చుక్కా-శనగల కోటివీరయ్యగారు | కొరిశపాడు |
| ,, నేలవెల్లి కోటయ్యగారు | దుగ్గిరాల |
| ,, రాచంశెట్టి కోటివీరయ్య, కొలగాని నాగయ్యగార్లు | దుగ్గిరాల |

## రాజపోషకులు

| | |
|---|---|
| శ్రీమాన్ అందెల కోటివీరయ్యగారు | చేబ్రోలు |
| ,, అందెల కోటినాగయ్యగారు | ,, |
| ,, సిద్దాని అంకన్నగారు, మ్యు॥ కమీషనర్ | నర్సారావుపేట |
| ,, శరణార్థి గౌరయ్యగారు, బి. ఎ., రిజిష్ట్రార్ | తాడేపల్లిగూడెం |
| ,, సాయం సిద్ధరామప్పగారు | శంషాబాదు |
| ,, డా. కె. రుద్రప్పగారు, ఎల్. ఎం. ఎస్. | హైద్రాబాద్ |
| ,, పట్నంశెట్టి మల్లప్పగారు, | మెదక్ |
| ,, రుద్రశెట్టి గుండయ్యగారు | మంచిరాల |
| ,, దొడ్డ కోటయ్యగారి వీరన్నగారు | నల్లగొండ |

## సహాయకులు

| | |
|---|---|
| శ్రీమాన్ అవధూత బసవరాజుగారు | నూజవీడు |
| ,, చిలువూరి శంభయ్యగారు | చిలువూరు |
| ,, చదువుల బసవశంకరయ్యగారు | నరసాపురం |
| ,, చుక్కా పాపయ్యగారు | వల్లభాపురం |
| ,, ఎస్. సోమేశ్వరరావుగారు, హైకోర్టు వకీలు, | వికారాబాదు |
| ,, రావికోటిమఠం వీరభద్రయ్యగారు | హైదరాబాదు |
| ,, పాలకొల్లు చెన్నబసవయ్యగారు | కనగాల |
| ,, కంచాల నాగయ్యగారు | |



A. G. Press, Bezwada.

